# శ్రీ భక్తతుకారాం అభంగవాణి



వ్యాఖ్యాత

శ్రీబ్రహ్మవిద్యానన్దగిరి స్వాములవారు



# గురుపరమ్పరాస్తోత్రమ్

ఓమ్ సదాశివ సమారమ్భాం శంకరాచార్యమధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యన్తాం వందే గురుపరమ్పరామ్ ॥

ఓమ్ గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥

ఓమ్ నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తితాపసమ్ ।
పరాశరఞ్చ తత్పుత్రం వ్యాసం వేదాబ్జభాస్కరమ్ ॥

ఓమ్ విరక్తం శ్రీశుకం దేవం జ్ఞానవైరాగ్యరూపిణమ్ ।
గౌడపాదం చ గోవిన్దం యోగీన్ద్రం జ్ఞానినాం వరమ్ ॥

ఓమ్ తచ్ఛిష్యం శంకరాచార్య మద్వైతస్థాపకం గురుమ్ ।
నమామి భగవదత్పాదం శంకరం లోకశంకరమ్ ॥

ఓం సచ్చిదానందరూపం తం జ్ఞానవైరాగ్య దాయకం ।
అసంగానందనామానం సద్గురుం ప్రణమామ్యహమ్ ॥

ఓమ్ విద్యాప్రకాశనామానం వేదవేదాన్తకోవిదమ్ ।
గీతాతత్త్వప్రబోద్ధారం సద్గురుం ప్రణమామ్యహమ్ ॥

ఓమ్ అసంగానంద గుర్వాద్యాం విద్యాప్రకాశమధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యన్తాం వందే గురుపరమ్పరామ్ ॥

# శ్రీభక్తతుకారాం అభంగవాణి




అనువాదం & వ్యాఖ్యానము

శ్రీబ్రహ్మవిద్యానందగిరి స్వాములవారు



ప్రకాశకులు

శ్రీ శుకబ్రహ్మాశ్రమం

శ్రీకాళహస్తి, చిత్తూరు జిల్లా.

శ్రీభక్తతుకారాం అభంగవాణి

రచన : శ్రీబ్రహ్మవిద్యానందగిరి స్వాములవారు

ప్రథమ ముద్రణ : 2015 - 1000 ప్రతులు



వెల : రూ. 200/-

గ్రంథప్రాప్తి స్థానం :
శ్రీశుబ్రహ్మాశ్రమము,
శ్రీస్వామి విద్యాప్రకాశానందనగర్,
శ్రీ శుకబ్రహ్మాశ్రమం(పోస్టు),
శ్రీకాళహస్తి, చిత్తూరు జిల్లా, ఆం.ప్ర.
భారత్. పిన్-517 640
ఫోను : 08578-222239

డి.టి.పి. :
శ్రీవారిగ్రాఫిక్స్, తిరుపతి.
సెల్ నెం. 9948434277

ముద్రణ :
సి.ఎస్.ప్రింటర్స్ , తిరుపతి.
సెల్ నెం. 98482 64047

# ప్రకాశకీయం

మహారాష్ట్ర మహాత్ములలో భక్తశిఖామణియగు శ్రీ భక్త తుకారాం మహారాజ్‌గారు "గాథ" అని కొన్ని వేల అభంగాలు వ్రాశారు. వేదం త్రికాండాత్మకమైనట్లు ఈ అభంగవాణిని గూడా శ్రీ బ్రహ్మవిద్యానందగిరి స్వాములవారు త్రికాండలుగా సమకూర్చి ఇపుడు కర్మ, భక్తి కాండలను మాత్రం మూల అభంగం, ప్రతిపదార్థం, తాత్పర్యం, విశేషవ్యాఖ్యలతో రచించారు. అదే మీ చేతిలోని ఈ గ్రంథము. ఇట్టి విశిష్టరచన చేసిన పూజ్యశ్రీ బ్రహ్మవిద్యానందగిరి స్వాములవారికి మా కృతజ్ఞతాపూర్వక వందనములు. భవిష్యత్తులో జ్ఞానకాండను గూడా వారు అనువదిస్తారని ఆశిస్తున్నాము.

దీనికి తమ అమూల్య అభిప్రాయాన్ని వ్రాసిన మహామహోపాధ్యాయులు డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారికి కృతజ్ఞతా పూర్వక ధన్యవాదాలు. అట్లే దీనిని ఓపికతో డి.టి.పి చేసిన తిరుపతి శ్రీవారిగ్రాఫిక్స్ వారికిన్ని, సర్వాంగసుందరంగా ముద్రించిన ప్రెస్ వారికిన్ని ధన్యవాదాలు. వీరందరినీ పరమాత్మ అనుగ్రహించుగాక!

శ్రీశుకబ్రహ్మాశ్రమం — ప్రకాశకులు

శ్రీకాళహస్తి

27-07-2015

# నామాట

"శ్రీభక్తతుకారాం అభంగవాణి" అను మరాటీ గ్రంథ అనువాద కర్త, వ్యాఖ్యాకర్త పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీబ్రహ్మవిద్యానందగిరి స్వాములవారు ఆంగ్లవిద్యావంతులు, అట్లే బ్రహ్మవిద్యావిశారదులు.

వీరు కుటుంబపోషణకు మహారాష్ట్రలోని సోలాపూర్ పట్టణనివాసులైనా ఆధ్యాత్మికంగా పూర్వజన్మసంస్కారం ప్రబలంగా గలవారు. సోలాపూర్ పట్టణ విశేషమేమంటే ప్రతిరోజు కొన్ని కొన్ని దేవాలయాలలో ఉదయమే ఆధ్యాత్మిక తరగతులు చాలాకాలం నుండి ఇప్పటికీ జరుగుచున్నవి. ముముక్షువులు అందు పాల్గొని ఆ తరువాత తమ తమ విధులకు పోవడం మేము చూచాము.

శ్రీ బ్రహ్మవిద్యానందగిరిస్వాములవారు గూడ అటువంటి తరగతులు ఇద్దరు ముగ్గురు గురువుల వద్ద దాదాపు పదిహేను సంవత్సరాలు ప్రతినిత్యం బ్రహ్మవిద్యనభ్యసించారు. బ్రహ్మజ్ఞానాన్ని సంపూర్ణంగా తెలుసుకోవాలనే తపనతో సంస్కృతం, వ్యాకరణం గూడా చదివి వేదాన్తంలో మంచి నిష్ణాతులైనారు. ఆ పిదప తాను తెలుసుకొనిన వేదాంతాన్ని కొంతకాలంగా సోలాపూర్‌లోని జిజ్ఞాసువులకు ప్రతినిత్యం బోధిస్తున్నారు.

మేము సోలాపూర్ ప్రవచనలకు పోయినపుడెల్ల వీరిని చూచాము, గమనించాము. వేదాన్తశాస్త్రమును ఎంత బాగా అపోశన పట్టారో అంత మంచి నియమనిష్ఠ ఆదర్శఆచరణ గలవారు. ఇట్టి వీరు వారి కోరికననుసరించి శ్రీశుకబ్రహ్మాశ్రమంలో సన్న్యాసాన్ని స్వీకరించి శ్రీబ్రహ్మానందగిరిస్వాములవారనే శ్రీ జగద్గురు శంకరుని దశనామ సన్న్యాససంప్రదాయంలో యోగపట్టాను, సన్న్యాసనామాన్ని స్వీకరించారు. మేము వారి ఆచారవిచారాలను, వేదాన్తజ్ఞాననిష్ఠను చూచి చాల సంతోషించి

మా మాసపత్రిక వేదాన్తభేరిలో ప్రచురణ నిమిత్తం మహారాష్ట్ర మహాత్ములలో ప్రముఖులగు శ్రీ భక్తతుకారాం మహారాజుగారి "గాథ" లోని అభాంగాలను తెలుగులో అనువదించి పంపమని కోరినాము. శ్రీస్వాములవారు మా కోరికమేరకు శ్రీ తుకారాం అభంగాలకు తెనుగు అనువాదమే గాక విశేషవ్యాఖ్య గూడా వ్రాసి పంపినారు. వేదాన్తభేరిలో ఈ అభంగవాణిని ధారావాహికంగా ప్రచురిస్తున్నాము.

ఈ అభంగాలకు శ్రీస్వాములవారి విశేషవ్యాఖ్య చాలా సుందరంగా వేదాన్త జిజ్ఞాసువులకు చాల ఉపయోగకరంగా విపులంగా ఉన్నందున దీనిని గ్రంథరూపంలో ఆశ్రమంచే ప్రచురించాలని సంకల్పం కలిగింది. శ్రీశుకబ్రహ్మాశ్రమంలో పూజ్యగురుదేవులు "గీతా పాఠశాల" అను పేరిట స్థాపించిన బ్రహ్మవిద్యాపాఠశాలలో వీరు మా కోరికపై ఆచార్యస్థానం వహించి సదరు పాఠశాల విద్యార్థులకు వేదాన్తశాస్త్రాన్ని క్రమప్రకారం పాఠం చెప్తున్నారు. వారి ప్రణాలి చాల బాగుంది. అట్లే వ్యాకరణం కూడా చెప్తున్నారు. శ్రీస్వాములవారు వారి ఆచార్యత్వంలో అద్వైతవేదాన్తాన్ని ఈ పాఠశాలలో క్రమపద్ధతిలో ప్రస్థానత్రయభాష్యంతో సహా విద్యార్థులకు అందించి ముముక్షువులను కృతార్థులను చేస్తారని ఆశిస్తూ సద్గురుదేవులు, గురుపరంపర వారి శక్తిసామర్థ్యాలను లోకోపకారకం చేస్తారని, అలా అనుగ్రహిస్తారని ఆశిస్తున్నాను.

– విద్యాస్వరూపానందగిరి స్వామి

# ప్రస్తావన

శ్లో॥ యుక్తాహార విహారాయ వివిక్తస్థలవాసినే ।
మలయాళయతీంద్రాయ బ్రహ్మనిష్ఠాయ తే నమః ॥

శ్లో॥ విద్యాప్రకాశనామానం వేదవేదాంతకోవిదమ్ ।
గీతాతత్త్వప్రబోద్ధారం సద్గురుం ప్రణమామ్యహమ్ ॥

శ్లో॥ వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థం
సర్వేషుభూతేషు దయాప్రపూర్ణమ్ ।
శ్రీకీరబ్రహ్మాశ్రమ పీఠసంస్థం
శ్రీసద్గురుం నౌమి విద్యాస్వరూపమ్ ॥

ప్రపంచములో ఎన్నో సంస్కృతులు, నాగరికతలు ఉన్నా వాటన్నిటికంటె అతి ప్రాచీనమైనది భారతీయ సంస్కృతి. విచారశీలురైనవారు ఎవరైనా దీనిని ఒప్పుకొనవలసిందే. ఎన్నో సంస్కృతులు ఉదయించాయి. కాలప్రవాహంలో మళ్ళీ కొట్టుకుపోయాయి. భారతీయ సంస్కృతిమాత్రం ఎన్నోసార్లు అనేక పరకీయ సంస్కృతులచే నాఘాతము పొందినప్పటికి వాటినన్నిటిని దిగదొక్కి తలెత్తుకొని సజీవంగా నిలబడగల్గింది, మృతినొందలేదు. ఇటువంటి భారతీయసంస్కృతిగర్భములో యే అమృతము నిండి ఉన్నదో? విచారించినచో ఆ అమృతము ఏదోకాదు – "అసమాన అధికారి సంతు మహాత్ములే". సంస్కృతి అధర్మముతో కొట్టబడినప్పుడు, పరకీయ సంస్కృతులు ప్రబలి సన్నగిల్లినప్పుడు – మహాత్ములవతరించి పునరుజ్జీవింపజేసారు. రాళ్ళు, మట్టిపెడ్డలను రక్షించడము దేశరక్షణకాదు. సంస్కృతిని పునరుద్ధరించుట, వృద్ధిపరచుటయే నిజమైన దేశరక్షణ. భారతీయ సంస్కృతి వైదిక వాఙ్మయముపైననే ఆధారపడి ఉంది. వాఙ్మయము

రక్షింపబడుతూ, వృద్ధింగతమయినప్పుడే సంస్కృతి రక్షింపబడుతుంది. సంస్కృతి రక్షింపబడినప్పుడే దేశము రక్షింపబడి, సుఖశాంతులు నెలకొల్పబడతాయి. భారతీయసంస్కృతిలో తత్త్వజ్ఞానము, ధర్మము, భక్తి సమాజరచన, రాజశాసనము మరియు అర్థవ్యవస్థ మొదలగు ఎన్నో తత్త్వములు అంతర్భూతమై ఉన్నవి. ఇటువంటి వైదిక వాఙ్మయమును పునరుజ్జీవింపజేసి, ధర్మమును స్థాపించి, దుర్మతములను ఖండించి, సంస్కృతికి ప్రాణముపోసి, ప్రజలకు భక్తి, జ్ఞానము, వైరాగ్యము, ధర్మము, నీతి మరియు ఆచార విచారములు నిర్విరామముగా బోధించి లోకమునుద్ధరించుట కొఱకై భగవంతుని విభూతి, కారుణ్యమూర్తియగు "శ్రీ భక్త తుకారాం మహారాజుగారు" ఈ లోకంలో నవతరించిరి.

బోలా పుండరీకవరద హరి విఠల్ శ్రీజ్ఞానదేవ్ తుకారాం మహారాజ్‌కీ జై........

1. శ్రీభక్తతుకారాం మహారాజుగారు తమ "గాథ" గ్రంథములో ఎక్కువగా భక్తిని (భాగవతధర్మమును) ప్రస్తుతించినప్పటికిని ముఖ్యముగా అద్వైతతత్త్వజ్ఞానమునకే మహత్త్వమును ఇచ్చియున్నారు. 2. వైదిక ధర్మమును గూడ అక్కడక్కడ ఉల్లేఖించి యున్నారు. 3. సమాజరచనవర్ణాశ్రమ యుక్తముగా ఉండాలంటూ అట్టహాసముగా ప్రతిపాదించినారు. 4. రాజశాసనము ధర్మ నియంత్రితమై యుండాలి. రాజులుగాని, ప్రజాపరిపాలకులు గాని ఎప్పుడును అన్యాయమును ఆశ్రయించగూడదు. మరియు అన్యాయమును ఉపేక్షగూడ చేయగూడదు. తప్పుజేసినవాడిని తప్పకుండా శిక్షించాలి. అధర్మమును రూపుమాపి ధర్మమును రక్షించాలి- అని శ్రీతుకారాం మహారాజుగారు చక్కని రాజనీతిని గూడ వారి "గాథ"లో "ఝూలేం రామరాజ్య కాయ ఉణేం ఆమ్హాసీ" ఇత్యాది అభంగములద్వారా

ప్రతిపాదించారు. 5. "జోడోనియా ధన ఉత్తమ వ్యవహారేం। ఉదాసేం విచారేం వేంచ కరీ॥" ఇత్యాది అభంగములలో ధర్మపూర్వకముగా, నీతిగా ధనమునార్జించాలి మరియు నిష్కామముగా, విచారపూర్వకముగా సత్కార్యముల కొఱకు ఖర్చుచేయాలి – అని అర్థవ్యవస్థను గూడ చాలా గంభీరముగా వారి "గాథ"లో నిరూపించారు.

శ్రీ తుకోబారాయ్ అంటున్నాడు – లోకమునకు నేను ఏదైతే బోధిస్తున్నానో, అది నా సొంతముది గాదు. వేదశాస్త్రములలోని సిద్ధాంతమునే చెప్పుచున్నాను. వ్యాసాదులు పురాణాదుల్లో ఏది చెప్పారో – దానినే నేను అనువదించి చెప్పుచున్నాను. విఠలుని (పరమాత్మను) శరణుజు జొచ్చాలి (వెళ్ళాలి), అతని నిజనిష్ఠలో ఉండి నామజపము చేయాలి – ఇత్యాది విషయములు వేదములోనే చెప్పబడ్డాయి. భగవన్నామము చేత లోకము ఉద్ధరించబడుతుంది. భగవంతుని శరణుబొందినవాడు భాగ్యవంతుడు. చతుర్వేదములు, పదునెనిమిది పురాణములు, ఆరు శాస్త్రములు ఇదే విషయమును చెప్పుచున్నవి. "భగవన్నిజ తత్త్వజ్ఞానముచేతనే మోక్షము" అని వేదశాస్త్రములలో చెప్పబడిన ఈ పరమ రహస్యము నాకు శ్రీ విఠలుని కృపచేతనే తెలిసింది. అంతేగాని వేదపుటలను తిరగేసే అధికారము మాకు లేదు. కాని విఠలుని అనుగ్రహము మాపై పరిపూర్ణముగా ఉన్నందువల్లనే వేదరహస్యములు వేదార్థములు, మాకు క్షుణ్ణంగా అవగతమైనవని ధైర్యంగా అభిమానముతో చెప్పగల్గుతున్నాము. తాత్పర్యమేమనగా! శ్రీతుకారాం మహారాజుగారి అభంగములకు ఇంతటి ప్రామాణ్యత చేకూరుటకు కారణము వారి యొక్క వేదనిష్ఠయే. వారు వైదిక ధర్మమునే ప్రమాణముగా స్వీకరించి దానినే భాషాంతరముజేసి లోకులకు బోధించారు. వారి యొక్క వేదనిష్ఠ వారి స్వశబ్దముల ద్వారానే తెలియబడుచున్నది. వినండి. "వేదము

నుల్లంఘించి, అనాదరించి యెవడు ఏది చెప్పినా, వాడు పాఖండి, సంతుమహాత్ముల ముందు వాడు నల్లముఖము వాడు. ఎవనికి వేదములు, శాస్త్రములు, ఇతిహాస పురాణములు మాన్యములుగావో అనగా ప్రామాణ్యముగా స్వీకరించడో - వాని ముఖము గూడ చూడవద్దు. వేదములను నిందించువాడు చండాలుడు, పాతకి, సూతకి మరియు పరమ మూర్ఖుడు" ఇటువంటి శ్రీతుకారామస్వామిని "వేదవిరోధి" అని స్వప్నమందైనా తలంచవచ్చునా?

కర్మకాండము, ఉపాసనా (భక్తి) కాండము మరియు జ్ఞానకాండము అని వేదము కాండత్రయాత్మకము. ఇంతేగాకుండా ఎన్నో విద్యలు, విషయాలు గూడ వేదములో ప్రతిపాదించబడ్డాయి. వాటన్నిటిని లోకోపకారకములని గుర్తించి "శ్రీభక్తతుకారాం - అభంగవాణి" ద్వారా "గాథ"లో విపులముగా వివరించారు.

**1. కర్మకాండము :-**

"ధర్మరక్షావయాసాఠీc । కరణేc ఆటీ ఆమ్హాసీ ॥" (137) ఈ అభంగము ద్వారా శ్రీతుకారాం మహారాజుగారు ధర్మమును రక్షించుట కొఱకే అవతరించినాడని సుస్పష్టముగా తెలియుచున్నది. అందుకే వారి "గాథ"లో అడుగడున "వేదవిహిత" కర్మలను ఉపదేశించారు. ఎందుకనగా! జీవుడు ఎంతవరకు దేహేంద్రియ మనోబుద్ధులు గలిగియుండి వాటితో ఎంతవరకు తాదాత్మ్యము పెట్టుకొనునో - అంతవరకు జీవుని ద్వారా కర్మలు జరుగుట అపరిహార్యము. "న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్య కర్మకృత్" (గీత. 3-5) కావున పాపాత్ముడుండనీ లేదా పుణ్యాత్ముడుండనీ కర్మ చేస్తున్నపుడు దాని ఫలముయొక్క స్పృహ ఉన్నా, లేకున్నా అతడు

అనుభవించి తీరవలయును. "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి । అవశ్యమేవ భోక్తవ్యం కృతకర్మ శుభాశుభమ్". వర్తమాన జన్మలో అనుభవిస్తున్న సుఖదుఃఖములు గత జన్మలలో చేసుకున్న కర్మ ఫలములు. ఇప్పుడు చేస్తున్న కర్మ ఫలము భావి జన్మలకు సంప్రాప్తించును. వేద నిషిద్ధ కర్మలను పాపకర్మలంటారు. అభక్ష్య భక్షణము, అపేయపానము ఇత్యాదులు. వేదవిహిత కర్మలు పుణ్యకర్మలనబడును. స్వర్గాదులనుద్దేశించి విధానము చేయబడినవి. ఈ పుణ్యపాపములు బుద్ధిగమ్యములు గావు మరేమనగా శాస్త్ర గమ్యములు. ఇది మంచిది ఇది చెడ్డది అని బుద్ధి నిర్ణయించినంత మాత్రముచే వాటిని పుణ్యపాపములనగూడదు. వేదమే నిర్ణయిస్తుంది. అందువలన వేదవిహిత కర్మలు మాత్రమే చేయాలి. ఒకవేళ మనుష్యుడు వేదాజ్ఞనుల్లఘించి వర్తించినట్లయితే యమదండనకు పాత్రుడగును. నరక హేతువులు గాన వేదనిషిద్ధ కర్మలు చేసినవాడు చక్రవర్తిగా ఉన్నప్పటికిని యమదండనకు గురికావలసిందే. శ్రీతుకోబారాయ్‌గారు వారి "గాథ"లో నిషిద్ధకర్మలను – హింసా, దొంగతనం, అగమ్యగమనము, అభక్ష్య భక్షణము, అపేయపానము, అస్పృశ్యస్పర్శనము, అసత్యభాషణము మొదలగు వాటిని నిషేధిస్తూ వాటినాచరించువారిని దుష్టుడని, దుర్జనుడని, లండు అని ఇత్యాది శబ్దాలతో మరీ కఠోరంగా నిందించారు. "బోలే వర్మ జో చాలే యా విరహిత। తో జాణాపతిత శ్రుతి బోలే"॥ ఇత్యాది అభంగములలో వర్ణాశ్రమోచిత ధర్మము నుల్లంఘించినవానికి పతనము తప్పదని చెప్పారు. "వేదవిహిత తుమ్హీ ఆఇకాహెూ కర్మే'।" ఇత్యాది, మరియు "బ్రహ్మచారీ ధర్మ ఘోకావీం అక్షరేం" ఇత్యాది అభంగములద్వారా దేహతాదాత్మ్యముగల వర్ణాశ్రమములవారు వారి వారికి విధానము చేసిన కర్మలు అవశ్యముగా చేయాలని నొక్కివక్కాణించి ఉపదేశించారు.

**2. భక్తికాండము :-**

శ్రీ తుకారాంమహారాజుగారి "గాథ"లో ముఖ్యముగా "భక్తి" నే ఎక్కువగా ప్రతిపాదించారు. వారంటారు - భక్తి నిర్దోషంగా ఉండుట అత్యంతావశ్యకము. భక్తి యొక్క ఫలము సగుణసాక్షాత్కారము, తద్వారా భోగ మోక్షములు. భక్తి నాలుగు విధములగు దోషములు లేనిదైయుండాలి. 1.దంభము, 2. పాపము, 3. కామన, 4. వ్యభిచారము.

**1. దంభము :-** దంభము శ్రీ తుకారామస్వామివారికి ససేమిరా గిట్టదు. దాంభిక భక్తితో లోకులను మోసపుచ్చవచ్చును, కీర్తిని గడించవచ్చును. కాని సర్వాంతర్యామి భగవంతుని నమ్మించగలరా? ఈ దాంభిక భక్తి ఎటువంటిది అనగా! అత్త చనిపోతే కడుపులో ప్రేమలేని కోడలు ఏడ్చినట్లు, డబ్బులిచ్చి శవము వద్ద ఏడిపించినట్లు (కంటిలో నీరుండదు, కడుపులో ప్రేమ ఉండదు), గొడ్రాలు కడపుకు చాలాగుడ్డలు కట్టుకొని నాకు కడుపొచ్చింది అని చెప్పుకున్నట్లు - లోన సాంసారిక వాసనలు నింపుకొని బాహ్యంగా భక్తి జేస్తే ఏమైనా ఫలముంటుందా? కావున నిష్ఫలమగు దాంభికభక్తి చేయగూడదు.

**2. పాపము :-** పాపదోషము భక్తిలో నుండగూడదు. ఒకవైపు స్నానసంధ్యాదులు, కట్టు, బొట్టు జుట్టు బాగానే ఉన్నాయి. కాని మరొకవైపు అభక్ష్య భోజనాదులు జేసి పాపమును ఒడిగట్టుకుంటారు. విషయాసక్తితో గూడిన భక్తి అనగా ఇంద్రియమనంబులు అదుపులో పెట్టుకోకుండా "రామ రామ, క్రిష్ణ క్రిష్ణ, శివశివ, నారాయణ" అంటే ఏమైన ఫలముందా? షడ్రసోపేతమగు పక్వాన్నమును తింటున్నపుడు ఒక ఈగ కడుపులోకి పోయింది. ఆ భోజనము సుఖకారకముగా యుంటుందా?

**3. కామము :-** భోగకామనతో భక్తిచేసినట్లయితే బంగారమిచ్చి ఇనుమును తెచ్చుకున్నట్లుంటుంది. మాయొక్క గృహ, పశు, ధన, సంతతి, పొలము, పుత్ర పెంపొందాలి అను కామనతో భక్తి చేసిననది భగవంతునికి ఇష్టముండదు.

**4. వ్యభిచారము :-** జగత్కారణమగు పాండురంగని వదలి ఎవరు క్షుద్రదేవతలనుపాసింతురో - వారి భక్తి వ్యభిచారి భక్తి. ఏదేవత తన పొట్టకోసము ఏడుస్తుందో, నాకు ఇది పెట్టు అదిపెట్టు అని భక్తులనే అడుక్కుతింటుందో - అటువంటి దేవతాభక్తి జేసినవానికి ఏమైన ఫలము దక్కుతుందా? శాక్తులు కొందరు శక్తి ఉపాసన చేస్తూ మాంసభక్షణము మద్యపానము ఇత్యాది నిషిద్ధము, అశుద్ధము మరియు అధర్మ పనులు చేస్తారు. వీరు ఐహిక పారలౌకిక సుఖములను నోచుకోరు, బదులుగా నారకీయ దుఃఖములననుభవించెదరు. పరబ్రహ్మమే యగు పాండురంగని వదలి క్షుల్లక (క్షుద్ర) దేవతలయందు విశ్వాసముపెట్టిన వారి ఫజీతి చాలా భయంకరంగా ఉంటుంది. సారాంశమేమనగా దంభము, పాపము, కామన మరియు వ్యభిచారములను చతుర్విధ దోషరహితమైన అనన్యభక్తియే "శుద్ధభక్తి" యనబడును.

శ్రీతుకారాం మహారాజుగారి "గాథ" యేది గలదో, అది ఒక భక్తిశాస్త్రము. దానిలో చెప్పిన ప్రతి విషయము గూడ అనుభవపూర్వకము - చిలుక పలుకులుగావు. వారు అంటారు - నేను యేది లోకమునకు ఉపదేశిస్తున్నానో, అది నేను స్వయంగా అనుభవించి చెప్పుతున్నాను - పాండురంగని పాదాలపై ఆన. భక్తిరసమును నేను స్వయముగా సేవించి మీకు త్రాపుచున్నాను. శ్రీతుకారామస్వాములవారు సగుణ, నిర్గుణ సాక్షాత్కారి. వారి భాగ్యమేమని చెప్పవచ్చును. పాండురంగడే వారికి ఋణి

(అప్పు తీసుకున్నవాడు) అయ్యాడు. మనుష్య జన్మ సార్థకము జేసుకున్నాడు. భగవంతుని దాసుడయ్యాడు. వారికి నాలుగు విషయాలు చాలా ఇష్టము. 1. పంఢరీక్షేత్రము, 2. చంద్రభాగ, 3. పాండురంగడు, 4. పుండరీకుడు. పంఢరీక్షేత్ర "వారి" చేయుటయే వారికి తీర్థయాత్ర. ఏకాదశి ఉపవాసమే వారి వ్రతము. విఠలుని నామసంకీర్తనము చేయుటయే వారి నియమిత ధర్మము. "రామక్రిష్ణహరి" అనునదియే వారికిష్టమైన మహామంత్రము. భగవంతునికి, భక్తునికి భేదము చూడకుండుటయే వారి జ్ఞానము. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - పాండురంగా! నీయందుగల ఏకవిధభక్తి ఎప్పుడూ వ్యభిచరితము కాగూడదు. కళ్యాణకారియగు ఒకేఒక మీయొక్క భక్తిమార్గములోనే నేను చరింతును గాక. దేవా! నామనస్సులో ఎప్పుడుగూడ దుర్వాసనలు ఉత్పన్నము గాగూడదు. ఉత్పన్నమైన ఏక నిష్ఠభక్తి సిద్ధిని పొందునట్లు అనుగ్రహింపుము. నాకు తినుటకు తిండి లేదు. "అన్నము అన్నము" అంటూ ఆకలితో అలమటిస్తూ ఒక భార్య అసువులు వదలినది. సంతానము నష్టమైనది. నాతల్లిదండ్రులు పరమపదవిని పొందినారు. వ్యాపారము దివాలా తీసినది. కుటుంబమును పోషించుకోలేని అసమర్థుడని లోకులు నిందిస్తున్నారు. ఇదంతా నా మంచికోసమే జరిగిందని భావిస్తున్నాను. ఒకవేళ నేను సకలైశ్వర్య సంపన్నుడనై ఉంటే, నీభక్తిని చేసి ఉందునో లేదో. ఈ వర్తమాన పరిస్థితిని కల్గించి నన్ను అనుగ్రహించావు స్వామి! దేవా! ముల్లోకములందైననూ ఇంతకంటె గొప్ప భాగ్యము గలదా? ఐహిక పారలౌకిక భోగములందాసక్తి లేకుండ చేయుము తండ్రీ! పరమేష్ఠి పదము, ఇంద్రపదము మొదలగునవి భోగములు గావు - భవరోగములు. నీయొక్క భక్తిముందు బ్రహ్మజ్ఞానము, తజ్జన్య మోక్షము గూడ న్యూనమే. పతివ్రతస్త్రీకి ఎట్లు తన

పతిదేవుని యందే ఏకనిష్ఠ భక్తి ఉంటుందో అటువంటి అవ్యభిచరితమైన నిష్కామ భక్తిని నాకు ప్రసాదించండి స్వామీ!

1. శ్రీతుకారాం మహారాజుగారి భక్తిలో దంభములేదు. లోకులు వారిని నిందాస్తుతులు చేసినా వారిని (లోకులను) లక్ష్యపెట్టేవారు కాదు. నామసంకీర్తన చేస్తూ దేహమును, దేశకాలాలను విస్మరించేవారు. పాండురంగనిలో తన్మయులై గానం చేసేవారు. లోకులను రంజింపజేయుటకు వారు కీర్తన జేసేవారు కాదు. దేవుణ్ణి ఉద్దేశించి ప్రార్థించేవారు. 2. స్వప్నములోగూడ వారు పాపచింతన చేసేవారు కాదు. విహిత భోగముల యందే వారికి విరక్తి గలదంటే, ఇక నిషిద్ధ విషయాలలో ఆసక్తి కలుగుటకు శక్యమే లేదు. ఆనాటి మహారాష్ట్ర రాజ్యాధిపతి శ్రీఛత్రపతి శివాజీవారు శ్రీతుకారాం మహారాజుగారి బోధలు విని ముగ్ధుడై అనేకమైన ద్రవ్య విశేషమును పంపించినా వాటిని స్వీకరించకుండా తిరిగి పంపించాడు. కోరివచ్చిన శ్రీని, స్త్రీని కాదన్నారు. ద్రవ్యమును మృత్తికతో, పరస్త్రీని రుక్మిణీ మాతతో సమానముగా భావించేవారు. 3. వారి భక్తిలో కామన మచ్చుకైనను ఉండెడిదికాదు. "బ్రహ్మాదికపదేం దుఃఖాచీ శిరాణీ । తెథే దుశ్చిత్త ఝుణీం జడో దేసీ ॥" ఈ మంగళాచరణ అభంగ వాక్యముద్వారానే వారియొక్క వైషయిక వితృష్ణ ఎంతటిదో తెలియవస్తుంది. 4. శ్రీపాండురంగడే వారికి పరమప్రమాణము. సర్వస్వము. "విఠల ఆముచే జీవన । ఆగమ నిగమాంచే స్థాన" ॥ నాకు జీవనము విఠలుడే. వేదశాస్త్రములకు ఉత్పత్తి స్థానము మరియు ప్రతిపాద్యవిషయము విఠలుడే. "అస్య మహతోభూతస్య నిఃశ్వసితమేతద్ ఋగ్వేదాదేః", "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి". "శాస్త్రయోనిత్వాత్", "వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః" ఇత్యాది శ్రుతి, యుక్తి, స్మృతి ప్రతిపాదిత పరబ్రహ్మమే విఠలుడు. ఇతరదేవతలు, అవతార విశేషాలు

విఠలుని విభూతులే అంటూ శ్రీతుకారాంమహారాజుగారు వారి "గాథ"లో వేదములే పరమ ప్రమాణములని, విఠలుడే వేదప్రతిపాద్య విషయమని నొక్కివక్కాణించి చెప్పారు. ఇటుకపైనున్న సమచరణదృష్టి గల ఆ పాండురంగనియందే నాకు అఖండవృత్తి నిలిచియుండుగాక! విఠలునికి వ్యతిరిక్తమైన మాయికపదార్థములయందు నా చిత్తము పోకుండుగాక! విఠలుని శ్రీచరణకలములయందే నాకు అవ్యభిచరిత ఏకనిష్ఠభక్తి ఉండుగాక! అంటూ శ్రీవిఠలేశుని మహారాజుగారు ప్రార్థిస్తూ జగత్తునకు గూడ ఉపదేశము చేశారు.

### 3. జ్ఞానకాండము (అద్వైత తత్త్వజ్ఞానము)

శ్రీ తుకారాంమహారాజుగారు వారి "గాథ"లో ఎక్కువగా భక్తికి, విశేషతః నామస్మరణకు ప్రాధాన్యత ఇచ్చారు. అయినా గూడ అద్వైత తత్త్వజ్ఞానమును బోధించలేదని చెప్పుటకు వీలులేదు. ఉపనిషత్తులలో యే అద్వైత తత్త్వజ్ఞానము చెప్పబడినదో, మరియు దేనిని శ్రీమజ్జగద్గురు ఆద్యశంకరాచార్యులవారు వారి భాష్యాది గ్రంథములలో విస్పష్టముగా ప్రతిపాదించినారో, అట్లే శ్రీ సంతుజ్ఞానదేవులు - జ్ఞానేశ్వరి మరియు అమృతానుభవము ఇత్యాది గ్రంథాలలో విస్తృతముగా చెప్పియుండిరో - అదే తత్త్వమును శ్రీమహారాజుగారు గూడ సంక్షేపముగా (మార్మికభాషలో) ప్రతిపాదించారు. అద్వైత తత్త్వజ్ఞానములో ముఖ్యంగా రెండు విషయములు ప్రతిపాదించబడినవి. 1. జగన్మిథ్యాత్వము, 2. జీవబ్రహ్మైక్యము. వాటిలో "రజ్జుసర్పాకార బాసియలేఁ జగడంబర" ॥ (3600) ఇత్యాది అభంగములచే జగన్మిథ్యాత్వమును వర్ణిస్తూ ఈ సంసారము పుచ్చిపోయిన గింజలవలె అసారమైనది. పరమాత్మ తప్ప జగత్తులో శాశ్వతమైనది ఒకటియును లేదు. దుఃఖాలయమగు ఈ జగత్తు మాయాకార్యము. జగదుపాదానకారణమగు

మాయ బ్రహ్మమును ఆశ్రయించుకొని బ్రహ్మమునే విషయము జేసినది. (కప్పివేసినది). దాని యొక్క ఆవరణ శక్తి (అసత్వాపాదక, అభానాపాదక ఆవరణము)చే బ్రహ్మము లేదు, భాసించుటలేదు (నాస్తి, నభాతి) అను భ్రమ జీవులకు కలిగినది. ఆ అవిద్యారూపమాయచేతనే భూత భౌతిక సృష్టి నిర్మాణము జరిగింది. రంగా! ఈ అసద్రూప జగత్తును మాకు సత్యముగా ఎందుకు భాసింపజేస్తున్నావు? నీ మాయచే స్వయంగా నీవే ఆవరింపబడి, నిష్కారణముగా మమ్ములనెందుకు భయభ్రాంతులనుగా జేసి ఆడిస్తున్నావు? ఇట్లు శ్రీమహారాజుగారు జగత్తు అసత్, జడ, దుఃఖరూపముగాయున్నదను సిద్ధాంతమును అనేక అభంగముల ద్వారా స్పష్టముగా తెలియజేస్తూ జీవ-బ్రహ్మైక్యమును చాలా సుందరంగా వర్ణించారు. "అమర ఆహా అమర ఆహా। ఖరేం కీ సహా ఖోటేతేం ॥" (901) అరే ఓ జనులారా! మీరందరు జన్మ మరణాతీతులుగాయున్నారు. దేహతాదాత్మ్యమును వదలండి. అప్పుడే మీకు నా మాటలలోని సత్యము తెలియవస్తుంది. దేహెూపాధిమూలమున మీకు "నేను జీవుడను" అని తోస్తున్నది. వాస్తవముగాదు. "దేవచి బరేం దేవచి బరేం। తుకామ్హణే ఖరే తుమ్హీ"॥ వస్తుస్థితిని విచారించినచో జీవుడు సదా ముక్తస్వరూపుడు, బంధము అనునది ఎప్పుడూ లేదు. దేహేంద్రియ మనోబుద్ధులయందు, స్త్రీపుత్రాదులయందు "నేను నాది" అను మిథ్యా అభిమానము వల్లనే బద్ధుడయ్యాడు. శ్లో॥ న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః। న ముముక్షుర్న వై ముక్తః ఇత్యేషా పరమార్థః ॥ (మాండూక్యకారికా). దేహేంద్రియముల ద్వారా పుణ్యపాపరూప కర్మ జరుగుతుంటే - కర్తృత్వము దేహేంద్రియాలలో ఉందా? ఆత్మలో ఉందా? అను వివేకము లేనందువలన బద్ధుడయ్యాడు. శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా, కరణం చ పృథగ్విధమ్। వివిధాశ్చ పృథక్ చేష్టాః, దైవం చైవాత్ర పంచమమ్॥

తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః। పశ్యత్యకృత బుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః ॥ (గీత 18-14,16)

ఉపాధియోగముచే నేర్పడిన బంధము ఆత్మయందు ఎట్లు కల్పితమో అట్లే మోక్షము గూడ "సారీ ఝూలీ మేలీ లటకే వచన। బద్ధముక్త శీణ తుకామ్హణే॥" (3323) చిన్నపిల్లలు చెక్కబొమ్మలతో ఆడుకుంటూ చెక్కబొమ్మరూప పురుషుడు "చనిపోయి మళ్ళీ బ్రతికి లేచాడు" అనడం ఎంత అబద్ధమో, అట్లే కల్పితము మరియు పరిచ్ఛిన్నమునగు ఉపాధి, పారమార్థికము మరియు వ్యాపకమునగు ఆత్మను బంధించుటగాని మరియు దానినుండి ముక్తిని బొందుటయుగాని పచ్చి అబద్ధము - అనగా ఆత్మ బంధమోక్షాతీతము, నిత్యశుద్ధ, బుద్ధ, ముక్త స్వరూపము. కాని జీవుడు భ్రమచేత స్వయముగా తనను బద్ధుడనని ఆరోపించుకుంటున్నాడు. శ్రీతుకారాం మహారాజుగారు బద్ధజీవున్ని సంబోధిస్తూ అంటున్నారు - "ఒరే జీవుడా! నీవు దేహత్రయముతో సంబంధము పెట్టుకోకుండా, స్వరూపస్థితిలో ఉండుము. అహంకార మమకారములనబడు మలమును అంటకుండా ఉండుము. బ్రహ్మమును ఆత్మత్వముగా (అహం బ్రహ్మాఽస్మి) అనుభూతినొందుటయే నిజముగా బ్రహ్మజ్ఞానమనబడును. అనుభవము లేకుండా బ్రహ్మజ్ఞానము గూర్చి చెప్పుట కేవలము శుష్క వేదాంతమగును.

శ్రీమహారాజుగారు స్వయముగా బద్ధభూమికను తీసుకొని చెప్పుచున్నాడు. "నేను పంచభూతముల వలలో చిక్కిపోయాను. అనగా దేహత్రయ తాదాత్మ్యమును పొందాను. వాటిని అభిమానించి నేను స్వయముగా నా బంధనమును నిర్మించుకున్నాను. వాస్తవముగా దేహత్రయాతీతుడనయ్యును, భిన్నత్వము, ద్రష్టృత్వము గోచరించుట లేదు." ఈ ప్రకారముగా శ్రీపూజ్యపాద అద్యగురు శంకరాచార్యులవారు ఏద్వైతే

ఆత్మానాత్మల అన్యోన్యధ్యాసము చెప్పియుండిరో - దానినే శ్రీమహారాజుగారు కొంచెము వేరు భాషలో చెప్పారు. స్వతః సమ్యక్ జ్ఞానమునొందిగూడ బద్ధభూమికను తీసుకొని చెప్పుటలో తాత్పర్యమేమనగా! భక్తి పారవశ్యమే గాని వేరొండుగాదు. అదెట్లనగా! "దేవా! నీవు జగద్రూపనాటకమును రచించి, అనేక అవతారములు స్వీకరించుట వట్టి బూటకము. భక్తులనుద్ధరించుటగూడ నీవు కల్పించిన ఒక ఆట. పరమార్థతః వాస్తవముగాదు. బొమ్మలన్నీ చక్కెరతో నిర్మింపబడినవే నని తెలిసిగూడ- "ఇది చిలుక, ఇది కుక్క, ఇది పిల్లి" అని అంటున్నాము. ఇదియే మేము చేస్తున్న గొప్ప పొరపాటు. దేవా! నీవు నిర్గుణము, నిరాకారము, అజ, అజర, అమరస్వరూపుడవు. అట్లే నేను గూడ నిర్గుణము, నిరాకారము, అజ, అజర, అమర స్వరూపుడను ఎందుకు కాదు చెప్పు. నామాటలు నీకు స్వీకార్యములు కాకున్నచో, పద.... మనమిద్దరము సద్గురువుల వద్దకు వెళ్ళెదము. సత్పురుషులే మన యీ జగడమును తీర్మానించెదరు. నీకెట్లు పరమార్థతః నామరూపములు లేవో, నాకుగూడ లేవు. నీవెట్లు వ్యవహారదృష్ట్యా దేహధారణ చేయుదువో, అట్లే నేను గూడ ధరిస్తున్నాను." స్వామివారి పై వాక్యములను చక్కగా గమనించినచో వారియొక్క భక్తి మధ్వ - రామానుజులవలె ద్వైతమూలకముగాదని వెల్లడియగుచున్నది.

శ్రీతుకారాం మహారాజుగారు ఉపనిషత్తులలోని అద్వైతతత్త్వమునే వారి అభంగములద్వారా గానము చేసారు. కాని ఆ తత్త్వముయొక్క ఆవిష్కరణ శాస్త్రీయపద్ధతిలో కాకుండా లౌకిక పద్ధతిలో చాలా సుందరముగా ప్రతిపాదించి యున్నారు. ఉదాహరణకు - "తత్త్వమసి" ఈ వాక్యములో 'తత్ పదార్థము, 'త్వం' పదార్థములలో విరోధమున్నందున జహదజహల్లక్షణా చేయవలసి వచ్చింది. అనగా వాచ్యార్థములోని విరోధి భాగమును త్యాగము

చేసి, అవిరోధి చేతనాంశమును గ్రహించినచో జీవబ్రహ్మైక్యము సంభవించును. ఇది వేదాంత శాస్త్రములలో ప్రతిపాదించబడింది. ఇదే విషయమును ఒక అభంగములో శ్రీతుకారామస్వామిగారు "తత్" శబ్దవాచ్యార్థమును త్యాగముజేసి దేవుని వర్ణన జేశారు. "నేను, నాయొక్క అను శబ్దములయొక్క వాచ్యార్థమును నాశనము జేసి నీవలెనే నన్ను జేయుము" అను ప్రార్థనా భాషలో 'తత్త్వమసి' మహావాక్యములోని అభేదార్థమునే ఆవిష్కరించారు. "ఉపాధి వేగళేం తుమ్హీ నిర్వికార । కాంహీచ సంసార తుమ్హా నాహీ । ఐసే మజ కరూనీ దేవా నారాయణ । సమూల వాసనా నురవానీ ॥" దేవా! నీవు కార్యకారణాత్మక ఉపాధి భిన్నుడవు. నీకు అవస్థాత్రయమునకు గాని ప్రపంచము యొక్క ఉత్పత్తి, స్థితి, ప్రళయములకు గాని కారణత్వము పరమార్థతః లేదు. జన్మ మరణరూప సంసారము నీకు లేదు. నారాయణా! నన్ను గూడ నీవలెనే జేయుము. సంసారమునకు, భేదజ్ఞానమునకు కారణమగు అవిద్యాసహిత వాసనలను నాశనము జేయుము. అప్పుడు నేను నీ స్వరూపుడను కాగలను. శ్లో॥ విభేద జనకేఽజ్ఞానే నాశమాత్యంతికం గతే । ఆత్మనో బ్రహ్మణోర్భేదమసంతం కః కరిష్యతి ॥ తత్త్వమస్యాది వాక్యోత్థ సమ్యగ్ధీజన్యమాత్రతః । అవిద్యాసహకార్యేణ నాసీదస్తి భవిష్యతి ॥ (విష్ణుపురాణము మరియు బృ.వార్తికము). ఈప్రకారముగా అఖండ మహావాక్యార్థమును పై అభంగము ద్వారా స్పష్టము జేసియున్నారు. ఇట్లు కాండత్రయాత్మక వేద వాఙ్మయమును దృష్టిలో బెట్టుకొని సకల విషయములను వారి "గాథ"లో ప్రతిపాదించారు. ఇంతేగాకుండా నీతి, ధర్మము, వైరాగ్యము, వివేకము, అర్థ, సామాజిక, రాజనీతి ఇత్యాది ఎన్నో విషయాలను ఉపదేశించారు. మరియు కావ్య లక్షణాలు గూడ ఈ సద్గ్రంథరూప "గాథ"లో అగుపడును. సాహిత్య విషయాలగు అలంకారములు గూడ ఎన్నో మీరు "గాథ"లో చూడవచ్చును. వేదము మరియు

వేదానుసారియగు బ్రహ్మసూత్రములు, భాగవతము, భగవద్గీతా ఇత్యాది గ్రంథములతో సమన్వయము చేస్తూ "గాథ" రచన ద్వారా లోకంలో చక్కటి సంస్కృతిని జాగృతి జేసి వైదిక వాఙ్మయమును పునరుజ్జీవింపజేసి వారి యవతారకార్యమును పూర్తిగావించి, చివరకు సదేహముతో స్వధామమగు వైకుంఠమున కేగి విష్ణుసాయుజ్యమును పొందిన మహాభక్త శిరోమణి శ్రీభక్తతుకారాం మహారాజుగారి దివ్యచరణారవిందములకు హృత్పూర్వక కోటి కోటి ప్రణామములు.

బోలా పుండరీక వరదహరి విఠల్ శ్రీజ్ఞానదేవ తుకారాం మహారాజుకీ జై ......

పైన వివరించిన ప్రకారముగా శ్రీతుకోబారాయ్ అభిప్రాయాన్ని అనుసరిస్తూ మీముందు ఆవిష్కరిస్తున్న ఈ చిన్న పొత్తమును "శ్రీభక్తతుకారాం అభంగవాణి"ని గూడ కాండత్రయ వివక్షలోనే సంగ్రహముగా రూపుదిద్దాలని తలంచి "గాథ"లో నాలుగు వేలకు పైగా ఉన్న అభంగములలో కొన్నిటిని మాత్రమే గ్రహించి ఈ చిన్నగ్రంథములో మొదటి భాగముగా కర్మకాండ, ఉపాసనా (భక్తి) కాండమును దృష్టిలో పెట్టుకొని యథా మతిగా వ్యాఖ్యానము చేయడం జరిగింది. ఇంతేగాకుండా మరెన్నో అద్భుతమైన అవాంతరవిషయాలను గూడ ప్రాసంగికముగా వివరించనైనది. జీవుడు అజ్ఞాన తత్కార్యమగు సంసారరూప అనర్థమును ఆత్యంతిక నివృత్తి జేసికొని నిత్యము, నిరుపాధికము, నిరతిశయమును అగు ప్రత్యగభిన్న బ్రహ్మానందరూప మోక్షమును పొందుటకు - దానికి (మోక్షమునకు) ప్రతిబంధకమగు అజ్ఞానమును నివృత్తి జేసికొనవలెను. అజ్ఞానము నివృత్తి (నాశనము) గావలెనన్న దానికి విరోధియగు జ్ఞానమునే సంపాదించాలి. "జ్ఞానాదేవ తు కైవల్యమ్", "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి", "తరతి

శోకమాత్మవిత్", "జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిం అచిరేణాధిగచ్ఛతి" , "యత్ జ్ఞాత్వాఽ మృతమశ్నుతే" ఇత్యాది శ్రుతి స్మృతులు ప్రమాణములు. ఈ జ్ఞానము వేదాంత విచారము వల్లనే ఉదయిస్తుంది. "విచారాజ్జాయతే జ్ఞానం", "అవిచారకృతో బంధో విచారేణ నివర్తతే", "వేదాంత విచారమును "అధికారి" పురుషుడైతేనే చేయగలడు. అధికారి అనగా వివేకము, వైరాగ్యము, షట్సంపత్తి మరియు ముముక్షుత్వము అను నాల్గు సాధనములు గలవాడు. ఈ సాధన చతుష్టయ సంపత్తిని పొందవలెనన్న పురుషుడు ఈశ్వరార్పణబుద్ధితో నిష్కామకర్మ, నిష్కామ ఉపాసన చేయాలి. దానితో అంతఃకరణ శుద్ధి, చిత్తైకాగ్ర్యము సిద్ధించును. శ్లో॥ "స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్। సాధనం చ భవేత్పుంసాం వైరాగ్యాది చతుష్టయమ్॥" (అపరోక్షానుభూతి). నిష్కామకర్మచే మలదోషము (పాపము) నివృత్తమగును. నిష్కామ ఉపాసన (ఈశ్వరనామోచ్చారణాదికము)చే చిత్త ఏకాగ్రత (విక్షేపము–చిత్త చాంచల్యము యొక్క నివృత్తి) కలుగును. "ధర్మేణ పాపమపనుదతి", "జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః". ఇత్యాది ప్రమాణములు. ఇట్లు అంతఃకరణశుద్ధి మరియు ఏకాగ్రతను పొందినవానికే సాధనచతుష్టయము సిద్ధించును. ఈ సాధనచతుష్టయ సంపన్నుడే వేదాంత విచారమునకు, తద్ద్వారా జ్ఞానమును పొందుటకు అధికారి. ఈ విషయమునంత దృష్టిలో పెట్టుకొనియే వేదమాత మొట్టమొదలు కర్మోపాసనలను విరివిగా వివరించినది. తదుపరి జ్ఞానకాండమును అనగా వేదాంతరూప ఉపనిషద్విద్యను ప్రతిపాదించినది. ఇదే భావమును జ్ఞప్తియందుంచుకొని ఈ సద్గ్రంథమును "అధికారి" నిరూపణ వరకు పూర్వభాగముగా రూపొందించినాము. దీనిని ప్రేక్షావత్పురుషులు, విజ్ఞులు ఆదరించగలరు.

సాధనచతుష్టయ సంపత్తి ప్రాప్తించినమీదట అధికారి పురుషునికి "తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్". (ముండకోపనిషత్) అని చెప్పిన గురూపసత్తి విధిప్రకారము శ్రీగురుదేవులను శరణుబొంది, వారి ముఖారవిందమునుండి తత్త్వమస్యాది మహా వాక్యశ్రవణము, మననము, నిదిధ్యాసనరూప విచారము కర్తవ్యమైయున్నది. "తద్విజిజ్ఞాసస్వ", "సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః" ఇత్యాది శ్రుతులు మరియు "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" ఇత్యాది స్మృతి, సూత్రములు ప్రమాణములు. ఇట్టి విచారజనిత అప్రతిబద్ధ దృఢ అపరోక్షరూప చరమ వృత్త్యాత్మక సాక్షాత్కారముచేత పురుషుడు అజ్ఞాననివృత్తిద్వారా కైవల్యము (మోక్షము) నొందును. జీవన్ముక్తుడగును. "జ్ఞానాదేవ తు కైవల్యమ్" జీవన్ముక్తుడగును. "తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యేఽథ సంపత్స్యే." అను శ్రుత్యుక్త ప్రకారము ప్రారబ్ధ క్షయమయిన వెంటనే వర్తమాన దేహపాతము, ఆపైన విదేహ మోక్షము నొందును. "న స పునరావర్తతే", "స్థిత్వాస్యామంతకాలేఽపి బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి". ఈ విషయమంతా జ్ఞానకాండాత్మకము మరియు ఈ గ్రంథము యొక్క ఉత్తర భాగరూపంలో శ్రీతుకారాం మహారాజుగారి "గాథ" నుండి సందర్భానుసారముగ క్రమముగా అభంగములను సంగ్రహించి త్వరలో రూపొందించనున్నాము. దానికి వలసిన శక్తిని, భక్తిని స్ఫూర్తిని ప్రసాదించి, అనుగ్రహించగలరని శ్రీపాండురంగని మరియు శ్రీభక్తతుకారాం మహారాజుగారిని పదములనంటి పదములనిమ్మని ప్రార్థిస్తున్నాము.

శ్రీతుకారాం మహారాజుగారి "గాథ"కు ఎందరో మహానుభావులు అర్థమును చెప్పినారు. వ్యాఖ్యలుగూడ వ్రాసినారు. వారందరిటికి

వందనములు. వారిలో "శ్రీ శంకర్‌మహారాజ్ ఖందార్‌కర్" గారి గాథాభాష్యము చాలా ప్రసిద్ధము, గంభీరము, ప్రసన్నము మరియు యథాయోగ్యముగూడ. ఇది అతిశయోక్తిగాదు స్వభావోక్తి. వారు గొప్ప మేధావి, బ్రహ్మనిష్ఠాగరిష్ఠులు, భక్తి జ్ఞానవైరాగ్యసంపన్నులు. వారు శ్రీమహారాజుగారి వేదానుసారి భావమును గ్రహించి అభంగములకు యథా యోగ్యముగా భాష్యమును రచించి సాధకభక్తులకు ఎంతో మేలు చేకూర్చిన మహనీయులు. వారు కేవలము శ్రీతుకారాం గాథాభాష్యమే కాకుండా - "హరిపాఠ" భాష్యము, శ్రీజ్ఞానేశ్వర్ మహారాజుగారు శ్రీమద్భగవద్గీతపై వ్రాసిన "శ్రీజ్ఞానేశ్వరి"కి మరియు అమృతానుభవమునకు గూడ భాష్యము వ్రాసినారు. మేము "శ్రీభక్తతుకారాం అభంగవాణి" అను నీ లఘుగ్రంథములో గైకొనిన శ్రీతుకారాం గాథ లోని అభంగములకు శ్రీపరమపూజ్య శంకర్ మహారాజ్ ఖందార్‌కర్ గారి భాష్యము ననుసరించియే అర్థము చెప్పుట, అనువాదము చేయుట జరిగినది. మేము అనధికారులమైనప్పటికిని వారి భావాను సారముగానే అభంగములకు యథామతిగ విస్తృతవ్యాఖ్యానము జేయుటకు సాహసించితిమి. శ్రీశంకర్ మహారాజ్ ఖందార్‌కర్ గారు తమ "గాథాభాష్య" ప్రస్తావన చివరలో ఒకమాట చెప్పారు. ఏమనగా - "కొన్ని చోట్ల శ్రీతుకారాం మహారాజుగారి అభంగములలోని శబ్దములయొక్క వాచ్యార్థానుసారమే మేము భాష్యమును వ్రాసియున్నాము. కొన్ని చోట్ల మాత్రము వాచ్యార్థమును స్వీకరించినచో అభంగము యొక్క ఆశయమును అర్థము చేసికొనుటకు కష్టమగునని ప్రతీయమాన తాత్పర్యార్థము ననుసరించియే భాష్యము వ్రాసియున్నాము. ఇది తత్త్వజ్ఞులగు వాచకులకు (పాఠకులకు) తెలియగలదు". అదే విషయమును (భావమును) మేము గూడ అనువదించి చెప్పుచున్నాము - గావున పాఠకభక్తులు, విజ్ఞులు గమనించగలరు."తాత్పర్య అనుపపత్తియే" లక్షణాకు బీజము గావున

అభంగములలోని కొన్ని శబ్దములకు లక్ష్యార్థమును (భావార్థమును) చెప్పవలసి వచ్చినది.

"శ్రీ భక్తతుకారాం అభంగవాణి" యను నీ చిన్న సద్గ్రంథమును తెలుగుభాషలో అనువదించి స(సు) హృదయులగు మీ చేతికందించే సౌభాగ్యము మాకు ప్రాప్తించినందులకు వేము ధన్యులముగా భావించుచున్నాము. కాని యీ కృతి(షి)లో మా చొరవ యేమియును లేదు. లేఖకుని చేతిలోని కలము వంటివారము. శ్రీపాండురంగడు మరియు శ్రీతుకారాం మహారాజు (వీరిద్దరి) యనుగ్రహమే ఈ గ్రంథ రచనకు అసాధారణకారణము. ఇంకొక ఉపాదానకారణము గూడ గలదు. అదియేమనగా! ఈ గ్రంథరచనలో ఒక స్త్రీమూర్తి యొక్క త్యాగనిరతి నిహితమై యున్నది. ఆమెయొక్క సహకారము లేకుంటె ఈ గ్రంథరత్నము రచింపబడి యుండెడిది కాదు. ఆమెయొక్క సేవానిరతికి ప్రతిఫలముగా మేమేమియును సమర్పించుకోలేక పోయాము. అందుకే ఈగ్రంథము యొక్క వ్యాఖ్యానమునకు "సుజాత వ్యాఖ్య" అని నామకరణము చేయుట జరిగినది. ఇది మోహము కావచ్చునని మోహము జెందవలదు. కేవలము కృతజ్ఞతలు చెల్లించుట మాత్రమే.

శ్రీతుకారాం మహారాజుగారి "గాథ"లోని కొన్ని అభంగములకైనా తెలుగు భాషలో అనువాదముచేయాలని, తెలుగు పాఠక పాండురంగభక్తులకు సేవచేయాలని మేము స్వప్నమందైననూ సంకల్పము చేసియుండలేదు. అభంగములయొక్క ఆలోచనయు లేదు. ఎన్నడును అభంగములను చదువలేదుగదా. "గాథ" గ్రంథమును చూసి ఆనందించే భాగ్యము గూడ కలుగలేదు. మాకు ఇచ్ఛయును లేకుండెను. కాని, పాండురంగడంటే అత్యంత ప్రేమ (భక్తి) యుండెడిది. పాండురంగభక్తచరిత్రలు చదివేవారము.

పాండురంగభక్తులలో శ్రీ తుకారం మహారాజుగారు మహాభక్తశిరోమణి అని గూడ తెలియును. వారి చరిత్రను గూడ తెలుగులో చదివి యున్నాము. కాని వారి "అభంగవాణి"ని మాత్రము చదివి యెఱింగినవారముగాము. ఒకప్పుడు మేము సోలాపూర్ - మహారాష్ట్రలో" శ్రీమలయాళస్వామి సత్యసాధనా ఆశ్రమము"ను నెలకొల్పి విద్యార్థులకు కొన్నాళ్ళుగా వేదాంత పాఠాలు బోధిస్తూ ఉంటిమి. ఇట్లుండగా సుమారు 2008లో ఒకనాడు "రంగారెడ్డి జిల్లా, నవాపేట మండలము పులిమామిడి అనుగ్రామము నుండి సోమిరెడ్డి అను పేరుగల వ్యక్తి, పాండురంగని అనన్యభక్తుడు మమ్మలను వెదుకుతూ వెదుకుతూ మావద్దకు విచ్చేసి, సాగిలబడి మ్రొక్కి లేచినిలబడి కంటివెంట నీరుకారుస్తూ ఉన్నాడు. నోటివెంట మాటరావడము లేదు. కొంతసేపు మేము అలా చూసి మందలించాము. స్వామీజీ! మీరెవరు? ఎక్కడివారు? ఇక్కడకు ఎందుకు వచ్చారు? మీ రోదనమునకు కారణమేమి? చెప్పగలరా? అప్పుడు ఆ భక్తుడు కొంత ఊరట బొంది తన వివరాలు అన్ని చెప్పి - తన యభీష్టమును, ఇక్కడకు వచ్చిన కారణమును తెలియపరచినాడు. ఏమనగా! స్వామీజీ! మిమ్మల్ని వెదుకుకుంటూ గొప్ప కార్యార్థమై వచ్చాను. ఏమిటంటే - శ్రీభక్తతుకారాం గారి యొక్క అంభంగ "గాథ"ను తెలుగులో అనువదించేవారెవరైనా ఉన్నారా - అని ఎన్నో చోట్లు తిరిగాను. కాని ఎచ్చటను యెవరును సమర్థులైనవారు తటస్థపడలేదు. తటస్థపడినప్పటికిని వారు అంగీకరించలేదు. దానితో నిరాశజెంది దుఃఖముతో ఉదాసీనముగా ఉండి, దీనుడనై ఆ పాండురంగని అనుగ్రహమేమో మీ యొక్క ఆచూకీ తెలిసింది. వెంటనే పరుగు పరుగునవచ్చి మీ పాదాలపై వ్రాలినాను. మీరు నన్ను అనుగ్రహించి, మా అభీష్టమును నెరవేర్చగలరని మళ్ళీ ఏడ్చాడు. మేము ఆ భక్తునియొక్క తపన, పాండురంగని

యందు, శ్రీతుకారాం యందు గల అకుంఠితమైన భక్తిని, శ్రీతుకారాంగాథపైగల నిస్సీమప్రేమను అర్థం చేసుకోగలిగాము. కాని చేయునది లేక మేము సంశయములో ఉండి పోయాము. ఎందుకంటే! మాకు మరాఠీ భాషా పరిజ్ఞానము అంతగా లేదు – ఇది మొదటిసమస్య. మేము ఎప్పుడును శ్రీతుకారాం మహారాజుగారి యొక్క "గాథ"ను చూడనేలేదు. ఇది రెండవసమస్య. మరియు దానిని తెలుగులో అనువాదము చేయుట – మరీ క్లిష్టమైనపని – ఇది మూడవ సమస్య. ఇప్పుడు ఈభక్తునికి ఏమని సమాధానము చెప్పాలి– ఇదీ మా సందేహము. ఆ భక్తుడేమో మళ్ళీ మళ్ళీ రోదిస్తూ ప్రార్థిస్తూన్నాడు. స్వామీజీ అన్ని అభంగములు కాకున్నా కొన్ని అయినా అనువదించండి. ఇంతవరకు "శ్రీజ్ఞానేశ్వరి" తెలుగులో అనువదించారు. కానిగాథను ఎవరు అనువదించలేదు. ఆ బృహత్కార్యమును మీరు నెరవేర్చగలరను నమ్మకంతో మీ వద్దకు వచ్చాను. నేను రాలేదు – ఆ పాండురంగడే మీవద్దకు పంపించాడు, అనుగ్రహించండి స్వామీ! అని. అప్పుడు మేము ఆలోచించాము. ఇది నిజంగా పాండురంగని సంకల్పమే అయి ఉండవచ్చును. అలాంటప్పుడు మేమెందుకు సంకోచించవలెను. "మూకం కరోతి వాచాలం, పఙ్గుం లంఘయతే గిరిమ్ । యత్కృపా తమహం వందే పరమానందమాధవమ్" ॥ అని నిశ్చయించుకొని ఒకవేళ ఇది శ్రీ విఠలుని యొక్క సత్యసంకల్పమే అయితే ఈ "అభంగవాణి తెలుగు అనువాదరూప కార్యము తప్పకుండా ఫలప్రదమవుతుంది అని మాట ఇచ్చాము. ఆనాటి వాగ్దానరూప అంకురమే, ఈనాడు ఈ "శ్రీభక్తతుకారాం అభంగవాణి" అను గ్రంథరూప ఫలమైనది.

ఇటువంటి సద్గ్రంథము రూపదిద్దుకొని ముద్రింపబడి మన చేతుల్లోకి వచ్చే సౌభాగ్యమును కల్పించిన వారు కరుణాసముద్రుడగు మా

శ్రీగురుదేవులు. వారు ఎంతో పట్టుదలతో ఎంతో శ్రమకోర్చి, శ్రీతుకారాం మహారాజుగారి అభంగవాణిని ప్రజలలోకి తీసికురావాలని, శ్రీమహారాజుగారి సద్బోధలు చదివి, విని సకల జీవులు ఆనందించాలని, తరించాలని ఎంతో పట్టుదలతో ముద్రించారు. శ్రీగురుదేవుల చరణకమలద్వంద్వమునకు సాష్టాంగ ప్రణామములు.

శ్లో॥ యదత్ర సౌష్టవం కించిత్తద్గురోరేవ మే న హి ।
యదత్రాసౌష్టవం కించిత్తన్మమైవ గురో ర్నహి ॥

శ్రీ సద్గురు చరణారవిందార్పణమస్తు
మీ విధేయులు
స్వామి బ్రహ్మావిద్యానందగిరి

శ్రీ శుకబ్రహ్మాశ్రమము.
15-04-2015

# నివేదన

మహామహోపాధ్యాయ డా॥ సముద్రాల లక్ష్మణయ్య
ఎడిటర్ ఇన్ చీఫ్, తి.తి.దే, తిరుపతి.

లోకంలో కొందరు కారణజన్ములై ఉంటారు. వారు ఒక మహత్తరకార్యం నిర్వహిస్తారు. తద్ద్వారా ఎనలేని లోకోపకారం చేస్తారు. అట్టి మహాపురుషులసంఖ్య మిక్కిలి తక్కువగానే ఉంటుంది. కాని సమాజంపై వారు చూపే ప్రభావానికి పరిమితి లేదు. అట్టి మహామహులలో శ్రీభక్తతుకారాం అగ్రగణ్యుడు.

మహాత్ముల జన్మ ఒకదేశానికో, ఒక కాలానికో, ఒక జాతికో పరిమితం కాదు. "శూరుల జన్మంబు సురల జన్మంబు ఏరుల జన్మంబు ఎరుగంగనగునె" అన్నట్లు వారు ఎప్పుడు ఎక్కడ జన్మిస్తారో తెలియదు. కాని జన్మించి పెరిగి పెద్దవారై లోకోపకారమైన మహాకార్యాలు చేసినపుడు వారి కీర్తి నలుదెసలా విస్తరిస్తుంది. మహానుభావుడైన శ్రీతుకారాం యశస్సు ఆవిధంగానే లోకంలో నలువైపులా విస్తరించింది.

మహాత్ముల ఘనకార్యాలు అనేకవిధాలుగా ఉంటాయి. సమకాలీన సమాజాన్ని ప్రభావితం చేసే సామాజిక సేవారూపమైన కార్యక్రమాలతోపాటు ఆధ్యాత్మికవిజ్ఞాన విభూషితులైనవారు కర్మ భక్తి ధ్యాన జ్ఞానాది యోగాలను ముమ్మరంగా ప్రచారం చేస్తారు. ఆ యోగాల ద్వారానే మనుజుడు ముక్తికి తగిన అర్హత సంపాదించుకుంటాడు. అందువల్ల "స్వయం తీర్ణః పరాంస్తారయతి" అన్నట్లు మహాత్ములు తాము తరించి ఇతరులను తరింపజేయటానికి పాటుపడతారు.

అలా పాటుపడటం అనేక నిర్మాణాత్మక కార్యక్రమాలరూపంలో ఉంటుంది. శ్రీ తుకారాం మహాశయుడు తమ సమకాలికులకే కాక తర్వాతి వారికి కూడా తరణోపాయాలుగా ఆధ్యాత్మిక తత్త్వబోధకాలైన సూక్తులనెన్నింటినో అభంగవాణి రూపంలో ప్రసాదించాడు. ఈ ప్రబోధంలో లౌకిక పారలౌకిక జీవనములలో ఆత్మోన్నతి కలిగించే ప్రబోధాలు కోకొల్లలుగా ఉన్నాయి.

కబీర్‌దాసు సూక్తులు, వేమనపద్యాలు, బసవేశ్వరవచనాలు, లోకప్రసిద్ధములైనట్లే తుకారాం మహాశయుని అభంగాలుకూడా విశ్వతోముఖమైన వ్యాప్తి పొందాయి. మహారాష్ట్రదేశంలో అవి భగవద్గీతవలె నిత్యపారాయణ యోగ్యాలుగా ప్రచారం పొందాయి.

నిష్కామకర్మ, ఆశ్రమధర్మాలు, చిత్తస్వరూపం, తీర్థక్షేత్రపర్యటన నియమాలు, అహింసాది వ్రతాల గొప్పతనం, పూర్వభక్తులను భగవంతుడు రక్షించిన విధము, శ్రీకృష్ణాద్యవతారాల ప్రాశస్త్యం, గోపికల నిరుపమ భక్తి, ధ్యానాది ఉపాసనలకు అవసరమైన నిష్ఠ ఇత్యాదిగా నైతిక, ఆధ్యాత్మిక, తత్త్వమంతా పూసగ్రుచ్చినట్లు ఇందులో వివరించడమైనది.

మహారాష్ట్ర దేశంలోనే వుండి ఆ భాషను బాగా అభ్యసించి ఆధ్యాత్మిక మార్గంలో అడుగుపెట్టి చివరికి సన్న్యాసం కూడా స్వీకరించినవారు శ్రీబ్రహ్మవిద్యానందగిరి స్వాములవారు. వీరు సంస్కృతం కూడా చక్కగా అభ్యసించారు. వేదాంతవిద్యలో ప్రవీణులు. చక్కని ప్రవచనపాటవం కలవారు.

శ్రీశుకబ్రహ్మాశ్రమపీఠాధిపతులైన పూజ్యశ్రీ విద్యాస్వరూపానందగిరి స్వాములవారినుండి సన్న్యాసం స్వీకరించారు. వారి సన్నిధిలోనే ఉంటూ ప్రస్తుతం ఆధ్యాత్మిక తత్త్వప్రబోధలను కావిస్తున్నారు. తమకున్న ఆధ్యాత్మిక విజ్ఞానాన్నీ, మహారాష్ట్ర సంస్కృత భాషాపరిచయాన్నీ వినియోగిస్తూ శ్రీ తుకారాం మహాశయుని అభంగాలను తెలుగులో మనోజ్ఞంగానూ, అర్థవంతంగానూ వివరించారు.

ఈ గ్రంథం రచించిన రచయితకూ, దీనిని ప్రచురించిన ఆశ్రమ నిర్వాహకులకూ కృతజ్ఞతాభివందనాలు సమర్పిస్తున్నాను. ఆధ్యాత్మిక జిజ్ఞాస కల పాఠకులు భక్తిశ్రద్ధలతో దీనిని అధ్యయనం చేసి ఆత్మోన్నతి పొందగలరని ఆశిస్తున్నాను.

తిరుపతి — సముద్రాల లక్ష్మణయ్య

22-05-2015

# శ్రీభక్తతుకారాం అభంగవాణి

## విషయసూచిక

శ్రీ

# ॥ పాండురంగాష్టకమ్ ॥

మహాయోగపీఠే తటే భీమరథ్యాం
వరం పుండరీకాయ దాతుం మునీంద్రైః ।
సమాగత్య తిష్ఠన్తమానందకందం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥1॥

తటిద్వాసనం నీలమేఘావభాసం,
రమామందిరం సుందరం చిత్ప్రకాశమ్ ।
వరం త్విష్టికాయాం సమన్యస్తపాదం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥2॥

ప్రమాణం భవాబ్ధేరితం మామకానాం
నితమ్బ కరాభ్యాం ధృతో యేన తస్మాత్ ।
విధాతుర్వసత్యై ధృతో నాభికోశం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥3॥

స్ఫురత్కౌస్తుభాలంకృతం కంఠదేశే
శ్రియాజుష్ట కేయూరకం శ్రీనివాసమ్ ।
శివం శాంతమీడ్యం వరం లోకపాలం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥4॥

శరశ్చంద్ర బింబాననం చారుహాసం,
లసత్కుండలాక్రాంత గండస్థలాంతమ్ ।
జపారాగబింబాధరం కంజనేత్రం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥5॥

కిరీటోజ్జ్వలత్సర్వదిక్ప్రాంతభాగం
సురైరర్చితం దివ్యరత్నైరనర్ఘై ।
త్రిభంగాకృతిం బర్హమాల్యావతంసం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥6॥

విభుం వేణునాదం చరన్తం దురన్తం
స్వయం లీలయా గోపవేషం దధానమ్ ।
గవాం వృందకానందదం చారుహాసం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥7॥

అజం రుక్మిణీప్రాణసంజీవనం తం
పరంధామ కైవల్యమేకం తురీయమ్ ।
ప్రసన్నం ప్రపన్నార్తిహరం దేవదేవం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥8॥

స్తవం పాండురంగస్య వై పుణ్యదం యే
పఠన్త్యేకచిత్తేన భక్త్యా చ నిత్యమ్ ।
భవామ్భోనిధిం తే వితీర్త్వాన్తకాలే
హరేరాలయం శాశ్వతం ప్రాప్నువన్తి ॥9॥



# ఇందుగల గ్రంథ చిహ్న సూచికలు

| | |
|---|---|
| 1. వే.పం. | వేదాన్త పంచదశి |
| 2. ముం.ఉ | ముండకోపనిషత్తు |
| 3. కఠ. | కఠోపనిషత్తు |
| 4. ఐ. ఉ. | ఐతరేయోపనిషత్తు |
| 5. బృ.ఉ. | బృహదారణ్యకోపనిషత్తు |
| 6. ఛాం. ఉ. | ఛాందోగ్యోపనిషత్తు |
| 7. గీత. | భగవద్గీత |
| 8. శాం.ప- మ. భా | మహాభారతం, శాంతిపర్వం |



# శ్రీభక్తతుకారాం అభంగవాణి

## శ్రీ పాండురంగాయ నమః

## శ్రీభక్తతుకారాం మహారాజుగారి సంక్షిప్త జీవిత చరిత్ర

పరమ పవిత్రమైన భరతఖండమునందు పరమేశ్వరుని యొక్క యనేక యవతారములు వెలసినవి. ధర్మము సన్నగిల్లినప్పుడల్లా భగవంతుడవతరించి పునరుజ్జీవింపజేసెను. శిష్టులను రక్షించెను. దుష్టులను దునుమాడెను, కాని వారి దుష్టబుద్ధిని మార్చి, అజ్ఞానమును మాత్రము నాశనము చేయలేక పోయెను. అందుకే వారు దుష్టమైన పూర్వ సంస్కార బలముచే పునః పునః జన్మించి ధర్మమునకు హాని గలుగజేయు చుండిరి. కావున అస్త్రశస్త్రములచే దుష్టులలోని అజ్ఞానము అంతము గాదని యెఱింగి భగవంతుడు తన అంశాంశములచే మహాత్ముల (జ్ఞానుల) రూపములో పరమ భాగవతోత్తములగు భక్తాగ్రేసరులుగా నక్కడక్కడ అప్పుడప్పుడు అధర్మము పెచ్చు పెరిగినపుడు ప్రకటమై దుర్మార్గులలోని యజ్ఞానమును జ్ఞానప్రదానముచే నంతరింపజేసి ముక్తిని ప్రసాదించు చున్నాడు. "నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా" (గీత 10–11). హృదయస్థ అజ్ఞానోపాదానక మిథ్యాప్రత్యయ రూప తమస్సు (అధ్యాస)ను. అంతఃకరణపరిణామాత్మక దీప సదృశ చిదాభాసయుక్త అప్రతిబద్ధదృఢ అపరోక్ష బ్రహ్మజ్ఞానముచే స్వరూపావరకాజ్ఞాననివృత్తిద్వారా నాశనము చేయుదును – అని భగవద్వచనము. "యతః జ్ఞాన మజ్ఞానస్యైవ నివర్తకమ్" జ్ఞానము అజ్ఞానమునకు మాత్రమే నివర్తకము(నాశకము) ఉన్నది (పంచపాదికా). అనాది కల్పితాజ్ఞానము జ్ఞానముచేతనే నివర్తించునుగాన, దుష్టుల (అజ్ఞ జనుల) యజ్ఞానమును జ్ఞానప్రదానము ద్వారా నశింపజేసి ముక్తులను గావించుటకుగాను భగవంతుడు తన విభూతులైన యనేక

మహాత్ములుగా నవతరించుచున్నాడు. అట్టి మహాత్ముల కోవకు జెందిన వాడే శ్రీ భక్త తుకారామ్. మహారాష్ట్రలో "దేహు" అను గ్రామములో శాలివాహన శకము 1520 లో "మోరే" అను వంశమునందు ఒకానొక నిరుపేద కుటుంబములో భగవద్విభూతి యగు శ్రీ తుకారాం మహారాజు గారు జన్మించెను. శ్రీతుకోబారాయ్ భగవద్విభూతి (అవతారపురుషుడు) అనుటలో అతని యొక్క స్వవచనములే ప్రమాణములు.

అభంగము :-

ఆమ్హీ వైకుంఠవాసీ । ఆలోఁయాచి కారణాసీ ।
బోలిలే జే ఋషీ । సాచభావేఁ వర్తాయా ॥ 1॥

ఝాడూ సంతాంచే మారగ । ఆడరానీ భరలేఁ జగ ।
ఉచ్ఛిష్టాచా భాగ । శేష ఉరలాతో సేవూ ॥ 2॥

అర్థేఁ లోపలీఁ పురాణేఁ । నాశ కేలా శబ్దజ్ఞానేఁ ।
విషయలోభీ మనేఁ । సాధనే హే బుడవిలీఁ ॥3॥

పిటూఁ భక్తీచా డాంగోరా । కళికాళాసీ దరారా ।
తుకా మ్హణే కరా । జయ జయకార ఆనందేఁ ॥4॥ (236)

ప్రతిపదార్థము :- ఆమ్హీ = మేము ; వైకుంఠవాసీ = వైకుంఠములో నివసించువారము; (కాని, ఈ మృత్యులోకానికి) ఆలో = వచ్చినాము ; యాచి = దీని (జన్మ) యొక్క (ముఖ్యమగు యే) ; కారణాసీ = కారణము గూర్చి? (అనినచో) ; జే = ఎవరైతే (పూర్వీకులైన) ; ఋషీ = తత్త్వదర్శులగు సత్పురుషులు (యే వైదిక మార్గమును) ; బోలిలే = చెప్పి యుండిరో (దానిని) ; భావే = శ్రద్ధతో ; సా చ = సత్యముగా (యథా విధిగా) వర్తాయా= వర్తించుటకు (ఆచరించుటకు మరియు నితరులచే

నాచరింపజేయుటకు అని తెలియవలెను. 1. ఇంతే గాకుండా) సంతాంచే= సత్పురుషులచే (చూపబడిన వైదిక) ; మారగ = మార్గము (నందు వికారరూప ధూళి ఏర్పడినది. దానిని) ; ఝాడూ = శుభ్రము (స్వచ్ఛము) చేయుదుము; (ఎందుకనగా సంపూర్ణ) జగ = జగత్తు ; అడరానీ = వేద నిషిద్ధ వ్యవహారరూప అడ్డునడకలతో (యథేష్టా చరణముతో) ; భరలే = నిండిపోయినది. (కావున పూర్వోత్తర మీమాంసలలో ఋషులు చెప్పిన) ఉచ్ఛిష్టాచా భాగ = ధర్మ, జ్ఞాన ఆది విషయములను (మరియు), ఉరలా శేష = మిగిలిన నామసంకీర్తనాది శేష భాగము యేది గలదో; తో = దానిని ; సేవూ = జగత్తులో ప్రకాశింపజేసి ఆచరించెదము. 2. పురాణే = వేద–శాస్త్ర – పురాణములయొక్క (యథార్థ తాత్పర్య భూత) ; అర్థే = అర్థము (విషయము); లోపలీ = లోపించినది, శబ్దజ్ఞానేఁ = కేవల శబ్ద జ్ఞానముచే (ధర్మము – భక్తి – జ్ఞానములయొక్క) ; నాశ కేలా = నాశము చేసిరి ; (అనుభవరహిత ఉపదేశకులయొక్క మనేఁ = మనస్సు ;విషయ లోభీ = విషయాసక్త మయ్యేను ; హే = ఈ ; సాధనేఁ = పరమార్థ సాధనలు ; బుడవిలీఁ = ముంచివేసిరి. 3. తుకా హ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; కళికాళాసీ = కలికాలమునకు గూడ ; దరారా = భయమును (గొల్పు) ; భక్తీచా = భక్తియొక్క ; డాంగోరా = దండోరా (నగారా) ; పిటూ = మ్రోగించెదము ; (అందుకని ఓ జనులారా! మీరు) ఆనందేఁ = ఆనందముతో (హరినామము యొక్క) ; జయ జయకార = జయజయకారములు ; కరా= చేయండి. 4.

**తాత్పర్యము :–** మేము వైకుంఠములో నివసించు వారము. అయినా గూడ, ఈ మర్త్యలోకములో నవతరించితిమి. దీనికి ముఖ్య కారణమేమనగా! పూర్వీకులైన మంత్రద్రష్టలు, తత్త్వజ్ఞులునగు సత్పురుషులు ఏదైతే వైదిక

మార్గమును బోధించి యుండిరో దానిని శ్రద్ధతో మరియు శాస్త్రోక్త ప్రకారముగా నాచరించి, యితరులచే నాచరింప జేయుటయే. 1. ఇంతే గాకుండా సత్పురుషులచే జూపబడిన వైదిక మార్గమునందు అనేక వికారములు (దోషములు) ఏర్పడినవి. ఆ దోషరూప మాలిన్యమును తొలగించుట మరియు జగత్తు వేదనిషిద్ధ వ్యవహారరూప యథేష్టాచరణ (అడ్డునడకలతో) వ్యాప్తమై పోయినది గాన. జగత్తునకు యథార్థమగు శ్రేయో మార్గమేదో సుస్పష్టముగా దెలియ జేయుట గూడ మా యవతరణ ప్రయోజనము గలదు. "ఉచ్ఛిష్టభాగము" అనగా పూర్వోత్తర మీమాంసలలో ఋషులు చెప్పిన ధర్మ బ్రహ్మ ప్రతిపాదక విషయము లేవి గలవో నవియును మరియు భాగవతాది గ్రంథములలో ప్రధానముగా భక్తిని గూర్చి ప్రతిపాదింపబడినప్పటికిని నామసంకీర్తనాదుల గూర్చి విశేషముగా ప్రతిపాదింపబడుట యవశిష్టమై యున్నందున, ఈ రెండు భాగములు అనగా ధర్మ, జ్ఞానములను మరియు నామ సంకీర్తనాదులను జగత్తులో విశేషముగా ప్రకాశింప జేసి ఆచరించుట గూడ మా యవతార ప్రయోజనమున్నది. 2. వేద–శాస్త్ర– పురాణాదులందలి యథార్థతత్త్వము లుప్తమైనది. కేవల శబ్ద జ్ఞానము (వాచ్యార్థ జ్ఞానము) చే లక్ష్యార్థము (తాత్పర్య విషయీభూత యథార్థ తత్త్వము) ధర్మ, భక్తి, జ్ఞానములు నాశనము చేయబడినవి. ఉపదేశకులమని యనిపించుకుంటున్న వారి మనస్సు విషయాసక్తమైనది. పరమార్థ సాధనలు వివేకాదులు, అమానిత్వాదులు, అద్వేష్టృత్వాదులు ముంచివేయబడినవి. 3. శ్రీ తుకారాం మహారాజు గారంటున్నారు – మేము ఇప్పుడు కలికాలము గూడ భయపడునట్లుగా భక్తిని విస్తరింపజేస్తూ, భక్తి యొక్క ఢంకా (నగారా) అన్ని దిక్కులలో మ్రోగించెదము. అందువలన నో జనులారా! మీఅందరు ఆనందముతో హరినామము యొక్క జయ జయకారములు చేయండి. 4.

జై జై పాండురంగ హరి, జై జై రామ కృష్ణ హరి
జై జై పాండురంగ హరి, జై జై రామకృష్ణ హరి.
జై జై పాండు రంగ హరి, జై జై రామకృష్ణ హరి.

బోలో పుండరీక వరద హరి విఠల్, శ్రీ జ్ఞానదేవ్ తుకారాం పండరినాథ మహారాజ్ కీ జై....

**విశేషము :-** ప్రాణినాం సాక్షాదభ్యుదయనిఃశ్రేయసహేతుః యః స ధర్మో బ్రాహ్మణాద్యైః వర్ణిభిః ఆశ్రమిభిశ్చ శ్రేయోఽర్థిభిః అనుష్ఠీయమానః, దీర్ఘేణకాలేన అనుష్ఠాతృణాం కామోద్భవాత్ హీయమాన వివేక విజ్ఞాన హేతుకేన అధర్మేణ అభిభూయమానే ధర్మే, ప్రవర్ధమానే చ అధర్మే, జగతః స్థితిం పరిపాలయిషుః స ఆదికర్తా నారాయణాఖ్య విష్ణుః భౌమస్య బ్రహ్మణః బ్రాహ్మణత్వస్య రక్షణార్థం దేవక్యాం వసుదేవాత్ అంశేన కిల సంబభూవ. (శ్రీమద్భగవద్గీతా సంబంధభాష్యే)

**అర్థము :-** ప్రాణులకు సాక్షాత్తు అభ్యుదయ నిఃశ్రేయసాన్ని ఇచ్చే ప్రవృత్తి, నివృత్తి రూప వేదోక్త ధర్మము శ్రేయస్సు కావాలనే కోరిక గల ఆయా వర్ణములకు జెందిన బ్రాహ్మణాదులచేత గార్హస్థ్యాద్యాశ్రమాల్లో ఉన్న వారి చేత ఆచరించబడుతుంది. ఇలా ధర్మాన్ని అనుష్ఠిస్తూండగా, సుదీర్ఘకాలమునకు, ఈ ధర్మానుష్ఠానం చేయువారిలో కామం (దురాశ) పెరిగి పోయింది. దానితో వాళ్ళలో వివేకజ్ఞానం సన్నగిల్లి అధర్మం పెచ్చు పెరిగి ధర్మాన్ని అణచి వేయడం ప్రారంభించింది. అట్టి పరిస్థితిలో జగత్తు యొక్క స్థితిని పరిపాలించు ఉద్దేశ్యంతో మొదటి సృష్టికర్తయగు నారాయణుడను విష్ణువు భూమిపై గల బ్రహ్మను అనగా బ్రాహ్మణత్వాన్ని రక్షించుటకు ( వేదమును రక్షించుటకు) ఒక అంశంతో వసుదేవుని ద్వారా దేవకి యందు జన్మించినాడట.

పై పేర్కొనబడిన శ్రీపూజ్యపాదులు జగద్గురు శంకరాచార్యుల పై భాష్యవచనాను సారమే శ్రీజగద్గురు తుకారాం మహారాజుగారు పై నుదహరింపబడిన మరాఠీ అభంగము ద్వారా తన యవతారకార్యమును తెలుపుచున్నారు. ఏదేని సంప్రదాయములో దీర్ఘకాలానంతరము జనులలో కామ, క్రోధ, లోభాది వికారములు (దోషములు) నిర్మాణమగును. దానిచే సంప్రదాయము (గురుపరంపరాగత ఉపదిష్ట సదుపదేశరూప వైదిక ధర్మము) వికృతి నొందును. భగవత్ప్రాప్తిరూప సాధ్యము కొఱకు సంప్రదాయ ప్రవర్తకులు సంప్రదాయమును (స్థాపించిరి) ఉపదేశించిరి. కామాది వికార ప్రాబల్యముచే భగవత్ ప్రాప్తి రూప సాధ్యము మరియు సంప్రదాయరూప హేతువు ప్రక్కకు నెట్టబడును. ఇటువంటి పరిస్థితుల్లో అధికారి పురుషుల అవతారము మరియు సంప్రదాయ శుద్ధీకరణముయొక్క ఆవశ్యకత ఉంటుంది. శ్రీతుకారాం మహారాజుగారి యవతారమునకు పూర్వము వసిష్ఠ, వ్యాస, వాల్మీకి, శక, నారద, జ్ఞానేశ్వర, నామదేవ, ఏకనాథుడు మొదలగు యెందరో సత్పురుషులు సంప్రదాయమును రూఢి పఱచి యుంచిరి. ఆ సంప్రదాయములోని కొందరు, ఉపదేశకులమని యనిపించుకొనువారు (పండితం మన్యాః) లోకములో విషయాసక్తులై, శబ్దపాండిత్యము, లోభము, దంభము, అభిమానము ఇత్యాది వికారముల చేత సంప్రదాయమును విచ్ఛిన్నము చేయుదురు. అందువలన సంప్రదాయశు ద్ధీకరణమత్యంతావశ్యకముగాన శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - సంతులు బోధించిన వైదిక ధర్మమును శ్రద్ధాపూర్వకముగా విధ్యుక్త ప్రకారముగా స్వయముగా నాచరించి యితరులచే నాచరింపజేసి కృతార్థులను జేయుటయే మా యవతార లక్ష్యము. సత్పురుషులు (ఋషులు, మునులు) జూపించిన మార్గములో కామాది వికారరూప మాలిన్యమును తుడిచి వైచి, వేదనిషిద్ధమగు యథేష్టాచరణాది వక్రమార్గములో నడచు

వారికి యథార్థ మార్గమేదో సుస్పష్టముగ తెలియ జేయుట, పూర్వోత్తర మీమాంసలలో జైమిని, వ్యాసమహర్షులచే ప్రబోధింపబడిన ధర్మ, బ్రహ్మ జ్ఞానమును మరియు హరినామ సంకీర్తనమును జగత్తులో విస్తృతముగా ప్రచారము జేసి యాచరించుటయే మాయవతార ప్రయోజనమని స్పష్టీకరించిరి. ఇంకను తన యవతార కార్యమును వ్యక్తీకరిస్తూ :-

**అభంగము :-**

**ధర్మ రక్షావయాసాఠీc । కరణేc ఆటీ ఆమ్హాసీ॥ 1॥**
**వాచా బోలోc వేదనీతి । కరూc సంతీ కేలేc తే ॥2॥**
**న బాణతా స్థితి అంగీc । కర్మ త్యాగీ లండతో ॥3॥**
**తుకామ్హణే అధమత్యాసీ । భక్తీ దూషే హరీచీ ॥4॥ (137).**

ప్ర.ప :- ధర్మ = ధర్మమును ; రక్షావయాసాఠీ = రక్షించుట కొఱకు ; ఆమ్హాసీ = మాకు ; ఆటీ = (అనేక) ప్రయత్నములు ; కరణేc = చేయవలసి వస్తుంది , 1. వేదనీతీ = వేదోక్త ధర్మము, నీతి, భక్తి ఇత్యాది తత్త్వములేవి గలవో (వాటిని) ; వాచా = (మాయొక్క) అభంగ వాణి ద్వారా; (లోకులకు స్పష్టముగా) బోలోc= చెప్పెదము. (మరియు) ; సంతీc = సంతులు (సత్పురుషులు యే వైదిక ధర్మమును, భక్తిని) ; కేలే = ఆచరించిరో; తేc = దానిని (మేము) ; కరూc = ఆచరించెదము. 2. (ఎవరైతే) అంగీ = స్వయముగా తనకు ; స్థితి = బ్రహ్మానుభూతి (బ్రాహ్మీస్థితి) ; న బాణతా = అనుభవమునకు రాక తొలుతనే ; కర్మ = వేదవిహిత కర్మలను ; త్యాగీ = త్యజించునో ; తో = వాడు ; లండ = మిథ్యాచారి యనబడును. 3. తుకామ్హణే = శ్రీ తుకారామస్వామి అంటున్నాడు. (ఎవడైతే). అధమ = నీచుడుంటాడో (వాడు) ; భక్తీ = హరిభక్తిని ; దూషీ = దూషించును; (మరియు) త్యాసీ= వానికి, హరీచీ = హరిభక్తి (దూరమగును). 4.

**తా॥** ధర్మమును రక్షించుట కొఱకు మాకు అనేక ప్రయత్నములు చేయవలసి వచ్చుచున్నది. 1. మాయొక్క అభంగవాణిచేత సంతు మహాత్ములచే చెప్పబడిన వేద, ధర్మ, భక్తి, నీతి మరియు ఆచార తత్త్వములు జగత్తునకు (లోకులకు) సుస్పష్టముగా తెలియజేయుబడుచున్నవి. సత్పురుషులు యే వైదిక, ధార్మిక మరియు భక్తి సంబంధ ఆచరణ గావించిరో, దానిని మేము ఆచరిస్తూ, జనులచే నాచరింప జేసెదము. 2. స్వయముగా తనకు బ్రహ్మానుభూతి కలుగనిదే మేము జ్ఞానులమని తలంచి యెవరు ధర్మమును త్యజింతురో వారు మిథ్యాచారులని తెలియవలెను. 3. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు - యెవరైతే అధమ పురుషులుంటారో, వారు హరియందు, హరిభక్తియందు దోషము నెంచి హరిభక్తి నుండి విముఖులై, భగవంతునికి యత్యంత దూరులగుచున్నారు. 4.

**విశేషము :-** పై యభంగము ద్వారా శ్రీతుకారాం మహారాజుగారు "ధర్మమును పరిరక్షించుట వేద, ధర్మ, భక్తి, నీతి మరియు ఆచార తత్త్వములను మా యభంగవాణిచే ప్రచారము చేయుటకే మేము అవతరించితిమి" యను యభిప్రాయమును స్వయముగా ప్రకటించెను.

నిర్గుణము, నిరాకారము, సచ్చిదానంద ఘనమగు నీవు ఎప్పుడు, ఎందుకు దేహధారివలె నవతరించెదవు? అను ప్రశ్నను పురస్కరించుకొని స్వయముగా శ్రీకృష్ణ పరమాత్మయే ఈ విధముగా సమాధించిరి (సెలవిచ్చిరి).

**శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత! ।**
**అభ్యుత్థానమధర్మస్య తదాఽ_త్మానం సృజామ్యహమ్॥** (గీత 4-7)

ఓ భరత వంశోద్భవుడవగు అర్జునా! లేక, భా = జ్ఞానము, దాని యందు రతుడవు (రమించువాడవు) నగు నో యర్జునా! వేద విహితము, ప్రాణుల యభ్యుదయ నిఃశ్రేయససాధనము, ప్రవృత్తి నివృత్తి రూపము,

తథా వర్ణాశ్రమాచారములచే నభివ్యక్తమగు ధర్మమునకు యెప్పుడెప్పుడు గ్లాని (హాని) సంభవించునో మరియు వేదనిషిద్ధము, అనేక ప్రకారముల దుఃఖసాధనము మరియు ధర్మవిరోధి యగు నధర్మము యెప్పుడు అభ్యుత్థానము (ఉద్భవము) అగునో, అప్పుడప్పుడు నేను (సచ్చిదానంద ఘనుడను) మాయా రచిత దేహమును ధరించి యవతరించెదను. (అని భగవద్వచనము).

ఈ భగవద్వచనానుసారము, పై యభంగ వచనానుసారముగ విచారించిన శ్రీతుకారాం మహారాజుగారు ఈశ్వరాంశ సంభూతుడుగా, అవతారపురుషుడుగా దెలియబడుచున్నాడు.

ఈ ఒకే జన్మయందేగాకుండా యనేక జన్మలలో ఇదే పని అనగా ధర్మపరిరక్షణ. భగవత్తత్త్వ ప్రచారరూప కార్యమును నిర్వహిస్తూ, దీనుల దుఃఖమును నివృత్తి చేస్తూ వస్తున్నాము - అని అంటూ శ్రీ తుకారాం మహారాజుగారు తన యవతార ప్రయోజనమును స్వయముగా తెలియ జేయుచున్నారు.

అభంగము :-

మాగేఁ బహుతాం జన్మీఁ । హేఁచీ కరిత అలో ఆమ్హీ ।
భవతాప శ్రమీఁ । దుఃఖేఁ పీడిలీఁ నివవూఁ త్యా ॥1॥

గర్జోఁ హరీచే పవాడే । మేళవూఁ వైష్ణవ బాగడే ।
పాఝుర రోకడే । కాఢూఁ పాషాణా మధ్యే ॥2॥

భావ శుద్ధ నామావళీ। హర్షేఁ నాచోఁ పిటో టాళీ ।
ఘాలూ పాయాతళీఁ । కళీకాళయాబళేఁ ॥3॥

కామక్రోధ బందిఖానీఁ । తుకామ్హణే దిలే దోన్హీ।
ఇంద్రియాంచే ధనీ । ఆమ్హీ ఝూఁలో గోసావీ ॥4॥

ప్ర.ప :- ఆమ్హీ = మేము ; మాగేc = వెనుక (పూర్వము) ; బహుతాం = అనేకమైన; జన్మీc = జన్మలలో, హేచీ = ఇదే (కార్యము) ; కరిత = చేస్తూ ; ఆలో = వచ్చినాము ; (ఏమనగా?) భవతాప = (యెవరైతే) సంసారతాపముచే, శ్రమీc = శ్రమించి ; దుఃఖే = భవదుఃఖముచే ; పీడిలీc = పీడింపబడిరో; త్యా = వారియొక్క (దుఃఖమును): నివపూc = నివృత్తి చేయుటయే. 1. హరీచే = శ్రీహరియొక్క (నామమును) ; గర్జోc = గర్జించుచూ; పవాడే = స్తుతి చేయుట ; వైష్ణవ = విష్ణు భక్తులను ; మేళవూc = సమీకరించి ; (హరి కీర్తనలు భజనలు చేస్తూ) ; బాగడే = గంతులు వేయుట ; (మరియు) పాషాణా మధ్యే = కఠిన శిలలవంటి హృదయము గల మనుష్యుల నుండి గూడ; రోకడే = ప్రత్యక్షముగా, పాఝర = భక్తి రూప ప్రేమ స్రోతస్సును ; కాఢూ = తీయుటయే (ప్రవహింపజేయుటయే) మా యొక్క కార్యము (అవతార ప్రయోజనము). 2. (అందువలన ఓ సద్భక్తులారా! మనమందరము) భావశుద్ధ = చిత్తశుద్ధితో (శ్రద్ధాపూర్వకముగా శ్రీహరియొక్క) నామావళీ = నామావళిని (గానము చేయుదము) ; హర్షేc = సంతోషముతో, నాచోc = నృత్యము చేయుదము. టాళీ = తాళములను; పిటోc = మ్రోగించెదము ; యూ = ఈ ; బళే = భక్తి సామర్థ్యముచే ; కళీకాళ = కలికాలమును; (మన యొక్క) పాయాతళీ= పాదముల క్రింద, ఘాలూc = పడవేసెదము. 3. తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు ; ఆమ్హీ = మేము ; కామ క్రోధ= కామము మరియు క్రోధము (అను నీ) ;దోన్హీ = రెంటిని ; బందీఖానీ = బందిఖానలో (ఖైదీలో) ; దిలే = అప్పగించితిమి ; (మరియు) ఇంద్రియాంచే = ఇంద్రియములకు ; ధనీ = సత్తాధీశులమగు ; గోసావీ = యజమానులము; ఝూలోc = అయితిమి. 4.

**తా॥** మేము అనేక జన్మములనుండి ఇదే పని (కార్యము) చేస్తూ వస్తున్నాము. ఏమనగా! యే జనులైతే సంసారతాపముచే సంతప్తులైరో, త్రివిధ దుఃఖములచే పీడితులైరో, వారి దుఃఖములను శాంతింపచేసి, సుఖమును చేకూర్చుటయే. 1. శ్రీహరియొక్క దివ్యనామ ఘోష చేయుట, నిర్మల హృదయులు, అనన్య విష్ణుభక్తులను సమీకరించుట, సత్సంగములు ఏర్పాటు చేసి భగవంతుని గుణగణగానము చేస్తూ చిందులు వేయుట, పాషాణ హృదయులగు మానవుల నుండి గూడ ప్రేమ భక్తి రూప స్రోతస్సును ప్రవహింప జేయుట మాయవతార కార్యము (ప్రయోజనము)న్నది. 2. అందువలన నో సద్భక్తులారా! మనమందరము చిత్తశుద్ధిచే శ్రద్ధా పూర్వకముగా శ్రీహరి నామావళిని గానము చేయుదము. ఆ ఆనందములో తన్మయులమై నృత్యము చేయుదము. తాళములు దిక్కులు పిక్కటిల్లు లాగున మ్రోగించెదము. మరియు భగవద్భక్తి సామర్థ్యముచే కలికాలమును (మృత్యువును) గూడ మన పాదముల క్రింద పడవైచి చూర్ణము చేసెదము. కావున హరిభజన జేయుదము రండి. 3. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు - మేము భక్తి బలముచే కామ క్రోధములను రెంటిని (ఉపలక్షణముగా - అరిషడ్వర్గములను) ఖైదీలో బంధించితిమి. ఈ విధముగా మేము ఇంద్రియములకు సత్తాధీశులమగు యజమానులము అయితిమి. శమదమాదులను పొందితిమి. 4.

**విశేషము :-** కావున శ్రీభక్త తుకారామస్వామి సాక్షాద్భగద్విభూతి యని, ధర్మ సంరక్షణార్థము, లోక కళ్యాణార్థము భగవత్తత్త్వ ప్రచారముచే లోకము నుద్ధరించుట కేతెంచిన యవతారపురుషుడని తన స్వకీయ యభంగవాణిద్వారా తేటతెల్లమయినది. ఈ విషయములో శ్రీవ్యాస సూత్రమును గూడ ప్రమాణముగా స్వీకరించదగి యున్నది. "యావదధికార మవస్థితిరాధికారికాణామ్" (బ్ర.సూ. 3-3-32).

"ఆధికారికాణామ్ = అధికారపురుషులకు ; యావదధికారమ్ = అధికారమున్నంత వరకు;అవస్థితిః = ఉండుట" అని సూత్రార్థము.

ఈశ్వరకోటి మహాత్ములు (ముక్త పురుషులు) స్వతః ముక్తులై యుండియు ఈశ్వరుని వలె సంసారము యొక్క కల్యాణము కొఱకు ప్రవృత్తులగుదురు. వారి ప్రారబ్ధము ఉత్కృష్టము మరియు శుద్ధము. కావున వారు ప్రాయః స్వతంత్రులుగా ఉంటారు. వీరినే అధికారి పురుషులంటారు. వారు ఈశ్వరునిచే నియోగింపబడిగాని, ఇచ్ఛానుసారముగా గాని సమయానుసారము లోక కళ్యాణార్థము, భక్తి, జ్ఞాన, వైరాగ్యములనుపదేశించి లోకమును అభక్తులైన దురాచారుల (నాస్తికుల) నుండి, అధర్మము నుండి రక్షించి ఉద్ధరించుట కొఱకు శరీరధారులై యవతరించెదరు. వారు వారియొక్క అధికారి ప్రారబ్ధ సమాప్తి పర్యంతము అప్పుడప్పు డవతరిస్తూంటారు. ప్రారబ్ధము ముగియడముతో విదేహ కైవల్యము నొందెదరు.

ఈ సూత్రమునకు భాష్యము వ్రాస్తూ శ్రీఆదిశంకరులు ఇలా తెలిపి యున్నారు. కొందరు అధికారి పురుషులు విదేహ కైవల్యము నొందకుండా భగవాన్ విష్ణువు (ఈశ్వరుని) ఆజ్ఞచే ధర్మరక్షణార్థము పునః పునః అవతరించెదరు. "అపాంతరతమ" అను పేరుగల ఋషి మహా విష్ణువు యొక్క ఆజ్ఞచే ద్వాపరము మరియు కలియుగ సంధికాలములో "కృష్ణద్వైపాయనుడు"గా నవతరించెను. బ్రహ్మదేవుని మానస పుత్రుడు - సనత్కుమారుడు, భగవాన్ శంకరునినుండి స్కంధుడు ఉద్భవించిరి. నారదుని కైతే యనేక యవతారములు కలిగినట్లు పురాణ వచనములున్నాయి.

అట్లే శ్రీతుకోబారాయ్ గూడ అధికారిపురుషుడుగా భక్తి, జ్ఞాన, వైరాగ్యములను లోకమునకు బోధించి, ధర్మమును పరిరక్షించుట కొఱకు యవతరించెనని యెఱుంగవలయును.

మహాత్ములు కొందరు ఆగర్భశ్రీమంతులుగా ఆవిర్భవిస్తారు. కొందరు మధ్య తరగతి కుటుంబములో జన్మిస్తారు. మరికొందరు నిరుపేద కుటుంబములో నవతరించి కఠిన దారిద్ర్యావస్థను అనుభవిస్తారు. స్త్రీ శూద్ర, వైశ్యాది వర్ణములలో ప్రకటమగుదురు. కారణమేమనగా? వారి జన్మముచే లోకమునకొక ఉపదేశము నందజేయుటయే. "ఎట్టి పరిస్థితిలోనైననూ భగవద్భక్తి పరమార్థ సాధన చేయవచ్చును" అని తెలియ జేయుటయే వారి ఉపదేశము. జన్మరహస్యము. సంపన్న స్థితి యందు గాని, విపన్న స్థితి యందుగాని పరమార్థ సాధన చేయ వచ్చును అని మహాత్ములు లోకమునకు ఉపదేశిస్తున్నారు. కనక కాంతా సంపన్న అవస్థలో గూడ పరమార్థ సాధన ఎలా చేయాలో శ్రీ ఏకనాధ మహారాజు తెలియపరచెను. భ్రష్ట సన్యాసి సంతానము – అని వెలివేయబడిన దుర్భర పరిస్థితుల్లో గూడ పరమార్థమును సాధించ వచ్చునని శ్రీ జ్ఞానేశ్వర్ మహా రాజుగారు లోకమునకు తెలియజేసిరి. కటిక దారిద్ర్య విపన్నావస్థలో గూడ భగవంతుణ్ణి చేరవచ్చునని శ్రీ భక్త తుకారాం మహారాజుగారు చాటి చెప్పిరి. కావున పరబ్రహ్మా భిన్న ఆత్మ తత్త్వము నెఱింగి మోక్షము నొందుటకు జాతి నీతి కుల గోత్ర వర్ణాశ్రమ లింగ వయోఽవస్థా పరిస్థితులు – అర్హతలు కావు. మరేమనగా! అనన్య (అవ్యభిచారి) భక్తి, సాధన చతుష్టయసంపత్తి. మోక్షము సకల జీవుల యొక్క స్వరూపములోనున్నందున సర్వులు పరమ గతికి అధికారులే యను విషయమును విశ్వ గురువులు వాసుదేవులే సెలవిచ్చిరి.

**శ్లో॥ మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాంగతిమ్ ॥**

(గీత 9-32)

**అర్థము :-** హేపార్థ! (అర్జునా!) ఈ మాట నిశ్చితము. ఏమనగా! నన్ను ఆశ్రయించిన – శరణు బొందిన వారెవరైనా సరే అనగా జాతి

దోషముచే దూషితులైన అంత్యజులు గాని, పశు పక్ష్యాదులుగాని, స్త్రీలుగాని, కృష్యాదులందు సంలగ్న వైశ్యులు గాని మరియు జన్మతః అధ్యయనాద్యభావముగల పరమగతికి అయోగ్యులగు శూద్రులు గాని, అందరు గూడ పరమగతిని పొందెదరు.

పై భగవద్వచనములు ముమ్మాటికి సత్యములే యని చాటి చెప్పుటకే కాబోలు శ్రీ తుకారాం మహారాజుగారు శూద్రకులమున యవతరించి, వైశ్యవృత్తిని చేపట్టి కులదేవత యగు శ్రీ విఠలుని ఆరాధ్య (ఉపాస్య) దైవముగా యెన్నుకొని ఘోర దరిద్రమును అనుభవిస్తూ, "అన్నమో రామచంద్రా" అంటూ ఆకలిచే అలమటిస్తూ భార్య పిల్లలు మరణించినప్పటికిని, పరమార్థ సాధనము వదలకుండా పరమాత్మస్థానమును (సదేహ వైకుంఠమును) చేరుకొనెను.

శ్రీ తుకారాం మహారాజుగారి చరిత్రను యెందరో వ్రాసినప్పటికిని, మనకు అతని యొక్క స్వకీయ అభంగ వాణియే ప్రమాణము.

అభంగము :-

యాతి శూద్ర వైశ్య కేలా వేవసావ ।
ఆధీఁ తో హా దేవ కుళపూజ్య॥1॥

నయే బోలోఁ పరీ పాళిలేఁ వచన
కేళియాచా ప్రశ్న తుప్హీ సంతీ॥2॥

సంవసారేఁ ఝాలోఁ అతిదుఃఖే దుఃఖే ।
మాయబాపేఁ సేఖీఁ క్రమిలియా॥3॥

దుష్కాళేఁ ఆటిలేఁ ద్రవ్య నేలా మాన ।
స్త్రీ ఏకీ అన్న అన్న కరితాఁ మేలీ ॥4॥

లజ్జా వాటే జీవా త్రాసలోఁ యా దుఃఖేఁ ।
వేవసాయ దేఖేఁ తుటీ యేతా ॥5॥

దేవాచేఁ దేఉళ హెూతేఁ జేఁ భంగలేఁ ।
చిత్తాసీ తేఁ ఆలేఁ కరావేఁసే ॥6॥

ఆరంభీ కీర్తన కర ఏకాదశీ ।
నవ్హే అభ్యాసీ చిత్త ఆధీ॥ 7॥

కాంహీఁ పాఠ కేలీ, సంతాంచీ ఉత్తరేఁ ।
విశ్వాస ఆదరేఁ కరోనియాం ॥8॥

గాతీ పుఢేఁ త్యాచేఁ ధరావే ధ్రుపద ।
భావే చిత్తశుద్ధ కరోనియాం॥ 9॥

సంతాంచేఁ సేవిలేఁ తీర్థ పాయవణీ ।
లాజ నాహీఁ మనీఁ యేఊ దిలీ॥10॥

ఠాకలా తో కాంహీం కేలా పరఉపకార।
కేలేఁ హేఁ శరీర కష్టవూనీ॥ 11॥

వచనేఁ మానిలీఁ నా హీఁ సుహృదాంచీఁ ।
సమూళ ప్రపంచీ వీట ఆలా॥12॥

సత్య అసత్యాసీ మన కేలేఁ గ్వాహీ ।
మానియేలేఁ నాహీఁ బహుమతాం ॥13॥

మానియేలా స్వప్నీఁ గురూచా ఉపదేశ ।
ధరిలా విశ్వాస దృఢ నామీఁ ॥14॥

యావరీ యా ఝాలీ కవిత్వాచీ స్ఫూర్తీ ।
పాయ ధరిలేఁ చిత్తీఁ విఠోబాచే॥15॥

నిషేధాచా కాంహీఁ పడిలా అఘాత ।
తేణే మధ్యే చిత్త దుఃఖవలేఁ॥16॥

బుడవిల్యా వహ్యా బైసలో ధరణేఁ ।
కేలేఁ నారాయణేఁ సమాధాన॥17॥

విస్తారీ సాంగతాం బహుత ప్రకార ।
హోఈల ఉశీర ఆతాం పురే ॥18॥

ఆతాం ఆహేతైసా దిసతో విచార ।
పుఢీల ప్రకార దేవ జాణే॥ 19॥

భక్తా నారాయణ నుపేక్షీ సర్వథా ।
కృపావంత ఐసా కళోఁ ఆలేఁ ॥20॥

తుకా హ్మణే మాఝేఁ సర్వ భాండవల ।
బోలవిలే బోల పాండురంగేఁ ॥21॥ (765)

ప్రతిపదార్థము :- (నాయొక్క) యాతి = జాతి; శూద్ర = శూద్ర జాతి (ఉన్నది); వేవసావ = వ్యవసాయము (జీవికా వృత్తి); వైశ్య = వైశ్యవృత్తిని కేలా = చేసితిని (స్వీకరించితిని) ; ఆధీ = పూర్వము నుండియు (మాయొక్క); కుళపూజ్య = కులమునకు ఉపాస్యము ; తో = ఆ ; హా = ఈ ; దేవ = విఠలుడే (ఉపాస్య దేవతగా ఉండెను. ఉన్నాడు) 1.(నా చరిత్రను ఈ జగత్తులో) బోలోఁ నయే = చెప్పుటకు నాకు ఇష్టము లేదు ; పరీ = అయినా గాని ; సంతీ = సంతు మహాత్ములయిన ; తుమ్హీ = మీరు ; ప్రశ్న కేలియాచా = ప్రశ్నించినందున ; (మీ యొక్క) వచన = వచనములను ; పాళిలేఁ = పాలించి (గౌరవించి - చెప్పుచున్నాను) 2.( నేను ఈ) సంవసారే= సంసారములో; అతిదుఃఖే = అనేక దుఃఖములచే (కష్టములచే) ; దుఃఖీ

= దుఃఖితుడను; ఝూలో ం = అయితిని ; సేఖీ = చివరికి ; (ఈ దుర్భరమైన సాంసారిక కష్టములలోనే నా యొక్క) మాయ బాపేం = తల్లిదండ్రులు; క్రమిలియా = నిష్క్రమించిరి. 3. (తదనంతరము) దుష్కాళేం = కరువు; ఆటిలే = ప్రాప్తించినది; ద్రవ్య = మా వద్ద ఉన్న కొద్దిపాటి ద్రవ్యము ఖర్చయిపోయినది. (దరిద్రముచే మా యొక్క) మాన = గౌరవము; నేలా = లేకుండా పోయింది ; ఎకీ స్త్రీ = ఒక స్త్రీ (పెద్ద భార్య) ; అన్న అన్న కరితా= అన్నము అన్నము అంటూ ఆకలితో ; మేలీ = మరణించినది. 4. యా దుఃఖే = ఈ దుఃఖముచే; త్రాసలో = చాలా బాధ పడ్డాను, జీవా = (నా) మనస్సునకు ; లజ్జా = సిగ్గు; వాటే = అనిపించినది, వేవసాయ = వ్యాపారము (దినదినము); తుటీ = దివాలాకు ; యేతా = వచ్చుట ; దేఖీ = కనుపించుచున్నది. 5. దేవాచే = మాకులదైవము విఠలుని యొక్క ; దేఊళ= మందిరము ; జే = ఏదైతే; హెూతే = ఉండెనో (అది) ; భంగలేం= జీర్ణమైపోయినది , తే= ఆ దేవాలయ జీర్ణోద్ధరణమును ; కరావేసే = చేయాలని (నా); చిత్తాసీ = చిత్తములోకి (సంకల్పము) ;ఆలే = వచ్చినది.(అలాగే దేవాలయ జీర్ణోద్ధరణము చేసితిని) 5. (ఆ దేవాలయంలో ప్రతి) ఏకాదశీ = ఏకాదశి రోజున, కీర్తన = హరి నామ సంకీర్తన; ఆరంభీకరీ= ప్రారంభించితిని; ఆధీ = ప్రప్రథమమున ; అభ్యాసీ= అభ్యాసమునందు (పరమార్థ సాధనయందు) ; చిత్త = శ్రద్ధ (అధికముగా); నవ్తే = లేకుండెను. 7. (కాని) ఉత్తరే = తరువాత ; సంతాంచీ = సంతు మహాత్ములయొక్క ; కాంహీ = కొన్ని (అభంగములు, ఓవీలను) విశ్వాస = శ్రద్ధచేత ; ఆదరేకరూనియాం = ఆదరపూర్వకముగా; పాఠకేలీం = కంఠస్థము చేసితిని. 8. త్యాచే = సంతు మహాత్ముల,పుడేం = యెదుట; వారు యే అభంగములను); గాతీ = పాడేవారో; (ఆ అభంగముల) ధ్రువపద= దర్పు (వంత); ధరావే = పట్టేవాడిని (పాడే వాడిని). భావే = భావ

పూర్వకముగా; చిత్త శుద్ధి కరోనియాం = చిత్తశుద్ధి పూర్వకముగా (అభంగములు పాడే వాడిని). 9. సంతాంచే = సత్పురుషులయొక్క పాయవణే = కాళ్ళు కడిగిన ; తీర్థ = చరణ తీర్థమును సేవిలే = సేవించితిని; (చరణతీర్థమును సేవిస్తున్నప్పుడు) మనీఁ= మనస్సులో; లాజ = సిగ్గును లేక అభిమానమును; యేఊదిలీ నాహీఁ = రానివ్వలేదు. 10. ఠాకలా తో కాంహీఁ = (ఈ శరీరముతో) వలసినంత ; పర ఉపకార = పరోపకారము; కేలా= చేసితిని ;హే శరీర = ఈ శరీరమును ; కష్టవూనీ = కష్టపెట్టి ; (పరోపకారము) కేలేఁ చేసితిని. 11. సుహృదాంచీ = ఆప్త మిత్రుల, బంధువుల యొక్క; వచనేఁ = వచనములను ; మానిలీ నాహీఁ = లెక్కపెట్టలేదు. సమూళ ప్రపంచ = కారణ సహిత ప్రపంచము పట్ల (నాకు); వీట = వైరాగ్యము ; ఆలా = వచ్చినది. 12. సత్య అసత్యాసీ = సత్యము, అసత్యము మరియు కర్తవ్య, అకర్తవ్యముల విషయములో ; మన = మనస్సును, గ్వాహీ = సాక్షిగ; కేలేఁ = చేసితిని; బహుమతాం = అనేక మంది మతములను (అభిప్రాయములను) ; మానియేలేఁ నాహీఁ= స్వీకరించ లేదు. 13. స్వప్నీ = స్వప్నమునందు ; గురూచా ఉపదేశ = శ్రీగురుదేవులు (బాబాజీ స్వామి) ఇచ్చిన "రామకృష్ణ హరీ" అను నామోపదేశమును ; మానియేలా = శిరసా వహించితిని ; నామీ = నామముచే తెలియబడువాడు శ్రీ విఠలుని యందు; దృఢ= దృఢమైన, విశ్వాస = శ్రద్ధను, ధరిలా = ధరించితిని. (అథవా నామమునందే దృఢ విశ్వాసమునుంచితిని)14. యావరీ= అటుపై ; యా = ఈ, కవిత్వాచీ = అభంగరచనారూప కవిత్వముపై; స్ఫూర్తీ = ప్రేరణ; ఝూలీ = కలిగినది, చిత్తీ = చిత్తమునందు; విఠోబాచీ = శ్రీ విఠలుని యొక్క, పాయ = శ్రీ చరణములను ; ధరిలే ఁ= ధరించితిని. 15. (శూద్రు)లు కవిత్వము (వ్రాయగూడదను) నిషేధాంచా = నిషేధములయొక్క; కాంహీ = కొన్ని, ఆఘాత = ప్రతి బంధకములు; పడిలా=

ఏర్పడినవి. తేణే = వాటిచే ; మధ్యే = మధ్యలో, చిత్త = మనస్సు; దుఃఖవలేc = చాలా దుఃఖించెను. 16. (నేను రచించిన) వహ్యా = అభంగ గ్రంథములను, (రామేశ్వర భట్టు అనువాదు) , బుడవిల్యా = ఇంద్రాయణినదిలో ముంచివేసెను; (దానిచే నేను అత్యంత దుఃఖితుడనై అక్కడనే) ధరణే = ఉపవాస దీక్షను వహించి; బైసలో= కూర్చుంటిని; (తరువాత) నారాయణేc = శ్రీవిఠలుడు, (నదిలో మునిగిపోయిన గ్రంథములను తిరిగి నా చేతికిచ్చి) సమాధాన = నన్ను సమాధానము ; కేలే c= చేసెను. 17. (ఓ సత్పురుషులారా! నా చరిత్రను) విస్తారీ = విస్తారముగా ; బహుత్ ప్రకార = అనేక ప్రకారముల (సంపూర్ణముగా) ; సాంగతాం = చెప్పినచో, ఉశీర = ఆలస్యము, హెూఈల = కాగలదు; (కావున) ఆతాం = ఇప్పుడు (ఇంతటితో) ; పురే = చాలును. 18. ఆతాం = ఈ వర్తమాన పరిస్థితుల్లో; దిసతో = ఎలా కనబడుచుంటినో, తైసా ఆహే = అలా ఉన్నాను ; పుఢీల = భవిష్యత్కాలములో; ప్రకార = ప్రకారము, విచార = విచారము ఎలా ఉండునో, దేవ = శ్రీ విఠలుడే, జాణే = యెఱుcగును. 19. సర్వథా = అన్ని ప్రకారముల చేతను (ఏ ప్రకారముగా గూడ); భక్తా = భక్తులను, కృపావంత నారాయణ = దయాళు వగు శ్రీమన్నారాయణుడు ; నుపేక్షీ = ఉపేక్ష చేయదు, ఐసా = ఈ విధముగా (నాకు), కళోc ఆలేc = తెలియ వచ్చినది. 20. తుకామ్హణే = శ్రీ తుకారాం మహారాజు గారంటున్నారు, మాఝే = నాయొక్క సర్వ భాండ వల = సర్వస్వము (పెన్నిధి), పాండురంగే = పాండురంగడే; (అతడు నాచే ఏవిధముగా) బోల = పలుకు; బోలవిలే = పలికించెనో (అలాగే మీకు చెప్పితిని.) 21.

**తాత్పర్యము :–** శ్రీ తుకారాం మహారాజుగారు తన జీవితచరిత్రము ఈ ప్రకారముగా తెలుపుచున్నాడు. నేను శూద్ర (క్షుద్ర) జాతికి చెందిన

వాడను. కాని జీవన నిర్వహణ కోసము వైశ్యవృత్తిని (వ్యాపారమును) స్వీకరించితిని. మా పూర్వీకులనుండి ఇప్పటి వరకు మా కులదైవము (ఉపాస్య దేవత) శ్రీ క్షేత్రము పండరీ నివాసుడు శ్రీవిఠలుడు ఉన్నాడు. 1. నా యీ స్థితిని (చరిత్ర) జగత్తునకు ఈ విధముగా తెలియ జేయాలని నాకు ఇచ్ఛలేదు. కాని సంతుమహాత్ములగు మీరు అడిగారు. గావున మీ ఆజ్ఞానుకారి నగు నేను మీ ఆజ్ఞను శిరసా వహించి చెప్పుచున్నాను. 2. నేను వ్యాపారము చేస్తూ ఉన్నాను. సంసార రూపబండి చక్కగా నడుస్తూ ఉన్నది. కాని ఇంతలో సంసారములో అనేక దుర్భరములగు కష్టముల నెదుర్కొనవలసి వచ్చినది. ఈ కష్టముల యందే చివరికి నా తల్లిదండ్రులు పరమ పదవిని బొందిరి. 3. తదనంతరము దుర్భిక్షము (కరవు) ఏర్పడినది. దగ్గర ఉన్న స్వల్పమగు ధనము కాస్త ఖర్చయి పోయినది. దారిద్ర్యావస్థ ఏర్పడినందున లోకంలో మాకు గౌరవము లేకుండాపోయింది. యెవరు గూడా మమ్ములను లెక్క (గణన) జేయకుండిరి. ఒక భార్య అయితే "అన్నమో రామచంద్రా" అంటూ ఆకలితో అలమటిస్తూ అన్నము, అన్నము అంటూ అసువులు విడిచింది (చనిపోయినది). 4. ఆమెకు పిడికెడు అన్నమైనా పెట్టలేని నేను అసమర్థుడనని తలంచి సిగ్గుతో, ఆ దుఃఖమును భరించలేక జర్జరమయి పోయితిని. వ్యాపారము దినదినము దివాలా దీస్తున్నది. కటిక దరిద్రుడనయ్యాను. 5. మాకులదైవమగు శ్రీ విఠలుని మందిరము (మాగృహసమీపములో నున్నటువంటిది) శిథిలమై పోయినది. దాని జీర్ణోద్ధరణ జేయాలని స్ఫూర్తి జనించినది. మరియు చాలా ప్రయత్నముతో జీర్ణోద్ధారము గూడా చేసితిని. 6. ఆ దేవాలయములో ప్రతి ఏకాదశి రోజున హరినామ సంకీర్తన జేయుట ప్రారంభించితిని. ప్రారంభములో అభ్యాసము వైపు (పరమార్థ సాధన వైపు) మనస్సు మొగ్గు జూపెడిది గాదు. 7. కాని కాలక్రమేణ చాలా శ్రద్ధతో, పూజ్యబుద్ధిచేత శ్రీ జ్ఞానదేవునియొక్క, నామదేవుని

యొక్క మరియు శ్రీ ఏకనాథ మహారాజుయొక్క కొన్ని ఓవీలు (పద్యములు), అభంగములను కంఠస్థము చేసి పాడుకునే వాడిని. 8. ఎవరైనా వారకరీ సంతులు భజన కీర్తనల యందు అభంగములను పాడుతుంటే, వారి వెనుక అభంగముల యొక్క దర్వును చేకొని అత్యధిక ప్రేమచే యభిమాన రహితుడనై వంత పాడే వాడిని. 9. సత్పురుషుల యొక్క చరణ తీర్థమును మనస్సు నందు సిగ్గు, అభిమానమును బొందక శ్రద్ధా భక్తులతో సేవించెడి వాడిని. 10. శరీరమునకు కష్టము గలిగినప్పటికిని సాధ్యమైనంత వరకు పరోపకారము చేసితిని. 11. నాయొక్క ఆప్తులు, ఇష్టులు నన్ను "భగవంతుని భజన పిచ్చిలో పడవద్దని, ఏదైనా ఉద్యోగము చేయుమని" ఎల్లప్పుడు చెప్తూ ఉండేవారు. నాకు ప్రపంచము పట్ల పూర్తిగా విరక్తి గలిగినందున వారి మాటలను పెడచెవిన పెట్టితిని. 12. సత్యాసత్యములు, కర్తవ్యాకర్తవ్యముల విషయములో నామనస్సును సాక్షిగా నుంచితిని. అనేకుల మతమును (అభిప్రాయములను) నేను స్వీకరించలేదు. 13. శ్రీగురుదేవులు బాబాజీస్వామి నాకు స్వప్నములో ఉపదేశించిన "రామకృష్ణహరి" అను మహా మంత్రమునందు దృఢ విశ్వాసమును పెట్టి ప్రమాణముగా స్వీకరించితిని. 14. శ్రీనామదేవులు స్వప్నములో ఆజ్ఞాపించిన పిమ్మట నాలో కావ్యరచన చేయాలనే స్ఫూర్తి కలిగింది. ఆ నిమిత్తముచే శ్రీ విఠలుని యొక్క పాదములను దృఢముగా చిత్తమందు ధరించితిని. 15. ఇంతలో "శూద్రులు కావ్య రచన చేయ గూడదు" అను నిషేధము ప్రతిబంధకమైనది. దానిచే నేను చాలా దుఃఖించితిని. 16. రామేశ్వర భట్టు అను నతడు నేను రచించిన అభంగ గ్రంథములను ఇంద్రాయణి నదిలో పడవేసెను. దానిచే నా చిత్తము అత్యంత ఖిన్నమయ్యెను. నేను అక్కడే ఇంద్రాయణి నదీ ఒడ్డున పదమూడు రోజులు నిరాహారదీక్షను బూని శ్రీపాండురంగని ప్రార్థిస్తూ కూర్చున్నాను. పరమ దయాళువైన పాండురంగడు నదిలో మునిగి పోయిన

గ్రంథములను తిరిగి నాచేతికిచ్చి నన్ను అనుగ్రహించెను. 17. ఓ సత్పురుషులారా! నా జీవితములో జరిగిన ఘటనలను మీకు సవిస్తరముగా చెప్తూ కూర్చున్నట్లయితే చాలా ఆలస్యము (సమయము) కాగలదు. కావున ఇంతవరకు చెప్పింది చాలు. 18. ఇప్పుడు వర్తమాన పరిస్థితిలో ఎలా కనబడుచుంటినో, అలా ఉన్నాను. భవిష్యత్కాలములో ఏప్రకారముగా, ఏవిచారముతో ఉంటానో, అది ఆ విఠలుడే యెఱుగును. 19. శ్రీమన్నారాయణుడు తన భక్తులను ఎప్పుడు గూడ ఉపేక్షించడు. అతడు చాలా కృపాళువున్నాడు. ఇది మాత్రము నా ఆయుష్షులో అనేక ఘటనలచే నాకు అనుభవమునకు వచ్చినది. 20. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - శ్రీపాండురంగడే నా సర్వస్వము - పెన్నిధి. అతడు నన్ను ఎలా పలికించాడో, అలాగే చెప్పాను, చెప్పుచున్నాను. 21.

అభంగము :-

బాప మేలా న కళతాం । నవ్హీ సంసారాచీ చింతా ॥1॥
విఠో తుఝేం మాఝేం రాజ్య । నా హీ దుసర్యాచేం కాజ ॥2॥
బా ఇల మేలీ ముక్త జాలీ । దేవేం మాయా సోడవిలీ ॥3॥
పోర మేలే బరేం ఝూలేం । దేవేం మాయే విరహిత కేలేం ॥4॥
మాతా మేలీ మజ దేఖతాం । తుకామ్హణే హరలీ చింతా ॥5॥

(416)

ప్ర.ప :- నకళతాం = నాకు తెలియకుండానే (నా యొక్క శైశవావస్థలోనే) ; బాప = తండ్రి; మేలా = దివంగతుడాయెను ; సంసారాచీ = సంసారము యొక్క; చింతా = చింత, (నాకు) నవ్హీ = లేకుండెను. 1. విఠో! = హే విఠలా! తుఝే = నీయొక్క; మాఝే = నాయొక్క; రాజ్య = రాజ్యమే (ఉన్నది) ; దుసర్యాచే ం= ఇతరుని (అన్యుని) యొక్క, కాజ

నాహీం = పనియే లేదు. 2. బా ఇల = నా(పెద్ద)భార్య; మేలీ = మరణించినది; (ఆమె) ముక్త = ముక్తురాలు, జాలీ = అయెను ; (దీనితో) దేవే ం = భగవంతుడు; మాయా = మాయనుండి (నన్ను), సోడివిలీ = విడిపించెను. 3. పోర = పోరడు (పిల్లవాడు) ; మేలే = చనిపోయినాడు ; బరేం = మంచిగా, ఝాలేం జరిగినది. (అయినది), దేవేం = విఠలుడు, (నన్ను) మాయే విరహిత = మాయ నుండి నన్ను ముక్తున్ని ; కేలేం = చేసినాడు. 4. తుకాహ్మణే = శ్రీ తుకారాం మహారాజుగారు అంటున్నారు, మజ = నా; దేఖతాం = యెఱుకలోనే ; మాతా = తల్లి, మేలీ = చనిపోయినది; చింతా= సంసారచింత;హరలీ = హరింపబడినది. (దూరమయినది). 5.

తా॥ నాకు యేమియును తెలియని అజ్ఞానావస్థలోనే (శైశవావస్థలోనే) మా తండ్రి దివంగతుడైనాడు. 1. అయితే నేమి? హే విఠలా! నీ యొక్క మరియు నాయొక్క రాజ్యమే ఉన్నది. అన్యులతో పని లేదు. కావున నీ భక్తి జేయుటకు నాకు సంపూర్ణ స్వాతంత్ర్యము లభించినది. 2. భార్య చనిపోయినది. పావము! ఆమె సంసారదుఃఖములనుండి ఒక్కసారిగానే ముక్తురాలయినది. దేవుడు ఈ విధముగా స్త్రీ విషయక మాయనుండి నన్ను సహజముగానే విడిపించెను. 3. కొడుకు మరణించాడు. ఇది కూడ చాలా మేలు జరిగినది. భగవంతుడు నన్ను అనాయాసముగా మాయా మోహము నుండి ముక్తుణ్ణి చేసినాడు. 4. శ్రీ తుకారాం మహారాజు గారంటున్నారు నా యెఱుకలోనే మా తల్లి స్వర్గస్థురాలాయెను. అందు వలన భగవంతుడు సంసారచింతను పూర్తిగా దూరము చేసెను. సారాంశమేమనగా! ఒకదాని తరువాత మరొకటిగా ఎన్ని ఆపత్తులైనా (హిమాలయముల వలె దాటుటకు శక్యము గానటువంటివి) ఎదురైనప్పటికిని, హరిభజన దృష్టిచే ఇష్టాపత్తిగా భావించి, శోక సంతప్తులు కాకుండా పరమార్థ సాధన కొనసాగించాలి.

అభంగము :-

బరే ఝూలేం దేవా నిఘాలే దివాళేం ।
బరీ యా దుష్కాళేం పీడా కేలీ॥ 1॥

అనుతాపేం తుఝ్యేం రాహిలేం చింతన ।
ఝూలా హా వమన సంవసార॥ 2

బరేం ఝూలేం దేవా బా ఈల కర్కశా ।
బరీ హే దుర్దశా జనామధ్యేం ॥3॥

బరే ఝూలే జగీం పావలోం అపమాన ।
బరేం గేలేం ధన ఢోరేం గురేం ॥4॥

బరేం ఝూలేం నాహీం ధరలీ లోకలాజ ।
బరా ఆలో తుజ శరణ దేవా ॥5॥

బరేం ఝూలేం తుఝేం కేలేం దేవా ఈల ।
లేకరేం బా ఈల ఉపేక్షిలీం ॥6॥

తుకామ్హణే బరేం వ్రత ఏకాదశీ ।
కేలేం ఉపవాసీం జాగరణ॥ 7॥ (767)

ప్ర.ప :- దేవా! = ఓ భగవంతుడా!; దివాళే =నష్టము; నిఘాలేం = వాటిల్లినది ; బరేం = మంచిగా; ఝూలేం = అయినది; దుష్కాళే = దుర్భిక్ష (కరువు వచ్చి) ; పీడా కేలీ = చాలగా పీడించినది; బరీ యా = చాలా బాగయింది. 1. (ఎందుకనగా!) అనుతాపేం = సంసారము పట్ల పశ్చాత్తాపముచే విరక్తి గలిగి; తుఝ్యే = నీయొక్క, చింతన = స్మరణ; రాహిలేం= ఉన్నది. హా = ఈ, సంవసార = సంసారము; వమన= వాంతి

జేయబడిన అన్నము వలె అప్రియము, ఝాలా = అయినది. 2. బాఈల = (రెండవ) భార్య ; కర్కశా = గయ్యాళి (లభించినది) ; దేవా! = ఓ విఠలా!; బరే ఝాలే = చాలా మేలు జరిగినది, జనామధ్యే = లోకంలో; దుర్దశా = (నాకు) దుర్దశ (దురవస్థ ఏర్పడినది) ; హే బరీ = ఇది బాగుంది. 3. జగీ = జగత్తులో ; అపమాన= అవమానమును ; పావలోఁ = పొందితిని, బరే ఝాలేఁ = చాలా మంచిదే, ధన = ధనము; (ద్రవ్యము; ఢోరే, గురేఁ= పశు పక్ష్యాది (సంపద), గేలే = నష్టమై పోయినది, బరే ఁ = మేలు జరిగినది. 4. దేవా! = ఓ భగవంతుడా! లోకలాజ = లోకలజ్జ (లోకాభిమానము) ; ధరిలీ నాహీఁ= గ్రహించ లేదు బరేఁ ఝాలేఁ = చాలా మంచిదే, తుజ = నీ, శరణ = శరణు; ఆలోఁ = వచ్చితిని, బరా = సరే (మంచిదైనది). 5. బాఈల = భార్యను, లేకరే ఁ = పిల్లలను; ఉపేక్షిలీ = ఉపేక్షించి; తుఝే = నీకు, దేవా ఈల = సమర్పణము, కేలే ఁ= చేసితిని; బరేఁఝాలే ఁ= (ఇదియును) చాలా మంచిదే. 6. తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు, (పై సర్వకారణములవలన నేను), ఏకాదశీవ్రత = ఏకాదశి వ్రతమును స్వీకరించితిని, ఉపవాసీఁ= ఉపవాసముండి; జాగరణ = హరి జాగరణము, కేలేఁ= చేసితిని, బరే ఁ = చాలా మంచిదాయెను. 7.

**తా॥** హే విఠలా! నా వ్యాపారమునకు నష్టము వాటిల్లినది. (దివాలా తీసితిని). దుర్భిక్ష (కరువు)తో ఎంతో బాధపడ్డాను. నాకు మేలే జరిగినది. 1. ఎందుకనగా! సంసారము పట్ల పశ్చాత్తాపము గలిగి నీ చింతన (భజన) గడిచినది. వాంతి జేయబడిన అన్నము వలె ఈ సంసారము అప్రియము అయినది. విరక్తి గలిగినదని భావము. 2. రెండవ భార్య గయ్యాళి లభించినది. ఇదియును మంచిదే. లోకంలో నాకు యెవరును గౌరవించడము లేదు ఘోరమైన దురవస్థ ప్రాప్తించినది. ఇదియును నా మంచికే జరిగినది. 3.

జగత్తులో అడుగడుగున నాకు అవమానమే జరుగుచున్నది. ద్రవ్యము, పశువులు, పక్షులు మొదలగు నా సంపదయంతయు నష్టమై పోయినది. చాలా సంతోషము. 4. లోకలజ్జను స్వీకరించలేదు. అనగా లోకులు ఎన్నివిధముల నన్ను అవమానించినప్పటికిని దానిచే నేను ఉద్విగ్నమును, తాదాత్మ్యమును, బిడియమును పొందలేదు. నేను నీకు శరణు జొచ్చితిని. ఇది చాలా మంచిదయినది. 5. దేవా! భార్యాపిల్లలను ఉపేక్షించి, మనోవాక్కాయములచే సంపూర్ణముగా నీకు సమర్పించి మంచిపని చేసాను. 6. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు-పై సర్వ కారణముల వలన నేను ఏకాదశి వ్రతమును స్వీకరించితిని. మరియు ఉపవాసముండి హరిజాగరణము చేసితిని. ఇదియును నా మేలు కొఱకే జరిగినది. సారాంశమేమనగా! సంసారములో ఎటువంటి పరిస్థితి తటస్థించినను అది హరిభజనకు అనుకూలమే కాగలదు. ఎన్ని దుఃఖములు (కష్టములు) యెదురైనను వాటిచే క్షుబ్దుడు (విక్షిప్తుడు) గాకుండా, ఈశ్వర వరప్రసాదముగా భావించి, హరి చింతన జేయుటయే సర్వోత్కృష్టమైన సాధన అని తెలియవలెను.

ఈ ప్రకారముగా శ్రీతుకారామ స్వామి అత్యంత కష్టజీవనమును గడుపుతూ పరమార్థసాధన నిత్యనిరంతరముగా అనన్యమైన భక్తి శ్రద్ధలతో కొనసాగించి, తాను తత్త్వమస్యాది వాక్యముల తాత్పర్య విషయభూతమైన బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానమును బడసి యనుభూతమొనర్చుకొని శ్రీ విఠలుని కృపకు పాత్రుడయ్యెను. తాను ఈ మర్త్యలోకములో 52 సంవత్సరములు మాత్రమే జీవించి యుండెను. జీవితమంతయు తన యభంగవాణి ద్వారా లోకమునకు ధర్మమును, నీతిని, ఆచార విచారములను, భక్తి, జ్ఞాన, వైరాగ్యములను, సగుణ నిర్గుణ తత్త్వమును (యథార్థ స్వరూపమును) బోధించి

తన యవతార కార్యమును పూర్తిగావించుకొని శాలివాహన శకము 1573 లో విమానములో కూర్చొని సదేహముతో వైకుంఠమునకు వెళ్ళెను. ఇది ఈ కలియుగములో అత్యంత అద్భుతమైన ఘటన. దీనిని ఆధునిక బుద్ధి వాదులు విశ్వసించ వచ్చును లేక విశ్వసించక పోవచ్చును. కాని సప్రామాణికము, సయుక్తికమునూ అయియున్నదనుటలో సందేహము లేదు. నాస్తికుల బుద్ధికి యసంభవాభాస కలిగినప్పటికి అధ్యాత్మిక క్షేత్రములో ఉన్న ఆస్తికులకిది అతిశయోక్తి కానేరదు.

శ్రీ తుకారాం మహారాజుగారు సదేహముగా వైకుంఠము వెళ్ళినాడు అనుట సప్రామాణికము. ఈ విషయములో శాస్త్రప్రమాణములు అనేక ఉదంతములను తెలియపరచుచున్నవి. సశరీరముతో పరలోకమునకు వెళ్లుట అతిశయోక్తి కాదు, సుసాధ్యమే యని మనకు రామాయణాది శాస్త్రములు నుడువు చున్నవి.

కౌశికుని యొక్క సహోదరి సత్యవతి సశరీరముతో స్వర్గమునకు వెళ్ళినట్లు శ్రీద్వాల్మీకి రామాయణము చెప్పుచున్నది.

శ్లో॥ సశరీరా గతా స్వర్గం భర్తారమనువర్తినీ ।
కౌశికే పరమోదారా ప్రవృత్తా చ మహానదీ ॥

(రామాయణము - బాలకాండము. 34-8)

అర్థము :- శ్రీ విశ్వామిత్రుని జ్యేష్ఠ సహోదరి తన పతిని అనుసరిస్తూ (సత్యవతి) సశరీరముతో స్వర్గమునకు వెళ్ళి పోయినది. ఆమెయే "కౌశికీ" యను పేరుతో పరమ ఉదార మహానదిగా ప్రకటమై ఈ పృథివి తలమున ప్రవహించుచున్నది.

విశ్వామిత్రుని తపః ప్రభావముచే త్రిశంకువు అను రాజు

స్వర్గమునకు సశరీరముతో వెళ్ళినట్లు మరొక చోట రామాయణములో తెలియ వచ్చుచున్నది.

విశ్వామిత్రుడు త్రిశంకువుతో ఇలా అన్నాడు.

శ్లో॥ స్వార్జితం కించిదప్యస్తి మయా హి తపసః ఫలమ్ ।
రాజంస్త్వం తేజసా తస్య సశరీరో దివం వ్రజ ॥
(రామాయణము - బాలకాండము. 60-14, 15)

అర్థము :- హే రాజన్! ఒకవేళ నేను ఏమైన తపఃఫలమును పొందియున్నచో, దాని ప్రభావముచే నీవు సశరీరముతో స్వర్గమునకు వెళ్ళుము.

శ్లో॥ ఉక్త వాక్యే మునౌ తస్మిన్ సశరీరో నరేశ్వరః ।
దివం జగామ కాకుత్థ మునీనాం పశ్యతాం తదా ॥
(రామాయణము - బాలకాండము. 60- 15 , 16 )

అర్థము :- విశ్వామిత్ర మునీశ్వరులు ఈ విధముగా చెప్పుట తోడనే త్రిశంకువు అను రాజు మునులందరు చూస్తూ ఉండగా తన శరీరముతో సహా స్వర్గమునకు వెళ్ళి పోయెను.

మరొక చోట కిష్కింధకాండలో - సుగ్రీవుడు శ్రీరామచంద్రునితో ఒకానొక వనమును గూర్చి పరిచయము చేస్తూ-

శ్లో ॥ అత్ర సప్త జనా నామ మునయః సంశితవ్రతాః ।
సప్తైవాసన్నదః శీర్షా నియతం జలశాయినః ॥

శ్లో ॥ సప్తరాత్రే కృతాహారా వాయునాచలవాసినః ।
దివం వర్షశతైర్యాతాః సప్తభిః సకలేవరాః ॥
(రామాయణము - కిష్కింధకాండము. 13-18, 19)

**అర్థము :-** (ఈ వనంలో ఒకానొక విస్తృత ఆశ్రమముండెను. అందరి శ్రమను పోగొట్టెడిదిగా నుండెను. "ఆశ్రమం శ్రమనాశనమ్"). ఈ ఆశ్రమములో సప్త జనులను పేరుతో ఏడుగురు మునులు కఠోర వ్రత పాలనము చేయుచుండెడివారు. వారు తలక్రిందులుగా తపస్సు చేయుచుండెడి వారు నియమ పూర్వకముగా జలములో శయనించు చుండెడివారు.

వారు ఏడు దినములు మరియు ఏడు రాత్రులు కేవలము వాయు భక్షణము చేయుచు కాలమును వ్యతీతము చేయుచుండిరి. అట్లే ఒక స్థానములో నిశ్చలభావముతో ఉండేవారు. ఇలా ఏడువందల సంవత్సరములు తపస్సు చేసి, వారు సశరీరముతో స్వర్గమునకు వెళ్ళి పోయిరి.

ఉత్తరకాండములో - లక్ష్మణుడు సశరీరముతో అదృశ్యమై స్వర్గమునకు వెళ్ళినట్లు తెలియబడుచున్నది.

**శ్లో॥ అదృశ్యం సర్వ మనుజైః సశరీరం మహాబలమ్ ।**
**ప్రగృహ్య లక్ష్మణం శక్రస్త్రిదివం సంవివేశ హ ॥**
(రామాయణము - ఉత్తరకాండము. 106-17)

**అర్థము :-** (లక్ష్మణుడు యోగయుక్తుడై శ్వాసను బంధించి కూర్చొని యుండెను, మహాబలుడగు లక్ష్మణుడు శరీరముతో సహా మానవ మాత్రుల దృష్టినుండి అదృశ్యమాయెను. అప్పుడు దేవరాజగు యింద్రుడు లక్ష్మణుని తీసికొని స్వర్గమునకు వెళ్ళెను.

అట్లే స్వయముగా శ్రీరామచంద్రుడు గూడ సశరీరము తన తమ్ములతో సహా వైష్ణవతేజములో ప్రవేశించెనని - ఉత్తరకాండము.

**శ్లో॥ వివేశ వైష్ణవం తేజః సశరీరః సహానుజః ॥**
(రామాయణము - ఉత్తరకాండము. 110-12)

**అర్థము :-** శ్రీరామ చంద్రుడు తన తమ్ములతో సహా సశరీరముతో వైష్ణవ తేజములో ప్రవేశించెను.

మరియు మహాభారతములో - శ్రీయుధిష్ఠరులవారు సదేహము (దివ్య శరీరముతో) దేవతలతో సహా దివ్యలోకమునకేగినట్లు వినబడుచున్నది. (మహాభారతము - స్వర్గారోహణ పర్వము 3-41,42)

శ్రీ తుకారామస్వామి కీర్తన చేస్తూ చేస్తూ అదృశ్యమై సశరీరముతో వైకుంఠమునకు వెళ్ళుటకు శాస్త్రీయముగా ప్రమాణములు చూపించడమైనది. అట్లే శ్రీతుకారాం మహారాజు వలెనే మరికొందరి మహాత్ముల చరిత్రలను గూడ చూచెదము.

ముక్తా బాయి గూడ చూస్తూ చూస్తూ ఉండగానే గుప్తమైనట్లు తెలియ వచ్చుచున్నది.

భక్త కబీర్ - అంత్యసమయములో గులాబి పూల శయ్య రచించమని తన శిష్యులను ఆదేశించెను. శయ్య సుసజ్జితమైనది. దానిపై కబీర్ ఒక శాలువ కప్పుకొని పడుకున్నాడు. కొంత సమయమునకు శిష్యులు శాలువ తీసి చూసే సరికి భక్త కబీర్ అక్కడే అదృశ్యమయ్యెను. ఈ చరిత్ర హిందువులకు ముస్లింలకు అందరికి సువిదితమే.

సిక్కు సంప్రదాయ సంస్థాపకులు శ్రీ గురునానక్ జీవనయాత్ర 70 సంవత్సరములకు సమాప్తమైనది. వారి యొక్క అంత్య సంస్కారము హిందూ సంప్రదాయానుసారము చేయాలా? లేక, మహమ్మదీయ సంప్రదాయానుసారము చేయాలా? అను వివాదము జరుగుతూనే ఉండగా ఒకానొక శిష్యుడు మృత శరీరముపై నున్న వస్త్రమును తొలగించగా అక్కడ శరీరము అదృశ్యమైనది. అంత్య సంస్కార వివాదము సమాప్తమైనది.

కావున పై శాస్త్రీయప్రమాణములచేతను మరియు ఈ కలియుగములోనే జరిగిన మరికొందరి మహాత్ముల చరిత్రలచేతను శ్రీతుకారామస్వామి సశరీరముగా వైకుంఠమునకు వెళ్ళిన ఘటన సత్యమని ఋజువైనది.

అయినప్పటికిని ఈ సత్కథా ప్రసంగముపై యెవరికి విశ్వాసము కుదురుట లేదో వారు దయజేసి సహృదయముతో శ్రీతుకారాం మహారాజుగారి యొక్క స్వకీయ అభంగములపై సత్ శ్రద్ధను వహించి ఆదరభావముచే, శాంతచిత్తము గలిగి అధ్యనము చేసినచో వారికే భగవత్కృపచే తథ్యము దెలియగలదు.

అభంగము :-

శంఖ చక్ర గదా పద్మ । పైల ఆలా పురుషోత్తమ ॥1॥
నా భీ నా భీ భక్తరాయా ।వేగీ c పావలో c సఖయా ॥2॥
దురునీ యేతా దిసే దృష్టీ c । ధాకే c దోష పళతీ సృష్టీ ॥3॥
తుకా దేఖోని ఎకలా । వైకుంఠీహూనీ హరీ ఆలా ॥4॥

ప్ర.ప :- శంఖ చక్ర గదా పద్మ = శంఖము, చక్రము, గద మరియు పద్మమును (చతుర్భుజములయందు ధరించి) ; పురుషోత్తమ = పురుషోత్తముడైన (శ్రీమన్నారాయణుడు) ; పైల= కొంచెము ప్రక్కకు (అతి సమీపములో), ఆలా = వచ్చియున్నాడు. 1. (మరియు నాతో ఇలా అంటున్నాడు) భక్తరాయా! = ఓ ప్రియమైన భక్తరాయా!; సఖయా = ఓ నా సఖుడా (మిత్రమా!) ; నా భీ నా భీ = భయపడకుము! భయపడకుము! ; (నీ కోసము); వేగేc = వేగముగా, (నేను) పావలో c = యేతెంచితిని. 2. (ఆ శ్రీహరి) దురునీ = దూరము నుండి ; యేతా= వచ్చుచుండుట ;

దృష్టీ= దృష్టికి (నేత్రమునకు) ; దిసే = కనుపించుచున్నది. (అతని యొక్క) ధాకేఁ=భయముచే, దోష = పాపములు; సృష్టీ = దశ దిశలకు, పళతీ = పరుగిడుచున్నవి. 3. తుకా = శ్రీతుకారాం మహారాజ అంటున్నాడు; (నేను); ఎకలా = ఒంటరిగా ఉండుట; దేఖోని = చూపి; వైకుంఠీహూనీ = వైకుంఠమునుండి, హరి = శ్రీహరి ; ఆలా = వచ్చెను. 4.

**తా॥** శంఖము, చక్రము, గద, పద్మమును చతుర్భుజములయందు ధరించి శ్రీపురుషోత్తముడు అనతిదూరములో వచ్చి నిలబడినాడు. 1. మరియు నాతో ఇలా అన్నాడు. ఓ భక్త శిరోమణీ! ఓ నా ప్రియమైన మిత్రమా! నీవు భయపడకుము! భయపడకుము! నీ కోసము నేను అతిత్వరగా వచ్చేసినాను. 2. శ్రీహరి దూరము నుండి వచ్చుట నాదృష్టికి గోచరమయ్యెను. అతని భయముచే పాపములన్నియు దశదిశలకు పలాయనము చిత్తగించెను. 3. శ్రీతుకారాం మహారాజుగారు అంటున్నారు - నేను ఒంటరిగా ఉన్నది చూసి శ్రీమన్నారాయణుడు నన్ను ఉద్ధరించి వైకుంఠమునకు తీసికెళ్ళుటకు విచ్చేసెను. 4.

**అభంగము :-**

**ఆమ్హీ జాతోఁ తుమ్హీ కృపా అసోఁ ద్యావీఁ ।**
**సకళాం సాంగావీ వినంతీ మాఝీ ॥1॥**

**వాడ వేళ ఝాలా ఉభా పాండురంగ।**
**వైకుంఠా శ్రీరంగ బోలావితో॥2॥**

**అంతకాళీ విఠో ఆమ్హాసి పావలా ।**
**కుడీ సహిత ఝాలా గుప్త తుకా ॥3॥** (3621)

ప్ర.ప :- (ఓ జనులారా!) ఆమ్హీ = మేము (నేను); జాతో = (వైకుంఠమునకు) వెళ్ళుచున్నాను; తుమ్హీ = మీరందరి; కృపా = దయ,

(నాపై) అసో c ద్యావీ = ఉండనివ్వండి ; సకళాం = సర్వులకు; మాఝీ = నాయొక్క (ఇదే) వినంతీ = ప్రార్థన; సాంగావీ = తెలియజేయండి. 1. వాడ = చాలా; వేళ = సమయము; ఝాలా = అయింది; పాండురంగ = శ్రీ పండరీనాథుడు; ఉభా = నిలబడియున్నాడు. (నన్ను) శ్రీరంగ = శ్రీరంగడు; వైకుంఠా = వైకుంఠమునకు ; బోలావితో = (తీసికెళ్ళుటకు) పిలుచుచున్నాడు. 2. తుకా = శ్రీతుకారాం మహారాజుగారు అంటున్నారు; అంతకాళీ = (నా) అంత్యకాలములో, విఠో = శ్రీవిఠలుడు; ఆమ్హాసీ= మమ్ములను (నన్ను), పావలా = అనుగ్రహించెను. (మరియు నేను) కుడీసహిత = దేహసహితముగా ;గుప్త= గుప్తము (అదృశ్యము) ; ఝాలా= అయితిని. 3.

**తా॥** ఓ జనులారా! నేనిప్పుడు వైకుంఠమునకు వెళ్ళి పోవు చున్నాను మీరందరు నాపై కృప ఉంచండి. ఈ విషయము అందరితో చెప్పండి. 1. శ్రీపాండురంగడు వచ్చి చాలా సేపటినుండి నిలబడియున్నాడు. ఆ శ్రీరంగడు నన్ను వైకుంఠమునకు తీసికెళ్ళుటకు పిలుచు చున్నాడు. 2. శ్రీతుకారామ స్వామి అంటున్నాడు - నాయొక్క అంత్య సమయములో శ్రీవిఠలుడు నన్ను అనుగ్రహించినాడు. నేను సశరీరముతో గుప్తము (అదృశ్యము) అయితిని. 3.

సకల పురుషులు సర్వదుఃఖాత్యంతనివృత్తి, పరమానందావాప్తి రూప పరమపురుషార్థమనబడు మోక్షమునే గోరెదరు. మోక్షము అందరి యొక్క స్వరూపమే. అయినప్పటికి అందరిచేత యెందుకు అనుభూతమగుట లేదు? దీనికి ప్రతిబంధకము–ఆవరణ విక్షేప శక్తులు గల అనాది యనిర్వచనీయ భావరూప పదార్థమగు యజ్ఞానమే. "అనృతేన హి ప్రత్యూఢాః" (ఛాం.ఉ. 8-3-2) మిథ్యాభూతమగు అజ్ఞానముచేత స్వరూపము ఆచ్ఛాదింపబడినట్లు

ఉపనిషత్తు చెప్పుచున్నది. "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జన్తవః" (గీత. 5-15) జీవుల స్వరూప జ్ఞానము అజ్ఞానముచే నావరింపబడినందున జననమరణరూపసంసారములోబడి అఖండము సచ్చిదానందమునగు స్వరూపము నెఱుంగ లేక అవస్తువగు అనాత్మయందు (దేహాదులందు) వస్తుత్వ బుద్ధి (ఆత్మత్వ బుద్ధి)చే మోహితులగు చున్నారు. అని భగవద్వచనము. "నేను అజ్ఞానిని", "నాకు బ్రహ్మము తెలియదు" అను వ్యవహారమేది గలదో, అది అజ్ఞానముయొక్క అస్తిత్వమునందు అనుభవప్రమాణము. ఈ విధముగా శ్రుతి, స్మృతి, అనుభవములచే నే యజ్ఞానము సిద్ధించుచున్నదో నదియే మోక్షమునకు ప్రతిబంధకమగుచున్నది. కావున ఈ స్వరూపాజ్ఞానము నివర్తించిననే మోక్షము సిద్ధించును. అయితే అజ్ఞానమునకు నివర్తకమేమిటి? అంధకారము తొలగుటకు దానికి విరోధియైన ప్రకాశము యెట్లు ఆవశ్యకమో అట్లే అజ్ఞానము నివర్తించుటకు దానికి విరోధియైన స్వరూప జ్ఞానమే అత్యంతావశ్యకమై యున్నది.

**శ్లో॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।** (గీత 5-16)

**అర్థము :-** యెవరియొక్క అజ్ఞానము ఆత్మ జ్ఞానముచే నశించినదో – అని గీతాచార్యులు అజ్ఞాన నివర్తకము జ్ఞానమే యని నుడివిరి. "జ్ఞానా దేవతు కైవల్యమ్" "తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ" (శ్వే.ఉ. 3-8) ఆత్మ యాథాత్మ్య జ్ఞానము చేతనే మృత్యువును (సంసారము) దాటుదురు. మోక్ష ప్రాప్తికి వేరు మార్గము లేదు – అని ఉపనిషద్వాణి. కావున అజ్ఞానము నివర్తించి మోక్షము ప్రాప్తించ వలె నన్న బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానము నవశ్యముగా సంపాదించవలయును.

మరి ఈ స్వస్వరూపజ్ఞానము యెలా సంప్రాప్తించును? "తద్విజ్ఞానార్థం స గురుమేవాఽభిగచ్ఛేత్ (ముం.ఉ. 1-2-12)

"ఆచార్యవాన్పురుషో వేద" (చాం.ఉ 6-14-2) తద్విద్ధి ప్రణిపాతేన (గీత. 4-34)

**అర్థము** :- వివేకాది సాధన చతుష్టయ సంపన్నుడైన బ్రహ్మ జిజ్ఞాసువు దాని నెఱుంగుట కొఱకు శ్రోత్రియుడు మరియు బ్రహ్మనిష్ఠుడైన, అదే విధముగా పాపరహితుడు, నిష్కాముడు మరియు దయాళువు అయిన శ్రీగురుదేవులను శరణు బొందవలెను- అని ముండక శ్రుతి. ఎవరికి ఆచార్యుడు అనగా శ్రీగురుదేవుడు గలడో, అతడే పరమ తత్త్వమును తెలియగలడు - అని ఛాందోగ్యము. కావున బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానమును సంపాదించుటకు శ్రీగురుమూర్తి యొక్క ఆవశ్యకత అనివార్యము. "శాస్త్రజ్ఞోఽపి స్వాతంత్ర్యేణ బ్రహ్మజ్ఞానాన్వేషణం న కుర్యాత్" (ముం.ఉ. 1-2-12 శాంకరభాష్యము) శాస్త్ర జ్ఞాన సంపన్నుడైన పురుషుడు గూడ స్వతంత్రముగా గురునిరపేక్ష బ్రహ్మ జ్ఞానాన్వేషణము చేయగూడదని పూజ్య పాదులు శ్రీఆద్య శంకరాచార్యుల వారు సెలవిచ్చిరి. కావుననే గురు శిష్య సంప్రదాయప్రచయ గమనార్థము సర్వజ్ఞుడు, సాక్షాత్పరమాత్మ యొక్క అవతారము అయినప్పటికిని శ్రీకృష్ణుడు సాందీప మునిని గురువుగా స్వీకరించెను. శ్రీరామచంద్రుడు వసిష్ఠ మహర్షులను గురువుగా యెన్నుకున్నారు.

ఇక శ్రీభక్త తుకారాం గారి విషయానికొస్తే - వారి యొక్క గురువుగారెవరు? అను ప్రశ్న పడుతుంది. సంతు మహాత్ములు చాలా దుర్లభము. కాని అలభ్యులు కారు. చందనము చౌకధరగలది కాదు. అయినా లభించును. కస్తూరి సర్వత్ర సౌలభ్యము గాదు, కాని యెక్కడో ఒక చోట తప్పకుండా దొరుకుతుంది. రత్న, వజ్ర, వైడూర్యాదులు పేదవాడికి దుర్లభములు. అశక్యములు, కాని ధనవంతునికి సులభ్యములు. అట్లే యెవరు

ప్రచుర పుణ్య ధనము గలవారుంటారో, వారికి సత్సంగ లాభము గలుగును సత్సంగము దుర్లభము మరియు నమోఘము. కాని యెవరి భాగ్యశ్రీ ఉదయించునో వారికి సంతు మహాత్ముల సహవాసము దొరుకుతుంది. ఏ మహాత్ముని ఈశ్వరుడు ఆజ్ఞాపించునో, అతడు స్వయముగా విచ్చేసి శిష్యుని కృతార్థునిగ జేయును. సాధన చతుష్టయ సంపన్నుడు ప్రభూత పుణ్య సంచయము గలవాడును, "ప్రదీప్త శిరా జలరాశిమివ" ప్రచండ భాస్కర ప్రతాప సంతప్త శిరస్కుడు యేవిధముగా సరోవరాది శీతల జలరాశిని చేరి తాపమును నివర్తించు కొనవలెనను (తపన) ఆరాటము గల్గియుండునో అట్లు సంసారములోని త్రివిధ తాపములచే సంతప్తుడై తన్నివృత్తి కోసము (శీతల జలరాశివంటి) సద్గురు ప్రాప్తి యొక్క ఆరాటము గల అధికారి చెంతకు, ఈశ్వరునిచే నియుక్తుడగు (ప్రేరితుడగు) సద్గురువు స్వయముగా వెతుకుతూ విచ్చేయును. ఫలము పరిపక్వమగుట తోడనే పిలువకుండానే వచ్చి ఫలమును స్పృశించి మధురాతిమధురముగ జేయు చిలుకవలె, విరక్త జీవుడగు నధికారి చెంతకు దయాళువగు శ్రీగురుదేవుడు పరుగెత్తుకొనివచ్చి తత్త్వమస్యాది వాక్యోపదేశముచే ఆత్మరహస్యమును తెలిపి కృతార్థునిగ జేయును.

సత్పురుషులందరు సద్గురుసమానులే. స్త్రీలందరు తల్లితో సమానులే, అయినను స్తన్య పానముగావించి బిడ్డను తృప్తి పఱచు తల్లి ఒక్కతే. సత్పురుషులందరు సద్గురుతుల్యులే, అయినను స్వానుభవామృత పానము చేయించి, సంసారతాపరూప ఆకలితో వ్యాకులము జెందు ముముక్షు బిడ్డను తృప్తి పఱచు (మోక్షమునిచ్చు) సద్గురు -మాత ఒక్కరే. ఆ గురు - మాత (మా ఊలీ =తల్లి) ముముక్షు బిడ్డ యొక్క రోదనమును విని ఈశ్వర నియుక్తమై (ప్రేరితమై) పరుగెత్తుకొనివచ్చి అమృతపానము చేయించును.

గురు శిష్య సంబంధము జన్మ జన్మాంతరముల నుండి వచ్చునది. ఆ గురు మా ఊలీ నిశ్చిత సమయమునకు, నిశ్చిత శిష్యునికి ఆత్మ తత్త్వమును దెలిపి కృతార్థునిగ జేయును. ఉదాహరణమునకు పరీక్షిన్మహారాజును శ్రీశుకభగవానుడు ప్రకటమై కృతార్థునిగ జేసినట్లు, "శ్రీ బాబాజీ చైతన్య" భగవదిచ్ఛానుసారముగ యథాకాలము, యథోచితరీతిగా శ్రీతుకారామస్వామి యెదుట ప్రకటమై మంత్రోపదేశము జేసి కృతార్థునిగ జేసెను.

పూర్తిగా గాఢమైన సుషుప్త్యవస్థలో నున్న వానిని మేలుకొలుపుటకు వాని పేరున పిలుస్తూ శబ్దము జేసినచో నతడు గాఢనిద్రలో నున్నందున మేలుకొనడు. పూర్తిగా మేలుకొనిన (జాగరిత) పురుషుణ్ణి మేలుకొల్పుట యవసరమే లేదు. కాని నిద్రా దోషముచే స్వకల్పిత స్వప్న ప్రపంచములో సుఖదుఃఖములననుభవించుచున్న పురుషున్ని వాని పేరున పిలుస్తూ శబ్దము చేసినచో నతడు స్వస్వప్నగత సుఖదుఃఖములనుండి విడివడి మెలకువ జెంది స్వస్థతను పొందును. అట్లే గాఢ సుషుప్తివంటి అజ్ఞానాంధకారములో నిండా మునిగి యున్న మూఢులకు (వివేక హీనులకు) తత్త్వమస్యాది వాక్యోపదేశరూప శబ్దప్రయోగము నిరుపయోగమగును. మరియు యెవరైతే అప్రతిబద్ధ దృఢాపరోక్ష బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము (అహం బహ్మాఽస్మి అను చరమ వృత్తి)చే నజ్ఞాన తత్కార్య రూప అనాది నిద్ర నుండి మేల్కాంచిరో (జీవన్ముక్తులయినారో) వారికి గూడ తత్త్వమస్యాది వాక్యోపదేశము (శబ్దము) యొక్క ఆవశ్యకత లేదు. కాని మలదోషము, విక్షేపదోషము యెవరియందైతే లేవో, స్వరూపాజ్ఞానము మాత్రము గలదో మరియు సాధన చతుష్టయ సంపత్తిచే సుసంపన్నుడై, ఈ జననమరణరూప సంసార స్వప్నములో త్రివిధ దుఃఖములచే సంతృప్తుడై, తీవ్రతర మోక్షేచ్ఛగల యధికారి పురుషునికి "తత్త్వమసి నాసి త్వం సంసారి" అను శబ్దముచే ప్రబోధితుడిని జేసినచో

నతడు అనాది మాయా కల్పిత సంసారరూప స్వప్నము నుండి మేల్కాంచి (అహం బ్రహ్మాఽస్మి అను జ్ఞానముచే) ముక్తుడగును.

**కారికా :- అనాది మాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే ।**

**అజమనిద్ర మస్వప్న మద్వైతం బుధ్యతే తదా ॥**

(మాం.కా. 1-16)

**అర్థము :-** జీవుడు అనాది మాయనుండి (అజ్ఞానము తత్కార్యమగు జాగ్రదాది ప్రపంచము నుండి) మేల్కాంచునో అనగా తత్త్వజ్ఞానమును యెప్పుడు పొందునో, అప్పుడు అజము (జన్మాది షడ్భావ వికారరహితము) అనిద్రము (జన్మాది కారణ భూతమగు నవిద్య లేనిది), అస్వప్నము (అన్యథాగ్రహణ రూప జాగ్రదాది ప్రపంచరహితము) మరియు నద్వైతము (సజాతీయాదిరహితము)నగు తురీయమగు ఆత్మతత్త్వబోధ గలుగును.

ఈ తథ్యమును లోకమునకు తెలియజేయుటకే కాబోలు శ్రీబాబాజీ చైతన్యులవారు శ్రీతుకారాం మహారాజుగారి స్వప్నములో ప్రకటమై "రామక్రిష్ణ హరి" అను దివ్యమంత్రమునుపదేశించెను. దీనికి అచ్చెరు వొంద పనిలేదు. అస్మదాదుల గురుశిష్య సంప్రదాయము, బోధ్య బోధక వ్యవహారము నిజముగా స్వప్నమందే జరుగుచున్నది. అన్యథా గ్రహణమే స్వప్నము. జాగ్రత్, స్వప్న, సుషుప్త్యాది ప్రపంచ మంతయును స్వప్నమే "త్రయ ఆవసథాస్త్రయః స్వప్నాః" (ఐ.ఉ. 1-3-12) జీవుని యొక్క మూడు అవస్థలు మూడు స్వప్నములే.

శ్రీ తుకారామస్వామి, తనకు శ్రీగురుదేవులైన శ్రీబాబాజీ చైతన్యుల వారు స్వప్నములోనే దర్శనమిచ్చి మంత్రోపదేశము చేసి, అనుగ్రహించెనని స్వయముగా తన యభంగవాణి ద్వారా చెప్పుచున్నాడు.

అభంగము :-

సత్యగురు రాయే కృపా మజకేలీ ।
పరినాహీఁ ఘడలీ సేవా కాహీఁ ॥1॥

సాంపడ విలేఁ వాటేఁ జాతా గంగాస్నానా ।
మస్తకీఁ తో జాణా ఠేవిలా కర ॥2॥

భోజనా మాగతీ తూప పావశేర ।
పడిలా విసర స్వప్నామాజీఁ ॥3॥

కాయ కళే ఉపజలా అంతరాయ ।
హ్మణోనియాంకాయ త్వరా ఝాలీ॥4॥

రాఘవ చైతన్య కేశవ చైతన్య ।
సాంగితలీ ఖూణ మాళికేచీ ॥5॥

బాబాజీ ఆపులేఁ సాంగితలేఁ నామ ।
మంత్ర దిలా"రామకృష్ణ హరి" ॥6॥

మాఘ శుద్ధ దశమీ పాహునీ గురువార ।
కేలా అంగీకార తుకాహ్మణే ॥7॥ (3432)

ప్ర.ప :- గురురాయే = గురురాయడు (శ్రీగురుదేవుడు) ; మజ= నాపైన; సత్య = నిజముగా ; కృపా కేలీ = కృప చేసెను (అనుగ్రహించెను); పరి = కాని; (ఆయన యొక్క) సేవా = సేవ ; కాంహీఁ = ఏమియును గూడ (నాచేత); ఘడలీ నాహీ c = గడించ లేదు (జరుగలేదు). 1. (నేను ఇంద్రాయణి నదికి స్నానము చేయుటకు వెళ్ళుచున్నట్లు నాకు స్వప్నము పడింది. ఆ స్వప్నములో) గంగాస్నానా = నదీ స్నానమునకు, జాతా = వెళ్ళు

చున్నపుడు ; వాటేఁ = మార్గమధ్యమున; సాంపడలేఁ = దొరికెను (శ్రీగురుదేవుడు తటస్థపడెను) తో = ఆయన; మస్తకీఁ= నా తలపై; కర = తన శుభహస్తమును ; ఠేవిలా జాణా = పెట్టినాడని తెలియండి. 2. (గురుదేవులు) భోజనా = భోజనము కొఱకు ; పావశేర = పావుశేరు ; తూప = నెయ్యిని, మాగతీ = (నన్ను) అడిగెను ; స్వప్నా మాజీఁ = స్వప్నమునందు;విసర = విస్మృతి ; పడిలా = పడింది ( కలిగినది) 3. కాయ హ్మాణోనియాం = ఎందు కొఱకో ఏమో అని; కళే = అనిపించుచున్నది. (సద్గురు దేవుని అకస్మాత్తు దర్శనము వలన నాకు) కాయ త్వరా ఝాలీ = ఏమి తొందర అయినదో, అంతరాయ = విఘ్నము ;ఉపజలా = ఉత్పన్నమైనది (సద్గురు దేవులు అంతర్ధాన మయిరి.)4. (శ్రీగురుదేవులు వారి యొక్క) మాళికేచీ = సంప్రదాయము యొక్క ;ఖూణ = చిహ్నములను (గూర్చి చెప్తూ, పరమ గురువు పేరు) రాఘవ చైతన్య = రాఘవ చైతన్యుడని;(స్వంత గురువు) కేశవచైతన్య = కేశవ చైతన్యుడని, సాంగితలీ = చెప్పెను. 5. ఆపులేఁనామ - తన యొక్క పేరు ;బాబాజీ = బాబాజీ చైతన్యుడని, సాంగితలేఁ = చెప్పెను; రామకృష్ణ హరి = "రామకృష్ణహరి", (అను) మంత్ర = మంత్రమును;(నాకు) దిలా = ఇచ్చెను (ఉపదేశించెను) 6. (ఆ శుభదినము) మాఘ శుద్ధ దశమీ = మాఘమాసము, శుక్లపక్ష దశమీరోజు, గురువార = గురువారము ; పాహెూని = శుభదినము నెంచి, (నన్ను) అంగీకార కేలా = శిష్యునిగా స్వీకరించెను. (అని) తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగారు అంటున్నారు. 7.

**తా॥** శ్రీగురుదేవులు నిజముగా నన్ను కరుణించెను. కాని నాచేత ఆయనకు ఏమియును సేవ గడించలేదు. (నేను ఆయనకు ఏమియును సేవ చేయలేక పోయితిని.)1. నేను ఇంద్రాయణి నదిలో స్నానము చేయుటకు

వెళ్ళుచున్నట్లు నాకు స్వప్నములో కనపడింది. ఆ స్వప్నములో నేను నదికి స్నానమునకు వెళ్ళుచున్నప్పుడు మార్గ మధ్యములో శ్రీగురుదేవులు నాకు తటస్థ పడిరి. వారు స్వయముగా నన్ను శోధించుకుంటూ వచ్చి, నాశిరముపై వారి శుభహస్తమును పెట్టి నన్ను ఆశీర్వదించిరి. 2. నను పరీక్షించుటకేమో తెలియదు - శ్రీగురుదేవులు నన్ను (స్వప్నములో) భోజనము కొఱకు పావుశేరు నెయ్యిని అడిగెను. కాని అకస్మాత్తుగా శ్రీగురుదేవుల దర్శనమగుటచే నేను విస్మయముచే (కంగారులో) నెయ్యిని తెచ్చి యిచ్చుట మరచితిని. 3. నాసేవలో జాప్యము జరిగినందువల్లనో ఏమో, తెలియదు. సద్గురుదేవులు అతి తొందరలోనే అంతర్ధానమయిరి. 4. కాని వారు అంత అల్పకాలములోనే రాఘవ చైతన్యులవారు వారి పరమ గురువులని కేశవ చైతన్యులవారు స్వంత గురుదేవులని గురుపరంపరాగతసంప్రదాయమును గూర్చి నిర్దేశించి చెప్పిరి. 5. వారి యొక్క సొంత నామధేయము బాబాజీ చైతన్య అని చెప్పి, నాకు "రామకృష్ణ హరి" అను దివ్యమంత్రమునుపదేశించిరి. 6. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు ఈ ప్రకారముగా మాఘమాసము శుక్లపక్షము దశమీ తిథి గురువారము రోజు మంచిదని యెంచి శ్రీగురుదేవులు నాకు ఉపదేశమిచ్చి యనుగ్రహించిరి. 7.

అభంగము :-

మాఝియే మనీంచా జాణోనియాం భావ ।
తోకరీ ఉపావ గురురావ ॥1॥

ఆవడీచా మంత్ర సాంగితలా సోపా ।
జేణే c నోహే గుంఫా కోఠే కాంహీc ॥2॥

జాతీ పుఢే ఏక ఉతరలే పార ।
హే భవసాగర సాధుసంత ॥3॥

**జాణత్యా నేణత్యా జ్యా జైసీ ఆవడీ ।**
**ఉతార సాంగడీ తాపే పేటే ॥4॥**

**తుకా హ్మణే మజ దావియేలా తారూ ।**
**కృపేచా సాగరూం పాండురంగ ॥5॥ (3433)**

ప్ర.ప :- గురురావ = గురుదేవులు ; మాఝియే = నా యొక్క ; మనీంచా = మనస్సులోని, భావ = భావమును (ఇచ్ఛా) ; జాణోనియాం= తెలిసికొని ; తో = వారు ; ఉపావ = ఉపాయమును (మంత్రోపదేశమును), కరీ = చేసిరి. 1. ఆవడీచా = నాకిష్టమైన; మంత్ర = మంత్రమును (రామకృష్ణహరి) ; సోపా = సులభమైన దానిని ; సాంగితలా = చెప్పిరి;జేణే= దేనిచేతనైతే ;కోఠే = ఎక్కడను ;కాంహీం = ఏమియును;గుంఫా = దుఃఖజాలము;నోహే = లేదో ; (అటువంటి సులభోపాయము చెప్పిరి). 2. ఏక = ఈ ఏకైక మంత్రముచే ; గతంలో అనేక ) సాధుసంత = సాధు మహాత్ములు ; హే = ఈ; భవసాగర = సంసార సముద్రమును; పార ఉతరలే = దాటిరి; (ఇప్పుడు) జాతీ = పోవుచున్నారు. (దాటుచున్నారు); పుఢే = ముందు (దాట గలరు). 3. జాణత్యా = తెలిసియో ; నేణత్యా = తెలియకనో, జ్యా = యెవరికి ;జైసీ = ఏవిధముగా ; (ఏసాధన యందు ) ఆవడీ = అభిరుచి(గలదో, ఆ సాధనములను గురుదేవుడు బోధించును. స్వతంత్రముగా) ఉతార = (తెప్పతో పోవు వారికి) అట్లే దాటుటకుపాయమును. (జీవబ్రహ్మైక్యబోధరూప ఉపాయమును సాధన సంపన్నునికి బోధించును.) ; తాపే = గుమ్మడికాయ లేదా సొరకాయ బుర్రలను సాధనముగా (అనగా ఆత్మనివేదన రూప భక్తిని) బోధించును; సాంగడీ = తోడుగా నడచు వానికి తోడును జూపెట్టును. (అనగా సకామ కర్మలను బోధించును). పేటే = ఈత రానివానికి పుంటికట్టెల మోపును

నడముకు కట్టి, తోడుగా త్రాడును కట్టి - ఆత్రాడు చివర పట్టుకొని మరీ ఈదుట నేర్పించునట్లు వర్ణాశ్రమ విహిత ధర్మములను బోధిస్తాడు. 4. తుకా హ్మణే = శ్రీ తుకారాం మహారాజు గారంటున్నారు ; మజ = నాకు (మాత్రము సద్గురుదేవులు) తారూ = నామము అను తెప్పను చిన్న ఓడను ; (మరియు) కృపేచా సాగరూం = కృపా సాగరుడైన ; పాండురంగ = పాండురంగడు (అను నావికున్ని) ; దావియేలా = చూపించాడు. 5.

**తా॥** శ్రీ గురుదేవులు నా మనస్సులోని ఇచ్ఛను (భావమును) తెలిసికొని, దానినే భవసాగరమును దాటుటకుపాయముగా చెప్పిరి. 1. ఏమిటనగా! నాకిష్టమైన మంత్రము "రామకృష్ణ హరి". ఇదే మంత్రమును నాకు గురు దేవులు(బాబాజీ చైతన్యుల వారు) ఉపదేశించిరి. ఈ మంత్రము ఎంత సులభమైన దనగా! స్నానాది కర్మల విధానము లేదు. దేశకాలనియమము లేదు. ఉచ్చరించుట తప్పినచో పిచ్చిపట్టే భయము లేదు. కావున ఈ మంత్రము చేతనే జ్ఞానదేవులు, నామదేవులు, ఏకనాథ మహారాజు మొదలగు సంతు మహాత్ములు ఒకరి తరువాత ఒకరు ఈ భవసాగరమును దాటిరి. ఆధునిక సంతులు దాటుచున్నారు. ఇక ముందు గూడ అనేక సంతులు, భక్తులు ఈ నామము చేత భవసాగరమును దాటగలరు. 3. తెలిసి, తెలియక యెవరికి యే సాధన ఇష్టమున్నదో వారికి ఆ సాధనమును శ్రీగురుదేవుడు బోధిస్తాడు. యెవరికి స్వతంత్రముగా కాలినడకతో గాని, చిన్న తెప్పతోగాని నదిని దాటే శక్తి గలదో అనగా సాధనచతుష్టయ సంపన్న అధికారికి జీవబ్రహ్మైక్య జ్ఞానమను (తెప్పను) ఉపదేశించును. కొందరికి వేదత్రయీ ధర్మరూప (నౌక అను) జ్యోతిష్టోమాది సకామకర్మలను బోధించును. కొందరికి ఆత్మ నివేదనమను భక్తిని (సొరకాయ బుర్రలాంటి సాధనమును) చెప్పును. కొందరికి తూటికట్టెల లేక పుంటికట్టెల మోపును నడుము కట్టి, దానితోపాటు నడుమునకు త్రాడునుగూడ కట్టి,

ఆత్రాటి రెండవ చివరను పట్టుకొని ఈదుట రానివానికి ఈదుట నేర్పించునట్లు - వర్ణాశ్రమ విహిత కర్మలను ఈశ్వరార్పణ బుద్ధితో ఫలాభిసంధి రహితముగా చేయుమని బోధించును. 4. తుకారాం మహారాజుగారంటున్నారు – శ్రీగురుదేవులు నాకు మాత్రము నామమును "రామకృష్ణ హరి" అను తెప్పను మరియు పరమ కృపాసాగరుడైన శ్రీపాండురంగడు అను నావికున్ని చూపెట్టి, వీరిద్దరు (నామమ మరియు పాండురంగడు) నిన్ను భవసాగరము నుండి దాటించెదరు – అని చెప్పెను. 5.

**విశేషము :-** పై అభంగముల ద్వారా ఈ క్రింది విషయములు తెలియవచ్చు చున్నది.

1. సద్గురు దేవుడు శ్రీ తుకారామస్వామిని అనుగ్రహించి "రామకృష్ణ హరి" అను మంత్రోపదేశము చేసెను.

2. ఈ ఉపదేశమును స్వప్నములో ఇంద్రాయణి నదికి స్నానార్థము వెళ్ళుచుండగా మార్గమధ్యములో సద్గురు దేవుడు తటస్థపడి, (మంత్రోపదేశమును) చేసి, తలపై శుభహస్తము నుంచి అనుగ్రహించెను.

3. సద్గురుదేవులు భోజనార్థము పావుశేరు నెయ్యిని అడిగినాడు. కాని తుకారామస్వామి మరచి పోయెను. సద్గురువు వెళ్ళి పోయిన పిదప తుకారామస్వామి చాలా బాధపడ్డాడు. గురుదేవులకు నేనేమి సేవ చేయలేక పోతిని గదా అని దుఃఖపడ్డాడు. నా సేవలో పొరపాటు జరిగినందువల్లనే గురుదేవులు తొందరగా వెళ్ళిపోయినాడని బాధ పడ్డాడు.

4. సద్గురు దేవులు తన గురు పరంపరనుగూర్చి తెలియ జేస్తూ - పరమ గురువు రాఘవచైతన్య అని, స్వగురువు కేశవ చైతన్య అని, తన పేరు బాబాజీ చైతన్య అని చెప్పెను.

5. గురూపదేశము మాఘ మాసము, శుక్లపక్ష దశమీ తిథి, గురువారమునాడు లభించినది. సద్గురుదేవులు శ్రీతుకారాం మహారాజు గారిని ఇలా అంగీకరించెను.

6. గురురాయుడు మనస్సులోని భావము నెఱింగి తరణోపాయమును (మంత్రమును) ఉపదేశించెను. ఈ మంత్ర జపములో ఎలాంటి ఇబ్బందులు, బంధనములు లేవు.

7. అధికారిభేదమును బట్టి సద్గురు దేవులు ఉపదేశమును లేదా సాధనములను బోధించును. నదిని దాటుటలో సామర్థ్య భేదము బట్టి అనేక సాధనలు గలవు. (ఏ) కాలినడకతో లేదా స్వతంత్రముగా చిన్న తెప్పను ఆశ్రయించి నదికి దాటవచ్చును. (బి) నౌకను ఆశ్రయించి వెళ్ళవచ్చును.(సి) సొరకాయ బుర్ర లేదా గుమ్మడికాయ బుర్రలను నడుమునకు కట్టుకొని నెమ్మదిగా మరొకరు తోడుగా రాగా వెళ్ళవచ్చును. లేదా (డి) మరొకరి సహాయముతో గూడ వెళ్ళవచ్చును.

8. ఈ మంత్రము చేతనే శ్రీజ్ఞానేశ్వర్ మహారాజు, శ్రీనామదేవులు మరియు శ్రీ ఏకనాథ మహారాజు మొదలగు సంతు మహాత్ములు భవసాగరమును దాట గల్గిరి. గురూపదేశమునకు పూర్వమే విఠలునియొక్క ఉపాసనా, "రామకృష్ణ హరి" అను మంత్రము శ్రీతుకారామస్వామికి చాలా ప్రియమున్నదని తెలియవచ్చుచున్నది.

9. సద్గురు దేవులు నామము అను తెప్పను పాండురంగడు అను నావికున్ని చూపించి, వీరిద్దరు నిన్ను భవసాగరము నుండి తరింపజేయుదురని చెప్పిరి.

# శ్రీభక్తతుకారాం అభంగవాణి

- మంగళాచరణము -

శ్లో॥ సమచరణ సరోజం సాంద్ర నీలాంబుదాభం
జఘననిహితపాణిం మండనం మండనానామ్ ।
తరుణ తులసి మాలాకంధరం కంజనేత్రం
సదయధవళహాసం విఠలం చింతయామి ॥

1. అభంగము :-

సమచరణదృష్టి విటేవరీ సాజిరీ ।
తెథేఁ మాఝీ "హరి" వృత్తి రాహెూ ॥1॥

ఆణిక నలగె మాయిక పదార్థ ।
తెథేఁ మాఝెఁ ఆర్త నకో దేవా ॥2॥

బ్రహ్మాదిక పదేఁ దుఃఖాచీ శిరాణీ ।
తెథేఁ దుశ్చిత్త ఝుణీఁ జడో దేసీ ॥3॥

తుకామ్హణే త్యాచేఁ కళలేఁ ఆమ్హా వర్మ ।
జే జే కర్మధర్మ నాశవంత॥4॥

ప్రతి పదార్థము :- హరి = ఓ శ్రీహరి! ; సమచరణదృష్టి = సమాన చరణములు, సమాన దృష్టి (గలిగి, విటేవరీ = ఇటుకపై (నున్న ఏ నీ యొక్క) సాజిరీ = సుందరమైన (మూర్తి గలదో); తెథేఁ= అక్కడ (ఆమూర్తిపైన);మాఝీ = నా యొక్క వృత్తి = అంతఃకరణవృత్తి;రాహెూ = ఉండాలి. 1. దేవా = ఓ దేవా! ; ఆణిక = ఇతరములైన (నీకంటె భిన్నములైన) ;మాయిక = మాయాకార్యమైన ; పదార్థ = సాంసారిక పదార్థములు ; న

లగె = నాకవసరము లేదు ; తెథేం = అక్కడ (ఆ పదార్థములందు) ; మాఝె = నాయొక్క (మనస్సులో గూడ) ఆర్త = యిచ్ఛ ; నకో = (నిర్మాణము) కాకూడదు. 2. బ్రహ్మాదిక = బ్రహ్మలోకాది; పదేం = స్థానము (లందుగల) ; శిరాణీ = దివ్య భోగములు ; దుఃఖాచీ = దుఃఖసంబంధమైనవే (ఉన్నవి), తెథేం = అక్కడ (బ్రహ్మాది లోక భోగములందు) ; దుశ్చిత్త = (కామాది దోషదూషితమైన నా) దుష్ట చిత్తము; ఝుణీ = కదాచిత్, జడో= ఆసక్తము ; దేసీ = అగునేమో. (కాని అలా కాగూడదని ప్రార్థన)3. తుకామ్హణే= శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు ;ఆమ్హా = మాకు ; త్యాచే ం = వాటి యొక్క (ఇహ పర సంబంధమైన భోగములయొక్క), వర్మ= రహస్యము ; కళలేం= తెలిసెను. (ఏమనగా!) జేజే = ఏదేది; కర్మ = ఈ లోక సంబంధమైన కృషివాణిజ్యాది కర్మజన్యధాన్యధనాది భోగసంపత్తి; ధర్మ = శాస్త్రోక్తకర్మజన్య అపూర్వము ద్వారా ప్రాప్తించు పరలోక భోగసంపత్తి; నాశవంత = నాశనము గలదియే (ఉన్నది.).

**తాత్పర్యము :–** హే శ్రీహరీ! సమానచరణములు, మరియు సమాన దృష్టి గలిగి నీ యొక్క ఏ శ్యామసుందరవిగ్రహము ఇటుకపై విరాజమానమై యున్నదో, దానిపైనే నా యొక్క అఖండాకారాంతఃకరణ వృత్తి ఎల్లప్పుడు ఉండాలి. 1 'ఓ దేవా! నీకంటె యితరములైన మాయా కార్యమైన మిథ్యా సాంసారిక పదార్థములు నాకు వలదు. ఇంతేగాదు - వాటిని గూర్చిన యిచ్ఛగూడ నా మనస్సులో పొడమగూడదు. 2. ఈ లోకము మొదలుకొని బ్రహ్మలోక పర్యంతముగల యే దివ్య భోగ జాతము గలదో, అది యంతయు దుఃఖముయొక్క పరాకాష్ఠయై యున్నది. అటువంటి దుఃఖమిశ్రిత భోగములందు కదాచిత్ కామక్రోధాది దోషదూషితమైన నా చిత్తమాసక్తమగునేమో! కాని, అట్లు కాగూడదు సుమా. 3. శ్రీ తుకారాం

మహారాజుగారంటున్నారు-మాకు ఐహిక పారలౌకిక భోగముల యొక్క రహస్యము తెలిసినది. ఏమనగా! ఏదేది ఈ లోకములో కృషి వాణిజ్యాది కర్మ జన్య ధాన్యధనాది భోగసంచయము గలదో మరియు శ్రౌత,స్మార్తకర్మజన్య అపూర్వముచే ప్రాప్తమగు స్వర్గ, బ్రహ్మాది పారలౌకిక అమృత సేవనాది యే దివ్యభోగజాతము గలదో, అది యంతయు మాయికము, దుఃఖరూపము మరియు వినాశ శీలమున్నది. 4.

**సుజాత వ్యాఖ్య :-** పై అభంగములో "సమచరణ" మరియు "సమదృష్టి" అను రెండు పదములు విఠలుని యొక్క తటస్థలక్షణమును తెలుపుచున్నవి. "కాదాచిత్కత్వే సతి వ్యావర్తకత్వం తటస్థలక్షణత్వమ్", యథా "కాకవద్గృహం దేవదత్తస్య" దేవదత్తుని యింటిపైనున్న కాకి కించిత్కాలముండి యితరుల యిండ్లనుండి దేవదత్తుని యిల్లును మాత్రము తెలుపుతుంది. అట్లే పరమాత్మ సర్వవ్యాపకుడై యుండి భక్తానుగ్రహార్థము సగుణ రూపముతో పాదములు జోడించి అతిశయోత్కర్షతో శోభిస్తూ ఇటుకపై నిలుచున్నాడు.

సమదృష్టి యనగా సమస్త భక్తులపై సమాన కృపా దృష్టి గలవాడని యర్థము. లేక నేత్రకమలముల దృష్టిని, యోగుల యొక్క ధ్యానముద్రవలె నర్ధోన్మీలితమునై, అటునిటు పడకుండ కేవలము తన యెదుటనున్న భక్తునిపైనే కేంద్రీకరించినవాడు అని గూడ నర్థము. కావున సమ చరణత్వము మరియు సమదృష్టిత్వము కాదాచిత్కమైనందున విఠలుని యొక్క తటస్థలక్షణమును తెలుపుచున్నవి.

అథవా, సమదృష్టి యను పదము స్వరూప లక్షణమును బోధిస్తున్నది. "సదా విద్య మానత్వే సతి వ్యావర్తకత్వం స్వరూపలక్షణత్వమ్", యథా "ప్రకృష్ట ప్రకాశవాన్ చంద్రః". ప్రకృష్టప్రకాశము చంద్రునికి యావత్కాలావస్థాయియై యుండి యితరమును వ్యావృత్తి చేయుచున్నది.

అట్లే సమదృష్టియను పదము గూడ విఠలుని స్వరూపమును సూచించు చున్నది. తథాహి -"దృష్టి" యనగా జ్ఞానము. జ్ఞానము విఠలునికి (పరమాత్మకు) కాదాచిత్కము గాకుండా సదా విద్యమానమై, స్వరూపమైయున్నది. "ప్రజ్ఞాన ఘన ఏవ" (బృ.ఉ. 4-5-13). ఇంతేగాక "సత్యం జ్ఞానం" (తై.ఉ. 3-1-1), "విజ్ఞానమానందమ్" (బృ.ఉ. 3-9-29) ఈ రెండు శ్రుతుల వల్ల జ్ఞానము - సత్యము మరియు ఆనందముల యొక్క సామానాధికరణ్యమును చూపుచున్నది. అందువలన దృష్టి అనగా జ్ఞానము - సత్యము మరియు ఆనందములకుపలక్షణమున్నందున, సత్, చిత్, ఆనందము విఠలుని యొక్క స్వరూపలక్షణమున్నదని తెలుపుచున్నది.

ఈ ప్రకారముగా నుభయ లక్షణాత్మకము - సగుణ, నిర్గుణ రూపుడు విఠలుడని యభంగములోని "సమ చరణదృష్టి" యను పదములచే నుస్పష్టమైనది. అటువంటి స్వరూపమునందు నా యొక్క అఖండాకారాంతఃకరణ వృత్తి యెల్లప్పుడుండులాగున నన్ననుగ్రహింపుమని యభంగములోని "వృత్తిరాహెూ" అను పదముతో, హే శ్రీహరీ! యని సంబోధిస్తూ, విఠలుని ప్రార్థిస్తున్నాడు - శ్రీ తుకారాం మహారాజుగారు. మాయిక పదార్థముల నుండి యంతఃకరణమును హరించి సగుణ నిర్గుణ రూపమునందు స్థిరపరచు సామర్థ్యము కేవలము విఠలునికి మాత్రమే ఉంది, కావున విఠలునికి "హరి" అని సాభిప్రాయ సంబోధనము.

మనుష్య జన్మ సాఫల్యము నొందుటకు విఠలుని యొక్క సగుణ నిర్గుణరూపమునందు నిరంతర ప్రేమ (భక్తి) లక్షణ వృత్తి మరియు జ్ఞాన లక్షణవృత్తులనుంచిననే తప్ప వేరొండుపాయములేదు. కావున యీ యిరుతెఱంగులవృత్తి ఎల్లప్పుడుండునట్లనుగ్రహింపుమని "వృత్తి రాహెూ" అని విఠలుని ప్రార్థిస్తున్నాడు శ్రీతుకారాం మహారాజుగారు. 1.

సగుణ సాక్షాత్కారమునకు వలసిన ప్రేమ లక్షణ వృత్తి కలుగుటకు గాని,నిర్గుణ సాక్షాత్కారమునకు వలసిన, ఆవరణ విక్షేపశక్తులుగల యనాది యనిర్వచనీయ భావరూపాజ్ఞాన నివర్తక జ్ఞానలక్షణ వృత్త్యుదయించుటకు గాని అంతఃకరణము శుద్ధము మరియు వివేకాది సాధన సంపన్నమై యుండుట యత్యంతావశ్యకమని రెండవ చరణము ద్వారా తెలియజేయుచున్నారు.

ఓదేవా! నీ కంటె భిన్నమైన మాయాకార్యమైన సాంసారిక పదార్థములు నాకు వలదు- అంటూ "ఆణిక నలగె మాయిక పదార్థ" అను యీ రెండవ చరణములో "మాయిక" అను విశేషణ పదముచే, మాయా, తత్కార్యమైన ప్రపంచము మిథ్యా, అనిత్యము అనియు తద్భిన్నమైన నీవు నిత్యమనియు అమాయి విఠలునికి మాయిక సాంసారిక పదార్థములకు భేదమును ప్రదర్శిస్తూ, వేదాంతాధికారికి ఉండవలసిన మొదటి సాధనము "వివేకము"ను వ్యక్తపరచిరి. 2.

బ్రహ్మలోక పర్యంతముగల దివ్యభోగములన్నియు దుఃఖము యొక్క పరాకాష్ఠము అని "బ్రహ్మాదిక పదే c దుఃఖాచీ శిరాణీ" అంటూ ఈ మూడవ చరణముచే నమర్యాదిత దృఢ "వైరాగ్య"ము ద్యోతితమయినది. 3.

ఓ దేవా! దృష్టానుశ్రవికవైషయికపదార్థములందు మా యంతఃకరణము విక్షిప్త మగుటకు వీలు లేదు. ఎందుకనగా! ఆ పదార్థముల నిజస్వరూపము మాకు తెలిసింది. "తద్యథేహ కర్మచితో లోకః క్షయతే ఏవమేవాఽముత్ర పుణ్యచితో లోకోఽపి క్షీయతే" (ఛాం.ఉ. 8-1-6). ఈ శ్రుతి వచనానుసారము ఏ విధముగా ఈ లోకసంబంధమైన వ్యావహారిక క్రియా జన్య భోగములు క్షయ శీలములో, అట్లే వైదిక కర్మ జన్య పుణ్యముచే ప్రాప్తమగు పరలోక భోగములు గూడ నశ్వరములే యని సుస్పష్టముగా

తెలిసినది. ఈ భావమును వ్యక్తము చేయు నాలుగవ చరణము "జేఁ జేఁ కర్మధర్మ నాశవంత" ద్వారా తీవ్రవైరాగ్యము ధ్వనితమగుచున్నది. ఇంతేగాకుండా శమాది షట్క సంపత్తి గూడ యథామతి ఊహనీయము. 4.

సగుణ విఠలుని భక్తి మరియు నిర్గుణరూపము యొక్క మోక్ష ప్రతిబంధరూప అజ్ఞాన నివర్తక జ్ఞాన లక్షణ వృత్తి యేదైతే ప్రథమ చరణములో "వృత్తిరాహూ" అను పదముచే భగవంతుని ప్రార్థించడమైనదో, దానిచే మోక్షేచ్ఛారూప చతుర్థ సాధనముఁ దెలియ వలెను.

1. ఈ ప్రకారముగా 1. వివేకము, 2. వైరాగ్యము, 3. షట్ సంపత్తి, మరియు, 4. ముముక్షుత్వము అను సాధన చతుష్టయ సంపత్తి ధ్వనితమగుచున్నందున అధికారి నిరూపణము సిద్ధించినది.

2. మొదటి చరణములోని "హరి" అను పదముచే వేద ప్రతిపాద్య "విషయము" విదితమగుచున్నది. "వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః" (గీత 15-15) సర్వవేదములచే తెలియదగినది. ప్రతిపాద్యమయిన వస్తువు నేనే అని భగవద్వచనము. కావున విఠల రూప "హరి" (శుద్ధచైతన్యమే) వేదాంత విషయము. వేదాంతములకు (ఉపనిషత్తులకు) ఏ జీవ బ్రహ్మైక్య రూప శు ద్ధచైతన్యము (హరి) విషయయో, అదియే ఈ "శ్రీ తుకారాం మహారాజు గాథ" అను గ్రంథమునకు విషయము. ఈ గ్రంథమునందు గూడ జీవ బ్రహ్మైక్యము (హరి)నే ముఖ్య విషయముగా ప్రతిపాదించడమైనది. ఈ గ్రంథమునకు "తుకోపనిషత్" అని గూడ నామాంతరము గలదు.

3. "అజ్ఞాత బ్రహ్మ విషయః జ్ఞాతం బ్రహ్మ ప్రయోజనమ్" । అను వృద్ధవచనానుసారము హరియే ఆనందరూపుడు గావున ఈగ్రంథమునకు ప్రయోజనము. "సర్వదుఃఖనివృత్తి, పరమానందావాప్తి" రూప మోక్షము

హరియే యైయున్నాడు. "రసో వై సః", "ఆనందం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చన" (తై. ఉ. 2-7, 2-9) బ్రహ్మమే (హరియే) ఆనందరూపుడు. ఆ బ్రహ్మము నెఱింగినవాడు దేనిచేతను భయపడడు అని శ్రుతి వాక్యము. సర్వదుఃఖములు నివృత్తమైనవాడు హరియే యై యున్నందున హరి నెఱింగినవాడు శోకము - (సంసారము)ను తరిస్తాడు అని " తరతి శోకమాత్మవిత్" (ఛాం.ఉ. 7-1-3) శ్రుతి వచనము. సకల జీవులచే కోరబడు పురుషార్థరూప మోక్షము హరియే. "తెథె మాఝీ హరి వృత్తి రాహెూ" అను ప్రథమచరణవాక్యముచే శ్రీతుకారాం మహారాజు హరిరూప మోక్షమునే ప్రార్థించినాడు, గావున గ్రంథ ప్రయోజనము సిద్ధించినది.

4. గ్రంథమునకు విషయమునకు ప్రతిపాదక ప్రతిపాద్య రూప సంబంధమున్నది. అజ్ఞానమునకు, గ్రంథవిచారజనిత జ్ఞానమునకు నివర్త్య నివర్తక భావ సంబంధమున్నది. జ్ఞానమునకు గ్రంథ విచారమునకు మరియు మోక్షమునకు జ్ఞానమునకు జన్య జనక భావరూప సంబంధమున్నది. ఇత్యాది సంబంధములు యథా సంభవమూహనీయములు.

ఈ విధముగా అధికారి, సంబంధము, విషయము మరియు ప్రయోజనము అను ననుబంధచతుష్టయము గూడ ధ్వనితమైనది.

ఈ పురాణోక్తి ననుసరించి

శ్లో ॥ సకృదుచ్చరితం యేన హరి రిత్యక్షరద్వయమ్ ।
బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి ॥

శ్లో ॥ సర్వదా సర్వకార్యేషు నాస్తి తేషామమంగళమ్ ।
యేషాం హృది స్థితో భగవాన్ మంగళాయతనో హరిః॥

(స్కందపురాణము)

శ్లో ॥ నామసంకీర్తనం యస్య సర్వపాపప్రణాశనమ్ ।
ప్రణామో దుఃఖశమనస్తం నమామి హరిం పరమ్ ॥
(శ్రీమద్భాగవతము 12-13-23)

అభంగములోని మొదటి చరణములో "హరి" అను పదముచే హరిని ప్రార్థిస్తూ మంగళమును గూడ చేయడమైనది. "మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే, వీరపురుషాణి భవంతి, ఆయుష్మత్పురుషాణి చాఽధ్యేతారః సిద్ధార్థాః యథా స్యుః" అను మహాభాష్యకారుల వచనము, మరియు నిర్విఘ్న పరిసమాప్తి కామో మంగళమాచరేత్" అను శిష్టాచారానుమిత వచనము ప్రమాణములు. గ్రంథము నిర్విఘ్నముగ పరిసమాప్తమగుటకు, విస్తృత ప్రచారమగుటకు, ఆర్షసంప్రదాయమును పరిరక్షిస్తూ, నాస్తికత్వమును దూరీకరిస్తూ శ్రీపాండురంగనియొక్క పరిపూర్ణానుగ్రహము కోరుతూ "హరి" అను సాభిప్రాయ సంబోధనము ద్వారా శ్రీతుకారాం మహారాజుగారు ఆశీర్వాదాత్మక మంగళాచరణము గావించిరి.

"శ్రేయాంసి బహు విఘ్నాని భవంతి మహతామపి" అను బహు విఘ్ననిశ్చయసంభవాభిప్రాయముచే శ్రీ తుకారాం మహారాజుగారి "హరిపాఠము" నుండి నమస్కారాత్మక మంగళము అంతరాయబాహుళ్య నివృత్త్యర్థము సంగ్రహింపబడుచున్నది.

**2. అభంగము :-**

**నమీలా గణపతి మాఉలీ సారజా ।**
**ఆతాం గురురాజా దండవత ॥1॥**

**గురురాయా చరణేం మస్తక ఠేవిలా ।**
**ఆపుల్యా స్తుతీలా ద్యావీ మతీ ॥2॥**

**గురురాయా తుజ ఐసా నాహీఁ సఖా ।**
**కృపాకరూనీ రంకాధరీ హాతీఁ ॥3॥**

**తుకా మ్హణే మాతా పితాగురు బంధు ।**
**తూఁచీ కృపా సింధు పాండురంగా ॥4॥**

(శ్రీ తుకారాం మహారాజు హరిపాఠము నుండి)

ప్ర.ప :- గణపతి = శ్రీవిఘ్నేశ్వరు(నికి) ; మా ఊలీ = తల్లి (యైన) ; సారజా = శారదాదేవికి ; నమిలా = నమస్కరించితిని ; ఆతాఁ= ఇప్పుడు ; గురురాజా = గురుదేవునకు ; దండవత = సాష్టాంగ దండవత్ ప్రణామములు. 1. (సమర్పిస్తూ) ; గురురాయ చరణేఁ = శ్రీ గురురాయుని చరణకమలములందు, (నాయొక్క) మస్తక = శిరస్సును; ఠేవిలా= ఉంచితిని ; (హే గురుదేవా!) ; ఆపుల్యా = మీయొక్క; స్తుతీలా = స్తుతిచేయుటకు ; మతీ = బుద్ధిని; ద్యావీ= ప్రదానము చేయండి, 2. గురురాయా = హే గురుదేవ! తుజ ఐసా = నీవంటి ; సఖా= మిత్రుడు ; నాహీఁ = లేదు; (హే గురుదేవ!) రంకా = (ఈ దీనునిపై ; కృపా కరూనీ= దయజేసి; హాతీధరీ = చేత బట్టండి ; 3. తుకామ్హణే = తుకారాం మహారాజు అంటున్నారు ; పాండురంగా= హే పాండురంగా ; మాతా పితా గురు బంధు = తల్లి, తండ్రి, గురువు మరియు బంధువు(అన్నియును నీవే), తూఁచీ = నీవే ; కృపా సింధు = దయా సాగరుడవు (ఉన్నావు). 4.

తా॥ సకలప్రతి బంధకములను నిర్మూలించు పార్వతీ పరమేశ్వరనందనుడైన శ్రీ విఘ్నేశ్వరునకు, సకల విద్యలకధిష్ఠాన దేవతా, చదువుల తల్లియైన శ్రీ సరస్వతీదేవికి మరియు సర్వైశ్వర్యములతో సుశోభితుడైన శ్రీ విఠల రూప గురుదేవుల యొక్క చరణారవిందములకు సాష్టాంగ దండవత్ప్రణామములు చేయుచుంటిని. 1. సర్వ సమర్థుడు, సర్వ

నియంత యయిన శ్రీ గురుదేవుల పదకమలములయందు శిరస్సు నుంచి, నిన్ను న్స్తుతింప నమర్థమగు బుద్ధిని నాకు ప్రసాదింపుమని వేడుకుంటున్నాను. 2. హే గురురాయా! నీ వంటి యాప్తమిత్రుడు లేడు. ఈ దీనుని కరణించి నీ దరికి జేర్చుకొని చేయూతనిమ్ము. 3. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు - హేపాండురంగా! తల్లివి, తండ్రివి, గురువు మరియు బంధువు - నాకు సర్వము నీవే సుమా! నన్ను రక్షించు దయాసాగరుడవు నీవే. 4.

సు.వ్యా :- శ్లో ॥ శైవైస్త్వదీయైరుత వైష్ణవైశ్చ
శాక్తైశ్చ సౌరైరపి సర్వ కార్యే ।
శుభాశుభే లౌకిక వైదికే చ
త్వమర్చనీయః ప్రథమం ప్రయత్నాత్ ॥

హే విఘ్నేశ్వరా! శైవులుగాని, గాణపత్యులుగాని, వైష్ణవులుగాని, శాక్తేయులుగాని మరియు సౌర్యేయులు గాని, సకల దేవతా ఉపాసకులెవరైనా గాని - లౌకికములేగాని, వైదికములే గాని సర్వశుభాశుభకార్యములందు ప్రథమమున ప్రయత్నముచే నవశ్యముగా నిన్నారాధించియే కార్యారంభము చేయదగినది. అని త్రిపురాసురవధావసరమున శివవచనము. కావున సర్వులకు పరమ ప్రయోజనకారియైన ఈ సద్గ్రంథము యొక్క శుభారంభమున కోరి శ్రీగణపతి వందనము నాచరించుట శ్రేయోదాయకము.

శా॥ తల్లీ నిన్నుఁ దలంచి పుస్తకము చేతం బూనితిన్నీవు నా
యుల్లంబందుననిల్చి జృంభణముగా నుక్తుల్సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ
పుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ పూర్ణేందు బింబాననా.

అని శ్రీమదాంధ్ర భాగవతారంభమున శ్రీపోతనామాత్యులు నుడివినట్లు, మరియు

**శ్లో॥ నమస్తే శారదే దేవి, కాశ్మీర పురవాసినీ ।**
**త్వా మహం ప్రార్థయే నిత్యం, విద్యాదానం చ దేహి మే ॥**

ఓ కాశ్మీరదేశ వాసియైన శారదాదేవి! నీకు వందనము. నేను నిన్ను విద్య (అహం బ్రహ్మాస్మి యను నధ్యాత్మ జ్ఞానము) నపేక్షించి ప్రతి నిత్యము హృత్పూర్వకముగా ప్రార్థిస్తున్నాను. కావున నో దేవీ! నాకు విద్యాదానము చేయుము ఈ "సరస్వతీ రహస్యోపనిషత్" వచనానుసారము గ్రంథాది యందు విద్యాప్రాప్తిని మరియు గ్రంథరచన స్ఫూర్తిని కోరి సర్వ విద్యలకధిష్ఠాత్రి దేవతయైన శ్రీ శారదాదేవి యొక్క స్మరణము, వందనము సకల బుధజనసమ్మతము -

**శ్లో ॥ యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ ।**
**తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ॥**

**తా॥** ఏమహా పురుషునకు తనకిష్టమైన దైవమునందు యెటువంటి మహోత్కృష్టమైన భక్తి గలదో, అట్లే పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీ గురుదేవుని యందు పరమ భక్తి యున్న యెడల, ఆ మహాత్మునకు వేదాంత శాస్త్రములలో చెప్పబడిన గుహ్య తత్త్వము సులభముగా, సుస్పష్టముగా, నిస్సందేహముగా దెలియబడును. అని శ్వేతాశ్వతరోపనిషత్తు తెలియ పరచు చున్నది. మరియు శ్రీవిచారసాగరమునందు- దోహా॥

**ఈశ్వర్ తై c గురూ మై c అధిక, ధారై భక్తి సజాన ।**
**బిన గురు భక్తి ప్రవీనహూ, ల హై న అ తమ జ్ఞాన ॥**

**తా॥** సుజనుడైన పురుషుడు, ఈశ్వరుని యందు యెటువంటి ఉత్కృష్టమైన భక్తిని గలిగి యుండునో - అంతకంటె అత్యధిక భక్తిని

శ్రీగురుదేవులయందుంచవలయును. ఎందుకనగా? సకల శాస్త్ర ప్రవీణుడైనప్పటికిని గురూపదేశమును (తత్త్వమసీత్యాది వాక్యోపదేశము) పొంది విచార శబ్ద వాచ్య శ్రవణ మనన మరియు నిధిధ్యాసనములు చేయనిదే ఆత్మ జ్ఞానమును పొందడు - ముక్తుడు కానేరడు. ఈ శ్రీ సాధు నిశ్చలదాసు స్వామి యొక్క సువచనమును బట్టి, మోక్షమును గోరు ప్రతివాడు అత్యావశ్యకముగా శ్రీసద్గురుదేవులను శరణు బొందకుండా, గురుభక్తుడు గాకుండా ఎన్నడునూ కృతార్థుడు గానేరడు అని తేట తెల్లమగుచున్నది. 1.

కావున శ్రీతుకారాం మహారాజుగారు శ్రీగురుదేవులే సర్వస్వమని భావించి సాష్టాంగ దండవత్ నమస్కారములు చేసి కరుణా సముద్రుడైన శ్రీగురుదేవులను (శ్రీవిఠలుని) స్తుతించుటకు సుయోగ్యమైన సద్బుద్ధిని ప్రసాదించమని భక్తి ప్రపత్తులచే వేడుకుంటున్నాడు. 2.

“యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహా. తై.ఉ. 2-4-1 ఏ పరబ్రహ్మ పరమాత్మ (విఠలుని) ను స్తుతించుటకు (విషయము చేయుటకు) మనస్సుతో సహితముగా ప్రవృత్తమయిన వాణి పరమాత్మను పొందలేక (విషయము చేయలేక) వెనుదిరిగి వచ్చెనో - అటువంటి అవాఙ్మానసగోచరమైన విఠలుని స్తుతించడమెలా సాధ్యమని శంకించవలదు. ఎందుకనగా? ఏ విధముగా చందన వృక్షము తన యొక్క నికటవర్తి యన్య వృక్షమునందు తన సుగంధమును సంచరింపజేయునో మరియు నగ్ని సంబంధమయిన ఇనుము నందు అగ్ని తనయొక్క ఉష్ణతను ప్రకాశతను ఏవిధముగా ప్రసరింపజేయునో, అట్లే తన యొక్క అనన్య భక్తుడు, చరణ సేవకుడు మరియు మందమతియైన నా (గ్రంథకర్త)లో శ్రీ విఠలుడు గ్రంథ రచనా స్ఫూర్తిని ప్రసరింపజేసి, స్వయముగా తానే యీ యుపాధిద్వారా

గ్రంథరచనాకార్యమును చేయుచున్నాడు. "శ్రోతా వక్తా తూంచీ దేవా" (అభంగము. 277) "భర్తా ఆణీ భోక్తా కర్తా ఆణీ కరవితా నారాయణ" (అభంగము. 1184) చేసేవాడు, చేయించుకునే వాడు సర్వము విఠలుడే. నేను కేవలము లేఖకుని చేతిలోని లేఖనము (కలము) వలె కరణము (సాధనము)ను మాత్రమే. హరి స్మరణాత్మక మంగళాచరణముచే విఘ్నములు (ప్రతిబంధకములు) సమూలముగా నశించును గావున హర్షోత్కర్షచే శ్రీపాండురంగని స్తుతిస్తూ గ్రంథము యొక్క శుభారంభము చేయబడుచున్నది.

జై జై పాండు రంగ హరి ......
జై జై రామకృష్ణ హరి ......

బోలా.. పుండరీక వరద ... హరి విఠల్ .. శ్రీ జ్ఞానదేవ్, తుకారాం పండరినాథ్ మహారాజ్ కీ ... జై ...

**3. అభంగము :-**

**సుందర తేం ధ్యాన ఉభేం విటేవరీ ।**
**కర కటావరీ ఠేవూనియా ॥1॥**

**తులసీ హార గళా కాసే పీతాంబర ।**
**ఆవడే నిరంతర హేంచీ ధ్యాన ॥2॥**

**మకరకుండలేం తళపతీ శ్రవణీం ।**
**కంఠీ కౌస్తుభమణి విరాజిత॥3॥**

**తుకామ్హణే మాఝేం హేంచీ సర్వసుఖ ।**
**పాహీన శ్రీముఖ ఆవడీనేం ॥4॥ (14)**

ప్ర.ప :- కటావరీ = నడుముపైన; కర = చేతులు ; ఠేవూనియా= ఉంచి, విటేవరీ = ఉటుకపైన, ఉభే = నిలుచున్న ; తే ధ్యాన = ఆ

ధ్యానము (ఆ రూపము) సుందర = (అతిశయ) సుందరము. 1. గళా = మెడ(లో) ; తుళసీహార = తులసీమాల; కాసే= (కాశె) నడుమునకు ; పీతాంబర = పసుపు వన్నెవస్త్రము ; (గల) ; హే ౘీ = ఈ (రూపము) యొక్క ; ధ్యాన = ధ్యానము ; (నాకు) నిరంతర= ఎల్లపుడు ; ఆవడే = ఇష్టము (ఉన్నది). 2. (ఎవరి యొక్క) శ్రవణీం = కర్ణముల (చెవుల) యందు; మకరకండలేం = మకరాకారకుండలములు ; తళపతీ = శోభిస్తూ (ఉన్నాయో); (మరియు) కంఠీ = కంఠమునందు, కౌస్తుభమణి = కౌస్తుభమణి, విరాజిత = ప్రకాశించు చున్నదో. 3. తుకామ్హణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు. (అటువంటి) శ్రీముఖ = ఐశ్వర్య యుక్త (ఆ విఠలుని) ముఖమును; ఆవడీనే = ప్రేమతో ; పాహీన = (ఎల్లపుడు) చూస్తూ ఉండగలను, హే ౘీ = ఇదే ; మాఝె = నాకు, సర్వసుఖ = సర్వసుఖము (ఉన్నది). 4.

**తా॥** నడుముపై చేతులిడుకొని ఇటుకపై నిలచిన ఏధ్యానము శ్రీవిఠలేశుని యొక్క విగ్రహము (స్వరూపము) గలదో, అది అతిశయ సుందరము. 1. మెడలో తులసీమాల, నడుమున పీతాంబరమును ధరించి యున్న "రంగ"ని యొక్క అఖండ ధ్యానమే నాకు మిక్కిలి యిష్టము. 2. ఎవరి యొక్క కర్ణపుటముల యందు మకరాకారకుండలములు ప్రకాశిస్తూ ఉన్నాయో, కంఠము నందు కౌస్తుభమణి శోభిస్తున్నదో, 3. ఆ మోహనాకార, సకలైశ్వర్యములు నిక్షిప్తమై యున్న శ్రీ "రంగని" యొక్క సుందర శ్రీముఖమును, ప్రేమతో నిరంతరము దర్శిస్తూ ఉండడమే నాకు సర్వ సౌఖ్యము. విఠలునియొక్క దివ్యమంగళశ్యామసుందరవిగ్రహ దర్శనానందము ముందు త్రైలోక్య సుఖము గూడ తుచ్ఛమని భావము. 4.

4. అభంగము :-

సదా మాఝె డోళే జడో తుఝీ మూర్తీ ।
రఖుమా ఈచ్యా పతీ సోయరియా ॥1॥

గోడ తుఝెం రూప గోడ తుఝెం నామ ।
దేఈం మజ ప్రేమ సర్వకాళం ॥2॥

విఠో మా ఉలియే హేంచి వర దేఈం ।
సంచరోని రాహీం హృదయామాజీం ॥3॥

తుకా మ్హణే కా హీం న మాగేం ఆణిక ।
తుఝె పాయీం సుఖ సర్వ ఆహే ॥4॥(15)

ప్ర.ప :- సోయరియా! = ఓ నా ప్రాణమా! (ప్రియమైన రంగా!), రఖుమా ఈచ్యా పతీ = రుక్మిణీదేవి యొక్క వల్లభ! (రుక్మిణీనాథ!) ; మాఝె= నాయొక్క ; డోళె = కన్నులు ; సదా = ఎల్లప్పుడు ; తుఝీ = నీయొక్క మూర్తీ = విగ్రహము (స్వరూపము) యందు ; జడో = ఆసక్తమై యుండునట్లు (అనుగ్రహింపుము). 1. తుఝె = నీయొక్క ; రూప = రూపము ; గోడ = మధురము ; తుఝె = నీ యొక్క, నామ = నామధేయము, గోడ = మధురము, (అందువలన) మజ = నాకు ; సర్వకాళ = ఎల్లవేళల యందు; ప్రేమ =(నీయొక్క) భక్తిని ; దేఈం = ప్రసాదించుము. 2. విఠో = విఠల (నామముతో విఖ్యాతి నొందిన) ఓ; మావులియే = తల్లీ! హేంచి = ఇదే (నాకు) వర = వరమును, దేఈ ం = ఇవ్వుము, హృదయామాజీం = హృదయమునందు ; సంచరోని = సంచరించి (ప్రవేశించి), రాహీ ం = ఉండుము. 3. తుకా మ్హణే = శ్రీ తుకారాం మహారాజు గారంటున్నారు ; (ఇంతకు మించి) ఆణిక= ఇతరములైన, కాహీ ం = ఏమియును గూడ;

న మాగే = (నిన్ను) కోరను, (ఎందుకనగా), తుఝె = నీయొక్క; పాయీం= చరణకమలముల చెంతనే ; సర్వ సుఖ = సమస్తసుఖము ; ఆహే = ఉన్నది. 4.

తా॥ ప్రాణాధారమైన ఓ రంగా! రుక్మిణీ వల్లభ! మనోహరమైన నీ శ్యామసుందర మూర్తియందు నా లోచనద్వయమఖండముగా నాకర్షింప బడునట్లనుగ్రహింపుము. 1. కృష్ణా! నీరూపము మధురము, నామము మధురాతిమధురము. నాకు నీ రూప నామములయందే యకుంఠితమైన, అనన్యమైన ప్రేమ లక్షణభక్తి సర్వకాల సర్వావస్థల యందు దృఢపడునట్లు కరుణించుము. 2. హే విఠూ మావులీ! (విఠల రూప తల్లీ!) నీవు నిరంతరము నా హృదయమందిరమందే వసించియుండునని వరమును ప్రసాదించుము3 శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు - రంగా! ఇంతకు మించి నిన్ను త్వద్వ్యతిరిక్త ఐహిక, పారలౌకిక సౌఖ్యములేమియునుం గోరను. ఎందుకనగా! నీ చరణ సాన్నిధ్యములోనే సర్వసుఖములు ప్రాప్త మగు చుండ అన్యమునేల నపేక్షించెదము స్వామీ! 4.

సు.వ్యా :- శ్రీ తుకారాం మహారాజుగారు తనయొక్క నేత్ర యుగళము శ్రీ పాండురంగని దివ్య మంగళ మూర్తిపైనే అఖండముగా నాకర్షింపబడి యుండునట్లను గ్రహింపుమని కోరుట వలన నుపలక్షణము (అనుక్త సూచకము) చేత సర్వేంద్రియములను గ్రహించాలి. 1. "రసో వై సః" (తై. ఉ. 2-7) "రసం హ్యేవాఽయం లబ్ధ్వాఽనందీ భవతి" ఈ తైత్తిరీయ శ్రుతి చెప్పినట్లు పరమాత్మయే (విఠలుడే) రస (ఆనంద) స్వరూపుడు. పరమాత్మయొక్క ఆనందముచేతనే విశ్వమంతయు చేష్ట చేయుచున్నది, ప్రాణులన్ని జీవించుచున్నవి. చక్కెర తీపిగా ఉంటుంది. చక్కెర బొమ్మ గూడ తీపిగానే యుంటుంది. అట్లే నిర్గుణ నిరాకార పరమాత్మ ఆనందరూపుడే

మరియు సగుణ సాకార పరమాత్మ విఠలుడు (కృష్ణుడు) గూడ ఆనంద స్వరూపుడే. కావున భగవంతుని యొక్క నామము మధురము , రూపము మధురము, ప్రత్యవయవము మధురము, తాను ధరించిన వస్తువు మధురము. తాను చరించిన భూమి మధురము. సర్వము మధురాతి మధురము.

అధరం మధురం వదనం మధురం,
నయనం మధురం హసితం మధురమ్ ।
హృదయం మధురం గమనం మధురం,
మధురాధిపతేరఖిలం మధురమ్ ॥

వేణుర్మధురో రేణుర్మధురః,
పాణిర్మధురః పాదౌ మధురౌ ।
నృత్యం మధురం సఖ్యం మధురం,
మధురాధిపతేరఖిలం మధురమ్ ॥

గీతం మధురం పీతం మధురం,
భుక్తం మధురం సుప్తం మధురమ్ ।
రూపం మధురం తిలకం మధురం,
మధురాధిపతేరఖిలం మధురమ్ ॥

ఈ ప్రకారముగా శ్రీ వల్లభాచార్యులు మాధవుని యొక్క మాధుర్యమును గ్రోలుతూ మైమరచి కీర్తించాడు.

**తా॥** గోవిందుని యొక్క పెదవులు మధురము, శ్రీముఖము మధురము, నేత్రములు మధురము, నవ్వు మధురము, హృదయము మధురము, నడక మధురము, మధురాధిపతి యొక్క సర్వము మధురము.

మురళీధరుని యొక్క పిల్లనగ్రోవి మధురము, పాదరేణువులు మధురము, చేతులు మధురము. పాదములు మధురము, నాట్యము

మధురము, స్నేహము మధురము, మధురాధీశుని యొక్క సర్వము మధురము.

గోపాలుని యొక్క గానము మధురము, పానము మధురము, భోజనము మధురము, శయనము మధురము, రూపము మధురము, తిలకము మధురము, శ్రీమధురాధిపతి యొక్క సర్వము మధురాతి మధురము. 2.

ఇటువంటి మనమోహన ఆనందకంద శ్రీకృష్ణచంద్రునియొక్క అందములొలుకు సుందరమూర్తి యందఖండ దృఢభక్తిని, మరియు ఎల్లపుడు తన హృదయ మందిరముననే సంచరిస్తూ ఉండాలని శ్రీతుకారాం మహారాజుగారు శ్రీవిఠలుని వరము నిమ్మని వేడుకుంటూ. 3. భగవంతుని కంటె భిన్నమయిన భోగజాతము వలదని విన్నవించుకున్నాడు. ఎందుకనగా! కోరిన కోర్కెలు ఈడేర్చే కామధేనువు లాంటి శ్రీ విఠలుని చరణారవిందమకరంద మాధుర్యమును నిత్యము సేవించు మనోభృంగము, దుఃఖమిశ్రితములు, పరిచ్ఛిన్నములు నయిన క్షుద్రానందములనేల నపేక్షించును? శ్రీమద్భాగవతములో పరమ భాగవతోత్తముడయిన శ్రీప్రహ్లాదస్వామియును ఇదే విషయమును వివరించాడు.

సీ॥ మందార మకరంద మాధుర్యమునదేలు,
మధుపంబు బోవునే మదనములకు ।
నిర్మల మందాకినీ వీచికల దూగు,
రాయంచ జనునె తరంగిణులకు ।
లలితరసాల పల్లవఖాదియై చొక్కు,
కోయిల జేరునే కుటజములకు ।

పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకో
-రకంబరుగునే సాంద్రనీహారములకు ।

గీ॥ అంబుజోదర దివ్య పాదారవింద,
చింతనామృత పాన విశేషమత్త ।
చిత్తమే రీతి నితరంబు జేర నేర్చు,
వినుతగుణ శీల మాటలు వేయినేల? ॥

కావున భక్తునికి భగవచ్చరణములే శరణ్యము. 4.

5. అభంగము :-

ఖడా రవాళీ సాఖర । ఝూలా నామాచాచీ ఫేర ।
న దిసేఁ అంతర । గోడీ తాయీఁ నివడితాం ॥1॥

తుమ్హీ ఆమ్హీ పాండురంగా । భిన్న ఐసే కాయ సాంగా ।
చాళవిలేఁ జగా । మీ హే ఁ మాఝే యాసాఠీ ॥2॥

పాయీఁ హోతీఁ నాకీఁ శిరీఁ । హేమ రాహేఁ అళంకారీఁ ।
ముసేఁ ఆల్యావరీ । కాయ నివడేఁ వేగళేఁ ॥3॥

నిజలియా లాభ హాని । తోఁచ ఖరీ తే స్వప్నీఁ ।
తుకామ్హణే దోన్హీ । నివారలీ జాగతాం॥4॥ (1905)

ప్ర.ప :- ఖడా సాఖర= ఖండశర్కర ; రవాళీ (సాఖర) = సామాన్య పంచదార (చక్కెర) ; (ఈ రెండింటిలో) నామాచాచీ = నామ మాత్రమైన, ఫేర = భేదము; ఝూలా = అయినది (ఉన్నది);(కాని వాటిని గూర్చి) నివడితాం= విచారించి; తాయీఁ = (వాటి స్వరూపమును) తెలిసికున్నట్లయితే; గోడీ = తీపితనములో, అంతర = (ఏమాత్రము గూడ) భేదము ; న దిసే= అగుపడుట లేదు. (ప్రతీతి అగుటలేదు)1. పాండురంగా=

హే పాండురంగా!; తుమ్హీ = మీ(లో); ఆమ్హీ = మా(లో) ; ఐసేం= ఇటువంటి (ఈ) ; భిన్న= భేదము, కాయ = ఏమిటి? (ఎక్కడిది) ; సాంగా= చెప్పండి ;జగా = లోకులను; మీ = నేను ; హే మాఝేం = ఇది నాది; యా సాఠీ = దీని కొరకు (ఈ భ్రమలో), చాళవిలేం = నడిపించినావు (పడదోసినావు),2. (స్త్రీల యొక్క) పాయీం= కాళ్ళయందు ; హాతీం= చేతులందు ; నాకీం = ముక్కున; శిరీం = తలయందు (భిన్న భిన్నమైన) ; హేమ = బంగారు ; అళంకారీం = ఆభరణములు; రాహేం = ఉంటాయి, (కాని ఆ ఆభరణములను) ముసే ం = మూసలో(వేసి) ; ఆల్యావరీ = కరిగించి నట్లయితే, నివడేం= విచారించి చూసిన వేగళే = భేదము ; కాయ= ఉంటుందా?. 3. తుకామ్హణే = శ్రీతుకారాం మహారాజు అంటున్నారు, నిజలియా = నిద్రించినపుడు (నిద్రా దోషమున్నంతవరకు); స్వప్నీ = స్వప్నములో (గలిగిన) ; లాభ హాని = లాభనష్టములు, తోంచ = అవియే; ఖరీ = సత్యములని (పించును) ; (ఒక్కసారి) జాగతాం = మేల్కొంచిన పిమ్మట; తే దోన్హీ = ఆరెండు (లాభనష్టములు), నివారలీ = బాధితములగుచున్నవి (నివృత్తములగుచున్నవి). 4.

**తా॥** ఖండ శర్కర మరియు సామాన్య శర్కర (చక్కెర), ఈ రెంటిలో నామమాత్ర భేదమే ఉంది, కాని వాటి యథార్థ స్వరూప విచారణ చేసినచో తీపిదనములో మాత్రము యత్కించిద్భేదము లేదు. 1. అదే విధముగా, హే పాండురంగా! నీకు మరియు మాకు భేదమెక్కడిది చెప్పు. ఈ లోకులను అహంకార, మమకారరూప భ్రమలో పడదోసావు. లేనిచో పాండురంగనికి మరియు జీవునికి ఏమాత్రము భేదము లేదు. 2. స్త్రీల యొక్క పాదముల యందు, చేతులయందు, ముక్కున, మరియు శిరస్సునందు భిన్నభిన్నమైన ఆకార విశేషము గల బంగారు ఆభరణములుంటాయి. కాని వాటిని

మూసలో వేసి కరిగించిన వాటి యథార్థ స్వరూపమైన బంగారమునందు ఏమాత్రమైనా భేదముంటుందా? 3. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు – ఎంత వరకు నిద్రారూప దోషముంటుందో, అంతవరకు స్వప్నము నందు గలుగు లాభ నష్టములు సత్యముగ దోచును. కాని మేల్కొంచిన పిదప ఆ రెండును (లాభ నష్టములు) బాధ నొందును. (మిథ్యాత్వ నిశ్చయమగును) అదే విధముగా ఎంత వరకు (స్వరూపాజ్ఞానము) అవిద్యారూప దోషముండునో, అంతవరకు పాండురంగడు పరోక్షుడు, జీవుడు పరిచ్ఛిన్నుడను భేదభ్రమ సురక్షితము. కాని ఆత్మత్వముచే పాండురంగని సాక్షాదపరోక్షానుభవము ఎప్పుడు గలుగునో, అప్పుడు భేద భ్రాంతి బాధించును. 4.

సు.వ్యా :– సకల వేద, శాస్త్రముల సారము, తత్త్వమస్యాది వేదాంత వాక్యముల తాత్పర్య భూత విషయము, జీవబ్రహ్మల యొక్క ఐక్యము. ఇదియే శ్రీ తుకారాం మహారాజుగారి యొక్క ఉపదేశసారము, గ్రంథము యొక్క ముఖ్యోద్దేశమును ఈ అభంగము ద్వారా ఉద్ఘోషించుచున్నారు. అభంగములోని మొదటి చరణములో జీవ బ్రహ్మల (విఠలుని) యొక్క స్వరూపైక్యమును తెలియజేయుటకు దృష్టాంతమును ప్రదర్శించారు. ఖండ శర్కర యొక్క రూపము, (తెలుపు), తీపిదనము, పిండి మొదలైన పదార్థములను తనవలెనే తీయగా మార్చు గుణములేవి గలవో, అవి యన్నియు సాధారణ (వాడుకలోని) చక్కెరలో గూడ నున్నవి, గావున వీటిలో నామ మాత్ర భేదమే గలదు గాని స్వరూపముచే నభేదము గలదు, మరియు నగ్ని విస్ఫులింగాదులను గూడ నెఱుఁగవలెను. 1. అదే విధముగా – రెండవ చరణములో దార్ష్టాంతమును తెలియ జేస్తూ హే పాండురంగా! నీకు మరియు మాకు భేదమెక్కడిది. చెప్పండి. నీలో ఏ సచ్చిదానందాది

విశేషణములు గలవో, అవి మాలో గూడ ఉన్నందున నీవు, మేము భిన్నులము కాదు. "సత్యం జ్ఞానం" (తై.ఉ. 2-1-1), "విజ్ఞానమానందం బ్రహ్మ" (బృ.ఉ. 3-9-28) ఇత్యాది శ్రుతులు బ్రహ్మము (విఠలుడు) సచ్చిదానంద రూపుడని తెలుపుచున్నవి. ఈ లక్షణము (స్వరూపము) జీవుడు గూడ గలిగి యున్నాడనుటకనేక శ్రుతులు ప్రమాణములు -

**న జాయతే మ్రియతే వా విపశ్చి-**
**న్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్ ।**
**అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే ॥** (కఠ.ఉ. 1-2-18)

**తా॥** ఈ విపశ్చిత్ - మేధావీ ఆత్మా ఉత్పన్నము కాదు, మరణించదు, ఇది ఏయితరమైన కారణమునుండి ఉత్పన్నము కాదు, స్వతః (అర్థాంతరరూపముచే) తన నుండి తాను కలుగ లేదు. అందువల్లనే ఈ ఆత్మ జన్మ రహితము, నిత్యము (ఎల్లపుడు ఉండునది), శాశ్వతము మరియు పురాతనము అదే విధముగా శరీరము మరణించినను తాను మరణించదు.

అవినాశీ వాఽరే అయమాత్మాఽనుచ్ఛిత్తి ధర్మా (బృ.ఉ. 4-5-14) ఓ మైత్రేయీ ఈ ఆత్మకు వికారరూప నాశనము గాని ఉచ్ఛేద రూప నాశనము గాని లేదు. ఈశ్రుతులచే నాత్మ నిత్యమని సిద్ధించుచున్నది. ఏది నిత్యమో అది సత్యముంటుంది. "నిత్యత్వం - సత్యత్వం, తద్యస్యాస్తి తన్నిత్యం - సత్యం, తథా చాఽస్థా గోచరః" (భామతీ - పృష్ఠము - 83). నిత్యత్వమనగా - సత్యత్వము. ఆ సత్యత్వము దేని యందుండునో, ఆ సత్యపదార్థము సర్వథా శ్రద్ధేయము, ఉపాదేయము. కావున ఆత్మ (స్వరూపము) సద్రూపమున్నది. 1.

"అత్రాయం పురుషః స్వయంజ్యోతిర్భవతి" (బృ.ఉ. 4-3-9) "న హి విజ్ఞాతు ర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే" (బృ.ఉ. 4-3-30) "నిద్రలో ఈ

పురుషుడు స్వయంప్రకాశుడుగా ఉంటాడు", "విజ్ఞాత యొక్క విజ్ఞానానికి వినాశము లేదు "ఇత్యాది శ్రుతులు "ఆత్మ"- జ్ఞాన స్వరూపమున్నదని నుడువు చున్నవి. 2.

అద్వితీయ ఆత్మయే జీవునికి నిరపేక్షిక ఆనందమున్నది.

"ఏషోఽ స్య పరమ ఆనందః" (బృ.ఉ. 4-3-32)

"తదేతత్ప్రేయః పుత్రాత్ప్రేయో విత్తాత్ప్రేయోఽ న్యస్మాత్సర్వ స్మాదంతరతరం యదయమాత్మా" (బృ.ఉ. 1-4-8) ఆ ఈ ఆత్మతత్త్వము ప్రియమున్నది. పుత్రునికంటె అధిక ప్రియమున్నది. ధనముకంటె నధిక ప్రియమున్నది. మరియు దేహాదిక సర్వ వస్తువులకంటె నతిశయ ప్రియమున్నది. ఎందుకనగా ఆత్మ ఆత్మే తరములన్నింటి అపేక్షచేనాంతరతరమున్నది. ఇత్యాది శ్రుతులచే నాత్మ ఆనందరూపమున్నదని సిద్ధించుచున్నది. 3. కావున ఆత్మకు బ్రహ్మ (విఠలుని) యొక్క సచ్చిదానంద రూప లక్షణముతో సరిపడుచున్నందున పాండురంగనికి జీవునికి భేదము లేదు. ఇంతే గాకుండా "తత్త్వమసి" (ఛాం. ఉ. 6-8-7) అది (బ్రహ్మము) నీవైయున్నావు. "అయమాత్మా బ్రహ్మ" (బృ.ఉ. 2-5-19) ఈ ఆత్మ బ్రహ్మమున్నది. "తదేవ బ్రహ్మ త్వం విద్ధి"(కేన.ఉ. 1-4) ఆ బ్రహ్మమే నీవని తెలియుము. ఇత్యాది శ్రుతులచే జీవబ్రహ్మల ఏకత్వము ధ్వనితమగుచున్నది. ఇదియే సకల వేద శాస్త్రముల తాత్పర్య భూత విషయమున్నందున పాండురంగనికి, మాకు నామమాత్రభేదమే తప్ప స్వరూపముచే భేదము లేదని నిశ్చయమైనది. మరియు యుక్తులచే గూడ జీవబ్రహ్మలయొక్క అభేదము సునిశ్చితము - "ప్రత్యగాత్మా బ్రహ్మ బ్రహ్మాభిన్నుడు, సచ్చిదానందరూపుడున్నందున, బ్రహ్మవలె" ఇత్యాద్యనుమాన ప్రయోగములు.

**శ్లో॥ ఘటాకాశ మఠాకాశౌ మహాకాశే ప్రతిష్ఠితౌ ।**
**ఏవం మయి చిదాకాశే జీవేశౌ పరికల్పితౌ ॥** (వ.ఉ. 2-50)

**తా॥** ఘటాకాశము మరియు మఠాకాశము మహాకాశము నందే కల్పించబడినవి. ఘట, మఠరూపోపాధులను తొలగిస్తే, మహాకాశమే యవశిష్టమై యుండును. అట్లే చిదాకాశ స్వరూపుడైన నాయందు జీవేశ్వరులు కల్పితులు. మాయాఽ విద్యా రూపోపాధులను బాధించినచో శుద్ధచైతన్యమే మిగులును.

**శ్లో॥ అహమస్మి సదా భామి, కదా చిన్నాహమప్రియః ।**
**బ్రహ్మైవాహమతః సిద్ధం, సచ్చిదానందలక్షణమ్ ॥**

అద్వైతమకరందం-2

**తా॥** నా యొక్క అస్తిత్వము, భాతిత్వము (ప్రకాశకత్వము) మూడవస్థల యందు, మూడు కాలముల యందును ఉన్నది. అట్లే నెనెప్పుడు నప్రియుడను కాను. (అనగా నేనెప్పుడూ పరమప్రీతికి విషయమునై యున్నాను.) అందువలన బ్రహ్మమునకు యే నచ్చిదానంద లక్షణత్వమున్నదో, అది నాయందును సంభవించు చున్నందున నేను బ్రహ్మమునే యైయున్నాను. ఇత్యాద్యనుభవము చేతను బ్రహ్మాత్మల యొక్క అభేదరూప ఫలితార్థము నిష్పన్నమగుచున్నది. కావున హే పాండురంగా! శ్రుతి, యుక్తి మరియు ననుభవముచే నీకు, మాకు నామమాత్ర భేదమే గాని, స్వరూపముచే నభేదమున్నదని నిర్ణయించనైనది. విఠలా! ఇప్పుడు చెప్పు నీకు, మాకు భేదమెక్కడిది? అమాయకులైన లోకులను అహంకార మమకారరూప భ్రమలో పడద్రోసినావు గావున భేదము భాసించుచున్నది. లేనిచో నీకు (పాండురంగనికి), జీవునికి ఏమాత్రము భేదము లేదు - అని శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు. 2. ఇదే విషయమునకు పుష్టినిస్తూ స్త్రీల ఆభరణముల దృష్టాంతమును ప్రదర్శించాడు. మూడవ చరణములో 3.

జీవుడు స్వయముగా సాక్షాత్పాండురంగడై యుండగా, నేను భక్తుడ (ఉపాసకుడ)నని, పాండురంగడు నా ఆరాధ్య దైవము (ఉపాస్యము) అని ఈ భేద భ్రమకు హేతువును సర్వానుభవ దృష్టాంతముచే స్పష్టీకరిస్తున్నాడు – శ్రీ తుకారాం మహారాజుగారు. ఎంత వరకు నిద్రారూప దోషముండునో, అంత వరకు స్వప్నము మరియు స్వాప్నిక వ్యవహారము సత్యముగ దోచును. నిద్రనుండి మేల్కాంచిన యెడల స్వప్నము, స్వాప్నికలాభనష్టములేవియును గోచరించవు. మిథ్యాత్వ నిశ్చయరూప బాధనొందును. అట్లే ఎంతవరకు (స్వరూపాజ్ఞానము) అవిద్యారూప దోషముండునో అంతవరకు పాండురంగడు పరోక్షుడు, జీవుడు పరిచ్ఛిన్నుడని, విఠలుడు ఉపాస్యము, నేను ఉపాసకుడనను భేద భ్రాంతి నిర్బాధ్యము. కాని బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముచే నాత్మత్వ రూపముచే పాండురంగని, సంశయ విపరీత భావనా రహిత సాక్షాదపరోక్షానుభవమెప్పుడు గలుగునో, అప్పుడు సకారణ భేద భ్రమ (అధ్యాస) ఆత్యంతిక నివృత్తి నొందును.

**శ్లో॥** ముక్తిస్తు బ్రహ్మతత్త్వస్య జ్ఞానాదేవ న చాన్యథా ।
స్వ ప్రబోధం వినా నైవ స్వస్వప్నో హీయతే యథా ॥
(వేదాంత పంచదశి. 6–210)

**తా॥** బ్రహ్మతత్త్వమును తెలిసికొనిన మాత్రమే ప్రతిబంధకరూప అవిద్యా నివృత్తి ద్వారా మోక్షము లభించును, వేరొండు మార్గము లేదు. తాను నిద్రనుండి మేలుకొననిదే తన స్వప్నము నివృత్తి కాదుగదా.

మరియు "తరతి శోకమాత్మవిత్" (ఛాం.ఉ. 7–1–3), "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" (ముం.ఉ. 3–2–9), ఆత్మజ్ఞాని శోకమును (అవిద్యా తత్కార్యరూప సంసారమును) దాటుతాడు. బ్రహ్మము నెఱింగినవాడు బ్రహ్మ మే యగుచున్నాడు. ఇత్యాది మంత్రవర్ణములు ప్రమాణములు. 4.

జీవునికి ముక్తి లభించవలెనన్న మోక్షప్రతిబంధకమైన అజ్ఞానము ఆత్యంతిక నివృత్తి నొందవలెను. అందుకు శ్రీపాండురంగని యొక్క యథార్థ స్వరూపమును బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానము ద్వారా ఆత్మత్వముచే నెఱుంగవలయును. విఠలుని యాథాత్మ్య జ్ఞానముచే నజ్ఞానము నివర్తించును. జ్ఞానము కలుగుటకు తత్త్వమస్యాది వేదాంతవాక్యవిచార శబ్దవాచ్య శ్రవణ, మనన, నిధిధ్యాసములు చేయవలయును. అందులకు వివేక, వైరాగ్య, షట్సంపత్తి మరియు ముముక్షుత్వమను సాధన చతుష్టయ సంపత్తి మొదలగునంతరంగ సాధనలు గలిగియుండవలెను. ఈ యంతరంగ సాధనలు ప్రాప్తించుటకు ఈశ్వరనామోచ్చారణ మరియు నుపాసనాదులచే చిత్తైకాగ్రత గలిగి, మరియు ఈ జన్మలోగాని, జన్మాంతరములలోగాని కామ్య నిషిద్ధ వర్జనపురఃసర నిత్య, నైమిత్తిక, ప్రాయశ్చిత్తాది విహితకర్మలను ఈశ్వరార్పణ బుద్ధిచే (నిష్కామముచే) చేసి నిఖిల కల్మషములు నిర్గతమైన వాడై, నితాంతనిర్మలాంతఃకరణముగలవాడై ప్రమాతా (అధికారి) పురుషుడుండవలెనని శాస్త్రోక్తి. కావున నంతఃకరణశుద్ధి కొరకు బహిరంగ సాధనములైన వేద విహిత స్వస్వ వర్ణాశ్రమోచిత కర్మలు కర్తవ్యములని శ్రీతుకారాం మహారాజుగారు ఉపదేశించుచున్నారు.

**6 అభంగము :-**

వేద విహిత తుమ్హీ ఆ ఇకా హెూ కర్మేం ।
బోలతో తీ వర్మేం సంతాపుఢే ॥1॥

చారీ వర్ణ ఝూలే ఎకాచియే అంగీం ।
పాపపుణ్య భాగీం విభాగిలే ॥2॥

ప్రథమ పావులీం పావవిలా పంథ ।
ఆది మధ్య అంతభేద నాహీం ॥3॥

**అంబే బోరీ వడ బాభుళా చందన ।**
**గుణా గుణ భిన్న అగ్ని ఏక ॥4॥**

**తుకామ్హణే మన ఉన్మన జో హెూయ ।**
**తోc వరీ హేసోయ విధి పాళీ ॥5॥ (968)**

ప్ర.ప :- వేదవిహిత కర్మేc = వేదములో ఆయా వర్ణాశ్రమములకు విధానము చేసిన కర్మలు ; తీ= (మరియు) వాటిలోని ; వర్మే = రహస్యములను ; సంతాపుఢే = సత్పురుషుల ముందు ; తుమ్హీ = మీకు; బోలతో = చెప్పుచున్నాను ; ఆఇకా = వినండి, హెూ = అహెూ! ; 1. ఎకాచియా అంగీ = ఒకే ఒక (హరి) నుండి; చారీవర్ణ = (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర) నాలుగు వర్ణములు, ఝాలే = ఉత్పన్నములైనవి (వారివారి) పాపపుణ్య = పుణ్యాపాపముల; భాగీc= భేదము (తారతమ్యము) వల్లనే ; విభాగిలే = వర్ణ భేదము (ఉచ్ఛనీచ భావము) ఏర్పడినది. 2. ప్రథమ పా ఉలీc = మొదటి అడుగులోనే, పంథ = మార్గము (తాను చేరుకోవలసిన గమ్యమును), పావవిలా = పొందినట్లయిన (చేరుకున్నట్లయిన)చో, ఆది = మొదలు ; మధ్య = నడుమ ; అంత = చివర ; (అను) భేద = భేదము ; నాహీ c = ఉండదు ; 3. అంబే = మామిడి ; బోరీ = రేగు (బదరీ), వడ = వట(మర్రి), బాభుళా = తుమ్మ (ముండ్ల చెట్టు); చందన= చందనము (మొదలగు చెట్లు), గుణాగుణ = (వాటి వాటి) గుణదోషములచే, భిన్న = భిన్న భిన్నములైననూ), అగ్ని = అగ్నిలో వేసి కాల్చినచో ; ఏక= ఏకరూపములగును. 4. తుకా మ్హణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు ; మన = మనస్సు ; ఉన్మన = నిర్వృత్తికము ; జోహెూయ = ఎప్పుడగునో, తో cవరీ = అంతవరకు; విధి= వేదవిహిత కర్మలను ; పాళీ = పాటించాలి. (అచరించాలి) ; హే = ఇది, సోయ = (మనుష్య మాత్రులకు) హితమును గూర్చు ఉపాయము. 5.

**తా॥** ఆయా వర్ణాశ్రమాల వారికి చెప్పబడిన వేద విహిత కర్మల యొక్క రహస్యమును సత్పురుషులను సాక్షిగా బెట్టి మీకు చెప్పుచున్నాను – వినండి. 1. ఒకే పరమాత్మ నుండి నాలుగు వర్ణములు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర) సృష్టింపబడినవి. వారి వారి యొక్క గుణబేదము, కర్మ భేదము ననుసరించి వర్ణ భేదములు, ఉచ్చనీచ భావములు నిర్మింప (ఏర్పరుప) బడినవి. 2. మొదటి అడుగులోనే చేరుకోవలసిన (గ్రామము) ప్రాప్తించినచో, మార్గమునకు ఆది మధ్యాంతములుండవు. 3. మామిడి చెట్టు, రేగు చెట్టు (బదరీ వృక్షము), వట(మఱ్ఱి) వృక్షము, తుమ్మ లేదా ముండ్ల చెట్టు, మరియు చందన వృక్షము మొదలగు చెట్లు వాటి వాటి గుణదోషాలచే భిన్నభిన్నములైనను అగ్నిలో పడవేసినపుడు మాత్రము వాటి వాటి గుణ దోషాలను వదిలేసి ఏకరూపమవుతాయి. 4. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు. ఎంత వరకు "శ్రీహరి" యొక్క దృఢ అపరోక్ష జ్ఞానముచే దేహేంద్రియ సంఘాతమును, దేశ, కాల, ఘట పటాది బాహ్య ప్రపంచమును విస్మరించి మనస్సు ఉన్మనీభావము (నిర్వృత్తికము) నొందదో, అంతవరకు వారి వారి వేద విహిత కర్మలను శ్రద్ధతో ఆచరించాలి. అది వారి కళ్యాణము (హితము)నకు హేతువగును. 5.

సు.వ్యా :– ఓ జనులారా! సంతు మహాత్ముల యెదుట వేద విహిత కర్మల యొక్క రహస్యము నెఱింగించెదను, సావధానచిత్తులై శ్రద్ధతో వినండి. 1.

**శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః ।**
**తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥**

(శ్రీమద్భగవద్గీతా. 4-13)

**తా॥** బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య మరియు శూద్ర - అను నాలుగు వర్ణములు, వారి వారి గుణ, కర్మల ననుసరించి నాచే సృష్టింపబడినవి. ఈ విధముగా సృష్టి రచనాది కర్మకు నేనే కర్తనైనప్పటికి అవినాశి పరమేశ్వరుడనైన నన్ను వాస్తవముగా నకర్తగానే నెఱుంగుము అని ఈశ్వర వచనము. 2.

"తీవ్ర సంవేగానామాసన్నః" (యో.సూ. 1-21) పతంజలి భగవాన్ చెప్పినట్లు ఎవరైతే కృతోపాసకులై యుండి (అభంగము. 771) విహంగ మార్గము నవలంబించి (ఈ న్యాయము ననుసరించి) అతి శీఘ్రముగా "హరి" తత్త్వము నెఱుంగుదురో, వారికి మంద, మధ్యమోత్తమాది భేదముచే సకామకర్మ, నిష్కామకర్మ మరియు నుపాసనాది సాధనాక్రమము (పిపీలికామార్గము) నవలంబించవలసిన యవసరము లేదని తృతీయ చరణము యొక్క భావము. 3. గుణ దోషాలతో విభిన్నమైన వృక్షజాల మగ్నిలో ప్రక్షిప్తమైనపుడు వాటి గుణదోషాలను, నామరూపాలను త్యజించి ఏవిధముగా ఏక (అగ్ని) రూపమగుచున్నవో, అట్లే "హరి" తత్త్వము నెఱింగిన పిమ్మట జీవుని యొక్క అనాద్యవిద్యా పరికల్పిత నామరూపములు, వర్ణాశ్రమములు జ్ఞానాగ్నిచే ప్రదగ్ధమై విశుద్ధ చైతన్యము (విఠలుని)లో నేకరూపమగును. అత్తఱి పూర్వ వృత్తి ద్వైతము అనగా కర్తా, కరణము, కర్మ మరియు ఫలము - ఇత్యాది సంపూర్ణ వ్యవహారము సమసిపోవును. వర్ణాశ్రమాది భిన్నత్వము భిన్నమై హరితో నభిన్నమై పోవును. "యత్ర త్వస్య సర్వమాత్మైవా భూత్తత్కేన కం పశ్యేత, తత్కేన కం జిఘ్రేత్" (బృ.ఉ. 4-5-15). ఏ అవస్థలో ఈ విద్వానునికి సమస్త ద్వైతము ఆత్మయే అయిందో (ఆత్మ అనగా స్వరూపముగా నెఱుంగబడినదో). అప్పుడు దేనిచే దేనిని చూచును, దేనిచే దేనిని యాఘ్రాణించును. "యథా నద్యః స్యందమానాః సముద్రేఽస్తం గచ్ఛంతి నామరూపే విహాయ"( ముం.ఉ. 3-2-8.) ఏవిధముగా నదులు

ప్రవహించి సముద్రమును చేరి నామరూపములను వదలి సముద్రముతో ఏక రూపమును పొందునో అట్లే విద్వాన్ పురుషుడు నామ రూపాత్మకమైన, వర్ణాశ్రమాది సంపూర్ణద్వైతమును వదిలి, ప్రకృతి కంటే పరమైన, స్వప్రకాశమైన, స్వాత్మా భిన్న పురుషున్ని చేరుతాడు. ఇత్యాది మంత్ర వర్ణములు ప్రమాణములు. 4. శ్రీతుకారాం మహారాజుగారు స్వాభిప్రాయమును వ్యక్తము చేస్తూ అంటున్నాడు - ఎంతవరకు "హరి"యొక్క అపరోక్ష జ్ఞానముచే దేహాదిక ప్రపంచము విస్మరింపబడి మనస్సు ఉన్మనీ భావము (నిర్వృత్తికము)ను పొందదో, అంతవరకు స్వవర్ణాశ్రమోచిత కర్మలను శ్రద్ధతో విధిపూర్వకముగా నాచరించవలయును. అవి మానవమాత్రులకు హితమును చేకూర్చును.

శ్లో॥ యజ్ఞదాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ (భ.గీ. 18-4)

తా॥ యజ్ఞము, దానము, మరియు తపోరూప వేదశాస్త్ర విహిత (శ్రౌత, స్మార్త) కర్మలు త్యాగము చేయుటకయోగ్యములు ఎందుకనగా! యజ్ఞము, దానము, మరియు తపోరూప విహితకర్మలు ఫలాభిసంధిరహిత బుద్ధిమంతులు కర్తవ్యములని యెంచి చేయదగినవి. అవి యంతఃకరణ శుద్ధి ద్వారా మోక్షమునకు హేతువులగునని శ్రీమద్భగవద్వచనము. 5.

**7. అభంగము :-**

బ్రహ్మా చారీ ధర్మ ఘోకావీం అక్షరేం ।
ఆశ్రమీం విచార షట్కర్మీం ॥1॥

వానప్రస్థ తరీ సంయోగీం వియోగ ।
సంన్యాస తో త్యాగ సంకల్పాచా॥2॥

**పరమహంస తరీ జాణే సహజ వర్మ ।**
**తెథెయాతి ధర్మ కుల నాహీఁ ॥3॥**

**బోలే వర్మ జో చాలే యా విరహిత ।**
**తో జాణా పతిత శ్రుతి బోలే ॥4॥**

**తుకా మ్హణే కాంహీఁ నాహీఁ నేమా విణ ।**
**మోకళాతో సీణ దుఃఖ పావే ॥5॥ (979)**

ప్ర.ప :- బ్రహ్మాచారీ = బ్రహ్మాచారియొక్క ; ధర్మ = ధర్మము (ఏమనగా) ; అక్షరేఁ = వేదములను, ఘోకావీ ఁ = అధ్యయనముచేయవలెను; ఆశ్రమీ ఁ= గృహస్థుడు, షట్కర్మీ = ఆరు కర్మలను ; విచార = విధి నిషేధములను విచారించి విహిత కర్మలనాచరించవలెను, 1. వానప్రస్థ = వానప్రస్థుడు, సంయోగీఁ= స్త్రీని త్యాగము చేయక పరిగ్రహించి ; తరీ = ఉన్నప్పటికి ; వియోగ = మనస్సుచేనపరిగ్రహవృత్తితో నుండవలెను, సన్యాస తో = సన్యాసి యయితే; సంకల్పాచా = (దేహ స్త్రీ, పుత్రాదులకు సంబంధించిన) సంకల్పమును (గూడ); త్యాగ = త్యాగము చేయవలెను. 2. సహజ = బ్రాహ్మీస్థితి ;(యొక్క) వర్మ = రహస్యము ; జాణే = ఎఱిఁగిన, పరమహంసకు, తరీ = అయితే; తెథె = అక్కడ (ఆస్థితిలో) ; యాతి = జాతి, ధర్మ = ధర్మము; కుళ - కులము; (మొదలగు విధినిషేధములు) నాహీ ఁ = లేవు (ఉండవు,3. జో = ఏదైతే ; వర్మ = (వేదవిహితకర్మ) రహస్యమును; బోలే = చెప్పితినో; యా = దీనిని ; విరహిత = ఉల్లంఘించి (ఎవరైతే) ; చాలే = ప్రవర్తించునో, తో = అతడు ; పతిత = పతనమగునని; జాణా = తెలియండి; (ఈవిషయమును), శ్రుతి = వేదము ;బోలే = చెప్పుచున్నది. 4. తుకామ్హణే = శ్రీతుకారాం మహారాజు గారంటున్నారు; (నేను చెప్పిన ధర్మనియమములను) కాహీ ఁ = ఏమి (ఏవి) గూడ ;

నాహీం= పాలించరో; (మరియు) నేమావిణ = నియమము తప్పి, మోకళా = స్వేచ్ఛా చారి యగునో; తో = అతడు ;సీణ = కష్టమును, దుఃఖ = దుఃఖమును, పావే = పొందవలసి వచ్చును( అనుభవించవలసి వచ్చును). 5.

**తా॥** బ్రహ్మచారి గురుగృహములో ఉంటూ వేదాధ్యయనము చేయుచుండవలెను. గృహస్థులు షడ్విధ కర్మలను (యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము మరియు ప్రతిగ్రహము) ఆచరించవలెను. విధినిషేధములను చక్కగా పరిశీలించి వారి వారికి నియమించిన విహిత కర్మలను దేశ, కాలాది నియమానుసారము ఆచరించుచుండవలెను. 1. వానప్రస్థులు శిఖాయజ్ఞోపవీతములను త్యజించకుండా, లేదా స్త్రీ త్యాగము చేయకుండా పరిగ్రహించి యున్నప్పటికి మనస్సుతో న పరిగ్రహవృత్తి గలిగి గ్రామములో గాని, వనములో గాని ఉంటూ తాపస జీవనమును గడుపుతూ "హరి" చింతనాదులను చేయుచుండవలెను. సన్యాసులు విధిపూర్వకముగా సర్వసంగపరిత్యాగము చేసి, దేహము, స్త్రీ పుత్రాది విషయక యిచ్ఛను బాహ్యాభ్యంతరమున త్యాగము చేసి శ్రవణాదులను జేయుచుండవలెను. 2. ఎవరైతే సహజావస్థను (బ్రాహ్మీస్థితిని) పొందిన పరమహంసలుంటారో, వారు జీవ, జగత్ మరియు బ్రహ్మముయొక్క నిజస్వరూపము నెఱింగి వర్తమానదేహములోనే విదేహస్థితిని అనుభవించుదురు, గాన వారికి జాతి, కుల మరియు వర్ణాశ్రమ ధర్మములు (విధినిషేధములు) ఏవి గూడ యుండ నేరవు. 3. నేను చెప్పిన వర్ణాశ్రమోచిత వేదవిహిత కర్మరహస్యములనుల్లంఘించి చరించువారు నిశ్చయముగా పతనమగుదురు. ఇది నా స్వకపోల కల్పనగాదు, మరేమనగా వేదమే వారిని నిందించినది. 4. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - ఎవరైతే విధినుల్లఘించి ధర్మ నియమములను పాటించరో మరియు స్వతంత్రముగా

యథేష్టాచరణము జేయుదురో, వారు ఇహ,పరములందు దుఃఖమునకు పాత్రులగుదురు. ఉభయ భ్రష్టులగుదురని తాత్పర్యము. 5.

**సు.వ్యా :** 1. బ్రహ్మచర్యవ్రతమును పాటిస్తూ బ్రహ్మచారి గురుకులములో వేదాధ్యయనము చేయుచుండవలెను. బ్రహ్మచర్యమనగా!

**శ్లో॥ దర్శనం స్పర్శనం కేళిః కీర్తనం గుహ్యభాషణమ్ ।**
**సంకల్పోఽ ధ్యవసాయశ్చ క్రియా నిర్వృత్తి రేవ చ ॥**

**ఏత న్మైథునమష్టాంగం ప్రవదంతి మనీషిణః ।**
**విపరీతం బ్రహ్మచర్య మనుష్ఠేయం ముముక్షుభిః ॥**

(కఠరుద్రోపనిషత్. 6,7)

**తా॥** స్త్రీలయొక్క దర్శనము, స్పర్శనము, వారితో క్రీడించుట, కీర్తించుట (వారిని గూర్చి స్తుతించుట, చర్చించుట), కామతత్త్వ సంబంధ రహస్య సంభాషణము, కామ - సంకల్పము, సంభోగ ప్రయత్నము, సంభోగక్రియ. ఈ ఎనిమిది విధముల మైథునత్యాగమే బ్రహ్మచర్య మనబడును. మముక్షువులచే నిది యనుష్ఠింపదగినది.

పైన జెప్పబడిన బ్రహ్మచర్య వ్రతమును పాటిస్తూ గురుకులవాసియై బ్రహ్మచారి వేదాధ్యయనము చేయాలి.

2. గృహస్థులు షట్కర్మయుక్తులై నియమిత విహిత కర్మానుష్ఠానము గలిగి యుండవలెను. షట్కర్మలనగా!

**శ్లో॥ అధ్యాపనమధ్యయనం యజనం యాజనం తథా ।**
**దానం ప్రతిగ్రహశ్చైవ, షట్కర్మాణ్యగ్రజన్మనః ॥**

(మనుస్మృతి. 10-75)

తా॥ అధ్యాపనము, (వేద) అధ్యయనము, యజ్ఞము చేయుట, దానము చేయుట మరియు దానమును స్వీకరించుట యను నారు కర్మలు బ్రాహ్మణులకు విధానము చేయబడినవి. మిగతా వర్ణముల వారికి కొన్ని మినహాయించి (తగ్గించి) చెప్పబడినవి - మనుస్మృతిలో చూడండి. ఇంతే గాక గృహస్థుడు ఎంత అహింసా వ్రతము పాలించు చున్నవాడైనను అతని ద్వారా అనివార్యమైన ఐదు హింసలు జరుగుచుండును. అవి ఏవి? అనగా!

శ్లో ॥ పంచసూనా గృహస్థస్య చుల్లీ పేషణ్యుపస్కరః ।
కండనీ చోదకుంభశ్చ బధ్యతే యాస్తు వాహయన్ ॥
(మ.స్మృ. 3-68)

తా॥ అనివార్యమైన ఐదుపాపములు గృహస్థునికి కలుగుచుండును. 1. చుల్లీ = పొయ్యిలో కట్టెలిడి వండుచున్నప్పుడు కట్టెలలోని క్రిములు మరణించును. 2. పేషణి = విసురు రాయిలో గాని, రోలులో నూరు చున్నపుడు గాని ప్రాణిహింస జరుగును, 3. ఉపస్కరః = చీపురుతో ఊడ్చునప్పుడు - మొదలగు రీతులచే ప్రాణి హింస జరుగును. 4. కండనీ = కూరగాయలు కోయునపుడు గాని, ధాన్యాదులను దంచునపుడు గాని హింస జరుగును. 5. ఉదకుంభ = నీటిని వేడిచేయునపుడు ప్రాణిహింస జరుగును. (ఇల్లు కట్టునపుడు, వ్యవసాయము పనులు చేయునపుడు గూడ విరివిగా ప్రాణినాశనము జరుగును. అవి అన్నియు ఈ ఐదింటిలోనే అంతర్భూతము చేయవలెను) ఈ ఐదు పాపములను చేస్తూ గృహస్థుడు పాపముచే బద్ధుడగుచున్నాడు.

ఈ ఐదు తెఅంగుల పాప నివృత్తికి మహర్షులు గృహస్థులకు ఐదు మహాయజ్ఞములను వరుసగా విధించారు.

**శ్లో॥ అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణమ్ ।**
**హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనమ్ ॥**
(మ. స్మృ. 3-70)

**తా॥** 1. బ్రహ్మయజ్ఞము = వేదము, ఉపనిషత్, భగవద్గీతాది పారాయణము, ప్రణవాది మంత్రజపము, భగవత్కీర్తన పూజాదులు. వీనిలో నేదేని నొకదానినైనను నాచరించక గృహస్థుడు ఆహారము గ్రహించరాదు.

2. పితృయజ్ఞము = తర్పణాదులచే పితరులను తృప్తి పరచుట, 3. దైవ యజ్ఞము = అగ్ని యందు దేవతలనుద్దేశించి యాహుతులు వేయుట (వైశ్వదేవము),

4. భూతయజ్ఞము = కుక్కలకు, పిల్లులకు, కాకులకు పరాన్నభుక్కులైన జీవులకు ఆహారమిడుట. 5. నృ (మనుష్య) యజ్ఞము = అతిథిసత్కారము మొదలగునవి.

**శ్లో॥ పంచైతాన్యో మహాయజ్ఞాన్ న హాపయతి శక్తితః ।**
స గృహేఽపి వసన్నిత్యం సూనాదోషైర్నలిప్యతే ॥ (మ.స్మృ. 3-71)

**తా॥** ఎవడీ యైదు మహాయజ్ఞములను వీడక యథాశక్తిగా నాచరించునో, అతడు గృహస్థాశ్రమియైనను పంచసూనాది దోషము లైదునతని నంటవు. 1.

3. వానప్రస్థుల విషయములో మనుస్మృతి యందు ఈ విధముగా చెప్పబడినది.

**శ్లో॥ గృహస్థస్తు యదా పశ్యే ద్వలీ ఫలితమాత్మనః ।**
**అపత్యస్యైవచాపత్యం తదాఽరణ్యం సమాశ్రయేత్ ॥**
(మ.స్మృ. 6-2)

**తా॥** గృహస్థుడెపుడు తన మోమున ముడతలను, నెఱసిన తన శిరమును గాంచునో, మరియు తన పుత్రునికి పుత్రుడు పుట్టుట జూచునో, ఆ వెంటనే గృహస్థాశ్రమమును వీడి వానప్రస్థమును స్వీకరించి యరణ్యమునకుం జనవలెను.

**శ్లో॥** సంత్యజ్య గ్రామ్య మాహారం సర్వంచైవ పరిచ్ఛదమ్ ।
పుత్రేషు భార్యాం నిక్షిప్య వనం గచ్ఛేత్సహైవ వా ॥
(మ.స్మృ. 6-3)

**తా॥** సాధారణముగా గృహస్థాశ్రమములో సేవించు కట్వామ్ల లవణాది ఆహారములను మాని కందమూలాది ఫలములను గైకొనుచు, పరిజనమును సంపూర్ణముగా వదిలేసి, భార్యను పుత్రులకప్పగించి, ఆమెకిష్టమున్నచో నపరిగ్రహ వృత్తి గలిగి వెంట నిడుకొని వనమునకు c జనవలెను.

**4. ముఖ్యముగా** సంన్యాసము ద్వివిధము. 1. వివిదిషా సంన్యాసము 2 విద్వత్సంన్యాసము. సాధన చతుష్టయ సంపన్నుడై తత్త్వజ్ఞానమును బడయుటకై స్వీకరించునది వివిదిషా సంన్యాసము. "కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయం లోక ఇతి తే హ స్మ పుత్త్రైషణాయాశ్చ, విత్తైషణాయాశ్చ, లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షా చర్యం చరంతి" (బ్ర.ఉ. 4-4-22)

ఆత్మలోకము నిచ్ఛగించు త్యాగీ పురుషుడు ఈ విధముగా విచారించును. ఈ (పుత్రాది) ప్రజలచే మాకేమి ప్రయోజనమున్నది. మాకు ఆత్మలోకము (స్వ స్వరూపస్థితి) యభీష్టమున్నది. (ఇట్లు చింతించి) ఆ విరక్త పురుషులు పుత్రేషణ, విత్తేషణ, మరియు లోకేషణ నుండి విముఖులై భిక్షావృత్తిని - స్వీకరించుచున్నారు. ఈ శ్రుత్యనుసారము విరక్త పురుషుడు

బాహ్యాభ్యంతరములందు దేహ, స్త్రీ, పుత్రాదులకు సంబంధించిన యిచ్ఛను త్యజించి విధిపూర్వకముగా సర్వసంగపరిత్యాగము చేయవలయును. "యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" (తై.సం. 1-5-9-1) ఇత్యాది నిత్యకర్మలను గృహస్థులకు విధించినట్లు వివిదిషా సంన్యాసులకు గూడ శాస్త్రము నిత్యకర్మగా వేదాంత శ్రవణమును విధానము చేసినది.

**శ్లో॥ నిత్యం కర్మ పరిత్యజ్య వేదాంత శ్రవణం వినా ।**
**వర్తమానస్తు సన్యాసీ పతత్యేవ న సంశయః ॥**

**తా॥** అగ్నిహోత్రము, సంధ్యోపాసనాది నిత్యకర్మలను పరిత్యజించిన వివిదిషా సన్యాసి వేదాంత శ్రణము చేయక జీవించిన నతడు పతనమగును.

**శ్లో॥ దినే దినే తు వేదాంత శ్రవణం భక్తిసంయుతాత్ ।**
**గురుశుశ్రూషయా లబ్ధాత్ కృచ్ఛ్రాశీతి ఫలం లభేత్ ॥**

**అర్థము :-** ప్రతి దినము భక్తి పూర్వకముగా గురు శుశ్రూషాలబ్ధమైన వేదాంత శ్రవణం చేయడం వల్ల ఎనభై కృచ్ఛ్రవ్రతాలు చేసిన ఫలం పొందుతాడు.

**శ్లో॥ త్వం పదార్థవివేకాయ సన్యాసః సర్వ కర్మణామ్ ।**
**శ్రుత్యాభిధీయతే యస్మాత్తత్త్యాగీ పతితో భవేత్ ॥**

**తా॥** "తత్త్వమసి" మహావాక్యములోని "త్వం" పద వాచ్యమైన అంతఃకరణ విశిష్ట చైతన్యమును వివేకము చేసి (అంతఃకరణ రూపోపాధి నుండి వేరుజేసి) లక్ష్యార్థమైన ప్రత్యక్ చైతన్యమును బ్రహ్మగా నెఱుంగుట కొరకే అగ్ని హోత్ర సంధ్యోపాసనాది సంపూర్ణ కర్మల యొక్క సంన్యాసమును శ్రుతి విధానము చేసింది. వివిదిషా సన్యాసి త్వం పదార్థవివేకము చేయనిచో పతితుడగునని శ్రీ సురేశ్వరాచార్యులు నుడివిరి.

"అరున్ ముఖాన్ యతీన్ శాలా వృకేభ్యః ప్రాయచ్ఛమ్" (కౌ.ఉ. 3-1) వేదాంత విచారము (శ్రవణము) చేయని సన్యాసులను చంపి కుక్కలకు, తోడేళ్ళకు ఆహారముగా వైచితినని ఇంద్రుడు ప్రతర్ధనునితో అన్నాడు. కావున వివిదిషా సంన్యాసులు సర్వ సంగ పరిత్యాగులై వేదాంత (తత్త్వమస్యాది వాక్య) విచారము నెల్లపుడు చేయు చుండవలెను. 2.

బ్రహ్మచర్య, గృహస్థ మరియు వానప్రస్థాశ్రమములలో నుండియు, వివేకాది సాధనసంపన్నుడై యుండి, వేదాంత విచారముచే బ్రహ్మసాక్షాత్కారము నొందిన తత్త్వవేత్త పురుషుడు చిత్త విక్షేపనివృత్తి మరియు జీవన్ముక్త విలక్షణానంద ప్రాప్తిని గోరి యే సంన్యాసమును స్వీకరించునో, నది విద్వత్సంన్యాసమనబడును. ఎల్లపుడు సహజావస్థలో నుండు నీ పరమహంసలు, జీవ జగత్ మరియు బ్రహ్మలయొక్క యథార్థ స్వరూపము నెఱింగి, దేహములోనే విదేహస్థితి ననుభవించుదురు – గావున వీరికి జాతి, కులము మొదలగు వర్ణాశ్రమ ధర్మములు, విధి నిషేధములుండవు.

శ్లో॥ న వర్ణా న వర్ణాశ్రమాచారధర్మా
న మే ధారణాధ్యానయోగాదయోఽపి ।
అనాత్మాశ్రయాహం మమాధ్యా సహానాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్ ॥

**తా॥** వర్ణ = బ్రాహ్మణ, క్షత్రియాది, ఆశ్రమ = బ్రహ్మచర్య, గృహస్థాది; ఆచార= స్నాన, శౌచాది; ధర్మ= బ్రహ్మచర్య గురుసేవాది ; ధారణా= బాహ్య ఘటపటాది విషయములను త్యాగము జేసి మనస్సును బ్రహ్మము నందు స్థిరపరచుట; ధ్యాన= పరమాత్మ చింతన ; యోగ = చిత్తవృత్తి నిరోధము ; ఆది శబ్దముచే శ్రవణ, మనన నిధిధ్యాసములు సహితము నివి యన్నియు నేను గాను, నావి గావు. ఇవి నాయందు

అత్యంతభావములున్నవి. ఎందుకనగా నివి యన్నియు అనాత్మ = ఆత్మ విరోధి యవిద్యా, ఆశ్రమము = ఉపాదానకములున్నవి. అహంకార మమకార రూపాధ్యాసకు మూలమైన యవిద్యా తత్త్వ జ్ఞానముచే నాశమొందుట వలన అవిద్యాప్రయుక్త వర్ణాశ్రమాది వ్యవహారములు నాయందత్యంతాభాములున్నవి. అవిద్యాతత్కార్యము విద్యచే నశించగా నవశిష్టమైన అద్వితీయము, మంగళ (ఆనంద) స్వరూపము, నిర్ధర్మకమునయిన శుద్ధమైన సాక్షి చైతన్యమునే నేను. శ్రీ జగద్గురు ఆద్యశంకరాచార్య "దశశ్లోకి" వచనానుసారము పరమ హంసలకు వర్ణాశ్రమాది ధర్మములు, విధినిషేధములు లేవని తెలియుచున్నది. 3.

నాలుగవ చరణములో శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు. ఓ జనులారా! ఈ విషయము జ్ఞప్తి యందుంచుకొనుడు. ఏమనగా! నేను చెప్పిన వేద విహిత వర్ణాశ్రమాది నియత కర్మలను గూర్చిన రహస్యములను పాలించక నెవడుల్లఘించునో వాడు "పతితు"డగును. ఇది నా స్వకపోలకల్పనగాదు. వేదమే (శాస్త్రమే) చెప్పుచున్నది. "కపోల కల్పన" అనగా మిథ్యా వచనమని యర్థము.

**శ్లో॥ మృగతృష్ణాంభసి స్నాతః ఖపుష్పకృతశేఖరః ।**
**ఏషవంధ్యా సుతో యాతి శశిశృంగ ధనుర్ధరః ॥**

**తా॥** వంధ్యా సుతుడు (గొడ్రాలి కొడుకు) మృగజలము నందు స్నానము జేసి, ఆకాశపుష్పమును తలను దాల్చి, కుందేలు కొమ్మును ధనుషుగా గైకొని గంధర్వవనమునకు యుద్ధమునకు వెళ్ళుచున్నాడు.

పై వచనములన్నియునేవిధముగా మిథ్యా (అసత్యము)లో, నేను చెప్పిన కర్మరహస్యములు అలాంటివి గావని శ్రీతుకారాం

మహారాజుగారంటున్నారు. ఇదే విషయమును స్పష్టీకరిస్తూ నేను చెప్పిన వర్ణాశ్రమవిహిత కర్మానుష్ఠానము (పాలనము) చేయుకనెవడు యింద్రియార్థములందు యథేచ్ఛగా సంచరించునో, వాడు ఇహపర సౌఖ్యములకు పాత్రుడు కాడు. మోక్షమునకైతే నతి దూరుడని శ్రీతుకారాం మహారాజుగారు చెప్పుచున్నారు.

అథైనయోః పథోర్న కతరేణ చ న తానీమాని క్షుద్రాణ్యసకృదావర్తీని భూతాని భవన్తి, జాయస్వ మ్రియస్వేత్యేతత్తృతీయం స్థానమ్" (ఛాం.ఉ. 5-10-8)

వేద (శాస్త్ర) విధి నుల్లంఘించిన కపూయ చరణులు (పాపాచారులు) అర్చిరాది మార్గమున గాని, ధూమ మార్గమునగాని జనక (చచ్చుట, పుట్టుట) జాయస్వ మ్రియస్వ మను తృతీయ మార్గమునలంబించుదురు. (అనగా కుక్క, పంది, క్రిమి, కీటకాది యోనులను పొందుదురని భావము)

**శ్లో॥ యశ్శాస్త్ర విధిముత్సృజ్య వర్తతే కామకారతః ।**
**న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్ ॥** (గీత. 16-23)

**తా॥** ఎవరైతే శాస్త్ర విధిని త్యజించి యథేచ్ఛా(ష్టా) చరణము చేయునో, వాడు సిద్ధిని (అంతఃకరణ శుద్ధిని) పొందదు, ఇహపర సౌఖ్యము నొందదు మరియు పరమగతిని (మోక్షమును) గూడ పొందుటకనర్హుడు అని భగవద్వచనము. 5.

పై రెండు అభంగములలోని శ్రీతుకారాం మహారాజుగారి యొక్క అభిప్రాయము - ఎంతవరకు హరియొక్క అపరోక్ష జ్ఞానముచే దేహాదిక ప్రపంచము యొక్క విస్మృతి గలిగి మనస్సు ఉన్న నీ భావమును పొందదో లేదా పరమహంసలకువలె సహజావస్థ ప్రాప్తము కాదో అంతవరకు స్వస్వ

వర్ణాశ్రమ ధర్మాచరణ విహిత కర్మానుష్ఠానము అవశ్యము చేయు చుండవలెను. విపరీతముగా చరించినచో నా మనుష్యుడు "పతితు"డగును.

శ్లో॥ అకుర్వన్ విహితం కర్మ నిందితం చ సమాచరన్ ।
ప్రసక్తశ్చేంద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతే నరః ॥ (మ.స్మృ. 11-44)

శ్లో॥ విహితస్యా ననుష్ఠానాన్నిందితస్య చ సేవనాత్ ।
అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి ॥
తస్మాత్తేనేహ కర్తవ్యం ప్రాయశ్చిత్తం విశుద్ధయే ॥
(యాజ్ఞవల్క్యస్మృతి 3-219, 220)

పై రెండు స్మృతులు యొక్క అర్థము :- ఎవరైతే విహిత కర్మలను చేయక, నింద్యమైన కర్మలు చేస్తూ, ఇంద్రియార్థములందాసక్తుడై యుండునో, ఆ మనుష్యుడు వర్తమానదేహముండగనే ప్రత్యవాయ నివృత్యర్థము ప్రాయశ్చిత్తము జేయువలెను. (ఏదైనా ఒక కర్మ యథావిధిగా చేయకపోయినా, చేయవలసిన కర్మ చేయకపోయినా కలుగు దుష్ఫలితం (పాపం, దుఃఖం) "ప్రత్యవాయమ"నబడును)

"తస్మాదజ్ఞేనాధికృతేన కర్తవ్యమేవ కర్మ" ఇతి ప్రకరణార్థః. ప్రాగాత్మజ్ఞాన నిష్ఠా యోగ్యతా ప్రాప్తేః తాదర్థ్యేన కర్మానుష్ఠానమధికృతేన అనాత్మజ్ఞేన కర్తవ్యమేవ ఇత్యేతత్" నకర్మణామనారంభాత్" (గీత. 3-4) ఇత్యతః ఆరభ్య "శరీర మాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః" । (గీత. 3-8) ఇత్యేవ మన్తేన ప్రతిపాద్య "యజ్ఞార్థా త్కర్మణోన్యత్" (గీత. 3-9) ఇత్యాదినా "మోఘం పార్థ సజీవతి". (గీత. 3-16) ఇత్యేవమన్తేన అపి గ్రంథేన ప్రాసంగికమ్ అధికృతస్య అనాత్మవిదః కర్మానుష్ఠానే బహుకారణముక్తమ్. తదకరణే చ దోష సంకీర్తనం కృతమ్.

**అర్థము :-** అందువల్ల ఆత్మ జ్ఞానం లేని కర్మాధికారి కర్మలు చేస్తూనే ఉండాలి అనేది ఈ ప్రకరణం (ఘట్టం)లో ప్రతిపాదించబడిన అర్థము. ఆత్మజ్ఞాననిష్ఠకు యోగ్యత లభించుటకు పూర్వం, అలాంటి యోగ్యత లభించడం కోసం కర్మల యందధికారం గల ఆత్మజ్ఞానరహితుడు కర్మయోగం చేయాలి, అని "న కర్మణామనారంభాత్" మొదలు కొని "శరీర యాత్రాఽపి చ తే" వరకు ఉన్న గ్రంథం చేత ప్రతిపాదించి, ప్రసంగవశం చేత అనాత్మజ్ఞుడైన కర్మాధికారి కర్మలు అనుష్ఠించాలి - అనడానికి అనేక కారణాలు చెప్పి, కర్మలు చేయక పోవడం దోషం అని కూడ చెప్పబడింది (శ్రీమద్భగవద్గీతా శాంకర భాష్యమ్ 3-16)

**8. అభంగము :-**

కులధర్మే జ్ఞాన కులధర్మే సాధన ।
కులధర్మే నిధాన హోతా చఢే ॥1॥

కులధర్మే భక్తి కులధర్మే గతి ।
కులధర్మే విశ్రాంతి పావలీల ॥2॥

కులధర్మే దయా కులధర్మే ఉపకార ।
కులధర్మసార సాధనాంచే ॥3॥

కులధర్మే మహత్వ కులధర్మే మాన ।
కులధర్మ పావన పరలోకీంచే ॥4॥

తుకామ్హణే కులధర్మ దావీ దేహీం దేవ ।
యథా విధి భావ జరీ హోయ ॥5॥ (2268)

ప్ర.ప :- కులధర్మే = కులధర్మముచే; జ్ఞాన = జ్ఞానము ; కులధర్మే కులధర్మముచే ; సాధన = సాధన చతుష్టయ సంపత్తి (ప్రాప్తమగును),

కులధర్మే = కులధర్మముచే; నిధాన = నిధానము (విఠలుడు); హాతా = చేతిలోనికి; చఢే – ఎక్కును (వచ్చును) ; 1. కులధర్మే = కులధర్మముచే ; భక్తి = భక్తి (కలుగును); కులధర్మే = కులధర్మముచే; గతి = సద్గతి ; కులధర్మే = కులధర్మముచే ; విశ్రాంతి = మోక్షము; పావలీల = పొందబడును;2. కులధర్మే = కులధర్మముచే; దయా 6 దయ; కులధర్మే = కులధర్మముచే; ఉపకార = ఉపకారము (సంభవించును); కులధర్మ = కులధర్మము; సాధనాంచే = (సర్వ) సాధనములయొక్క; సార = సారము (ఉన్నది) ; 3. కులధర్మే = కులధర్మముచే; మహత్వ = గొప్పతనము (వృద్ధియగును); కులధర్మే = కులధర్మముచే ; మాన = (లోకములో) గౌరవము (ప్రాప్తించును); కులధర్మే = కులధర్మముచే; పరలోకీంచే = పరలోకములో నున్న పితరులు ; పావన = ఉద్ధరింపబడుదురు ;4. తుకామ్హణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; కులధర్మ = కులధర్మము ; దేహీం= ఈ వర్తమాన దేహమునందే; దేవ = దేవుడి(ని); దావీ = చూపెట్టును ; (ఎప్పుడు?) యథావిధి = శాస్త్రోక్త ప్రకారముగ; భావ ; శ్రద్ధచే; జరీ = ఒకవేళ; హెూయ= అయినట్లయితే. (అనుష్ఠించినప్పుడని యర్థము)5.

తా॥ మనుష్యుడు కులపరంపరాగత వర్ణాశ్రమధర్మములను త్యజించకూడదు. ఎందుకనగా! కులధర్మము చేత చిత్తశుద్ధి పూర్వక జ్ఞానము కలుగుతుంది. కులధర్మాచరణముచే వివేక, వైరాగ్యాది సాధన చతుష్టయ సంపత్తి ప్రాప్తమగును. మరియు విఠలరూపనిధి చేజిక్కును. 1. కులధర్మాచరణముచే చిత్తములో హరిభక్తి యుదయించును. మరియు సకామ బుద్ధిచే గాని, నిష్కామబుద్ధిచే గాని యాచరించినచో క్రమముగా సద్గతి (స్వర్గాది ప్రాప్తి) లేదా పరమ విశ్రాంతిరూపమోక్షము లభించును. 2. కులధర్మము నాచరిస్తూంటే సహజముగా భూతదయ, పరోపకారము

గూడా గడించును. అందువలన కులధర్మము సర్వ సాధనములకు సారభూతమైనది. 3. స్వవర్ణాశ్రమ విహిత ధర్మాచరణముచే లోకములో గౌరవము (కీర్తి ప్రతిష్ఠలు) వృద్ధి నొందును. ప్రజలలో తనపట్ల ఉత్తమ సజ్జనుడని పూజ్య భావన యేర్పడును. మరియు స్వర్గాదిలోకములకు వెళ్ళిన పితరులు కులధర్మాచరణముచే పవిత్రులగుదురు. (ఉద్ధరింపబడుదురు). 4. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు కులధర్మమును శాస్త్రోక్త ప్రకారముగా, శ్రద్ధా పూర్వకముగా నాచరించిన వర్తమాన దేహములోనే దేవున్ని (శ్రీవిఠలుని) ఆత్మత్వముచే సాక్షాత్కరింపజేయును. గావున కులధర్మమును త్యజించ గూడదు. 5.

సు.వ్యా :- మానవుడు కుల పరంపరాగత వర్ణాశ్రమోచిత విహిత కర్మానుష్ఠానమును విధిపూర్వకముగా, శ్రద్ధతో నీశ్వరార్పణ బుద్ధిచే, ఫలాభిసంధిరహితముగా నాచరించిన యెడల చిత్తశుద్ధి పూర్వక జ్ఞానముదయించును.

**శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।** (గీత. 8-45)

స్వస్వ వర్ణాశ్రమోచితకర్మల నాచరించుటయందాసక్తమైన నరుడు ఆత్మ జ్ఞాననిష్ఠా యోగ్యతా ప్రాప్తి లక్షణ సంసిద్ధిని పొందుతాడు.

**శ్లో॥ యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే ।**
(గీత. 5-11)

యోగులు (కర్మయోగులు- అనాత్మజ్ఞులైన కర్మాధికారులు) ఈశ్వరార్పణబుద్ధిలో ఫలాసక్తి లేనివారై అంతఃకరణ శుద్ధి (రాగద్వేషాది మాలిన్య నివృత్తి) కోసము, ఆత్మజ్ఞాననిష్ఠాయోగ్యతా ప్రాప్తికోసము కర్మలు చేయుచున్నారు.

హరితోషణార్థము స్వవర్ణాశ్రమవిహితకర్మలనాచరించనచో వివేకాది సాధనములు ప్రాప్తించును.

**శ్లో॥ స్వ వర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్ ।**
**సాధనం చ భవేత్పుంసాం వైరాగ్యాది చతుష్టయమ్ ॥**
(అపరోక్షానుభూతిః -3)

శ్రీహరిని సంతోషపరచు తపస్సుచేత, స్వవర్ణాశ్రమోచిత ధర్మాచరణముచే మనుష్యునికి వైరాగ్యము, వివేకము, షట్ సంపత్తి మరియు మముక్షుత్వము అను సాధనచతుష్టయసంపత్తి ప్రాప్తమగును.

ఆత్మజ్ఞానమునకు వైరాగ్యము అసాధారణ కారణమ్మందున ఆచార్యులు శ్లోకములో వైరాగ్యమును మొదట పఠించిరి.

మరియు స్వవర్ణాశ్రమధర్మానుష్ఠానముచేతనే స్వాత్మాభిన్న విఠలరూప విధానము (నిధి) ప్రాప్తమగుచున్నది.

**శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।**
**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥** (గీత 18-46)

ఏ పరమాత్మవల్ల ప్రాణులయొక్క ప్రవృత్తి (తమ తమ పనులలో ప్రవర్తించడం జరుగుచున్నదో), ఏ పరమాత్మచేత ఈ ప్రపంచమంతా వ్యాపింపబడియున్నదో, ఆ పరమాత్మను స్వకర్మచేత పూజించి మానవుడు సిద్ధిని (ఐకాత్మ్య జ్ఞాననిష్ఠా యోగ్యతా లక్షణ అంతఃకరణ శుద్ధిని) పొందు చున్నాడు. తద్ద్వారా ప్రత్యగభిన్న పరమాత్మ సాక్షాత్కారము కరతలామలకము వలె కలుగుచున్నది. 1.

నిష్కామకుల ధర్మాచరణముచేతనే చిత్తమునందు హరిభక్తి కుదురు చున్నది.

శ్లో॥ కర్మణా జాయేతే భక్తి భక్త్యా జ్ఞానం ప్రజాయతే ।
జ్ఞానాత్ప్రజాయతే ముక్తిః ఇతి వేదార్థసంగ్రహః ॥

భగవదర్పిత నిష్కామకర్మచేత భక్తి గలుగును. అనన్యభక్తిచేత జ్ఞానముదయించును. బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముచే ముక్తి లభించును. ఇది వేదముయొక్క సంగ్రహార్థమని పెద్దలు నుడువుచున్నారు.

మరియు నియతకర్మలు సకామముచే ననుష్ఠించినచో స్వర్గాది ఫలములు ప్రాప్తించును "స్వర్గకామో యజేత జ్యోతిష్టోమేన" స్వర్గమును గోరువాడు జ్యోతిష్టోమ యాగము జేయవలెను. "వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః ప్రేత్య కర్మ ఫలమనుభూయ తతః శేషేణ విశిష్టదేశ జాతి కుల ధర్మాయుః శ్రుతవృత్తవిత్త సుఖమేధసః జన్మ ప్రతిపద్యన్తే". (గౌ.ధ.సూ. 11-29) స్వ స్వ కర్మలయందు నిష్ఠగల వర్ణాశ్రమాలవాళ్ళు మరణించిన పిమ్మట కర్మఫలము ననుభవించి, తరువాత శేషకర్మచేత విశిష్టమైన జాతి, కులము, ధర్మము, ఆయుర్దాయము, విద్య, సదాచారము, ధనము, సుఖము మరియు బుద్ధిబలము గలవారై జన్మ పొందుతుంటారు. ఇత్యాది శ్రుతి స్మృతులచేత సకామకర్మలు చేసినవారికి సద్గతి (స్వర్గాది ప్రాప్తి) తెలియబడుచున్నది.

శ్లో॥ శ్రుతిస్మృత్యుదితం ధర్మ మనుతిష్ఠన్హి మానవః ।
ఇహ కీర్తి మవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్ ॥

(మనుస్మృతి. 2-9)

మనుష్యుడు ఈ లోకములో కీర్తిని పొందుతాడు మరియు పరలోకమున ధర్మానుష్ఠానజన్య ఫలము ఉత్కృష్ట సుఖరూపమైన, స్వర్గాపవర్గములు పొందును. (అపవర్గము = మోక్షము). ఇట్లు గుణ కల్పనచేత శ్రుతి స్మృత్యుదిత ధర్మము ననుష్ఠింపవలయునని విధి చెప్పబడినది.

కుల పరంపరాగత వర్ణాశ్రమ ధర్మమును నిష్కామముచే ననుష్ఠించు వారికి చిత్తశుద్ధిద్వారా ఆత్మజ్ఞాన నిష్ఠా యోగ్యతా ప్రాప్తిచే మోక్షమునకు హేతువులగుచున్నవి. "అభ్యుదయార్థోఽపి యః ప్రవృత్తిలక్షణో ధర్మః వర్ణాశ్రమాంశ్చోద్దిశ్య విహితః సః దేవాదిస్థానప్రాప్తిహేతురపి సన్ ఈశ్వరార్పణ బుద్ధ్యా అనుష్ఠీయమానః సత్త్వశుద్ధయే భవతి. ఫలాభిసంధిరహితః. శుద్ధ సత్త్వస్య చ జ్ఞాననిష్ఠా యోగ్యతా ప్రాప్తి ద్వారేణ. జ్ఞానోత్పత్తిహేతుత్వేన చ నిఃశ్రేయసహేతుత్వమపి ప్రతిపద్యతే" ॥

వర్ణములను, ఆశ్రమములనుద్దేశించి అభ్యుదయంకొఱకై విధించబడిన, ప్రవృత్తి లక్షణమైన ఏధర్మం ఉన్నదో అది దేవాది స్థానాలను పొందడానికి హేతువైనా గూడ ఫలాసక్తి లేకుండా ఈశ్వరార్పణ బుద్ధితో నాచరిస్తే అది యంతఃకరణ శుద్ధిని కలిగిస్తుంది. పరిశుద్ధాంతఃకరణునికి ఈ కర్మజ్ఞాననిష్ఠను పొందడానికి యోగ్యత్వం సంపాదించడం ద్వారా వానికి జ్ఞానం కలుగుటకు హేతువై మోక్షమునకు కూడ సాధనమగుచున్నది. (శ్రీమద్భగవద్గీతా శాంకరభాష్యము భూమికలో). ధర్మేణ పాపమపనుదతి. (తై.ఆ. 10-63-7) ధర్మముచే పాపము క్షమించును.

**శ్లో॥ జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః ।**
**యథాదర్శ తలప్రఖ్యే పశ్యత్యాత్మానమాత్మని ॥** (శాం.ప. 204-8)

పాపకర్మ నశించడంవల్ల అద్దంలాంటి శుద్ధాంతఃకరణంలో ఆత్మను దర్శించ గలుగు ఆత్మజ్ఞానముదయించుచున్నది.

"తమేతం వేదానువచనేన బ్రాహ్మణాః వివిదిషన్తి యజ్ఞేన" (బృ.ఉ. 4-4-22). బ్రాహ్మణులు (క్షత్రియ, వైశ్యులు గూడ) ఆ ఈ ఆత్మను వేదాధ్యయనము చేత, యజ్ఞము చేత తెలిసి కొనగోరుతారు.

"విశుద్ధ సత్త్వస్తతస్తు తం పశ్యతే నిష్కలమ్". విశుద్ధాంతఃకరణము గలిగిన పురుషుడు నిష్కలమైన ఆత్మను దర్శిస్తాడు (ముం.ఉ. 3-1-8). ఇత్యాది శ్రుతిస్మృతులచేత స్వవర్ణాశ్రమోచిత విహిత కర్మలను ఈశ్వరార్పణ బుద్ధిచే ఫలాభిసంధిరహితముగా ననుష్ఠించినచో నాత్మజ్ఞాన నిష్ఠా విశ్రాంతిరూప మోక్షము సిద్ధించునని ధ్వనితమగు చున్నది. 2.

స్వధర్మాచరణము చేత సర్వ భూతదయ మరియు పరోపకారము సహజముగా గడించును (జరుగును). అందువలననే స్వధర్మాచరణము సమస్తసాధనములయొక్క సారనాయున్నది. 3. తాను స్వధర్మాచరణము పాలించుటచే అలౌకికమైన కీర్తి, లోకమాన్యత లభించును. మరియు స్వర్గాది లోకాలకు వెళ్ళిన పితరులు గూడ కలధర్మముచే నుద్ధరింపబడుదురు. "కర్మణా పితృలోకః" (బృ.ఉ. 1-5-16) కర్మచేత పితృలోకము జయింపబడును. ఇత్యాది శాస్త్రములు ప్రమాణములు. 4.

శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - స్వధర్మమును శాస్త్రోక్త ప్రకారముగా, శ్రద్ధతో నాచరించినచో ఈ వర్తమాన దేహములోనే దేవుని (విఠలుని) ఆత్మత్వముచే సాక్షాత్కారము చేయించగలుగును. కావున శ్రీమద్భగవద్గీతలో

**శ్లో॥ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।**
**జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్ ॥** (గీత. 2-51)

సమబుద్ధియుక్త పురుషుడు కర్మ జన్య ఫలత్యాగము చేసి కేవలము ఈశ్వర ప్రీత్యర్థము కర్మలు చేయుటచే అంతఃకరణశుద్ధిద్వారా మనీషాయుక్తుడగును. (మనీషా - తత్త్వమస్యాది వాక్యజన్యఆత్మజ్ఞాన యుక్తుడగును). తద్ద్వారా జన్మరూప బంధనము నుండి విముక్తుడై అనగా

ఆత్యంతికరూపముచే సర్వథా ముక్తుడై, అనామయం అనగా అవిద్యా తత్కార్య రూప రోగ రహితుడై, అభయ పదము - ఆనంద స్వరూప బ్రహ్మాభిన్న ఆత్మ తత్త్వమును అనగా పరమ పురుషార్థరూప మోక్షము పొందుచున్నాడు. అని శ్రీ గీతాచార్యులు నుడువుచున్నారు. కావున పరంపరాగత స్వ వర్ణాశ్రమోచిత శ్రుతి స్మృత్యుదిత విహిత కర్మలవశ్యముగా ననుష్ఠేయములని శ్రీతుకారాం మహారాజుగారు కర్మ రహస్యమునుద్బోధించుచున్నారు. 5.

ప్రాసంగిక సంక్షేప కర్మ విచారము :- శుభాశుభ అదృష్ట జనక వ్యాపారమునకు "కర్మ" అంటారు. ఈ కర్మ రెండు విధములు1. విహిత కర్మ 2. నిషిద్ధ కర్మ. 1. పురుష ప్రవృత్తి నిమిత్తము వేదము వేటియొక్క స్వరూపమును తెలియజేయుచున్నదో అవి విహిత కర్మలనబడును. 2. నరకాద్యనిష్టసాధనములు బ్రాహ్మణహననాదులు నిషిద్ధములు. పురుష నివృత్యర్థము వేదము వేటి స్వరూపమును బోధించుచున్నదో, అవి నిషిద్ధ కర్మలు. ఉదా:- "కలంజం న భక్షయేత్" కలంజమును భక్షించ (తిన) గూడదు. ఇత్యాదులు. కలంజమనగా-

శ్లో॥ విషాక్తే నైవ బాణేన హతౌ యౌ మృగపక్షిణౌ ।
తయోర్మాంసం కలంజం స్యా చ్ఛుష్కమాంసమథాపి వా ॥

విషమును పూసిన బాణముచే కొట్టగా, చంపబడిన మృగ (లేడి) మరియు పక్షులయొక్క మాంసమును లేదా శుష్కమాంసమును కలంజమందురు. రక్తలశునమ్" ఎఱ్ఱవెల్లి పాయలను" కలంజమని" కొందరంటారు. నిష్కర్ష మేమనగా - ఏవిధమైన మాంసమును గాని ఏ ప్రాణియొక్క మాంసమును గాని, వెల్లి పాయలను గాని మరియే ఇతరములైన అభక్ష్యములను భక్షించగూడదని వేదము "కలంజం న భక్షయేత్" అని నిషేధించుచున్నది.

1. విహితకర్మలు నాలుగు ప్రకారములు :- 1. ప్రాయశ్చిత్త కర్మలు. 2. కామ్యకర్మలు. 3. నైమిత్తికకర్మలు. 4. నిత్యకర్మలు.

2. పాపక్షయసాధనములు ప్రాయశ్చిత్తకర్మలు. ఉదా! చాంద్రాయణాదులు చాంద్రాయణ విషయంలో మనుస్మృతిలో – ఇలా తెలియ జేశారు.

**శ్లో॥ ఏకైకం హ్రాసయేత్పిండం కృష్ణే శుక్లే చ వర్ధయేత్ ।**
**ఉపస్పృశన్ త్రిషవణమేత చ్చాంద్రాయణం స్మృతమ్ ॥**

(మనుస్మృతి: 11-216)

ప్రతిదినము ప్రాతఃకాలము, మధ్యాహ్నము, సాయంకాలములందు స్నానము చేస్తూ, పౌర్ణిమనాడు పదునైదు గ్రాసముల భోజనము చేసి కృష్ణ పక్ష పాడ్యమి నుండి చతుర్దశీ వరకు ప్రతి దినము ఒక్కొక్క గ్రాసము తక్కువ చేస్తూ అమావాస్య రోజున ఉపవాసముండవలెను. శుక్లపక్ష ప్రతివదనుండి ఒక గ్రానము భోజనముతో నారంభించి ఉత్తరోత్తరదినములలో ఒక్కొక్క గ్రాసము వృద్ధి చేస్తూ పూర్ణిమ నాడు పదునైదు గ్రాసములు భుజించవలెను. ఈ ప్రకారము ఒక మాసము వరకు చేయు వ్రతమును చాంద్రాయణ వ్రతము అంటారు. దీనికి "పిపీలికా – మధ్య చాంద్రాయణమ"ంటారు. యింకా అనేక చాంద్రాయణములు చెప్పబడ్డాయి. మనుస్మృతిలో చూడగలరు.

ప్రమాదవశమున కదాచిత్ విహితాకరణము మరియు నిషిద్ధ కర్మాచరణము జరిగిన యెడల, ప్రత్యవాయ (ఆగామి దుఃఖ) నివృత్యర్థము ప్రాయశ్చిత్తము చేయవలెను.

**శ్లో॥ అకుర్వన్ విహితం కర్మ నిందితం చ సమాచరన్ ।**
**ప్రసక్త శ్చేంద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతే నరః ॥** (మ.స్మృ. 11-44)

విహితకర్మలు చేయక, నిషిద్ధ కర్మలు చేస్తూ, ఇంద్రియార్థము (శబ్దాది విషయము) లందు ఆసక్తుడై యథేచ్ఛగా సంచరించు మనుష్యుడు ప్రాయశ్చిత్తమునకు పాత్రుడగును.

**శ్లో॥ ప్రాయోనామ తపః ప్రోక్తం చిత్తం నిశ్చయ ఉచ్యతే ।**
**తపో నిశ్చయ సంయుక్తం ప్రాయశ్చిత్తమితి స్మృతమ్ ॥**
(వాచస్పత్యమ్)

ప్రాయ మనగా తపస్సు, చిత్తమనగా నిశ్చయము. నిశ్చయ సంయుక్త తపస్సునకు ప్రాయశ్చిత్త మందురు. ఈ ప్రాయశ్చిత్తము రెండు విధములు. 1. సాధారణ ప్రాయశ్చిత్తము. 2. అసాధారణ ప్రాయశ్చిత్తము. 1. ఈ జన్మలో కాని, జన్మాంతరములలో గాని చేసిన అజ్ఞాత పాప నివృత్యర్థము చేయబడునని సాధారణ ప్రాయశ్చిత్తములు - గంగాస్నానము, ఈశ్వర నామోచ్చారణము మొదలగునవి. 2. జ్ఞాత పాప నివృత్యర్థము చేయబడునని అసాధారణ ప్రాయశ్చిత్తములు. ఏ విధమైన పాపనివృత్యర్థము ఏవిధమైన ప్రాయశ్చిత్తకర్మ చేయాలో, శాస్త్రము విధానము చేసింది. ఉదా: బ్రహ్మహత్యాది పాపనివృత్యర్థము అశ్వమేధాది కర్మలు శాస్త్రము విధానము చేసినది. మరియు-

**శ్లో॥ అకామతః కృతం పాపం వేదాభ్యాసేన శుధ్యతి ।**
**కామతస్తు కృతం మోహాత్ప్రాయశ్చిత్తైః పృథగ్విధైః ॥**

మనుస్మృతిలో (11-46)లో ఈ ప్రకారముగా గూడ ప్రాయశ్చిత్తము చెప్పబడినది. అనిచ్ఛాపూర్వకముగా చేయబడిన పాపము వేదాభ్యాసము (ఉపలక్షణముగా గంగాస్నానము, ఈశ్వరనామోచ్చారణము) మొదలగు లఘు ప్రాయశ్చిత్తములచే నశించును. మరియు రాగ ద్వేషాది

మోహవశమున ఇచ్ఛాపూర్వకముగా చేయబడు పాపము శాస్త్రము విధానము చేసిన అనేక గురు ప్రాయశ్చిత్తములచే నశించునని మనువచనము.

2, స్వర్గాది ఇష్ట ఫల నిమిత్తము విధానము చేయబడిన కర్మలు కామ్యకర్మలనబడును. ఉదా! "జ్యోతిష్టోమేన స్వర్గ కామో యజేత" స్వర్గమును గోరువాడు జ్యోతిష్టోమ యాగమును చేయవలెను. ఇత్యాది.

3. ఏదేని నిమిత్త విశేషముపస్థితమైనపుడు యే కర్మలు శాస్త్రముచే అవశ్య కరణీయములని విధానము చేయబడినవో,వేటిని చేయకుంటే పాపము గలుగునో మరియు చేసినచో పుణ్యరూపఫలము లేదో అవి నైమిత్తిక కర్మలనబడును. ఉదా: జాతేష్టి కర్మ - ఇత్యాది. "వైశ్వానరం ద్వాదశ కపాలం నిర్వపేత్ పుత్రే జాతే" పుత్రుడు ఉత్పన్నమైనపుడు పండ్రెండు కపాలములయందు పురోడాశను (యవ పిండితో చేసిన రొట్టెలు) వైశ్వానర దేవునకు ప్రదానము చేయవలెను. అట్లే శ్రాద్ధ, గ్రహణకాల స్నానము మొదలగునవి దెలియవలెను.

4. వేటికి చేయనిచో ప్రత్యవాయ (పాపము లేదా ఆగామి దుఃఖ)ము గలుగునో, చేసినచో ఫలమేమియును లేదో మరియు శాస్త్రము వేటిని నిత్యము అవశ్యముగా చేయవలెనని విధానము చేసినదో వాటిని నిత్యకర్మలంటారు. ఉదా: "అహరహః సంధ్యాముపాసీత" ప్రతి దినము సంధ్యావందనాదులనవశ్యము చేయవలెను. పంచ యజ్ఞాదులను (అధ్యావనం బ్రహ్మయజ్ఞం - మనుస్మృతి - 3-70) గూడ గ్రహించవలయును.

ఇంతవరకు పూర్వమీమాంసా శాస్త్రానుసారము కర్మలనుగూర్చి సంక్షేపముగా తెలిసికున్నాము. వేదాంత మతానుసారము నిత్య నైమిత్తిక

కర్మలకు గూడ స్వర్గరూపఫలము స్వీకరించబడింది. నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానం వల్ల ప్రత్యవాయం పుట్టక పోవడమే ఫలం మరొక ఫలం లేదని చెప్పుటకు ప్రమాణమేమి లేదు. ఆ కర్మానుష్ఠానాన్ని అనుసరించి పుట్టే మరొక ఫలం గూడ ఉండవచ్చును గదా!

"తద్యథాఽమ్రే ఫలార్థే నిర్మితే చాయాగంధావనూత్పద్యేతే, ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్యన్తే" (ఆపస్తంబుడు) పండ్ల కోసము మామిడి మొక్క నాటగా దాని నుండి నీడ మరియు సువాసన గూడ ఎట్లు కలుగుతాయో అట్లే ధర్మం ఆచరిస్తూంటే మరికొన్ని ఇతర ఫలాలు (లాభాలు) కూడ కలుగుతాయి. నిత్య నైమిత్తిక కర్మల నాచరించకపోతే పాపోత్పత్తి చెప్పడమయుక్తము. ఎందుకనగా అభావము నుండి భావము (పాపము) ఎలా ఉత్పన్నమగును. "నాపి నిత్యానామకరణాదభావాత్ప్రత్యవాయ భావోత్పత్తిః "నాసతో విద్యతే భావః" (గీత. 2-16) "కథమసతః సజ్జాయేత" (ఛాం.ఉ. 6-2-2) ఇతి" (గీతా భాష్యము 4-18) మరియు ఈ విషయమై బ్రహ్మసూత్ర భాష్యము 4-3-14 లో శ్రీ మజ్జగద్గురు ఆద్యశంకరాచార్యులు సయుక్తి, సప్రమాణములచే విస్తారముగా చర్చించారు. అక్కడ చూడండి. కావున వేదాంతమతానుసారము సంపూర్ణకర్మలు సకామ పురుషునికి సంసారమునకు హేతువులగును. నిష్కామ పురుషునికి అంతఃకరణశుద్ధి ద్వారా మోక్షమునకు హేతువులగుచున్నవి.

**శ్లో॥ యుక్తః కర్మ ఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికమ్ ।**
**అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥** (గీత. 5-12)

యుక్తః అనగా నేను చేయు "ఈకర్మలు ఈశ్వరుని కొఱకే గాని నా స్వప్రయోజనము కొఱకు కావు" అను నభిప్రాయము గల పురుషుడు కర్మఫల త్యాగపూర్వకముగా కర్మల నాచరిస్తూ, నైష్ఠికమ్ అనగా చిత్తశుద్ధి,

నిత్యానిత్యవస్తు వివేకము, సన్యాసము (వైరాగ్యము) మరియు జ్ఞాననిష్ఠాక్రమముచే నుత్పన్నమైన మోక్షమనబడు శాంతిని పొందుచున్నాడు. కాని ఎవడు అయుక్తుడో అనగా “ఈ కర్మలు ఈశ్వరుని కొఱకే, నాస్వప్రయోజనము కొఱకు కావు” అను నభిప్రాయ శూన్యుడు, కామకారేణ అనగా సకామభావముచే ప్రవృత్తుడైనందున, (“ఈ కర్మఫలము నాస్వప్రయోజనము కొఱకే'' నను విచారముచే ఫలాసక్తుడై ప్రవృత్తుడైనందున) నతడు కర్మలచే నితాంతము (నిఃశేషముగా) సంసారబంధమును పొందుచున్నాడు. అందువలన నీవు యుక్తుడవై కర్మ చేయుము. అని శ్రీకృష్ణభగవానుడు అర్జునులవారి నుద్దేశించి ప్రబోధించెను. గావున ముముక్షువైనవాడు కర్మలను ఈశ్వరార్పణ బుద్ధిచే ఫలాభిసంధిరహితుడై స్వ వర్ణాశ్రమోచిత విహిత కర్మలను శ్రద్ధాపూర్వకముగా నాచరించవలయును. అట్లయినచో నంతఃకరణశుద్ధి కలిగి ఆత్మజ్ఞాన నిష్ఠా యోగ్యతా ప్రాప్తి ద్వారా బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముచే పరమ విశ్రాంతి రూపమోక్షము సిద్ధించును.

**9 అభంగము :-**

సత్యకర్మ ఆచరేఀ రే। బాపా సత్య కర్మ ఆచరేఀరే ।
సత్యకర్మ ఆచరేఀ హెూఈల హిత ।వాఢేల దుఃఖ అసత్యాచేఀ ॥1॥

ఊఀస వాఢవితా వాఢలీ గోడీ ।
గూళ సాఖర హే త్యాచీ పరవడీ ॥2॥

సాఖరేచ్యా ఆళాం లావిలా కాందా ।
స్థూళ సానా పరీ వాఢే దుర్గంధా ॥3॥

సత్య అసత్య హే ఐసియా పరీ ।
తుకా మ్హణే యాచా విచార కరీఀ ॥4॥ (2169)

ప్ర.ప:- రే బాబా = అరే బాబా ; సత్యకర్మ = ధర్మము మరియు నీతి యుక్తమైన కర్మ ; ఆచరేc= ఆచరించు ; సత్యకర్మ = స్వవర్ణాశ్రమోచిత శాస్త్రవిహిత కర్మలను ; ఆచరే c- ఆచరించు ; సత్యకర్మ = శ్రీపాండురంగనికి ప్రీతిని గలిగించు కర్మలను, ఆచరే = ఆచరించు, (అట్లాచరించినచో నీకు) హిత హొఈల = మేలు గలుగును, అసత్యాచే c= నిషిద్ధాచరణముచే దుఃఖ = దుఃఖము; వాఢేల - వృద్ధి నొందును. 1. ఊస = చెఱకు(ను నాటి); వాఢవితా = పెంచుచున్నట్లయిన ; (దాని యొక్క) గోడీ = తీపి ; వాఢలీ = వృద్ధియగును. (మరియు దానితో); గూళ = బెల్లము ; సాఖర = చక్కెర (పంచదార); హే = ఈ (మొదలగు) త్యాచీ = దానియొక్క; పరవడీ= ప్రకారముల (పదార్థములు నిష్పన్నమగును లేదా వృద్ధినొందును. ). 2. (ఒకవేళ ఆ) సాఖరేచ్యా = చక్కెరయొక్క (చెఱకుయొక్క) ; ఆళాం = ఆలవాలము (పాదు) యందు ; కాందా = ఉల్లిగడ్డ(ను); లావిలా = నాటినచో; (అది) స్థూళ = పెద్దదిగా ; సానా = సన్నముగా (గాని ఏ)వాసన) ; వాఢే= వృద్ధియగును. 3. తుకా మ్హణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; సత్య = సత్యము ; అసత్య = అసత్యము (యొక్క) హే = ఈ; ఐసియా= విధమైన ; పరీ (ఫలభేదమున్నది. ); యాచా = దీనియొక్క ; విచార = వివేకము ; కరీc = చేయుము. 4.

**తా॥** అరే బాబా! ధర్మయుక్తములు మరియు నైతికములయిన (కర్మలను) వ్యవహారములను చేయు చుండుము. వర్ణాశ్రమోచిత శాస్త్ర విహిత సత్కర్మలు చేయుచుండుము. మరియు శ్రీపాండురంగనికి (ఈశ్వరునికి) ప్రీతికరములయిన కర్మలు చేయుచుండుము. తద్వారా నీయొక్క మేలు జరుగును. మరియు పాపఫలమైన దుఃఖము దూరమగును. 1. చెఱకునకు నీళ్ళు పోసి బాగుగా పెంచినట్లయిన దానియొక్క తీపి వృద్ధినొంది

క్రమముగా బెల్లము, చక్కెర మొదలగు పదార్థములు దాని నుండి (చెఱకు నుండి) ఉత్పన్నములగును. 2. ఆ చెఱకు యొక్క పాదులయందు ఉల్లి మొక్కలను నాటినచో అవి పంటకొచ్చి, పెద్దవిగనో లేదా చిన్నవిగనో - యెట్లున్నప్పటికి దుర్గంధమును వ్యాపింపజేయును. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - చెఱకు మరియు ఉల్లిగడ్డ దృష్టాంతము వలె (తీపిxదుర్గంధముల వలె) సత్యవ్యవహారమునకు మరియు నసత్య వ్యవహారమునకు ఫల భేదము (ఆనందముx దుఃఖము) ఉన్నది. కావున ఈ రెంటిలో - సత్యా సత్య వ్యవహారము (కర్మ)లలో ఏది మంచి, ఏది చెడు - నీవే చక్కగా విచారించి యథాయోగ్యము ప్రవర్తించుము.

సు.వ్యా :- ధర్మాచరణము - మరియు నైతిక వ్యవహారముచే స్వవర్ణాశ్రమోచితవిహితకర్మలను ఫలాభిసంధిరహితముగ సత్యమైన పాండురంగని ప్రీత్యర్థమాచరించినచో విఠలుని యనుగ్రహముచే మానవునికి కల్యాణము (హితము అనగా మోక్షము) చేకూరును. సంసారరూపదుఃఖ మత్యంతముగా సమూలముచే నివృత్తమగును.

**శ్లో॥ ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైత వాసనా ।**
**మహాభయ పరిత్రాణా ద్విత్రాణా ముపజాయతే ॥** (అవధూతగీత)

జనన మరణరూప మహాభయము నుండి రక్షించు ఈశ్వరానుగ్రహమువలననే రక్షణలేని జీవులకు వేదాంతమున జెప్పబడిన ఆత్మజ్ఞానము గలిగెడు నద్వైతవానన యుదయించును. అని శ్రీదత్తాత్రేయులవారు ఆనతిచ్చిరి. 1.

శ్రీతుకారాం మహారాజుగారు జనులనుద్దేశించి యుపదేశము చేస్తూ - అరే బాబా! నేను చెప్పినట్లు మీరు సత్యనిష్ఠులై ధర్మాచరణ,

సత్కర్మానుష్ఠానమును ఈశ్వరార్పణ బుద్ధితో నిష్కామముగా చేసిన మీ యంతః కరణభూమిలో దైవీసంపత్తి, సాధనచతుష్టయసంపత్తి గలిగి అద్వైత వాసన పొడమును. తద్ద్వారా జ్ఞానముచే ముక్తులగుదురు. అందువలన మీ యంతఃకరణ భూమిని (అహంబ్రహ్మాస్మి) జ్ఞానమునకుపాదానకారణ మున్నందున) సద్వాసనలచే వాసితముగా మార్చుకోండి - అని రెండవ చరణములో 'చెఱకు' దృష్టాంతము నిచ్చిరి. 2.

దీనికి విపరీతముగా నిషిద్ధాచరణము చేసిన యెడల మీయంతఃకరణ భూమి ఆసురీ సంపత్తితో కూడినదై చెడు వాసనలచే దూషితమై (కామక్రోధాదులచే దూషితమై) జన్మ మరణరూప మహాదుఃఖమును పొందగలరని హెచ్చరిస్తూ మూడవ చరణములో 'ఉల్లిగడ్డ' దృష్టాంతము నిచ్చిరి. 3.

శ్లో॥ దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా ॥

(గీత. 16-5)

దైవీసంపత్తి మోక్షమునకు, ఆసురీసంపత్తి బంధమునకు కారణమని చెప్పబడింది. ఏవర్ణాశ్రమములవారికి ఫలాభిసంధిరహిత ఏసాత్విక క్రియ శాస్త్ర విహితమున్నదో అది వారి దైవీ సంపత్తి. అది సత్త్వ శుద్ధి, భగవద్భక్తి లేక జ్ఞానము మరియు యోగస్థితి పర్యంతమున్న యెడల సంసార బంధ నివృత్తి మరియు కైవల్య ప్రాప్తికి హేతువగును. కాని, ఎవరికి శాస్త్ర నిషిద్ధమైన, ఫలాకాంక్ష పూర్వక, అహంకార సహిత రాజస తామస క్రియ ఉన్నదో అది వారి ఆసురీ సంపత్తి. ఇది శాస్త్రము మరియు శాస్త్రమును అనుసరించు వారి యొక్క మతము (అభిప్రాయము) నందు సంసారబంధమునకు కారణమగుచున్నది(మధుసూదనీ.)

శ్లో॥ మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ ।
అశుద్ధం కామసంపర్కాచ్ఛుద్ధం కామ వివర్జితమ్ ॥
(వేదాంత పంచదశి 11-16), (మైత్రాయణ్యుపనిషత్. 6-34)

మనస్సు శుద్ధము అశుద్ధము అని రెండు విధములుగ చెప్పబడినది. కోరికలతో (వాసనలతో) కూడిన మనస్సు అశుద్ధము. కోరికలు (వాసనలు) లేని మనస్సు శుద్ధము.

శ్లో॥ చిత్తమేవ హి సంసారస్తత్ప్రయత్నేన శోధయేత్ ।
యచ్చిత్తస్తన్మయో మర్త్యో గుహ్యమేతత్సనాతనమ్ ॥
(వే.పం. 11-13), (మై.ఉ. 6-34)

చిత్తమే సంసారము. దానినతిప్రయత్నముతో నభ్యాస వైరాగ్యములచేత రజస్తమస్సులు, కామక్రోధాది కల్మషములనుఁ దొలగించి యేకాగ్రము చేయవలెను. ఏలన, తన చిత్తము దేనియందు లగ్నమై యుండునో తనను దానినిగనే మర్త్యుడు భావించుకొనును. ఇదియే యనాది సిద్ధమైన రహస్యము.

శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు. ఓ జనులారా! పైనుదహరింపబడిన శాస్త్రోక్తి మరియు నేనిచ్చిన (చెఱకు - ఉల్లిగడ్డ) దృష్టాంతముచే నిష్కామ సత్కర్మానుష్ఠానముచే శుద్ధమైన సద్వాసనావాసితాంతఃకరణము పారంపర్యముగా మోక్షమునకు హేతువనియు, దానికి విపరీతముగా యథేష్టముగ నిషిద్ధాచరణము గావించినచో నంతఃకరణము అసద్వాసనలతో దూషితమై నేరుగా నరకమునకు (సంసారమునకు) కారణమగుచున్నందున, సత్యాసత్య వ్యవహారములకు ఫలభేదము తెలియ బడుచున్నందున, ఈ రెంటిలో మీకేది యోగ్యమో బాగుగా విచారించి ప్రవర్తించండి. 4.

10. అభంగము :-

తప తీర్థ దాన వ్రత ఆచరణ ।
గాతాం హరిగుణ వారూం నయే ॥1॥

కోటి కుళే c త్యాచీ వాటులీ సాహోతీ ।
త్యా తయా ఘడతీ బ్రహ్మ హత్యా ॥2॥

ఆపులియా పాపే c నసుటే సాయాసే c ।
కోణాకాళే c ఐసే c నిస్తరేల ॥3॥

వ్హావే c సాహ్య తయా న ఘూలావే c భయ ।
ఫుకాసాఠీ c పాహే c లాభ ఘాత ॥4॥

తుకామ్హణే హిత మానా యా వచనా ।
సుఖ దుఃఖ జాణా సాధే ఫుకా ॥5॥ (994)

ప్ర.ప :- (ఒకానొక మనుష్యుడు) తప = తపస్సును ; తీర్థ = తీర్థయాత్రలను ; దాన = దానమును ; వ్రత = వ్రతములను ; ఆచరణ = ఆచరించు (చున్నచో); హరిగుణ = భగవంతుని యొక్క గుణ గణమును ; గాతాం = గానము చేయుచున్నచో (అతనిని) వారూc = వారించ (నివారించ); నయే = కూడదు. 1. (ఏలన) త్యాచీ = అతని యొక్క (నరకస్థ వంశీయులు) ; కోటి కుళేc = కోటి సంఖ్యాక తరములవారు ; వాటులీ = (పుణ్యము యొక్క) దారిని ; పాహోతీ = చూస్తూంటారు ; త్యా = (ఎవరైతే పుణ్యకార్యమును ప్రతిఘటిస్తారో) వారికి ; తయా = విఘ్నముచేయుటచే; బ్రహ్మహత్యా = బ్రహ్మహత్యా రూప మహాపాపము ; ఘడతీ = గడించును (ప్రాప్తించును). 2. ఆపులియా = తనయొక్క ; పాపేc= పాపములే ;

సాయాసేం = గొప్ప కష్టము చేత (గూడ) న సుటేం = (అతనిని) వదలవు (నశించవు = అలాంటప్పుడు) ; ఐసేం = ఈవిధముగా (పుణ్య కార్యమునకు ప్రతిబంధకము గలిగించినచో, ఇతని పాపములు) ; కోణాకాళేం= ఏకాలమునందు ; నిస్తరేల = నిరసించును. 3. (అందువలన) తయా = పుణ్యకార్యము చేయు వానికి; సాహ్యా = సహకారము ; వ్హావేం=కావలెను; భయ = భయమును (విఘ్నమును) ; న ఘాలావేం =వేయగూడదు (కలిగించ గూడదు) ; (సత్కర్మలయందు సహకరించినచో) ఫుకాసాఠీ = అయాచితముగ; లాభ = లాభ (పుణ్య)మును ; సాహేం=చూచెదరు (పొందెదరు; లేనిచో); ఘాత = పాపమును (హానిని పొందెదరు.) 4. తుకా మ్హణే = శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు; యా = ఈ ; వచనా = నా వచనము ; హిత= హితకారకమని ; మానా - స్వీకరించండి ; (అట్లయినచో) ఫుకా = అయాచితముగా ; సుఖ = సుఖమును (పుణ్యమును) సాధే = సాధించుదురు (పొందుదురు, లేనిచో) ; దుఃఖ = దుఃఖమును (పాపమును పొందుదురని); జాణా - తెలియండి. 5.

తా॥ ఏ మానవుడు తపస్సును, తీర్థయాత్రలను, దానమును, వ్రతములు ఇత్యాది ధర్మాచరణమును శాస్త్రోక్త ప్రకారముగా శ్రద్ధతో చేయు చున్నాడో మరియు హరిగుణ గణ గానము భక్తితో చేయుచున్నాడో అతనికి యితరులు తన సాధననుండి భ్రష్టున్ని చేయకూడదు. "నీవు ఈ సాధన చేయకుము" అని తన సాధనయందు అశ్రద్ధ నిర్మాణము చేసి బుద్ధి భేదము చేయకూడదు. 1. ఏలన, సత్కర్మజేయు పురుషునియొక్క కోటి సంఖ్యాక తరముల వంశీయ పితరులు స్వ ఉద్ధరణ (సద్గతి) కోసము, ఇతని పుణ్యము కొఱకు నిత్యము ఎదురు చూస్తు ఉంటారు. అలాంటప్పుడు, ఏ పాపాత్ముడైన సత్కర్మాచరణ జేయు పురుషున్ని తన సాధన నుండి పతితున్ని (భ్రష్టుని)

జేసినచో అతని కోటి కులమును ఘాతకము జేయు బ్రహ్మహత్యా సమమైన మహాపాతకము జేసినవాడగును. 2. ఎక్కడైతే స్వకృత పాపములనుండియే గొప్ప కష్టము చేతగూడ తరించుట కసాధ్యమో అక్కడ యితరులను పుణ్య కర్మలను చేయ నివ్వకుండా విఘ్నములు కలిగించడముచే ప్రాప్తపాపములనుండి విముక్తి (వాడికి) ఎప్పుడు గలుగును? ఎప్పుడు తరించును? 3. అందువలన సత్కర్మలు జేయు వానికి సహకరించండి, ప్రోత్సహించండి. మరియు మీరు విఘ్నములు మాత్రము కలిగించకండి, బుద్ధిభేదము చేయకండి. సత్కర్మలయందు సాహాయ్యము చేసినట్లయిన అయాచిత పుణ్యమునకు పాత్రులగుదురు. విఘ్నములు గలిగించినచో వ్యర్థముగా పాపమును మూటగట్టుకొందురు. నరకమున బడుదురు. 4. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - ఈ నా వచనమును హితకారముగా నెంచి, సత్కర్మాచరణ యందు సహకరించినట్లయిన మీకపరిమిత పుణ్యరాశి చేకూరును. దాని మూలమున సుఖమును పొందుదురు. లేనిచో వ్యర్థముగా పాపమును సంపాదించి నరకమునకు పాత్రులగుదురు. దుఃఖమును పొందుదురని తెలియండి.

సం.వ్యా:- "తవన్" శబ్దమునకర్థము శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు ప్రసంగమును బట్టి నానార్థములు చెప్పిరి. "కాయేంద్రియ మనసాం సమాధానమ్". శరీరమును ఇంద్రియములను, మరియు మనస్సును సమాధానము (సమ్యగాధానము) చేయుట తపస్సనబడును. (కే.ఉ. 4-8 భాష్యము), చిత్తవిశుద్ధి సాధనము తపస్సు (ప్ర.ఉ. భాష్యము. 6-4), కృచ్ఛాంద్రాయణాది వ్రతములకు తపస్సని (ఛాం.ఉ 2-23-1. భాష్యము)లో, స్వాధ్యాయ ప్రవచనములకు తపస్సని (తై. ఉ. 1-8 భాష్యము)లో అదే విధముగా (తై.ఉ. 3-1 భాష్యములో)

శ్లో॥ మనసశ్చేంద్రియాణాం చ హ్యైకాగ్ర్యం పరమం తపః ।
తజ్జ్యాయః సర్వ ధర్మేభ్యః స ధర్మ పర ఉచ్యతే ॥
(మ.భా.శాం.ప 250-4)

మనస్సును ఇంద్రియములను ఏకాగ్రము చేయుట పరమతపస్సనబడును. సర్వధర్మములలో ఇదియే శ్రేష్ఠము, పరమధర్మము. మరియు (ఛాం.ఉ. 5-10-1) భాష్యములో - వానప్రస్థుల యొక్క అసాధారణ ధర్మము తపస్సని చెప్పారు. స్వ వర్ణాశ్రమ విహిత కర్మలకు తపస్సని మన్వాది శాస్త్రములలో చెప్పబడినది. శీతోష్ణాది ద్వంద్వ సహిష్ణుతా తపస్సని మరియు శాస్త్రీయ మార్గము చేత కాయేంద్రియ మనస్సులను శోషింప జేయుట తపస్సని - వాచస్పత్యము. ఇంతే గాక గీత యందు సాత్విక, రాజస, తామస భేదములచే తపస్సు చెప్పబడినది. అందు సాత్వికము ఆచరణీయము. అదియు శరీర వాఙ్మయ మానసిక భేదములచే త్రివిధము. (గీత. 17-14 నుండి 17-19 వరకు)

శ్లో॥ తపో విద్యా చ విప్రస్య నిఃశ్రేయసకరం పరమ్ ।
తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే ॥
(మనుస్మృతిః 12-104)

తపస్సు (బ్రహ్మచర్యము, గృహస్థాది ఆశ్రమోక్త ధర్మము) మరియు విద్యా (ఆత్మజ్ఞానము) ఈ రెండు బ్రాహ్మణునికి (ముముక్షువునకు) ఉత్తమ మోక్ష సాధనములు. అందులో తపస్సుచే పాపములు నశించును. విద్యచే మోక్షము ప్రాప్తించును అని మనువచనము. "నాతపస్వినో యోగో సిద్ధ్యతి" (యో.సూ. 2-1. భాష్యము) తపోహీనునకు మోక్షము (యోగము) సిద్ధించదు. ఇంకా తపస్సుయొక్క మాహాత్మ్యమును గూర్చి మనుస్మృతి (11-233 నుండి 11-244) వరకు) మరియు పురాణాదులలో

దెలియదగును. కావుననే ముముక్షువైనవాడికి అవశ్యముగా తపస్సు తన యొక్క ఆత్మోన్నతి కొఱకు ఆచరణీయమున్నదియని పూజ్యపాదులు ఆద్య శంకరాచార్యులవారు తమ "ఆత్మబోధ" గ్రంథారంభమున దెలియ పరచు చున్నారు.

**శ్లో॥ తపోభిః క్షీణ పాపానాం శాంతానాం వీతరాగిణామ్ ।**
**ముముక్షూణా మపేక్ష్యోఽయం ఆత్మబోధో విధీయతే ॥**

కృచ్ఛాంద్రాయణ, ఉపవాసాది వ్రతములు మరియు వర్ణాశ్రమ విహిత నిత్యనైమిత్తికాది కర్మానుష్ఠానరూప తపస్సులచే ఎవరి యంతః కరణస్థ (రాగాది మాలిన్యము) పాపములు నశించినవో, మనస్సు శబ్దాది విషయములనుండి ఉపరతిని పొందినదో, అనుకూల వస్తు జ్ఞానజన్య బుద్ధివృత్తిరూప రాగము నివృత్తమయినదో – అటువంటి ఇహాముత్రఫలభోగ విరక్తులకు, భ్రమజతాదాత్మ్యము (చిజ్జడగ్రంథి) విచ్ఛేదనము నందు ప్రయత్నశీలురైన సాధన చతుష్టయ సంపన్నులై మోక్షము నందగోరు వారికి ఈ ఆత్మబోధ (ఆత్మజ్ఞానము) విధిముఖముగా నావశ్యకముగా ప్రతిపాదించ బడుచున్నది.

శ్రుతిభగవతి గూడ తపస్సుయొక్క ఆవశ్యకతను మరియు ప్రయోజనమును తెలియ జేస్తూ

**శ్లో॥ తపసా ప్రాప్యతే సత్త్వం సత్త్వా త్సంప్రాప్యతే మనః ।**
**మనసా ప్రాప్యతే త్వాత్మా హ్యాత్మాపత్త్యా నివర్తతే ॥**

(మైత్రేయ్యుపనిషత్ 1-6) (మైత్రాయణ్యుపనిషత్. (4-3)

తపస్సు చేత జ్ఞానోపలబ్ధి, జ్ఞాన ప్రాప్తి చేత మనసు వశీభూతమై ఆత్మ సంస్థమగును. అట్టి మనస్సు చేత ఆత్మానుభవము (ఆత్మోపలబ్ధి) మరియు

తద్వారా సంసార సాగరము నుండి ఉత్తీర్ణత (ముక్తి) లభించు చున్నది యని తపస్సు ముముక్షువులచే నవశ్యము కర్తవ్యముగా నుపదేశించు చున్నది.

**తీర్థము:-** "తరతి పాపాదికం యస్మాత్ తత్తీర్థమ్" ఈ వ్యుత్పత్తి చేత మానవుడు దేనివలన పాపములనుండి తరిస్తాడో అది తీర్థము. పుణ్య జనక స్థానాదులకు తీర్థమంటారు. లేదా శ్రద్ధాయోగ్యము, పూజనీయము అయిన వ్యక్తులకు, వస్తువులకు తీర్థము అని యందురు. తీర్థములు త్రివిధములు. 1. జంగమము. 2. మానసము. 3. స్థావరములు.

**1. శ్లో॥ బ్రాహ్మణాః జంగమం తీర్థం నిర్మలం సార్వకామికమ్ ।**
**యేషాం వాక్యోదకేనైవ శుద్ధ్యంతి మలినా జనాః ॥**

**శ్లో॥ బ్రాహ్మణానాం ముఖే స్వర్గా వాచి వేదాః కరే హరిః ।**
**గాత్రే తీర్థాని యాగాశ్చ హృదయం బ్రహ్మ సంస్థితమ్ ॥**

**శ్లో॥ కోటి బ్రహ్మాండమధ్యేషు సంతి తీర్థాని యాని చ ।**
**తాని సర్వాణి తీర్థాని వసంతి ద్విజ పాదయోః ॥**

**అర్థము :-** ఎవరి వాక్యోదకమాత్రముచే మలినాంతఃకరణము గలిగిన పాపులు పరిశుద్ధమగుదురో అటువంటి సర్వకామనలు తీర్చు పవిత్రాత్ములైన బ్రాహ్మణోత్తములు జంగమ తీర్థమనంబడుదురు. ఏలన, బ్రాహ్మణుల ముఖమందు స్వర్గములు వాక్కులో వేదములు, హస్తము యందు హరి, శరీరమందు (సర్వావయవముల యందు) సమస్త తీర్థములు మరియు హృదయ మందు బ్రహ్మము వసించి యుండును.

ఇంతేకాక కోటి బ్రహ్మాండముల యందు యేవేవి తీర్థములు గలవో నవి యన్నియు ద్విజుని (బ్రాహ్మణుని) పాదముల యందుండునని అన్యాన్య పురాణములు వచించుచున్నవి. కావున బ్రాహ్మణులు తీర్థ స్వరూపులు.

**శ్లో॥ కర్మణాపి విశుద్ధస్య పురుషస్యేహ భారత ।**
**హృదయే సర్వతీర్థాని తీర్థభూతః స ఉచ్యతే ॥**
(పృష్ఠము. 6374 మ.భా. ఆశ్వ.ప.వై.ధ.ప)

అర్థము :- ఓ భారత! ఈ లోకములో పుణ్యకర్మానుష్ఠానముచే విశుద్ధమైన పురుషుని హృదయములో సమస్త తీర్థములు వసించియున్నవి. అందువలన నతడు తీర్థ స్వరూపుడనబడుతాడు.

**శ్లో॥ గురుతీర్థం పరం జ్ఞానమతస్తీర్థం న విద్యతే ।**
**జ్ఞానతీర్థం పరం తీర్థం బ్రహ్మతీర్థం సనాతనమ్ ॥**
మ.భా. ఆశ్వ.ప. వైష్ణవ ధర్మ పర్వము. పృష్ఠము. 6374.

**అర్థము** :- గురురూప తీర్థముచే పరమాత్మయొక్క జ్ఞానము ప్రాప్తమగును. అందువలననతనికంటే గొప్ప తీర్థము లేదు. జ్ఞానతీర్థము సర్వశ్రేష్ఠమైన తీర్థము మరియు బ్రహ్మతీర్థము సనాతనము.

**శ్లో॥ గురుభావం పరం తీర్థమన్య తీర్థం నిరర్థకమ్ ।**
**సర్వ తీర్థమయం దేవి! శ్రీగురోశ్చరణాంబుజమ్ ॥** (శ్రీగురుగీత)

**అర్థము** :- ఓ పార్వతీ! శ్రీగురుపరమాత్మ స్వరూప చింతన గావించుచుండిన నితరతీర్థములు సేవింపనవసరము లేదు. శ్రీగురు స్వరూప ధ్యానమే పరమ తీర్థము.తీర్థములను సేవించినచో జ్ఞానము గలుగదు. కొంత పుణ్యము మాత్రము గలుగును. శ్రీగురుదేవుని యొక్క పాదారవిందములను సేవించుటచే ననంత సుకృత విశేషము లభ్యమగుటయే గాక నాత్మజ్ఞానము గలుగుచున్నది. కావున యే యితర క్షేత్రములకు జన నవసరము లేదు. ఈ గురుగీత వాక్యముచే శ్రీగురుదేవుడు సర్వతీర్థ స్వరూపుడని వెల్లడి యగుచున్నది.

శ్లో॥ గవాం హి తీర్థే వసతీహ గంగా పుష్టిస్తథాసాం రజసి ప్రవృద్ధా ।
లక్ష్మీఃకరీషే ప్రణతౌ చ ధర్మస్తాసాం ప్రణామం సతతం చ కుర్యాత్॥

అర్థము :- భారతీయ సంస్కృతిలో పరమ పవిత్రముగా, ధర్మస్వరూపముగా పరిగణింపబడు తీర్థస్వరూపిణియైన శ్రీగోమాతలో సకల పాపములను నాశనము చేయు గంగాది పవిత్ర నదులు వసించి యున్నవి. గోవికారములయిన (గవ్యములు) పాలు, పెరుగు, వెన్న మొదలగు ద్రవ్యములు మానవులకు బలమును వృద్ధి జేయును. తనను నమస్కరించిన వారికి సమస్త సంపదలను ప్రసాదించును. కావున గోమాతకు ఎల్లపుడు ప్రణమిల్లు చుండవలయును.

ఈ విధముగా పైనుదహరించినట్లు బ్రాహ్మణుడు, శ్రీ గురుదేవుడు, గోమాత మొదలగునవి జంగమ తీర్థములనబడును.

2. ఇక మానసతీర్థములను గూర్చిన పురాణ వచనమును తెలిసికొనెదము.

శ్లో॥ శ్రుణు తీర్థాని గదతో మానసాది మయానఘే! ।
యేషు సమ్యఙ్నరః స్నాత్వా ప్రయాతి పరమాం గతిమ్ ॥

శ్లో॥ సత్యం తీర్థం క్షమా తీర్థం తీర్థ మింద్రియనిగ్రహః ।
సర్వభూత దయాతీర్థం సర్వత్రార్జవమేవ చ ॥

శ్లో॥ దానం తీర్థం దమస్తీర్థం సంతోషస్తీర్థ ముచ్యతే ।
బ్రహ్మచర్యం పరం తీర్థం తీర్థం చ ప్రియ వాదితా ॥

శ్లో॥ జ్ఞానం తీర్థం ధృతిస్తీర్థం పుణ్యం తీర్థముదాహృతమ్ ।
తీర్థానామపి తత్తీర్థం విశుద్ధిర్మనసా పరా ॥
ఏతత్తే కథితం దేవి! మానసం తీర్థలక్షణమ్ ।

అర్థము :- హే పాపరహితమైన దేవి! వేటి యందు మానవుడు స్నానముచేసి పరమగతిని పొందగలడో, అటువంటి మానస తీర్థములు నాచే తెలుపబడుచున్నవి. శ్రద్ధతో వినుము. సత్యము తీర్థము, క్షమా తీర్థము, ఇంద్రియ నిగ్రహము తీర్థము, సర్వభూతదయ తీర్థము, సరళభావముండుట తీర్థము, అనగా మనస్సులో, వాక్కులో కర్మలో ఒకే భావమనబడును. బ్రహ్మచర్యము పరమ తీర్థము, ప్రియభాషణము తీర్థము, జ్ఞానము తీర్థము, ధైర్యము తీర్థము, పుణ్యము తీర్థము, మరియు నంతఃకరణవిశుద్ధి (నైర్మాల్యము) తీర్థములలో కెల్లా తీర్థమని చెప్పబడినది. ఓ దేవి! ఈ విధముగా నీకు మానసతీర్థలక్షణము (స్వరూపము) చెప్పబడినది.

3. స్థావర తీర్థములు ఈ విధముగా చెప్పబడినవి. అవి ఏమనగా!

శ్లో॥ సంక్షేపేణ మునిశ్రేష్ఠాః! పృథివ్యాం యాని కాని చ ।
విస్తరేణ న శక్యంతే వక్తుం వర్షశతైరపి ॥

శ్లో॥ ప్రథమం పుష్కరం తీర్థం నైమిషారణ్య మేవ చ ।
ప్రయాగం చ ప్రవక్ష్యామి ధర్మారణ్యం ద్విజోత్తమాః ॥

అర్థము :- ఓ మునిశ్రేష్ఠులారా! పృథివి (ఈ భూమండలంలో నున్న) తీర్థములన్నిటి గూర్చి చెప్పుటకు నూరు సంవత్సరములు గూడ సరిపడవు. అందువలన సంక్షేపముగ చెప్పుచుంటిని. వినండి. మొదటి తీర్థము పుష్కరము తదనంతరము నైమిషారణ్యము, ప్రయాగ మరియు ధర్మారణ్యము ఇత్యాది భూమండలములోని (భౌమ తీర్థములు) సమస్తములు స్థావర తీర్థములని దెలియవలెను.

తీర్థక్షేత్రములలో పాటించవలసిన నియమములు గమనించ వలయును.

**శ్లో॥ యస్య హస్తౌ చ పాదౌ చ మనశ్చైవ సుసంయతమ్ ।**
**విద్యా తపశ్చ కీర్తించ సతీర్థ ఫలమశ్నుతే ॥**

(ప.పు.పా.ఖం. 19–24)

**శ్లో॥ మనో విశుద్ధం పురుషస్య తీర్థం**
**వాచాం యమస్త్వింద్రియనిగ్రహస్తపః ।**
**ఏతాని తీర్థాని శరీరజాని**
**స్వర్గస్య మార్గం ప్రతిబోధయన్తి ॥**

అర్థము :- ఎవరు సంయమిత హస్త పాదాదులు (కర్మేంద్రియములన్నియు) మరియు మనస్సును (ఉపలక్షణముగా సమస్త జ్ఞానేంద్రియములను) ఇంద్రియార్థములనుండి నిగ్రహించి, శాస్త్రోక్తమైన జ్ఞానము తపస్సు గలిగి ధర్మ యుక్తమైన కీర్తి గలిగి తీర్థ క్షేత్ర సందర్శనము జేయునో, అతడే తీర్థఫలము నొందును.

మనో నైర్మల్యము, వాక్సంయమనము మరియు నితర సకలేంద్రియ నిగ్రహము అదేవిధముగా శాస్త్రీయ తపస్సు మొదలగు శారీరక తీర్థములు పురుషునికి స్వర్గమునకు మార్గమును సూచించును. మనః శుద్ధి, ఇంద్రియ నిగ్రహము మరియు దైవీ సంపత్తిగల వాడే తీర్థఫలము (పుణ్యము)ను బడయగలడని భావము.

దీనికి విరుద్ధముగా నాచరించిన తీర్థఫలము నొందదని పురాణము చెప్పుచున్నది.

**శ్లో॥ యో లుబ్ధః పిశునః క్రూరో దాంభికో విషయాత్మకః ।**
**సర్వ తీర్థేష్వపి స్నాతః పాపో మలిన ఏవ సః ॥**

శ్లో॥ చిత్త మంతర్గతం దుష్టం తీర్థస్నానాన్న శుద్ధ్యతి ।
శతశోఽపి జలై ర్ధౌతం సురాభాండమివాఽశుచిః ॥

శ్లో॥ అన్యత్ర హి కృతం పాపం తీర్థమాసాద్య నశ్యతి ।
తీర్థేషు యత్కృతం పాపం వజ్రలేపో భవిష్యతి ॥

శ్లో॥ నిగృహీతేంద్రియగ్రామో యత్రైవ చ వసేన్నరః ॥
తత్ర తస్య కురుక్షేత్రం నైమిషం పుష్కరాణి చ ॥
(స్కంధపురాణం. వైష్ణవ ఖండం - మార్గశీర్షమాస మాహాత్మ్యం - 17 వ అధ్యాయము.)

అర్థము :- ఏపురుషుడు అత్యంత లోభియై (పిసినారి); చాడీలు చెప్పువాడై, నిర్దయుడై, దంభాచారియై మరియు విషయాసక్తుడై యుండి సమస్త పుణ్యక్షేత్రములలో (తీర్థములలో) చక్కగా స్నానమాడినప్పటికి నతడు పాపి మరియు మలినుడుగానే యుండును. పునీతుడెన్నటికిని గానేరడు. అంతరింద్రియమైన చిత్తము రాగాది మాలిన్యముతో, విషయ వాసనలతో దూషితమై యున్న యెడల నతడు తీర్థస్నానము చేసినప్పటికి పరి శుద్ధుడు గాడు. సురాభాండమును నూరుసార్లు కడిగినా దానిలోని దుర్వాసన బోనట్లు ఇతడు తీర్థములలో నూరు సార్లు స్నానమాడినా, భావశుద్ధి కలుగదు.

ఇతరస్థలములలో చేసిన పాపములు తీర్థస్థానములలో స్నానము చేసిన నశించును, కాని పుణ్యక్షేత్రములో చేసిన పాపము (అపేయపానము, అభక్ష్యభక్షణము, అకార్యకరణము ఇత్యాదులు) చేసినచో నా పాపము వజ్రలేపమగును. అనగా నదినశించకపోగా ఘోర నరకము ననుభవించవలసి వచ్చును.

కావున నింద్రియ సముదాయమును నిగ్రహించి తీర్థక్షేత్రములో గాని మరియెక్కడైనాగాని యుండి భగవచ్చింతన, ఈశ్వరనామోచ్చారణా

దులచే కాలమును సద్వినియోగపరచునో నతడున్నచోటు కురుక్షేత్రము, నైమిషారణ్యము మరియు పుష్కరాది తీర్థ క్షేత్రమగును.

**దానము :- "శాస్త్రోక్త సంప్రదాన స్వత్వాపాదక ద్రవ్యత్యాగో దానమ్"**

దానము చేయువాడు శాస్త్రోక్త ప్రకారముగా పాత్రులైన వారికి తనయొక్క స్వత్వమును (స్వామిత్వము లేదా (అధికారమును) త్యాగము చేస్తూ గ్రహీత యొక్క స్వత్వమును శ్రద్ధతో ఆపాదిస్తూ చేయు న్యాయార్జిత ద్రవ్య సమర్పణమునకు దానమందురు.

**శ్లో॥ అర్థానాముదితే పాత్రే శ్రద్ధయా ప్రతిపాదనమ్ ।**
**దానమిత్యభినిర్దిష్టం వ్యాఖ్యానం తస్య వక్ష్యతే ॥** (దేవలస్మృతి)

దాత తనయొక్క అర్థమును (ద్రవ్యమును); ఉదితే = శాస్త్రోక్తప్రకారముగా; పాత్రే = యోగ్యులైనవారికి; శ్రద్ధయా = శ్రద్ధచేత తన స్వామిత్వమును త్యాగము చేస్తూ ; ప్రతిపాదనమ్ = గ్రహీత యొక్క స్వత్వమును ఆపాదిస్తూ న్యాయార్జిత ద్రవ్యత్యాగము చేయుట యేది గలదో దానిని దానమందురు. దానియొక్క వ్యాఖ్యానము ముందు చెప్పబడు చున్నది.

**శ్లో॥ దాతా ప్రతిగ్రహీతా చ శ్రద్ధా దేయం చ ధర్మయుక్ ।**
**దేశకాలౌ చ దానానామంగాన్యేతాని షడ్విదుః ॥** (దేవలస్మృతి)

1. దాత, 2. ప్రతి గ్రహీత (దానము తీసికొనువాడు), 3. శ్రద్ధా; 4. ధర్మయుక్ – న్యాయార్జిత దేయ (ఇవ్వబడు) ద్రవ్యము, 5. దేశము మరియు 6. కాలము. ఈ ఆరు దానాంగములని చెప్పబడినవి. దానవిషయములో శ్రద్ధా చాలా ప్రధానము. "శ్రద్ధయా దేయం

అశ్రద్ధయాऽదేయమ్" శ్రద్ధతో దానము చేయవలెను, అశ్రద్ధతో దానము చేయకూడదు. (తై.ఉ. 1-11)

**శ్లో॥ అవజ్ఞయా న దాతవ్యం కస్య చిల్లీలయాऽపి వా ।**
**అవజ్ఞయా కృతం హన్యాత్ దాతారం నాత్ర సంశయః ॥**
(వాల్మీకి రామాయణము 1-13-33 )

**అర్థము :-** ఎవరికైనా దానము చేయునప్పుడు వారికి అనాదర పూర్వకముగా, అశ్రద్ధతో దానము చేయకూడదు. లేనిచో అట్లు చేసిన - దానము దాతను నష్టము చేయును. సందేహము లేదు.

**శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।**
**అసదిచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ ॥** (గీత 17-28)

ఓ అర్జునా! శద్ధ లేకుండా చేసిన హవనము, ఇచ్చిన దానము, తపించిన తపస్సు మరియు నేదేని గూడ శ్రద్ధ లేకుండా చేసిన శుభకర్మ - "అసత్" అనబడును. అందువలన అశ్రద్ధతో చేసిన ఏ శుభకర్మ కూడ ఇహలోకమున గాని మరణించిన పిదపగాని లాభదాయకము (ప్రయోజనకారి) కాదు.

దానము సాత్విక, రాజస మరియు తామస భేదములచే మూడు విధములని భగవంతుడు చెప్పియున్నాడు. (గీత. 17-20, 21,22).

**శ్లో॥ దాతవ్య మితి యద్దానం దీయతేऽనుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్వికం స్మృతమ్ ॥** (17-20)

దానము చేయుట, శాస్త్ర చోదితము (అజ్ఞ)గా భావించి ఫలాపేక్ష లేకుండా విద్యా మరియు తపో యుక్తుడైన అనుపకారి పాత్రునికి కురుక్షేత్రాది పుణ్యక్షేత్రములలోగాని, సూర్యగ్రహణాది పవిత్రకాలములలోగాని యథా

శక్తి ద్రవ్యదానము (గో,భూ, హిరణ్య మరియు అన్నదానాదులను) చేయవలయును. పాత్రుడగు వానికి దానము చేయవలెనని చెప్పుటలో యోగ్యుడని లేదా రక్షకుడని అర్థము చేయాలి. "విద్యా తపోభ్యామాత్మనో దాతుశ్చ పాలన క్షమ ఏవ ప్రతిగృహ్ణీయాత్".

తపస్సు చేత తనను మరియు దాతను రక్షించు సమర్థుడే దానమును గ్రహించ వలయునని శాస్త్రము. ఈవిధముగా దానము చేసినచో దీనిని సాత్త్విక దానమందురు. ఈ సాత్త్వికదానమునే ముముక్షువులు చేయవలెను.

శ్రేష్ఠమైన దానములేవో మీ యభిప్రాయమును చెప్పండి యని ధర్మరాజు అడగగా శ్రీ భీష్మలవారు ఇలా అన్నారు.

**శ్లో॥ అభయం సర్వభూతేభ్యో వ్యసనే చాప్యనుగ్రహః ।**
**యచ్చాభిలషితం దద్యాత్ తృషితాయాభియాచతే ॥**

(మ.భా.అను.పర్వ.దానధర్మ పర్వము 59-3)

సంపూర్ణ ప్రాణులకు అభయదానమిచ్చుట, వ్యసనము అనగా సంకట సమయములో నార్తుల ననుగ్రహించుట, యాచకుడడిగిన దానిని (పాత్రతను గమనించి) యిచ్చుట మరియు దాహముతో నున్న వానికి జలదానము చేయుట మొదలగునవి శ్రేష్ఠమైన దానములు.

దానము యొక్క ఫలమును తెలియ జేస్తూ-

**శ్లో॥ హిరణ్యదానం గోదానం పృథివీ దానమేవ చ ।**
**ఏతాని వై పవిత్రాణి తారయన్త్యపి దుష్కృతమ్ ॥**

(మ.భా. అను. పర్వ. దానధర్మ పర్వము. 59-5.)

**అర్థము :-** సువర్ణదానము, గోదానము, మరియు భూదానము - ఈ మూడు పవిత్రదానములు. ఇవి పాపాత్ముని గూడ తరింప జేస్తాయి.

అన్నదానముయొక్క ప్రాశస్త్యమును తెలుపుతూ శ్రీభీష్ముల వారంటారు.

**శ్లో॥ అన్నమూర్జస్కరం లోకే ప్రాణాంశ్చాన్నే ప్రతిష్ఠితాః ।**
**అన్నేన ధార్యతే సర్వం విశ్వం జగదిదం ప్రభో! ॥**

**అర్థము** - ప్రభో! సంసారములో అన్నమే శారీరక బలమును వృద్ధి చేయును, అన్నము యొక్క ఆధారము చేతనే ప్రాణములు (లేదా ప్రాణులు) నిలిచి యున్నవి. అందు వలననే అన్నమే ఈ సంపూర్ణ జగత్తును ధరించి యున్నది.

**శ్లో॥** అన్నేన సదృశం దానం న **భూతం న భవిష్యతి ।**
**తస్మాదన్నం విశేషేణ దాతుమిచ్ఛన్తి మానవాః ॥**
(మ.భా.అను.ప. దానధర్మపర్వము 63-7,6.)

**అర్థము** :- అన్నముతో సమానమైన దానము లేదు, ఉండబోదు. అందువలననే మానవులు ఎక్కువగా అన్నదానమునే చేయుట కిచ్ఛగించుచున్నారు.

**వ్రతము** :- ప్రతిజ్ఞా పాలనమునకు వ్రతమందురు. లేక, "వ్రతం నామ వేదోక్త విధినిషేధానుష్ఠాననైయత్యమ్" వేదములో (శాస్త్రములో చెప్పబడిన విధి నిషేధములను నియమముచే నాచరించుట వ్రతమందురు.(శాండిల్యోపనిషత్ 2-1) లేదా,

**శ్లో॥** ప్రసన్న **గురుణా పూర్వముపదిష్టం త్వనుజ్ఞయా ।**
**ధర్మార్థమాత్మ శుద్ధ్యర్థ ముపాయ గ్రహణం వ్రతమ్ ॥**
(సూత సంహితా - జ్ఞానయోగ ఖండము-14- 24 )

అర్థము :-సేవాదులచే ప్రసన్నుడైన శ్రీగురు పరమాత్మచే యే యుపాయ విశేషములు (ఉపవాసాదికములు) వదేశింపబడి, వాటిననుష్ఠించుటకాజ్ఞాపింపబడెనో, వాటిచే పుణ్య సంపాదనము ద్వారా ఫలములను పొందుటకు గాని, ప్రతిబంధక పాపనిరాసద్వారా చిత్తశుద్ధి కొఱకు గాని యథా నియమము అనుష్ఠింపబడు ఉపవాసాదులకు వ్రతమందురు.

అథవా, "వ్రతం చ సమ్యక్సంకల్ప జనిత అనుష్ఠేయ క్రియావిశేషరూపమ్" (వాచస్పత్యమ్).

శ్లో॥ సంకల్పమూలః కామో వై యజ్ఞాః సంకల్పసంభవాః ।
వ్రతాని యమధర్మాశ్చ సర్వే సంకల్పజాః స్మృతాః ॥
(మనుస్మృతిః 2-3)

అర్థము :- ఇచ్ఛా సంకల్పమూలకమున్నది. యజ్ఞము సంకల్పము చేతనే కలుగుచున్నది అదేవిధముగా వ్రతము మరియు యమాదులు సంకల్పమునుండే కలుగుచున్నవి.

"ఈ కర్మచేత నా యభీష్ట ఫలము సిద్ధించును" అను నీప్రకారమైన నిశ్చయాత్మికాంతఃకరణవృత్తిరూప బుద్ధియే "సంకల్పమనఁ బడును. (కర్తవ్యత్వాధ్యవసాయః సంకల్పః).

ఈ సంకల్పముచే గలుగు ప్రవృత్తి వలన అనుష్ఠింపబడు క్రియావిశేషమునకు వ్రతమందురు.

ఈ వ్రతము 1. ప్రవృత్తి రూపము 2. నివృత్తి రూపము. 3. మరియు నుభయరూపము అని మూడు విధములు. 1. ద్రవ్య విశేష భోజన పూజాదికము ప్రవృత్తిరూపము. పత్ర,పుష్ప,ఫల నైవేద్యాదులచే

దేవతారాధనాదులను నియమము తప్పకుండా నిత్యము అనుష్ఠించుట యని తెలియ వలయును.

2. ఉపవాసాదికము నివృత్తి రూపము. ఇదియును మరల మూడు విధములు. 1. నిత్యం 2. నైమిత్తికము. 3. కామ్యములు. 1. ఏకాదశ్యాది వ్రతములు నిత్యములు.

2. చాంద్రాయణాది వ్రతములు నైమిత్తికములు. 3. తత్తత్తిథ్యు వవాసాది రూపములు కామ్యములు. పర్వకాలములలో లేదా విశేషదినములలో చేయు ఒక్క ప్రొద్దులు.

3. ఉభయ రూపములు :- శ్రీ సత్యనారాయణ వ్రతము మొదలగునవి.

శ్రీ వరాహపురాణము మానస, కాయిక భేదములచే వ్రతములిరుతెఱఁగులని తెలియజేయుచున్నది.

**శ్లో॥ అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్య మకల్మషమ్ ।**
**ఏతాని మానసాన్యాహు ర్వ్రతాని వ్రతధారిణామ్ ॥**

**అర్థము :-** ఏప్రాణికి ఏప్రకారమైన హింస జేయకుండుట, సత్య పరిపాలనము, దొంగతనము జేయకుండుట, బ్రహ్మ చర్యమును పాలించుట మరియు రాగాది దోష రహితమై యుండుట మొదలగు సాధనములు కలిగియుండుట యేది గలదో- వీటినే వ్రతధారుల యొుక్క మానసవ్రతములని పెద్దలు చెప్పుచున్నారు.

**శ్లో॥ ఏకభుక్తం తథా నక్తముపవాసాదికం చ యత్ ।**
**తత్సర్వం కాయికం పుంసాం వ్రతం భవతి నాన్యథా ॥**

**అర్థము :-** వ్రతార్థము దినములో ఒక పూట మాత్రమే భుజించుట, అదే విధముగా వ్రతార్థము దినమున భుజించకుండా రాత్రిభుజించుట, మరియు దివారాత్రులు భుజించకుండుట లేదా అయాచిత భోజనమును స్వీకరించుట మొదలగునవి వ్రతధారి పురుషులయొక్క కాయిక వ్రతములనబడును. అన్యములు కావు.

శ్రీ కృష్ణ పరమాత్మ శ్రీమద్భగవద్గీత తొమ్మిదవ అధ్యాయములో ఈవిధముగా సెలవిచ్చి యున్నారు. ఎవరు అవిధిపూర్వకముగా - అజ్ఞానపూర్వకముగా, అనగా నన్ను సర్వాత్మ భావముచే నెఱుంగక అన్య దేవతాదుల నారాధిస్తారో వారు అంతఃకరణోపాధి గుణత్రయభేదముచేత మూడు తెఱంగులని తెలియ జేసెను.

**శ్లో॥ యాన్తి దేవవ్రతా దేవాన్పితౄన్యాన్తి పితృవ్రతాః ।**
**భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మామ్ ॥**

(గీత. 9-25)

**అర్థము :-** అవిధిపూర్వకముగా నారాధించు వారిలో సాత్త్వికులైన వారు దేవవ్రతులు. అనగా వసు,రుద్ర, ఆదిత్యాది దేవతల సంబంధమైన వ్రతము గలవారు. వ్రతము అనగా నైవేద్యము, ఉపహారము, ప్రదక్షిణ మరియు ప్రణామాది పూజలు. వాటిచే ఆయా దేవవతలనారాధించు వారు వారినే పొందుచున్నారు. "తం యథా యథా ఉపాసతే తథైవ భవతి" ఆ పరమాత్మను ఏవిధంగా ఉపాసిస్తాడో అదే అవుతాడు అని శ్రుతి ప్రమాణము. రాజసగుణముగలవారు అగ్నిష్వత్తాది పితరులనుపాసించి వారినే పొందుదురు. తమోగుణము గలవారు యక్ష, రాక్షస, వినాయక మరియు మాతృగణాది భూత పూజలుజేసి ఆయా భూతములనే పొందెదరు. ఈ

ప్రకారముగా సాత్త్వికాది భేదముచే వ్రతధారులు మూడు విధములని భగవంతుడు తెలియ జేసెను.

వ్రతము నాచరించునపుడు చిత్తము సాత్త్విక దైవీ వృత్తిని గలిగి భగవన్మయమై సకల సద్గుణములతో నిండియుండవలెను. హృదయము నిండా యిష్టదైవము నిలిచి యుండవలెను. వ్రతాచరణకాలములో ముఖ్యముగా గమనింపవలసిన విషయములు నాలుగు.

**శ్లో॥ బ్రహ్మచర్యం తథా శౌచం సత్య మామిషవర్జనమ్ ।**
**వ్రతేష్వేతాని చత్వారి వరిష్ఠానీతి నిశ్చయః ॥** (దేవల స్మృతి.)

**అర్థము :-** బ్రహ్మచర్యము, శౌచము, సత్యము మరియు అభక్ష్య తథా అపేయ పదార్థముల వర్జనము (త్యాగము) - ఈ నాలుగు ముఖ్య విషయములు వ్రతకాలములో పాలించవలెనని వృద్ధుల నిర్ణయము.

వ్రతములు సకల వర్ణములవారికి సర్వసాధారణములని తెలియజేస్తూ ఫలమును గూడ పురాణములు దెలుపుచున్నవి.

**శ్లో॥ వినిగ్రహేశ్చేంద్రియాణాం కుర్వీత నియతాత్మవాన్ ।**
**ఉపవాస జప ధ్యాన తీర్థ స్నానాదికైరపి ॥**

**శ్లో॥ వ్రతైర్యజ్ఞేన దానేన తపసా తీర్థ సేవయా ।**
**అనేక జన్మసంసిద్ధిమేనః క్షపయతి ద్విజః ॥**

(గరుడ పురాణము)

**అర్థము :-** ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహము గలిగిన ద్విజుడు, ఉపవాసము, జపము, ధ్యానము, తీర్థ స్నానాదుల చేత, వ్రతములచేత, యజ్ఞములచేత, దానము చేత, తపస్సుచేత మరియు తీర్థక్షేత్ర పర్యటన

మొదలగు పుణ్య కార్యములచేత ననేక జన్మసముపార్జిత పాపమును నాశనము చేసికొనును.

వ్రతాదులు చాతుర్వర్ణ్యముల వారికి సాధారణములని చెప్పబడి నందున పై శ్లోకములో "ద్విజ" శబ్దగ్రహణము అన్ని వర్ణముల కుపలక్షణార్థమని తెలియవలెను. ఇట్లు చెప్పినచో శూద్రులకు యజ్ఞమునందధికారము లేనందున శ్లోకములో "యజ్ఞేన" శబ్దగ్రహణము విరోధమున్నదని శంకించవలదు. ఎందుకనగా! యజ్ఞశబ్దము నకనేకార్థములున్నందున దేవతా పుజాద్యర్థములను దెలియవలయును.

శ్లో॥ వ్రతోపవాసనియమైః శరీరోత్తాపనైస్తథా ।
వర్ణాః సర్వేఽపి ముచ్యంతే పాతకేభ్యో న సంశయః ॥

**అర్థము :-** వ్రతము, ఉపవాసాది నియములచేత, శాస్త్రోక్త మార్గమున కాయేంద్రియ శోషణరూప తపస్సు చేత సకల వర్ణముల వారు పాపములనుండి ముక్తులగుచున్నారు. ఇందులో నిసుమంతైనను సందియము లేదు. అని ఫలసహితముగా సకల వర్ణముల వారికి వ్రతాదులు సాధారణములని – దేవల స్మృతి.

శ్లో॥ మాం హి పార్థ వ్యపాశ్రిత్య య్యేపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యా స్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాంగతిమ్ ॥
(గీత. 9-32)

**అర్థము :-** హే పార్థ! నన్ను ఆశ్రయించిన (శరణుబొందిన) యే పాప జన్మలున్నారో అనగా జాతి దోషముచే దూషితులైన అన్త్యజులు మరియు పశుపక్షులు మొదలుకొని తిర్యగ్యోనులున్నాయో లేదా జాతి దోషముచే ఏ దుష్టులున్నారో, అదే విధముగా వేదాధ్యయనాది శూన్యులైన

స్త్రీలు, కృష్యాదులందు సంలగ్నమైన వైశ్యులు మరియు జన్మతః అధ్యయన శూన్యులైన పరమగతికి అయోగ్యులైన శూద్రులు మొదలగువారుగూడ పరమగతిని పొందుచున్నారు. "అపి" శబ్దముచే (గీత 9-30) చెప్పబడిన సుదురాచారులైనప్పటికి నన్ను శరణు బొందినచో పరమగతిని బొందగలరు. ఈ భగవద్వచనము చేత గూడ జప, తప, ధ్యాన, వ్రత, పూజాదులందు సకల వర్ణాశ్రమముల వారు మరియు సకల జీవులు అర్హులని, ఈ వ్రతాదులు సర్వ సాధారణములని దెలియబడుచున్నవి.

ప్రకృత అభంగములో మొదటి చరణములో శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - ఏమానవుడు ఇంతదనుక పైన సవిస్తరముగా వర్ణింపబడిన తప, తీర్థ, దాన మరియు వ్రతములను శాస్త్రోక్త ప్రకారముగా శ్రద్ధతో నాచరించు చుండునో మరియు హరి గుణ గానము నెవరు అనన్య భక్తితో చేయుచుండునో, వారి నితరులు వారి సాధన నుండి బుద్ధిభేదము చేయ కూడదు. అశ్రద్ధను నిర్మాణము చేసి వారి సాధనకు విఘ్నము (ప్రతిబంధకము) కలిగించగూడదు. ఏలననగా!

శ్లో॥ యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషణామ్" (గీత. 18-5)

**అర్థము :-** ఫలాభిసంధిరహితులైన తత్తదధికారి పురుషులకు యజ్ఞ దాన తపస్సులు పావనములు. అనగా జ్ఞాన ప్రతిబంధక పాపరూప మలక్షాళనము చేత జ్ఞానోత్పత్తి యోగ్యతారూప పుణ్య గుణాధానముచేత నంతఃకరణశుద్ధికి తోడ్పడును.

"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసా నాశకేన" (బృ.ఉ. 4-4-22) ఆ ఈ ఆత్మను బ్రాహ్మణులు (ముముక్షువులు) వేదములయొక్క స్వాధ్యాయము, యజ్ఞము, దానము మరియు తప ఉపవాసాది వ్రతములచేత తెలిసికొనుటకిచ్ఛగించు చున్నారు.

ఈ శ్రుతికి భాష్యం వ్రాస్తూ శ్రీ శంకరులంటున్నారు- "వేదానువచన యజ్ఞదాన తపః శబ్దేన సర్వమేవ నిత్యం కర్మ ఉపలక్ష్యతే । ఏవం కామ్య వివర్జితం నిత్యం కర్మజాతం సర్వం ఆత్మ జ్ఞానోత్పత్తి ద్వారేణ మోక్షసాధనత్వం ప్రతిపద్యతే ।"

**అర్థము :-** యజ్ఞాది శ్రుతేః - "యజ్ఞేన దానేన తపసానాశకేన" ఈ శ్రుతిబలముచేత, సర్వాపేక్షా - బ్రహ్మసాక్షాత్కారమునకు సర్వ కర్మలు పరంపరాసాధనములుగా (చిత్త శుద్ధి వైరాగ్య సంన్యాస శ్రవణమనన నిధిధ్యాసనాది పరంపర చేత) స్వీకరించబడినవి, ఉదాహణమునకు - అశ్వవత్ - ఏ విధముగా గమన క్రియారూపపరంపరచేత గ్రామప్రాప్తికి అశ్వము (గుఱ్ఱము) సాధనమైనట్లు అందువలన యజ్ఞాది శ్రుతి అప్రామాణ్యము గాదు.

ఈ ప్రకారముగా స్మృతి, శ్రుతి మరియు యుక్తి చేత తపస్సు మొదలగు విహిత కర్మలు ఆత్మ జ్ఞానయోగ్యతా ప్రాప్తి ద్వారా మోక్షమునకు సాధనములున్నందున, ఈ సాధనల యందు శ్రద్ధతో సకామముచేతగాని, నిష్కామముచేతగాని ప్రవృత్తుడై విధిపూర్వకముగా నాచరించు వానికి విఘ్నము (బుద్ధిభేదము) గలిగించరాదని శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు. దీనికి "ఈశ్వరగీత" ప్రమాణము.

**శ్లో॥ న బుద్ధి భేదం జనయేదజ్ఞానాం కర్మ సంజ్ఞినామ్ ।**
**జోషయేత్సర్వ కర్మాణి విద్వాన్యుక్తః సమాచరన్ ॥** (గీత. 3-26)

**అర్థము :-** అజ్ఞానాం కర్మసంజ్ఞినామ్- "నేను ఈ కర్మను చేయుదును, దీని ఫలము ననుభవించుదును" అను కర్తృత్వాభిమానముచే ఫలాపేక్ష గలవాడై కర్మయందభినివేశము గలవాడైన యవివేకి యొక్క బుద్ధి భేదము - బుద్ధిని విడగొట్టడము (బుద్ధి చాంచల్యమును) "ఈ కర్మ

చేయవద్దు, దీనికి వేరు మార్గము (ప్రత్యామ్నాయ)మున్నది" యని కర్మల యందలి విశ్వాసమును, న జనయేత్ – పుట్టించకూడదు. మరేమి చేయాలి? విద్వాన్ – జ్ఞానియైనవాడు; యుక్తః – సమాహితుడై; (శ్రద్ధావంతుడై); సర్వకర్మాణి – సమస్తకర్మలను; సమాచరన్ – తాను చక్కగా నాచరిస్తూ ; జోషయేత్ – అవిద్వానునితో చేయించాలి. అలమితి విస్తరేణ. ఇంతవరకు అభంగములోని మొదటి చరణమునకు యథామతి వ్యాఖ్యానము చేయడమైనది. 1.

ఇంతేగాకుండా తపస్సు, తీర్థము, దానము, వ్రతము మరియు హరి గుణగానము చేయువానికి బుద్ధి భేదము చేయగూడదని చెప్పుటలో మరొక హేతువును శ్రీతుకారాం మహారాజుగారు చూపించుచున్నారు. ఏమన! సత్కర్మానుష్ఠానము చేయు మనుష్యుని యొక్క నరకములో పడిన తన కోటి కులము స్వతః వారి ఉద్ధరణ కోసము ఈ పుణ్యాత్మునియొక్క పుణ్యమునకు ఎదురు చూచుచుందురు. అనగా ఇతని పుణ్యముచే నరకస్థ తన కోటికులము ఉద్ధరింపబడునని శాస్త్రవచనము.

**శ్లో॥ వ్రతం కుర్యాన్నరో యస్తు అధ్వానం పరిసర్పతి ।**
**నరకస్థా న్పితౄంస్తద్వత్ స్వర్గం నయతి సత్వరః ॥**
**కులే తస్య న రాజేంద్ర! ప్రైతో భవతి కశ్చన ॥**

**అర్థము :–** ఏనరుడు వ్రతమును జేయునో అతడు సంసారము నుండి స్వయముగా తరించడమే గాక తన వంశీయులు ఎవరైతే నరకములో పడిరో వారిని తన పుణ్యముచే స్వర్గమునకు తీసికెళ్ళును. ఓ రాజేంద్ర అతని కులములో ఎవరు గూడ భూత, పిశాచయోనిని పొందరు. ఉపలక్షణముగా పశు పక్షి క్రిమి కీటకాది నీచయోనులు (జన్మలు) పొందరని భావము.

ఇటువంటి పుణ్యాత్మున్ని బుద్ధి భేదము కలిగించి ఎవరైతే సాధనకు విఘ్నము కలిగించునో నతడు జ్ఞాని గాని, అజ్ఞాని గాని ఎవరైనా ఉండుగాక ఈ సాధకుని యొక్క కోటి కులమును చంపినంత బ్రహ్మ హత్యతో సమానమైన పాపమును పొందును.

బ్రహ్మ హత్య యనగా బ్రాహ్మణ ప్రాణ వియోగ ఫలక వ్యాపారము. బ్రహ్మ హత్యను మనుస్మృతిలో మహాపాతకములలో పఠించడమైనది.

శ్లో॥ బ్రహ్మ హత్యా సురాపానం స్తేయం గుర్వంగనాగమః ।
మహాన్తి పాతకాన్యాహుః సంసర్గశ్చాపి తైః సహ ॥ (మను. 11-54)

అర్థము :- బ్రాహ్మణహత్య, మద్యపానము, దొంగతనము, గురుపత్నిగమనము మరియు ఈ నలుగురిలో ఏ ఒక్కరితోనైన సహవాసము చేయుట ఈ ఐదింటిని మహాపాతకములంటారు. 2.

మిగతా చరణముల యర్థము సామాన్యము. తాత్పర్యములో తెలియ పరచడమైనది.

11. అభంగము :-

ఏకాదశీస అన్నపాన । జే నర కరితీ భోజన ।
శ్వాన విష్ఠే సమాన । అధమ జన తే ఏక ॥1॥

ఐకా వ్రతాచే మహిమాన । నేమేం ఆచరతీ జన ।
గాతీ ఐకతీ హరికీర్తన । తే సమాన విష్ణూశీం ॥2॥

అశుద్ధ విటాళసీచేం ఖళ । విడా భక్షితా తాంబూల ।
సాంపడే సబళ । కాళా హోతీం న సుటే ॥3॥

సేజ బాజ విలాస భోగ । కరితీ కామినీ చా సంగ ।
తయా జోడే క్షయరోగ । జన్మ వ్యాధీ బళివంత ॥4॥

**ఆపణ నవజె హరి కీర్తనా । ఆణికా వారీ జాతాం కోణా ।**
**త్యాచ్యా పాపేం జాణా । తేంగణా తో మహామేరూ ॥5॥**

**తయా దండీ యమదూత । ఝాలే తయాచే అంకిత ।**
**తుకామ్హణే వ్రత । ఏకాదశీ చుకలియా ॥6॥ (170)**

ప్ర.ప:- ఏకాదశీ = ఏకాదశి రోజున; జే నర = ఏ నరుడైతే; అన్న= భోజనమును ; (మరియు) పాన = నీటిని ; కరితీ = చేయునో(సేవించునో); (అతనియొక్క ఆ భోజనము) శ్వాన విష్ఠేసమాన= కుక్క మలముతో సమానము ; మరియు (ఎవరైతే ఏకాదశి వ్రతము నాచరించరో) తే జన = ఆ జనులు ; (ఈ లోకములో) ఏక అధమ = ఒకానొక అధముడు (నీచుడు); 1. (ఓ జనులారా!) వ్రతాచే = ఏకాదశి వ్రతము యొక్క మహిమాన = మహిమను; ఐకా = వినండి; జన = ఏ జనులైతే; నేమేం ఆచరతీ = నియమముతో ఏకాదశి వ్రతమును ఆచరింతురో; హరి కీర్తన గాతీ = హరి కీర్తనము గానము చేయుదురో; ఐకతీ – శ్రవణము చేయుదురో, తే = వారు; విష్ణూశీ ; విష్ణువుతో; సమాన ; సమానము. 2. (ఏ జనులైతే ఏకాదశి రోజున) విడా = విడము; తాంబూల = తాంబూలము (పోకలు వగైరా) భక్షితాం = భక్షించినచో; ఖళ = (ఆ) దుర్మార్గుడు; అశుద్ధ = అశుద్ధమైన; విటాళసీ చేం= స్త్రీరజమును (తినుచున్నాడని తెలియవలెను. ఇంతే గాక నతడు) సబళ ; బలవంతుడైన; కాళ = కాలుని (యముని); హాతీం= చేతిలో; సాంపడే = చిక్కినాడు; న సుటే = (ఎప్పుడు గూడ) విడువ బడడు. 3. (ఎవరైతే ఏకాదశి రోజున) సేజ = మృదువైన శయ్య ( పడక)ను; బాజ = మంచమును; కామినీ చా సంగ = స్త్రీ సాంగత్యము; (మరియు) విలాస భోగ = భోగ విలాసములు; కరితీ = చేయునో (సల్పునో); తయా = అతనికి; క్షయరోగ = క్షయరోగము; జోడే

= అంటుకొనును; (ఇంతే గాకుండా) బలివంత = ప్రబలమైన; జన్మ = జనన (మరణ రూప); వ్యాధీ = భవరోగము (ప్రాప్తమగును). 4. (ఎవరైతే ఏకాదశిరోజున) ఆపణ = తాను (స్వతః) హరికీర్తనా = హరికీర్తనమునకు; నవజే = వెళ్ళడో; (మరియు) ఆణికాం = ఇతరులు; కోణా = ఎవరైనా; జాతా = పోవుచున్నచో (వారిని) వారీ = వారించునో (పోనివ్వడో); త్యా చ్యా = వాడియొక్క; పాపేం= పాపము (ముందు); తోమహామేరు = ఆ మహామేరు పర్వతము (గూడ) ఠేంగణా = పొట్టిదని (చిన్నదని); జాణా = తెలియండి. 5. తుకామ్హణే = శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు; ఏకాదశి వ్రత = ఏకాదశి వ్రతమును; (ఏ నరుడు) చుకలియా = తప్పునో(ఆచరించడో); తయా = అతనిని; యమదూత = యమకింకరుడు; దండీ = దండించును (శిక్షించును); తయాచే = (ఇంతేగాక నతడు) యమదూతకు; అంకిత = అంకితము (ఆధీనము); ఝాలే = ఆయెను॥ 6॥

తా॥ ఏకాదశి రోజున ఎవరైతే అన్నమును భుజించునో, పునః పునః నీరు మరియు నితర పానీయములు సేవించునో, వారి యొక్క ఆ భోజనము శ్వానవిష్ఠా (కుక్క మలము)తో సమానము- మరియు ఎవరు ఏకాదశివ్రతమును పాలించరో వారు ఈ జగత్తులో అధములని తెలియవలెను. 1. ఓ జనులారా! ఏకాదశి వ్రత మాహాత్మ్యమును వినండి. ఏమనగా! ఎవరు ఏకాదశి వ్రతమును నియమముచే నాచరించునో, హరి కీర్తనముఁ జేయునో లేదా శ్రవణము జేయునో వారు విష్ణుతుల్యురు (సమానులు). 2. ఎవరు ఏకాదశి రోజున విడా, తాంబూలము (సుపారీ) తినునో, వారు ఆ విడా, తాంబూలాది రూపములో స్త్రీరజమును (ముట్టు రక్తమును) తిను చున్నారని దెలియ వలయును. ఇంతేగాదు – ఈ దుష్టుడు – ప్రబలమైన కాలుని, (యముని) చేత జిక్కి, ఎన్నడును విడువ బడడు. 3.

ఎవరు ఏకాదశి రోజున మంచముపైనగాని, మృదువైన (పరుపులు, మెత్తలు గల) శయ్యపై గాని నిదురించుదురో, శరీరమునకు సుగంధతైలము మర్దించుకొనునో, సుందరమైన, విలువైన దుస్తులు ధరించునో, నాటకములు మరియు సినిమాలు చూచునో, స్త్రీ సహవాసముఁ జేయునో, వారు క్షయరోగము లేదా రక్త కుష్టు మొదలగునసాధ్య వ్యాధులతో పీడింప బడుదురు. ఇంతంత యని (కిం బహునోక్తేన) ఏమి చెప్పవలెను. బలవంతమైన జన్మ మరణరూప మహాదుఃఖమును పొందెదరు. 4. ఎవరు ఏకాదశి రోజున స్వతహాగా హరికీర్తనకు (భజనకు) వెళ్ళక, వెళ్ళువారికి వెళ్ళనివ్వరో వారి పాపము ముందు మేరుపర్వతము చిన్నదగును. 5. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - ఏకాదశి వ్రతమునాచరించని పాపి యమదూతలకధీనుడై, వారిచే శిక్షింపబడును. 6.

సు.వ్యా:- అహోరాత్ర భోజన (అభావః) నివృత్తిః ఉపవాసః ।రాత్రి మరియు దినము(24 గంటలు) ఆహారమును తీసికొనకుండుట ఉపవాసము యొక్క సామాన్య లక్షణము. ఇది వైధము అవైధమని రెండు విధములు. శాస్త్ర సమ్మతమైనది వైధము. ఇది వ్రతరూపముండును. దీని యొక్క విశేష లక్షణము-

శ్లో॥ ఉపావృత్తస్య పాపేభ్యో యస్తు వాసో గుణైః సహ ।
ఉపవాసః స విజ్ఞేయః సర్వభోగవివర్జితః ॥ (భవిష్యపురాణము)

తా॥ ఉపావృత్తస్య = నివృత్తస్య ; పాపేభ్యః = పాప కర్మభ్యః (శాస్త్ర నిషిద్ధ సర్వ కర్మలనుండి నివృత్తమయిన వాడు అని అర్థము)లేదా దోషేభ్యః = రాగద్వేషమాత్సర్యాది దోషముల నుండి నివృత్తమయినవాడు అని అర్థము. కావున ఉపవాస వ్రతము నాచరించువాడు సర్వ పాపములనుండి లేదా సర్వ దోషములనుండి ఉపరతుడై యుండి, దయా,క్షమా, అనసూయ,

శౌచము, అనాయాసము, అకార్పణ్యము, అస్పృహా, భగవద్ధ్యానము, తజ్జపము, తత్కథాశ్రవణాది మంగళగుణములు గలిగి యుండి, నృత్య, గీత స్రక్చందన వనితాది భోగ వివర్జితుడై యుండుట యేది గలదో, దానిని ఉపవాసమందురు.

ఈ ఉపవాసము త్రివిధము. 1. నిత్యము, 2. కామ్యము, 3నైమిత్తికము.

1. ఏకాదశి, శివరాత్ర్యాద్యుపవాసములు నిత్యములు.

2. అమావాస్య, ద్వాదశి, మరియు సంక్రాంత్యాది ప్రశస్త తిథులలో చేయునవి కామ్యములు.

3. ప్రాయశ్చిత్త రూపములు నైమిత్తికములు (చూడుము. మనుస్మృతి 11-211) ఏకాదశి వ్రతము నిత్యము గాన యావజ్జీవితము సదా శ్రద్ధతో నాచరించదగినదని శాస్త్రవచనము.

**శ్లో॥ ఉపోష్యైకాదశీ రాజన్! యావదాయుః సువృత్తిభిః ।**

(ఆగ్నేయ పురాణము)

**తా॥** ఓ రాజా! సచ్చరిత్రులు, సదాచారసంపన్నులైనవారు జీవించి యున్నంతవరకు ఏకాదశి వ్రతమాచరించవలెను.

**శ్లో॥ ఏకాదశీ సదోపోష్యా పక్షయోః శుక్లకృష్ణయోః ।**

(సనత్కుమార సంహితా)

**తా॥** శుక్ల పక్షములోని ఏకాదశి మరియు కృష్ణ పక్షములోని ఏకాదశి - ఈ రెండు ఏకాదశి రోజులయందు ఉపవాస వ్రతము తప్పకుండా ఎల్లప్పుడు చేయదగినది. ఒకవేళ ఏకాదశి వ్రతమాచరించనిచో దోషమును చెప్పుచున్నాడు సనత్కుమారుడు.

శ్లో॥ న కరోతి హి యో మూఢః ఏకాదశ్యాముపోషణమ్ ।
స నరో నరకం యాతి రౌరవం తమసావృతమ్ ॥

శ్లో॥ ఏకాదశ్యాం మునిశ్రేష్ఠ! యో భుంక్తే మూఢచేతసః ।
ప్రతిమాసం స భుంక్తే తు కిల్బిషం శ్వాది విట్సమమ్ ॥

తా॥ ఏ మూఢుడు ఏకాదశి రోజున ఉపవాసవ్రతము నాచరించడో, ఆ నరుడు తమస్సుచే నావరింపబడినటువంటి రౌరవాది నరకమునకు వెళ్ళును. ఓ మునిశ్రేష్ఠుడా! ఏ మూఢ చేతస్కుడు (మూఢబుద్ధి) ఏకాదశి రోజున అన్నమును భుజించునో, వాడు ప్రతి మాసము శ్వాది విష్ఠతో (కుక్క పంది మొదలగు వాటి యొక్క మలముతో) సమానమైన పాపమును భుజించు చున్నాడని దెలియ వలెను.

శ్లో॥ ఏకాదశ్యాం దినే యోఽన్నం భుంక్తే పాపం భునక్తి సః ।
ఇహలోకే చ చాండాలో మృతః ప్రాప్నోతి దుర్గతిమ్ ॥

తా॥ ఏ మనుష్యుడు ఏకాదశి దివసమున అన్నమును భుజించునో, వాడు పాపమును తినుచున్నాడని యెఱుఁగవలయును. వాడు బ్రతికినన్నాళ్ళు ఈ లోకములో చండాలునితో సమానము. మరణించిన పిదప దుర్గతిని పొందును. (పద్మపురాణము - ఉత్తర ఖండము 53-43, 44)

శ్లో॥ యో భుంక్తే వాసరే విష్ణోః శ్వపచాదధికో హి సః । (స్కం.పు)

తా॥ ఎవరు విష్ణువాసరము (ఏకాదశి దినము)న భుజింతురో, వారు కుక్క మాంసమును వండుకొని తిను శ్వపచు (చండాలు)ని కంటే నధికమైన నీచుడని తెలియవలెను..

శ్లో॥ పాపాని కానిచిద్యాని బ్రహ్మహత్యా సమాని చ ।
అన్నమాశ్రిత్య తిష్ఠన్తి సంప్రాప్తే హరివాసరే ॥
తాని పాపాన్యుపాశ్నాతి భుంజ్జానో హరివాసరే ॥

**అర్థము :-** బ్రహ్మ హత్యా సమమైన ఏయే పాపములు గలవో, అవి యన్నియు ఏకాదశి రోజున అన్నమునాశ్రయించియుండును. ఆరోజున నెవరైనా అన్నమును భుజించినచో నతడు బ్రహ్మహత్యా సమమైన పాపములనే తినుచున్నాడని దెలియవలెను. 1.

ఎవరు ఏకాదశిరోజున నియమముచే వ్రతపాలన చేస్తూ, హరికీర్తనము చేయునో లేదా శ్రవణముచేయునో వారు విష్ణుసమానులు.

**శ్లో॥ యదీచ్ఛేద్విష్ణు సాయుజ్యం శ్రియా సంతతి మాత్మనః ।**
**ఏకాదశ్యాం న భుంజ్జీత పక్షయోరుభయోరపి ॥** (కూర్మ పురాణము)

అర్థము :- ఎవరు విష్ణు సాయుజ్యము నిచ్ఛగింతురో, ఐశ్వర్యము మరియు తనకు సంతానము కావాలని యిచ్ఛగింతురో వారు యిరుపక్షములలో ఏకాదశి రోజున అన్నమును భుజించగూడదు - అని సకాములకు ఫలము వినబడుచున్నది. 2.

ఎవరు యేకాదశి దినమున విడా (విడెము), తాంబూలము (సుపారీ లేదా వక్కపొడి) తినునో వాడు ఆ రూపములో స్త్రీ రజస్సును తినుచున్నాడని యెఱుంగవలయును. ఇంతేగాక వాడు ప్రబలమైన కాళుని (యముని) చేతికి జిక్కినవాడై ఎన్నటికిని తప్పించుకొననసమర్థుడగును.

మరియు ఏకాదశి రోజున మంచముపైనగాని, పరపులు - తలదిండ్లు గల మృదువైన శయ్యపై గాని పవళించుట, శరీరమునకు సుగంధ తైలము మర్దించుకొనుట, సుందరమైన, విలువైన దుస్తులు ధరించుట, నాటకములు మరియు సినిమాలు చూచుట మరియు స్త్రీ సహవాసము చేయుట మొదలగు విలాసభోగముల ననుభవించినచో నతడు క్షయరోగము, రక్తకుష్ఠ మొదలగునసాధ్య వ్యాధులచే పీడింపబడును.

**శ్లో॥ అసకృజ్జలపానం చ దివా స్వాపం చ మైథునమ్ ।**
**తాంబూలచర్వణం మాంసం వర్జయేద్వ్రతవాసరే ॥**
**(కూర్మ పురాణము)**

అర్థము :- ఏకాదశివ్రత దివసమున ననేక మారులు జలపానము చేయుట, పగలు నిద్రించుట, మైథునమొనర్చుట, తాంబూలాదులను నములుట మరియు మాంసభక్షణము చేయుట మొదలగునవి త్యజించవలయును.

**శ్లో॥ ద్యూత క్రీడాం చ నిద్రాంచ తాంబూలం దంతధావనమ్ ।**
**పరాపవాద పైశున్యే, స్తేయం హింసాం తథా రతిమ్ ॥**
**క్రోధం చానృత వాక్యాని హ్యేకాదశ్యాం వివర్జయేత్ ।**
**(పద్మపురాణము- ఉత్తరఖండము. 50-19,20)**

అర్థము : -ఏకాదశి రోజున జూదమాడుట, నిదురించుట, విడెము (తాంబూలాదులను సేవించుట), దంతధావనము, ఇతరులను నిందించుట, చాడీలు చెప్పుట, దొంగతనము, ప్రాణిహింస, మైథునము, క్రోధము మరియు నసత్య భాషణము - ఈ పదునొకండు విషయములను త్యాగము చేయవలయును.

ఏకాదశి వ్రతఫలము నీవిధముగా శాస్త్రము నుడువుచున్నది.

**శ్లో॥ ఏకాదశీ సమం కించి త్పాపత్రాణం న విద్యతే ।**
**స్వర్గ మోక్ష ప్రదా హ్యేషా రాజ్య పుత్ర ప్రదాయినీ ॥**
**సుకళత్ర ప్రదాహ్యేషా శరీరారోగ్యదాయినీ ॥ (నారదీయము)**

**అర్థము :-** పాపపరిహారము చేయుటలో ఏకాదశివ్రతముతో సమమైనది మరొకటి లేదు. ఈ వ్రతము సకాములకు స్వర్గమును,

రాజ్యమును, సంతానమును, సుగుణ రాశియైన భార్యను, మరియు శరీరారోగ్యము నిచ్చునదై యున్నది.

శ్లో॥ నిష్కామస్తు గృహీ కుర్యా దుత్తరైకాదశీం తథా ।
సకామస్తు తదా పూర్వాం కుర్యాద్బౌధాయనోఽబ్రవీత్ ॥

అర్థము :- నిష్కామ గృహస్థుడు ఉత్తర ఏకాదశిని మరియు సకాముడు పూర్వ ఏకాదశి వ్రతము నాచరించవలయునని బోధాయనుడు చెప్పెను.

**12. అభంగము :-**

భవసాగర తరతాం । కారే కరీతసాం చింతా ।
పైల ఉభాదాతా । కటీం కర ఠేవూనియాం ॥1॥

త్యాచే పాయీం ఘూలా మిఠీ । మోల నేఘే జగజేఠీ ।
భావా ఏకాసాఠీం । ఖాందా వాహే ఆపుల్యా ॥2॥

సుఖే కరావా సంసార । న సండావే దోన్హీ వార ।
దయా క్షమా ఘర । చోజవీత యేతీల ॥3॥

భుక్తీ ముక్తీ చీ చింతా । దైన్య నాహీ దరిద్రతా ।
తుకా మ్హణే దాతా । పాండు రంగ వోళగిల్యా ॥4॥ (203)

ప్ర.ప:- (ఓ నరుడా!) భవసాగర = జన్మమరణరూప సంసార సాగరమును ; తరతా = దాటుటకు ; చింతా = చింత ; కారే = ఎందుకురా; కరీతసాం = చేయుచున్నావు. (అటువైపు చూడు) కటీ = నడమున; కర = చేతులు ; ఠేవూనియాం = పెట్టుకొని; పైల = చంద్రభాగ తీరమునందు; దాతా = అభయదాత (పాండురంగడు); ఉభా = నిలుచున్నాడు. 1. త్యాచే=

అతని యొక్క; పాయీం = పాదములకు ; మిఠీఘాలా = నమస్కారము చేయుము (ఆ) జగజేఠీ = జగత్ శ్రేష్ఠుడు (పాండురంగడు); మోల = మూల్యమును; (నీనుండి ఏమి) నేఘే = తీసికొనడు. (కాని అతనికి నీయొక్క) భావ = శుద్ధాంతఃకరణము (మాత్రము కావాలి); ఏకాసాఠీం = (నీయొక్క) ఒక్క శుద్ధ భావమునకు మాత్రమే; (పాండురంగడు) ఆపుల్యా = తనయొక్క; ఖాందా = భుజములపై (భక్తున్ని ఎత్తుకొని సంసారరూప నది యొక్క అవతల తీరమునకు) వాహే = మోసికొని పోవును. 2. సంసార - కుటుంబ జీవనము ; సుఖే = సుఖముగా; కరావా = చేయండి; (కాని) దోన్హీ = రెండు; వార = వారి (క్షేత్రమునకు లేదా యాత్రకు నియమించుకున్న సమయమునకు తప్పకుండా వెళ్ళుట); న సండావే = వదల గూడదు; దయా, క్షమా అను సద్గుణములు ; చోజవీత = శోధించుకుంటూ; ఘర= (మీ) యింటికి; యేతీల = వచ్చును. 3. (శ్రీ) తుకామ్హణే = శ్రీతుకారాం మహారాజు గారంటున్నారు; (ఒక్కసారి) దాతా = అభయదాత; (అయిన) పాండురంగ = శ్రీపాండురంగ(నికి); వోళగిల్యా = శరణు వెళ్ళినచో (ఆ భక్తునికి) దైన్య దరిద్రతా, భుక్తీ ముక్తీ = భోగమోక్షముల; చీ = యొక్క చింతా = చింత; నాహీ = లేదు. 4.

**తా॥** ఓయీ నరుడా! భవసాగరము నుండి తరించుటకు చింతజేయుచుంటివా? అటు వైపు చూడుము. నడుముపై చేతులిడుకొని సమర్థుడైన శ్రీపాండురంగడు నిన్ను తరింప జేయుటకు చంద్రభాగ నదీ తీరమున నిలచియున్నాడు. 1. అతని శ్రీ చరణములపై బడుము. జగత్ శ్రేష్ఠుడైన శ్రీవిఠలుడు నీనుండి ఏవిధమైన ద్రవ్యరూప మూల్యమును గోరడు. కేవలము భక్తియుక్తమైన భావము (మనస్సు) ఉండిన చాలును. అంతమాత్రము చేతనే నిన్ను (భక్తుని) తన భుజములపై నెక్కించుకొని

భవసాగరము యొక్క అవతలి తీరమునకు మోసుకొని పోవును. 2. ఒక్కసారి మనస్సును సంపూర్ణముగా భగవంతునికి సమర్పించి భవసాగరము నుండి తరించు భారమును అతనిపై వేసినచో, చాలు, ఇక భక్తునికి తన గురించిన చింతకు కారణమే లేదు. సుఖముగా స్త్రీ, పుత్ర, బంధు మిత్రాదులతో సంసారమును (కుటుంబ జీవనము) గడువ వచ్చును. కాని సంవత్సరమునకు రెండు వారీలు - అనగా - "ఆషాఢ మరియు కార్తీక మాసములలోని శుక్లపక్ష ఏకాదశిరోజులలో పండరీ క్షేత్ర యాత్ర" మాత్రము విడువరాదు. తద్వారా దయా, క్షమాది దైవీ సంపత్తి మీ యింటిని వెతుకుతూ స్వయముగా ఆనందముచే విచ్చేయును. 3. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు ఒక్కసారి అభయ దాతయైన శ్రీ విఠలేశునికి సంపూర్ణముగా శరణు బొందిన భక్తునికి దైన్య(దుఃఖ) దారిద్ర్యతలకు సంబంధించిగాని భోగమోక్షములకు సంబంధించిగాని చింతజేయుటకు కారణమేమి గలదు. 4.

**13. అభంగము -**

**పంఢరీచే వారకరీ । తే అధికారీ మోక్షాచే ॥1॥**

**పుండలికా దిధలా కర । కరుణాకరే విఠలేం ॥2॥**

**మూఢ పాపీ జైసే తైసే । ఉతరీ కాసే లావూనీ ॥3॥**

**తుకా మ్హణే ఖరే ఝూలేం । ఏకా బోలే సంతాచ్యా ॥4॥ (1081)**

ప్ర.ప :- (ఎవరైతే) పంఢరీచే = శ్రీక్షేత్రము పంఢరీ యొక్క ; వారకరీ = వారి) (యాత్ర) జేయునో; తే = అతడు ; మోక్షాచే ; మోక్షమునకు; అధికారీ = అధికారి (సమర్థుడగును); 1. (ఈవిధముగా) కరుణాకరేం విఠలేం= కృపాసాగరుడైన శ్రీవిఠలేశుడు; పుండలికా = భక్తపుండరీకునికి;

వర = వరము ; దిధలా = ఇచ్చెను. 2. (అందువలననే) శ్రీరంగడు) మూఢ= మూఢుడైన ; పాపీ = పాపాత్ముని (గూడ) జైసే = ఎట్లున్నను; తైసే = అట్లే; కాసేఀ లావూని = (తన) నడుమునకు కట్టుకొని ; (భవసింధువు నుండి) ఉతరీ = తరింపజేయుచున్నాడు. 3. తుకామ్హణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; ఎకా సంతాచ్యా = ఒకానొక (శ్రీ పుండరీక) సంతు మహాత్మునియొక్క; బోలేఀ - వచనము ; ఖరేఀ = నిజము ; ఝాలేఀ- ఆయెను. 4.

**తా॥** ఎవడు శ్రీక్షేత్రము పండరీపుర వార్కరీ యగునో నతడు మోక్షాధికారియై ముక్తుడగును. 1. అని శ్రీవిఠలుడే శ్రీభక్త రాజు పుండరీకునికి వరము నిచ్చెను. 2. అందువల్లనే శ్రీరంగడు ఎటువంటి పాపినైనను తన నడుముకు కట్టుకొని భవసింధువు నుండి తరింపజేయుచున్నాడు. శ్రీభక్త పుండరీకుడు రంగన్ని ఈ విధముగా ప్రార్థించాడు.

**శ్లో॥ జ్ఞాన విజ్ఞాన హీనానాం మూఢానాం పాపినా మపి ।**
**దర్శనాత్తే భవేన్మోక్షః ప్రార్థయామి పునః పునః ॥** (పాం.మ)

**అర్థము :-** ఓ దేవా! జ్ఞానము గాని విజ్ఞానము గాని లేని మూఢ పాపులను గూడ, మీ యొక్క దర్శన మాత్రము చేతనే ముక్తులను జేయుమని పదే పదే ప్రార్థించుచున్నాను. ఈ విధముగా పుండరీకుడు వేడుకొనగా శ్రీవిఠలేశుడు "తథాస్తు" అన్నాడు. 3. ఈ ప్రకారముగా సంతుమహాత్ముడైన పుండరీకుని యొక్క వచనము సత్యమైనది. 4.

**14. అభంగము :-**

**పుండలీక భక్తరాజ । తేణేఀ సాధియేలేఀ కాజ ।**
**వైకుంఠీచే నిజ । పరబ్రహ్మ ఆణిలేఀ ॥1॥**

పాండు రంగ బాళమూర్తి । గాఈ గోపాళ సాంగతీ ।
యే ఊనియాం ప్రీతి । ఉభే సమచిరాహిలేఁ ॥2॥

ఎకా ఆగళే అక్షరే । భూ-వైకుంఠ చి దూసరేఁ ।
మ్హణవితీ యేరేఁ పరీ తీ ఐసీ నవ్హేతీ ॥3॥

పాప పంచక్రోశీమధీఁ । యే ఊ న శకేచి కధీఁ ।
కై చీ తెథె విధి । నిషేధాంచీ వసతి ॥4॥

పురాణే బోలతీ ఐసే । చతుర్భుజ తీఁ మాణసేఁ ।
సుదర్శనా వరీ వసే । న బుడే హే కల్పాంతీఁ ॥5॥

అనుపమ్య ఇచీ థోరీ । మహాక్షేత్ర మహీవరీ ।
ధన్యవారకరీ । తుకా మ్హణే తేథీచే ॥6॥ (2494)

ప్ర.ప :- పుండరీక = పుండరీకుడు; భక్తరాజ = భక్తరాజు (ఉన్నాడు). తేణేఁ= (.త్యానే) అతడు ; కాజ = (గొప్ప) కార్యమును ; సాధియేలేఁ = సాధించినాడు. (ఏమనగా?) నిజ = స్వ (ధామము అయిన); వైకుంఠీచే = వైకుంఠములో ఉందు నటువంటి ; పరబ్రహ్మ = పరబ్రహ్మమును (విష్ణువును); అణిలేఁ = (శ్రీక్షేత్రము పండరీపురమునకు) తీసికొచ్చినాడు. 1. (ఆ పరబ్రహ్మము) పాండురంగ = పాండురంగడు" (అను నామధేయముతో); బాలమూర్తి = బాలరూపముతో; గా ఈ, గోపా'ళ సాంగతీ = గోవులు, గోపాలుర సాంగత్యముతో ; ప్రీతి = (పుండరీకుని యొక్క) ప్రేమ కోసము; యే ఊనియాం = (పండరీపురమునకు) వచ్చి ; సమచి = సమచరణములతో; ఉభే = (ఇటుకపై) నిలబడి ; రాహిలేఁ= ఉన్నాడు. 2. (ఈ పంఢరీ పురము) ఎకా = ఒక; అక్షరేఁ = అక్షరము (వర్ణము); ఆగళేఁ = ముందుగా గలిగిన; దూసరేఁ=రెండవదైన; భూ=వైకుంఠచి = భూ = వైకుంఠమే; యేరేఁ =

ఇతరములైన (క్షేత్రములు (శ్రేష్ఠములు, పవిత్రములు అని); మ్హణవితీ = అనిపించుకుంటాయి. పరీ = కాని, ఐసీ = ఈ పంధరీ క్షేత్రంవంటి (శ్రేష్ఠములు పవిత్రములు తీ=అవి, నవ్హే = కావు. 3. (పంధరీపురము యొక్క పరిధిలో) పంచక్రోశీ మధీఁ = ఐదు క్రోసులలో ; పాప = పాపము ; కధీ = ఎప్పుడు గూడ; యే ఊం = రావడానికి ; న శకేచి = శక్యత లేదు; (అందవలన) తెథే = ఆ పంధరీపుర పరిధిలో ; విధి = పాపనివృత్త్యర్థము ప్రాయశ్చిత్త విధి యొక్క గాని ; నిషేధాం చీ = (పాపము చేయకుము; అను నిషేధము యొక్క గాని (ప్రవృత్తి) కైచీ = ఎలా; వసతి = ఉండగలదు; 4. (ఎందువల్లననగా) మాణసే = (పంధరీలోని) మనుష్యులు; తీ = వారు; చతుర్భుజ = నాలుగు భుజములు గలవారని ; (మరియు నా పండరీపురము) సుదర్శనావరీ = శ్రీమహావిష్ణువు యొక్క సుదర్శన చక్రముపై; వసే = వసించి (నెలకొని) యున్నదని ; హే = ఈ పంధరీపురము ; కల్పాంతీఁ = కల్పాంతము నందుగూడ; న బుడే = మునిగిపోదని; ఐసే = ఈ విధముగా; పురాణే = పురాణములు, బోలత = చెప్పుచున్నది. 5. తుకా మ్హణే = శ్రీ తుకారాం మహారాజు గారంటున్నారు ; మహీవరీ = ఈ పృథివిలో ; మహాక్షేత్ర = శ్రీపంధరీ మహాక్షేత్రము ; ఇచీ = దీని యొక్క ; అనుపమ్య = నిరుపమానము ; థోరీ = గొప్పది. (మరియు) తేథీచే = ఆ పంధరీ పుణ్యక్షేత్రములో నున్న ; వారకరీ = వార్కరి భక్తులు ; ధన్య ధన్య = ధన్యులు, ధన్యులు. 6.

**తా॥** వైకుంఠవాసియగు పరబ్రహ్మ శ్రీమన్నారాయణుడు పంధరిలో భక్తులను భవసాగరమునుండి తరింప జేయుటకు కటి బద్ధ హస్తుడై స్థిరముగా నిలిచి యుండునటువంటి గొప్పకార్యమును సాధించిన భక్తరాజు శ్రీపుండరీకుడు. 1. పరమాత్మ శ్రీ మహావిష్ణువు గో-గోపాలురతో సహా

శ్రీభక్త పుండరీకుని ప్రేమరూప భక్తిచే నాకర్షింపబడి పదములు జోడించి యిటుకపై శ్రీ పంధరీక్షేత్రమున "శ్రీ పాండురంగ" నామధేయముతో బాలరూపముచే నిలచి యున్నాడు. 2. పృథివి యందుపమానరహితమైన, పరమ పవిత్రమైన, సర్వ శ్రేష్ఠమైన శ్రీ పంధరి "భూ" యనునేకాక్షరాధిక వైకుంఠము. "భూవైకుంఠము". శ్రీపంధరీ క్షేత్రే తర క్షేత్రములు శ్రేష్ఠములు, పవిత్రములు అని అనిపించుకున్నప్పటికి శ్రీక్షేత్రము పంధరీతో సమానమైన శ్రేష్ఠములు, పవిత్రములు మాత్రము కావు. 3. శ్రీ పండరీ పరిసరాల పంచక్రోశ పరిధిలో పాపమునకు ప్రవేశము లేనందున, పాపనివృత్తి కొఱకు ప్రాయశ్చిత్త విధిగాని, "పాపము చేయకుము" అను నిషేధములుగాని ఎలా ప్రవృత్తములగును? 4. ఎందువలనననగా శ్రీ పంధరీ పురప్రజలు చతుర్భుజులని, శ్రీ పంధరీ క్షేత్రము శ్రీమహావిష్ణువుయొక్క సుదర్శనచక్రముపై నెలకొని యున్నదని, కల్పాంతమునందు గూడ ప్రళయము గాదని పురాణ వచనము. 5. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు – పృథివిలో నిటువంటి నిరుపమానమైన శ్రీ పండరిక్షేత్ర "వార్కరి" భక్తులెవరైతే యున్నారో, లేక కాగలరో వారు ధన్యులు, వారి జీవనము ధన్యము. 6.

**15. అభంగము :-**

**కాంరే పుంఢ్యా మాతలాసీ । ఉభేం కేలేం విఠలాసీ ॥1॥**

**ఐసా కైసారే తూంధీట । మాగే భిరకావలీ వీట ॥2॥**

**యుగేం ఝూలీ అఠావీస । అజునీ నమ్హణసీ బైస ॥3॥**

**భావ దేఖోని నికట । దేవేం సోడలేం వైకుంఠ ॥4॥**

**తుకా మ్హణే పుండలికా । తూంచి భక్త బళియానికా ॥5॥** (2980)

ప్ర.ప :- కాంరే పుంఢ్యా = ఏమిరా పుండరీకా! ; మాతలాసీ = (ప్రేమ రూప భక్తిచే) ఉన్నత్తుడవైనావు ; విఠలాసీ = శ్రీ విఠలేశున్ని ;

ఉభే కేలేc = నిలబెట్టినావు; 1. తూ c = నీవు; ఐసా = ఈ విధముగా; కైసా రే ధీట = మొరటు తనము నేల వహించితివిరా!; వీట = యిటుకను; మాగే = వెనుకకు; భిరకావలీ = విసరివైచితివి. 2. అఠావీస = ఇరువది ఎనిమిది ; యుగేc = యుగములు; ఝాలే = గడచినవి; అజునీ = ఇంకాగూడ; బైస = కూర్చొనుము; (అని) న మ్హణసీ = అనవైతివి. 3. నికట = ఉత్కటమైన; (అనన్యమైన భావ) = (నీయొక్క) ప్రేమ భావమును; దేఖోని = చూసి; దేవేc= దేవుడు; వైకుంఠ = వైకుంఠమును; సోడలేc = విడచినాడు. 4. తుకా మ్హణే = శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు; పుండలికా = ఓ పుండరీకుడా! తూంచి = నీవే; నికా = (సర్వోత్తముడవైన) నిజమైన; బళియా = బలవంతుడవైన; భక్త = భక్తుడవు. (ఉన్నావు) 5.

**తా॥** అరే పుండరీకా! ప్రేమ రూప భక్తిచే మదోన్మత్తుడవై శ్రీ విఠలేశున్ని నిలబెట్టితివేమిరా! 1. ఇంతటి మొరటు తనము నేల వహించితివి. ఇటుకను వెనక్కి విసరివేసితివి. 2. ఇరువది ఎనిమిది యుగములు గడచినవి. ఇప్పటికి గూడ స్వామిని "కూర్చొనుము" అని పలుకవైతివి. 3. నీయొక్క ఉత్కటమైన భావభక్తిని చూసి ఆ దేవుడు (శ్రీరంగడు) స్వయముగా వైకుంఠమును వీడినాడు. 4. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు. పుండరీకా! నీవే సర్వోత్తమమైన నిజమైన బలవంతుడవైన పాండురంగ భక్తుడవు. 5.

సు.వ్యా :- ఒరే పుండరీకా! ఏమిరా నీ యమర్యాద చేష్ట. ప్రేమ రూప భక్తిచే నున్మత్తుడవై, అవినయముచే నవజ్ఞుడవై విఠలుని ఇలా నిలబెట్టితివి. 1. ఏమిరా నీ మొరటుతనము. నీకు దర్శనమిచ్చి నీతో ప్రేమ పూరిత వార్తాలాపము చేయుటకేతించిన దేవదేవునికి మృదువైన యాసనమైనా వేయకుండా యిటుకను వెనక్కి విసరి, దానిపై నహెూరాత్రులు

నిలబెట్టితివి. 2. నీతో ప్రేమచే తనివిదీర సంభాషణము చేయాలని, నీకాలింగన మొసంగవలెనని ఇరువది ఎనిమిది యుగముల నుండి నీకోసము నిరీక్షిస్తూ ఉన్నా, ఇప్పటికైనా స్వామిని పలుకరించవైతివి. "కూర్చొనండి" అని కూడ చెప్పవైతివి. 3. నీయొక్క ఉత్కట భావ భక్తిచే ప్రేరితుడై, నీకు దర్శనమిచ్చుటకై నిజవైకుంఠమును వీడి పంఢరీపురమును భూవైకుంఠముగా మార్చాడు పాండురంగడు. 4. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు. పుండరీకా! సమస్త భక్తాగ్రేసరుల యందు నిజమైన బలవద్భగవద్భక్తుడవు నీవేనయ్యా. ఆహా! ఏమి నీ భక్తి వైశిష్ట్యము. నీకు నా హృత్పూర్వక శతకోటి ప్రణామములు. నా యొక్క ధన్యవాదములు స్వీకరించుము. 5.

**16.** అభంగము :-

జయా నాహీ నేమ ఏకాదశీవ్రత ।
జాణావే తేఁప్రేత సర్వలోకీఁ ॥1॥

త్యాచే వయ నిత్య కాళ లేఖితాహే ।
రాగేఁ దాంతఖాయ కరకరా ॥2॥

జయాజియే ద్వారీ తుళసీ వృందావన ।
నాహీఁ తేఁ స్మశాన గృహ జాణా ॥3॥

జయే కుళీఁ నాహీఁ ఏకహీ వైష్ణవ ।
త్యాచాబుడే భవనదీ తాఫా ॥4॥

విఠోబా చేఁనాంవ నుచ్చారీ జేఁ తోండ ।
ప్రత్యక్ష తేఁ కుండ చర్మకాంచేఁ ॥5॥

**తుకా మ్హణే త్యాచే కాష్ఠ హాతపాయ ।**
**కీర్తనా నవ జాయ హరీచియా ॥6॥ (34)**

ప్ర.ప :- జయా - ఎవరికైతే ; ఏకాదశీవ్రత - ఏకాదశి వ్రతము (యొక్క); నేమ = నియమము; నాహీఁ = లేదో; తే = వారు ; సర్వలోకీఁ= సమస్తలోకములలో; ప్రేత = ప్రేతము (అని); జాణావే = తెలియ వలెను. 1. త్యాచే = అతనియొక్క ; వయ = అయుశ్మును; నిత్య - ప్రతి నిత్యము; కాళ= కాలుడు (యముడు); లేఖితాహే = లెక్కించుచున్నాడు; రాగేఁ = కోపముతో; దాంత = దంతములు ; కరకరా = కరకరమని ; ఖాయ = కొరుకుతున్నాడు. 2. జయాజియే = ఎవరి యొక్క; ద్వారీ = ద్వారము నందు. (ముంగిట); తుళసీ వృందావన = తులసీ బృందావనము; నాహీ ఁ= లేదో; తేఁ = ఆ; గృహ = ఇల్లు ; స్మశాన = స్మశానమని; జాణా= తెలియండి. 3. జయే = ఎవరి యొక్క; కుళీఁ = కులమునందు ; ఏకహీఁ-ఒక్కరుగూడ; వైష్ణవ - విష్ణుభక్తుడు ; నాహీ ఁ -లేడో; త్యాచా - అతని యొక్క; తాఫా - కుల సముదాయము ; భవనదీ - సంసార సాగరములో; బుడే - మునుగును. 4. జేఁ- ఎవరు; తోండ - (తనయొక్క) నోటితో; విఠోబాచే ఁ -శ్రీ విఠలుని యొక్క; నాంవ - నామమును; నుచ్చారీ- ఉచ్చరించడో; తేఁ - వాని యొక్క ఆ నోరు; ప్రత్యక్ష - ప్రత్యక్షముగా ; చర్మకాంచే - చర్మకారుని (మాదిగవాని) యొక్క ; కుండ - మురికి లంద. 5. తుకామ్హణే - శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు ; (ఎవడు) హరీ చియా - హరియొక్క ; కీర్తనా - కీర్తనమునకు ; నవజాయ - వెళ్ళడో; త్యాచే - వానియొక్క ; హాతపాయ - చేతులు, కాళ్ళు; కాష్ఠ - కాష్ఠము(కట్టెల)తో సమానము. 6.

**తా॥** ఎవడికి ఏకాదశి వ్రతము చేయు నియమము లేదో, ఆ మనుష్యుడు మూడులోకములలో ప్రేతము (పీనుగ లేదా పిశాచము) అని

తెలియవలెను. 1. కాలుడు (యముడు) అతని యొక్క ఆయువును లెక్కిస్తూ, వాడిపై కోపముతో పండ్లు కరకరా కొరుకుతుంటాడు. 2. ఎవరి యొక్క ఇంటి ముందు శ్రీతులసీ బృందావనముండదో, ఆ ఇల్లు స్మశానమని తెలియవలెను. 3. ఎవరి యొక్క కులములో ఒక్కడు గూడ విష్ణుభక్తుడు జన్మించలేదో లేదా హరిభక్తి చేయువాడు లేడో, వాడియొక్క ఆ కుల సముదాయము పేరుతో సహా భవనదిలో మునిగి పోవును. 4. ఎవడు వాని నోటినుండి శ్రీ విఠలుని యొక్క దివ్య నామమునుచ్చరింపడో, వాడి ఆ నోరు, పశువులతోళ్ళు నానబెట్టు మాదిగవాని (చర్మకారుని) యొక్క మురికి లందయని తెలియవలెను. 5. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు– ఎవడు శ్రీహరి యొక్క కీర్తనకు, భజనకు వెళ్ళడో, తాళములు వాడి చేతులతో మ్రోగించడో(వాయించడో), వాడి యొక్క ఆకాళ్ళు, చేతులు పొయ్యిలో పెట్టి సగము కాల్చి పిదప చల్లార్చిన కొఱవి కట్టెలతో సమానము. 6.

సు.వ్యా :- శ్రీ తులసీ మాహాత్మ్యమును అనేక పురాణములు విశేషముగా వర్ణించు చున్నవి. శ్రీదేవీ భాగవతములో నవమ స్కంధములో శ్రీ తులసీ వైశిష్ట్యమును ఈ ప్రకారముగా వర్ణించనైనది.

**శ్లో॥ యస్యా దేవ్యాస్తులా నాస్తి విశ్వేషు నిఖిలేషు చ ।**
**"తులసీ" తేన విఖ్యాతా తాం యామి శరణం ప్రియామ్ ॥**

**అర్థము** :- శ్రీ విష్ణువు ఇలా అంటున్నాడు. సంపూర్ణ విశ్వములో ఏదేవికి (సమానము) తులనా చేయుటకశక్యమో. అందువలన ఏదేవి "తులసీ" అను పేరుతో పిలువ బడు చున్నదో, అటువంటి నా ప్రియురాలిని శరణు జేరుచున్నాను.

**శ్లో॥ పురా బభూవ యా దేవీ త్వాదౌ వృందావనే వనే**
**తేన "వృందావనీ" ఖ్యాతా సౌభాగ్యాం తాం భజామ్యహమ్ ॥**

**అర్థము** :- ఏదేవి ప్రాచీనకాలములో వృందావనములో ప్రకటమయ్యెనో, అందువలన ఎవరు "వృందావనీ" అని విఖ్యాతి నొందెనో, అటువంటి సౌభాగ్యవతియైన దేవిని నేనుపాసించుచున్నాను.

**శ్లో॥ నిత్యం యస్తులసీతోయం భుంక్తే భక్త్యా చ మానవః ।**
**లక్షాశ్వమేధజం పుణ్యం సంప్రాప్నోతి స మానవః ॥**

**అర్థము** :- ఏ మానవుడు ప్రతినిత్యము పవిత్రమైన తులసీ జలమును భక్తితో సేవించునో నతడు లక్ష అశ్వమేధయాగములు జేసిన పుణ్యమును పొందును.

**శ్లో॥ తులసీ పత్ర తోయం చ మృత్యు కాలే చ యో లభేత్ ।**
**ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకే మహీయతే ॥**

**అర్థము** :- ఏ వ్యక్తి యొక్క మరణకాలములో ముఖమునందు తులసీ జలమును పొందునో నతడు సర్వపాపముల నుండి ముక్తుడై, విష్ణులోకమునకధికారి యగును.

**శ్లో॥ సాత్వతైస్తులసీ కాష్ఠ మాలాకుంజ సముద్భవా ।**
**ధార్యా నిత్యం ప్రయత్నేన త్వేతద్భక్తస్య లక్షణమ్ ॥**

**అర్థము** :- తులసీ కాష్ఠ నిర్మిత మాలలు లేదా పత్ర నిర్మిత మాలలు (తులసీమాలలు) విష్ణుభక్తులచే ప్రయత్న పూర్వకముగా ధరించదగినవి. ఇది భక్తుని యొక్క లక్షణము. (ఆమ్హా అలంకార ముద్రాంచే శృంగార తులశీచే హార వాహూ కంఠీ । (గాథా 1709)

**శ్లో॥ తులసీ కాష్ఠ నిర్మాణ మాలాం గృహ్ణాతి యో నరః ।**
**పదే పదేఽ శ్వమేధస్య లభతే నిశ్చితం ఫలమ్ ॥**

**అర్థము :-** ఎవరు తులసీ కాష్ఠ నిర్మిత మాలను మెడలో ధరించుదురో, వారు అడుగడుగున నశ్వమేధఫలమును నిశ్చితముగా పొందుదురు.

**శ్లో॥ పూర్ణిమాయా మమాయాం చ ద్వాదశ్యాం రవి సంక్రమే ।**
**తైలాభ్యంగం చ కృత్వా చ మధ్యాహ్నే నిశి సంధ్యయోః ॥**

**అశౌచేఽ_శుచికాలే యే రాత్రి వాసోఽ_స్నాతా నరాః ।**
**తులసీం యే విచిన్వంతి తే ఛిందంతి హరేః శిరః ॥**

**అర్థము :-** పౌర్ణమి, అమావాస్య, ద్వాదశి, సూర్య సంక్రాంతి, మధ్యాహ్న కాలము, రాత్రి, రెండు (ఉదయము, సాయము) సంధ్యలయందు, అశౌచసమయమందు, రాత్రి నిదురించిన పిదప స్నానము చేయకుండా –ఇటువంటి సమయములందు మరియు శరీరమునకు తైలమును రుద్దుకొని ఏ మనుష్యుడు శ్రీతులసీ పత్రమును త్రెంచునో, నతడు స్వయముగా శ్రీవిష్ణువు యొక్క శిరచ్ఛేదనము చేసిన వాడని యెంచవలయును.

అన్యపురాణములందు గూడ శ్రీతులసీ యొక్క మాహాత్మ్యము ఈ విధముగా వినబడుచున్నది.

**శ్లో॥ యత్ఫలం సర్వ పుష్పైశ్చ సర్వ పత్రేణ యత్ఫలమ్ ।**
**తులస్యా స్తద్దళార్ధేణ పుణ్యం స్యాద్విష్ణు పూజనే ॥**

**తులసీ గంధమాదాయ యత్ర గచ్ఛతి మారుతః ।**
**దిశోదశ పునాత్యాశు భూతగ్రామాంశ్చతుర్విధాన్ ॥**

**అర్థము :-** సర్వప్రకారముల పుష్పములతో, పత్రములతో శ్రీమహావిష్ణువు నర్చించిన నే ఫలము లభ్యమగునో నది కేవలము సగము (అర్ధ) తులసి పత్రముతో శ్రద్ధా భక్తి పురస్సరముగా నారాధించిన

లభ్యమగును. తులసీ వృక్షము మీదుగా వెళ్ళిన గాలి దశదిశలను మరియు తత్రస్థ చతుర్విధ (అండజ, జరాయుజ, ఉద్భిజ్జ మరియు స్వేదజ) ప్రాణులను పునీతము జేయును.

**శ్లో॥ పుష్కరాద్యాని తీర్థాని గంగాద్యాః సరితస్తథా ।**
**వాసుదేవాదయో దేవా వసన్తి తులసీదలే ॥**

**అర్థము :-** పుష్కరము, ప్రయాగ, కాశీ ఇత్యాది ఏ పుణ్యతీర్థములు గలవో, గంగా, యమునా మొదలగు యే పవిత్రమైన నదులు గలవో, శ్రీకృష్ణాది దేవతలెవరు గలరో వీరందరు శ్రీ తులసీ పత్రములో వసించు చున్నారు.

**శ్లో॥ తులసీ కాననం చైవ గృహే యస్యావతిష్ఠతే ।**
**తద్గృహం తీర్థభూతం హి నాయాన్తి యమకింకరాః ॥**

**అర్థము :-** ఏ పుణ్యాత్ముని గృహమున తులసీ వనముండునో నా గృహము పవిత్రతీర్థస్థలముగా పరిగణింపబడును. ఆ యింటికి యమకింకరులు వచ్చుటకు భయపడుదురు. అసమర్థులు యని యర్థము.

**శ్లో॥ శుక్లా కృష్ణా చ తులసీ గుణై స్తుల్యా ప్రకీర్తితా ।**

**అర్థము :-** గుణ సామ్యముచే తులసీ శుక్ల (తెల్లనిది), కృష్ణ (నల్లనిది) యని యిరు తెఱంగులుగా చెప్పబడు చున్నది.

**శ్లో॥ అస్నాత్వా తులసీం ఛిత్వా యః పూజాం కురుతే నరః ।**
**సోఽపరాధీ భవేత్సత్యం తత్సర్వం నిష్ఫలం భవేత్ ॥**

**అర్థము :-** స్నానము చేయకుండా (అశుచిగా) యెవరు శ్రీ తులసీ పత్రములను త్రెంచి దైవ పూజను చేయుదురో, ఆ నరుడు అపరాధి యని యెన్నబడును. అతడు చేసిన పూజ నిష్ఫలమగును.

శ్రీతులసి పత్రములను త్రెంచునపుడు భక్తి పూర్వకముగా పఠించవలసిన మంత్రములు ఈ క్రింద చూపబడుచున్నవి. (పద్మ పురాణము - క్రియాయోగ సారము నుండి)

శ్లో॥ మాత స్తులసి! గోవింద హృదయానందకారిణీ! ।
నారాయణస్య పూజార్థం చినోమి త్వాం నమోఽస్తు తే ॥

శ్లో॥ కుసుమైః పారిజాతాద్యైః సుగంధైరపి కేశవః ।
త్వయా వినా నైవ తృప్తిం చినోమి త్వామతః శుభే ! ॥

శ్లో॥ త్వయా వినా మహాభాగే! సమస్తం కర్మనిష్ఫలమ్ ।
అతస్తులసి! దేవి! త్వాం చినోమి వరదా భవ ॥

శ్లో॥ చయనోద్భవ దుఃఖం యద్దేవి! తే హృది వర్తతే ॥
తత్ క్షమస్వ జగన్మాత స్తులసి! త్వాం నమామ్యహమ్ ॥

శ్లో॥ కృతాంజలిరిమాన్ మంత్రాన్ పఠిత్వా వైష్ణవో జనః ।
కరతాలత్రయం దత్వా చినుయాత్తులసీ దలమ్ ॥

శ్లో॥ శనైః శనైస్తథా కారైశ్ఛీయతే తులసీ దలమ్ ।
యథా న కంపతే శాఖా తులస్యా ద్విజసత్తమ! ॥
శ్లో॥పత్రాణాం చయనే విప్ర! భగ్నశాఖా యథా భవేత్ ।
తథా హృది వ్యథా విష్ణో ర్దీయతే తులసీపతేః ॥

అర్థము :- శ్రీ గోవిందుని హృదయము నానందింప జేయు నో తులసిమాత! శ్రీమన్నారాయణుని పూజకోసం పత్రములను త్రెంచుచున్నాను. కావున నీకు నా నమస్కారము.

అత్యంత సుగంధయుక్త పారిజాతాది పుష్పములచే నర్చించినను,

నీవు లేక (తులసి పత్రము లేక) నారాయణుడు తృప్తి జెందదు, కావున నోమంగళకరమైన తులసీ మాత! నిన్ను త్రెంచుచున్నాను.

ఓ మహాభాగా! నీవు లేకుండా సమస్త కర్మలు (పూజాదులు) నిష్ఫలములు. కావున నిన్ను త్రెంచుచున్నాను. ఓ తులసీ దేవి! నేను చేయు సమస్త కర్మలు (పూజాదులు) సఫలములగునట్లు వరము నిమ్ము.

ఓ తులసీ దేవి! పత్రములు త్రెంచునపుడు నీ హృదయములో యత్కించిద్దుఃఖము గలిగిననో జనన్మాత! తలసీ! నన్ను క్షమించుము. కావున నీకు నమస్కరించు చున్నాను.

విష్ణు భక్తుడు తులసీ దలములను త్రెంచు సమయమున నంజలిబద్ధుడై శ్రీతులసీ ప్రదక్షిణము చేస్తూ పై చెప్పిన మంత్రములను పఠించి, మూడుసార్లు కరతాల ధ్వని (చప్పట్లు)గావించి శ్రీతులసీ దలములను త్రెంచవలెను.

**శ్రీ తులసీ దలములను కోయునపుడు తీసికోవలసిన జాగ్రత్తలు :-**

ఓ ద్విజోత్తమ! శ్రీతులసి వృక్షము యొక్క శాఖలు (కంపించ) కదలకుండా మెల్ల మెల్లగా దలములను కోయవలెను.

శ్రీ తులసీ పత్రములను త్రెంచునపుడు తులసీ వృక్ష శాఖలు ఒకవేళ విరిగినచో, పత్రములను త్రెంచు నా విష్ణుభక్తుడు శ్రీ మహావిష్ణువు యొక్క హృదయమును నొప్పించిన వాడని యెఱుంగవలయును.

**శ్రీ తులసీ సందర్శన నమస్కారము :-**

శ్లో॥ యాదృష్టా నిఖిలాఘ సంఘ శమనీ స్పృష్టా వపుష్పావనీ,
రోగానామభివందితా నిరసనీ సిక్తాంతక త్రాసినీ ।

**ప్రత్యాసత్తి విధాయినీ భగవతః కృష్ణస్య సంరోపితా,**
**న్యస్తా తచ్చరణే విముక్తి ఫలదా తస్యై తులస్యై నమః ॥**
(పద్మపురాణము - పాతాళఖండము. 79-66)

**అర్థము :-** ఎవరిని దర్శించినంత మాత్రము చేతనే సమస్త పాప సముదాయమును నాశనము చేయునో, స్పర్శించినంత మాత్రముననే శరీరమును పునీతము జేయునో, ప్రణమిల్లినచో సకల రోగములను నివృత్తి జేయునో, జలసేచనము జేసినచో యమునికి గూడ భయము గలిగించునో, ఆరోపించి(నాటి)నచో శ్రీకృష్ణ సాన్నిధ్యమునకు గొని పోవునో, భగవంతుని శ్రీచరణముల యందు సమర్పించినచో మోక్షరూపఫలమును ప్రసాదించునో - అటువంటి శ్రీతులసీ దేవికి నాయొక్క నమస్కారము.

శ్రీ తులసి యొక్క ప్రత్యవయవము పరమ పావనము.

**శ్లో॥ పత్ర పుష్పం ఫలం మూలం,**
**శాఖా త్వక్ స్కంధ సంజ్ఞితమ్ ।**
**తులసీ సంభవం సర్వం,**
**పావనం మృత్తికాదికమ్ ॥** (ప.పు.పా.ఖం. 24-2)

**అర్థము :-** శ్రీ తులసి యొక్క పత్రములు, పుష్పములు, ఫలములు, వేరు, శాఖలు, చర్మము, కాండము మరియు శ్రీతులసి వృక్షము క్రింది మృత్తికా సహితము సర్వము పరమపావనములు.

మరియు శ్రీతులసియొక్క నవవిధభక్తి ఈ ప్రకారముగ వినబడుచున్నది.

**శ్లో॥ దృష్టా స్పృష్టాఽథవా ధ్యాతా, కీర్తితా నామతః స్తుతా ।**
**రోపితా సేచితా నిత్యం, పూజితా తులసీ నతా ॥**

**శ్లో॥ నవధా తులసీ భక్తిం, యే కుర్వన్తి దినే దినే ।**

**యుగకోటి సహస్రాణి తన్వన్తి సుకృతం మునే! ॥**

అర్థము :- ఎవరు ప్రతి దినము శ్రీతులసి యొక్క దర్శనము, స్పర్శనము, ధ్యానము, నామ-కీర్తనము, స్తవనము, రోపణము, సేచనము, నిత్యపూజనము మరియు నమస్కారమనబడు నవవిధ తులసీ భక్తిని చేయుదురో, వారు సహస్రకోటి యుగముల పర్యంతము పుణ్యమును విస్తరింపజేయుదురు. (ప.పు. ఉత్తరఖండము 63-62 63-63)

ఈ ప్రకారము శ్రీతులసీ యొక్క మాహాత్మ్యము అత్యద్భుతమై యున్నందు వలననే శ్రీ తుకారాం మహారాజుగారు "జయాజియే ద్వారీ తులసీ వృందావన। నాహీ తే స్మశాన గృహ జాణా"। ఎవరి ఇంటి ముంగిట శ్రీతులసీ వృందావముండదో, వారి ఆ గృహము స్మశానము (వల్లకాడు) అని తెలియండి అని వ్యతిరేక ముఖముగా చెప్పెను కావున శ్రీతుకారాం మహారాజుగారి యొక్క ఈ వచనము శాస్త్ర సమ్మతమున్నందువలన ముమ్మాటికి నిజమని తలంచవలెను.

17. అభంగము :-

**వేంచూనియాం పిండ । భాతా దాన కరీ లండ ॥1॥**

**జైసీ యాచీ చాలీ వరీ । తైసా అంతరలా దురీ ॥2॥**

**మేల్యా రాఖే దిస । జీయాలేపణ ఝూలేఁ ఓస ॥3॥**

**తుకా మ్హణే దేవా । లోభేఁ న పురేచీ సేవా ॥4॥** (2210)

ప్ర.ప :- (తల్లి దండ్రులు జీవించి యున్నప్పుడు వారిసేవ చేయని మూర్ఖ పుత్రుడు- తల్లిదండ్రులు మరణించిన పిదప) లండ = (లబాడ) వంచక మూర్ఖుడు (పుత్రుడు); వేంచూనియాం - (ఇతరులు

మెచ్చుకొనునట్లు) అత్యధికముగా డబ్బు ఖర్చు పెట్టి (శ్రాద్ధ కర్మ నిర్వహించి); భాతా = అన్నము యొక్క ; పిండ = పిండములు చేసి. (పితృ తర్పణార్థము చేయు అన్నము ముద్దలు) ; దాన కరీ = పవిత్ర గంగా నదులలో వదులును, లేదా ఆ పిండములను గోవులు మొదలగు పశుపక్ష్యాదులకు దానము చేయును; 1. యాచీ = ఇతనియొక్క ; జైసీ = ఏవిధమైన ; చాలీవరీ = దుష్ప్రవర్తన (ఉంటుందో; అటులనే శ్రీ విఠలేశుడు అతని నుండి అంతంత) తైసా = ఆవిధముగా ; దురీ = దూరమగును. (తద్వారా ఈ మూర్ఖుడు( అంతరలా = నష్టపోయినాడు (నష్టపోవును). 2. మేల్యా = (తల్లి దండ్రులు) చనిపోయిన ; దిస = దినమును ; రాఖే = రక్షిస్తాడు (జ్ఞాపకముంచు కుంటాడు); (కాని) జీయాలేపణ = (తల్లిదండ్రులు) జీవించి యున్నపుడు; ఓస = నిర్జనము వలె అనగా తల్లిదండ్రులున్నా లేనట్లు; ఝూలేం= అయినాడు (ప్రవర్తించినాడు)3. తుకామ్హణే = శ్రీతుకారాం మహారాజు గారంటున్నారు; లోభే = వైషయిక లోభముచే (చేయబడు) ; సేవా = సేవ ; దేవా = దేవునికి ; న పురే = ఏ మాత్రము ఇష్టముండదు. 4.

**తా॥** తల్లిదండ్రుల సేవ చేయలేని మూర్ఖ మనుష్యుడు, వారు జీవించి యున్నపుడు వారి సేవ చేయుటకు సంకోచపడి చేతులు దాచుకునేవాడు. కాని తల్లిదండ్రులు మరణించిన పిదప మాత్రము పిండకూడు (శ్రాద్ధ కాలములో అన్నము ముద్దలు) ఘనముగా పెడుతాడు. 1. వాడి దుశ్చరితము (ప్రవర్తన) ఎట్లుండునో, అట్లే భగవంతుడు వాని నుండి దూరమవుతాడు. దానిచే వాడు చాలా నష్టపోతాడు. 2. వాడు తల్లిదండ్రులు మరణించిన దినమును బాగుగా జ్ఞప్తియందుంచుకొని ఘనముగా శ్రాద్ధకర్మ చేస్తాడు. కాని తల్లిదండ్రులు జీవించి యున్నపుడు వారు యింట్లో ఉన్నా, లేని వారుగనే ప్రవర్తించెడివాడు. వారి బాగోగులు చూచెడివాడు కాడు. 3.

శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు వైషయిక (ద్రవ్య) లోభముచే చేయబడు సేవను భగవంతుడు యిష్టపడడు. 4.

**సు.వ్యా :-** ఈ యభంగములో శ్రీతుకారాం మహారాజుగారు తల్లిదండ్రుల సేవ చేయని మూర్ఖ చక్రవర్తి యొక్క నిందచేస్తూ, తల్లి దండ్రులు పుత్రులచే సదా సర్వథా పూజ్యులని, వారిని సేవించి, ఆరాధించి, వృద్ధాప్యంలో చక్కగా పోషించే సుపుత్రుని స్తుతి (ప్రశంస) చేయు చున్నాడు.

"నహి నిందా నింద్యం నిందితుం ప్రక్రమతే, అపితు స్తుత్యం (విధేయం) స్తోతుమితి – న్యాయః" నిందా నింద్య వస్తువును నిందించుటకు ప్రవర్తించదు. మరేమనగా స్తుత్య (విధేయ)మును స్తుతించుటకే ప్రవృత్తమగును. (బృ.ఉ. భాష్య వార్తిక టీక. 1-5-62) ఈ న్యాయము చేత తల్లి దండ్రులు పుత్రులచే నిత్యము సేవింప దగిన వారని సుపుత్రులను స్తుతించు చున్నాడు. పుత్రుడనగా యెవరు? మనువు చెప్పుచున్నాడు.

**శ్లో॥ పుంనామ్నో నరకాద్యస్మాత్త్రాయతే పితరం సుతః ।**
**తస్మాత్పుత్ర ఇతి ప్రోక్తః స్వయమేవ స్వయంభువా ॥**
(మ.స్మృ. 9-138)

**అర్థము :-** ఎందువల్లనైతే సుతుడు "పుం" నామక నరకము నుండి తండ్రిని రక్షించునో, అందువల్ల అతడు స్వయముగా బ్రహ్మ చేత "పుత్రుడని" చెప్పబడెను.

తల్లిదండ్రుల మాహాత్మ్యమును గూర్చి మహాభారతము మరియు పురాణములు చాలా చక్కగా వర్ణించు చున్నవి.

**శ్లో॥ పితా ధర్మః పితా స్వర్గః పితా హి పరమం తపః ।**
**పితరి ప్రీతిమాపన్నే సర్వాః ప్రీయంతి దేవతాః ॥**

శ్లో॥ అశిషస్తా భజన్త్యేనం పరుషం ప్రాహ యత్పితా ।
నిష్కృతిః సర్వ పాపానాం పితా యచ్చాభినందతి ॥
(మహాభారతము - శాంతిపర్వము - అధ్యాయము 266-21-22)

అర్థము :- తండ్రియే ధర్మము; తండ్రియే స్వర్గము, తండ్రియే అన్నిటికంటె గొప్ప తపస్సు ; తండ్రి ప్రసన్నుడైనచో సమస్త దేవతలు ప్రసన్నులగుదురు. తండ్రి పుత్రున్ని ఒకవేళ కఠోర శబ్దములచే కోపించినచో, ఆ వాక్కులు పుత్రునికి ఆశీర్వచనములగును. ఒకవేళ తండ్రి పుత్రున్ని అభినందించినచో- ఆ వాక్కులు పుత్రునికి సర్వపాపములకు ప్రాయశ్చిత్తము లగును. అనగా పుత్రుని సర్వపాపములు నశించిపోవును.

శ్లో॥ మాతా దేహారణిః పుంసాం సర్వస్యార్తస్య నిర్వృత్తిః ।
మాతృలాభే సనాథత్వ మనాథత్వం విపర్యయే ॥
(మ.భా.శాం.ప. 266-26)

అర్థము :- మనుష్య మాత్రులకు తల్లి, శరీరరూప అగ్నిని ప్రకటము చేయు అరణి (కాష్ఠము) వంటిది. సంసారములోని సమస్త ప్రాణులకు సుఖమును మరియు ఊరటను కలిగించునది తల్లి. ఎంతవరకు తల్లి జీవించి యుండునో, అంతవరకు మనుష్యుడు సనాథుడనబడును. కాని ఆ మాతృ దేవత లేనిచో అనాథుడనబడును.

శ్లో॥ నాస్తి మాతృ సమా ఛాయా నాస్తి మాతృ సమాగతిః ।
నాస్తి మాతృ సమం త్రాణం, నాస్తి మాతృ సమా ప్రియా ॥
(మ.భా. శాం.ప. 266-31)

అర్థము :- మాతృదేవతతో సమానమైన ఛాయ (నీడ) లేదు, అనగా తల్లియొక్క ఛత్ర ఛాయలో ఏసుఖమున్నదో యది యన్యత్ర ఎక్కడ

గూడ లభించదు. తల్లితో సమానమైన చేయూత (సహాయము) లేదు. తల్లితో సమానమైన అన్య రక్షకులు లేరు. బిడ్డకు తల్లితో సమానమైన ప్రియ వస్తువు లేదు.

**శ్లో॥ సర్వ తీర్థమయీ మాతా సర్వదేవమయః పితా ।**
**మాతరం పితరం తస్మాత్ సర్వయత్నేన పూజయేత్ ॥**
**నారాయణ సమావేతావిహ చైవ పరత్ర చ ॥**
(పద్మపురాణము - సృష్టిఖండము. 47-11)
(భూమిఖండము. 63-13)

**అర్థము :-** మాతృదేవత సర్వ తీర్థ స్వరూపిణియు మరియు పితృ దేవుడు (తండ్రి) సమస్త దేవతల స్వరూపుడు. కావున సర్వథా, సర్వ ప్రయత్నము చే మాతాపితరులు పూజ్యులు వందనీయులు.

తల్లిదండ్రుల సేవాఫలమమోఘమని పద్మపురాణము ఈక్రింది విధముగా చెప్పుచున్నది.

**శ్లో॥ మాతా పిత్రోస్తు యః పాదౌ నిత్యం ప్రక్షాలయేత్సుతః ।**
**తస్య భాగీరథీ స్నాన మహన్యహని జాయతే ॥**
(ప.పు. భూమి ఖండము 62-74)

**శ్లో॥ తమోశ్చాపి ద్విజశ్రేష్ఠ! మాతా పిత్రోశ్చ స్నాతయోః ।**
**పుత్రస్యాపి హి సర్వాంగే పతంత్యంబుకణా యదా ।**
సర్వ తీర్థసమం స్నానం పుత్రస్యాపి ప్రజాయతే ॥ (63-1,2)

**శ్లో॥ మాతరం పితరం శ్చైవ యస్తు కుర్యాత్ ప్రదక్షిణమ్ ।**
ప్రదక్షిణే కృతా తేన సప్త ద్వీపా వసుంధరా ॥

శ్లో॥ జానునీ చ కరౌ యస్య పిత్రోః ప్రణమతః శిరః ।
నిపతంతి పృథివ్యాం చ సోఽక్షయం లభతే దివమ్
(ప.పు.సృ.ఖం. 47-12,13)

శ్లో॥ పతితం క్షుధితం వృద్ధమశక్తం సర్వకర్మసు ।
వ్యాధితం కుష్ఠినం తాతం మాతరం చ తథా విధామ్ ॥

శ్లో॥ ఉపచరతి యః పుత్రస్తస్య పుణ్యం వదామ్యహమ్ ।
విష్ణుస్తస్య ప్రసన్నాత్మా జాయతే నాత్ర సంశయః ॥

శ్లో॥ ప్రయాతి వైష్ణవం లోకం యదప్రాప్యం హి యోగిభిః ॥
(ప.పు. భూ.ఖం. 63-3,4,5)

అర్థము :- ఎవరు ప్రతినిత్యము తల్లిదండ్రులయొక్క పాదపద్మములు కడుగునో, మరియు ఆ నీటిని పరమ పవిత్రముగా భావించి పైన జల్లుకొని, తీర్థముగా సేవించునో నతనికి ప్రతిదినము గంగాస్నానఫలము లభించును.

తల్లిదండ్రులకు స్నానము చేయించు చున్నప్పుడు జలబిందువులు ఎగిరి పుత్రుని సర్వాంగములపై బడినచో, ఆ పుత్రుడు సంపూర్ణ తీర్థములలో స్నానము చేసిన ఫలము నందును.

ఎవరు మాతా పితరులకు నిత్యము ప్రదక్షిణము చేయునో, నతనిచే నప్తద్వీపనమన్వితమైన నంపూర్ణభూమండలము ప్రదక్షిణము చేయబడినదగును.

మాతాపితరులకు ప్రణమిల్లునపుడు ఎవరి యొక్క మోకాళ్ళు, చేతులు, మరియు శిరస్సు పృథివిని స్పృశించునో నతడు అక్షయమైన స్వర్గమును పొందును.

తల్లిదండ్రులు నడవలేకగాని నిలువలేకగాని పడిపోయినపుడు, ఆకలితో నలమటించునవుడు, వృద్ధులై యేకార్యమును చేయుటకసమర్థులైనపుడు మరియు రోగిగానున్నపుడు లేదా అసాధ్యమైన కుష్ఠ మొదలగు వ్యాధులచే పీడితులైనపుడు ఇటువంటి యవస్థలయందు ఏపుత్రుడు తల్లిదండ్రులకు శ్రద్ధాభక్తులచే సేవ జేయునో నతనిపై నిస్సందేహముగా శ్రీవిష్ణువు ప్రసన్నుడగును. యోగి జనులకు గూడ దుర్లభమైన శ్రీవిష్ణుధామము ప్రాప్తమగును.

శ్లో॥ ఏకపుత్రో వరం విద్వాన్ బహుభిర్నిర్గుణైస్తు కిమ్ ।
ఏకస్తారయతే వంశ మన్యే సంతాపకారకాః ॥
(ప.పు.భూ.ఖం. 11-39)

ఏకశ్చంద్రస్తమో హంతి న చ తారాగణోఽపి చ ॥ (సుభాషితము)

**అర్థము** :- ఆకాశములోని యంధకారమును తొలగించుటకు ప్రకృష్ఠ ప్రకాశము గలిగిన నొక చంద్రుడు చాలును. అసంఖ్యాకములైన చుక్కలతోనేమి ప్రయోజనము? అట్లే వంశము (కులము) నుద్ధరించుటకు గుణవంతుడైన సుపుత్రుడొక్కడుండిన చాలును. (మందిని పీడించు) వందమంది కుపుత్రులుండినగాని నేమి ప్రయోజనము?

శ్రీవేమన యోగి గూడ చెప్పాడు గదా!

పద్యము :- తల్లిదండ్రుల మీద దయలేని పుత్రుడు
పుట్టనేమి వాడు గిట్టనేమి? ।
పుట్ట లోన చెదలు పుట్టదా గిట్టదా
విశ్వదాభిరామ వినుర వేమ ॥

మరియు మాతాపితరుల యొక్క సేవ చేయక, వారిననాదరించు స్వార్థ జీవియైన కుపుత్రునికి సంప్రాప్తమగు దుర్గతిని గూర్చి విస్తారముగా వివరించబడినది- పద్మపురాణములో-

శ్లో॥ రోగిణం చాపి వృద్ధం చ పితరం వృత్తికర్శితమ్ ।
వికలం నేత్ర కర్ణాభ్యాం త్యక్త్వా గచ్ఛే చ్ఛ రౌరవమ్ ॥
(ప.పు.సృ.ఖం. 47-19)

అర్థము :- ఎవరు - తండ్రి రోగిగా యున్నపుడు, వృద్ధుడు, జీవికావృత్తిరహితుడై యున్నప్పుడు, అంధుడు, మరియు చెవిటివాడై నిఃసహాయుడుగా నున్న పరిస్థితిలో వదిలి వెళ్ళిపోవునో, వారు రౌరవ నరకములో పడుదురు.

శ్లో॥ పితరౌ వికలౌ దీనౌ వృద్ధౌ దుఃఖిత మానసౌ ।
మహాగదేన సంతప్తౌ పరిత్యజతి పాపధీః ।
సపుత్రో నరకం యాతి దారుణం కృమిసంకులమ్ ॥

వృద్ధాభ్యాం యః సమాహూతో గురుభ్యా మిహ సాంప్రతమ్ ।
న ప్రయాతి సుతో భూత్వా తస్య పాపం వదామ్యహమ్ ।
విష్టాశీ జాయతే మూఢోఽమేధ్య భోజీ న సంశయః ॥

పుత్రగేహే స్థితౌ మాతా పితరౌ వృద్ధకౌ తథా ।
స్వయం తాభ్యాం వినా భుక్త్వా ప్రథమం జాయతే ఘృణిః ।
యావజ్జన్మ సహస్రంతు పునః శ్వానోఽభిజాయతే ॥

మూత్రం విష్ఠాం చ భుంజీత యావజ్జన్మసహస్రకమ్ ।
కృష్ణసర్పో భవేత్పాపి యావజ్జన్మ శతత్రయమ్ ।

**పితరౌ కుత్సితే పుత్రః కటుకైర్వచనైరపి ।**

**స చ పాపే భవేద్వ్యాఘ్రః పశ్చాద్దుఃఖీ ప్రజాయతే ॥**

**మాతరం పితరం పుత్రో న నమస్యతి పాపధీః ।**

**కుంభీపాకే వసేత్తావ ద్యావద్యుగసహస్రకమ్ ॥**

( పద్మపురాణము - భూమిఖండము-63-5 నుండి 12 వరకు)

**అర్థము :-** అంగహీనులు, దీనులు, వృద్ధులు, దుఃఖితులు, మరియు గొప్ప రోగములచే పీడితులైన మాతా పితరుల నెవడు వదలి వేయునో నా పాపాత్ముడు దారుణమైన కృమి కీటకములతో నిండియున్న నరకములో పడును. ఏ పుత్రుడు ముసలివాళ్లైన తల్లిదండ్రులచే పిలిపించబడినపుడు వారి వద్దకు వెళ్లడో, ఆ మూర్ఖుడు మలమును దిను పురుగై పట్టును. మరియు వేయి జన్మల పర్యంతము ఊరకుక్క యై పుట్టును. వృద్ధ మాతా పితరులు ఇంట్లో యుండగా, వారికి ప్రథమమున భోజనము నిడక స్వయముగా నన్నమును భుజించు పుత్రుడు నింద్యమైన క్రిమి (పురుగై) యై పుట్టును. మరియు వేయి జన్మల పర్యంతము మల మూత్రములు భుజించుచునుండును. ఇంతే గాకుండా ఈ పాపాత్ముడు మూడు వందల జన్మలు నల్లత్రాచు (కృష్ణ సర్పమై) యై పట్టును. ఏపుత్రుడైతే పరుష (కఠోర) వాక్కులచే తల్లిదండ్రులను నిందించునో, ఆ పాపి వ్యాఘ్ర జన్మ మెత్తును మరియు తదుపరి ఘోర దుఃఖమునకు గురియగును. ఏ పాపాత్ముడైన కుపుత్రుడు తల్లిదండ్రులకు వినయముతో, శ్రద్ధాభక్తితో నమస్కరించడో, వాడు వేయి యుగముల వరకు కుంభీపాక నరకమున నివసించును.

**శ్లో॥ ఏకేన శుష్కవృక్షేణ దహ్యమానేన వహ్నినా ।**

**దహ్యతే తద్వనం సర్వం కుపుత్రేణ కులం యథా ॥** (సుభాషితము

**అర్థము** :- ఎండిపోయిన ఒక వృక్షములో అగ్ని పడి యది రగిలి దావానలమై సంపూర్ణవనమునే సమాప్తము జేయును. ఎట్లనగా! వంశమును సంపూర్ణముగా నష్టము జేయు నొకానొక గుణ హీనుడైన కుపుత్రుని వలె. కావున ఇటువంటి మూర్ఖపుత్రుడు దృష్టాంతమునకే ఉపకరించును.

**శ్లో॥ కిం తయా క్రియతే ధేన్వా యా న దోగ్ధ్రీ న గర్భిణీ ।**
**కోఽర్థః పుత్రేణ జాతేన యో న విద్వాన్న ధార్మికః ॥** (సుభాషితము)

**అర్థము** :- ఏ గోవు క్షీరము (పాలు) నివ్వదో, మరియు సంతానమునుత్పన్నము చేయదో దానితో నేమి ప్రయోజనము? అట్లే ఏపుత్రుడు ధార్మికుడు కాడో మరియు విద్వానుడు కాడో, వాడితో నేమి ప్రయోజనము?

**మాతృ దేవో భవ, పితృ దేవో భవ । (తై.ఉ)**
**మాతాదేవో యస్య సః త్వం మాతృదేవో భవ - స్యాః । ఏవం పితృదేవ భవ)**

తల్లియే యెవరికి దేవుడో, అతడు మాతృదేవుడు. అటువంటి మాతృదేవుడవు నీవు అగుము అనగా తల్లిని దేవతవలె ఆరాధింపుము - అలాగే తండ్రిని గూడ యని - శ్రుతిమాత ఉద్ఘోషించుచున్నది.

కావున పైన దెలుపబడిన శాస్త్ర ఆధారములచే తల్లిదండ్రులు పుత్రులచే సదా సర్వయత్నములచేత శ్రద్ధా భక్తులతో సేవింపదగినవారని, పూజ్యులని, మరియు నిత్యము వందనీయులని సిద్ధమైనది. తల్లిదండ్రుల యొక్క సేవ కర్తవ్యముగా నెంచి యే మనుష్యుడు జేయునో నతనికి యది తల్లిదండ్రుల యొక్క యనుగ్రహము మరియు ఆశీర్వాదము వలన మోక్షమునకు సాధనమగునని శ్రీ తుకారాం మహారాజు గారి యొక్క పై యభంగములోని ముఖ్య అభిప్రాయము.

18. అభంగము :-

పతివ్రతా నేణేఁ ఆణికాచీ స్తుతీ ।
సర్వభావేఁ పతీ ధ్యానీఁ మనీఁ ॥1॥

తైసేఁ మాఝేఁ మన ఏకవిధ ఝాలేఁ ।
నావడే విఠలా విణేఁ దూజేఁ ॥2॥

సూర్య వికాసినీ నేఘే చంద్రకళా ।
గాయతే కోకిలా వసంతేసీ ॥3॥

తుకా మ్హణే బాళ మాతే పుఢేఁనాచే ।
బోల ఆణికాచే నావడ తీ ॥4॥ (1627)

ప్ర.ప :- పతివ్రతా = పతివ్రతా స్త్రీ ; ఆణికాచీ = ఇతర పురుషుల యొక్క ; స్తుతీ = స్తుతి (పొగడ్త); నేణే = ఎఱుగదు ; సర్వభావేఁ = సర్వ ప్రకారములచే (మనో వాక్కాయములచే) ; పతి = భర్తతో ననురక్తయై; మనీఁ = మనస్సులో, (పతిదేవుడినే) ; ధ్యానీఁ = ధ్యానము చేయుచుండును; 1. తైసే = అట్లే; మాఝే = నాయొక్క; మన = మనస్సు; ఏకవిధ = ఏకనిష్ఠ ఝాలే = అయినది; విఠలా విణే =పాండురంగన్ని విడిచి; దూజేఁ=అన్యుని; నావడే = ఇచ్చగించుటలేదు. 2. సూర్య వికాసినీ = సూర్యకిరణ స్పర్శచే వికసించు కమలము; చంద్రకళా = చంద్రకిరణం స్పర్శను; నేఘే = స్వీకరించుటలేదు. కోకిలా = కోకిల (పక్షి); తే = ఆ; వసంతేసీ = వసంత కాలములో మాత్రమే; గాయ = కూయును (ఇతర కాలములో కూయదు); 3. తుకామ్హణే = శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు; బాళ = బాలుడు; మాతాపుఢే = తల్లి యెదుటనే; నాచే = ఆడును ; (కాని) ఆణికాచే = ఇతరులయొక్క; బోల = మాటలు (గూడ); నావడతీ = ఇష్టపడడు.

**తా॥** పతివ్రతా స్త్రీ తనయొక్క భర్తను తప్ప యితరుల యొక్క స్తుతి చేయుట యెఱుంగదు. మనోవాక్కాయములచే పతిచే ననురక్తయై నిరంతరము తన మనస్సులో పతినే ధ్యానించుచుండును. 1. అట్లే, నాయొక్క మనస్సు విఠలునితో ఏకనిష్ఠయై, విఠలుని తప్ప అన్యమునిచ్ఛగించుట లేదు. 2. సూర్యునియొక్క కిరణములచే వికసించు కమలము, చంద్రకిరణములచే వికసించుటలేదు. అనగా సూర్యుని తప్ప అన్యమును యిష్టపడుట లేదు. అట్లే వసంతర్తువులో కూయుట కిష్టపడిన కోకిల, అన్య ఋతువులో కూయుట లేదు. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు – చిన్న పిల్లవాడు తన తల్లి ముందు ఆడును, పాడును. కాని ఇతరుల మాటలను ఇష్టపడడు. 4.

**సు.వ్యా:–** పై యభంగము ద్వారా శ్రీ తుకారాం మహారాజుగారు వారి యొక్క యకుంఠిత ఏకనిష్ఠ దృఢ భక్తి రూప దార్ష్టాంతమును తెలుపుతూ పతివ్రతా దృష్టాంతమును ప్రస్తుతించారు. దార్ష్టాంతమును స్పష్టము చేయుటకు దృష్టాంతమును చెబుతూ చెబుతూ లోకమునకు ఒక చక్కటి సందేశమును దృష్టాంతము ద్వారా బోధించుట మహాత్ముల నైజము.

కులగురువైన శ్రీవసిష్ఠమునీంద్రులచే నాజ్ఞాపింప బడిన సుదక్షిణా సమేతుడైన పుత్రకామియైన దిలీపుడు గోసేవా తత్పరుడై సురభి (నందిని)ని ఎలా అనుసరించాడో శ్రీ కాళిదాస కవీంద్రుడు "రఘువంశ" కావ్యములో చక్కగా వర్ణించాడు.

"శ్రుతే రివార్థం స్మృతిరన్వగచ్ఛత్"

"శ్రుతి(వేదము) యొక్క అర్థము (తాత్పర్యము)ను అనుసరించి స్మృతి వెళ్ళునట్లు" దీనిచే (ఈదృష్టాంతముచే) స్మృతి ఎప్పుడూ (ప్రతి విషయంలో) శ్రుతియొక్క అడుగుజాడల్లోనే నడుస్తుంది. గాని భిన్నంగా

వెళ్ళదు అను సత్యాన్ని చాటి చెప్పాడు శ్రీకాళిదాస కవి.

అట్లే శ్రీ తుకారాం మహారాజుగారు పతివ్రతాస్త్రీ యొక్క ఏకనిష్ఠత (పతినిష్ఠ) హైందవ సంప్రదాయము, భారతనారీ ధర్మము అని గుర్తు చేశాడు.

**పతిర్వ్రతమివ నియతోపాస్యత్వాత్ యస్యాః సా పతివ్రతా ।**

వ్రతము వలె పతిని యెవరు నియమముచే నుపాసింతురో ఆమె పతివ్రత యనబడును. పతివ్రతా స్త్రీ ధర్మమును, మరియు మాహాత్మ్యమును వర్ణిస్తూ శ్రీ శివపురాణము.

**శ్లో॥ విధేర్విష్ణోర్హరాద్వాపి పతిరేకోఽధికో మతః ।**
**పతివ్రతాయా దేవేశి! స్వ పతిః శివ ఏవ చ ॥**
(శివపురాణము - రుద్రసంహితా - పార్వతీ ఖండము 54-43)

**అర్థము :-** హే దేవేశ్వరి! పతివ్రతా స్త్రీకి తన భర్తయే బ్రహ్మ, విష్ణు మరియు శివుని కంటే గూడ నధికమని చెప్పబడినది. ఆమెకు పతియే శివస్వరూపుడు.

**శ్లో॥ భర్తాదేవో గురుర్భర్తా ధర్మ తీర్థ వ్రతాని చ ।**
**తస్మాత్సర్వం పరిత్యజ్య పతిమేకం సమర్చయేత్ ॥**
(స్కం.పు.బ్ర.ఖం.ధ.మ.7-48) (శి.పు. రు.సం. పా.ఖం. 54-51)

**అర్థము :-** పతివ్రతా నారికి పతియే దైవము, పతియే గురువు, పతియే ధర్మము, పతియే తీర్థము మరియు వ్రతము. అందువలన సర్వమును పరిత్యజించి పతినే యారాధించవలెను.

**శ్లో॥ సా ధన్యా జననీ లోకే స ధన్యో జనక పితా ।**
**ధన్య స చ పతిర్యస్య గృహే దేవీ! పతివ్రతా ॥**
(శి.పు. రు.సం. పా.ఖం. 54-58)

అర్థము :- హే దేవీ! ఎవరి యింటిలో పతివ్రతా స్త్రీ నివసించునో - ఆమె తల్లి, జన్మదాతయైన తండ్రి మరియును ఆమె భర్తగూడ ఈ లోకములో ధన్యులు.

శ్లో॥ పితృ వంశ్యాః మాతృవంశ్యాః పతివంశ్యాస్త్రయస్త్రయః ।
పతివ్రతాయాః పుణ్యేన స్వర్గే సౌఖ్యాని భుంజతే ॥
(శి.పు రు.సం. పా.ఖ 54-59)

అర్థము :- పతివ్రతా యొక్క పుణ్య బలముచే తండ్రి యొక్క మూడు తరములవారు, తల్లి యొక్క మూడు తరముల వారు, మరియు పతి యొక్క మూడు తరములవారు స్వర్గ సౌఖ్యము ననుభవించుదురు.

శ్లో॥ పతివ్రతాయాశ్చరణో యత్ర యత్ర స్పృశేద్భువమ్ ।
తత్ర తత్ర భవేత్సా హి పాప హంత్రీ సుపావనీ ॥
(శి.పు. రు.సం పా.ఖం. 54-61)

అర్థము :- పతివ్రతా నారీ యొక్క పాదము ఎక్కడెక్కడ భూమిని స్పృశించునో ఆ భూమి పాపహారిణీ మరియు పరమ పావని యగును.

శ్లో॥ భార్యా మూలం గృహస్థస్య భార్యా మూలం సుఖస్య చ ।
భార్యా ధర్మఫలావాప్త్యై భార్యా సంతానవృద్ధయే ॥
(శి.పు. రు.సం. పా. ఖం. 54-64)

అర్థము :- గృహస్థాశ్రమమునకు మూలము భార్య. భార్యయే సుఖమునకు మూలము. భార్య చేతనే ధర్మ ఫలప్రాప్తి గలుగును. భార్యయే సంతాన వృద్ధికి కారణము.

శ్లో॥ యథా గంగావగాహేన శరీరం పావనం భవేత్ ।
తథా పతివ్రతాం దృష్ట్వా సకలం పావనం భవేత్ ॥
(శి.పు రు.సం పా.ఖం 54-68)

అర్థము :- పరమ పవిత్రమైన భగవతి భాగీరథీ జలముచే నెట్లు శరీరము పునీతమగునో నట్లే పతివ్రతా స్త్రీ యొక్క దర్శనము చేయుటచే సమస్తము పావనమగును.

**శ్లో॥ తారః పతిః శ్రుతిర్నారీ క్షమా సా స స్వయం తపః ।**
**ఫలం పతిః సత్క్రియా సా ధన్యౌ తౌ దంపతీ శివే ॥**
(శి.పు. రు.సం. పా.ఖం. 54-70)

**అర్థము :-** ప్రణవము పతి ఉన్నాడు. వేదఋచా స్త్రీ ఉన్నది. పతి తపస్సు, స్త్రీ క్షమా ఉన్నారు. నారీ సత్కర్మ యైతే దాని ఫలము పతియై యున్నాడు. హే శివే! (పార్వతీ!) సతిపతులిద్దరు(దంపతులు) ధన్యులున్నారు.

**శ్లో॥ న చ భార్యా సమం కించిద్ విద్యతే భిషజాం మతమ్ ।**
**ఔషధం సర్వదుఃఖేషు సత్యమేతద్బ్రవీమి తే ॥**
(మహాభారతము-వనపర్వము-నలోపాఖ్యాన పర్వము - 61-29)

**అర్థము:-** సర్వ దుఃఖములు శాంతించుటకు గుణవంతురాలైన భార్యతో సమానమైన ఔషధము లేదని చికిత్సకుల యొక్క మతము. ఈ సత్యమును నీకు చెప్పుచున్నాను.

లక్ష్మి నివాస స్థానములను పేర్కొనుచూ స్వయముగా శ్రీలక్ష్మిదేవియే చెప్పుచున్నది. (మహాభారతము- అను శాసన పర్వము - దానధర్మ పర్వము 11-13)

**శ్లో॥ సత్యాసు నిత్యం ప్రియదర్శనాసు**
**సౌభాగ్యయుక్తాసు గుణాన్వితాసు ।**
**వసామి నారీషు పతివ్రతాసు**
**కళ్యాణశీలాసు విభూషితాసు ॥**

**అర్థము** :- ఏ స్త్రీలు సత్యవాదినులై యుందురో, వారి యొక్క చక్కటి వేషభూషణములచే చూచుటకు ప్రియముగా నుందురో, సౌభాగ్య శాలురు, సద్గుణవంతులు, పతివ్రతలు మరియు కళ్యాణమయ ఆచార విచారములు గలవారై యుందురో, అదే విధముగా ఎవరు ఎల్లప్పుడు వస్త్రాభూషణములచే విభూషితలై యుందురో - అటువంటి స్త్రీల యందు నేనెల్లప్పుడు వసించి యుందును.

**శ్లో॥** నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో న వ్రతం నాప్యుపోషణమ్ ।
**పతిం శుశ్రూషతే యేన తేన స్వర్గే మహీయతే ॥**

(మనుస్మృతి - 5-155)

**అర్థము**:- స్త్రీలకు పతికంటె వేరు యజ్ఞము లేదు. పతి యాజ్ఞ లేకుండా వ్రత ఉపవాసాదులు చేయకూడదు. స్త్రీలు తమపతి సేవచేతనే స్వర్గలోకములో పూజితులగుదురు.

**శ్లో॥ బాల్యే పితుర్వశే తిష్ఠేత్పాణిగ్రహస్య యౌవనే ।**
**పుత్రాణాం భర్తరి ప్రేతే న భజేత్ స్త్రీ స్వతంత్రతామ్ ॥**

(మనుస్మృతి. 5-148)

**అర్థము** :- స్త్రీ బాల్యములో తండ్రియొక్క, యౌవనములో పతియొక్క, పతిమరణానంతరము వృద్ధావస్థలో పుత్రులయొక్క వశములో నుండవలెను. (వారి యొక్క అజ్ఞ మరియు సమ్మతి ప్రకారము కార్యములు చేయవలయును) స్వతంత్రముగా ఎప్పుడు కూడ చేయగూడదు.

**శ్లో॥ సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ ।**
**యస్మిన్నేవ కులే నిత్యం కళ్యాణం తత్ర వై ధృవమ్ ॥**

(మ.స్మృ. 3-60)

అర్థము :- ఏ కులములో స్త్రీ చేత పతియు, పతి చేత స్త్రీ యున్ను సంతుష్టులగుదురో, ఆ కులములో సర్వదా అవశ్యము కళ్యాణమగును.

**శ్లో॥ యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః ।**
**యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః ॥**
(మ.స్మృ. 3-56)

అర్థము :- ఏ కులము నందు స్త్రీలు ఆదర-సత్కారముల ద్వారా పూజింప బడుదురో, ఆకులముపై దేవతలు ప్రసన్నులగుదురు. ఏకులమందు స్త్రీలు పూజింపబడరో, ఆకులమందు సమస్త కర్మలు నిష్ఫలములగును, (అందువలన స్త్రీలను ఎప్పుడు గూడ అనాదరణ చేయగూడదు)

**శ్లో॥ శ్వశ్రూశ్వశురయోః పాదౌ జోషయంతీ గుణాన్వితా!**
**మాతాపితృపరా నిత్యం సా నారీ పతివ్రతా ॥** (తపోధనా) ॥
(మహాభారతము-అనుశాసనపర్వము-దానధర్మపర్వము. 146-51)

**అర్థము** :- ఏ స్త్రీ ఉత్తమగుణయుక్తయై ఎల్లప్పుడు అత్తమామల చరణ సేవాతత్పరయై యుండునో, మరియు తల్లి దండ్రుల యందు గూడ ఎల్లప్పుడు ఉత్తమభక్తిభావము గలిగియుండునో, ఆ స్త్రీ తపోధనురాలు మరియు పతివ్రత యనంబడును.

శ్లో॥ కార్యేషు మంత్రీ కరణేషు దాసీ,
భోజ్యేషు మాతా శయనేషు రంభా! ।
ధర్మేఽనుకూలా క్షమయా ధరిత్రీ
భార్యా చ షాడ్గుణ్యవతీహ దుర్లభా ॥
(సుభాషిత రత్నభాండాగారము - పృష్ఠము. 351-27)

అర్థము :- భార్య, యోగ్యాయోగ్య విచారణ యందు మంత్రివంటిది. కార్యము నిర్వహించుట యందు దాసీ సదృశము.

భోజనకాలములో తల్లివంటిది. సహవాసములో దివ్యస్త్రీ వంటిది. ధర్మకార్యములయందు అర్ధాంగిని. సహన శీలత యందు పృథివీ తుల్యము. ఈ ఆరు సద్గుణములు గలిగియున్న భార్య చాలా దుర్లభము.

**శ్లో॥ యమ దూతాః పలాయంతే సతీ మాలోక్య దూరతః ।**
**అపి దుష్కృత కర్మాణం సముత్సృజ్య చ తత్పతిమ్ ॥**
(శివపురాణము)

**అర్థము :-** పతివ్రతా స్త్రీని చూసి యమదూతలు, దుర్మార్గుడైన పతిని గూడ వదిలి పలాయనము చిత్తగించెదరు.

**శ్లో॥ మితం దదాతి హి పితా మితం భ్రాతా మితం సుతః ।**
**అమితస్య హి దాతారం భర్తారం పూజయేత్సదా ॥**
(వాల్మీకి రామాయణము - అయోధ్యాకాండము. 39-30)
(స్కంధ పురాణము-బ్రహ్మఖండము-ధర్మారణ్యమాహాత్మ్యము. 7-47)

**అర్థము :-** తండ్రి, అన్న, తమ్ముడు, మరియు పుత్రుడు - స్త్రీకి పరిమితమైన సుఖమునే యివ్వగలరు - కాని భర్త అపరిమిత సుఖమును ఇచ్చును - గావున సతి యెల్లప్పుడు పతియొక్క పూజనము ఆదర-సత్కార పూర్వకముగా చేయవలెను.

పతివ్రతా శిరోమణి యగు సీతాదేవి శ్రీసతి అనసూయదేవితో పతివ్రతధర్మమును గూర్చి తెలియజేసిన ప్రకారము శ్రీ వాల్మీకి రామాయణములో గనందగినది-

శ్లో॥ పతి శుశ్రూషణాన్నార్యాస్తపో నాన్య ద్విధీయతే ।
సావిత్రీ పతి శుశ్రూషాం కృత్వా స్వర్గే మహీయతే ।
తథా వృత్తిశ్చ యాతా త్వం పతి శుశ్రూషయా దివమ్ ॥

వరిష్ఠా సర్వనారీణా మేషా చ దివి దేవతా ।
రోహిణీ న వినా చంద్రం ముహూర్త మపి దృశ్యతే॥

ఏవం విధాశ్చ ప్రవరాః స్త్రియో భర్తృ దృఢవ్రతాః ।
దేవలోకే మహీయన్తే పుణ్యేన స్వేన కర్మణా ॥

(శ్రీమద్వాల్మీకి రామాయణము-
అయోధ్యాకాండము 118-9 నుండి 12)

అర్థము :- శాస్త్రములో స్త్రీకి పతి సేవకంటే వేఱగు రెండవ తపస్సు విధానము చేయబడలేదు. సత్యవంతుని పత్నియగు పతివ్రత సావిత్రి పతిసేవ చేతనే స్వర్గలోకములో పూజింపబడుచున్నది. ఆమెవలెనే వర్తించు చున్న నీవు (సతి అనసూయదేవి) గూడ పతిసేవా ప్రభావముచే స్వర్గములో నుత్కృష్ట స్థానము నలంకరించినావు. సంపూర్ణ స్త్రీలలో శ్రేష్ఠురాలగు, స్వర్గ దేవత యగు రోహిణీ పతిసేవా ప్రభావము చేతనే ముహూర్తకాలము గూడ చంద్రుని విడిచి యుండుట కనుపించదు. ఈ విధముగా ననేక మంది సాధ్వీమణులు దృఢపూర్వకమైన పాతివ్రత్య ధర్మమునునుష్ఠించి, వారి పుణ్యబలముచేత దేవలోకములో నాదరింపడుచున్నారు.

శ్లో॥ రామస్య దయితా భార్యా నిత్యం ప్రాణసమా హితా ।
జనకస్య కులే జాతా దేవ మాయేవ నిర్మితా ॥

సర్వలక్షణ సంపన్నా నారీణాముత్తమా వధూః ।
సీతాప్యనుగతా రామం "శశినం రోహిణీ యథా" ॥

శ్రీ మద్వాల్మీకి రామాయణము - బాలకాండము 1-26
నుండి 28 వరకు)

అర్థము :- శ్రీనారద మహర్షుల వారు శ్రీ వాల్మీకి మహర్షుల వారితో సీతాదేవియొక్క పాతివ్రత్యధర్మమును శ్లాఘిస్తూ యిలా చెబుతున్నారు.:-

జనకుని కులములో జన్మించిన సీతాదేవి, అవతరించిన దేవమాయవలె నున్న సుందరి, సమస్త శుభలక్షణములచే విభూషితురాలు, స్త్రీలలో నుత్తమురాలు, శ్రీరామచంద్రునికి ప్రాణసమానమైన ప్రియపత్నియును, అదేవిధముగా ఎల్లప్పుడు పతి హితమునే గోరుచుండెడి వైదేహి శ్రీరాముని యనుసరించి "చంద్రుని వెంట రోహిణి వెళ్ళునట్లు" వనవాసమునకేగెను.

మరియు పతివ్రత స్త్రీయొక్క ప్రాశస్త్యమును తెలుపుతూ పద్మపురాణము:-

**శ్లో॥ సదాచార పరా భవ్యా ధర్మసాధన తత్పరా ।**
**పతివ్రతరతా నిత్యం సర్వదా జ్ఞానవత్సలా ॥**

**ఏవం గుణా భవేద్భార్యా యస్య పుణ్యా మహాసతీ ।**
**తస్య గేహే సదా దేవా తిష్ఠంతి చ మహౌజసః ॥**

**పితరో గేహ మధ్యస్థాః శ్రేయో వాంఛతి తస్య చ ।**
**గంగాద్యాః సరితః పుణ్యాః సాగరాస్తత్ర నాన్యథా ॥**

**పుణ్యా సతీ యస్య గేహే వర్తతే సత్య తత్పరా ।**
**తత్ర సర్వాణి తీర్థాని పుణ్యాని వివిధాని చ ॥**

**నాస్తి భార్యా సమం తీర్థం నాస్తి భార్యా సమం సుఖమ్ ।**
**నాస్తి భార్యా సమం పుణ్యం తారణాయ హితాయ చ ॥**

(పద్మ పురాణము - భూమిఖండము 59-11 నుండి 15-24)

**అర్థము :-** ఏ స్త్రీ సర్వవిధముల సదాచారమును పాలించునదియై, ప్రశంసాయోగ్యమగు ఆచరణము గలదియై, ధర్మసాధనములయందు సంలగ్నమై, సదా పాతివ్రత్యమును పాలించునదియై మరియు నిత్యము

జ్ఞానానురాగిణియై ఇటువంటి గుణవతియగు, పుణ్యవతి యగు మహాసతీ - యెవరి యింటిలో పత్ని (భార్య)గా యుండునో - వారి యింటిలో ఎల్లప్పుడు దేవతలు నివసించుదురు. పితరులుగూడ వారి యింటియందుండి వారి కళ్యాణమును గోరుచుందురు. ఎవరి యింటిలో ఇటువంటి సత్యపరాయణురాలగు, పవిత్ర హృదయురాలగు సతీమణి యుండునో - ఆయింటిలో గంగా మొదలగు పవిత్ర నదులు, సముద్రములు, యజ్ఞములు, గోవులు, ఋషిగణము, అదే విధముగా సంపూర్ణ పవిత్ర తీర్థములుండగలవు. ప్రేయస్సును అనగా ఐహికపారలౌకికసంపదను గోరువారికి మరియు శ్రేయస్సు అనగా మోక్షమును గోరువారికి భార్యతో సమానమైన తీర్థము లేదు. భార్యతో సమమగు సుఖము లేదు. భార్యతో తుల తూగు పుణ్యమునూ లేదు.

పతివ్రతా స్త్రీలు నాలుగు ప్రకారములుగా నుందురని శ్రీశివపురాణము నుడువు చున్నది. 1. ఉత్తమ 2. మధ్యమ, 3. నికృష్ట, 4. అతినికృష్ట భేదముచే పతివ్రతలు నాలుగు విధములు.

1. ఎవరి మనసు స్వప్నములో గూడ స్వపతిని గూర్చియే ధ్యానించునో, పర పురుషుని గూర్చి చింతించదో ఆమె ఉత్తమ శ్రేణికి చెందిన పతివ్రత యని తెలియవలెను.

2. ఎవరు ఇతర పురుషులను ఉత్తమ బుద్ధిచే అనగా తండ్రివలె, అన్నవలె, లేదా పుత్రునివలె భావించుదురో వారు మధ్యములు.

3. ఎవరు మనస్సులో స్వకుల ధర్మములను విచారించి వ్యభిచారము చేయరో, సదాచారమందే స్థిరమై యుందురో వారు నికృష్టులు అనగా నిమ్న కోటికి చెందిన పతివ్రతలని తెలియవలెను.

4. ఎవరు పతియొక్క భయము చేతనో, లేక కులమునకు కళంకము వచ్చునేమోనను భయముచే వ్యభిచారము నుండి తప్పించుకొనుటకు ప్రయత్నించుదురో - వారు అతి నికృష్ట లేదా నిమ్నతమ పతివ్రతలని పూర్వకాలిక విద్వానులు చెప్పిరి.

సతి పతులయొక్క స్వధర్మమర్యాదను (అవధిని) గూడ చెప్పు చున్నది పురాణము.

శ్లో॥ యః స్వనారీం పరిత్యజ్య నిర్దోషాం కులసంభవామ్ ।
పరదారరతో వా స్యాదన్యాం వా కురుతే స్త్రియమ్ ॥
సోఽన్య జన్మని దేవేశి! స్త్రీభూత్వా విధవా భవేత్ ।

అర్థము :- పార్వతితో శంకరుడంటున్నాడు.- ఓ దేవేశి! ఏపురుషుడు తన యొక్క నిర్దోషియైన కులీన స్వపత్నిని వదలి పరస్త్రీ యందాసక్తమగునో లేదా అన్య స్త్రీని గ్రహించునో, అతడు అన్య జన్మమునందు స్త్రీ యోనిని (జన్మము) పొంది విధవ యగును.

శ్లో॥ యా నారీ తు పతిం త్యక్త్వా మనోవాక్కాయకర్మభిః ।
రహః కరోతి వై జారం గత్వా వా పురుషాంతరమ్ ॥
తేన కర్మ విపాకేన సా నారీ విధవా భవేత్ ॥

అర్థము :- ఏ స్త్రీ స్వపతిని వదిలి పరపురుషునితో రమించునో, ఆమెకు గూడ జన్మాంతరములో వైధవ్య ప్రాప్తి సంభవించును. ఇంకను స్త్రీల యొక్క దుశ్చరితము వలన యే దుర్గతి ప్రాప్తించునో ఆ విషయమై విస్తృతముగా శివపురాణము రుద్రసంహితా పార్వతీ ఖండము ఏబది నాలుగవ అధ్యాయములో తెలుపబడినది.

సతీ, అనసూయ, సావిత్రీ, మరియు సీతా మొదలగు పతివ్రతా శిరోమణులందఱకు సాష్టాంగప్రణామములు. భారతనారికి జయము జయము. భారతమాతకు జయము జయము.

**19.** అభంగము :-

కాహీ నిత్య నేమావిణ । అన్న ఖాయ తో శ్వాన ।
వాయాం మనుష్య పణ । భార వాహే తో వృషభ ॥1॥

త్యాచా హెూయ భూమీభార । నేణేఀ జాతీ చా ఆచార।
జాలా దావే దార । భోగవీ అఘోర పితరాంసీ ॥2॥

అఖండ అశుభవాణీ । ఖరేఀ న బోలే స్వప్నీఀ ।
పాపీ తయాహూనీ । నాహీఀ ఆణిక దూసరా॥3॥

పోట పోసీ ఎకలా । భూతీఀ దయా నాహీ జ్యాలా ।
పాఠీ లాగే ఆల్యా । అతిథా చే ద్వారేశీఀ ॥4॥

కాంహీఀ సంతాంచే పూజన । న ఘడే తీర్థాంచె భ్రమణ ।
యమాచా ఆందణ । సీణ థోర పావలా ॥5॥

తుకామ్హణే త్యాంసీఀ । మనుష్యపణా కేలీ హాణీ ।
దేవా విసరూనీ । గేలీఀ మ్హణతీ మీ మాఝే ॥6॥ (97)

ప్ర.ప:- (ఎవడు) కాహీ = ఏమియు ; నిత్యనేమావిణ = నిత్య నియమములు ఆచరించకుండా ; అన్న = అన్నమును ; ఖాయ = తినునో; తో = వాడు ; శ్వాన = కుక్క (అని తెలియవలెను) ; (మరియు వాడి) మనుష్య పణ = మనుష్యత్వము ; వాయాం = వ్యర్థము ; తో= వాడు (సంసార) భార = బరువును, వాహే = మోయునటువంటి ; వృషభ =

ఎద్దు (అని అర్థము)1. భూమీ = భూమికి ; త్యాచా = వాడి యొక్క ; భార= బరువు; హెూయ = అగును ; (ఎవడు) జాతీచా ఆచార = స్వ జాతి యొక్క ఆచారములను ; నేణేc = పాలించడో; జాలా = మంటగలుపునో ; (వాడు) పితరాంసీ = పితరుల యొక్క దావేదార = శత్రువు (అయ్యి) ; అఘోర = అఘోరమనబడు నరక ప్రకారమును; భోగవీ = అనుభవింప జేయును. 2. (ఎవడు) అఖండ = ఎల్లప్పుడు అశుభవాణీ = అమంగళకర మాటలు (అబద్దము) ఉచ్చరించునో; ఖరేc= సత్యమును; స్వప్నీ = స్వప్నములో కూడ; న బోలే = మాట్లాడడో; తయా హూనీ = వాడికంటె;ఆణిక = అధికమైన; దూసరా = రెండవ ; పాపీ = పాపాత్ముడు ; నాహీc = లేదు. 3. (ఎవడు) ఎకలా = ఒంటరిగా (స్వతః వాడి) పోట = పొట్టను (మాత్రమే); పోసీ = పోషించునో; జ్యాలా = ఎవడికి; భూతీc = ప్రాణులయందు; దయా = దయ(అనుకంపా) నాహీc= లేదో; (మరియు ఎవడు) దారేశీc = ద్వారము వద్దకు ; ఆల్యా = వచ్చిన ; అతిథాచే = అతిథి యొక్క; పాఠీ లాగే= వెంట పడునో. 4. (మరియు) సంతాంచే సత్పురుషుల యొక్క; పూజన = ఆరాధన; తీర్థాంచే భ్రమణ = తీర్థ క్షేత్ర సంచారము ; కాంహీ= ఏమియును (ఎవడి ద్వారా) న ఘడే = గడించలేదో (చేయలేదో)(వాడు); యమాచా = యమునికి; ఆందణ = కానుక (అగును); (అందువలన వాడికి యముని చేత) థోర = మిక్కిలి ; సీణ = దుఃఖము ; పావలా = ప్రాప్తమగును ; 5. తుకా మ్హణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; (ఎవడు) దేవా = దేవున్ని ; విసురూని = మరచి ; గేలీ = పోయి ; (దేహమును) మీ = నేను (అని); (స్త్రీపుత్రాదులను) మాఝే = నావారు (అని అంటాడో) త్యాంసీc= వాడు ; (తన యొక్క) మనుష్య పణా = మనుష్యత్వమునకు ; హాణీ = హాని (నష్టము) ; కేలీ = చేసుకున్నవాడగు చున్నాడు. 6.

తా॥ ప్రాతఃస్మరణము, గంగాస్నానము, సంధ్యా, దేవపూజ మరియు తులసీ ప్రదక్షిణ మొదలగు నిత్య నియమములలోనే యొక్కటియు నాచరించకుండా ఎవడు అన్నమును భుజించునో, వాడు ఊరకుక్కతో సమానుడు. వాడి మనుష్య జన్మ వ్యర్థము. కేవలము సంసార భారమును మోయు వింతపశువు (ఎద్దు) అని తెలియవలెను. 1. ఇటువంటి మనుష్యుడు భూమికి బరువు. ఎవడు స్వజాతి మరియు కులధర్మములను మంటగలిపి, పాలించడో వాడు పితరులకు శత్రువై, వారిని అఘోరమను నరకములో పడదోసిన వాడగును. 2. ఎవడు ఎల్లప్పుడు అసభ్యకరమైన మాటలు మాట్లాడునో, స్వప్నములో గూడ సత్యమును వచించడో, అటువంటి వాడికంటే నధికమైన పాపాత్ముడు ఈ జగత్తులో మరొకడు లేడు. 3. ఎవడు ఒంటరిగా స్వతః వాడి పొట్టను మాత్రమే పోషించుకొనునో, పేద సాద ప్రాణుల విషయములో దయను జూపించడో, గడియలోకి వచ్చిన అతిథిని భయపెట్టి, ఆకలి తీర్చకుండానే వెన్నంటి పారద్రోలునో. 4. జీవితములో ఎపుడు గూడ సత్పురుషులను సేవించలేదో, తీర్థయాత్రలు చేయ (దిరుగ) లేదో, అటువంటి మనుష్యుడు యమునికి కానుక (దక్షిణ)గా సమర్పించ బడినవాడుగా నెఱుగవలెను. దానిచే వాడికి యముని వలన మిక్కిలి దుఃఖము ప్రాప్తమగును. 5. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు – ఏ మనుష్యుడు భగవంతున్ని మరచి దేహమును నేనని, పుత్ర భార్యాదులను నావారు అని తలంచునో, వాడు వాడి మనుష్యత్వమును నష్ట పరచుకున్న వాడగుచున్నాడు. 6.

సు.వ్యా –"న హి నిందా నిన్ద్యం నిందితుం ప్రక్రమతే, అపి తు సుత్యస్య స్తోతుమ్" ఈ న్యాయము చేత శ్రీ తుకారాం మహారాజుగారు "నిత్య నియమములు లేకుండా – ఎవడు అన్నమును భుజించునో వాడు

కుక్కతో సమానుడని" చెబుతూ ఆహారము యొక్క శ్రేష్ఠతను, మరియు భుజించునపుడు పాలించవలసిన నిత్య నియమములు, వహించవలసిన జాగ్రత్తలేమిటో బాగుగా గుర్తు చేశారు. శాస్త్రోక్త ప్రకారము ఆహారము యొక్క ప్రకారములు, భుజించునపుడు తీసికొనవలసిన జాగ్రత్తలు, నియమములు మరియు పద్ధతులు తెలిసి భుజించవలయును.

ఆహారముయొక్క ప్రయోజనములు "సుశ్రుతము"లో ఈ క్రింది విధములుగా తెలియ పరచడమైనది.

**శ్లో॥ ఆహారః ప్రాణినః సద్యో బలకృద్దేహ ధారకః ।**
**ఆయుస్తేజః సముత్సాహ స్మృత్యో ర్జోఽగ్నివివర్ధనః ॥**

**అర్థము :-** ఆహారమును భుజించిన తోడనే ప్రాణులకు బలమునిచ్చును. దేహవృద్ధికి తోడ్పడును. ఆయువును, తేజస్సును, ఉత్సాహమును, స్మృతిని, శక్తిని మరియు అగ్నిని వృద్ధి జేయును.

**మంత్రము :-** ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః, సత్త్వశుద్ధౌ ధృవా స్మృతిః. స్మృతిలంభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః । (ఛాం.ఉ. 7-26-2)

**అర్థము :-** శుద్ధ ఆహారం తీసికున్నందువలన సత్త్వగుణం, దానిచేత దృఢ స్మృతి (జ్ఞానం), దానిచే జీవుని గ్రంథులన్నీ విప్పుకొని శుద్ధుడౌతాడు అనగా ముక్తుడౌతాడు. కావున పరిశద్ధ (సాత్త్విక)మైన ఆహారమును తీసికొనవలయును.

**శ్లో॥ అన్నదోషేణ చిత్తస్య కాలుష్యం సర్వదా భవేత్ ।**
**కలుషీకృతచిత్తానాం జ్ఞానం సమ్యఙ్న భాసతే ॥**

**అర్థము :-** దోషయుక్తమైన (కలుషితమైన) ఆహారంచే మనస్సు దూషితమవుతుంది. కలుషితాంతఃకరణములో సమ్యగ్ జ్ఞానం ప్రజ్వలించదు.

ఎందుకంటే మనం తీసుకునే ఆహారంయొక్క సూక్ష్మాంశమే మనస్సుగా మారుతుందని ఛాందోగ్యోపనిషత్తులో ఈ విధంగా చెప్పబడింది.

**మంత్రము :-** అన్నమశితం త్రేధా విధీయతే, తస్య యః స్థవిష్ఠో ధాతు స్తత్పురీషం భవతి, యో మధ్య మస్తన్మాగ్ంసం, యోఽ ణిష్ఠస్తన్మనః ॥ (6-5-1)

**అర్థము :-** భుజించిన ఆహారము మూడు ప్రకారములుగా మారుతుంది. అతి స్థూలాంశము మలముగాను, మధ్యమాంశము మాంసము గాను, మరియు సూక్ష్మాంశము మనస్సుగాను మారుతుంది. కావునశుద్ధాహారము పరమ పద ప్రథమ సోపానమని సాధకులు గ్రహించదగినది.

ఆహారము మూడు విధములుగ నుండునని గుణ భేదము ననసరించే శ్రీ గీతాచార్యులు సెలవిచ్చిరి.

**శ్లో॥ ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।** (గీత. 17-7)

**అర్థము :-** ఆహారము గూడ సత్త్వాది గుణమును బట్టి సర్వులకు మూడు విధములుగా ఇష్టమున్నది.

**శ్లో॥ ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః ।**
**రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్విక ప్రియాః ॥**
(గీత. 17-8)

**అర్థము :-** ఆయుస్సును, మనోబలమును, దేహబలమును ఆరోగ్యమును, సౌఖ్యమును, ప్రీతి బాగుగ వృద్ధి నొందించునవియు, రసము గలవియు, చమురు గలవియు, దేహమందు చాలా కాలముండునవియు మరియు మనోహరములైనవియునగు ఆహారములు సత్త్వగుణము గలవారికి ఇష్టములై యుండును.

ఇట్టియాహారము ధ్యానాదులకు మిక్కుటముగ నను కూలించును కావున బ్రహ్మమార్గమున కీలకస్థానము నాక్రమించియున్నదానినిగ భావించి ముముక్షువులు సాత్త్వికాహారమునే సేవించుచు రావలెను.

**శ్లో॥ కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహి నః ।**
**ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥** (గీత. 17-9)

అర్థము :- చేదుగాను, పులుపుగాను, ఉప్పుగాను, మిక్కిలి వేడిగాను, కారముగాను, చమురులేనివిగాను, మిగుల దాహము గలుగజేయునవిగాను ఉండునవియు, శరీరమునకు దుఃఖమును, మనస్సునకు వ్యాకులత్వమును గలుగజేయునవియునగు ఆహారపదార్థములు రజోగుణము గలవానికిష్టములై యుండును.

**శ్లో॥ యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।**
**ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥** (గీత 17-10)

**అర్థము :-** వండిన పిమ్మట ఒక జాము దాటినదియు (లేదా బాగుగ ఉడకనిదియు), సారము నశించినదియు, దుర్గంధము గలదియు, పాచిపోయినదియు(వండిన పిదప ఒక రాత్రి గడచినదియు) ఒకరు తినగా మిగిలినదియు (ఎంగిలి చేయబడినదియు), అశుద్ధముగా నున్నదియు (భగవంతునికి నివేదించబడనిదియు)నగు ఆహారము తమోగుణము గలవారికిష్టమైనది యగును.

పరమార్థ సాధనకు ప్రతిబంధకములై యున్నందున రాజసిక, తామసిక ఆహారములను ముముక్షువులు సేవింపగూడదు.

ఆహారము యొక్క స్వరూపభేదమును బట్టి నాల్గు ప్రకారములుగా నుండునని శ్రీ శ్రీగాతాచార్యులు తెలియజేసిరి.

**శ్లోకపాదము :- పచామ్యన్నం చతుర్విధమ్ ॥** (గీత. 15-14)

పరమాత్మ జీవుల శరీరములో జఠరాగ్ని రూపమున వర్తించుచు, వారు తిను నాలుగు విధములైన ఆహారమును జీర్ణమొనర్చు చున్నారని తెలుపబడినది.

నాలుగు విధములైన యాహారములు-1. భక్ష్యములు, 2. భోజ్యములు, 3. లేహ్యములు, 4. చోష్యములు

1. దంతములచే కొరికి తినబడు కఠిన పదార్థములు - అప్పడములు (పిండి వంటలు), కూరగాయలు మొదలగునవి "భక్ష్యములు" లేదా "చర్వ్యము"లు అని గూడ అందురు.

2. నాలుకచే చప్పళించి మ్రింగబడు మెత్తని వస్తువులగు అన్నము మొదలగునవి "భోజ్యము"లనబడును.

3. నాలుకచే చప్పరింపబడి, రుచిచూడబడు పచ్చళ్ళు, బెల్లము (కరిగించినది) మొదలగు వాటిని "లేహ్యము" లందురు.

4. నోటిచే బిగబట్టి వాటి యొక్క రసమును మ్రింగి శేషాంశము పారవేయుబడునవి- ఉదా:- చెఱకు గడలు మొదలగునవి చోష్యములనబడును లేదా నోటిచే జుఱ్ఱబడు పాయసము, చారు, మజ్జిగ మున్నగునవి గూడ గ్రహించ దగినవి.

ఆహారమును భుజించునపుడు ఈ క్రింది నియమమును పాటించవలసిందని శాస్త్రము నుడువుచున్నది.

**శ్లో॥ ద్వౌ భాగౌ పూరయేదన్నై ర్జలేనైకం ప్రపూరయేత్ ।**
**మారుతస్య ప్రచారార్థం చతుర్థమవశేషయేత్ ॥** (స.ఉ. 2-59)

**అర్థము :-** ఉదరమును (పొట్టను) నాలుగు భాగములుగా ఊహించుకొని రెండు భాగములు అన్నముతో నింపవలెను. ఒక భాగము జలముచే పూరించవలెను. గాలి యాడుటకొఱకు ఒక భాగమును వదిలివేయవలెను. ఇది సాధకులు మరియు సామాన్యముగా ఎల్లపుడు కూర్చుండి వారి వారి వ్యాపారముల చేయువారికి అన్వయించును. కష్టజీవులు మాత్రము అనాయాసముగా జీర్ణించుకొనగలిగినంత, అనారోగ్యమునకు దారి దీయకుండా మనస్సు వ్యాకులత్వము నొందకుండా భుజించ వచ్చును.

**శ్లో॥ అనారోగ్య మనాయుష్య మస్వర్గ్యం చాతి భోజనమ్ ।**
**అపుణ్యం లోక విద్విష్టం తస్మాత్తత్పరివర్జయేత్ ॥**

(మనుస్మృతి. 2-57)

**అర్థము :-** అధిక భోజనము చేయుట ఆరోగ్యమునకు, ఆయుస్సునకు, స్వర్గమునకు మరియు పుణ్యమునకు అహితకరమవుతున్నది. అదేవిధముగా లోక నిందితమున్నది. ఈ కారణము చేత నధిక భోజన సేవనము సర్వదా త్యాజ్యము.

**శ్లో॥ దేవాన్నమేక భుక్తం తు ద్విభుక్తం స్యాన్నరస్య చ ।**
**త్రిభుక్తం ప్రేత దైత్యస్య చతుర్థం కౌణపస్య తు ॥**

(పద్మ పురాణము - సృష్టిఖండము. 46-130)

**అర్థము :-** మనుష్యుడు ఒకసారి (ఒకపూట మాత్రమే) భుజించుట దేవతా భోజనము (దైవాన్నము) అనబడును. రెండు మార్లు భుజించుట మానుషాన్నమని, మూడుసార్లు భుజించుట ప్రేతములు మరియు దైత్యుల భోజనమని, తథా నాలుగు మార్లు భుజించుట కౌణప భోజనమని పురాణ

వచనము. "కౌణప" అనగా! కుణపం = శవం భక్షయితుం శీలమస్యేతి = కౌణపః (అమరకోశము 1-1-59), కుణపః = శవః భక్ష్యత్వేన విద్యతే అస్యేతి = కౌణపః (వాచస్పత్యమ్)

**"సాయం ప్రాతర్మనుష్యాణా మశనం శ్రుతి బోధితమ్"**

ప్రొద్దున మరియు సాయంత్రము రెండుసార్లు మనుష్యులు భుజించవచ్చునని శ్రుతి చెప్పుచున్నది.

గృహస్థుడైనవాడు ఉదయం పూట భుజించుటకు పూర్వము ఆచరించవలసిన కర్తవ్యమును "యాజ్ఞవల్క్యస్మృతి" ఈ క్రింది విధముగా బోధించుచున్నది.

**శ్లో॥ శరీరచింతాం నిర్వర్త్య కృతశౌచవిధిర్ద్విజః ।**
**ప్రాతః సంధ్యాముపాసీత దంతధావనపూర్వకమ్ ॥** (1-98)

**అర్థము :-** ద్విజుడైన గృహస్థుడు ప్రాతఃకాలములో శరీర చింత (మలమూత్ర విసర్జనము) దూరము చేసికొని, దంతధావనము చేసికొని, స్నానాది క్రియలచే శుచిర్భూతుడై, ప్రాతః సంధ్యోపాసన తీర్చుకొనవలయును.

**శ్లో॥ హుత్వాగ్నీ న్సూర్య దైవత్యాన్ జపేన్మంత్రాన్సమాహితః ।**
**వేదార్థానధిగచ్ఛేచ్చ శాస్త్రాణి వివిధాని చ ॥** (1-99)

**అర్థము :-** ప్రాతః సంధ్యానంతరము ఆహవనీయాది (అగ్నులందు) హవనము చేసి, సమాహితచిత్తుడై (అవిక్షిప్తచిత్తుడై), సూర్య దైవత్య మంత్రము (ఉదు త్యం జాతవేదసమ్)ను జపించి, తదనంతరము వేదార్థములను, మరియు వివిధ శాస్త్రముల జ్ఞానమును అధ్యయనాదుల ద్వారా బడయవలెను.

శ్లో॥ ఉపేయాదీశ్వరం చైవ యోగక్షేమార్థ సిద్ధయే ।
స్నాత్వా దేవాన్ పిత్రూంశ్చైవ తర్పయేదర్చయేత్తథా ॥ (1-100)

అర్థము :- యోగ (అప్రాప్తము యొక్క ప్రాప్తి) క్షేమము (ప్రాప్తము యొక్క రక్షణ) కొఱకు ఈశ్వరుని (దేవాలయము, రాజు, లేదా ప్రశస్త వ్యక్తి) వద్దకు వెళ్ళ వలెను. తదనంతరము మధ్యాహ్నకాలములో స్నానము చేసి దేవతలకు మరియు పితరులకు అర్చనము మరియు తర్పణము చేయవలెను.

శ్లో॥ వేదాథర్వ పురాణాని సేతిహాసాని శక్తితః ।
జపయజ్ఞ ప్రసిధ్యర్థం విద్యాం చాధ్యాత్మికీ జపేత్ ॥ (1-101)

అర్థము :- తదనంతరము జపయజ్ఞ సిద్ధి కొఱకు వేదము (ఋక్, యజు, సామ, అధర్వణ) యొక్క స్వస్వ శాఖాధ్యయనము, పురాణ, ఇతిహాస మరియు ఆధ్యాత్మిక విద్యను యథాశక్తి జపించవలెను. (అభ్యసింప వలెనని యర్థము)

శ్లో॥ అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృ యజ్ఞస్తు తర్పణమ్ ।
హెూమో దైవో బలిర్భూతో నృయజ్ఞోఽ తిథి పూజనమ్॥
(మ.స్మృ.3-70)

అర్థము :- వేదము యొక్క అధ్యయనము, అధ్యాపనము పితృ తర్పణము, దేవతోద్దిష్ట హవనము, భూతములకు అన్నమునిచ్చుట మరియు అతిథి భోజనాది పంచ మహాయజ్ఞములను నిర్వహించవలయును.

శ్లో॥ దేవేభ్యశ్చ హుతాదన్నా చ్ఛేషాద్భూతబలిం హరేత్ ।
అన్నం భూమౌ శ్వ చాండాల వాయసేభ్యశ్చ నిక్షిపేత్ ॥
(యా.స్మృ. 1-103)

అర్థము :- దేవతలకు (వైశ్వదేవతలకు) హవనము చేయగా శేషించిన అన్నమును భూతయజ్ఞము చేయవలెను. కుక్కలకు, చాండాలురకు, మరియు కాకుల కొఱకు అన్నమును భూమిపై పెట్టవలెను.

శ్లో॥ అన్నం పితృ మనుష్యేభ్యో దేయమప్యన్వహం జలమ్ ।
స్వాధ్యాయ సతతం కుర్యాన్న పచేదన్నమాత్మనే ॥
(యా.స్మృ. 1-104)

అర్థము :- ప్రతిదినము పితరులకు మరియు మనుష్యులకు అన్నము నిడవలయును. అన్నాభావసమయములో జలమును సమర్పించవలెను. ప్రతిదినము స్వాధ్యాయము చేయుచుండవలయును. కేవలము స్వతః వారి కోసమే అన్నమును వండుకొనరాదు.

శ్లో॥ ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యంతే యజ్ఞ భావితాః ।
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః ॥ (గీత. 3-12)

అర్థము :- పైన దెలుపబడిన యజ్ఞములచే దేవతలు తృప్తి జెంది, ఇష్టమైన భోగములనిచ్చి వర్షాదులచే వారిని తృప్తిపఱచెదరు – ఈ ప్రకారము వారిచే నివ్వబడిన భోగ్యవస్తువులను తిరిగి వారికి సమర్పింపకనే ఎవడనుభవించునో, అతడు దొంగయే యగును.

శ్లో॥ యజ్ఞ శిష్టాశ్శినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।
భుంజ్ఞతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥
(గీత. 3-13)

అర్థము :- యజ్ఞము నందు (భగవదర్పణము చేసి) మిగిలిన పదార్థమును తిను సజ్జనులు సమస్త పాపములనుండి విడువబడుచున్నారు. అట్లుగాక ఎవరు తమ నిమిత్తమే (దేహేంద్రియములను మాత్రమే తృప్తి

పఱచుటకు) భుజించుచున్నారో, అట్టివారు పాపమును తినువారే యగుదురు.

శ్లో॥ అతిథిత్వేన వర్ణానాం దేయం శక్త్యనుపూర్వశః ।
అప్రణోద్యోఽతిథిః సాయమపి వాగ్భూతృణోదకైః ॥
(యా.స్మృ. 1-107)

అర్థము :- సమయమునకు అతిథిరూపంలో వచ్చిన ఏవర్ణము వారికైనను వర్ణక్రమముగా యథాశక్తి అన్నమునిడి తృప్తి పరచవలెను. సాయంకాలము గూడ ఒకవేళ అతిథులు విచ్చేసిన యెడల వారిని నిరాశపరచకుండా మధురవాణి చేతను, శయనించుటకు స్థలమును చూపి, తృణ శయ్యనిచ్చి, జలాదులచే నతనిని సత్కరించవలెను.

శ్లో॥ బాలస్వవాసినీ వృద్ధ గర్భిణ్యాతుర కన్యకాః ।
సంభోజ్యాతిథి భృత్యాంశ్చ దంపత్యోః శేషభోజనమ్ ॥
(యా.స్మృ. 1-105)

అర్థము :- బాలురు, పితృగృహస్థిత సువాసినీ (వివాహిత) స్త్రీలు, వృద్ధులు, గర్భిణీస్త్రీలు, రోగులు, కన్యకలు, అతిథులు మరియు సేవకులకు అన్నమును వడ్డించి, మిగిలిన అన్నమును (గృహస్థులైన) దంపతులు భుజింపవలెను.

శ్లో॥ అపోశనేనోపరిష్టాదధస్తా దశ్నతా తథా ।
అనగ్న మమృతం చైవ కార్యమన్నం ద్విజన్మనా ॥
(యా.స్మృ. 1-106)

అర్థము :- ద్విజాతులైనవారు భోజనసమయంలో భుజించుటకు పూర్వము మరియు తరువాత ఆపోశన కర్మచేత భోజనమును అనగ్నము మరియు అమృతమును చేయవలయును.

ఆపోశన కర్మ అనగా భోజనమునకు పూర్వము "అమృతస్యోపస్తరణమసి స్వాహా" అను మంత్రమును చ్చరించి అన్నమును భుజించవలెను. భుజించిన పిమ్మట "అమృత పిధానమసి స్వాహా" అను మంత్రమునుచ్చరించవలయును. దీనినే యమృతము చేయుట యందురు.

అనగ్నమనగా భోజనమునకు పూర్వము అన్నముపై జలముచే సంప్రోక్షణముగావించి మూడుసార్లు ఆచమనము చేయాలి. భోజనానంతరము గూడ మూడుసార్లు ఆచమనము చేయాలి.

శ్లో॥ ఉపస్పృశ్య ద్విజో నిత్య మన్న మద్యాత్సమాహితః ।
భుక్త్వాచోపస్పృశేత్సమ్యగద్భిః ఖాని చ సంస్పృశేత్ ॥
(మ.స్మృ. 2-53)

అర్థము :- ద్విజుడైనవాడు ప్రతి నిత్యము సావధానముగా మూడు సార్లు ఆచమనము చేసి భుజించుట కారంభించవలెను. మరియు భుజించిన పిమ్మట గూడ మూడుసార్లు ఆచమనము చేయవలయును. సమ్యగ్ అనగా శాస్త్రోక్తప్రకారముగా జలముచే రెండు ముక్కు రంధ్రములను, రెండు చెవులను మరియు రెండు కన్నులను స్పృశించవలెను.

శ్లో॥ త్రిరాచామేదపః పూర్వం ద్విః ప్రమృజ్యాత్తతో ముఖమ్ ।
ఖాని చైవ స్పృశేదద్భిరాత్మానం శిర ఏవ చ ॥ (మ.స్మృ. 2-60)

అర్థము :- భుజించుటకు పూర్వము మూడుసార్లు ఆచమనము చేసి, అంగుష్ఠ మూలముచే (పెదవులు మూసికొని) ముఖమును స్పృశించవలెను. మరియు పైన జెప్పినట్లుగా ఆరు ఛిద్రములను, హృదయస్థానమును మరియు శిరస్సును జలముచే స్పృశించవలయును.

అన్నమును పూజ్యభావనచే ఆదరపూర్వకముగా భగవత్ప్రసాదముగా భావించి భుజించవలెను.

శ్లో॥ పూజయే దశనం నిత్యమద్యా చ్చైతదకుత్సయన్ ।
దృష్ట్వా హృష్యేత్ప్రసీదేచ్చ ప్రతినందేచ్చ సర్వశః ॥ (మ.స్మృ. 2-54)

అర్థము :- భోజన పదార్థములను పూజించవలెను. అనగా "ప్రాణార్థకమని" ధ్యానించవలెను. మరియు అన్నమును నిందించకూడదు. మొత్తము అన్నమును భుజించవలెను. ఎంగిలి యన్నమును విస్తరు లేదా పళ్ళెములో మిగల్చ (వదల) గూడదు. అన్నమును చూసి మనస్సు ప్రసన్నముగా చేసికొనవలెను. "ఈ అన్నము నాకు సర్వదా లభించు గాక" అని ఈ ప్రకారము అన్నమును అభినందించవలెను.

శ్లో॥ "యదృచ్ఛయాచోపపన్నమద్యాచ్ఛ్రేష్ఠ ముతావరమ్"

తథా "అన్నం న నింద్యాత్ "(తై.ఉ. 3-7) ఇత్యాది వచనములచే దైవవశముచే సంప్రాప్త అన్నము శ్రేష్ఠము గాని అశ్రేష్ఠముగాని పరబ్రహ్మ స్వరూపముగా భావించి భుజించవలెను. కాని యపకృష్ఠమున్నదని నిందించవలదు.

శ్లో॥ ప్రాణార్థం మాం సదా ధ్యాయేత్సమాం సంపూజయేత్సదా ।
అనింద శ్చైతదద్యాత్తు దృష్ట్వా హృష్యేత్ప్రసీదేచ్చ ॥
(ఆదిత్య పురాణము)

అర్థము :- ప్రాణార్థము నన్ను ధ్యానించవలెను. అతడు (భోక్త) నన్ను ఎల్లపుడు పూజించవలెను. నిందించకుండా భుజించవలెను. నన్ను చూసి ప్రసన్నమైన మనస్సుతో హర్షించ వలయునని స్వయముగా పలికెను.

శ్లో॥ అన్నం దృష్ట్వా ప్రణమ్యాదౌ ప్రాంజలిః కథయేత్తతః ।
అస్మాకం నిత్య మస్త్వేతదితి భక్త్యా స్తువన్నమేత్ ॥
(ఆదిత్య పురాణము)

అర్థము :- అన్నమును చూడగానే మొమ్మొదట నమస్కరించి, ప్రాంజలి ఘటించి "ఈ అన్నము మాకు ఎల్లపుడు ప్రాప్తమగుగాక" అని భక్తిచే స్తుతిస్తూ - నమస్కరించవలెను.

**శ్లో॥ పూజితం హ్యశనం నిత్యం బలమూర్జం చ యచ్ఛతి ।**
**అపూజితం తు తద్భుక్తముభయం నాశయేదిదమ్ ॥**

(మ.స్మృ. 2- 55)

**అర్థము :-** పూర్వోక్త ప్రకారముగా పూజింపబడిన (సత్కరింపబడిన, అభినందింపబడిన) అన్నము బలమును మరియు వీర్యమును ప్రసాదించును అదే విధముగా పూజింపబడని యన్నము (నిందితము అనగా నిందజేయబడుతూ తినబడినది) ఆ రెంటిని (బలము మరియు వీర్యమును) నష్టపరచును.

**శ్లో॥** అన్నమూర్జస్కరం లోకే ప్రాణాంశ్చాన్నే ప్రతిష్ఠితాః ।
అన్నేన ధార్యతే సర్వం విశ్వం జగదిదం ప్రభో! ॥

(మహాభారతము - అనుశాసన పర్వము. 63-7)

**అర్థము :-** ప్రభో! సంసారములో అన్నమే శారీరక మరియు మానసిక బలమును వృద్ధి జేయును. అన్నముయొక్క ఆధారము చేతనే సమస్తప్రాణులు లేదా ప్రాణములు నిలిచియున్నవి. అందువలన అన్నమే ఈ సమస్త జగత్తును ధరించియున్నది.

వృష్టేరన్నం **తతః** ప్రజాః ॥ (మ.స్మృ. 3-76)

వర్షముచే అన్నము మరియు అన్నముచే ప్రజోత్పత్తి జరుగుచున్నది. కావున నన్నము సర్వదా సర్వులచే సర్వత్ర సంసేవ్యము, పూజనీయమున్నది. అందువలన నన్నము భగవద్భావము (బ్రహ్మ భావము)చే భుజించదగినది. భోజనారంభమున దృష్టిదోష నివారణార్థము బ్రహ్మాదులను స్మరించవలెను.

శ్లో॥ అన్నం బ్రహ్మ రసో విష్ణుః భోక్తాదేవో మహేశ్వరః ।
ఇతి సంచింత్య భుంజానం దృష్టిదోషో న బాధతే ॥

శ్లో॥ అంజనా గర్భసంభూతం కుమారం బ్రహ్మచారిణమ్ ।
దృష్టిదోషవినాశాయ హనూమంతం స్మరామ్యహమ్ ॥

**అర్థము :-** అన్నము బ్రహ్మము, రసము విష్ణువు, జ్ఞాన మూర్తియైన మహేశ్వరుడు (శివుడు) భోక్తయై యున్నాడని చింతిస్తూ, యెవరు అన్నమును భుజించుదురో, వారికి దృష్టి దోషము బాధించదు.

అంజనాదేవి గర్భమున కుమారుడుగా జన్మించిన, (లేదా కుమార స్వరూపుడైన) బ్రహ్మచారియైన శ్రీ అంజనేయ స్వామిని దృష్టి దోష నివారణార్థము స్మరించుచున్నాను.

మితము, సాత్త్వికము, ఈశ్వరార్పితము మరియు న్యాయార్జితమైన అన్నమును, పరమార్థసాధనయే(అన్నము యొక్క) ముఖ్య ప్రయోజనముగా యెంచి, ప్రాణసంధారణార్థము సాధకుడు దైవధ్యానముతో భుజించవలయును.

శ్లో॥ అత్రాహారార్థం కర్మకుర్యా దనింద్యం
కుర్యా దాహారం ప్రాణసంధారణార్థమ్ ।
ప్రాణాః సంధార్యాస్త త్త్వజిజ్ఞాసనార్థం
తత్త్వం జిజ్ఞాస్యం యేన భూయో న దుఃఖమ్ ॥
(శ్రీయోగ వాసిష్ఠము - నిర్వాణ ప్రకరణము-
ఉత్తరార్థము -21-10)

**అర్థము :-** ఈ భువిలో ముముక్షువైన వాడు ఆహారము కొఱకు శాస్త్రోక్తమైన, అనింద్యమైన కర్మ చేయాలి. ప్రాణసంధారణ కొఱకు మాత్రమే

ఆహారమును భుజించవలయును. బ్రహ్మము నెఱుంగుటకు మాత్రమే ప్రాణములను ధరించాలి. దేనిచే (జనన మరణరూప) సంసారదుఃఖము అత్యంతాభావము నొందునో (సమూలముగా నివృత్తమగునో), అటువంటి బ్రహ్మతత్త్వము నవశ్యముగా నెఱుంగవలయును.

ఇంతటి గొప్ప మాహాత్మ్యముగల, శ్రేష్ఠమైన, సర్వులచే పూజ్యమైన అనింద్యమైన యాహారమును యెవడు ప్రాతః స్మరణము, గంగాస్నానము సంధ్యోపాసనము, తులసీ ప్రదక్షిణము, దేవపూజ మరియు అతిథి సత్కారాది నిత్య నియమములలోనే యొక్కటియును ఆచరించ (పాలించ) కుండా భుజించునో, వాడు శ్రీతుకారాం మహారాజుగారన్నట్లు కుక్క గాక మరేమగును. వాడి మనుష్యజన్మనిరర్థకము. వాడు కేవలము సంసార భారమును మోయు నొకానొక వృషభము (ఎద్దు)అని తెలియవలెను. 1.

ఇటువంటి మనుష్యుడు భూమికి బరువు. కులధర్మములను, జాతిధర్మములను అనుష్ఠించక శాస్త్రమర్యాదను ఎవడుల్లంఘించునో వాడు పితరులకు శత్రువై, వారిని నరకములో పడదోయువాడగుచున్నాడని శ్రీతుకారాం మహారాజుగారు అభంగములోని రెండవ చరణము ద్వారా తెలియజేయుచున్నారు.

శ్రీ బ్రహ్మదేవునితో పృథ్వీమాత ఈ విధముగా తనయొక్క దుస్సహమైన బాధను(దుఃఖమును) విన్నవించుకుంటూ విలపిస్తుంది.

శ్లో॥ కృష్ణ భక్తి విహీనా యే యే చ తద్భక్తనిందకాః ।
తేషాం మహా పాతకినా మశక్తా భారవాహనే ॥

శ్లో॥ స్వధర్మాచార హీనా యే నిత్యకృత్యవివర్జితాః ।
శ్రద్ధాహీనాశ్చ వేదేషు తేషాం భారేణ పీడితా ॥

శ్లో॥ పితృ మాతృ గురుస్త్రీణాం పోషణం పుత్రపోష్యయోః ।
యే న కుర్వంతి తేషాం చ న శక్తా భారవాహనే ॥

శ్లో॥ యే మిథ్యావాదినస్తాత దయా సత్య విహీనకాః ।
నిందకా గురుదేవానాం తేషాం భారేణ పీడితా ॥

**అర్థము :-** ఎవరు శ్రీకృష్ణ పరమాత్మ యొక్క భక్తి చేయరో, మరియు శ్రీకృష్ణభక్తులను నిందించెదరో, ఆ మహాపాతక మనుష్యులయొక్క భారమును మోయుటకు నేను సర్వథా అసమర్థురాలనగుచున్నాను.

ఎవడు స్వవర్ణాశ్రమ ధర్మములను ఆచరించుట లేదో, నిత్యాది కర్మ విహీనుడగుచున్నాడో, ఎవరికి శ్రీగురు వేదాదులయందు శ్రద్ధలేదో, వారి భారముచే పీడితురాలనగు చున్నాను.

తల్లి, తండ్రి, గురువు, స్వపత్నీ, పుత్రులు మరియు ఆశ్రిత వర్గము నెవడు పాలన -పోషణ చేయుట లేదో, వాడి భారమును మోయుటకు నేను అసమర్థురాలనగు చున్నాను.

ఓ తండ్రీ! ఎవడు అసత్యమును పలుకునో, ఎవడి యందు దయ మరియు సత్యాచరణాభావము గలదో, అదేవిధముగా గురుజనులను, దేవతలను ఎవడు నిందించునో, వాడి భారముచే పీడితనగుచున్నాను.

(బ్రహ్మవైవర్త పురాణము - శ్రీకృష్ణ జన్మఖండము-
4-20 నుండి 23 వరకు)

శ్లో॥ వర్ణాశ్రమ విరుద్ధం చ కర్మ కుర్వన్తి యే నరాః ।
కర్మణా మనసా వాచా నిరయేషు పతన్తి తే ॥

(విష్ణుపురాణము. 2-6-32)

**అర్థము** : - ఎవరు వారి స్వవర్ణాశ్రమ ధర్మ విరుద్ధముగా మనసా, వాచా, కర్మణా వ్యవహరించునో, వారు నరకములో పడి పోదురు.

**శ్లో॥ అకుర్వన్ విహితం కర్మ నిందితం చ సమాచరన్ ।**
**ప్రసక్తశ్చేంద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతే నరః ॥**

(మనుస్మృతి. 11-44)

**అర్థము** :- శాస్త్రోక్త కర్మలు (సంధ్యోపాసన, అగ్నిహోత్ర, శవస్పర్ష దోష నివృత్యర్థ స్నానాది) చేయని వాడు అదేవిధముగా శాస్త్ర ప్రతిషిద్ధ కర్మలు (హింసా, దొంగతనము, మద్యపానము, ద్యూతము మొదలగునవి) చేయు వాడు, మరియు ఇంద్రియార్థముల (శబ్దాదుల) యందు ఆసక్త మనుష్యుడు ప్రాయశ్చిత్తమునకు అర్హుడగును.

**శ్లో॥ యశ్శాస్త్ర విధిముత్సృజ్య వర్తతే కామకారతః ।**
**న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥**

(గీత. 16-23)

**అర్థము** :- ఎవడు శాస్త్రోక్తమగు విధిని విడిచిపెట్టి తన యిచ్ఛానుసారము ప్రవర్తించునో, వాడు పురుషార్థ ప్రాప్తి యోగ్య అంతఃకరణ శుద్ధిని పొందడు. వాడికి ఐహిక పారలౌకిక సుఖములు దుర్లభములు. మోక్షమైతే అత్యంత దుర్లభము.

"ఎవడు అసభ్యకరమైన వచనములు పలుకునో, స్వప్నములో గూడ సత్యమును వచింపడో, అటువంటి వాడికంటె ఈ జగత్తులో పాపాత్ముడు మరొకడుండడు" అని సత్యపరిపాలనా కర్తవ్యమును శ్రీ తుకారాం మహారాజుగారు అభంగములోని మూడవ చరణముద్వారా వ్యతిరేకముఖముగా గుర్తుచేయు చున్నారు.

"సత్యం వద" (తై.ఉ. 1-11-1) సత్యమును పలుకుము.

శ్లో॥ నాస్తి సత్యాత్పరోధర్మో నానృతాత్పాతకం పరమ్ ।
స్థితిర్హి సత్యం ధర్మస్య తస్మాత్సత్యం న లోపయేత్ ॥
(మ.భా.శాం.ప. 162-24)

అర్థము :- సత్యమునకంటె నధికమైన ధర్మము లేదు. అసత్యమునకంటే నధికమైన పాతకము లేదు. సత్యమే ధర్మమున కాధార శిలయై యున్నది. కావున సత్యమును లోపము చేయకూడదు - అని మహాభారతము చెప్పుచున్నది.

"సత్యమేవ జయతే నానృతమ్" (ముం.ఉ. 3-1-6)

"సత్యవాదియే జయమును పొందును. మిథ్యా వాది కాదు" అని ఉపనిషత్తు బోధించుచున్నది. మంత్రములోని "సత్య"శబ్దముచే" సత్యవాది" యని లక్షణచేత తెలియవలెను. ఏలయన, పురుషాశ్రితములు గాని కేవల సత్యానృతములకు జయపరాజయములు సంభవింపవు కదా. (భాష్యము).

"సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా" (ముం.ఉ.3-1-5) మిథ్యా వచన త్యాగరూప సత్యము మరియు మనస్సు తథా ఇంద్రియముల ఏకాగ్రతా రూప తపస్సు చేతనే యథార్థ ఆత్మ దర్శనమగునని ఉపనిషత్తు చెప్పుచున్నది. కావున సత్యమును ప్రయత్నపూర్వకముగా పాలించదగినదని తెలియ బడుచున్నందున, సత్యమును లోపము చేయకూడదు.

శాస్త్రము సత్యము యొక్క నిర్వచనము ఈ క్రింది విధముగా చేసినది.

శ్లో॥ చక్షురాదీంద్రియైర్దృష్టం శ్రుతం ఘ్రాతం మునీశ్వర! ।
తస్యైవోక్తిర్భవేత్సత్యం విప్ర తన్నాన్యథా భవేత్ ॥
(జాబాల దర్శనోపనిషత్ 1-9)

శ్రీ దత్తాత్రేయులవారు వారి శిష్యుడైన సాంకృతికి బోధిస్తూ- హే సాంకృతీ! చక్షురాదీంద్రియముల చేత ఏయే శబ్దాది విషయములను వినడము, చూడడము, వాసన చూచుట మొదలగునవి అనుభవించబడినవో, మరియు తెలియబడినవో, వాటిని అదే విధముగా యథార్థముగా వాగింద్రియము చేతగాని లేక సంకేతము చేతగాని చెప్పుట యేది గలదో దానిని "సత్య"మందురు.

**శ్లో॥ యథా శ్రుతం యథా దృష్టమాత్మనా యద్యథా కృతమ్ ।**
**తథా తస్యా వికారేణ వచనం సత్యలక్షణమ్ ॥**

(మ.భా. అను.ప. 145 అధ్యా.పృ. 5988)

**అర్థము :-** ఎవరు ఎలా వినియున్నారో, చూసి యున్నారో మరియు ఎలా చేసియున్నారో - ఆ యనుభవమును ఏవిధమైన పరివర్తనము (వికారము, మార్పు) చేయకుండా యథా తథముగా వాణిద్వారా ప్రకటము చేయుట యేది గలదో, అదియే "సత్యము" యొక్క లక్షణము.

**శ్లో॥ సత్యస్య వచనం శ్రేయః సత్యం జ్ఞానం హితం భవేత్ ।**
**యద్భూత హిత మత్యన్తం తద్వై సత్యం పరం మతమ్ ॥**

(మ.భా.వన. ప. 213-31)

అర్థము :- ఎల్లపుడు సత్యమును చెప్పుట కల్యాణకారియగును. యథార్థ జ్ఞానమే హితకారకమగును. దేనిచే జీవులకు అత్యంత హితము చేకూరునో, అదియే ఉత్తమ సత్యమని చెప్పబడినది.

**శ్లో॥ యథార్థ కథనం యచ్చ సర్వలోక సుఖప్రదమ్ ।**
**తత్సత్యమితి విజ్ఞేయ మసత్యం తద్విపర్యయః ॥**

(బ్రహ్మాపురాణము (పద్మపురాణము)

**అర్థము** - సర్వలోకులకు సుఖమునిచ్చు యథార్థ (చూసింది చూచినట్లు, విన్నది విన్నట్లు, తెలుసుకున్నది తెలుసుకున్నట్లు) వచనము యేది గలదో, దానిని సత్యమందురు. దానికి విరుద్ధమైనది అసత్యమని తెలియవలెను.

సర్వులకు సుఖమును గలుగ జేయు యథార్థవచనము "సత్యము" అని నిర్వచిస్తే కొన్ని సందర్భములలో సత్యము గూడ కొందఱికి దుఃఖమును మరియు ననర్థమును గూడ గలుగ జేయవచ్చు నను శంకకు సమాధానముగా మన్వాదులు నుడువుచున్నారు.

**శ్లో॥ సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్నబ్రూయాత్సత్య మప్రియమ్ ।**
**ప్రియం చ నా నృతం బ్రూయాదేష ధర్మ స్సనాతనః ॥**

(మనుస్మృతి.4-138) (స్కంధపురాణము-బ్రహ్మఖండము.ధ.మ. 6-88)

**అర్థము :-** యథా దృష్టము, శ్రుతమునగు ప్రియమగు సత్యమును చెప్పవలెను. ఉదా! నీకు పుత్రుడు కలిగెను. ఇత్యాది. సత్యమైనను అప్రియమును (నీ పుత్రుడు మరణించెను ఇత్యాది) చెప్పవలదు. ప్రియమైనను అసత్యమును చెప్పగూడదు. ఇది వేదమూలకమున్నందున అనాది కాలము నుండి వచ్చుచున్న (సనాతన) ధర్మమున్నది.

**శ్లో॥ భవేత్సత్యం న వక్తవ్యం వక్తవ్య మనృతం భవేత్ ।**
**యత్రానృతం భవేత్సత్యం సత్యం వాప్య నృతం భవేత్ ॥**

(మ.భా. కర్ణపర్వము 69-32)

(మహాభారతము-శాంతిపర్వము - రాజధర్మాను శాసనపర్వము - 109-5)

**అర్థము :-** ఎక్కడ అసత్యమే సత్యము యొక్క పని జేయునో అనగా ఒకానొక ప్రాణికి ప్రాణసంకటము నుండి రక్షించగలదో లేక సత్యమే

యసత్యముగాగలదో, అనగా ఒకానొక జీవిని సంకటమున పడవేయగలదో- ఇటువంటి సందర్భములయందు సత్యమును చెప్పగూడదు- అసత్యమును పలుకుటయే యుచితము.

దీనికి యవచ్ఛేదకమును (మర్యాదను) గూడ సెలవిచ్చారు. వ్యాసభగవానులు - జాగ్రత్తగా గమనించాలి.

**శ్లో॥ తాదృశం పశ్యతే బాలో యస్య సత్యమనుష్ఠితమ్ ।**
**భవేత్సత్య మవక్తవ్యం న వక్తవ్యమనుష్ఠితమ్ ।**
**సత్యానృతే వినిశ్చిత్య తతో భవతి ధర్మవిత్ ॥**

(మ.భా. కర్ణపర్వము. 69-34 , 35.)

**అర్థము :-** ఎలాగోలాగున గత్యంతరము లేక అనివార్య పరిస్థితుల్లో స్వేతరహితార్థము వ్యవహారములోనికి తీసుకురాబడిన యసత్యమును, అనగా ఎక్కడ అసత్యమాడినచో పరిణామమున సత్యము వలె మంగళకారకమగునో, మరియు ఎక్కడ సత్యము పలికిన ననర్థము చేకూరునో - ఇటువంటి పరిస్థితుల్లో వ్యవహారములోనికి తీసుకురాబడిన యసత్యమును, బాలురు అనగా మూర్ఖులు సదా సర్వథా సత్యముగానే భావించి స్వార్థముచే నల్ప ప్రయోజనములకు ప్రయోగింతురు. కావున యిటువంటి అసత్య రూప సత్యమును ఎల్లవేళల, సర్వత్ర ప్రయోగించుట యోగ్యము కాదు. భావిత అసత్యరూప సత్యమును పలుకరాదు. మరేమనగా! మొదలు సత్యాసత్యములను బాగుగా పరిశీలించి పరిణామములో సత్యము వలె మంగళకరముగాగలదను దృఢనిశ్చయము గలిగిన పిదపయే వాటిని (సత్యాసత్యములను) పాలించవలయును. లేనిచో మౌనమే ఉచితము. ఈ విధముగా చక్కగా వివేకము చేసి యెవరు వ్యవహరించెదరో, వారు ధర్మజ్ఞులని భారతవచనము.

కావున మళ్ళీ, మనువచనమునే గుర్తుకు తెచ్చుకొనుట సముచితము.

**శ్లో॥ సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్నబ్రూయాత్సత్య మప్రియమ్ ।**
**ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మ స్సనాతనః ॥**

శ్లోకార్థముపైన దెలియ పరచనైనది. "నాస్తి సత్యాత్పరో ధర్మః" సత్యము కంటె నధిక ధర్మము లేదని చెప్పబడినందున సత్యమునే సర్వదా సర్వత్ర ప్రయత్నపూర్వకముగా పాలించవలయును.

ధర్మమననేమిటో, యే ప్రయోజనమునుద్దేశించి శాస్త్రము ధర్మమును బోధించు చున్నదో ప్రాసంగికముగా తెలిసికొనుట యుచితము.

**శ్లో॥ ధారణాద్ధర్మ మిత్యాహుర్ధర్మేణ విధృతాః ప్రజాః ।**
**యః స్యాద్ధారణ సంయుక్తః సధర్మ ఇతి నిశ్చయః ॥**

(మ.భా.శాం.ప. 109-11)

**అర్థము :-** ఏ తత్త్వము సంసారమును ధరించుచున్నదో - అధోగతి నుండి సద్గతిలోనికి తీసికెళ్ళుచున్నదో, మానవజీవనమును పశుత్వమునుండి వేరు జేసి దైవత్వమునకు తీసికెళ్ళుచున్నదో, దేనిచే సంపూర్ణ లోకము యొక్క స్థితి సంభవించు చున్నదో, ఏది సంపూర్ణ ప్రజ (ప్రాణికోటి) ను ధరించి యున్నదో-దేనిచే సమస్తము యొక్క ధారణ, పోషణ సిద్ధించు చున్నదో - ఆ తత్త్వమే "ధర్మ"ము- అని ధర్మవేత్తల యొక్క నిశ్చయము.

**శ్లో॥ అహింసార్థాయ భూతానాం ధర్మ ప్రవచనం కృతమ్ ।**
**యః స్యాదహింసా సంపృక్తః స ధర్మ ఇతి నిశ్చయః ॥**

(మ.భా. శాం.ప. 109-12)

అర్థము :- మనో వాక్కాయ కర్మలచే నేప్రకారము గూడ ప్రాణిహింస కాకూడదను ఉద్దేశ్యముతో ధర్మోపదేశము చేయబడినది. ఇందువలన ఏది అహింసాయుక్తమో, అది ధర్మమని ధర్మవేత్తల యొక్క నిశ్చయము.

**శ్లో॥ ప్రభవార్థాయ భూతానాం ధర్మ ప్రవచనం కృతమ్ ।**
**యః స్యాత్ప్రభవ సంయుక్తః స ధర్మ ఇతి నిశ్చయః ॥**

(మ.భా.శాం.ప. 109-10)

**అర్థము :-** ప్రాణుల యొక్క అభ్యుదయ, నిఃశ్రేయస్సు కొఱకే ధర్మ ప్రవచనము చేయబడినది. ఇందువలన ఏది ఈ ఉద్దేశ్యములో యుక్తమై యున్నదో అనగా, దేనిచే అభ్యుదయ, నిఃశ్రేయస్సులు సిద్ధించుచున్నవో, అది ధర్మమని ధర్మవేత్తల యొక్క నిశ్చయము.

సరే, ప్రకృతము ననుసరించెదము. "నహి సత్యాత్పరో ధర్మః" అని చెప్పబడినందున - ఏప్రాణికి గూడ ఏప్రకారముగను (మానసిక, వాచిక, కాయిక రూప) హింస కలుగకుండునట్లు, ప్రాణులయొక్క అభ్యుదయ, నిఃశ్రేయస్సుకు తోడ్పడునట్లు "సత్య"రూప ధర్మమును ప్రతిమానవుడు పరిపాలించవలయును. "తస్మాత్సత్యం న లోపయేత్" (మ.భా.శాం.ప. 162-24) అని వేదవ్యాసభగవానులు చెప్పినట్లు సత్యమును లోపము చేయకూడదు.

సత్యము యొక్క మాహాత్మ్యమును గూర్చి శాస్త్రములలో విస్తారముగా ఈ క్రింది విధముగా వర్ణించనైనది.

**శ్లో॥ సత్యస్య వచనం సాధు నసత్యా ద్విద్యతే పరమ్ ।**
**సత్యేన విధృతం సర్వం సర్వం సత్యే ప్రతిష్ఠితమ్ ॥**

(మ.భా. శాం.ప. 259-10)

**అర్థము :-** సత్యము పలుకుట శుభకర్మము. సత్యము కంటె నధికమైన కార్యము లేదు. సత్యమే సర్వమును ధరించియున్నది. మరియు సత్యమునందే సర్వము ప్రతిష్ఠితమై యున్నది.

**శ్లో॥ సత్యం సత్సు సదా ధర్మః సత్యం ధర్మః సనాతనః ।**
**సత్యమేవ నమస్యేత సత్యం హి పరమా గతిః ॥**

(మ.భా.శాం.ప. 162-4)

**అర్థము :-** సత్యరూప ధర్మము సత్పురుషుల యందు ఎల్లపుడు పాలింపబడుచున్నది. సత్యమే సనాతనధర్మమున్నది. సత్యమునకెల్లపుడు తలవంచవలెను. ఎందుకనగా సత్యమే జీవుని పరమ గతియై యున్నది.

**శ్లో॥ సత్యం ధర్మస్తపోయోగః సత్యం బ్రహ్మ సనాతనమ్ ।**
**సత్యం యజ్ఞః పరః ప్రోక్తః సర్వం సత్యే ప్రతిష్ఠితమ్ ॥**

(మ.భా. శాం.ప. 162-5.)

**అర్థము :-** సత్యమే ధర్మము, తపస్సు, మరియు యోగమున్నది. సత్యమే సనాతన బ్రహ్మమున్నది. సత్యమునకే పరమ యజ్ఞమని చెప్పబడినది. అదే విధముగా సత్యమునందే సర్వము ప్రతిష్ఠితమై యున్నది.

**శ్లో॥ ధారణం సర్వ వేదానాం సర్వ తీర్థావగాహనమ్ ।**
**సత్యం చ బ్రువతో నిత్యం సమం వా స్యాన్నవాసమమ్ ॥**

( మహాభారతము . అనుశాసన పర్వము- 75-28)

**అర్థము :-** సంపూర్ణ వేదములను ధారణ చేసినచో గలుగు పుణ్యము, మరియు సమస్త తీర్థములలో స్నానము చేసినచో గలిగెడు పుణ్యమేది గలదో అది సత్యవాది పురుషునియొక్క పుణ్యముతో సమానమగునో, కాదో సందియమున్నది. అనగా వాటి కంటె సత్యము శ్రేష్ఠమున్నది.

**శ్లో॥ అశ్వమేధ సహస్రం చ సత్యం చ తులయా ధృతమ్ ।**
**అశ్వమేధ సహస్రాద్ధి సత్యమేవ విశిష్యతే ॥**

(మ.భా. అను. ప. 75-29)

**అర్థము :-** ఒకవేళ త్రాసు యొక్క ఒక పళ్ళెములో (ఒకవైపు) వేయి అశ్వమేధ యజ్ఞముల పుణ్యము నుంచి, మరొక వైపు కేవలము సత్యము నుంచి తూచినచో వేయి అశ్వమేధ యజ్ఞముల కంటె సత్యమే శ్రేష్ఠమగును. (అధిక బరువు గలదగును).

**శ్లో॥ సత్యేన సూర్యస్తపతి సత్యేనాగ్నిః ప్రదీప్యతే ।**
**సత్యేన మరుతో వాంతి సర్వం సత్యే ప్రతిష్ఠితమ్ ॥**

(మ.భా. అను. ప. 75-30)

**అర్థము :-** సత్యము యొక్క ప్రభావము చేతనే సూర్యుడు తపించు చున్నాడు. సత్యముచేతనే అగ్ని ప్రజ్వలించుచున్నది. సత్యముచేతనే సర్వత్ర వాయువుయొక్క సంచారమగుచున్నది. ఎందుకనగా సర్వము సత్య మునందే ప్రతిష్ఠితమై (ఆధారపడి) యున్నది.

**శ్లో॥ సత్యేన దేవాః ప్రీయంతే పితరో బ్రాహ్మణస్తథా ।**
**సత్యమాహుః పరోధర్మ స్తస్మాత్సత్యం న లంఘయేత్ ॥**

(మ.భా. అను.ప. 75-31)

**అర్థము :-** దేవతలు, పితరులు మరియు బ్రాహ్మణలు సత్యము చేతనే ప్రసన్నులగుచున్నారు. సత్యమే పరమధర్మమని చెప్పబడినది. అందువలన ఎప్పుడు గూడ సత్యమును ఉల్లంఘించగూడదు.

**శ్లో॥ స్థితా సత్యేన ధరణీ సత్యే నైవ చ వారిధిః ।**
**సత్యేన జలధారాశ్చ సత్యే సర్వం ప్రతిష్ఠితమ్ ॥**

(శివపురాణము - కోటిరుద్ర సంహితా. 40-29)

**అర్థము :-** సత్యము చేతనే పృథ్వి నిలచి యున్నది. సత్యము చేతనే సముద్రము తన మర్యాదలో నున్నది. సత్యము చేతనే సెలయేళ్ళ జలధారలు ప్రవహించుచున్నవి. ఇది అది యననేల - సర్వము సత్యము నందే స్థితమై యున్నది.

**శ్లో॥ సత్యమేకపదం బ్రహ్మ సత్యే ధర్మః ప్రతిష్ఠితః ।**
**సత్యమేవాక్షయా వేదాః సత్యేనావాప్యతే పరమ్ ॥**
(శ్రీవాల్మీకి రామాయణము - అయోధ్యకాండము. 14-7)

**అర్థము :-** "ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ" అని చెప్పబడినట్లు ప్రణవరూప శబ్ద బ్రహ్మము సత్యము. ధర్మము సత్యము నందే ప్రతిష్ఠితమై యున్నది. అవినాశియైన వేదము సత్యము. పరబ్రహ్మ ప్రాప్తి సత్యము చేతనే కలుగును.

వస్తుతః సత్యరూప ప్రణవోపాసన చేత, సత్యరూప వేదాధ్యయనము చేత అంతఃకరణ శుద్ధి గలిగి సత్య స్వరూప పరబ్రహ్మ ప్రాప్తి సుకరమగును.

**శ్లో॥ ఋషయశ్చైవ దేవాశ్చ సత్యమేవ హి మేనిరే ।**
**సత్యవాదీ హి లోకేఽస్మిన్ పరం గచ్ఛతి చాక్షయమ్ ॥**
(వా.రా. అ.కాం. 109-11)

**అర్థము :-** ఋషులు మరియు దేవతలు ఎల్లపుడు సత్యమునే ఆదరించు చున్నారు. సత్యవాదియైన మనుష్యుడే ఈ లోకములో అక్షయమైన పరమధామమును చేరుకోగలుగు చున్నాడు.

**శ్లో॥ సత్యమేవేశ్వరో లోకే సత్యే ధర్మః సదాశ్రితః ।**
**సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి పరం పదమ్ ॥**
(వా.రా.అ.కాం. 109-13.)

అర్థము :- ఈ జగత్తులో సత్యమే ఈశ్వరుడు. సత్యరూప ఆధారముపైనే ధర్మము స్థితి గలిగి యున్నది. సత్యమే సమస్తమునకు మూలము. సత్యమున కంటే నధిక పరమ పదము లేదు.

శ్లో॥ సత్యం స్వర్గస్య సోపానం పారావారస్య నౌ రివ ।
నాస్తి సత్యాత్పరం దానం నాస్తి సత్యాత్పరం తపః ॥
(మ.భా. అను.ప. 145 అధ్యాయము. పృష్ఠము. 5988)

అర్థము :- సముద్రమును దాటుటకు నౌక ఏవిధముగా సాధన మున్నదో, అట్లే సత్యము స్వర్గమును చేరుటకు మెట్ల వలెనుపకరించును. సత్యమునకంటే నధికమైన దానము లేదు. సత్యమునకంటే నధిక తపస్సు లేదు.

శ్లో॥ సత్యేన పూయతే సాక్షీ ధర్మః సత్యేన వర్ధతే ।
తస్మాత్సత్యం హి వక్తవ్యం సర్వవర్ణేషు సాక్షిభిః ॥ (మ.స్మృ. 8-83)

అర్థము :- సాక్షి (గవాయి, వ్యావహారిక సాక్షి) సత్యముచేతనే పాపము నుండి విడివడుతాడు (పునీతుడౌతాడు). సత్యముచేతనే అతని యొక్క ధర్మము (కీర్తి) వృద్ధింగతమగును. ఈ కారణముచేతనే సర్వ వర్ణముల వారు సత్యమునే చెప్పవలెను.

నత్యము పదమూడు విధములుగా ఉంటుందని శ్రీమన్మహాభారతము ఈ క్రిందివిధముగా చెప్పుచున్నది.

శ్లో॥ సత్యం త్రయోదశ విధం సర్వలోకేషు భారత! ।

శ్లో॥ సత్యం చ సమతా చైవ దమశ్చైవ న సంశయః ।
అమాత్సర్యం క్షమా చైవ హ్రీస్తితిక్షానసూయతా ॥

శ్లో॥ త్యాగో ధ్యానమథార్యత్వం ధృతిశ్చ సతతం స్థిరా ।
అహింసా చైవ రాజేంద్ర! సత్యాకారాస్త్రయోదశ ॥
(మహాభారతము - శాంతిపర్వము -
(ఆపద్ధర్మ పర్వతము) 162-7 , 8,9)

**అర్థము :-** ఓ భారత (ధర్మరాజా)! సంపూర్ణ లోకములలో సత్యము యొక్క భేదములు పదమూడు గలవని స్వీకరింపబడుచున్నవి - అవియేవి యనగా!

1. సత్యము - (నిత్యైకరసము అవినాశి మరియు నవికారి లక్షణమైనది.)

2. సమతా - (తన యొక్క ప్రియమైన మిత్రుల యందు, అప్రియమైన శత్రువుల యందు “సమానభావము”)

3. దమము - (బాహ్యార్థములనుండి మనస్సును మరియు నింద్రియములను నిగ్రహించుట)

4. మత్సరతా అభావము - (ఇతరులు పుణ్యకార్యములు చేయునపుడు (దాన, ధర్మములు చేయు సమయములో) మనస్సును సంయమనము చేయుట అనగా ఇతరులపై “ఈర్ష్య” పెట్టుకొనకుండుట)

5. క్షమా - (సహించదగిన, సహించుటకయోగ్యమైన వ్యవహారములో మరియు ప్రియమైన, అప్రియమైన వచనములను సమానభావముచే సహించువాడే సర్వ సమ్మత క్షమాశీలుడైన శ్రేష్ఠపురుషుడు).

6. లజ్జా - (ఏ బుద్ధిమంతుడైన పురుషుడు చక్కగా ఇతరులకు హితము చేయుచుండునో, మనస్సులో ఎప్పుడు ఖేదము (దుఃఖమును) పొందడో, ఎవరి మనస్సు, వాణి ఎల్లప్పుడు శాంతమై యుండునో మరియు

ఎవడు మనో వాక్కాయములచే నిషిద్ధ కృత్యములు చేయుటకు సంకోచపడునో వాడు లజ్జా శీలుడు అనబడును)

7. తితీక్షా – (ధర్మార్థముల కొఱకు ఏ మనుష్యుడు కష్టము సహించునో, అతని ఆ సహనశీలతను "తితీక్షా" అందురు. లోకములో ఆదర్శపురుషుడుగా రాణించాలంటే అవశ్యముగా "తితీక్ష"ను పాలించవలయును)

8. అనసూయ – ("గుణేషు దోషావిష్కరణమ్" అసూయా ఇతి" సిద్ధాంత కౌముదీ" 576 (1-4-37) తద్రహితత్వమ్ – అనసూయా ।

గుణవంతులయందు దోషారోపణము అసూయ అంటారు. అది లేకుండా ఉండుటయే అనసూయ అనబడును.)

9. త్యాగము – (రాగద్వేష రహితులై శబ్దాది విషయాసక్తిని వదలుకోవడమే వాస్తవముగా "త్యాగ"మనబడును.)

10. ధ్యానము – ("తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్" (పాతంజల యోగ సూత్రము. 3-2) ధ్యేయవస్తువు (పరమాత్మ) నవలంబించియుండు చిత్తవృత్తికి తైలధారవలె నవిచ్ఛిన్న ప్రవాహము.

11. ఆర్యతా –

**శ్లో॥ కర్తవ్యమాచరన్కామమకర్తవ్యమనాచరన్ ।**
**తిష్ఠతి ప్రాకృతాచారో యః స "ఆర్య" ఇతి స్మృతః ॥**

**శ్లో॥ యథాచారం యథా శాస్త్రం యథా చిత్తం యథా స్థితమ్ ।**
**వ్యవహారముపాదత్తే యః స "ఆర్య" ఇతి స్మృతః ॥**

(శ్రీయోగవాసిష్ఠ మహారామాయణము – నిర్వాణప్రకరణము –పూర్వార్ధము. 126-64, 126-55)

**అర్థము :-** కర్తవ్యములగు నిత్యనైమిత్తిక కర్మలన్నింటిని యాచరించుచు, అకర్తవ్యములగు నిషిద్ధ కర్మలనాచరించక, ప్రస్తుతాచారమందు స్థితిగలిగి యుండువాడు "ఆర్య" దనబడును.

తన పూర్వుల యాచారములకనుకూలములును, చిత్తమునకు సదా తృప్తిగలుగ జేయునవియునగు వ్యవహారములను గ్రహించువాడు "ఆర్య"దని చెప్పబడును.

**శ్లో॥ ఆర్యతా నామ భూతానాం యః కరోతి ప్రయత్నతః ।**
**శుభం కర్మ నిరాకారో వీతరాగస్తథైవ చ ॥**

(మహాభారతము. శాంతిపర్వము - ఆపద్ధర్మ పర్వము. 162-18)

**అర్థము :-** ఏ మనుష్యుడు తనను ప్రకటము చేసుకొనకుండా (నిరభిమానముగా) ప్రయత్న పూర్వకముగా ప్రాణుల మేలు కోసము పనీ చేయునో, అతని యొక్క ఆ శ్రేష్ఠభావము మరియు ఆచరణకు "ఆర్యత" అందురు. ఇది ఆసక్తి త్యాగముచే ప్రాప్తించును.

12. ధృతిః - (సుఖదుఃఖములు ప్రాప్తమైనప్పుడు మనస్సులో వికారము గలుగకుండుట "ధృతి" యనంబడును. ఏ బుద్ధిమంతుడు తన యొక్క ఔన్నత్యమును గోరుతాడో, అతడు "ధృతి"ని సేవించు చుండ వలయును. దేహేంద్రియములు నీరసించినప్పటికి వాటిని కార్మోన్ముఖము చేయుటకు చేయు ప్రయత్న విశేషమునకు "ధృతి" అంటారని శ్రీమధుసూదన సరస్వతి స్వాములవారు చెప్పారు. (గీత. 10-34-16-3)

13. అహింసా - మనోవాక్కాయములచే చేయు ప్రాణిపీడనము హింసా యనబడును. "అద్రోహో సర్వభూతేషు కర్మణా మనసా గిరా" (మ.భా.శాం.ప. 162-21) మనోవాక్కాయకర్మలచే ఏప్రాణికి గూడ

ద్రోహము చేయకుండుటను గూడ అహింసా యందురు. కావుననో రాజేంద్ర! (ధర్మరాజా!) పైన దెలిపిన పదమూడు భేదములు "సత్యము" యొక్క స్వరూపమే యని యెఱుంగుము. ఇందులో సంశయము లేదు.

శ్లో॥ ఏతే త్రయోదశాకారాః పృథక్ సత్యైకలక్షణాః ।
భజంతే సత్యమేవేహ బృంహయంతే చ భారత! ॥
(మ.భా.శాం.ప. 162-22)

**అర్థము :-** ఓ భారత! పృథక్పృథక్‌గా చెప్పబడిన ఈ పదమూడు విధముల ధర్మములు ఒకే ఒక సత్యమునే సూచించిచున్నవి. ఇవి యన్నియు సత్యమునే యాశ్రయించుకొని యుండి, సత్యము యొక్క వృద్ధిని మరియు సృష్టిని చేయుచున్నవి గాన సత్యము యొక్క స్వరూప భేదములేయని తెలియదగినవియునై యున్నవి. "అనర్థానుబంధియథాభూతార్థవచనం సత్యమి"తి వ్యాఖ్యాతం భవతి.పరిణామములోననర్థమునకు దారి దీయని యథార్థభాషణమునకు (కథనమునకు) "సత్య" మందురు.

ఇంతవరకు వ్యావహారిక సత్యమును గూర్చి విస్తృతముగా విచారించనైనది. ఇప్పుడు ప్రాసంగికముగా వేదాంతరీత్యా పారమార్థిక సత్యము విచారించబడుచున్నది.

"త్రైకాలికాబాధ్యత్వం సత్యత్వమ్" – "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తై.ఉ. 2-1) భూత భవిష్యద్వర్తమాన లేక జాగ్రత్స్వప్న సుషుప్త్యాదులలో యేదియు నవ్యభిచరితమై (సదా విద్యమానమై) యుండునోనది "సత్యమ"నబడును.

యద్రూపేణ యన్నిశ్చితం తద్రూపం నవ్యభిచరతి తత్సత్యం, యద్రూపేణ నిశ్చితం యత్తద్రూపం వ్యభిచరదనృత మిత్యుచ్యతే । (తై.ఉ .2-1-1-భాష్యే)

**శ్లో॥ అకాశాది జగత్సర్వ మనృతం మాయికత్వతః ।**
**నానృతం బ్రహ్మ తేనైత త్సత్యమిత్యభిధీయతే ॥**
( అనుభూతి ప్రకాశము. 2-8)

అర్థము :- ఆకాశము మొదలగు జగత్తులోని వస్తుజాతమంతయును మాయిక మున్నందున నసత్యములు (అన్నృతములు). బ్రహ్మ యన్నృతము కానందున సత్యమని చెప్పబడుచున్నది.

"సత్యశబ్దస్య బ్రహ్మణ్య సకృత్ప్రయుక్తత్వాత్" (బ్ర.సూ. భాష్యే 3-3-31) సత్యశబ్దమునకర్థము "బ్రహ్మ" అని అనేక పర్యాయములు ప్రయోగించబడింది కదా!.

శ్లో॥ సర్వం సత్యం పరం బ్రహ్మ న చాన్యదితి యా మతిః ।
తచ్చ సత్యం వరం ప్రోక్తం వేదాంత జ్ఞానపారగైః ॥
(జాబాల దర్శనోపనిషత్- 1-10)

అర్థము :- సర్వము సత్యరూప పరమాత్మయే యున్నది. తద్వ్యతిరిక్తమన్యవస్తువెద్దియును లేదు - అను నీ దృఢ నిశ్చయమేది గలదో - దానినే వేదాంతనిష్ణాతులైన శ్రేష్ఠపురుషులు సర్వశ్రేష్ఠ" సత్యమని" చెప్పిరి.

"సదానిరస్తకుహకం సత్యం పరం ధీమహి"
(శ్రీమద్భాగవతము 1-1-1)

ఎల్లపుడు మాయా తత్కార్యముచే పూర్ణతః విముక్తమై యున్న పరమ సత్యరూప పరమాత్మను మేము ధ్యానించు చున్నాము - అని శ్రీమద్భాగవత మంగళ శ్లోకపాదార్థము.

**శ్లో॥ సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం సత్యస్య యోనిం నిహితం చసత్యే।**
**సత్యస్య సత్యమృతసత్య నేత్రం సత్యాత్మకం త్వాం శరణం ప్రసన్నాః॥**
(శ్రీమద్భాగవతము 10-2-26)

**అర్థము :-** ప్రభో! నీవు సత్యసంకల్పుడవు. నిన్ను పొందుటకు సత్యమే శ్రేష్ఠమైన సాధనమున్నది. సృష్టి, స్థితి, లయములను నసత్యావస్థలలో గూడ నీవు సత్యరూపుడవై యున్నావు. వ్యావహారిక సత్యరూప ఆకాశాది పంచభూతములకు నీవే కారణమై యున్నావు. మరియు వాటిలో నంతర్యామిరూపముచే విరాజమానమై యున్నావు. నీవు ఈ దృశ్యమాన జగత్తు యొక్క పరమార్థ స్వరూపమై యున్నావు. నీవే మధురమైన వాణికి మరియు సమదర్శనమునకు నేత్రము (ప్రవర్తకుడ)వై యున్నావు. హే భగవన్! నీవే సత్య స్వరూపుడవు. మేము నీ శరణు జొచ్చియున్నాము.

"తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" (తై.ఉ 2-6) పరమేశ్వరుడే ఈ దేహాదిక జగత్తును సృష్టించి (రచించి) దానియందు తానే జీవరూపముచే ప్రవేశించాడు.

క్షేత్రజ్ఞం చాపి మా విద్ధి సర్వ క్షేత్రేషు భారత! । (గీత 13-3) హే అర్జున! ఈ దృశ్యమాన క్షేత్రముల(శరీరముల)లో క్షేత్రజ్ఞుడను అనగా జీవాత్మను నేనే (పరమాత్మను) అని తెలియుము.

"ఆత్మా హి బ్రహ్మ" (తై.ఉ. ఉపోద్ఘాత భాష్యము.) ఆత్మయే బ్రహ్మము పైనుదహరింపబడిన శ్రుతి, స్మృతి మరియు బాష్యోక్తుల ప్రకారము జీవాత్మ పరమాత్మచే నభిన్నుడని తెలియబడుచున్నందున "ప్రత్యగభిన్న పరమాత్మయే" పారమార్థిక" సత్య"మని యెఱుగవలయును. తద్భిన్న మసత్యము. 3.

ఏమనుష్యుడు వాడి పొట్టను పోషించు కొనుటకు మాత్రమే వండుకొని ఒంటరిగా భుజించునో, పేద (ఆకలితో నలమటించు) ప్రాణులయందు దయజూపడో, ఇంటికేతెంచిన యతిథికి యన్నమిడక, కోపగించి, బెదిరించి, భగ్నాశుని చేసి తన గృహద్వారము నుండి

వెడలగొట్టునో వాడు యమునికి కానుకగాగలడు అనగా యమదండనకు గురిగాగలడని శ్రీతుకారాం మహారాజుగారు నాలుగవ చరణములో తెలియ జేయు చున్నాడు.

ఈ విషయము శాస్త్ర సమ్మతమున్నది. గనుక యథామతి శాస్త్రమును విచారించెదము.

**శ్లో॥ అఘం స కేవలం భుంక్తే యే పచన్త్యాత్మకారణాత్ ।**
**యజ్ఞశిష్టాశనం హ్యేతత్సతామన్నం విధీయతే ॥** (మ.స్మృ. 3-118)

**అర్థము :-** ఎవరు దేవతలకు, అతిథులకు మరియు నితర ప్రాణులకు నన్నము సమర్పించకుండా కేవలము స్వార్థమునకై ఒంటరిగా భుజించునో నతడు భోజనరూపములో పాపమునే తినుచున్నాడు. ఎందుకనగా గృహస్థులకు విధానము చేయబడిన పంచయజ్ఞములను చేయగా యజ్ఞశేషాన్నమే సజ్జనుల యొక్క అన్నమని చెప్పబడినది.

మంత్రవర్ణము :-

**మోఘమన్నం విన్దతే అప్రచేతాః సత్యం బ్రవీమి వధ ఇత్స తస్య ।**
**నార్యమణం పుష్యతి నో సఖాయం కేవలాఘో భవతి కేవలాదీ ॥**
(ఋగ్వేదము. 10-117-6)

**అర్థము :-** ఏ యవిద్వాన్ పురుషుడు యే పాపమయ అన్నమును గ్రహించు చున్నాడో, వాడు ఆత్మఘాతకుడే యని యర్థము. ఎవడు వైశ్వదేవం చేత సూర్యుని తృప్తి పరచడో, రాత్రి యందున ఉపకారకుడైన యగ్నిని తృప్తి పరచడో కేవలము దేహపోషణార్థము భక్షించుచున్నాడో, వాడు ఆ రూపంలో పాపమునే భక్షించుచున్నాడు. పాపియే యగుచున్నాడు అని సత్యమును చెప్పుచున్నాను.

**శ్లో॥ తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః ॥** (గీత. 3-12)

**అర్థము :-** దేవతలనుద్దేశించి చేయబడిన యజ్ఞములచే దేవతలు తృప్తి నొంది యజ్ఞకర్తలైన యజమానులకు ఇష్టమైన భోగముల నిచ్చుదురు. ఏ పురుషుడైతే వారి (దేవతల)చేత ప్రదత్తమైన భోగములను వారికి నివేదించకుండా భుజిస్తాడో (అనుభవిస్తాడో), అతడు చోరుడు(దొంగ) అనబడుతాడు.

**శ్లో॥ భుంజతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్ ॥**
(గీత. 3-13)

**అర్థము :-** ఎవడు వైశ్వదేవాదులకు సమర్పించకుండా వాడి దేహపోషణకై మాత్రమే వండుకుని తింటాడో ఆపాపి పాపమునే ఉపభోగిస్తున్నాడని తెలియాలి.

**శ్లో॥ విప్రాతిథ్యే కృతే రాజన్! భక్త్యా శుశ్రూషితేఽపి చ ।**
**దేవా శుశ్రూషితాః సర్వే త్రయస్త్రింశదరిందమ ॥**

(మహాభారతము - అశ్వమేధిక పర్వము - వైష్ణవధర్మ పర్వము - పృష్ఠము. 6329) గోరక్ పూర్ ప్రెస్ - హింది)

**అర్థము :-** హే శత్రుదమన ధర్మరాజా! బ్రాహ్మణునికి అతిథి సత్కారము మరియు శ్రద్ధాభక్తి పూర్వక సేవ చేయుట చేత ముప్పది మూడు కోట్ల (ప్రకారముల) దేవతల సేవ ఘటిల్లును.

**శ్లో॥ అభ్యాగతో జ్ఞాతపూర్వో హ్యజ్ఞాతోఽతిథిరుచ్యతే ।**
**తయోః పూజాం ద్విజః కుర్యాదితి పౌరాణికీ శ్రుతిః ॥**

(మ.భా. ఆ.ప. వై.ప. పృష్ఠము. 6329)

అర్థము :- పూర్వపరిచిత ఆహ్వానింపబడిన పురుషులు ఇంటికేతెంచిన వారిని అభ్యాగతులంటారు. అపరిచిత పురుషుడు సకాలమునకు విచ్చేసినచో అతనిని అతిథి యని యంటారు. వీరిరువురికి గృహస్థుడైనవాడు యథోచిత పూజలు చేయవలెనని - పంచమవేదమైన పౌరాణిక శ్రుతి చెప్పుచున్నది.

శ్లో॥ ఏకరాత్రం తు నివసన్నతిథిర్బ్రాహ్మణః స్మృతః ।
అనిత్యం హి స్థితో యస్మాత్తస్మాదతిథిరుచ్యతే ॥
(మ.స్మృ. 3-102)

అర్థము :- గృహస్థుని యింటికి ఒక రాత్రి నిలుచుటకు మాత్రము వచ్చు (యాత్రికుడైన) బ్రాహ్మణుని అతిథి యందురు. (న విద్యతేతిథిర్యస్య సః అతిథిః) అతడు వచ్చుటకు తిథి (సమయము) నిశ్చయము లేదు గనుక "అతిథి" యనబడుతాడు.

శ్లో॥ యస్య న జ్ఞాయతే నామ న చ గోత్రం న చ స్థితిః ।
అకస్మాద్గృహమాయాతి సోఽతిథిః ప్రోచ్యతే బుధైః ॥
(హలాయుధము)

అర్థము :- ఎవరియొక్క పేరు, గోత్రము, నివాసము మొదలగు వివరములు దెలియబడవో (అపరచితమో), అటువంటి పురుషుడు అకస్మాత్తుగా (ఏకారణము లేకుండా) సమయమునకు యింటికేతెంచినచో అతడు "అతిథి" అని బుధుల (పెద్దలు, జ్ఞానులు) చేత చెప్పబడుచున్నాడు.

శ్లో॥ అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే ।
స దత్వా దుష్కృతం తస్మై పుణ్యమాదాయ గచ్ఛతి ॥
(విష్ణు పురాణము. 3-9-15), (మహాభారతము-శాంతిపర్వము. 191-12)

**అర్థము :-** ఎవరి యింటి నుండి అతిథి భగ్నాశుడై (నిరాశచేత) తిరిగి వెళ్ళిపోవునో, అతడు అతనియొక్క సమస్తపాపములను ఆయింటి యజమానికిచ్చి, వాని యొక్క (యజమానియొక్క) సమస్తపుణ్యమును స్వయముగా తీసికెళ్ళును.

**శ్లో॥ పాపం ప్రతిగృహీతారం ప్రదాతురుపగచ్ఛతి ।**
**ప్రతిగ్రహీతుర్యత్పుణ్యం ప్రదాతారముపైతి తత్ ॥**

**తస్మాద్దానం సదా కార్యం పరత్ర హితమిచ్ఛతా ॥**

(మహాభారతము-అశ్వమేధిక పర్వము. వైష్ణవధర్మ పర్వము-పృష్ఠము. 6316)

**అర్థము :-** దాతయొక్క పాపము దానముతో పాటు దానము తీసికొను వాని వద్దకు వెళ్ళిపోవును. మరియు నతని పుణ్యము దాతను ప్రాప్తమగును. అందువలన పరలోకములో తన హితమును గోరువాడు ఎల్లపుడు దానము చేయుచుండవలెను.

**శ్లో॥ దివాతిథౌ తు విముఖే గతే యత్పాతకం నృప! ।**
**తదేవాష్టగుణం పుంసస్సూర్యోఢే విముఖే గతే ॥**

( వి.పు. 3-11-108)

**అర్థము :-** ఓ రాజా! దినము నందు అతిథి నిరాశుడై వెళ్ళిపోయిన నెంత పాపము గలుగునో, దానికి యెనిమిది వంతులు పాపము సూర్యుడు అస్తమించిన పిదప గృహస్థుని యింటినుండి అతిథి తిరిగి నిరాశచేత వెళ్ళిపోయినచో గలుగును.

**శ్లో॥ పిధాయతు గృహద్వారం భుంక్తే యోఽన్న ప్రహృష్టవాన్ ।**
**స్వర్గద్వారపిధానం వై కృతం తేన యుధిష్ఠిర! ॥**

(మహా భారతము - అశ్వమేధిక పర్వము - వైష్ణవ ధర్మ పర్వము - పృష్ఠము. 6355)

**అర్థము :-** ఓ ధర్మరాజా! ఎవడు భిక్షువు యొక్క లేదా అతిథి యొక్క భయముచే తన యింటి ద్వారమును మూసి వేసి ప్రసన్నపూర్వకముగా భుజిస్తాడో, వాడు స్వయముగా వాడి స్వర్గద్వారమును మూసివేసికున్నాడని తెలియాలి.

**శ్లో॥ నిర్వాసయతి యో విప్రం దేశకాలాగతం గృహాత్ ।**
**పతితస్తత్క్షణాదేవ జాయతే నాత్ర సంశయః ॥**

(మ.భా. ఆ.ప. వై.ప పృష్ఠము. 6329)

**అర్థము :-** ఎవడు దేశకాలానుసారము ఇంటికి వచ్చిన బ్రాహ్మణుని అక్కడ నుండి వెడల గొట్టునో, నతడు తత్క్షణమే పతితుడగును. ఇందులో నిసుమంతయు సందేహము లేదు.

**శ్లో॥ అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే ।**
**పితరస్తస్య నాశ్నంతి దశవర్షాణి పంచ చ ॥**

(మ.భా. ఆ.ప. వై.ప. పృష్ఠము. 6329)

**అర్థము :-** ఎవడి యింటి నుండి అతిథి నిరాశ చేత వెళ్ళి పోవలసి వచ్చునో, వాడి పితరులు పదునైదు సంవత్సరములు భోజనము చేయరు.

**శ్లో॥ అభ్యాగతం శ్రాంతమనువ్రజంతి**
**దేవాశ్చ సర్వే పితరోఽగ్నయశ్చ ।**
**తస్మిన్ ద్విజే పూజితే పూజితాః**
**స్వర్గతే నిరాశాః పితరో వ్రజంతి ॥**

(మ.భా. ఆ.ప. వై.ప. పృష్ఠము 6329)

**అర్థము :-** అలసిపోయిన అభ్యాగతుడు ఏగృహస్థుని యింటికి వచ్చునో, అతని వెంట సమస్త దేవతలు, పితరులు మరియు అగ్నియును

విచ్చేయుదురు. ఒకవేళ ఆ యింటి యజమానిచేత అభ్యాగతుడు పూజింపబడినచో, అతనితోపాటు విచ్చేసిన దేవతాదులందరూ పూజింపబడిన వారగుదురు. లేక అభ్యాగతుడు నిరాశచేత వెళ్ళి పోవలసి వచ్చినచో, అతనితోపాటు దేవతాదులందరును హతాశులై తిరిగి వెళ్ళి పోయెదరు.

శ్లో॥ స్వాధ్యాయ గోత్రా చరణమపృష్ట్వా చ తథా కులమ్ ।
హిరణ్యగర్భ బుద్ధ్వా తం మన్యేతాభ్యాగతం గృహీ ॥
(విష్ణుపురాణము. 3-11-63)

అర్థము :- గృహస్థపురుషుడు తన యింటికి వచ్చిన అతిథి యొక్క అధ్యయనము, గోత్రము, ఆచరణ మరియు కులము మొదలగు విషయముల యందు ఏమియును అడగకుండానే, అతనిని హిరణ్య గర్భుడుగా భావించి పూజించాలి.

శ్లో॥ అతిథిం నావమన్యేత నానృతాం గిరమీరయేత్ ।
న పృచ్ఛేద్గోత్రచరణం నాధీతం వా కదాచన ॥
(మ.భా.ఆ.ప. వై.ప. పృష్ఠము. 6355)

అర్థము :- గృహస్థపురుషుడు ఎప్పుడు గూడ అతిథిని అనాదరించ గూడదు. అతనితో అబద్ధమాడగూడదు. మరియు అతని యొక్క గోత్రము, శాఖా, అధ్యయన విషయంలో ఎప్పుడు గూడ ప్రశ్నించగూడదు.

శ్లో॥ క్రోధముత్పతితం హిత్వా సుశీలో వీతమత్సరః ।
అర్చయేదతిథిం ప్రీతః పరత్ర హితభూతయే ॥ (పృష్ఠము 6355)

అర్థము :- పరలోకమందు తన కళ్యాణమును గోరు మనుష్యుడు, తనయొక్క ఉద్భూతక్రోధమును గూడ నిరోధించి, మాత్సర్యమును త్యజించి, సౌశీల్యత చేతను మరియు ప్రసన్నతాపూర్వకముగా అతిథి పూజ చేయవలెను.

**శ్లో॥ చాండాలో వా శ్వపాకో వా కాలేయః కశ్చిదాగతః ।**

**అన్నేన పూజనీయః స్యాత్ పరత్ర హితమిచ్ఛతా ॥** (పృ. 6355)

**అర్థము :-** పరలోకమునందు తనయొక్క కళ్యాణమును గోరు గృహస్థ పురుషుడు, భోజన సమయమునకు యింటికేతెంచిన చాండాలుడుగాని, శ్వపచుడు (కుక్క మాంసమును వండుకొని తినువాడు) గాని అతనికి యన్నమును తృప్తిగా పెట్టి, సత్కరించవలయును.

ఎల్లప్పుడు నిరంతరము పరమాత్మ ధ్యాన తత్పరుడగు బ్రహ్మ నిష్ఠునకు భోజనము నిడిన గలుగు మహత్పుణ్య ఫలమును గూర్చి శాస్త్రము యీ క్రింది విధముగా నుడువుచున్నది.

**శ్లో॥ యత్ఫలం లభతే మర్త్యః కోటిబ్రాహ్మణభోజనైః ।**

**తత్ఫలం సమవాప్నోతి జ్ఞానినం యస్తు భోజయేత్ ॥**

(శ్రీ శివగీత 11-43)

అర్థము :- కోటి బ్రాహ్మణులకు భోజనం పెట్టినందున మనుజుడు యే పుణ్యఫలమును బొందునో, ఆ ఫలం ఒక్క బ్రహ్మజ్ఞానికి యాహారము పెట్టినందున పొందగలడు.

**శ్లో॥ కుక్షౌ తిష్ఠతి యస్యాన్నం యోగాభ్యాసేన జీర్యతే ।**

**కులాన్ తారయతే తేషాం దశపూర్వాన్దశాపరాన్ ॥**

**అర్థము :-** పరమాత్మ ధ్యానము చేయువారి యుదరమునందు పడిన యన్నము, ధ్యాననిష్ఠచే జీర్ణమైనచో నా ఫలము అన్నదాత యొక్క పదితరముల మృతినొందిన వారిని, రాబోవు పదితరముల వారిని గూడ ధన్యుల గావించును.

**శ్లో॥ పరమాద్వైత విజ్ఞాన నిష్ఠస్యైవ మహాత్మనః ।**
**శుశ్రూషా క్రియతే యేన తత్పాదౌ మమ మస్తకే ॥**
(సూతసంహిత - బ్రహ్మగీత. 4-143, 144 )

**అర్థము :-** ఎవడు పరమాద్వైత పరబ్రహ్మ విజ్ఞాన ధ్యాన నిష్ఠ యందుండు మహాత్మునకన్న వస్త్రాదులిచ్చి శుశ్రూష జేయునో ఆ పుణ్యాత్ముని యొక్క రెండు పాదకమలములున్ను నా శిరముపై ధరించుచున్నానని శ్రీ బ్రహ్మదేవుడుపదేశించెను.

సమయమునకు యింటికేతెంచిన యతిథిని పూర్వాపరము - కులగోత్రములను, విద్యార్హతలను విచారించకుండ భోజనాదులిచ్చి తృప్తి పఱచుటయే ఉత్తమగృహస్థుని లక్షణమని శాస్త్రము చెప్పుచున్నది.

**శ్లో॥ విప్రమధ్య పరిశ్రాంతం, బాలం వృద్ధమథాపి వా ।**
**అర్చయేద్గురువత్ప్రీతో గృహస్థో గృహమాగతమ్ ॥**
(పృష్ఠము. 6355)

అర్థము :- బ్రాహ్మణ బాలకుడుగాని, వృద్ధుడుగాని లేదా త్రోవలో యలసిపోయిన బాటసారియైనను గాని సమయమునకు యింటికి వచ్చినచో, గృహస్థ పురుషుడు ప్రసన్నతా పూర్వకముగా గురువునకు వలె అతనిని సత్కరించవలెను.

**శ్లో॥ సాంగోపాంగాంస్తు యో వేదాన్ పఠతీహ దినే దినే ।**
**నచాతిథిం పూజయతి వృథా భవతి స ద్విజః ॥** (పృష్ఠము. 6329)

అర్థము :- ఎవరు ప్రతి దినము సాంగోపాంగముగ వేదాధ్యయనము చేయునో, కాని, అతిథి పూజ చేయడో, అటువంటి ద్విజుని యొక్క జీవనము వ్యర్థము.

**శ్లో॥ దేశం కాలం చ పాత్రం చ స్వశక్తించ నిరీక్ష్య చ ।**

**అల్పం సమం మహద్వాపి కుర్యా దతిథిమాప్తవాన్ ॥** (పృ. 6330)

**అర్థము :-** శ్రద్ధాళువైన గృహస్థుడు దేశము, కాలము, మరియు పాత్రతను గుర్తించి స్వశక్త్యనుసారము, అల్పముగాగాని, మధ్యమముగాగాని లేక ఘనంగా గాని అతిథిసత్కారము చేయవలెను.

**శ్లో॥ సుముఖః సుప్రసన్నాత్మా ధీమానతిథిమాగతమ్ ।**

**స్వాగతేనాసనేనాద్భి రన్నాద్యేన చ పూజయేత్ ॥** (పృ. 5330)

**అర్థము :-** అతిథి యెప్పుడు గృహస్థుని ద్వారమున కేతెంచునో, అప్పుడు బుద్ధిమంతుడైన పురుషుడు ప్రసన్నచిత్తుడై, హాస్యవదనుడై అతిథికి స్వాగతము పలుకవలెను. కాళ్ళు కడుగుకొనుటకు నీళ్ళు ఇచ్చి, కూర్చొనుటకు యథోచితమైన ఆసనమును ఇచ్చి, అన్నపానాదుల ద్వారా అతనిని పూజించవలెను.

**శ్లో॥ హితః ప్రియో వా ద్వేష్యో వా మూర్ఖః పండిత ఏవ వా ।**

**ప్రాప్తో యో వైశ్వదేవాంతే సోఽతిథిః స్వర్గ సంక్రమః ॥**

(పృ. 6330)

**అర్థము :-** (గృహస్థులైన ద్విజులు భోజనము చేయుటకు పూర్వము వైశ్వదేవయజ్ఞము చేయుదురు.) ఈ యజ్ఞాంతమునకు తన హితమును కోరువాడుగాని, ప్రేమపాత్రుడుగాని, ద్వేషించు శత్రువుగాని, మూర్ఖుడు గాని లేక పండితుడుగాని ఎవరైనను సరే విచ్చేసినచో – అతడు ఈ గృహస్థున్ని స్వర్గమువరకు తీసికెళ్ళు నటువంటి అతిథి యగును.

శ్లో॥ అన్నదః ప్రాణదో లోకే ప్రాణదః సర్వదో భవేత్ ।

**తస్మాదన్నం విశేషేణ దాతవ్యం భూతిమిచ్ఛతా ॥** (పృ. 6355)

**అర్థము** :- ప్రపంచములో అన్నదానము చేయువాడు ప్రాణ దానము చేయువాడగును. మరియు ఎవరు ప్రాణదాతయగునో నతడు సర్వ దాత యగును. అందువలన తన కళ్యాణమును గోరువాడు విశేషరూపముచే అన్నదానము చేయవలయును.

శ్లో॥ అన్నం హ్యమృత మిత్యాహు రన్నం ప్రజననం స్మృతమ్ ।
అన్న ప్రణాశే సీదన్తి శరీరే పంచధాతవః ॥ (పృష్ఠము. 6355)

**అర్థము** :- అన్నము అమృత మనబడుచున్నది. అన్నము ప్రజలకు జన్మనిచ్చునదై యున్నది. అన్ననాశనమయినచో శరీరములోని పంచధాతువులు నశించును.

శ్లో॥ పితౄన్ దేవాన్ ఋషీన్ విప్రానతిథీంశ్చ నిరాశ్రయాన్ ।
యో నరః ప్రీణయత్యన్నైస్తస్య పుణ్యఫలం మహత్ ॥ (పృ. 6355)

**అర్థము** :- ఎవరు దేవతలకు, పితరులకు, ఋషులకు, బ్రాహ్మణులకు, అతిథులకు మరియు నిరాశ్రయులగు మనుష్యులకు అన్నమునిడి తృప్తి పరచునో, అతనికి చాలా గొప్ప పుణ్యము లభించును.

శ్లో॥ అన్నదః సర్వకామైస్తు సుతృప్తః సుష్ఠ్వలంకృతః ।
పూర్ణచంద్రప్రకాశేన విమానేన విరాజతా ॥
సేవ్యమానో వరస్త్రీభిర్దేవలోకం స గచ్ఛతి ॥ (పృష్ఠము. 6330)

**అర్థము** : - అన్నప్రదానము చేయు మనుష్యుడు సమస్త భోగములచే తృప్తుడై చక్కని ఆభూషణములచే నలంకృతుడై, పూర్ణచంద్ర ప్రకాశముచే ప్రకాశితమైన విమానము ద్వారా దేవలోకమునకేగును. అక్కడ దివ్యమైన స్త్రీలచే నతడు సేవింపబడును.

కావున అతిథి సత్కారమును గృహస్థులైన వారు తప్పకుండా శ్రద్ధాభక్తి పురః సరులై తమ కర్తవ్యముగా నెంచి యనుష్ఠించుచుండ వలయును.

ఎవడు తోటి ప్రాణుల పట్ల దయను జూపడో, సత్పురుషులను యథాశక్తిగా సేవించడో మరియు జీవితములో ఎప్పుడును తీర్థక్షేత్ర సంచారముం జేయడో - వాడు యమునికి కానుకగా సమర్పించబడిన వాడుగా నెఱుఁగ- వలయునని వ్యతిరేకముఖముగా బోధిస్తూ, దయా యనునది మానవుల యొక్క ముఖ్యధర్మముగా శ్రీతుకారాం మహారాజుగారు గుర్తు జేయుచున్నారు.

దుఃఖితేష్వనుకంపా దయా. దుఃఖితులైన ప్రాణుల పట్ల అనుకంపా అనగా రక్షాభిముఖీ బుద్ధి లేదా అనుగ్రహమును జూపుటయేది గలదో దానిని "దయ" యందురు

శ్లో॥ పరే వా బంధు వర్గే వా మిత్రే ద్వేష్యే రిపౌ తథా ।
ఆపన్నే రక్షితవ్యం హి దయైషా పరికీర్తితా ॥ (అత్రిస్మృతి-41)

అర్థము :- ఇతరుల యందుగాని, బంధువర్గమునందుగాని, మిత్రుల యందుగాని, తనను ద్వేషించువారి యందుగాని లేదా శత్రువుల యందుగాని - ఎవరినైనను ఆపత్తులో చిక్కు కొనుటంగాంచి వారిని రక్షించుట యేది గలదో దానినే "దయ" యందురు.

శ్లో॥ ఆత్మవత్సర్వభూతేషు కాయేన మనసా గిరా ।
అనుకంపా దయా సైషా ప్రోక్తా వేదాన్తవేదిభిః ॥
(సూతసంహితా-జ్ఞానయోగ ఖండము. 13-11 , 12 )

**అర్థము** :- ఏవిధముగా తనను రక్షించుకొనుటకు ఎల్లప్పుడు యత్నశీలుడై యుండునో, అట్లే శరీరము, మనస్సు మరియు వాణి ద్వారా సకల ప్రాణులను రక్షించుటకు తత్పరతా యేది గలదో, దానిని "దయ" యందురు.

అన్యత్రాగమశాస్త్రములో గూడ -

**శ్లో॥ రోగార్తస్య రిపోర్వాఽపి మిత్రస్యాన్యస్య వా పునః ।**
**తద్రక్షాభిముఖీ బుద్ధిర్దయైషా భాషితా బుధైః ॥**

**అర్థము** :- రోగముచే సంతప్తుడుగాని, శత్రువు గాని, మిత్రుడుగాని మరెవరైనా యుండుగాక - వారిని విపత్తుల నుండి రక్షించుటకభిముఖమైన యే బుద్ధి గలదో- దానిని "దయ" యందురు.

**శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు ।**
**సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥** (గీత. 6-9)

**అర్థము** :- పూర్వ స్నేహము గాని, యేసంబంధముగాని లేకయే ప్రత్యుపకారము నపేక్షింపకుండా నుపకారము చేయు - సుహృత్ యందు, స్నేహముచే నుపకారము చేయు మిత్రుని యందు, తాను చేసిన యపకారమును లెక్క చేయక స్వాభావిక క్రౌర్యము (కూ)ర స్వభావము) చే నపకారము చేయు శత్రువు యందు, పరస్పరము వాదించు కొను నిరువురిని గూడ నుపేక్షించు ఉదాసీనుని యందు పరస్పరము వాదించుకొను నిరువురియొక్క హితమును గోరు మధ్యస్థుని యందును, తనకు జేసిన యపకారమునకు తిరిగి యపకారము చేయు ద్వేషియందును, సంబంధవశముచే నుపకారము జేయు బంధువుల యందును, శాస్త్రవిహిత కర్మలు జేయు సాధువుల యందును శాస్త్ర నిషిద్ధ కర్మలు జేయు పాపుల యందును మరియు సమస్త ప్రాణుల యందును సమాన బుద్ధిగల యోగి యెవరు గలరో, నాతడందరిలో శ్రేష్ఠుడనబడును.

శ్లో॥ నహి ప్రాణైః ప్రియతమం లోకే కించన విద్యతే ।
తస్మాత్ప్రాణి దయా కార్యా యథాఽఽత్మని తథా పరే ॥
(మ.భా. అను.ప. 145 అధ్యా. పృ. 5990)

అర్థము :- సంసారములో ప్రాణములకు సమమైన ప్రియతమ వస్తువు మరొకటి లేదు. అందు వలన సమస్త ప్రాణికోటులందు దయ గలిగి యుండవలెను. తనపై యేవిధముగా దయ యభీష్టమున్నదో, అట్లే యితరులపై గూడ యుండవలెను.

శ్రీ ధర్మరాజుగారు ఇలా అంటున్నారు. ఎవరు ఆపదలో చిక్కుకున్న ప్రాణుల దుఃఖమును నాశనము చేయకుండా, కేవలము తన సుఖమును మాత్రమే యిచ్ఛగించుట యేది గలదో - దాని కంటే మరణించుట లేదా నరకములో పడుట యుచితము. ఎవరి మనస్సు సంకటములో నున్న ప్రాణులను రక్షించుట యందు సంలగ్నముగాదో - వారి యజ్ఞము, దానము మరియు తపము యిహలోకము మరియు పరలోకమునందు గూడ కళ్యాణమునకు సాధనములు గానేరవు.

నరకము గుండా గొని పోబడుచున్న ధర్మరాజు దేవదూతలతో యిట్లనెను. ఈ నరకములో వేలాది ప్రాణులు కష్టముననుభవించుచున్నారు. నన్ను చూసి ఆర్తభావముతో రక్షించు! రక్షించు! మని దీన స్వరముతో నఱచుచున్నారు. ఇటువంటి దుఃఖములో నున్న వారిని వదలి నేను స్వర్గమునకు రాలేను.

శ్లో॥ తస్మాద్యత్సుకృతం కించిన్మమాస్తి త్రిదశాధిప! ।
తేన ముచ్యంతు నరకాత్ పాపినో యాతనాం గతాః ॥
(మార్కండేయ పురాణము 15-76)

**అర్థము :-** ఓ దేవతాధిప! ఒక వేళ మీరు నాయందధిక పుణ్యమున్నదని దలంచినచో నది యీ నరకయాతనల ననుభవించుచున్న పాపులు వారి దుఃఖములనుండి విముక్తులగుటకుపకరించు గాక!

అప్పుడు దేవరాజైన యింద్రుడు ధర్మరాజుతో యిట్లనెను. ఓరాజా! నీ యొక్క ఈ పుణ్యదాన రూప ఉదార కర్మచే నీ పుణ్యము యింకను ద్విగుణీకృతమాయెను. నీవు యింకా ఉచ్చస్థానములనలంకరించితివి. చూడుము - ఈ పాపి జీవులు నరకము నుండి ముక్తులు గావింపబడిరి.

కావున దుఃఖితుల యందు దయ గలిగి యుండవలయును "దయ" యొక్క ప్రాశస్త్యమును పురాణము ఈ క్రింది విధముగా వర్ణించుచున్నది.

**శ్లో॥** న దయా సదృశో ధర్మో న దయా సదృశం తపః ।
న దయా సదృశం దానం న దయా సదృశః సఖా ॥

**శ్లో॥** దుఃఖితానాం హి భూతానాం దుఃఖోద్ధర్తా హి యో నరః ।
స ఏవ సుకృతి ర్లోకే జ్ఞేయో నారాయణాంశజః ॥

**శ్లో॥** న స్వర్గే నాపవర్గేఽపి తత్సుఖం లభతే నరః ।
యదార్త జంతు నిర్వాణ దానోత్థమితి నో మతిః ॥
(పద్మ పురాణము- పాతాళఖండము- 98-15, 17, 23)

**అర్థము :-** దయతో సమానమైన ధర్మము లేదు దయతో సమానమగు తపస్సు లేదు. దయతో తులతూగు దానము లేదు. దయతో సరియగు యే మిత్రుడును లేడు. ఏ మనుష్యుడు దుఃఖితులైన జీవుల నుద్ధరించునో నతడే ఈ సంసారములో పుణ్యాత్ముడు. అతనిని నారాయణుని అంశము నుండి ఉత్పన్నమైన వానిగా నెఱుంగవలయును. ఏ మనుష్యుడు ఆర్త (దుఃఖసంతప్త) ప్రాణుల యొక్క దుఃఖమును దూరము జేయునో

నతడు - యే సుఖమునకు స్వర్గము మరియు మోక్షసంబంధసుఖము గూడ సమానముగాదో, నటువంటి సుఖమునుఁ బొందగలడు- అని మా నిశ్చితాభిప్రాయము.

ఉత్తమపురుషులలో దయ స్వాభావికముగా నుండుననుటలో శాస్త్ర వచనము.

శ్లో॥ న త్వ హం కామయే రాజ్యం న స్వర్గం నా పునర్భవమ్ ।
కామయే దుఃఖ తప్తానాం ప్రాణినా మార్తి నాశనమ్ ॥

అర్థము :- నేను రాజ్యమును గోరను. స్వర్గమును వాంఛింపను. మరియు మోక్షము గూడ నాకు వలదు. నానా ప్రకారము దుఃఖములచే సంతప్తులగుచున్న ప్రాణుల యొక్క ఆర్తి (పీడ) నాశనము గావాలని మాత్రము నేను గోరుచున్నాను.

కావున సకల ప్రాణుల పట్ల దయ (రక్షాభిముఖీ బుద్ధి) గలిగి యుండుట మానవమాత్రుల యొక్క ముఖ్య ధర్మమున్నదని శ్రీతుకారాం మహారాజుగారు వ్యతిరేకముఖముగా అభంగము ద్వారా తెలియ జేసి యున్నారు. ఇంతే గాక సత్పురుషుల సేవ మరియు తీర్థయాత్రలు గూడ మనుష్యులకు పురుషార్థ సాధనములని తెలిపి యున్నారు.

శ్లో॥ యస్య హస్తౌ చ పాదౌ చ మనశ్చైవ సుసంయతమ్ ।
విద్యా తపశ్చ కీర్తిశ్చ స తీర్థ ఫలమశ్నుతే ॥
(పద్మపురాణము - పాతాల ఖండము. 19-24)

అర్థము :- ఎవరియొక్క చేతులు, పాదములు మరియు మనస్సు సుసంయతమై యుండునో - అనగా! యెవరి చేతులు భగవదారాధన యందు, సత్పురుషుల సేవ మరియు తల్లిదండ్రుల సేవ యందు సంలగ్నమై

యుండునో, యెవరి పాదములు తీర్థాది భగవత్స్థానములందు తిరుగాడునో మరియు నెవరి మనస్సు భగవంతుని చింతన యందు తత్పరమై యుండునో, యెవరికి అధ్యాత్మ విద్య ప్రాప్తమున్నదో యెవరు ధర్మపాలన కొఱకు కష్టమును సహించెదరో మరియు యెవరి భగవత్కృపకు పాత్రతారూప ధర్మయుక్తమైన కీర్తి గలిగి యున్నదో - అతడు సంపూర్ణ తీర్థముల ఫలమునొందును.

శ్లో॥ తీర్థాన్యనుసరన్ధీరః శ్రద్ధధానః సమాహితః ।
కృతపాపో విశుద్ధ్యేత కిం పునః శుద్ధ కర్మకృత్ ॥

అర్థము :- ఎవడు ఏకాగ్రచిత్తుడై, శ్రద్ధాయుక్తుడై, తీర్థయాత్రలు చేయగల ధైర్యవంతుడై తీర్థములను సేవించునో - అతడు పూర్వము పాపాచారియైనను తీర్థసేవనముచే పునీతుడగుచున్నాడు. ఇక శాస్త్ర విహిత శుద్ధ కర్మలు చేయువాడు. పునీతుడు కాగలడని వేఱుగ చెప్పవలెనా? (క్రైముతికన్యాయము).

శ్లో॥ కామం క్రోధం చ లోభం చ యో జిత్వా తీర్థమావిశేత్ ।
న తేన కించిదప్రాప్తం తీర్థాభిగమనాద్భవేత్ ॥

అర్థము :- ఎవడు కామమును, క్రోధమును మరియు లోభమును జయించి తీర్థమును ప్రవేశించునో - నతనికి తీర్థయాత్రచే నే వస్తువు గూడ యలభ్యముండదు.

శ్లో॥ అన్యత్ర హి కృతం పాపం తీర్థమాసాద్య నశ్యతి ।
తీర్థేషు యత్కృతం పాపం వజ్రలేపో భవిష్యతి ॥

(స్కంధపురాణము - వైష్ణవఖండము. మార్గశీర్ష మాహాత్మ్యము. 17-17)

అర్థము :- అన్యస్థలములలో జేసిన పాపము తీర్థ స్థానమున

నశించును. కాని తీర్థ స్థానములో జేసిన పాపము వజ్రలేపమగును. అనగా ప్రాయశ్చిత్తము లేనిదగును.

శ్లో॥ గంగాది తీర్థేషు వసన్తి మత్స్యా।
దేవాలయే పక్షిగణాశ్చ సన్తి॥
భావోజ్ఝితాస్తే న ఫలం లభన్తే।
తీర్థాచ్చ దేవాయతనాచ్చ ముఖ్యాత్॥
భావం తతో హృత్కమలే నిధాయ
తీర్థాని సేవేత సమాహితాత్మా॥ (నారద పురాణము)

అర్థము :- గంగాది నదులలో చేపలు నివసిస్తాయి. దేవమందిరములలో పక్షిగణము నివసించును. అను నిటువంటి భక్తి భావ చిత్త రహితునకు తీర్థ సేవనము చేతగాని, దేవమందిర నివాసముచే గాని యే విధమైన ఫలము లభించదు. అందువలన హృదయకమలమునందు భక్తి భావమును సంగ్రహించి, యేకాగ్రచిత్తుడై తీర్థ సేవనము జేయవలయును.

శ్లో॥ తీర్థాని చ యథోక్తేన విధినా సంచరన్తి యే।
సర్వ ద్వంద్వ సహా ధీరాః తే నరా స్వర్గగామినః॥

అర్థము :- ఎవడు యథోక్త శాస్త్ర విధిచే సంయమితుడై తీర్థ యాత్రలు జేయునో, సంపూర్ణ ద్వంద్వములను సహించు నా ధీరపురుషుడు స్వర్గమునకు వెళ్ళును.

20. అభంగము :-

మాంస ఖాతాం హౌస కరీ। జోడోని వైరీ తేవియేలా॥1॥
కోణ త్యాచీ కరీల కీంవ! జీవే జీవ నేణతీ॥2॥

**పుఢిలా సాఠీ పాజళీ సురీ । ఆపలీ చోరీ అంగులీ ॥3॥**

**తుకా హ్మణే పుఢేం కుటతీ హాడేం! ఆపుల్యా నాడే రడతీల ॥4॥**

**(1612)**

ప్ర.ప :- మాంస = మాంసమును ; ఖాతాం = తినుచు (తిని) ; హౌస = కోరికను (ఇచ్ఛను) ; కరీ =(పూర్తి) చేసుకొను చున్నాడు ; (ఆగామి దుఃఖ జనక పాపరూప) వైరీ = శతృవుతో ; జోడోని = సంబంధము పెట్టుకొని ; ఠేవియేలా = ఉంచుకొను చున్నాడు. 1. (తనయొక్క) జీవే = ప్రాణము లాంటిదే ; (ఇతర పశ్వాదుల యొక్క) జీవ = ప్రాణులు (జీవులు, అని) ; నేణతీ = తెలియ జాలకున్నాడు. (అలాంటి వాడు యమలోకములో దుఃఖము ననుభవించునపుడు); త్యాచీ = వానియొక్క (దుఃఖముల నుండి విడిపించుటకు) ; కోణ = ఎవరు?; కీంవ = దయ (కరుణ); కరీల = చేయుదురు? 2. పుఢిలా సాఠీ = ఎదుటనున్న పశువును చంపుట కొఱకు; సురీ = కత్తిని ; పాజళీ = పదును పెట్టి ఉంచుతాడు; (కాని) ఆపులీ= తనయొక్క; అంగులీ = వ్రేలును (మాత్రము) ; చోరీ = రక్షించు కుంటాడు. 3. తుకా హ్మణే = శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు ; పుఢే = ముందు యమలోకములో (యమదూతలు వీని యొక్క) హాడే = ఎముకలను; కుటతీ = చూర్ణము చేయుదురు ; (అప్పుడు) ఆపుల్యా = తనయొక్క ; నాడే = కర్మరూప త్రాటిచే (కృతకర్మఫలము ననుభవించునపుడు); రడతీల= దుఃఖిస్తూ బోరున ఏడుస్తాడు; 4.

**తాత్పర్యము** :- మూఢ మనుష్యులు పశువును హత్య చేసి దాని మాంసమును వండుకొని తిని, వారి కోరికను నెరవేర్చుకొనుచున్నారు. కాని జన్మజన్మాంతరములలో దుఃఖము నిచ్చు శతృవు (పాపము) తో సంబంధము పెట్టుకొనుచున్నామని మాత్రము తెలియజాలకున్నారు. 1.

తన జీవనము (ప్రాణము) లాంటిదే ఇతర పశ్వాదుల యొక్క ప్రాణముంటుందని తెలియక ప్రాణిహత్య (జీవహింస) చేయుచున్నారు. దానికి ప్రతిఫలముగా యమలోకములో శిక్షింపబడు చున్నపుడు, వానిని విడిపించుటకు, వానిపై కరుణజూపు వారెవరు? 2. ఎదుటనున్న పశువును చంపుట కొఱకు కత్తిని పదునుబెట్టి అతి తీక్షణముగా నూరి ఉంచుతాడు. కాని, పశువు మెడ కోయునపుడు నా వ్రేలు తెగిపోవునేమోయని, తన వ్రేలును మాత్రము జాగ్రత్తగా రక్షించుకుంటాడు. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - ఇటువంటి దుష్టులకు ఇక్కడ పాపము చేయునపుడు ఆనందముగా దోచును. కాని ముందు యమదూతలు వానిని కొట్టి, చిత్ర హింసలు పెట్టి, కాళ్ళతో కసిదీర త్రొక్కుచూ, వాని ఎముకలను చూర్ణము చేయుదురు. అప్పుడు వాని పూర్వకృత పాపకర్మఫలము ననుభవిస్తూ దిక్కులేని వాడై అతిదుఃఖముతో బోరున ఏడ్చును. 4.

సు.వ్యా:- ప్రకృతాభంగము ద్వారా శ్రీ తుకారాం మహారాజుగారు ప్రాణిహింస చేయరాదని, సకల ప్రాణుల పట్ల దయ గలిగి యుండాలని, "దయగల హృదయమే భగవన్నిలయమని చెబుతూ, మాంసభక్షణ నిషేధము చేస్తూ, మాంస భక్షణము చేయువానిని కఠినముగా మరియు సశాస్త్రీయముగా నిందించుచున్నాడు.

ప్రాణిహింసను నిందిస్తూ, మాంస భక్షణమును నిరాకరిస్తూ భారత, మన్వాది శాస్త్రములు లోక హితార్థము, అభయదానమే ఉత్తమ దానమని విస్తారముగా బోధించుచున్నవి.

శ్లో॥ అహింసా పరమో ధర్మ స్తథాఽహింసా పరమం తపః ।
అహింసా పరమం సత్యం యతో ధర్మః ప్రవర్తతే ॥
(మ.భా. అను.ప. 115-23)

అర్థము :- అహింసయే పరమధర్మము, అహింసయే పరమ తపస్సు, అహింసయే పరమ సత్యము. ఎందుకనగా? దాని చేతనే ధర్మము ప్రవృత్త మగుచున్నది.

శ్లో॥ అహింసా పరమో యజ్ఞస్తథా హింసా పరం ఫలమ్ ।
అహింసా పరమం మిత్రమహింసా పరమం సుఖమ్ ॥
(మ.భా. అను. ప. 116-29)

అర్థము :- అహింసయే పరమయజ్ఞము, అహింసయే పరమ ఫలము, అహింసయే పరమమిత్రుడు మరియు అహింసయే పరమ సుఖమున్నది.

సూ:- అహింసా సత్యా స్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహాః యమాః ।
(పాతంజల యోగ సూత్రము. 2-30)

అహింసా, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము మరియు అపరిగ్రహము – ఈ ఐదింటికి "యమము" లందురు. తత్ర వ్యాసభాష్యమ్:-

తత్రాహింసా సర్వథా సర్వదా సర్వభూతానామనభిద్రోహః, ఉత్తరే చ యమ నియమాస్తన్మూలాస్తత్సిద్ధి పరతయైవ తత్ప్రతిపాదనాయ ప్రతిపాద్యన్తే, తదవదాత రూపకరణా యైవోపాదీయన్తే ।

అర్థము :- మనోవాక్కాయ కర్మలలో నొకదాని మూలమున గాని, యొకవేళనేని, యొక ప్రాణికేని ద్రోహము చేయకుండుట యహింస యనబడును.సత్యాస్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహములను యమములును, వక్ష్య మాణ శౌచ, సంతోష, తప, స్వాధ్యాయేశ్వర ప్రణిధానములను నియమములు కలిసి తొమ్మిదియు నహింసా మూలములే గాన,

యమనియమము లన్నియు నహింసా సిద్ధి కొఱకును, సిద్ధించిన యహింసను విశదముగ నొనర్చి పుష్టి నొందించుటకును నిరూపింపబడెను.

**శ్లో॥ ప్రభవార్థాయ భూతానాం ధర్మప్రవచనం కృతమ్ ।**
**యః స్యాత్ప్రభవ సంయుక్తః సధర్మ ఇతి నిశ్చయః ॥**

(మ.భా. శాం.ప. 109-10)

**అర్థము :-** ప్రాణుల యొక్క అభ్యుదయము మరియు నిః శ్రేయస్సు కొఱకే ధర్మప్రవచనము చేయబడినది. అందువలననేది అభ్యుదయ నిఃశ్రేయస సిద్ధి కొఱకగునో నదియే ధర్మ మగునని శాస్త్ర వేత్తల నిశ్చయము.

**శ్లో॥ ధారణా ద్ధర్మ మిత్యాహుర్ధర్మేణ విధృతా - ప్రజాః ।**
**యః స్యాద్ధారణ సంయుక్తః సధర్మ ఇతి నిశ్చయః ॥**

(మ.భా.శాం.ప. 109-11)

**అర్థము :-** ఏది సర్వమును ధారణ జేయునో నది ధర్మ మనబడును. అనగా సకల జీవులను అధోగతి నుండి తప్పించి, రక్షించునది ధర్మము. ధర్మమే సంపూర్ణ ప్రజలను ధారణ జేసికొని ఉంది. అందువలన దేనిచే సకల ప్రజలయొక్క ధారణ, పోషణ సిద్ధించుచున్నదో, అదియే ధర్మమని ధర్మవేత్తల నిశ్చయము.

**శ్లో॥ అహింసార్థాయ భూతానాం ధర్మ ప్రవచనం కృతమ్ ।**
**యః స్యాదహింసా సంపృక్తః సధర్మ ఇతి నిశ్చయః ॥**

(మ.భా. శాం. ప. 109-12)

**అర్థము :-** ప్రాణులకు ఏ విధమైన హింస కలుగకుండుట కొఱకే ధర్మోపదేశము చేయబడినది. కావున నేది యహింసా యుక్తముండునో, నదియే ధర్మమని, ధర్మవేత్తల నిశ్చయము.

శ్లో॥ యథా నాగపదేఽన్యాని పదాని పదగామినామ్ ।
సర్వాణ్యేవాపి ధీయన్తే పదజాతాని కౌఞ్జరే ।
ఏవం లోకేష్వహింసా తు నిర్దిష్టాః ధర్మతః పురా ॥
(మ.భా. అను.ప. 114-6)

అర్థము :- ఏ విధముగా ఏనుగు యొక్క పద చిహ్నము నందు, అన్ని పదగాములైన ప్రాణులయొక్క పదచిహ్నములు సమాహితమై యుండునో, అట్లే పూర్వకాలమందు జగత్తులో అహింసా నిర్దేశము ధర్మతః చేయబడినది - అనగా అహింసా ధర్మమునందు సమస్త ధర్మార్థములు సమావిష్టమై యున్నవి.

శ్లో॥ అహింస యేంద్రియా సంగై ర్వైదికై శ్చైవ కర్మభిః ।
తపసశ్చరణైశ్చోగ్రైః సాధయంతీహ తత్పదమ్ ॥ (మ.స్మృ. 6-75)

అర్థము :- నిషిద్ధ హింసను వదలుట చేతను, శబ్దాది విషయముల నుండి ఇంద్రియములను నిగ్రహించుట చేతను, వేదోక్త నిత్యాది కర్మలనుష్ఠించుట చేతను, ఉగ్ర తపస్సుల నాచరించుట చేతను నీలోకంబున బ్రహ్మ పదవిని పొందుదురు. కావున అహింసా బ్రహ్మ ప్రాప్తికి సోపానమని తెలియుచున్నది.

"అహింసా పరమో ధర్మః" అని చెప్పబడినందున అహింసా ధర్మమును మన హితమును (కల్యాణమును) గోరి ఆచరించుచుండ వలయును. రక్షించుచుండవలయును - కాని, హననము చేయగూడదు.

శ్లో॥ ధర్మ ఏవ హతో హన్తి ధర్మో రక్షతి రక్షితః ।
తస్మా ద్ధర్మో న హన్తవ్యో మానో ధర్మో హతోఽవధీత్ ॥
(మ.స్మృ. 8-15) (మ.భా.వ.ప. 313-128)

అర్థము :- అతిక్రమించ బడిన (హననము చేయబడిన) ధర్మమే వ్యక్తిని నాశనము చేయును. రక్షింప (పాలింప)బడిన ధర్మమే వ్యక్తిని రక్షించును. అందువలన "కదాచిత్ మాచే నష్టము చేయబడిన ధర్మము మమ్ములను నష్టము చేయకుండు గాక!" అను నీ భావనచేత ధర్మమును హననము (త్యాగము) చేయగూడదు.

శ్లో॥ న హింస్యాత్సర్వభూతాని నానృతం వా వదేత్ క్వచిత్ ।
నాహితం నాప్రియం వాచ్యం నస్తేనః స్యాత్కదాచన ॥
(పద్మపురాణము - స్వర్గఖండము. 55-1)

అర్థము :- ఏ ప్రాణిని గూడ హింసించగూడదు. ఎప్పుడును అబద్ధమాడరాదు. ఎవరికిని అహితమును, అప్రియమునునగు వచనములు ముఖమునుండి వెలువడరాదు. ఎప్పుడును దొంగతనము చేయరాదు.

శ్లో॥ న హింస్యాత్ సర్వభూతాని మైత్రాయణగతశ్చరేత్ ।
నేదం జీవితమాసాద్య వైరం కుర్వీత కేనచిత్ ॥
(మ.భా శాం..ప. 278-5) (మ.భా. వన.ప. 213-34)

అర్థము :- ఏప్రాణిని గూడ హింసించగూడదు. సకల జీవులయందు మైత్రీ భావముతో చరించవలయును. ఈ దుర్లభమైన మానవ జన్మను పొంది ఏ ప్రాణితో గూడ వైరము పెట్టుకొనగూడదు.

శ్లో॥ యో హింసకాని భూతాని హినస్త్యాత్మ సుఖేచ్ఛయా ।
స జీవంశ్చ మృతశ్చైవ న క్వచిత్సుఖమేధతే ॥ (మ.స్మృ. 5-45)

అర్థము :- ఎవడొరులనుపద్రవపెట్టని ప్రాణులను తనసుఖము కొఱకు హింసించునో, అతడు జీవించియు మరియు మరణించియు ఎచ్చటను సుఖపూర్వక ఉన్నతిని పొందడు.

**శ్లో॥ త్రికారణం తు నిర్దిష్టం శ్రూయతే బ్రహ్మవాదిభిః ।**
**మనో వాచి తథాఽస్వాదే దోషా హ్యేష ప్రతిష్ఠితా ॥**
(మ.భా. అను.ప. 114-9)

**అర్థము :-** బ్రహ్మవాది మహాత్ములు హింసారూప దోషము సంభవించుటకు ప్రధానముగా మూడు కారణములను చెప్పుచున్నారు. 1. మనస్సు (మాంసమును తినాలని ఇచ్ఛ), 2. వాణి (మాంసమును తినుమని ఉపదేశించుట); మరియు 3. ఆస్వాదము (ప్రత్యక్షముగా మాంసభక్షణము చేసి ఆస్వాదించుట). ఈ మూడు హింసారూప దోషమునకు హేతువులున్నవి.

**శ్లో॥ య ఇచ్ఛేత్ పురుషోఽత్యంత మాత్మానం నిరుపద్రవమ్ ।**
**స వర్జయేత మాంసాని ప్రాణినామిహ సర్వశః ॥**
(మ.భా. అను.ప. 115-48)

**అర్థము :-** ఏ మనుష్యుడు అత్యంత నిరుపద్రవరూప పరమశాంతిని పొందగోరునో, నతడు జగత్తులో ప్రాణులయొక్క మాంసమును ఏనిమిత్తముచే గాని, ఎప్పుడుగాని స్వీకరించగూడదు. మాంసభక్షణమును పరిత్యజించవలయును.

**శ్లో॥ అనిష్టం సర్వభూతానాం మరణం నామ భారత ।**
**మృత్యుకాలే హి భూతానాం సద్యో జాయతి వేపథుః ॥**
(మ.భా. అను.ప. 116-17)

**అర్థము :-** హే భరత నందన! ఏ ప్రాణికిని మరణము యిష్టముండదు. ఎందుకనగా? సకల జీవులకు మృత్యుకాలములో శరీరము మృత్యుభయముచే వణకును.

శ్లో॥ నాకృత్వా ప్రాణినాం హింసాం మాంసముద్పద్యతే క్వచిత్ ।
న చ ప్రాణి వధః స్వర్గ్యస్తస్మాన్మాంసం వివర్జయేత్ ॥
(మ.స్మృ. 5-48)

అర్థము :- ప్రాణులను హింసించకుండా ఎక్కడనూ మాంసముత్పన్నమగుటకు వీలులేదు. జీవహింస స్వర్గసాధనము గాదు. ప్రతిబంధకమగును. కావున మాంసభక్షణమునశేషముగా సర్వదా పరిత్యజించవలయును.

శ్లో॥ న హి మాంసం తృణాత్కాష్టా దుపలాద్వాపి జాయతే ।
హత్వా జన్తుం తతో మాంసం తస్మాద్దోషస్తు భక్షణే ॥
(మ.భా. అను.ప. 115-24.)

అర్థము :- మాంసము తృణము (గడ్డి) నుండిగాని, కాష్టము (కట్టెల) నుండి గాని, మరియు శిలల (రాళ్ళ) నుండి గాని ఉత్పన్నము గాదు. అది జీవులను హత్యజేయుటతోడనే ప్రాప్తమగు చున్నది. కావున మాంస భక్షణము జేయుట మహాదోషము.

శ్లో॥ ధనేన క్రయికో హన్తి ఖాదకశ్చోపభోగతః ।
ఘాతకో వధబంధాభ్యా మిత్యేష త్రివిధో వధ ॥
(మ.భా. అను.ప. 115-38)

అర్థము :- మాంసమును కొనువాడు ధనము చేతను, తినువాడు ఉపభోగముచేతను మరియు ఘాతకుడు బంధించుటచేతను, చంపుటచేతను పశ్వాదులను మూడు విధములుగా వధ చేయుచున్నారు.

శ్లో॥ శుక్రాచ్చ తాత! సంభూతిర్మాంసస్యేహ న సంశయః ।
భక్షణే తు మహాన్ దోషో నివృత్యా పుణ్యముచ్యతే ॥
(మ.భా. అను.ప. 115-9)

హే తాత! మాంసభక్షణము మహాదోషప్రదము. ఎందువల్ల ననగా? మాంసము యొక్క ఉత్పత్తి వీర్యము చేనగుచున్నది. ఇందులో సందియము లేదు. కావున దానినుండి నివృత్తమగుటయే మహాపుణ్యమని చెప్పబడినది.

**శ్లో॥ సముత్పత్తించ మాంసస్య వధబంధౌ చ దేహినామ్ ।**
**ప్రసమీక్ష్య నివర్తేత సర్వమాంసస్య భక్షణాత్ ॥**

(మ.స్మృ. 5-49)

**అర్థము :-** శుక్ర శోణితముల కలయికచే మాంసముత్పన్నమగుటఁ జేసి యది యత్యంత నిందనీయమని (హేయమని)యు, మాంసమునకు మూలమగు ప్రాణివధ, బంధనములు క్రూర (అవమాన) కర్మలని యెఱింగి, శాస్త్రవిహితమైన మాంస భక్షణము సహితము త్యజించవలయును. కావున శాస్త్రవిహితముగాని (నిషిద్ధ) మాంసభక్షణము నుండి నివృత్తము గావలయునని వేరుగ జెప్పవలయునా? (కైముతికన్యాయము).

**శ్లో॥ అనుమంతా విశసితా నిహంతా క్రయ విక్రయీ ।**
**సంస్కర్తా చోపహర్తా చ ఖాదకశ్చేతి ఘాతుకాః ॥** (మ.స్మృ. 5-51)

**అర్థము :-** జీవహింసను సమ్మతించు (సమర్థించు)వాడు, జీవములయంగములను ఛేదించువాడు, జీవులను జంపువాడు, ప్రాణుల మాంసమును కొనువాడు, దానిని విక్రయించువాడు, వంట చేయువాడు, వడ్డించువాడు మరియు భక్షించువాడు - వీరలందఱు ఘాతుకులనఁ బడుదురు.

"ఖాదకాః సర్వ ఏవ తే" (మ.భా.అను.ప. 115-45) పైన జెప్పబడిన వారందఱు మాంసభక్షకులుగానే పరిగణింపబడతారు. అనగా మాంసమును తినువానితో సమానముగా పాపమునకు పాత్రులై నరకమును పొందెదరు.

శ్లో ॥ పుత్రమాంసోపమం జానన్ ఖాదతే యోఽవిచక్షణః ।
మాంసం మోహసమాయుక్తః పురుషః సోఽధమః స్మృతః ॥
(మ.భా.అను. ప. 114-11)

అర్థము :- పుత్రమాంసమునందును, ఇతర పశుపక్ష్యాదుల మాంసమునందును మాంసత్వసామ్యమున్నదని అనగా భేదములేదని తెలిసిగూడ యే మూర్ఖుడు జిహ్వాచాపల్యముచేగాని, శరీరపుష్ట్యర్థము గాని మోహవశుడైగాని మాంసమును భక్షించునో, వాడు నరాధముడని చెప్పబడినది.

శ్లో॥ అఖాదన్ననుమోదంశ్చ భావదోషేణ మానవః ।
యోఽనుమోదతి హన్యంతం సోఽపి దోషేణ లిప్యతే ॥
(మ.భా. అను.ప 115-39)

అర్థము :- ఎవడు స్వయముగా మాంసమును తినక (భక్షించక), తినువానికి మాత్రము అనుమోదనము (సమర్థనము) జేయునో, ఆ మనుష్యుడు భావదోషముచే మాంసభక్షణమను పాపమునకు అధికారి యగును. అదేవిధముగా నెవరు చంపువానికి యనుమోదనము జేయునో నతడు గూడ హింసాదోషముచే లిప్తుడగును. (అంటబడును.)

శ్లో॥ స్వమాంసం పరమాంసేన యో వర్ధయితుమిచ్ఛతి ।
అనభ్యర్చ్య పితౄన్ దేవాన్ తతోఽన్యో నాస్త్యపుణ్యకృత్ ॥
(మ.స్మృ. 5-52)

అర్థము :- ఎవడు యజ్ఞములచే దేవతలను, శ్రాద్ధములచేఁ బితరులను తృప్తిపఱచక, యితర మాంసములచే స్వమాంసమును వృద్ధి నొందింపజూచునో, వానికంటె నీచుడు (పుణ్యహీనుడు) వేఱొకడు లేడు.

**శ్లో॥ యోహి ఖాదతి మాంసాని ప్రాణినాం జీవితైషిణామ్ ।**
**హతానాం వా మృతానాం వా యథా హంతా తథైవ సః ॥**
(మ.భా. అను.ప. 115-37)

**అర్థము** :- ఎవడు జీవింపనిచ్ఛగించు ప్రాణులను చంపునో, లేక స్వయముగా మృతినొందినవాటి మాంసమును తినునో, వాడు చంపకున్నా చంపినవాడుగా (హంతకుడుగా)నే పరిగణింపబడును.

**శ్లో॥ యేన యేన శరీరేణ యద్యత్కర్మ కరోతి యః ।**
**తేన తేన శరీరేణ తత్తత్ఫలముపాశ్నుతే ॥**
(మ.భా. అను.ప 116-27)

**అర్థము** :- ఎవడు ఏయే శరీరముచే నేయే కర్మ చేయునో అతడు ఆయా శరీరముతో నాయా కర్మ ఫలమనుభవించును.

"మాంస" మను శబ్దార్థమును శ్రీవేదవ్యాసభగవానులు ఈక్రింది విధముగా తెలియ జేయుచున్నారు.

**శ్లో॥ మాంస భక్షయతే యస్మాద్భక్షయిష్యే తమప్యహమ్ ।**
**ఏతన్మాంసస్య మాంసత్వ మను బుద్ధ్యస్వ భారత! ॥**
(మ.భా. అను.ప. 116-25.)

**అర్థము** :- హే భరతనందన! (ఏప్రాణి వధచేయబడునో; నా ప్రాణి యిట్లనుచున్నది) మాం - నన్ను ; సః - వాడు (ఇప్పుడు); యస్మాద్ - ఎందువల్లనైతే; భక్షయతే - (స్వతృప్తికోసము) తినుచున్నాడో; (అందువల్ల భవిష్యత్తులో ఎప్పుడైనా) ; అహమపి - నేను గూడ; తమ్ - వానిని ; భక్షయిష్యే - భక్షించగలను. ఇదియే మాంసముయొక్క మాంసత్వము. ఇదే "మాంస" శబ్దమునకర్థమని తెలియుము.

**శ్లో॥ లోభాద్వా బుద్ధి మోహాద్వా బలవీర్యార్థమేవ చ ।**
**సంసర్గాదథ పాపానామధర్మ రుచితా నృణామ్ ॥**

(మ.భా. అను. ప. 115-33)

**అర్థము :-** లోభము చేతగాని, బుద్ధిమోహము చేతగాని, బలవీర్య పాప్తి కొఱకు గాని లేక పాపాత్ముల సహవాసము చేతగాని మనుష్యులకు హింసాద్యధర్మము నందు రుచి గలుగును.

**శ్లో॥ జాతాశ్చా ప్యవశాస్తత్ర ఛిద్యమానాః పునః పునః ।**
**పాచ్యమానాశ్చ దృశ్యంతే వివశా మాంస గృద్ధినః ॥**

(మ.భా.అను. ప. 116-20)

**అర్థము :-** మాంసలోలుప్తచిత్తజీవులు నీచయోనులలో జన్మించినప్పటికి పరవశులై యుందురు. మళ్ళీ మళ్ళీ శస్త్రములచే ఖండింప బడుచు మరియు వండింపబడుచు, నానా దుఃఖములకు గురి యగుదురు. ఆ జీవుల యొక్క వైవశ్యము ప్రత్యక్షముగా జూడబడుచున్నది.

**శ్లో॥ కుంభీపాకే చ పచ్యన్తే తాం తాం యోనిముపాగతాః ।**
**ఆక్రమ్య మార్యమాణాశ్చ భ్రామ్యన్తే వై పునః పునః ॥**

(మ.భా. అను.ప. 116-21)

**అర్థము :-** వారు తమ పాపకర్మకు ఫలముగా కుంభీపాక నరకములో (**శనగలు పెంచు మీద వేయించబడునట్లు**) వేయించబడు చున్నారు. మరియు భిన్న భిన్న యోనులలో జన్మిస్తూ, ఎన్నోమార్లు మెడగోయబడి చంపబడుచున్నారు. ఈ ప్రకారము పునః పునః సంసార చక్రములో తిరుగాడవలసి వచ్చుచున్నది.

శ్లో॥ జీవాః పురాకృతేనైవ తిర్యగ్యోని సరీసృపాః ।
నానా యోనిషు జాయన్తే స్వకర్మపరివేష్టితాః ॥
(మ.భా. అను.ప. అధ్యా. 145.)

**అర్థము** :- జీవులు వారి పూర్వకృతకర్మఫలముగా పశు, పక్షి, క్రిమి మరియు కీటాది జన్మలనొందుచున్నారు. కావున స్వస్వ కర్మలచే బద్ధులై ప్రాణులు భిన్న భిన్న యోనులలో జన్మించుచున్నారు.

శ్లో॥ స్వాహాస్వధామృత భుజో దేవాః సత్యార్జవప్రియాః ।
క్రవ్యాదాన్ రాక్షసాన్ విద్ధి జిహ్మానృతపరాయణాన్ ॥
(మ.భా. అను.ప. 115-25)

**అర్థము** :- ఎవరు స్వాహా (దేవయజ్ఞము) మరియు స్వధా (పితృ యజ్ఞము) లననుష్ఠించి, యజ్ఞావశిష్టామృత భోజనము జేయుదురో, అదే విధముగా సత్యమును మరియు ఋజుత్వము(సరళతా)ను ప్రేమించుదురో - వారు" దేవతలు" అని దెలియవలెను. కాని, ఎవరు కుటిలత్వము మరియు అసత్యభాషణమునందు ప్రవృత్తులై, ఎల్లపుడు మాంసభక్షణము చేయుదురో వారు "రాక్షసుల"ని దెలియవలెను.

శ్లో॥ యస్మాద్గ్రసతి చైవాయుర్హింసకానాం మహాద్యుతే ।
తస్మాద్వివర్జయేన్మాంసం య ఇచ్ఛేద్భూతిమాత్మనః ॥
(మ.భా. అను.ప. 115-31)

**అర్థము** :- మహాతేజస్వి యగునో నరేశా! జీవ హింసజేయు వాని యాయువును వాని పాపము గ్రసించివేయును. అందువలన, ఎవడు తన కళ్యాణము (హితము)ను గోరునో ఆ మనుష్యుడు మాంసభక్షణమునశేషముగా పరిత్యజించవలయును.

ఇంతవరకు అహింసా, తద్వైశిష్ట్యము మరియు మాంసభక్షణ నిషేధము "మాంస" శబ్దార్థము, మాంసభక్షణము ద్వారా కలుగు యనర్థములఁ గూర్చియు మరియు మాంసభక్షణము చేయు వారినింద - మున్నగు విషయములను శాస్త్రాధారముగా సవిస్తరముగా తెలుసుకున్నాము. ఇప్పుడు అహింసా ప్రాశస్త్యమును తథా మాంస భక్షణ త్యాగ ప్రాశస్త్యమును మరియు తత్ఫలమును గూర్చి తెలుసుకుందాము.

**శ్లో॥ యద్ధ్యాయతి యత్కురుతే ధృతిం బధ్నాతి యత్ర చ ।**
**తదావాప్నోత్యయత్నేన యో హినస్తి న కించన ॥** (మ.స్మృ. 5-47)

**అర్థము :-** ఎవడు ఈగలు, దోమలు మొదలగు నల్ప ప్రాణుల సహితము ఏప్రాణిని గూడ హింసింపడో, అతడు - "ధర్మాదికము నాకు గలుగుగాక" యని తలంచునో, శ్రేయస్సాధనమగు యే కార్యము జేయునో, పరమాత్మ చింతనాది యే ధ్యానము జేయగోరునో - వాటి ఫలముల నెల్ల నప్రయత్నముగానే పొందును.

**శ్లో॥ సర్వయజ్ఞేషు వా దానం సర్వ తీర్థేషు వాఽఽప్లుతమ్ ।**
**సర్వదానఫలం వాపి నైతత్తుల్య మహింసయా ॥**
(మ.భా.అను.ప. 116-30)

**అర్థము :-** సమస్త యజ్ఞములలో జేయబడు దానమునకు, సంపూర్ణ తీర్థములలో పవిత్ర మనస్సుతో నాచరించు స్నానాదులకు మరియు సర్వ ప్రకారముల దానములకు యే ఫలము చెప్పబడినదో నది యంతయు కలిసి గూడ అహింసా ధర్మముతో సమానముగా జాలదు.

**శ్లో॥ యో బంధన వధ క్లేశాన్ ప్రాణినాం న చికీర్షతి ।**
**స సర్వస్య హితప్రేప్సుః సుఖమత్యంత మశ్నుతే ॥** (మ.స్మృ. 5-46)

అర్థము :- ఎవడు జంతువులను కట్టుట, చంపుట, చిత్రహింసలు పెట్టుట మున్నగునవి జేయనొల్లడో, యతడు సకల భూతములకు హితముఁ జేయగోరుచు నెల్లపుడు తఱుగని మోక్షరూపమగు నానందము నొందును.

శ్లో॥ సర్వభూత దయావంతో విశ్వాస్యాః సర్వజంతుషు ।
త్యక్త హింసాసమాచారాస్తే నరాః స్వర్గగామినః ॥
(మ.భా. అను. ప. 144-9)

అర్థము :- ఎవరు సకల జీవకోట్లపై దయగలిగి యుందురో, సర్వజీవులకు విశ్వాసపాత్రులై మరియు హింసామయ ఆచరణములనుండి నివృత్తమైన వారై యుందురో, వారు స్వర్గమునకు వెళ్ళుదురు.

శ్లో॥ వర్షే వర్షేఽశ్వమేధేన యో యజేత శతం సమాః ।
మాంసాని చ న ఖాదేద్యస్తయోః పుణ్యఫలం సమమ్ ॥
(మ.స్మృ. 5-53)

అర్థము :- ఎవడు నూతేండ్లు ఏటేట నశ్వమేధముఁ జేయునో, వానికిని మరియు మాంసభక్షణము చేయని వానికిని గలుగు పుణ్యఫలము సమానమని చెప్పబడును.

శ్లో॥ ధన్యం యశస్య మాయుష్యం స్వర్గ్యం స్వస్త్యయనం మహత్ ।
మాంసస్యాభక్షణం ప్రాహుర్నియతాః పరమర్షయః ॥
(మ.భా. అను.ప. 115-35.)

అర్థము :- ధనము, యశస్సు, ఆయుష్షు తథా స్వర్గ ప్రాప్తికి ప్రధానోపాయము మరియు పరమ కళ్యాణము (మోక్షము)నకు సాధనము మాంస భక్షణ-త్యాగమే యని నియత పరాయణులైన మహర్షులు చెప్పిరి.

శ్లో॥ మధుమాంసం చ యే నిత్యం వర్జయంతీహ ధార్మికాః ।
జన్మప్రభృతి మద్యం చ సర్వే తే మునయః స్మృతాః ॥
(మ.భా. అను.ప. 115-70)

అర్థము :- ఏ ధర్మాత్ములైన పురుషులు జన్మప్రభృతి జీవిత పర్యంతము తేనె, మద్యము (సురాపానము) మరియు మాంసభక్షణము సంపూర్ణముగా త్యాగము జేయుదురో - వారందఱు మునులని చెప్పబడుదురు.

శ్లో॥ సర్వే వేదా న తత్కుర్యుః సర్వే యజ్ఞాశ్చ భారత ।
యో భక్షయిత్వా మాంసాని పశ్చాదపి నివర్తతే ॥
(మ.భా. అను.ప. 115-16.)

అర్థము :- హే భారత! ఎవరు మొదలు మాంసభక్షణము చేసి యుండి, మరియు తరువాత దానిని సర్వథా పరిత్యజించిరో - వారికి యే పుణ్యము ప్రాప్తించునో - దానిని సంపూర్ణ వేదములు మరియు యజ్ఞములు గూడ ప్రాప్తింపజేయ జాలవు.

శ్లో॥ సర్వమాంసాని యో రాజన్! యావజ్జీవం న భక్షయేత్ ।
స్వర్గే స విపులం స్థానం ప్రాప్నుయాన్నాత్ర సంశయః ॥
(మ.భా. అను.ప. 116-23)

అర్థము :- హే రాజన్! ఎవరు జీవితమంతయు ఏప్రాణి మాంసమును గూడ భుజింపనొల్లరో, వారు స్వర్గములో శ్రేష్ఠమైన మరియు విశాలమైన స్థానము నలంకరింతురు. ఇందులో నిసుమంతయు సంశయము లేదు.

శ్లో॥ అధృష్య సర్వభూతానామాయుష్మాన్ నీరుజః సదా ।
భవత్యభక్షయన్ మాంసం దయావాన్ ప్రాణినా మిహ ॥
(మ.భా. అను.ప. 115-40)

అర్థము :- ఏ మనుష్యుడు మాంసభక్షణము చేయడో, ఈ జగత్తులోని సకల ప్రాణుల యెడల దయగలిగి యుండునో, నతనిని యే ప్రాణి గూడ తిరస్కరించదు. అతడు దీర్ఘాయుష్మంతుడై ఎల్లపుడు ఆరోగ్యవంతుడుగా నుండును.

విహితమాంస భక్షణాదపి నివర్తేత, కిముతావిహితమాంస భక్షణాదిత్యవిధినా మాంసభక్షణ నిందానువాదః । (మ.స్మృ. 5-49. మన్వర్థ ముక్తావళీ).

అర్థము :- శాస్త్ర విహితమైన మాంసభక్షణము సైతము త్యాజ్యము అట్లుండ శాస్త్రవిహితముగాని మాంసభక్షణము నుండి నివృత్తము గావలయునని వేఱుగఁ జెప్పవలసినదేమున్నది? సర్వథా మాంసభక్షణము నింద్యమని యెఱింగి త్యాగము జేయ వలయును.

ఇంకను మాంస భక్షణముచే నుత్పన్నమగునవి పెక్కు దోషములు గలవు. అందులో కొన్నింటిని సంక్షేపముగ నీక్రింద గనందగును.

1. మాంసభక్షణము భగవత్ప్రాప్తికి గొప్ప ప్రతి బంధకమున్నది.

2. మాంసభక్షణముచే నీశ్వరుడు అప్రసన్నుడగును.

3. మాంసభక్షణము పాపమునకు సాధనమున్నది.

4. మాంసభక్షణముచే పరలోకములో దుఃఖము సంప్రాప్తమగును.

5. మాంసభక్షణము మానుషాహారము కానందున ప్రకృతి విరుద్ధమున్నది.

8. మాంసభక్షణముచే మనుష్యుడు పశుత్వము నొందుచున్నాడు.

7. మాంసభక్షణము మనుష్యునికి అనధికార చేష్టయగును. ఒకానొక ప్రాణికి ప్రాణసంయోగము చేసే సామర్థ్యము లేనపుడు, ప్రాణము తీసే అధికారము గూడ మనుష్యునకు లేదు.

8. మాంసభక్షణము ఘోర నిర్దయత యగును.

9. మాంసభక్షణముచే పశుపక్ష్యాదులకు గల వ్యాధులు మనుష్యులకు సంక్రమించి స్వాస్థ్యము చెడిపోవును.

10. మాంసభక్షణము శాస్త్ర నిందితము. (వేద విరుద్ధము).

కావున ఏ ప్రాణిని, ఎప్పుడును మరియు యే ప్రకారముగా గూడ హింసించక మాంసభక్షణము ఘోరనిర్దయ కృత్యమని, శాస్త్ర నిందితమని, అవమాన కార్యమని మోక్ష ప్రతిబంధకమని బాగుగా పై నుదహరించిన ప్రకారముగా శాస్త్రాధారములచే విచారించి – (దానిని) సర్వదా పరిత్యాగము జేయవలెను. సకల భూతములకు ప్రాణదానము మరియు అభయ దాన మొనరించ వలయును.

**శ్లో॥ ప్రాణదానాత్పరం దానం న భూతం న భవిష్యతి ।**
**నహ్యాత్మనః ప్రియతరం కించిదస్తీహ నిశ్చితమ్ ॥**

(మ.భా.అను.ప. 116–16)

అర్థము :– ప్రాణ దానము కన్న మించిన శ్రేష్ఠమైన యన్యదానము లేదు. ఉండబోదు. తన ఆత్మకంటె యీ లోకములో ప్రియతర వస్తువు అన్యమైనది ఏమియును గూడ లేదు. ఇది నిశ్చితము.

**శ్లో॥ సర్వభూతేషు యో విద్వాన్ దదాత్యభయదక్షిణామ్ ।**
**దాతా భవతి లోకే స ప్రాణానాం నాత్ర సంశయః ॥**

(మ.భా. అను.ప. 115–18.)

అర్థము :- ఏ విద్వాన్ సకల జీవులకు అభయ దానమొసంగునో, నతడు యీ లోకములో నిఃసందేహముగా "ప్రాణదాత" యని పిలువబడును- (యన బడును).

శ్లో॥ శరణ్యసర్వభూతానాం విశ్వాస్యః సర్వజన్తుషు ।
అనుద్వేగకరో లోకే న చాప్యుద్విజతే సదా ॥
(మ.భా. అను.ప. 115-28)

అర్థము :- సర్వ ప్రాణులకు శరణము నిచ్చు వాడు, సర్వులకు విశ్వాస పాత్రుడగును. అతడు సంసారములో ఎవరిని ఉద్వేగ (క్షోభ) ములో పడదోయడు. తాను ఎప్పుడు ఎవరిచే ఉద్విగ్నుడు (పీడితుడు) కాడు.

శ్లో॥ దానం భూతాభయస్యాహుః సర్వదానేభ్య ఉత్తమమ్ ।
(మ.భా. శాం.ప. 262-33.)

అర్థము :- ప్రాణులకు అభయదానమిచ్చుట యేదిగలదో యది సమస్త దానములకెల్ల ఉత్తమమైనదిగా చెప్పబడినది.

శ్లో॥ యస్మాదుద్విజతే లోకః సర్పాద్వేశ్మగతాదివ ।
న స ధర్మమవాప్నోతి ఇహలోకే పరత్ర చ ॥
(మ.భా. శాం.ప. 262-31.)

అర్థము :- ఇంటిలో సర్పము ప్రవేశించిన, ఇంటివారందఱు ఎట్లు భయభీతులగుదురో - అట్లు ఏ పురుషుని వలన లోకులు భయభీతులగుదురో అతడు ఇహలోకమందుగాని, పరలోకమందుగాని ధర్మ ఫలము నొందదు. (సుఖము నొందదు).

శ్లో॥ యస్మాదుద్విజతే విద్వన్! సర్వలోకో వృకాదివ ।
క్రోశతస్తీరమాసాద్య యథా సర్వే జలేచరాః ।
సభయం సర్వభూతేభ్యః సంప్రాప్నోతి మహామతే ॥
(మ.భా. శాం.ప. 262-25)

**అర్థము :-** హే మహామతే! హే విద్వన్! ఏ విధముగా నదీతీరమున కోలాహలము జేయు మనుష్యులకు భయపడి జల చరములన్నియు లోనికెళ్ళి దాగుకొనునో, మరియు ఎట్లు తోడేలును చూసిన తోడనే మేకలు, గొఱ్ఱెలు భయగ్రస్తమై, దిక్కుదోచక గడగడ వణకునో, అట్లే యే మనుష్యుని వలన లోకులు భీతి జెందెదరో - వానికి గూడ సంపూర్ణ ప్రాణులచే భయము సంప్రాప్తించును.

**శ్లో॥ న భూతో న భవిష్యోఽస్తి న చ ధర్మోఽస్తి కశ్చన ।**
**యోఽభయః సర్వభూతానాం స ప్రాప్నోత్యభయం పరమ్ ॥**
( మ.భా. శాం..ప. 262-17.)

**అర్థము :-** ఎవనికి భూత భవిష్యత్తులలో నే కార్యము (చేయదగినది) లేదో, ఎవనికి ఏ ధర్మము యవశిష్టము లేదో, మరియు సర్వభూతములకభయ ప్రదానము జేయునో, నతడు నిర్భయ (మోక్ష) పదవిని బొందును.

నిర్వైరః సర్వభూతేషు య స్స మామేతి పాండవ! (గీత.11-55) హే అర్జున! ఎవడు సర్వ జీవకోటులందు వైరభావము లేని వాడై (చెలుకాడై) యుండునో, నతడు నన్ను పొందును. (ఆత్మ జ్ఞానియై ముక్తి నొందును.)

**శ్లో॥ తపోభిర్యజ్ఞదానైశ్చ వాక్యైః ప్రజ్ఞాశ్రితైస్తథా ।**
**ప్రాప్నోత్యభయదానస్య యద్యత్ఫల మిహాశ్నుతే ॥**
(మ.భా.శాం.ప. 262-28)

**అర్థము :-** తపో యజ్ఞ దానములచే మరియు జ్ఞానసంబంధ ఉపదేశములచే మనుష్యుడు ఈ లోకములో యే యే ఫలములను బొందు చున్నాడో, ఆ ఫలములన్నియు కేవలము యభయదానముచే ప్రాప్తించును.

**శ్లో॥ జీవితం హి పరిత్యజ్య బహవః సాధవో జనాః ।**
**స్వమాంసైః పరమాంసాని పరిపాల్య దివంగతాః ॥**
( మ.భా. అను.ప. 114-18)

**అర్థము :-** ఉశీనర, శిబి చక్రవర్తి మొదలగు యనేక శ్రేష్ఠపురుషులు యితర ప్రాణులను రక్షించుటకొఱకు తమ ప్రాణములను సహితము త్యజించి, స్వమాంసముచే నితరుల మాంసమును రక్షించి స్వర్గమునకు వెళ్ళిరి. ఈ విషయములో మహాభారతము వనపర్వము - తీర్థయాత్రా పర్వము 131 అధ్యాయము చూడండి.

అభయదానోత్సాహియైన ధర్మస్వరూపుడైన శ్రీరామచంద్ర ప్రభువు యొక్క ప్రతిజ్ఞను గనండి.

**శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ ॥**
(శ్రీమద్వాల్మీకి రామాయణము. 6-18-33)

**అర్థము :-** ఎవరు ఒక్కసారి సర్వాత్మ భావముచే "నేను నీ వాడను" అని నన్ను పరిపూర్ణముగా శరణుజొచ్చి యాచించునో నతనిని సర్వ భూతముల నుండి నిర్భయునిగా జేయుదును. ఇది నాయొక్క ప్రతిజ్ఞ.

కావున "న హింస్యాత్సర్వభూతాని" మరియు "అహింసా పరమో ధర్మః" యను శాస్త్రమును తూచ తప్పకుండా నమలు పరుస్తూ, సకల భూతకోట్లకు అభయదానమొసంగి యే ప్రాణి మాంసమును గూడ భక్షించక, సర్వదా పరిత్యజించి శ్రీపాండురంగస్వామి కృపకు పాత్రులై, స్వస్వరూపమును యథార్థముగా నెఱింగి, పునరావృత్తిరహితమగు పరమ పదవిని (మోక్షమును) బొంద వలయును.

**21.అభంగము :-**

**ఆహార నిద్రే న లగె ఆదర ।**
**ఆపణ సాదర తోచి హెూయ ॥1॥**

**పరిమితి వీణ బోలణేం తేం వాయా ।**
**ఫార థోడేం కాయాపిండ పీడీ ॥2॥**

**సమాధాన త్యాచేం తోచి ఏక జాణేం ।**
**ఆపులియే ఖుణే పా వోని యాం ॥3॥**

**తుకా మ్హణే హెూయ పీడా తేం న కరీం ।**
**మగ రాహే పరీ భలతీయే ॥4॥ (2438)**

ప్ర.ప :- ఆహార = ఆహారము; (మరియు) నిద్రా = నిద్ర ; (వీటి యందధికమైన) ఆదర = ఆసక్తి ; నలగె = ఉండరాదు (యుక్తము కాదు; అవి) ఆపణ = స్వభావముగానే (నీవద్ద); సాదర = విద్యమానమై(ఉన్నవి, కావున) తోచి = వాటంతట అవే ; హెూయ = కలుగును ; పరిమితీ వీణ= మర్యాదను మించి ; బోలణే = మాట్లాడుట ; వాంయా = వ్యర్థము ; (అది) థోడే - కొద్దిగనో ; ఫార = గొప్పగనో ; కాయాపిండ = శరీరమునకు; పీడీ= పీడించును. 2. (మనుష్యుడు) సమాధాన = సమాధానమును (ఆత్మసాక్షాత్కారమును); పావోనియాం = పొంది; ఆపులియే = తనయొక్క; త్యాచే = ఆస్థితికి సంబంధించిన ; ఖుణేం = చిహ్నములను, తోచి = అతడే; ఏక = ఒక్కడు (మాత్రమే); జాణే = తెలియును. 3. తుకా మ్హణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు. (ఏది చేసిన యితరులకు) ; పీడాహెూయ = దుఃఖము గలుగునో; తే = దానిని ; నకరీ = చేయకుము; మగ = అటుపైన; (నీవు) భలతీయే = ఏవిధమైన; పరీ = స్థితిలో ; రాహే = ఉన్నాగాని (ఏమియు నభ్యంతరము లేదు). 4.

**తా॥** ఆహారము మరియు విషయములలో నత్యధిక యాసక్తి పెట్టుకోరాదు. అధికముగా తినాలి, అధికముగా నిద్రించాలి యను నపేక్ష కూడదు. ఎందువల్ల ననగా? నిద్రాహారములు కావాలనుకున్నప్పుడు నవి నీవద్దనే స్వాభావికముగానే యున్నవి గదా! అట్లైననిక వాటిపై నింత యాసక్తి యెందులకు? 1. మర్యాద (హద్దు)ను మీరి మాట్లాడుట వ్యర్థమగును. దానిచే శరీరమునకు గూడ కొద్దిగానో, గొప్పగానో పీడ (దుఃఖము) తప్పకుండా కలుగును. 2. మనుష్యుడు ఆత్మ సాక్షాత్కారమును లేదా సమాధానమును (పరితృప్తిని) పొందవలెను. అటువంటి స్థితి తనకు కలిగినదా? లేదా? అనునది తనకు మాత్రవే తెలియుగలదు. 3. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు- ఏమి **చేసినచో తనకు గాని ఇతరులకు గాని దుఃఖము గలుగునో అది ఎప్పుడునూ చేయకుము.** అటుపై నీవు ఏ స్థితిలో నున్నప్పటికిని, ఏమియును ఆపత్తి లేదు. 4.

శ్లో ॥ **శ్రూయతాం ధర్మసర్వస్వం శ్రుత్వా చైవావధార్యతామ్ ।**
**ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్ ।** (మహాభారతము)

**అర్థము :-** తనకు యేది ప్రతికూలము (చెడుగా) దోచునో, దానినితరులపట్ల నాచరించకుము. ఇదియే ధర్మ సర్వస్వము. దీనిని నిశ్చయముగా సమ్మతించుము.

**22. అభంగము :-**

**పుణ్య పరోపకార పాప తే పరపీడా ।**
**ఆణిక నా హీ జోడా దుజా యాంసీ ॥1॥**

**సత్య తోచి ధర్మ అసత్య తే అధర్మ ।**
**ఆణిక హేం వర్మ నాహీం దుజేం ॥2॥**

**గతి తేచి ముఖీం నామాచే స్మరణ ।**
**అధోగతి జాణ విన్ముఖతా ॥3॥**

**సంతాంచా సంగ తోచి స్వర్గవాస ।**
**నరక తో ఉదాస అనర్గళా ॥4॥**

**తుకా మ్హణే ఉఘడేం ఆహే హిత ఘాత ।**
**జయాంజేం ఉచిత కరా తైసేం ॥5॥ (2269)**

ప్ర.ప :- పరోపకార = పరోపకారము (చేయుట) ; పుణ్య = పుణ్యము, పరపీడా = ఇతరులను పీడించుట (ఏది గలదో) ; తే = అది ; పాప = పాపమునకు (హేతువగును) ; యాం సీ = ఈ పాప పుణ్యములకు; (ఈజగత్తులో) ఆణిక = వేరైనది ; దుజా = రెండవది ; జోడా = సమానమైనది; నాహీం = లేదు ; 1. సత్య = వేదవిహిత సత్యాచరణ (ఏదిగలదో); తోచి= అదియే ; ధర్మ = ధర్మము ; అసత = వేదనిషిద్ధ అసత్యాచరణ (ఏది గలదో) తేం = అది ; అధర్మ = అధర్మము ; హేం= ఈధర్మాధర్మముల (కంటె); ఆణిక = వేరగు ; దుజేం = రెండవ ; వర్మ = రహస్యము ; నాహీం= లేదు. 2. ముఖీ = ముఖము నుండి; నామాచే = హరినామము యొక్క ; స్మరణ = స్మరించుట (ఏదిగలదో); తేచి = అదియే; గతి = సద్గతి; విన్ముఖతా= హరినామము నుచ్చరింపకుండుట(యేది గలదో= అదియే); అధో గతి = అధోగతి(యని) ; జాణ =తెలియండి. 3. సంతాంచా = సత్పురుషుల యొక్క; సంగ = సహవాసమే ; తోచి = అదియే ; స్వర్గవాస= స్వర్గవాసము ; (వారి పట్ల) ఉదాస = ఉదాసీనముగా నుండుట (యేది గలదో); తో = అది ; అనర్గళా = అప్రతిబంధమైన; నరక = నరకము. 4. తుకా మ్హణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు ; హిత = కళ్యాణము; ఘాత - అకళ్యాణము; ఉఘడేం= స్పష్టముగా; ఆహే = ఉన్నది; జయాం = ఎవరికి ; జేం = ఏది;

ఉచిత = యోగ్యమనిపించునో; తైసేఁ=అట్లే ; కరా = చేయండి. 5.

తా॥ నీతి శాస్త్ర దృష్టి చేత మనో వాక్కాయములచే మరియు ధనము చేత పరోపకారము చేయుట గొప్ప పుణ్యము. మరియు నితరులను దుఃఖ పెట్టుట గొప్ప పాపము. ఈ పుణ్యపాపములకు జగత్తులో మరి యొకటి సాటిలేదు. వాటికి సాటి అవియే.

శ్లో॥ అష్టాదశ పురాణేషు వ్యాసస్య వచనద్వయమ్ ।
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్ ॥ 1.

పూర్వ మీమాంసా శాస్త్ర దృష్టిచేత వేదవిహిత సత్య ఆచరణయే ధర్మము. వేదనిషిద్ధ అసత్య ఆచరణయే అధర్మము. ఇంత కంటె ధర్మాధర్మములకు వేరే రహస్యము లేదు. 2. భక్తి శాస్త్ర దృష్టిచే హరి నామ చింతనమే సద్గతికి కారణము. మరియు హరి నామ విముఖమే అధోగతికి హేతువు అని తెలియండి. 3. వేదాంత శాస్త్ర దృష్టిచేత సత్పురుషుల సహవాసములో జ్ఞాన సంపాదనము చేయుటయే స్వర్గవాసము. మరియు వారిపట్ల ఉదాసీనమై అనాత్మ పదార్థములచే తాదాత్మ్యము నొందుటయే అప్రతిబంధమైన నరకవాసము. 4. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు – ఈప్రకారముగా తన యొక్క హితము లేదా అహితము ఎందులో నున్నదో, పై విచారము (వివేచనము) వలన స్పష్టమగు చున్నది. కావున ఎవరికి ఏది యోగ్యమనిపించునో, దానినాచరింప వచ్చును. 5. సారాంశమేమన? నీతి శాస్త్రము, పూర్వ మీమాంసాశాస్త్రము, భక్తి శాస్త్రము, వేదాంతశాస్త్రము - వీటి నన్నిటిని ప్రమాణముగా స్వీకరించి పరోపకారాది సత్కార్యములు, వేదవిహిత సత్య ఆచరణ, హరినామస్మరణ, సత్సాంగత్యము మరియు అధ్యాత్మ జ్ఞాన సంపాదనము చేయు వాడే నిజమైన ధార్మికుడు మరియు వాస్తవముగ వాని కళ్యాణమగునని తెలియవలెను.

శ్లో॥ శ్రుతిస్మృత్యుదితం ధర్మ మనుతిష్ఠన్హి మానవః ।
ఇహ కీర్తి మవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్ ॥
(మ.స్మృ. 2-9)

అర్థము :- మానవుడు శ్రుతిస్మృత్యుక్త ధర్మము ననుష్ఠించుచు ఇహలోకములో కీర్తి (యశస్సు)ను, పరలోకమున ధర్మానుష్ఠాన జన్య ఉత్కృష్ట ఫలము స్వర్గాపవర్గాది సుఖమును పొందును. ఇట్లు గుణ కల్పన చేత శ్రుతిస్మృత్యుదిత ధర్మము ననుష్ఠింపవలయునని విధి చెప్పబడినది.

సు.వ్యా :- విశ్వ వ్యవస్థ చక్కగా జరుగుటకు పరోపకారము అత్యంతావశ్యకమున్నది. ఎందుకనగా? ప్రాణుల యొక్క జీవనము పరస్పరాశ్రితమై యున్నది. ఎట్లనగా? తల్లి ఒకవేళ పుత్రుని పోషించని యెడల పిల్లవాని దశ ఏమిటో విచారించుడు. వృద్ధాప్యంలో కుమారుడు తల్లిని పోషించని యెడల ఆ మాతృ శ్రీ యొక్క మనుగడ యేమిటి? కావున, ఎప్పుడైతే మనము ఇతరుల సహకారమును, లేక ఉపకారమును పొందు చున్నామో, అలాంటప్పుడు యితరులకుపకారము చేయుట గూడ మన కర్తవ్యమని గుర్తించవలయును.అలాగే ఆకాశాది పంచభూతాత్మక ప్రకృతి, వృక్షములు, పశువులు, పక్షులు మొదలగు ప్రాణుల వల్ల గూడ మనకు కొద్దిగానో, గొప్పగానో ఉపకారము జరుగుచున్నది. అందువలన వాటికి ప్రత్యుపకారము జేయుట మన కర్తవ్యధర్మముగా నెంచవలయును. ఈ సత్యమును గుర్తించి యథాశక్తి మనోవాక్కాయమును మరియు ధనమును యితరుల సుఖమునకు, వారి యౌన్నత్యమునకుపయోగించవలయును.

శ్లో॥ ఆత్మార్థం జీవలోకేఽస్మిన్ కో న జీవతి మానవః ।
పరం పరోపకారార్థం యో జీవతి స జీవతి ॥

అర్థము :- ఈ లోకములో తన కోసము యే మనుష్యుడు జీవించుట లేదు? సమస్త జీవులు తమ కోసము జీవిస్తున్నారు. కాని, యెవరు యితరుల కోసము జీవించునో, వారి జీవితము సఫలము. (సార్థకము) అగుచున్నది.

శ్లో॥ పరోపకార శూన్యస్య ధిఙ్మనుష్యస్య జీవితమ్ ।
యావన్తః పశవస్తేషాం చర్మాప్యుపకరిష్యతి ॥ (శార్ఙ్గధర పద్ధతి)

అర్థము :- పరోపకారరహిత మనుష్యుల యొక్క జీవితమునకు ధిక్కారమగు గాక! ఎందుకనగా? పశువులనబడు ప్రాణులు సహితము మనుష్యులకు వాటి చర్మమునిచ్చి యుపకారము చేయుచున్నవి.

శ్లో॥ పరోపకారః కర్తవ్యః ప్రాణైరపి ధనైరపి ।
పరోపకారజం పుణ్యం న స్యాత్ క్రతుశతైరపి ॥

అర్థము :- ధన మాన ప్రాణములు సమర్పించియైనను పరోపకారము జేయుట మానవమాత్రుల కర్తవ్యముగా నెఱుంగవలెను. ఎందుకనగా? వందల కొలది యజ్ఞముల పుణ్యము గూడ పరోపకారజన్య పుణ్యమునకు తులతూగదు.

పరోపకారమనగా యితరులకుపకారము జేయుట. కాని యితరుల కంటె తనకే యత్యధిక ఉపకారము జరుగుచున్నది. ఏల యనగా? పరోపకారముచే పుణ్యముత్పన్న మగును. ఆ పుణ్యముచే సర్వ ప్రకారముల సుఖములు ప్రాప్తించును. ఎవరికి యుపకారము జేయబడుచున్నదో, వారికి యల్పము మరియు తాత్కాలిక మగు సుఖము, విశ్రాంతి లభించును. కాని, యుపకారము జేయు వానికి యత్యధికము మరియు దీర్ఘకాలిక సుఖము లభించును.

శ్లో॥ పరోపకరణం యేషాం జాగర్తి హృదయే సతామ్ ।
నశ్యన్తి విపదస్తేషాం సంపదః స్యుః పదే పదే ॥ (చాణక్య నీతి)

అర్థము :- ఏ సజ్జనుని యొక్క హృదయము ఎల్లప్పుడు యితర ప్రాణులకుపకారము (పరోపకారము) చేయవలయునను యిచ్ఛగలిగి యుండునో, నతని విపత్తులు వినష్టమగును మరియు అడుగడుగున నతనికి సంపత్తి ప్రాప్తమగును.

శ్లో॥ పిబన్తి నద్యః స్వయమేవ నామ్భః ।
స్వయం న ఖాదన్తి ఫలాని వృక్షాః ॥
ఖాదన్తి సస్యం న చ వారివాహాః ।
పరోపకారాయ సతాం విభూతయః ॥

శ్లో॥ పరోపకారాయ ఫలన్తి వృక్షాః ।
పరోపకారాయ వహన్తి నద్యః ॥
పరోపకారాయ దుహన్తి గావః ।
పరోపకారార్థ మిదం శరీరమ్ ॥

అర్థము :- నదులు స్వయముగా నీటిని సేవించవు. వృక్షములు స్వయముగా ఫలములను భుజించవు. మేఘములు స్వయముగా సస్యములను (అన్నమును) తినవు. వీటి జీవనము యితరులకే యంకితము. ఇట్లే సజ్జనుల యొక్క సంపత్తి (ధన, మాన, ప్రాణాది) సర్వము పరోపకారార్థమే యగును.

వృక్షములు పరోపకారము కొఱకే ఫలించును. నదులు పరోపకారము కొఱకే ప్రవహించును. గోవులు పరోపకారార్థమే పాడిని యిచ్చుచున్నవి. ఈ శరీరము పరోపకారార్థమే ఉన్నది.

శ్లో॥ భవన్తి నమ్రాస్తరవః ఫలోద్గమై
ర్నవామ్బుభిర్దూర విలమ్బినో ఘనాః ।
అనుద్ధతాః సత్పురుషాః సమృద్ధిభిః
స్వభావ ఏవైష పరోపకారిణామ్ ॥
(అభిజ్ఞాన శాకుంతలము 5-12) /భర్తృహరి నీతి శతకము-71)

అర్థము :- ఆమ్రాది (మామిడి మొదలగు) వృక్షములు సమృద్ధిగా ఫలించినపుడు క్రిందికి వంగియుండును. నూతన జలముచే పరిపూర్ణమై వర్షించుటకు సన్ముఖమైన మేఘము చాలా దూరముగా, భూమికి సమీపముగా వ్రేలాడబడి యుండును. సత్పురుషులు ఐశ్వర్య ప్రాప్తిచే వినమ్రులై యుందురు. ఈ నమ్రత పరోపకారుల యొక్క స్వభావమే యైయున్నది. వారికి యెప్పుడు గూడ అభిమానముండదు. ఔద్ధత్యమునకు కారణము అభిమానము. అభిమాన రహిత వ్యక్తికి యనుద్ధత(నమ్రత) స్వభావమై యుండును. ఇందు వలన ఐశ్వర్యవంతులైన సజ్జనుల నమ్రత గల వ్యవహారము, వృక్షములయొక్క మరియు మేఘముల యొక్క వంగుట యేగి గలదో, ఇది స్వాభావికమని యెఱుంగ వలయును.

శ్లో॥ పద్మాకరం దినకరో వికచంకరోతి
చంద్రో వికాసయతి కైరవ చక్రవాలమ్ ।
నాఽభ్యర్థితో జలధరోఽపి జలం దదాతి,
సన్తః స్వయం పరహితే విహితాభియోగాః ॥
( భర్తృహరి నీతిశతకము - 74)

అర్థము :- ఎవరి యాచనను గూడ నపేక్షింపకయే సూర్యుడు కమలములను వికసింప జేయును. చంద్రుడు కలువలను వికసింప జేయును. అట్లే మేఘము యెవరి యభ్యర్థనము (ప్రార్థన)ను యపేక్షింపకయే

నీటిని కురియును(వర్షించును). అదే విధముగా సజ్జనులు యెవరి ప్రేరణ లేకుండగనే పరహితము (పరోపకారము) నందు స్వయముగానే ప్రవృత్తులగుదురు. ఇది వారి స్వభావమని దెలియవలెను.

**శ్లో॥ శ్రోత్రం శ్రుతేనైవ న కుండలేన**
**దానేన పాణిర్నతు కంకణేన ।**
**విభాతి కాయః కరుణాపరాణాం,**
**పరోపకారై ర్నతు చందనేన ॥**

(భర్తృ హరి నీతిశతకము - 72)

**అర్థము :-** చెవులు శాస్త్రశ్రవణము చేతనే సుశోభితమగును, కాని కుండలములను ధరించుటచే గాదు. సత్పాత్రులకు దానము జేయుట చేతనే చేతులు శోభించునుగాని, కంకణములను ధరించుటచే గాదు. కరుణాపరాయణులైన, దయాశీలురైన పురుషుల యొక్క శరీరము పరోపకారముచే శోభించును గాని, చందనాది లేపనములచే గాదు. కుండలములు, కంకణములు మరియు చందనాదులు కాలాంతములో నశించిపోవును. కాని సత్పురుషుల యొక్క శాస్త్ర జ్ఞానము, దానము మరియు పరోపకారాది శుభలక్షణము లేవి గలవో యవి స్వాభావికములై శాశ్వతముగా నుండగలవు.

నిర్మల హృదయుడు, ఇహపరలోకములలో నవ్యయ యశస్సును పొందినవాడు, సకల భూతముల హితమును గోరువాడు మరియు మహాత్ముడునగు రంతిదేవుడు భగవంతున్ని యీ విధముగా కోరుకున్నాడు.

**శ్లో॥ న కామయేఽహం గతిమీశ్వరాత్పరా**
**మష్టర్ధి యుక్తా మ పునర్భవం వా ।**

**ఆర్తిం ప్రపద్యేఽఖిలదేహభాజా**
**మన్తః స్థితో యేన భవన్త్య దుఃఖాః ॥**
(శ్రీమద్భాగవతము - నవమస్కంధము. 21-12)

**అర్థము :-** నేను భగవంతున్ని అష్టసిద్ధులతో యుక్తమగు పరమగతిని గోరను. పునర్జన్మ రాహిత్య మగు మోక్షమును గూడ కోరను. మరేమనగా? నేను సంపూర్ణ ప్రాణుల హృదయములలో ఉండాలి, మరియు వారి సకల దుఃఖములను నేనే సహించవలయును. దానితో యే ప్రాణికి గూడ దుఃఖము కలుగకుండు గాక!

పరోపకార హృదయము గల మహాత్ములు వారు స్వయముగా దుఃఖమును సహించి యితరులకు సుఖమును చేకూర్చుటకు మనో వాక్కాయములచే సర్వ విధముల ప్రయత్నించుదురు కావున -

**శ్లో॥ యేన కేన ప్రకారేణ యస్య కస్యాపి దేహినః ।**
**సంతోషం జనయేత్ప్రాజ్ఞః తదేవేశ్వరపూజనమ్ ॥**

**అర్థము :-** బుద్ధిమంతుడైనవాడు యేదో నొక ప్రకారముచే యేదోనొక ప్రాణికి సంతోషమును గలిగించవలయును. అదియే ఈశ్వరారాధన యగును.

**శ్లో॥ ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।**
(గీత. 18-61)

**అర్థము :-** ఓ అర్జునా! ఈశ్వరుడు సకల జీవుల యొక్క హృదయ దేశములో వసించి యున్నాడు.

కావున, మనుష్యుడు యే ప్రకారముచేనైనను మనో వాక్కాయము లచే, ధన మాన ప్రాణములర్పించి యైనను పరహితము (పరోపకారము)

నందు నిష్కామముచే ప్రవృత్తుడైనచో నది యీశ్వర పూజనము, ధర్మ పరిపాలనమునూ యగును. తద్వారా యీశ్వరానుగృహీతుడై, యద్వైత వాసన పొడమి, కాలాంతరములో ముక్తి కాంతకు ప్రీతి పాత్రుడగును.

**23. అభంగము :-**

**శ్మశాన తే భూమీ ప్రేతరూప జన ।**
**సేవా భక్తి హీనగ్రామవాసీ ॥1॥**

**భరతీల పోటేం శ్వానాచియా పరీ ।**
**వస్తీ దిలీ ఘరీం యమదూతాం ॥2॥**

**అపూజ్య లింగ తెథే అతిత నేఘే థారా ।**
**ఐసీ వస్తీ చోరాం కంటకాంచీ ॥3॥**

**తుకామ్హణే నాహీం తావీ తీథ మతీ ।**
**యమాచీ నిశ్చితీ కుళవాడీ॥4॥ (48)**

ప్ర.ప :- తే = ఆ; భూమీ = భూప్రదేశము ; శ్మశాన = స్మశానము; (మరియు ఆ భూమి యందు నివసించు) జన = జనులు ; ప్రేతరూప = పీనుగులను పీక్కు తినే ప్రేతములతో సమానులు ; (వారెవరనగా) సేవా = అతిథి సేవా సంతు సేవా (మరియు) ; భక్తి = ఈశ్వరభక్తి ; హీన = లేని; గ్రామవాసీ = గ్రామవాసులు. 1. (ఈ లోకులు) శ్వానాచియా = కుక్కల యొక్క పరీ = పగిది ; పోటే = పొట్టను ; భరతీల = నింపు కుంటారు. (కాని) ఘరీ = (వారి యొక్క) ఇంటియందు; యమదూతాం = యమదూతలకు ; వస్తీ = స్థానమును ; దిలీ = ఇచ్చారు. 2. (ఏగ్రామములో) లింగ = శివలింగము లేదా విష్ణు ప్రతిమా ; అపూజ్య = పూజింపబడదో ;

(మరియు) అతితి = అతిథి; థారా = ఆశ్రయమును; నేఘే = గ్రహించడో; ఐసీ = ఇటువంటి (గ్రామములో); చోరాం = దొంగల యొక్క ; (మరియు) కంటకాంచీ = ముండ్ల యొక్క అనగా దుర్జనుల యొక్క ; వస్తీ = నివాసమగును. 3. తుకా మ్హణే = శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు; (యే) తీథీ = తిథియందు; (ఏధర్మ కృత్యము చేయాలో) మతీ = బుద్ధి, లేదా విచారణా; రావీ నా హీం= జ్ఞానము లేదు. (ఇటువంటి మనుష్యులు) యమాచీ = యముని యొక్క ; కుళవాడీ = కులవాడలో; (ఉంటారు. ఇది) నిశ్చితీ = సందియము లేదు. 4.

**తా॥** ఆ భూమి స్మశానము మరియు ఆ లోకులు ప్రేతరూపములు ఎవరనగా? ఏగ్రామములో నివసించు ప్రజలు అతిథి సేవా, మహాత్ముల సేవా మరియు ఈశ్వరభక్తి చేయరో – ఆ గ్రామము స్మశానము మరియు ఆగ్రామ ప్రజలు పీనుగులను పీక్కు తినే ప్రేత రూపములు అని తెలియాలి. 1. ఆ లోకులు ఏదో ఒక ఉద్యోగము చేసుకొని కుక్కల వలె వారి పొట్టను మాత్రమే నింపుకుంటారు. కాని భావికాలములో వారి ఇంటి యందు యమదూతలకు స్థానమిచ్చుచున్నామని తెలియజాలకున్నారు. 2. ఏగ్రామములో పూజించుటకు యోగ్యమైన శివలింగము గాని విష్ణు ప్రతిమగాని పూజింపబడదో, మరియు ఏ అతిథి గూడ ఆ గ్రామము నాశ్రయించడో అనగా ఏ గ్రామములో అతిథిసేవ చేయబడదో, ఆ గ్రామము దొంగలకు మరియు దుర్జనులకు నివాసమగును. 3. శ్రీతుకారాం మహారాజు గారంటున్నారు – ఏ తిథి యందు ఏ ధర్మ కార్యము చేయాలో తెలియని మూర్ఖ మనుష్యులు యమపురి వీథుల్లో ఉండగలరు– ఇందులో నిసుమంతయు సందేహము లేదు.

24. అభంగము :-

దుర్జనాంచీ గంధీ విష్ఠేచియే పరీ ।
దేఖోనియా దూరీ వ్హావేం తయా ॥1॥

ఆ ఇకా హెూ తుమ్హీ మాత హే సజ్జన ।
కరూ సంఘష్టననయే బోలోం ॥2॥

దుర్జనాచేం అంగీం అఖండ విటాళ ।
వాణీ రజస్వలా స్రవే తైసీ ॥3॥

దుర్జనా చే భయ ధరావేం త్యాపరీ ।
పిసాళల్యా వరీ ధాంవే శ్వాన ॥4॥

దుర్జనా చా భలా నవ్హే అంగసంగ ।
బోలిలాసే త్యాగ దేశ త్యాచా ॥5॥

తుకా మ్హణే కితీ సాంగావేం పృథక ।
అంగ కుంభీపాక దుర్జనాచేం ॥6॥ (92)

ప్ర.ప :- దుర్జనాచీ - దుర్జనుని యొక్క (దుర్గుణము) ;విష్ఠేచియే= మలము యొక్క ; పరీ = పగిది ; గంధీ = దుర్గంధము (వచ్చును); (కావున సజ్జనులు, వానిని) దేఖోనియా - చూసి; (వెంటనే) తయా = వాని నుండి ; దూరీ - దూరము; వ్హావే = కావలెను. 1. సజ్జన హెూ! = ఓ సజ్జనులారా!; తుమ్హీ = మీరు ( నా యొక్క); హే మాత = ఈ మాటలు ; ఆ ఇకా = వినండి; (మీరు దుర్జనలతో) సంఘష్టన = సంఘటన, సహవాసము; కరూం నయే = చేయకండి ; (ఇంతేగాదు) బోలోం(నయే)= మాట్లాడకండి. 2. దుర్జనాంచే = దుర్జనుల యొక్క ; అంగీ = శరీరమంతా; అఖండ = అఖండముగా ; విటాళ = స్త్రీ యొక్క ఋతుకాల దుర్గంధ ముండును; (ఏ

విధముగా) రజస్వలా = రజస్వలా స్త్రీ ; (అశుద్ధమును) స్రవేం=స్రవిస్తూ (ఉంటుందో) ; తైసీ = అట్లే ; (దుర్జనుని యొక్క ముఖము నుండి ఎల్లప్పుడు అశుద్ధమైన) వాణీ = వాణి (శబ్దము వెలువడుచుండును)3. (ఏ విధముగా) శ్వాన = కుక్క ; పిసాళల్యావరీ = వెఱ్ఱిలేచినపుడు; (ఎవరి వెంటను గూడ) ధాంవే = పరుగెత్తునో; త్యాపరీ = అదేవిధముగా; దుర్జనాచే = దుర్జనుల యొక్క (స్వభావమై యున్నందున, వారిపట్ల) భయ = భయమును; ధరావేం= ధరించవలెను (కలిగి యుండవలెను)4. దుర్జనా చా = దుర్జనుల యొక్కం అంగసంగ = శరీర స్పర్శగూడ ; భలా = మంచిది ; నవ్హే = కాదు; (ఇంతే గాకుండా దుర్జనుడు) దేశ = (ఏ దేశమందుండునో; త్యాచా = అతని యొక్క (ఆ ప్రదేశమును గూడ సజ్జనుడైనవాడు) ; త్యాగ = వదిలి వేయ వలెనని ; బోలిలాసే = శాస్త్రము చెప్పుచున్నది. 5. తుకా మ్హణే = శ్రీ తుకారాం మహారాజు గారంటున్నారు. (దుర్జనుల గూర్చి) పృథక - పృథక్ గా (వేరు వేరుగా) ; కితీ = ఎంతని ; సాంగావేం= చెప్పాలి. దుర్జనాచేం= దుర్జనుని యొక్క ; అంగ = (సంపూర్ణ) శరీరమే ; కుంభీపాక = కుంభిపాక నామక నరకము. 6.

**తా॥** దుర్జనుల యొక్క దుర్గుణము మలము పగిది దుర్గంధము వచ్చును. అందువలన వానిని చూసిన వెంటనే సజ్జనులు దూరముగా వెళ్ళవలెను. 1. ఓ సజ్జనులారా! నా ఈ మాటవినండి. దుర్జనుల యొక్క సహవాసము చేయకండి. వానితో మాటగూడ మాట్లాడకండి. 2. దుర్మార్గుని శరీరమంతా అఖండముగా స్త్రీ యొక్క ఋతుకాలపు అశుద్ధముతో సమానమగు దుర్గంధముండును. ఏవిధముగా రజస్వలాస్త్రీ అశుద్ధమును స్రవిస్తూ ఉంటుందో అట్లే దుష్టుని యొక్క ముఖము నుండి ఎల్లపుడు అశుద్ధమైన వాణి వెలువడు చుండును. 3. పిచ్చి పట్టిన వెఱ్ఱి కుక్క ఏవిధముగా

ఎవని వెంట గూడ పరుగిడుతుందో, అట్లే దుర్జనుని స్వభావమై యున్నందున, వానిపట్ల భయము కలిగి యుండవలెను. 4.

**శ్లో॥ శకటం పంచహస్తేషు, వాజినం దశ హస్తినామ్ ।**
**గజం హస్త సహస్రేషు దుర్జనం దూరతస్త్యజేత్ ॥** (నీతి శాస్త్రము)

దుర్మార్గుని యొక్క శరీరస్పర్శ గూడ మంచిదిగాదు. ఇంతే గాదు దుర్జనుడు ఏ ప్రదేశముననుండునో, ఆ ప్రదేశమును గూడ వదిలిపెట్టాలి అని పై శాస్త్రము నుడువు చున్నది. 5. శ్రీతుకారాం మహారాజు గారంటున్నారు - దుర్జనులను గూర్చి నేను ఎంతని వేరు వేరుగా చెప్పాలి. ఒక్కమాటలో చెబుతాను వినండి. దుర్జనుని యొక్క శరీరమే ప్రత్యక్ష కుంభీపాక నరకమని తెలియండి. 6.

**25.** అభంగము :-

సూకరాసీ విష్ఠా మానే సావకాశ ।
**మిష్టాన్నాచీ త్యాసకాయ గోడీ ॥1॥**

**తేవీం అభక్తాసీ ఆవడే పాఖండ ।**
**న లగే త్యా గోడ పరమార్థ ॥2॥**

**శ్వానాసీ భోజన దిలే పంచామృత ।**
**తరీ త్యాచేం చిత్త హాడావరీ ॥3॥**

**తుకా మ్హణే సర్పా పాజిలీయా క్షీర ।**
**వమితా విఖార విష ఝాలేం ॥4॥ (446)**

ప్రతి పదార్థము :- సూకరాసీ = పంది (కి); విష్ఠా = మలము; సావకాశ = శాంతముగా (ప్రీతికరమని); మానే = భావించి (భావన కలిగి

తినును) ; త్యాస = దానికి ; మిష్టాన్నాచీ = షడ్రసోపేతమైన మిష్టాన్నము యొక్క ; కాయ = ఏమి ; గోడీ = తీపి (రుచి). 1. తేవీc = అట్లే; అభక్తాసీ= అభక్తునికి ; పాఖండ = నాస్తికత్వము; ఆవడే = రుచించును ; త్యా = అతనికి ; పరమార్థ = పరమార్థ (మోక్ష) సాధన ; గోడ = తీపిగా (రుచిగా); న లగే = అనిపించదు;2. శ్వానాసీ = కుక్కకు ; పంచామృత = పంచామృత; భోజన = భోజనమును ; దిలే = ఇచ్చినా ; తరీ = గూడ; త్యాచేc= దాని యొక్క ; చిత్త = చిత్తము ; హాడావరీ = ఎముకలపైనే (ఉండును). 3. తుకా మ్హణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; సర్పా = సర్పమునకు ; క్షీర = పాలు ; పాజిలీయా = త్రాగించిన ; (వెంటనే) విఖార = (ఆ) విశైలీ సర్పము ; (త్రాగిన పాలను) వమితా = వాంతి చేసినచో ; విష = (ఆపాలు) విషము ; ఝాలేc = ఆయెను. 4.

తా॥ గ్రామ సూకరమునకు (పందికి) మలమును నెమ్మదిగా తినుటకు ఇష్టమగును. కాని దానికి మిష్టాన్నము యొక్క రుచి తెలియునా? 1. అట్లే అభక్తునకు నాస్తికత్వము ఇష్టమగునే గాని పరమార్థ సాధన, భగవద్భక్తి రుచింపదు. 2. కుక్కకు పంచామృత భోజనము పెట్టినప్పటికి, దాని చిత్తము నీచమైన ఎముకలపైనే యుండును. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు – పాముకు చిక్కటి పాలు పోసినచో, అది త్రాగి, ఒకవేళ వెంటనే వాంతి చేసినచో ఆపాలు విషపూరితమై బయటకు వెడలును. అట్లే అభక్తునికి పరమార్థరూప పాలు త్రాగించినచో, వెంటనే వాని నోటిగుండా నాస్తికత్వ వాదరూప విషమే బయలు వెడలును. 4.

కం॥ **తలనుండు విషము ఫణికిని,**
**వెలయంగ దోకనుండు వృశ్చికమునకుం**
**దల తోక యన్నయుండును,**
**ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ ॥**

శ్లో॥ సర్పః క్రూరః ఖలః క్రూరః సర్పాత్ క్రూరతరః ఖలః ।
మంత్రౌషధివశః సర్పః ఖల కేన నివార్యతే ॥ (చాణక్య నీతి)

తా॥ సర్పము మరియు దుష్టుడు ఇద్దరు క్రూరులే. అయిననూ సర్పము కంటె అధిక క్రూరుడు దుర్మార్గుడు. సర్ప విషము మంత్రౌషధములచే నివారింపబడును, కాని దుష్టుని యొక్క విషమునకు మంత్రము లేదు. మందు లేదు. కావున దుష్టులనుండి దూరముండుటకంటే వేరొండు ఉపాయము లేదు.

26. అభంగము :-

ఐసా హా లౌకిక కదా రాఖవేనా ।
పతిత పావనా దేవరాయా ॥1॥

సంసార కరితా మ్హణతీ హా దోషీ ।
టాకితాం ఆళసీ పోటపోసా ॥2॥

ఆచార కరితా మ్హణతీ హా పసారా ।
న కరితాంనరా నిందితాతీ ॥3॥

సంతసంగ కరితాం మ్హణతీ హా ఉపదేశీ ।
యేరా అభాగ్యాసీ జ్ఞాన నాహీఀ ॥4॥

ధన నాహీఀ త్యాసీ ఠాయీచా కరంటా ।
సమర్థాసీ తాఠా కరితాతీ ॥5॥

బహు బోలో జాతాఀ మ్హణతీ హా వాచాల ।
న బోలతాఀ సకళ మ్హణతీ గర్వీ ॥6॥

భేటిసీ నవ జాతాఀ మ్హణతీ హా నిష్ఠుర ।
యేతాంఘుర బుదవిలేఀ ॥7॥

లగ్నకరూఁ జాతా మ్హణతీ హా దూతలా ।
న కరితా ఝూలా నపుంసక ॥8॥

ని పుత్రికా మ్హణతీ పహా హెూ చాండాళ
పాతకాచేఁ మూళ పోరవడా ॥9॥

లోక జైసా ఓక ధరితాఁ ధరవేనా ।
అభక్తా జిరేనా సంతసంగ ॥10॥

తుకామ్హణే ఆతాం ఆ ఇకా వచన ।
త్యజునియాం జన భక్తీ కరా ॥11॥ (136)

ప్ర.ప :- పతిత పావనా దేవరాయా!; హా = ఈ; లౌకిక = లోకులు; ఐసా = ఇలా ఉన్నారు ; (ఏలనగా?) కదా = ఎప్పుడుగూడ ; రాఖవేనా = సంభాలించుట (అనుసరించుట) చాలా కష్టమగును. 1. (మనుష్యుడు ఒక వేళ) సంసార కరితా = సంసారము చేయుచున్నచో; హా = ఇతడు ; దోషీ= పాపి; (అని)హ్మణతీ = (లోకులు) అంటారు; టాకితాం = (సంసారమును) వదిలేస్తే; ఆళసీ = సోమరి; (మరియు) పోటపోసా = స్వతః పొట్టకు బ్రతకడము తెలియదు (అని అంటారు). 2. ఆచార కరితాఁ = ధర్మాచరణ చేయుచున్నచో; హా = ఇతడు ; పసారా = మిథ్యాచారి ; (అని) హ్మణతీ = అంటారు; న కరితా = ధర్మాచరణ చేయని ; నరా = మనుష్యుని; నిందితాతీ= నిందించెదరు. 3. సంతసంగ కరితా = సత్పురుషులచే సహవాసము చేసినచో; హా = ఇతడు ; ఉపదేశీ = జగద్గురువయ్యాడు (అని); హ్మణతీ = అంటారు; యేరా = సంతసంగతి చేయనిచో ; (ఈ) అభాగ్యాసీ = అభాగ్యునికి; జ్ఞాన నాహీఁ = జ్ఞానము లేదు (కలుగదు అని అంటారు)4. త్యాసీ = అతని ఠాయింాంచా = వద్ద; ధన = ధనము ; నాహీఁ = లేనిచో; కరంటా = దరిద్రుడు (అంటారు); సమర్థాసీ = శ్రీమంతుడిని ; తాఠా = గర్విష్ఠి

(ఉన్నాడని); కరితాతీ = (ఎవరిని లెక్క) చేయడని (అంటారు). 5. బహు = అధికముగా ; బోలో = మాట్లాడుటకు ; జాతా = వెళ్ళినచో ; హా = ఇతడు; వాచాల = వదరుబోతు(అని); హ్మణతీ = అంటారు ; న బోలతాం = మౌనముగా నుండినచో ; సకళ = లోకులందురు ; గర్వీ = గర్విష్ఠి (అని); హ్మణతీ = అంటారు. 6. (ఆప్త ఇష్టులను) భేటిసీ = కలియుటకు; నవజాతా= వెళ్ళనిచో ; హా = ఇతడు ; నిష్ఠుర = నిష్ఠురుడున్నాడని ; హ్మణతీ = అంటారు; యేతాం జాతాం = వచ్చుచు, పోవుచు ఉన్నయెడల; (వీడు) ఘర = ఇల్లు; బుడవిలేఁ = ముంచినాడని (అంటారు). 7. లగ్న కరూ జాతా =పెండ్లి చేసుకొన్నచో; హా = ఇతడు; మాతలా = విషయసంపటుడని; హ్మణతీ అంటారు; న కరితా = చేసుకొనని యెడల; నపుంసక = నపుంసకుడు; జాలా = అయినాడు(అని అంటారు) 8. నిపుత్రికా = సంతానహీనుడైనచో; పహా హెూ = ఏమండోయ్! చూడండి ; (ఇతడు) చాండాళ = చండాలుడు(న్నాడని) ; హ్మణతీ = అంటారు; పోరవడా = అతిగా సంతానమును కనినచో; మూళ = (అత్యధికముగా) పిల్లలు (కలిగినచో); పాతకాచేఁ=(అది) పాపము యొక్క ఫలమని (అంటారు. 9. జైసా = ఏవిధముగా; ఓక = వాంతి వచ్చినప్పుడు ; ధరితాం = ధరించుటకు అనగా ఆపుకొనుటకు (ఎంత ప్రయత్నించినా); ధరవేనా = ఆపుటకు శక్యము కాదో ; (మరియు ఏవిధముగా) అభక్తా = అభక్తునకు ; సంతసంగ = సంతు మహాత్ముల సాంగత్యము ; జిరేనా = జీర్ణింపబడదో ; (అట్లు) లోక= లోకులను (అనుసరించుట కష్టతరము)10. తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; ఆతాం = ఇప్పుడు ; (నా యొక్క) వచన = వాక్కులను ; ఆ ఇకా = వినండి; జన జనుల (యొక్క అపవాదమును) ; త్యజునియాం = వదిలిపెట్టి ; భక్తి కరా = హరి భక్తిని చేయండి. 11.

**తా॥** పతితపావనా! దేవరాయా! విఠలా! ఈ జగత్తులో లోకులను అనుసరించుట, లోకులనుండి రక్షింపబడుట చాలా కష్టముగా నున్నది. లోకులను సంభాలించుట, వారి నుండి జాగరూకులమై యుండుట అశక్యమున్నది. 1. ఒకవేళ మనుష్యుడు సంసారము చేయుచున్నచో - "ఇతడు ఎంతటి పాపాత్ముడు - తప్పి కూడ పరమార్థము చేయడు" అని లోకులు అతనిని అంటారు. ఈ అపవాద భీతిచే సంసారము నొదిలేస్తే - "సోమరిపోతు - స్వతః వాని పొట్ట కొఱకు గూడ సంపాదించుకునే తెలివి లేదు" అని అంటారు. 2. ధర్మాచరణ చేయుచున్నచో అతనిని చూసి "వీడు మిథ్యా చారి, మందిని మోసము చేయుటకు నాటకమాడుచున్నాడు" అని అంటారు. ధర్మాచరణ చేయని మనుష్యులను నిందిస్తుంటారు. 3. సత్సంగము, సత్‌శాస్త్ర అభ్యాసము చేయుచున్నచో "ఇప్పుడు వీడు ఉపదేశము చేయు జగద్గురువైనాడు" అని అంటారు. సరే! సత్సంగము సచ్ఛాస్త్రాభ్యాసము చేయనిచో "ఈ అభాగ్యుడికి సత్సంగము ఏల గడించును? వీడికి జ్ఞానమెలా కలుగును? ఛ.ఛ శక్యము లేదు" అని అంటారు. 4. ఎవరి దగ్గర ధనము లేదో వారిని చూసి "ఈ అభాగ్యుడు పుట్టు దరిద్రుడు" అంటారు. శ్రీమంతున్ని చూసి "వీడు చాలా గర్విష్ఠి, వీడికి ధన మదమున్నది, పేదలను లెక్క పెట్టడు" అని అంటారు. 5. చాలా ఎక్కువగా మాట్లాడితే "వాచాలుడం"టారు. మౌనంగా ఉంటే "అభిమాని" అని అంటారు. 6. ఆప్తులు, ఇష్టులైన వారిని కలుసుకొనుటకు వెళ్ళకుంటే "వాడెంత నిష్ఠురుడు" అని అంటారు. లేక పోవుచూ, వచ్చుచూ ఉన్న యెడల "వీడు వాని ఇల్లును ముంచాడు" అని అంటారు. 7. పెండ్లి చేసుకుంటే "వీడు విషయలంపటుడు" అని అంటారు. పెండ్లి చేసుకోకుంటే వీడికి "మొగతనము లేదు" అని అంటారు. 8. సంతానము కలుగకుంటే "వీడు అతి పాపి" అని అంటారు.

సరే! ఎక్కువగా సంతానము కలిగితే "ఎక్కువగా పిల్లలు పుట్టుట పాపము యొక్క ఫలము" అని అంటారు. 9. వాంతి కలిగినపుడు ఎలా ఆపుకోలేమో, అభక్తుడైన వానికి ఎలా సత్సంగము జీర్ణము గాదో, అట్లే లౌకికులను రక్షించుట, వాని నుండి జాగరూకులమై యుండుట అసమంజసము. 10. శ్రీ తుకారాం మహారాజు గారంటున్నారు – ఓ హరి భక్తులారా! మీరు నా మాటలను ఆలకించండి. లోకాపవాదమునుపేక్షించి చాలా సంతోషముతో, ఆనందముతో "విఠలుని" భజన చేయండి. 11. లోకులు పలుగాకులు గావున వారిని లక్ష్యబెట్టక సద్గురువు మరియు సచ్ఛాస్త్రము నందు పరమవిశ్వాసము నుంచి శ్రీగురుదేవుల ముఖారవిందము నుండి తత్త్వమస్యాది మహా వాక్యార్థమును శ్రవణ, మనన, నిధి ధ్యాసనరూప విచారము చేసి దృఢ అపరోక్ష బ్రహ్మ జ్ఞానమును బడసి మోక్షము నొందుటయే సాధకుని యొక్క కర్తవ్యము.

27. అభంగము :-

జాతో వారణసీ । నిరవీ గాఈ ఘోడే మ్హైసీ ॥1॥
గేలో యేతో నాహీఁ ఐసా । సత్య మానారే భరవసా ॥2॥
నకా కాఢూ మా ఢీఁ పేవేఁ । తుమ్హీ వరళా భూస ఖావేఁ ॥3॥
భికారియాచే పోరీఁ । తుమ్హీ ఘేవూనీ లాగా కారీ ॥4॥
సాంగాల జేవాయా బ్రాహ్మణ । తరీ కాపాల మాఘు మాన ॥5॥
ఓకలియా ఓకా । మ్యాం ఖర్చిలా నాహీఁ రుకా ॥6॥
తుమ్హీఁ ఖావేఁ తాక పాణీ । జతన కరా మాఘే లోణీ ॥7॥
నాహీఁ మాఘేఁ మనీఁ । పోరేఁ రాండా నాగవణీ ॥8॥
తుకామ్హణే నష్ట । హెూతేఁ తైసే బోలే స్పష్ట ॥9॥ (234)

ప్ర.ప :- (నేను) వారాణసీ = వారణాసి (కాశీ)కి; జాతో = వెళ్ళుచున్నాను; (కావున మీకు) గా = ఈ = ఆవులను ; హ్మైసీ = బఱ్ఱెలను; ఘోడే = గుఱ్ఱములను ; నిరవీ = స్వాధీనము చేయుచున్నాను. (చక్కగా రక్షించండి)1. (మీరు) ఐసా = ఇలా (అనుకోండి); గేలో నాహీ = (నేను) యాత్రకు పోలేదు. (అతి త్వరలో తిరిగి) యేతో = వచ్చెదను. (నామాటయందు) భరవసా = విశ్వాసము పెట్టి ; సత్య = సత్యమని ; మానారే – నమ్మండిరా!2. (నేను వెళ్ళిన పిదప) మాఝీ = నాయొక్క ; పేవేఁ = ధాన్యాగారమును ; కాఢూఁ నకా = తీయకండి ; తుహ్మీ = మీకు (తిండికి తిప్పలుగా ఉంటే) వరళా = తౌడు ; భూస = పొట్టు; ఖాలేఁ = తినండి.3. తుహ్మీ = మీరు ; కాఠీ = కఱ్ఱను ; ఘేవూనీ = తీసికొని ; భికారియాచే = అతిథి యొక్క ; పాఠీ = వెనువెంట; లాగా = పడండి (తరిమి కొట్టండి).4. (కదాచిత్ ) బ్రాహ్మణ = బ్రాహ్మణునికి ; జేవాయా= భోజనము పెట్టుటకు ; సాంగాల = చెప్పుదురేమో ; తరీ = అట్లుచేసినచో; మాఝీ = నాయొక్క ; మాన = మెడ ; కాపాల = కోసినట్లగును సుమా ! 5. (నేను తౌడు, పొట్టుతింటే) ఓక = వాంతి (వచ్చి) ; ఓకలియా = కక్కుకుంటే; మ్యాం – నేను ; రుకా = ఒక్క రూపాయి గూడ ; ఖర్చిలా = ఖర్చు; నాహీ = చేయలేదు.6. తుహ్మీ = మీరు ; తాక = చల్ల (మజ్జిగ); పాణీ = నీరు (మాత్రమే ; ఖావేఁ= (తినండి) త్రాగండి ; మాఝేం = నాయొక్క ; లోణీ = వెన్న (మాత్రము) ; జతనకరా = భద్ర పరచండి.7. (నా యొక్క ధనమును) నాగవణీ = దోపిడి చేయు ; (ఈ) రాండాపోరేఁ = అల్లులు అయిన వారి(కి) ఁ మాఝే = నాయొక్క (ధనమునప్పగించి); నాహీఁ= (నేను కాశికి) వెళ్ళను; (అని) మనీఁ= తన మనస్సులో (నిశ్చయించుకుంటాడు).8. తుకా హ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు ; నష్ట = ధనలోభముచే నష్టపోయిన బుద్ధి

గలవాడు ; హెూతే = తన మనస్సులో ఏమున్నదో ; తైసే = అట్లే ; స్పష్ట= స్పష్టముగా ; బోలే = చెప్పెను. 9.

తా॥ ఒకానొక గృహస్థుడు తన కుటుంబ సభ్యులతో ఇలా అంటున్నాడు. ఇప్పుడు నేను వారాణసీ (కాశీ)కి వెళ్ళు చున్నాను. కావున నా యొక్క ఆవులను, బఱ్ఱెలను, గుఱ్ఱములను మరియు నా సర్వస్వమును మీ స్వాధీనము చేయుచున్నాను. వాటిని స్వీకరించి, రక్షించండి. 1. మీరు ఇలా అనెదరేమో – ఏమనగా? నీవు కాశీకి వెళ్ళి వచ్చుటకు చాలా రోజులు పట్టును. అన్ని రోజులు ఈ పశ్వాదులను ఎలా జతనము చేయాలి? కాని ఈ విధమైన దిగులు పడనక్కరలేదు. ఎందుకనగా – "నేను ఇంట్లో నుండి ఎక్కడకు వెళ్ళనే లేదు" అని మీరు అనుకోవాలి. అంత తొందరగా వచ్చేస్తాను. నా మాటల యందు నిజముగా విశ్వాసము ఉంచుడు. 2. నేను తిరిగి వచ్చేసరికి నా ధాన్యాగారమును తెరువకండి. మీకు భోజనమునకు అంతగా ఇబ్బంది (కష్టముగా) ఉంటే తౌడు మరియు ధాన్యము పొట్టు తినండి3. నేను కాశీకి వెళ్ళానని తెలిసి ఇప్పుడైనా భిక్షదొరుకునేమో యని మన యింటికి అతిథులు, బిచ్చగాండ్రు వచ్చెదరేమో, కాని మీరు దుడ్డు కఱ్ఱ చేకొని వారి వెంట పడుడు. ఎంత అరచినాగాని ఒక్క అన్నము కణమును గూడ వడ్డించకండి. 4. నేను వెళ్ళిన పిదప మీకు అవకాశము దొరికింది గదా. అనుకొని కదాచిత్ బ్రాహ్మణులను భోజనమునకు ఆహ్వానించకండి. అటువంటి విశ్వాస ఘాతకము మాత్రము చేయకండి. అలా చేసినచో నా మెడ నరికినట్లే అవుతుంది. 5. నేను ఇంతవరకు ధన ధాన్యరక్షణార్థము చాలా శ్రద్ధ తీసికునేవాడిని. ఒక్కొక్కసారి ధాన్యమును ఖర్చు చేయుట మంచిది కాదని, తౌడు మరియు జొన్నపొట్టు తినేవాడిని దానివల్ల నాకు వాంతులు గూడ అగుచుండెడివి. కాని ఆ వాంతులను ఆపడము కోసము

శాంతి తీసుకురావడానికి ఒక్క పైసగూడ ఖర్చు చేసేవాడిని కాదు. 6. మీరు గూడ నావలెనే మసలుకోండి. నీళ్ళవలె పలుచగా చల్ల చేసికొని త్రాగండి, నా వెన్నను మాత్రము సురక్షితముగా నుంచండి. దానికి చేయి కూడ తాకనివ్వకండి. 7. చివరకు కాశీకి వెళ్ళదలచుకున్న ఆ గృహస్థుడు తన మనస్సులో ఇలా అనుకుంటున్నాడు- "నేను వీరికి ఇంత వివరముగా చెప్పాను. అయినాగాని అతి తిరస్కారబుద్ధి గల, అలక్ష్యమును చూపెడు ఈ నావాళ్ళందరు నా ధనధాన్యమును సంపూర్ణముగా ఖర్చుచేసి, నిశ్చయముగా నన్ను దరిద్రున్ని చేయక మానరు. కావున నా సంపత్తినంతయు నీ అయోగ్యులు మరియు వ్యర్థముగా నతివ్యయము చేయు వారికి స్వాధీనము చేసి, కాశీకి వెళ్ళడము యోగ్యము కాదు" అని మనస్సులో విచారించి, తాను కాశీకి వెళ్ళడమే విరమించుకున్నాడు. 8. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు. ఈ పాపాత్ముడైన చాండాల ధనలోభి తన మనసులోనిది స్పష్టముగా చెప్పుచున్నాడు. సారాంశమేమన లోభము ఉండరాదు. అది నరకమునకు ద్వారమని శ్రీకృష్ణపరమాత్మ చెప్పెను.

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామక్రోధ స్తథా లోభః తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥ (గీతా 16-21)

తా॥ కామము, క్రోధము, లోభము అను నీమూడును మూడు విధములగు నరకద్వారములు. ఇవి తనకు నాశనమును కలుగజేయును. కావున నీ మూడింటిని వదిలివేయ వలయును.

**28. అభంగము :-**

ద్రవ్యాచియా మాగేం కళికాళాచా లాగ ।
హ్మణోనియా సంగ ఖోటా త్యాచా ॥1॥

నిరయాచేం మూళ ఘాలూనియాం మాగేం ।
మాండిలీ ప్రసంగేం కథా పుఢేం ॥2॥

ఆజిచ్యా ప్రసంగేం హోచి లాభ ఘ్యావా ।
పుఢీల భార దేవావరీ ఘాలా ॥3॥

ప్రారబ్ధ కాంహీం న పాలటే సోసేం ।
తృష్ణేచేం హేం పిసేం వాయాంవిణ ॥4॥

తుకా హ్మణే ఘేఈ రాహేంఐసేం ధన ।
సాదర శ్రవణ కరోనియాం ॥5॥ (541)

ప్ర.ప :- ద్రవ్యాచియా = ద్రవ్యము (ధనము)యొక్క ; మాగేం = వెనుక ; కళి = కలిపురుషుని యొక్క (మరియు) ; కాళాచా = కాలుని (మృత్యువు) యొక్క ; లాగ = సంబంధము (ఉన్నది) ; హ్మణోనియా = అందువలన ; త్యాచా = ద్రవ్యము యొక్క ; సంగ = సంబంధము ; ఖోటా= చాలా చెడ్డది. 1. నిరయా చేం = నరకమునకు; మూళ = హేతువు (అయిన ఈ ద్రవ్యము) ; మాగేం=వెంబడి (వెనుక) పడుట ; ఘాలూనియా = మానేసి (వెనుకకు తిరిగి) ; ప్రసంగేం = ఈ మనుష్య దేహ ప్రసంగమునందు. (విద్యమానమున్నప్పుడు) ; పుఢే = ఇకముందు ; కథా = హరికథా ; మాండిలీ = ఆరంభించవలెను. 2. ఆజిచ్చా ప్రసంగీ = ఈ నాటి ప్రసంగమునందు. (ఈ దేహమున్నప్పుడే, ఇదే క్షణమునందు) ; హోచి = ఇదే (హరికథా శ్రవణము యొక్క); లాభ = ప్రయోజనమును ; ఘ్యావా = తీసికొనవలెను (పొందవలెను); పుఢీల = మున్ముందు ; భార = సంసారభారమును ; దేవావరీ = శ్రీవిఠలునిపై ; ఘాలా = వేయండి. (ఉంచండి). 3. (ధన సంచయమునకెంత యత్నించినను) ప్రారబ్ధ = ప్రారబ్ధ కర్మ మాత్రము ; కాంహీం = ఏ ప్రయత్నము చేతను ; పాలటె = అన్యథా

(విపరీతముగా) ; నసోసేం = జరుగదు.(కాదు) ; (కావున) హే = ఈ ద్రవ్యము గూర్చిన ; తృష్ణేచేం= ఆశయొక్క ; పిసేం = పిచ్చి ; వాయాం విణ= వ్యర్థము గాకుండా (అన్యప్రయోజనము లేదు). 4. తుకా హ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు ; సాదర = ఆదర (శ్రద్ధా) పూర్వకముగా ; శ్రవణ = హరికథా శ్రవణము ; కరోనియా = చేసి; ఐసే ధన = ఇటువంటి ధనమును ; ఘేఈ = సంపాదించుకోండి ; (ఏదైతే) రాహే = (శాశ్వతముగా) ఉండునో. (దానిని సంపాదించుకోండి). 5.

వ్యా॥ ద్రవ్యము వెనుక కలిపురుషుని యొక్క సంబంధమున్నది. ద్రవ్యమును సంచయము చేయునప్పుడు అనృతభాషణము వంటి అనేక పాపములు సంభవించును. కలిపురుషునకు పరీక్షిన్మహారాజు ఇచ్చిన నివాస స్థానము - ద్రవ్యము.

శ్లో॥ అభ్యర్థిత స్తదా తస్మై స్థానాని కలయే దదౌ ।
ద్యూతం, పానం, స్త్రియః, సూనా యత్రాధర్మ చతుర్విధః ॥

శ్లో॥ పునశ్చ యాచమానాయ జాతరూపమదాత్ప్రభుః ।
తతోఽనృతం, మదం, కామం, రజో వైరం చ పంచమమ్ ॥

అర్థము :- కలిపురుషునిచే ప్రార్థింపబడిన పరీక్షిన్మహారాజు అతనికి నాలుగు నివాస స్థానములిచ్చెను - ద్యూతము, మద్యపానము, స్త్రీ - సంగము; మరియు హింసా. ఈ స్థానముల యందు క్రమముగా అసత్య భాషణము; మదము, ఆసక్తి మరియు నిర్దయతా అను నీ నాలుగు విధముల పాపము (అధర్మము) నివసించును.

కలిపురుషునిచే నింకను నివాస స్థానము యాచింప బడిన మీదట, సమర్థుడైన పరీక్షిన్మహారాజు అతడు నివసించుటకు మరొక స్థానమును అనగా సువర్ణము (ధనము)ను ఇచ్చెను. ఈ ప్రకారముగా కలిపురుషుని

నివాసస్థానము లైదు అయ్యేను. వాటి యందు క్రమముగా అనృతము, మదము, కామము, నిర్దయతా మరియు రజోగుణము (చంచలతా) రూప అధర్మములు (పాపములు) జరుగుచుండును. (శ్రీమద్భాగవతము. 1-17-38,39)

మరియు ద్రవ్యమునకు కాలునితో గూడ సంబంధమున్నందున దాని నాశనముగూడ సునిశ్చితము. కావున మనుష్యులు ధనముతో సంబంధము పెట్టుకొనుట అపాయకరము. దుఃఖదాయకము.

**శ్లో॥ ఏషా హి విషయా దుఃఖ భోగినాం గహనా గుహా ।**
**ఘన మోహగజేంద్రాణాం వింధ్య శైల మహా తటీ ॥**

(శ్రీ యోగవాసిష్ఠ మహారామాయణము. 1-13-12)

**అర్థము :-** ఈ ధనలక్ష్మీ - ఆపదలను పాములకు పుట్ట, మోహములను ఏనుగులకు విశాలమగు వింధ్యపర్వతభూమి. (అనగా పాములు ఇతరులు చొరలేని గుహ నాశ్రయించుకొని యుండునట్లును, ఏనుగులు వింధ్యపర్వతభూమి నాశ్రయించుకొని యుండునట్లు, దుఃఖమోహములు లక్ష్మినాశ్రయించుకొని యుండునని భావము). 1. ద్రవ్యము నరకమునకు ద్వారము (సాధనము) న్నందున దాని నుండి విముఖమై, అమూల్యమైన ఈ మానవదేహమున్నప్పుడే శ్రీ హరికథా శ్రవణము చేయుటకారంభించవలయును. 2. ఇదే రోజు, ఇదే క్షణము నుండి హరికథా శ్రవణలాభమును పొందవలెను. రేపటికి వాయిదా వేయగూడదు.

**శ్లో॥ శ్వః కార్యమద్య కుర్వీత పూర్వాహ్ణే చాపరాహ్ణికమ్ ।**
**న హి ప్రతీక్షతే మృత్యుః కృతమస్య న వా కృతమ్ ॥**

మ.భా. శాం.ప. 175-15.

అర్థము :- రేపు చేయబోవు పనిని ఈ రోజుననే చేయవలయును. ఈ రోజు సాయంకాలము చేయబోవు పనిని ప్రాతఃకాలముననే చేయవలయును. ఎందుకనగా? ఇతడు పనిని పూర్తి చేసినాడా? లేదా? అని మృత్యువు విచారించదు. ప్రతీక్ష చేయదు.

శ్లో॥ కో హి జానాతి కస్యాద్య మృత్యుకాలో భవిష్యతి ॥
న మృత్యురామన్త్రయతే హర్తుకామో జగత్ప్రభుః ॥
అబుద్ధ ఏవాక్రమతే మీనాన్ మీన గ్రహో యథా ॥
(మ.భా.శాం.ప) 175-16)

అర్థము :- ఎవరి యొక్క మృత్యువు ఈ రోజుననే కాగలదని ఎవరెఱుంగుదురు. సంపూర్ణ జగత్తును శాసించు సమర్థుడైన మృత్యువు ఎప్పుడు ఎవరిని హరించుకుపోవాలో, అతనికి మొదలు నియంత్రణమివ్వడు. ఎట్లు జాలరి అకస్మాత్తుగా తెలియకుండానే వలను విసరి చేపలను పట్టుకొనునో, అట్లే మృత్యువు గూడ అజ్ఞాతముగానుండి అకస్మాత్తుగా జీవులనాక్రమించును.

కావున సంసార భారమంతయును భగవంతుని పై నుంచి, ఇదే క్షణములో హరికథా శ్రవణ లాభమును పొందుటకుపక్రమించవలయును. 3. ధనమును ఎంతగా కోరిననూ, దానిని పొందుటకెంత ప్రయత్నించిననూ, ప్రారబ్ధము మాత్రము అన్యథా మారుటకవకాశము లేదు. భాగ్యములో నున్నంతనే ప్రాప్తించును.

శ్లో॥ ఆరబ్ధమర్థం లభతే మనుష్యః
దైవోఽపి తం లంఘయితుం న శక్యః।
తస్మాన్న శోచామి న విస్మయో మే
యదస్మదీయం న హి తత్పరేషామ్॥

**అర్థము :-** మనుష్యులకు ప్రారబ్ధానుసారము ప్రాప్తించనున్న వస్తువు (విషయము) తప్పకుండా ప్రాప్తించును. దానిని దైవము గూడ నుల్లంఘించుటకు సమర్థుడు కాడు. ఏది మాకు ప్రాప్తించనున్నదో, అది యితరులకు జెందదు. అందువలన నేను శోకించుటయు లేదు. విస్మయమును జెందుటయును లేదు.

**శ్లో॥ అవశ్యం భావి భావానాం ప్రతీకారో భవేద్యది ।**
**తదా దుఃఖైర్నలిప్యేరన్నల రామ యుధిష్ఠిరాః ॥** (వే.పం. 7-156)

**అర్థము :-** జరుగక తప్పనిదగు ప్రారబ్ధమునకు ప్రతీకారముండినచో నలుడు, శ్రీరాముడు, యుధిష్ఠరుడు కష్టముల పాలుగాకుండెడి వారు.

**శ్లో॥ యదభావి న తద్భావి భావిచేన్న తదన్యథా ।**
**ఇతి చింతా విషఘ్నోఽయం బోధో భ్రమనివర్తకః ॥**
(వే.పం. 7-168)

**అర్థము :-** కానిది కానేకాదు. కానున్నచో నది కాక మానదు - అను బోధ భ్రమను పోగొట్టును. దుఃఖమను విషమును హరించును.

కావున ధనము నధికముగా సంపాదించవలెనను పిచ్చి నిష్ప్రయోజనమని తెలియవలెను. 4. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు - ఇప్పుడు శ్రద్ధా పూర్వకముగా హరికథా శ్రవణము చేసి, శాశ్వతముగా నుండు ధనమును (భక్తి, జ్ఞానము) సంపాదించుకొనవలయును. 5.

**29. అభంగము :-**

**సర్ప భులోన గుంతలా నాదా ।**
**గారూడియేఁ ఫాందా ఘాతలాసే ।**

హిండవుని పోటు భరీ దారోదారీం ।
కోండుని పెటారీ అసే రయా॥ 1॥

తైసీ పరీ మజ ఝూలీ పాండురంగా ।
గుంతలో తోమీ గా సోడవీం అతాం ।
మాఝె మజ కాంహీం న చలేసేం జాలేం ।
కృపా హే తుజ న కరితా ॥2॥

ఆవిసే మీన లావియేలా గళీం ।
భక్ష్య తో గిళీ హ్మణూనియాం ।
కాఢూని బాహెరీ ప్రాణ ఘేవూ పాహే ।
తెథె బాప మాయే కవణ రయా ॥3॥

పక్షీ పిలియాం పాతలేం ఆశా ।
దేఖోనియా ఫాసా గుంతే బళేం ।
మరణ సాయాసేం నేణేం ధాంవోనీ వోరసే ।
జీవిత్వా నాస ఝూలీం బాళేం ॥4॥

గోదపణే మాసీ లిగాడీం గుంతలీ ।
సాంపడే ఫడఫడీ అధికాధిక ।
తుకా హ్మణే ప్రాణ ఘేతలా ఆశా ।
పంఢరీ నివాసా ధాం వ ఝూలీ ॥5॥

ప్ర.ప :- సర్ప = పాము (సర్పము గారడివాని నాదస్వరము యొక్క) ; నాద = శబ్దము (ను విని) ; భులోన = (తనను) మరచిపోయి; (నాదస్వర ధ్వనిలో) గుంతలా = తల్లీనమయినది; (అప్పుడు) కారూడియే= గారడివాడు ; ఫాందా = పాములను పట్టు కాష్ఠపాశమును ; ఘాతలాసే =

వేసి (దానిని పట్టుకున్నాడు. తరువాత) దారోదారీఁ = గడప గడపకు (ఇంటింటికి) ; హిండవూని = తింపుతూ (దానిని ప్రజలకు చూపిస్తూ) పోట = పొట్టను; భరీ = నింపుకుంటూ ; పెటారీ = బుట్టలో ; కోండుని= మూసి ; అసే రయా = అట్లే ఉంచుతాడు. ॥1॥ పాండురంగా = హే విఠలా! ; తైసీ పరీ = అదేప్రకారముగా ; మజ = నా యొక్క (పరిస్థితి) ; ఝాలీ = అయినది ; గా = ఓ దేవా ; తో మీ = అటువంటి నేను ; (సంసారమునందు) గుంతలోఁ = చిక్కుకుపోయాను (మోహములో పడి పోయాను, కావున) ; ఆతా = ఇప్పుడు ; సోడవీఁ = విడిపించుముఁ మార్ఝె మజ = నాయొక్క స్వ(ప్రయత్నము) = కాంహీఁ = ఏమియును ; న చలేసేఁ = ఉపయోగము లేకుండా ;జాలేఁ = అయెను ; హే = ఈ (సంసారము నుండి విడిపించు నటువంటి) తుజ = నీయొక్క ; కృపా = అనుగ్రహము ; న కరితాం = లేనందువల్లనే (నా పరిస్థితి ఇలా అయ్యింది). 2. జాలరి (బెస్తవాడు) = గళీ = గాలమునకు ; ఆవిసే = ఆమిషమును (ఎరను) ; లావియేలా = పెట్టి ; (నీటిలో వేసి) మీన = చేపను (మభ్యపెట్టును); తో = ఆ ఎరను ; భక్ష్య = భక్ష్య (ఆహారము) పదార్థము ; హ్మణోనియాం= అనుకొని (భావించి, భ్రమలోబడి); గిళీ = మ్రింగును. (అప్పుడు ఆజాలరి దానిని) బాహెరీ = బయటకు ; కాఢూని = లాగి; ప్రాణ = ప్రాణములను; ఘేవూ పాహే = తీయజూచును ; (ఆ వేళలో ఆ చేపను విడిపించుటకు) తెథే = అక్కడ ; మాయే = తల్లి ; బాప = తండ్రి ; కవణ - ఎవరు ; రయాం= ఉన్నారు?. 3. పక్షీ = పక్షి ; పిలియాం = (తన) పిల్లలకు ; (ఆహారము నివ్వాలనే) ఆశా = ఆశ (తో) ; పాతలేఁ = (గూటికి) చేరుకున్నది; (అంతకు పూర్వమే వేటగాడు పక్షిపిల్లలను పట్టి వలలో నుంచాడు. ఆ పిల్లల యొక్క దీన పరిస్థితిని) దేఖోనియా = చూసి ; బళేఁ = బలవంతముగ (మోహవశముచే)ఁ ఫాసా = వలలో పడి; గుంతే = చిక్కుకొని ; సాయాసేఁ=

ఎంతో పరిశ్రమతో ; వోరసే = కన్నప్రేమకు కట్టుపడి ; ధాంవోని = కావాలని పరుగెత్తి (వలలో పడి); మరణ = మరణమును ; నేణే = తెచ్చుకున్నది. (ఇక మగ పక్షికూడ) బాళే = మోహవశముచే (వలలోపడి); జీవిత్వా = జీవితమును ; నాశ = నాశనము (చేసికొని దివంగతము); ఝూలీం = అయెను. 4. మాసీ = ఈగం (బెల్లము యొక్కం గోడపణే - తీపిదనమునకు ; (ఆసక్తమై దానికి) లిగాడీం = అతుకుకొని; గుంతలీ = చిక్కుకుంది ; (ఎగిరిపోవుటకు) అధికాధిక = ఎంత ఎక్కువగా ; ఫడఫడీ = రెపరెపలాడునో; అంతకంతకు ఎక్కువగా అతుకుకొని బెల్లమునకు) సాంపడే= దొరికి పోయింది. (అతుకబడి పోయింది) ; తుకాహ్మణే = శ్రీ తుకారాం మహారాజు గారంటున్నారు ; పంఢరీ నివాసా = పంఢరీపురవాసా! విఠలా!; (ఇట్లే మేము గూడ సంసారములో శబ్దాది విషయముల) ఆశా = ఆశలో (పడి); ప్రాణ = ప్రాణములను ; ఘేతలా = తీసికుంటున్నాము ; (కావున నీవు) ; ధావ ఘాలీ = తొందరగా పరుగెత్తి వచ్చి (మమ్ములను రక్షింపుము). 5.

**తా॥** ఒకానొక గారడివాడు పాము పట్టుట కొఅకు నాదస్వరమును ఊదుచుండెను. ఒకానొక సర్పము నాదస్వరము యొక్క ధ్వనిచే స్వయమును (తనను తాను) విస్మరించి నాదమును వినుటయందు తల్లీనమయినది అది చూసిన గారడి తన వద్ద నున్న పాములను పట్టుట కుపకరించు కాష్ఠ పాశముతో దానిని పట్టి బుట్టలో బంధించి, ప్రతి నిత్యము ఇంటింటికి తిరుగుతూ, దానిని ప్రజలకు చూపెట్టుచు, దానిచే పొట్ట గడుపు కొనుచుండెను. 1. పాండురంగా! నా అవస్థ గూడ అలాగే ఉంది. సంసారములో చిక్కుకున్నాను. నన్ను ఇప్పుడు నీవే రక్షించాలి. నీ అనుగ్రహము లేనందు వల్లనే సంసారము నుండి బయటపడుటకు నా

ప్రయత్నములన్నియు విఫలమగు చున్నవి. 2. జాలరి గాలమునకు ఎరను (మాంసమును) గ్రుచ్చి చేపను భ్రమలో పడవేయును. ఆ చేప ఎరనుగాంచి, ఇది నా ఖాద్య పదార్థమని యెంచి, గాలమును మ్రింగును. జాలరి దానిని బయటకు లాగి ప్రాణములు తీయును. ఆ సమయములోదానిని ప్రాణసంకటము నుండి విడిపించుటకు అక్కడ తల్లి దండ్రులెవరున్నారు? 3. ఒకానొక వనమందు పావురముల జంట నివసించుచుండెడిది. వాటి పిల్లలను గూటిలో వదలి, పిల్లల కోసము మేత తెచ్చుటకు వెళ్ళినవి. మేతను సేకరించు కొని పిల్లలకు మేత పెట్టాలి అను నాశతో పిల్లల వద్ద వచ్చాయి. కాని అవి రావడానికి పూర్వమే ఒకానొక వ్యాధుడు (వేటగాడు) పిల్లలను పట్టి వలలో నుంచాడు. బిడ్డలను రక్షించుకొనుటకు ఎంతో ప్రయత్నము చేసి విఫలమొందెను. పిల్లల యొక్క దైన్యావస్థను గాంచి, మోహవశముచే స్వమరణమును గూడ లెక్కచేయక ఆడుపావురము పరుగెత్తి వెళ్ళి వలలో పడెను. బయట సురక్షితముగా నున్న మొగ పావురము, నా ముద్దుల బిడ్డలు, ప్రియమైన భార్య చనిపోయిన మీదట నేనొక్కడినెందుకు బ్రతకాలి? అని విచారించి తాను గూడ స్త్రీపుత్రాదులయందు గల మోహముచే వలలో దూకి, చివరికి స్త్రీ పుత్రాదులతో సహా మరణమును పొందెను. సారాంశము – స్త్రీ పుత్రాదులందలి మోహము అనర్థమునకు కారణమున్నది. 4. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు – బెల్లము యొక్క తీపినందాసక్తమైన ఈగ తన్ను తాను మరచి బెల్లము పై వెళ్ళి వ్రాలును. వెంటనే ఆ బంకబెల్లముచే నంటుకొనును. రెపరెపలాడుచు నెగిరి పోవుటకెంతెంత ప్రయత్నము చేయునో, అంతత అధికాధికముగ బెల్లమునకు బిగ్గరగా, కదలలేని విధముగా నంటుకొని చిక్కులో (ఆపదలో) పడినదాయెను. పంఢరీవాసా! పాండురంగా! అదే విధముగా శబ్దాది పంచ విషయములందలి ఆశ (ఆసక్తి) చే నేను సంసారములో చిక్కుకున్నాను. తొందరగా వచ్చి నన్ను కాపాడుము.

సంసారము నుండి విడిపించుము. 5. ఇదే విషయములో శ్రీ ఆదిశంకరుల వారి దివ్యోపదేశము.

శ్లో॥ శబ్దాదిభిః పంచభిరేవ పంచ పంచత్వ
మాపుః స్వగుణైః నిబద్ధాః ॥
కురంగ మాతంగ పతంగ మీన
భృంగా నరః పంచభిరంచితః కిమ్? ॥

అర్థము :- లేడి, ఏనుగు, మిడుత, చేప మరియు తుమ్మెద అనునీ ఐదు ప్రాణులు శబ్దాది - తమ తమ గుణము- (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము)లచే కట్టబడినవై మరణమును పొందినవి. ఈ ఐదింటిచే కూడుకొన్న మనుష్యుని విషయమై ఏమి చెప్పవలయును? (వివేక చూడామణి - 78)

30. అభంగము :-

శరీర దుఃఖాచే కోఠార । శరీర రోగాచే భాండార ।
శరీర దుర్గంధీచీ థార । నాహీఁ అపవిత్ర శరీరా ఐసేఁ ॥1॥

శరీర ఉత్తమ చాంగలేఁ । శరీర సుఖాచే ఘోసులేఁ!
శరీరేఁ సాధ్య హెూయ కేలేఁ । శరీరేఁ సాధలేఁ పరబ్రహ్మ ॥2॥

శరీర విటాళాచేఁ అళేఁ । మాయా మోహా పాశ జాళేఁ ।
పతన శరీరాచ్యా ముళేఁ । శరీర కాళేఁ వ్యాపిలేఁ ॥3॥

శరీర సకళహి శుద్ధ । శరీర నిధీంచాహి నిధ ।
శరీరేఁ తుటే భవ బంధ । వసే మధ్యభాగీఁ దేవ శరీరా ॥4॥

శరీర అవిద్యేచా బాంధా । శరీర అవగుణాంచారాంధా ।
శరీరీఁ వసే బహుత బాధా । నా హీఁ గుణ సుధా ఏక శరీరీఁ॥5॥

**శరీరా దుఃఖ నేదావా భోగ । న ద్యావే సుఖ న కరీఁ త్యాగ ।**
**శరీర వోఖటేఁ న చాంగ ।తుకాహ్మణే వేగ కరీఁ హరిభజనీఁ ॥6॥**

(4039)

ప్ర.ప:- శరీర = శరీరము ; దుఃఖాచే = దుఃఖములకు ; కోఠార= ఆగారము (గిడ్డంగి) ; శరీర = శరీరము ; రోగాంచే = రోగములకు ; భాండార = భాండాగారము (ద్రవ్య సంగ్రహస్థానము) ; శరీర = శరీరము; దుర్గంధీ చీ = దుర్గంధమునకు ; థార = నిలయము ; శరీరా ఐసా = శరీరము వంటి; అపవిత్ర = అశుద్ధమైనది. (మరొకటి); నాహీఁ=లేదు. 1. శరీర = శరీరము ; చాంగలేఁ = మంచిది; ఉత్తమ = ఉత్కృష్టమైనది ; శరీర= శరీరము; సుఖాచేఁ = సుఖములఁ ఘోసులేఁ = గుత్తి; శరీరేఁ = శరీరముతో; కేలేఁ = (ఏమి) చేసినను; సాధ్య హెూయ = సాధ్యమగును. శరీరేఁ = శరీరముతోఁ పరబ్రహ్మ = పరబ్రహ్మము; సాధలేఁ = ప్రాప్తమగును. 2. శరీర = శరీరము; విటాళాచే = స్త్రీ రక్తము యొక్క ; ఆళేఁ = ఆలవాలము; మాయా = భ్రమ, మోసము ; మోహా = మోహము; పాశ = బంధము (ప్రేమపాశము) ; జాళేఁ= (జీవులను ఆవరించు) వల (ఉన్నది) ; శరీరాచ్యాముళేఁ= శరీరము వలననే; పతన = జీవుడు పతనమగుచున్నాడు; శరీర = శరీరము; కాళేఁ = కాలునిచే (మృత్యువుచే); వ్యాపిలేఁ = వ్యాప్తమైయున్నది. 3. శరీర = శరీరము ; సకళహి = సంపూర్ణముగా; శుద్ధ = శుద్ధమున్నది; శరీర = శరీరము; నిధీంచాహి = నిధులకు గూడ; నిధ = నిధి (ఉన్నది). శరీరేఁ = శరీరముచే; భవబంధ = సంసారబంధము; తుటే = నివృత్త మగును ; శరీరా = శరీరము యొక్క ; మధ్యభాగీ = మధ్యభాగములో ; దేవ = పరమాత్మ వసే = నివసించి (యున్నాడు). 4. శరీర = శరీరము ; అవిద్యేచా = అవిద్యయొక్క బాంధా=

ఆకారము (కార్యము), శరీరము = శరీరము అవగుణాం చా = దుర్గుణముల యొక్క ; రాంధా = మిశ్రితపాకము (ఉన్నది) ; శరీర = శరీరమునందు ; బహుత = అనేకములైన; బాధా = ఆధి, వ్యాధులు; వసేఁ = ఉంటున్నవి; శరీరీఁ = శరీరములో; ఏక గుణ సుధా = ఒక్క మంచి గుణము గూడ ; నాహీఁ = లేదు. 5. శరీరా = శరీరమునకు ; దుఃఖ = దుఃఖమును. నేదావా = ఇవ్వగూడదు; సుఖ - సుఖమును (గూడ); నద్యావే = ఇవ్వగూడదు ; భోగ = భోగమును (గూడ ఇవ్వగూడదు); త్యాగ = త్యాగము (గూడ) నకరీ = చేయగూడదు, శరీర = శరీరము, వోఖటే = చాలా చెడ్డది; నా చాంగ = మంచిది గాదు ; తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగా రంటున్నారు; వేగ = త్వరితముగ ; హరిభజనీఁ = హరిభజనముఁ కరీఁ= చేయవలెను. 6.

వ్యా॥ ఈ శరీరము సకల దుఃఖములకు ఆగారము (గిడ్డంగి), సకల రోగములకు భాండాగారము, దుర్గంధమునకు ఆశ్రయము, దీనితో సమానమైన అపవిత్రము ఈ జగత్తులో మరొకటి లేనిదై యొప్పుచున్నది.

శ్లో॥ త్వఙ్మాంసరుధిర స్నాయు మేధో మజ్జాస్థి సంకులమ్ ।
పూర్ణం మూత్రపురీషాభ్యాం స్థూలం నింద్యమిదం వపుః ॥
(వి. చూ. 89)

అర్థము :- త్వగాదులచే నిండినదియు, మలమూత్రముల కాలయమైన ఈ స్థూల శరీరము కడునీచమైనది.

శ్లో॥ అమేధ్య పూర్ణం క్రిమిజాల సంకులం
స్వభావ దుర్గంధశౌచమధ్రువమ్ ।
కళేవరం మూత్ర పురీష భాజనం
రమంతి మూఢాః న రమంతి పండితాః ॥

అర్థము :- అశుద్ధముతో నిండినదియు, పురుగుల తెట్టె, సహజముగా దుర్గంధ యుక్తమును, అశౌచమును, అస్థిరమును, మూత్రపురీషములకు నిలయమును అయిన ఈ శరీరరూప కళేవరము (పీనుగ) యందు మూఢులు రమించుదురేగాని పండితులు గారు. 1.

ఈ మనుష్యశరీరముతో పరమార్థసాధన చేయగలిగినచో ఈ దేహము చాలా మంచిది, ఉత్కృష్టమైనది. సుఖ మంజరి (గుచ్ఛము). ఈ శరీరముతో తలచినది సాధించవచ్చును. ప్రయత్నించినచో పరమాత్మ ప్రాప్తి గూడ గలుగును.

**శ్లో॥ సృష్ట్వా పురాణి వివిధాన్యజయాత్మ శక్త్యా**
**వృక్షాన్ సరీసృప పశూన్ ఖగదంశమత్స్యాన్ ।**
**తైస్తైరతుష్ట హృదయః పురుషం విధాయ**
**బ్రహ్మావలోకధిషణం ముదమాప దేవః ॥**

(శ్రీమద్భాగవతము. 11-9-28)

అర్థము :- భగవంతుడు తన అచింత్య శక్తి రూప మాయచేత వృక్షములు, సరీసృపములు(పాములు మొదలగునవి), పశువులు, పక్షులు, దోమలు, చేపలు మొదలుకొని అనేక ప్రకారముల యోనులను రచించినాడు. కాని వాటి చేనసంతుష్టుడై మనుష్య శరీరమును సృష్టించెను. ఇది బ్రహ్మ సాక్షాత్కారము చేసుకొనగలుగు బుద్ధిచే సమర్థమైనది. ఇటువంటి మానవదేహ రచన చేసి భగవంతుడు ఆనందితుడాయెను. 2.

ఈ శరీరము స్త్రీల రజస్సుచే నుత్పన్నమై, ముట్టు రక్తమున కాలవాలమైనది. స్త్రీ పురుషుల నొకరికొకరిని ఆకర్షింప జేయగల సుందర శరీరము, మోసము, మోహము, రాగయుక్తమైన ప్రేమ అను వలలో పడద్రోయునదై, పాపములకు పుట్టినిల్లై, జీవులనధఃపతన మొనరించు చున్నది.

ఈ శరీరము కాలుని (మృత్యువు)చే వ్యాప్తమై యున్నది. అనగా ఎప్పటికైనా మృత్యువాత బడక మానదు. శరీరము యొక్క స్వరూపమును "గర్భోపనిషత్" ఇలా చెప్పుచున్నది.

శ్లో॥ పంచాత్మకం పంచసు వర్తమానం
షడాశ్రయం షడ్గుణయోగయుక్తమ్ ।
తం సప్తధాతుం త్రిమలం ద్వియోనిం
చతుర్విధాహారమయం శరీరమ్ ॥

అర్థము :- పంచాత్మకమ్ - ఆకాశ, వాయు, అగ్ని, జలము, పృథ్వీ - ఈ అయిదు భూతముల కలయిక చే నేర్పడినది.

పంచసు వర్తమానమ్ - 1. అంతఃకరణపంచకము, 2. జ్ఞానేంద్రియ పంచకము, 3. కరేంద్రియపంచకము, 4. ప్రాణపంచకము. 5. విషయపంచకములతో ఉంటున్నది.

షడాశ్రయమ్ - ఆకలిదప్పులు, గమనాగమనములు, జన్మ మరణములను షడూర్ములకాశ్రయము.

షడ్గుణయోగయుక్తమ్ - శుక్ల, రక్త, కృష్ణ, ధూమ్రః, పీతః, కపిలః, పాండుర అను షడ్గుణములతో యుక్తమును,

సప్తధాతుమ్ - రసము (అన్నరసము), రక్తము, మాంసము, మేదస్, మజ్జా, అస్థి, శుక్రము (రేతస్) -అను సప్తధాతు యుక్తము.

త్రిమలమ్ - ఆణవ మలము, మాయిక మలము, కార్మిక మలము.

ద్వియోనిమ్ - యోని అనగా కారణము. తల్లి (శోణితము), తండ్రి (శుక్రము) "శుక్ర శోణిత సంయోగాదావర్తతే గర్భః" (గర్భోపనిషత్)

చతుర్విధాహారమయమ్ - భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యా - ఈ చతుర్విధాహారముల వికారము(కార్యము)- ఈ శరీరము.

ఇటువంటి శరీరమునకు ఆకర్షితులై జీవులు మోహముచే మోసపోవు చున్నారు.

శ్లో॥ రక్తమాంసమయస్యాస్య సబాహ్యాభ్యంతరం మునే ।
నాశైకధర్మిణో బ్రూహి కైవ కాయస్య రమ్యతా ॥
(యో.వా. 1-18-38)

అర్థము :- ఈ శరీరము రక్తమాంస మయము. దీని పరిణామము నాశనమే. దీని రమ్యత యేమియో విచారించి చెప్పుడు.

శ్లో॥ బద్ధాస్థా యే శరీరేషు బద్ధాస్థాయే జగత్స్థితౌ ।
తాన్మోహ మదిరోన్మత్తాన్ ధిన్ ధిగస్తు పునః పునః ॥
(యో.వా. 1-18-52)

అర్థము :-శరీరమును,జగత్తును,చిరస్థాయి,సత్యము, సారవంతము లనుకొను మోహమదిరోన్మత్తులకు మాటి మాటికి ధిక్కారమగు గాత!

శ్లో॥ ప్రజ్ఞా వరాకీ సర్వైవ కాయబద్ధాస్థ యానయా ।
మిథ్యాజ్ఞాన కురాక్షస్య ఛలితా కష్టమేకికా ॥ (యో.వా. 1-18-56)

అర్థము :- ఆహా! శరీరము స్థిరమను నమ్మికకు మూలకారణమగు మిథ్యా జ్ఞాన కురాక్షసి మోసమున, దీనయగు సద్బుద్ధి ఏకాకియై (వివేకహీనమై పడు చున్నది.

శ్లో॥ న కించిదపి దృశ్యేఽస్మిన్ సత్యం తేన హతాత్మనా ।
చిత్రం దగ్ధ శరీరేణ జనతా విప్రలభ్యతే ॥ (యో.వా. 1-18-57)

**అర్థము :-** ఈ జగత్తున సత్య మొకించుకైన లేకపోయినను, అస్థిత్వ విహీనమగు ఈ పాడు శరీరము జనులను వంచించుచున్నది. 3.

పరమార్థదృష్టిచే నీ శరీరము నిధుల (నిక్షేపముల) న్నింటికిని నిధి. ఈ శరీరము చేతనే భవబంధముయొక్క నివృత్తి యగును. ఈ శరీరమునందే దేవుడు (పరమాత్మ) వసించి, వ్యాపించి యున్నాడు. కావున యిటువంటి మానవ శరీరము చాలా దుర్లభము.

**శ్లో॥ దుర్లభం మానుషో దేహో ప్రాణినాం క్షణభంగురః ।**
**తత్రాపి దుర్లభం మన్యే వైకుంఠప్రియదర్శనమ్ ॥**
(శ్రీమత్ భాగవతము. 11-2-29)

అర్థము :-క్షణభంగురమైన ప్రాణికోట్లయొక్క జన్మములలో మానవ జన్మము అత్యంత దుర్లభము. అట్టి జన్మము పుణ్యవశముచే లభించినను, భగవద్భక్తుల దర్శనము కలుగుట మిక్కిలి దుర్లభము.

**శ్లో॥ స్వర్గిణోఽ ప్యేతమిచ్ఛంతి లోకం నిరయినస్తథా ।**
**సాధకం జ్ఞాన భక్తిభ్యా ముభయం తదసాధకమ్ ॥**

**అర్థము :-** స్వర్గవాసులైన దేవతలు, నరకవాసులైన పాపాత్ములను జీవులు ఈ మనుష్య శరీరము నభిలషించుచున్నారు. ఎందుకనగా? ఈ శరీరమునందే అంతఃకరణ శుద్ధి ద్వారా భక్తి మరియు జ్ఞానము ప్రాప్తించును. స్వర్గనరకములు కేవలము భోగభూములు. విధి నిషేధరూప కర్మలకు అధికారి యైన ఈ మానవశరీరము అతిదుర్లభము. స్వర్గనరకస్థ శరీరములు పరమార్థ సాధనకు గాని, ఏ సాధనకు గాని ఉపయుక్తములు గావు.

(భాగవతము. 11-20-12)

**శ్లో॥ లబ్ధ్వా సుదుర్లభమిదం బహు సంభవాంతే**
**మానుష్య మర్థదమనిత్య మపీహ ధీరః ।**
**తూర్ణం యతేత న పతేదనుమృత్యు యావ**
**న్నిః శ్రేయసాయ విషయః ఖలు సర్వతః స్యాత్ ॥**
(భాగవతము. 11-9-29)

అర్థము :- యద్యపి ఈ మనుష్య శరీరము అనిత్యము, మృత్యుగ్రాసమే అయినప్పటికి, దీనిచే పురుషార్థప్రాప్తి కలుగుటకవకాశమున్నది. అందువలననేక జన్మల తరువాత ఈ అత్యంత దుర్లభమైన మానవశరీరమును పొంది, బుద్ధిమంతుడైన పురుషుడు అతి శీఘ్రముగ మృత్యువాసన్నము గాకముందే మోక్షప్రాప్తికి ప్రయత్నించ వలయును. మానవ జీవన ముఖ్య ఉద్దేశ్యము మోక్షమే యై యున్నది. విషయ భోగములన్ని యోనులలో నవిశేషము. కావున విషయ సంగ్రహమునందు యీ అమూల్య మానవజీవనమును వ్యర్థపుచ్చు కొనగూడదు.

**శ్లో॥ మహతా పుణ్యపణ్యేన క్రీతోఽయం కాయ నౌస్త్వయా ।**
పారం దుఃఖోదధేర్గన్తుం తర యావన్న భిద్యతే ॥ (భాగ. )

అర్థము :- ఓయీ! నీవీ దుఃఖసాగరమును దాటుటకు గొప్ప పుణ్యమనెడు ధనము నిచ్చి నర శరీరమనెడి యీ నౌక (ఓడ)ను సంపాదించితివి. కావున నీ శరీర నౌక భిన్నము గాక మునుపే దుఃఖ సాగరమును దాటుమా!.

**శ్లో॥ నైవ జన్మని సర్వస్మిన్ విద్యాఽసౌ సులభాపి తు ।**
**శిష్యలక్షణసంపూర్ణ జన్మన్యేవ హి లక్ష్యతే ॥** (అనుభూతి ప్రకాశము)

**అర్థము** :- మానవ జన్మములన్నిటి యందును బ్రహ్మవిద్య సులభముగా లభింపదు. శిష్య లక్షణములగు శమదమాదులు సంపూర్ణములగునప్పుడే బ్రహ్మవిద్య పరిపూర్ణమగుచున్నది.

**శ్లో॥ ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।** (గీత 18-61)

ఈశ్వరుడు సకల జీవులయొక్క హృదయ దేశములో నున్నాడు - అను గీతాచార్యుల వచనానుసారము ఈ శరీరములోనే విద్యమానమై యున్న పరమాత్మను, తనువును మృత్యువు కబలించక ముందే సాక్షాత్కరించు కొనవలెను. 4.

ఈ శరీరము అవిద్యాయొక్క కార్యమున్నది. అవగుణముల పరిపాకము మరియు ఆధివ్యాధి రూప దుఃఖములకు నిలయమున్నది. "దుఃఖాలయమశాశ్వమ్"(గీత. 8-15). ఈ శరీరములో నొక్కటి గూడ మంచి గుణము లేదు.

ఈ శరీరము అవిద్యా కార్యమున్నదనుటలో అభియుక్తుల వచనములు అజ్ఞానస్యావరణ విక్షేపనామకమస్తి శక్తిద్వయమ్. తమ ప్రధాన విక్షేపశక్తి మదజ్ఞానోపహిత చైతన్యా దాకాశ..... ఉత్పద్యతే। "విక్షేపశక్తిర్లింగాది బ్రహ్మాండాంతం జగత్ సృజేది" తి (సర. ఉ. 42)

**అర్థము** :- అజ్ఞానమునకు ఆవరణము మరియు విక్షేపమను రెండు శక్తులు గలవు. తమః ప్రదాన అజ్ఞానము యొక్క విక్షేప శక్త్యుపహిత చైతన్యము నుండి ఆకాశము మొదలు కొని దేహాదిక ప్రపంచోత్పత్తి అయినది. ఈ శ్రుతి ప్రమాణమునుదహరిస్తూ - విక్షేపశక్తి యేది గలదో అది సూక్ష్మ శరీరము మొదలుకొని బ్రహ్మాండము పర్యంతము జగత్తును రచించును. (వేదాంతసారము).

శ్లో॥ ఆచ్ఛాద్య విక్షిపతి సంస్ఫురదాత్మరూపం
జీవేశ్వరత్వ జగదాకృతిభిర్మృషైవ ।
అజ్ఞాన మావరణ విభ్రమ శక్తి యోగాదా-
త్మత్వ మాత్ర విషయాశ్రయతా బలేన ॥
(సంక్షేప శారీరకము 1-20)

అర్థము :- "అహమజ్ఞః " నేను అజ్ఞానిని - ఇత్యాద్యనుభవ రూపములో స్ఫురించుచున్న అజ్ఞానము ఆత్మను ఆశ్రయత్వ విషయత్వ బలముచే, ఆవరణ, విక్షేపశక్తిద్వయయోగముచే వాస్తవ స్వరూపమును కప్పి పెట్టి, జీవత్వము, ఈశ్వరత్వము మరియు జగద్రూపముచే మిథ్యా విక్షేపము (కార్యము)ను ఉత్పన్నము చేయుచున్నది. కావున దేహాదిక ప్రపంచము అజ్ఞాన శబ్ద వాచ్యమైన అవిద్యా కార్యమని సిద్ధించినది. 5.

శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు - శరీరమును దుఃఖపెట్టగూడదు. సుఖమును గూడ ఇవ్వగూడదు. శరీరమును త్యాగము చేయగూడదు. మరియు దీనిచే భోగములు గూడ అనుభవించరాదు. కారణమేమన! ఈ శరీరముచే సంసారము చేసినచో బంధము ప్రాప్తించును. పరమార్థము చేసిన యెడల మోక్షము కలుగును. అందువలన నతి త్వరితముగ నీ శరీరమును హరిభజన చేయుట యందు వినియోగింపుడు. 6.

**31.** అభంగము :-

జరీ మాఝీ కోణీ కాపతీల మాన ।
తరీ నకో ఆన వదో జిహ్వా ॥1॥

సకళాం ఇంద్రియాం హే మాఝీ వినంతి ।
నకా హెూవూం పరతీ పాండురంగా ॥2॥

అణికాంచి మాత నా ఇకావీ కానీఁ ।
అణికాం నయనీఁ న పహోవేఁ ॥3॥

చిత్తా తువా పాయీఁ రహోవేఁ అఖండిత ।
హెూవూనీ నిశ్చింత ఏకవిధ ॥4॥

చాలా పాయ హోత హేఁచి కామ కరా ।
మాఝ్యా నమస్కారా విఠోబాసీ ॥5॥

తుకాహ్మణే తుహ్మా భయ కాయకరీ ।
అముచా కైవారీ నారాయణ ॥6॥ (261)

ప్ర.ప :- జిహ్వే! = ఓ నాలుకా! ; జరీ = ఒకవేళ ; కోణీ = ఎవరైనా ; (పాండురంగ నామమును వదలి అన్య నామోచ్చారణ చేయుట యందు బలవంతముగ) మాఝీ = నాయొక్క ; మాన = మెడ; కాపతీల = కోసివేసినా; తరీ = అయినప్పటికిని; ఆన = పాండురంగని నామము కంటె అన్య నామమును ; వదో నకో = ఉచ్చరింపకుము. 1. సకళాం ఇంద్రియాం = సర్వేంద్రియములకు; మాఝీ = నాయొక్క; హే = ఈ; వినంతి = ప్రార్థన; పాండురంగా = పాండురంగనికి; పరతీ = విముఖము; హెూవూనకా = కాకండి! 2. కానీఁ= ఓ చెవులారా! (పాండురంగని విడిచి) ఆణికాంచీ = అన్యుల యొక్క; మాత = మాటలు(స్తుతి); నా ఇకావీ = వినవలదు; నయనీఁ=ఓ నేత్రములారా! (పాండురంగని విడిచి) ఆణికాం= అన్యుల (రూపమును) న పహోవేఁ = చూడవలదు. 3. చిత్తా = ఓ నా చిత్తమా!; తువా = నీవు; నిశ్చింత = నిశ్చింతగ; హెూవూనీ = అయ్యి; (పాండురంగని యొక్క) పాయీఁ = పాదారవిందముల యందు; ఏకవిధ= ఏకనిష్ఠము; అఖండ = అఖండముగ(సంలగ్నమై); రహోవేఁ= ఉండుము. 4. పాయ= ఓ నా పాదములారా!; (మీరు పాండురంగని గ్రామమునకు);

చాలా = నడచి వెళ్ళండి; హాత = ఓ నా చేతులారా!; (మీరు) హేంచి = ఇదే; కామ = పని; కరా = చేయండి. (ఏమిటనగా!) మాఝూ = నాయొక్క (పెన్నిధియైన); విఠోబాసీ = శ్రీవిఠలేశునికి; నమస్కారా = నమస్కరించండి. 5. తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు. తుహ్మా = మీకు (మిమ్ములను); భయ = (జన్మ మరణ రూప) భయము; కాయకరీ = ఏమి చేయును? (ఎందుకనగా); ఆముచా = మనయొక్క; కైవారీ = రక్షకుడైన; నారాయణ = శ్రీమన్నారాయణుడున్నాడు గదా!. 6.

**తా॥** ఓ నా నాలుకా! పాండురంగ నామమును విడిచి ఇతరమైన నామమును చేకొనుటయందెవరైనా బలాత్కారముగ నా తలను నరికినా, నీవు మాత్రము అన్యమైన నామమునుచ్చరింపకుము. 1. సర్వేంద్రియములకు నా విన్నపమేమనగా! మీరందరును ఎప్పుడును పాండురంగనికి విముఖము కాకూడదు సుమా! 2. ఓ శ్రోత్రములారా! మీరు శ్రీపాండురంగని దివ్య స్తోత్ర శ్రవణము తప్ప అన్యమును వినకండి. ఓ నేత్రములారా! మీరు శ్రీ శ్యామసుందర దివ్య మంగళ విగ్రహమును తప్ప అన్యమును గాంచకుడు. 3. ఓ నా చిత్తమా! నీవు నిశ్చయముగా శ్రీపాండురంగని దివ్య చరణారవిందములయందేకనిష్ఠమైన యఖండ భక్తి గలిగి యుండుము. 4. ఓ నా పాదములారా! మీరు ఇంత మాత్రము పని చేయండి. ఏమనగా! మీరు శ్రీ విఠలుని గ్రామమునకు నడచి వెళ్ళండి. ఓ నా చేతులారా! మీరు నా పెన్నిధియైన శ్రీ విఠలేశునికి నమస్కరించండి. 5. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - మీరు ఇంతమాత్రము చేసిన యెడల, ఇక మీకు జన్మ మరణ భయమేమి చేయగలదు? కారణమేమన? సమస్త భయములనుండి విడిపించు (తప్పించు) మన రక్షకుడైన శ్రీమన్నారాయణుడండగా నుండగా దండధరుని గండమేల యుండ గలదు? 6.

వ్యా:- జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం
పాణిద్వంద్వ సమర్చయాచ్యుత కథాం శ్రోత్రద్వయం త్వం శృణు।
కృష్ణం లోకయ లోచనద్వయ! హరేర్గచ్ఛాంఘ్రి యుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ ముకుంద పాద తులసీం మూర్ధన్న మాధోక్షజమ్ ॥
(ముకుందమాల-20)

అర్థము :- హే జిహ్వే! కేశవుని కీర్తించుము. ఓ చిత్తమా! మురారిని శ్రద్ధతో భజించుము. ఓ హస్తయుగళమా! శ్రీధరుని యర్చించుము. ఓ శ్రోత్ర ద్వయమా! నీవు అచ్యుతుని కథా శ్రవణము చేయుము. ఓ నేత్ర ద్వయమా! నీవు శ్రీమనమోహన శ్యామసుందర దివ్య మంగళ విగ్రహమును దర్శించుము. ఓ చరణయుగళమా పవిత్రమైన భగవత్ స్థానములందు పరిభ్రమించుము. ఓ నాసికా! నీవు శ్రీ ముకుందచరణసేవిత తులసీ సుగంధము నాఘ్రాణించుము. మరియు నో శిరమా! భగవంతుడైన అధోక్షజుని ముందు వంగి నమస్కరించుము.

సకలేంద్రియ మనంబులను సర్వేశ్వరుని యందు సమర్పించి అనన్య భావముచే భజించి, విచారించి, విశ్వవ్యాపకుడైన శ్రీమహా విష్ణువును ప్రత్యగభిన్నముగ సాక్షాత్కరించుకొనుటయే ఆయా ఇంద్రియ వ్యాపారముల ప్రయోజనము, జీవిత లక్ష్యమును సిద్ధించును - అని పరమ భాగవతోత్తముడు శ్రీ ప్రహ్లాదస్వామి తెలియజేసిరి.

సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ।
సుర రక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము।

విష్ణు నాకర్షించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము ।
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి ।

తే.గీ॥ దేవదేవుని చింతించు దినము దినము
చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు ।
కుంభినీధవు జెప్పెడు గురుడు గురుడు
తండ్రి! హరి జేరు మనియెడి తండ్రి తండ్రి ॥

ఇట్లు హరిభజనయందు సర్వేంద్రియమనంబుల సార్థక్యమును అన్వయముఖముగ స్తుతిజేసి, ఇప్పుడు హరిభజన జేయనిచో దేహేంద్రియమనంబుల వైయర్థ్యమును వ్యతిరేకముఖముగ నిందించు చున్నాడు.

సీ॥ కంజాక్షునకు గాని కాయంబు కాయమే
పవనకుంభిత చర్మ భస్త్రి గాక ।
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే
ధమ ధమ ధ్వని తోడి ఢక్క గాక ।
హరిపూజనము లేని హస్తంబు హస్తమే
తరు శాఖ నిర్మిత దర్విగాక ।
కమలేశు జూడని కన్నులు కన్నులే
తనకుడ్య జాల రంధ్రములుగాక ।

ఆ.గీ॥ చక్రి చింతలేని జన్మంబు జన్మమే
తరళసలిల బుద్బుదంబు గాక ।

**విష్ణు భక్తి లేని విబుధుండు విబుధుడే**
**పాదయుగము తోడి పశువు గాక ॥**

**32. అభంగము :-**

**తుఝా శరణాగత ఝాలోఁ మీ అంకిత ।**
**కరీఁ మాఝె హిత పాండురంగా॥ 1॥**

**పతితపావన తుఝీ బ్రీదావలీ ।**
**తే అతా సంభాళీ మాయ బాపా॥ 2॥**

**అనాథాంచా నాథ బోలతీల సంత ।**
**ఐకోనియా మాత విశ్వాసలో ఁ ॥ 3॥**

**న కరావేఁ నిరాశ న ధరావేఁ ఉదాస ।**
**దేఈ యాచకాస కృపాదాన॥ 4॥**

**తుకాహ్మణే మీ తోఁ పాతకాంచీ రాశీ ।**
**దేఈ పాయాంపాసీఁ రావ దేవా॥ 5॥ (2266)**

ప్ర.ప :- పాండురంగా = ఓ పాండురంగా! ; మీ = నేను; తుఝా= నీకు; అంకిత= ఆజ్ఞాధారకుడనై (అంకితమై); శరణాగత = శరణాగతి; ఝాలోఁ=అయితిని; మాఝె = నా (యొక్క); హిత = హితమును (మేలును); కరీ = చేయుము. 1. మాయబాపా = తల్లి రూపములో, తండ్రి రూపములో నున్న విఠలా!; పతితపావన = పతితపావనా; (ఇత్యాది); తుఝీ = నీ; (యొక్క) బ్రీదావళీ = నామావళి (ఏదిగలదో) నీతే = అది( దానిని); ఆతాం= ఇప్పుడు; సంభాళీ = సంభాలించు(భద్రపరచు) కొనుము. 2. (నిన్ను) సంత= సత్పురుషులు; అనాథాం చా నాథా = అనాథ నాథుడవని; బోలతీల =

అంటారు; (అసత్పురుషుల యొక్క) మాత = వచనమును; (నేను) ఐకోనియా= విని; (నీపై) విశ్వాసలోఁ= విశ్వాసము (శ్రద్ధా) పెట్టితిని. 3. (నన్ను) నిరాశ = నైరాశ్యునిగా; న కరావేఁ = చేయకుము; (మరియు నాపట్ల) ఉదాసీన = ఔదాసీన్యమును (గూడ); న ధరావేఁ = ధరించకుము. యాచకాస = యాచకుడనైననాకు ; కృపాదాన = కృపాదానము; దేఈ= ఇవ్వుము. 4. తుకాహ్మణే = శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు; మీ= నేను; తో= ఆ; పాతకాంచీ = పాపముల యొక్క; రాశీ = రాశిని (ఉన్నాను); దేవా! ఓ దేవా!; (నాకు నీయొక్క) పాయాంపాసీం = చరణారవిందముల చెంత; ఠావ = ఆశ్రయము; దేఈ = ఇమ్ము. 5.

**తా॥** పాండురంగా! నేను నీకు సంపూర్ణ శరణాగతి నొంది, నీ ఆజ్ఞాధారకుడ (దాసుడ) నైతిని. ఇందువలన నీవు నా కల్యాణమును (మేలును) చేయుము అనగా మోక్షమును ప్రసాదించుము. 1. నీకు తల్లివి యని, తండ్రివి యని, మరియు పతితపావనుడవనియు ఇత్యాద్యనేక నామములు (బిరుదులు) గలవు. ఇప్పుడు వాటిని నీవు కాపాడుకొనుము. అనగా మాబోటి అనాథలు, దీనులు, పతితులను రక్షించిననే గాని నీ బిరుదులు నీకు దక్కును. లేనిచో నీకు అపకీర్తియే మిగులును.

**శ్లో॥** అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తే వ్యయామ్ ॥

(గీత-2-34)

**అర్థము :-** జనులు నీయొక్క అపకీర్తినే దీర్ఘ కాలము (ఎల్లప్పుడు) చెప్పుకుంటూ ఉంటారు.

అందుకే నన్ను రక్షించి (నీయొక్క యథార్థ దర్శన భాగ్యము కలిగించి) నీ బిరుదులు (నామావళిని) నిలబెట్టుకో. 2. నీవు అనాథ నాథుడవని సంతు

మహాత్ములు అంటున్నారు. వారి వచనములను విని నేను నీపై విశ్వాసము (శ్రద్ధ)ను బెట్టితిని. 3. దేవా! నన్ను నైరాశ్యన్ని చేయకుము. ఇంతేగాదు నాపట్ల ఔదాసీన్యమును (ఉపేక్షను) గూడ వహించకుము. మోక్షరూప భిక్షను యాచించే ఈ భిక్షువు (ముముక్షువు)నకు కృపాదానము, అభయము నొసంగుము. 4. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు. నేను పాపముల రాశిని ఉన్నాను. ఇందులో నిసుమంతయును సందేహము లేదు. కాని నా పాపములం గూర్చిన విచారము చేయక, నీ పాదారవిందములయందు నాకు కించిదాశ్రయమును మాత్రము ప్రసాదించుము. 5.

సు.వ్యా :- భగవచ్చరణాగతి మూడు విధములుగా ఉంటుంది- అని శ్రీమధుసూదన సరస్వతీ స్వాముల వారు గూఢార్థ దీపిక (గీత పై వ్యాఖ్య )18-66 లో తెలియ జేసారు.

**శ్లో॥ తస్యైవాహం మమైవాసౌ స ఏవాహమితి త్రిధా ।**
**భగవచ్ఛరణత్వం స్యాత్ సాధనాభ్యాస పాకతః ॥**

**అర్థము** :- సాధనాభ్యాసం యొక్క పరిపాకంచే "నేనతని వాణ్ణి" , "అతడు నావాడే"- మరియు "నేను అతనే (అతనే నేను)" అని మూడు రకముల భగవచ్ఛరణాగతి కల్గుతుంది. అందులో మొదటి శరణాగతి మృదువునకు ఉదాహరణము:- "సత్యపి భేదాపగమే నాథ తవాహం న మామకీనస్త్వమ్, సముద్రో హి తరఙ్గః క్వచన సముద్రో న తారఙ్గః ।

**అర్థము** :- ఓ నాథా! భేదం లేకున్నా నేను నీవాడనే గాని, నీవు నావాడవు కావు. తరంగము (అల) సముద్రానిదే గాని, సముద్రం ఎప్పుడును తరంగముది(అలది) గాదు. దీనికి ఉదాహరణము:- అంబరీషుడు.

రెండవది మధ్యమ శరణాగతికి ఉదాహరణము :- యథా

**శ్లో॥ హస్తముత్క్షిప్య యాతోఽసి, బలాత్కృష్ణ కిమద్భుతమ్ ।**
**హృదాయాద్యది నిర్యాసి, పౌరుషం గణయామి తే ॥**
(లీలా శుకము 3-96)

**అర్థము :-** కృష్ణా! నీవు బలాత్కారంగా నా చేయి వదిలించుకొని పోగలిగితివి. ఇందులో ఏమి ఆశ్చర్యము? నీవు నా హృదయము నుండి పోగల్గుదువేని, అప్పుడు నీ పౌరుషాణ్ణి నేను నుతిస్తాను. దీనికి ప్రహ్లాదుడు ఉదాహరణము.

మూడవది అధిమాత్రం శరణాగతికి ఉదాహరణము :-

**సకల మిదమహం చ వాసుదేవః**
**పరమ పుమాన్పరమేశ్వరః స ఏకః ।**
**ఇతి మతిరచలా భవత్యనన్తే**
**హృదయగతే వ్రజతాన్విహాయ దూరాత్ ॥"**

**అర్థము :-** ఇదంతా మరియు నేనుగూడ ఏకమాత్ర పరమ పురుషుడు, పరమేశ్వరుడు భగవంతుడగు వాసుదేవుడే, అని ఎవని హృదయంలో ఉండే భగవంతిని యందు బుద్ధి నిశ్చలంగా ఉండునో వారిని దూరం నుండి విడిచి వెళ్ళుము.- అని తన దూతను గూర్చి యముని వాక్యము. (విష్ణుపురాణము. 3-7-32). దీనికి ఉదాహరణము గోపికలు.

శ్రీతుకారాం మహారాజుగారు ప్రసంగానుసారముగా ఉపరోక్త త్రివిధ శరణాగతిని స్వీకరించాడు. ముఖ్యముగా వేదాంత సారమైన మూడవ శరణాగతియందే అతని దృఢనిశ్చయము గలదు. ప్రస్తుతము మాత్రము మొదటి శరణాగతిని స్వీకరించి చెప్పెను.

33. అభంగము :-

జీవనావాంచూనీ తళమళీ మాసా।
ప్రకార హా తైసా హెూతో జీవా ॥1॥

న సాంపడే ఝూలేఁ భూమి గత ధన ।
చరఫడీ మన తయాపరీ ॥2॥

మాతేచా వియోగ ఝూలియా హెూ బాళా ।
హోతో కళవళా జాణాదేవా ॥3॥

సాంగావేఁ తే కితీ తుహ్మాసీ ప్రకార ।
సకలాంచేఁ సార పాయ దావీ ॥4॥

యాచి చింతే మాఝూ కరపలా భీతర ।
కాం నేణోఁ విసరపడిలా మాఝూ ॥5॥

తుకామ్హణే తూహేఁ జాణసీ సకళ ।
యావరీ కృపాళ హెూఈ దేవా ॥5॥ (2273)

ప్ర.ప :- (చేపకు జీవనము జలము కావున) జీవనా వాంచూనీ= నీరు లేకుండా ; మాసా = చేప; (ఏవిధముగా) తళమళీ = వ్యాకులత జెందునో; తైసా ప్రకార = ఆ ప్రకారము; హా = ఈ (నా); జీవా = జీవనము (ప్రాణము); హెూతో = అగుచున్నది. 1. భూమిగత ధన = భూమిలో పాతిపెట్టిన ధనము; న సాంపడే = (కాలాంతరములో) దొరుకనట్లు; ఝూలేఁ = అయితే; (ఆ ధనలోభి యొక్క) మన = మనస్సు; చరఫడీ = (ఎంత) అశాంతిని పొందునో, తయాపరీ = ఆ విధముగా (నా మనస్సు అగుచున్నది.)2. బాళా = పిల్లవానికి; మాతేచా వియోగ; తల్లి యొక్క వియోగము; ఝూలియా = అయినప్పుడు; (ఏవిధముగ) కళవళా =

కలవరింపు; హెూ = కలుగునో; దేవా = ఓ దేవా; తో= అట్లే; హా= ఈ(నా చిత్తము) జాణా = (కలవరించు చున్నదని) తెలియుము. 3. తే ప్రకార = నీ వియోగమును భరించ లేని నా చిత్తము అవస్థ; తుహ్మాసీ = నీకు; కితీ= ఎంతని; సాంగావేc = చెప్పాలి? (నా యొక్క) సకళాంచే = సంపూర్ణ (ఆవేదనల యొక్క) ; సార = సారాంశమింతే; (ఏమిటంటే) పాయ దావీc= నీ చరణారవిందముల యొక్క దర్శన భాగ్యమును కలిగించుము. 4. (నీవు నా కెప్పుడు దర్శన భాగ్యము కలిగించెదవో నను) యాచి చింతేc = ఇదే చింతచేత; మాఝూ = నా హృదయము; భీతర = లోపల; కరపలా = వేయించబడుచున్నది; మాఝూ = నా (పట్ల నీకు); కాం = ఎందుకు; విసర పడిలా = మరుపు కలిగిందో; (నేను) నేణోc = తెలియజాలకున్నాను. 5. తుకాహ్మణే = శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు ; హే సకళ = నా గూర్చి పూర్తిగా; తూ = నీవు; జాణసే = తెలియుదువు; దేవా = ఓ పాండరంగా; యూవరీ = ఇక మీదటనైనా; (నావిషయములో) కృపాళహెూఈ= కృపాళుడవు కమ్ము (నన్ను కరుణించు)6.

తా॥ నీటి నుండి వేరు చేయబడిన చేప ఏ ప్రకారము నీటికోసము తపించునో (వ్యాకులత చెందునో), అట్లు నా చిత్తము నీ వియోగముచే తపించు చున్నది. 1. ధనలోభి భూమిలో పాతిపెట్టిన ధనము కాలాంతరమున కనుపించక పోయేసరికి అతని చిత్తము ఎంత అశాంతికి గురి యగునో అట్లు నా మనసు నీ దర్శన భాగ్యము లేక పరితపించు చున్నది. 2. తల్లి యొక్క వియోగముచే పిల్లవాడు ఎంత గలవరపడునో, అట్లే ఇప్పుడు నా చిత్తము యొక్క అవస్థ ఉన్నదని తెలియుము. 3. దేవా! నీ కెంతని వేడెదను. నా ప్రార్థన యొక్క సారమింతియే. ఏమన? నీ యొక్క శ్రీ చరణ ద్వంద్వ దివ్య దర్శన భాగ్యము కలిగించుము. 4. దీని చింత చేతనే నా హృదయము

శనగలు వేయించబడునట్లు, తపింపబడుచున్నది. రంగా! నీవు నన్నెందుకు మరచితివో నేనెఱుగనైతిని. 5. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు. పాండురంగా! నీవు నా గూర్చి సంపూర్ణముగా తెలియుదువు గదా! ఇకమీదట నైనా నా విషయములో కృపాళుడవు కమ్ము. నన్ను ధన్యునిగా చేయుము. 6.

**సు.వ్యా :-** ప్రకృత అభంగములో శ్రీ తుకారాం మహారాజుగారు తన యొక్క అకుంఠితమైన, అవ్యభిచరితమైన, క్షణకాలము గూడ భగవంతుని వియోగమును భరించలేని ప్రగాఢ భక్తిని ప్రకటము చేసెను. ఈ విషయములో గోపికలను ఉదాహరణముగా గైకొనవచ్చును.

**శ్లో॥ గోపికానాం పరమానంద ఆసీద్గోవింద దర్శనే ।**
**క్షణం యుగ శతమివ యాసాం యేన వినాభవత్ ॥**

(శ్రీమద్భాగవతము 10-19-16.)

**అర్థము :-** గోపికలకు భగవంతుడైన శ్రీ కృష్ణుని దర్శనమునందు పరమానందము కలుగుచుండెడిది. మరియు భగవంతుని యొక్క వియోగము వారికి క్షణకాలము గూడ వందలకొలది యుగములుగ దోచుచుండెడిది.

**శ్లో॥ అటతి యద్భవానహ్ని కాననం**
**తృటి యుగాయతే త్వామపశ్యతామ్ ।**
**కుటిల కున్తలం శ్రీముఖం చ తే**
**జడ ఉదీక్షతాం పక్ష్మకృద్ దృశామ్ ॥**

(శ్రీ మద్భాగవతము 10-31-15)

**అర్థము :-** కృష్ణా! నీవు ప్రాతఃకాలమున ఎప్పుడు వనమునకు వెళ్ళిపోదువో, అప్పుడు మాకు నీ వియోగము అర్ధక్షణము గూడ ఒక

యుగముతో సమానముగా దోచుచున్నది. మరియు (ఎప్పుడు నీవు) సాయంకాలము తిరిగి వచ్చేస్తావో అప్పుడు) గుండ్రముగా మెలిదిరిగిన గుంగురు వెంట్రుకలచే శోభాయమానమగు నీ సుందర ముఖారవిందమును దర్శిస్తూ (మేము ఈ విధముగా అనుకుంటాము) మా కనురెప్పలను సృష్టించిన బ్రహ్మ దేవుడు జడుడు (హృదయ శూన్యుడు) ఉన్నాడు. ఎందుకనగా? కనురెప్పలు మూయబడి మళ్ళీ తెఱచునంతకాలము నీ దర్శనము చేసుకోలేక వంచితులమై పోవుచున్నాము గదా!

అట్లే భక్త మీరాబాయి గూడ కృష్ణ విరహంతో విలపిస్తూ గానం చేస్తూంది.

**జో తుమ్ తోడే ప్రియ! మై నహీఁ తోడే రే**
**తోరీప్రీత్ తోడో కృష్ణ! కౌన్ సంగ్ జోడూఁ ॥జో॥**

**తుమ్ భయీ సరోవర్ । మైఁ తేరీ మఛియా**
**తుమ్ భయీ తరువర్ । మైఁ భయీ పంఖియా ॥జో॥**

**తుమ్ భయీ చందా । మైఁ భయీ చకోరా**
**తుమ్ భయీ సోనా । మై భయీ సుహాగా ॥జో॥**

**మీరాకే ప్రభు । తుమ్ వ్రజ కే లూసీ**
**తుమ్ మేరే ఠాకుర్ । మైఁ తేరీ దాసీ ॥జో॥**

కృష్ణా! నీవు మన యొక్క అమూల్యమైన పవిత్ర ప్రేమ బంధమును త్రెంచినా, నేను మాత్రము త్రెంచుకోలేను. అవునూ! నేను నిన్ను వదలి ఎవరినాశ్రయించాలి? నీవు సరస్సువైతే, నిన్ను వదలలేని నేను చేపనై నీలో సంచరిస్తాను. నీవు వృక్షమైతే నేను పక్షినై నీ యందే నివసిస్తాను. నీవు చంద్రునివైతే, నీ కోసము నేను ప్రేమామృత పానము చేయుటకు చకోరము

నవుతాను. నీవు బంగారమైతే, నీతో నభిన్నమై నేను ఆభరణమునై ప్రకాశిస్తాను. ఓ వ్రజపుర శోభనమూర్తీ! ఓ మీరా నాయకా! నీవు నా నాథుడవు. నేను నీ దాసిని.

ఇలాగే శ్రీతుకారాం మహారాజుగారు గూడ తన యొక్క అనన్య భక్తిని, భగవంతుని విరహ విహ్వాలతను వ్యక్తము చేసాడు.

**34. అభంగము :-**

గర్భీ అసతా బాళా । కోణ పాళీc త్యాంచా లళా ॥1॥
కైసా లాఘవీ సూత్రధారీ । కృపాళువా మాఝా హరీ ॥2॥
సర్ప పిలీ వితాంచీ ఖాయ । వా చవితాం కోణ మాయ ॥3॥
గగనీ లాగలా కోంసరా । కోణ పురవీ తెథె చారా ॥4॥
పోటీ పాషాణా చే జీవ । కవణ జీవనాచా భావ ॥5॥
తుకా హ్మణే నిశ్చల రాహే । హెూ ఈ తే సహజ పాహే ॥6॥
(1975)

ప్ర.ప :- బాళా = శిశువు; గర్భీ = గర్భములో; అసతా = ఉన్నప్పుడు; త్యాంచా = అతనిని; లళా = ప్రేమతో; కోణ = ఎవరు?; పాళీ= పాలించెదరు. 1. లాఘవీ = మాయావి; సూత్రధారీ = సూత్ర ధారి; కృపాళువా = కృపాళువైన; మాఝా = నాయొక్క; హరీ = పాండురంగడు; కైసా = ఎంతటి (సమర్థుడైన సకలలోక రక్షకుడు?) 2. సర్ప = సర్పము; వితాంచీ = ప్రసవించడము చేతనే (తన); పిలీ= పిల్లలను; ఖాయ = తినును, (అవేళ); వా చవితాం = (వాటిని) రక్షించునటువంటి; మాయ = తల్లి; కోణ - ఎవరు? 3. గగనీ = ఆకాశములో (ఇంటికోణలో); కోంసరా= సాలెపురుగు (గూటిని తన జాలతో); లాగలా = అల్లినది; తెథె = అక్కడ;

(దానికి); చారా = ఆహారమును; కోణ = ఎవరు?; పురవీ = అందించ (పూరించ) గలరు? 4. పాషాణాచే = శిలయొక్క; పోటీ = గర్భమున (మధ్యమున); జీవ = ప్రాణ (కప్ప నివసించును); జీవనాచా = (దాని) జీవనము యొక్క; భావ = సాధనములను; కోణ = ఎవరు?(సమకూర్చ గలరు?) 5. తుకా హ్మణే =శ్రీ తుకారాం మహారాజు గారంటున్నారు; నిశ్చల రాహే = (నీవు సకల సాంసారిక భారములను శ్రీహరిపై వదిలేసి) నిశ్చింతగా ఉండుము. (ప్రపంచములో) సహజ = సహజముగా; హెూఈ= జరుగునదంతయును; తే = దానిని; పాహే = చూస్తూ (ఉండుము). 6.

తా॥ శిశువు తల్లి గర్భములో నున్నపుడు అతనికి కావలసిన యాహారమునందజేసి రక్షించునదెవరు? మరియు నతని అచ్చట ముచ్చట తీర్చు వారెవరు? 1. పరమ కృపాళువు, జీవుల కర్మాధ్యక్షుడైన సూత్రధారి, మాయావి, సర్వనియామకుడు, సర్వాంతర్యామి యైన నా శ్రీహరి యొక్క మహిమను ఏమని వర్ణింపను. అనగా సకల జీవులను పోషించి, రక్షించు వాడు అఘటన ఘటనా సమర్థుడైన సర్వేశ్వరుడు శ్రీమన్నారాయణుడే యని భావము. 2. సర్పిణి ప్రసవించిన తోడనే తన పిల్లలను తినివేయును. ఆ పరిస్థితిలో అక్కడ ఆ పిల్లలను రక్షించు ఆత్మీయమైన అమ్మ ఎవరు? 3. సాలె పురుగు (ఊర్ణనాభి) ఎత్తైన ప్రదేశములో తన జాలతో గూటిని నిర్మించుకొని నివసించుచుండును. అక్కడ దానికి యాహారమును సమకూర్చు సమర్థులెవరు? 4. శిలా మధ్యమున కప్ప జీవించి యుండును. అక్కడ దానికి జీవనసాధనము లేమి? 5. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు – ఒరే నరుడా! ఉపరోక్త ఉదాహరణములను బాగుగా విచారించి, సాంసారిక బాధ్యతలన్నింటిని భగవంతునిపై మోపి, దేహ నిర్వహణ కొఱకధిక ప్రయత్నము చేయక, ప్రపంచములో నేదేది

జరుగు చుండునో, దానిని నిర్వికార మనస్కుడవై వీక్షిస్తూ, ప్రశాంత చిత్తుడవై యుండుము. 6.

సు.వ్యా :- ఈ అభంగములో శ్రీ తుకారాం మహారాజుగారు భగవంతునిపై తనకున్న పరమ విశ్వాసమును ప్రకటించుచున్నారు. సకల జీవులను పోషింప సర్వేశ్వరుడుండగా క్షుద్రమైన సంసార చింత యేల? భారమంతా భగవంతునిపై వేసి, అనన్యమైన హరిభజన చేయుటయే మన కర్తవ్యము గాని దేహ నిర్వహణము గూర్చి చింత వలదని శ్రీతుకోబా చెప్పుచున్నారు.

ఇదే విషయమును శ్రీ శేషప్పగారు తన కమనీయ కవిత్వముతో భగవంతునిపై పరమ విశ్వాసము నుంచ వలెనని తెలియ జేయుచున్నారు.

సీ॥ అడవి పక్షుల కెవ్వడా హారమిప్పించె
మృగజాతికెవ్వడు మేతబెట్టె ।
వనచరాదులకు భోజనమెవ్వడిప్పించె
చెట్ల కెవ్వడు నీళ్ళు చేదిపోసె ।
స్త్రీల గర్భంబునఁ శిశుల నెవ్వడు బెంచె
ఫణులకెవ్వడు బోసె పరగ విషము ।
మధు పాలి కెవ్వడు మకరంద మొనరించె
బసుల కెవ్వడొసంగె పచ్చి బూరి ।

తే॥గీ॥ జీవకోట్లను పోషింప నీవె గాని
వేరెయొక దాత లేదయ్య వెదకి జూడ ।
భూషణ వికాస శ్రీధర్మ పుర నివాస
దుష్టసంహార నరసింహ దురిత దూర ॥

35. అభంగము :-

పాండురంగే యే వో పాండురంగే ।
జివాచే జివలగే యే వో పాండురంగే ॥1॥

కనవాళూ కృపాళూ భక్తా లాగీఁ మోహీఁ ।
గజేంద్రాచా దాంవా తుంవా కేలా విఠాఈ ॥2॥

భక్తాంచ్యా కైవారేఁ కష్టలీస విఠలేఁ ।
అంబరీషా కారణే జన్మ దహా ఘేతలే ॥3॥

ప్రహ్లాదాకారణే స్తంభీ అవతార కేలా ।
విదారూని దైత్య ప్రేమ పాన్హా పాజిలా ॥4॥

ఉపమన్యు కారణేఁ కెంసీ దాంవసీ లవలాహీ ।
పాజే ప్రేమ పాన్హా క్షీర సాగరాఠాయీఁ ॥5॥

కౌరవీఁ పాంచాళీఁ సభోమాజేఁ ఆణలీ।
వస్త్ర హరణే వస్త్రేఁ కైసీ ఝూలీ మా ఉలీ ॥6॥

దుర్వాస పాతలా ధర్మా ఛలావయా వనీఁ ।
ధాంవసీఁ లవలా హీ శాక దేఠఘే ఉనీ ॥7॥

కృపాళు మా ఉలీ భక్తిముక్తి భాండార ।
కరీ మాఝా అంగీకార తుకా హ్మణే విఠలేఁ ॥8॥ (1788)

ప్ర.ప :- వో = ఓ! పాండురంగే! పాండురంగే! = (తల్లిగా భావించి సంబోధిస్తూ) పాండురంగ రూప తల్లీ!, పాండురంగరూప అమ్మా! ; యే = రమ్ము; వో = ఓ!; జివాచే = జీవునియొక్క; జివలగే = ప్రాణమా! (ప్రియతమా!); పాండురంగే = విఠల రూప మాత!; యే = రమ్ము (నా

కోసము పరుగెత్తుకొని రమ్ము)1. భక్తా లాగీ = భక్తుల గూర్చి (నీవు తొందరగా); మోహీc = మోహింపబడతావు. (భక్తిచే నాకర్షింపబడతావు); కనవాళూ = దయామయీ; కృపాళూ = కృపాళు (కరుణామూర్తి)వైన; విఠాఈ = విఠల రూప తల్లీ; తుంవా = నీవు; గజేంద్రాచా = గజేంద్రుని యొక్క (మొరనాలకించి వైకుంఠము నుండి); ధాంవా = పరుగు; కేలా = తీసితివి (పరుగెత్తుకొని వచ్చితివి)2. విఠలేc=ఓ విఠలరూప మాత; భక్తాం చ్యా = భక్తుల యొక్క కైవారేc= రక్షకురాలా! (నీవు భక్తుల కోసము ఎంతటి); కష్టలీస = కష్టమున కోర్చుకున్నావు; అంబరీషా కారణే = అంబరీషుని కొఱకు; దహా = పది; జన్మ = జన్మములను; ఘేతలే = ఎత్తితివి. 3. ప్రహ్లాదాకారణే = ప్రహ్లాదుని కొఱకు; స్తంభీ = స్తంభమునందు; అవతార కేలా = అవతరించితివి; (మరియు) దైత్య = హిరణ్యకశ్యపున్ని; విదారూని = పొట్ట చీల్చి (చంపి); ప్రేమ పాన్హా = ప్రేమామృతమును (ప్రహ్లాదునికి); పాజిలా = త్రాగించితివి. 4. ఉపమన్యుకారణే = ఉపమన్యు కొఱకు; కైసేc=ఏవిధముగా; లవలాహీ = తొందరగా; ధాంవసీ = పరుగెత్తుకొని (వచ్చితివి.); క్షీరసాగరా ఠాయీc=క్షీరసాగరమను స్థానమిచ్చి; ప్రేమపాన్హా = ప్రేమామృతమును; పాజి = త్రాగించితివి. 5. సభో మాజీ = నిండుసభలో; పాంచాళీ = ద్రౌపది; కౌరవీc= కౌరవుల చేత; ఆణిలీ = ఈడ్చుకు రాబడి; వస్త్ర హరణీc = వస్త్రాపహరణము గావింపబడునపుడు; మాఉలీ = ఓ విఠలరూప తల్లీ; (నీవు స్వయముగా); వస్త్రే = వస్త్రములుగా; కైసీ = ఎలా; ఝాలీ = అయితివి. 6. వనీc= వనములో; ధర్మా = ధర్మరాజు (వద్దకు); దుర్వాస = దుర్వాసముని; ఛళా వయా = అవమానించుటకు; పాతలా = చేరుకున్నపుడు; లవలాహీ = అతి త్వరగా; ధాంవసీ = పరుగెత్తుకొని వచ్చి; దేఠ = వనస్పతి యొక్క; శాక = ఆకును; ఘేఉనీ = స్వీకరించి (అరువది వేల మంది శిష్యులతో సమేతముగా దుర్వాసమునిని తృప్తి పఱచితిరి)7. తుకాహ్మణే=



द्रौपदी-चीर-हरण



सागके एक पत्तेसे विश्वकी तृप्ति

శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు; కృపాళు = కరుణామూర్తివైన; మాఝా = నా; విఠలేం మా ఉలీ = విఠలరూప అమ్మా! (నీవు) భక్తి ముక్తి భాండార = భక్తి ముక్తి భాండాగారము (ఉన్నావు, కావున నన్ను) ; అంగీకార కరీ = స్వీకరింపుము. 8.

తా॥ అమ్మా! పాండురంగే! ప్రాణుల (జీవుల) యొక్క ప్రాణమా! (ప్రియతమా!), నా ప్రాణాధారమా! నా కోసము తొందరగా పరుగెత్తుకొని రాగదమ్మా! 1. ఓ విఠల రూప తల్లీ! దయామయీ! కరుణా మూర్తీ! భక్తుల యొక్క అనన్య భక్తిచే శీఘ్రముగా నాకర్షింపబడు నో తల్లీ! నీవు గజేంద్రుని మొరనాలకించి వైకుంఠము నుండి పరుగు పరుగున వచ్చి మొసలి బారినుండి రక్షించి, ముక్తిని ప్రసాదించితివి. 2. ఓ విఠల రూప మాత! భక్తుల కోసము నీవు ఎంతటి కష్టము నోర్చుకొంటివి. భక్త అంబరీషుని కొఱకు పది జన్మలను స్వీకరించితివి. 3. ప్రహ్లాదుని రక్షించుట కొఱకు నృసింహ రూపముతో స్తంభము నందుదయించి స్వనఖములచే హిరణ్య కశ్యపుని పొట్టను చీల్చి చంపి, భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదస్వామికి ప్రేమామృతమును పంచి, జ్ఞానామృతమును త్రాగించితివి. 4. అమ్మా! ఉపమన్యుని కోసము పరుగులు తీస్తూ వచ్చి, క్షీరసాగరము నిచ్చి, ప్రేమామృతమును పంచి, నిజమైన క్షీరమును త్రాగించితివి. 5. ఓ విఠల రూప తల్లీ! కౌరవులచే నీడ్చుకు రాబడి, నిండు సభలో వస్త్రాపహరణముచే నవమానింపబడుచున్నపుడు, నీవు ఏమాత్రము జాగుజేయకుండా యేతెంచి, స్వయముగా వస్త్రరూపమును దాల్చి, ద్రౌపది మానము (గౌరవము)ను పరిరక్షించితివి. 6. వన వాసములో నున్నపుడు ధర్మరాజునవమానపరచుటకు విచ్చేసిన పదివేల మంది శిష్యబృంద సమేతుడైన దుర్వాసమునిని, ఒకానొక ఎంగిలి వనస్పతియాకును తిని (దుర్వాసుని) తృప్తి పరచితివి. 7. శ్రీ తుకారాం మహారాజుగా

రంటున్నారు– ఓ కృపాళువైన విఠల మాఉలీ! నీవు భక్తికి, మరియు ముక్తికి భాండాగారమువై యున్నావు. కావున నన్ను స్వీకరించి రక్షించుము. 8.

సు.వ్యా :- ప్రకృత అభంగములో శ్రీతుకారాం మహారాజుగారు పురాణోక్త అనేక మంది భగవద్భక్తుల చరిత్రలను స్మరిస్తూ – వారిని పూర్వము ఏవిధముగా ఉద్ధరించితివో, అట్లే నన్ను కరుణించి ఉద్ధరించ వలసినదని, శ్రీ పాండురంగని తల్లిగా భావించి సంబోధిస్తూ హృదయ పూర్వకముగా వేడుకుంటున్నాడు.

అభంగములోని మొదటి చరణములో "పాండురంగే" అను పదమును మూడు సార్లు ప్రయోగించాడు శ్రీతుకారామస్వామి. ఇచ్చట పునరుక్తి శంకావకాశము లేదు. ఎందుకనగా! కొన్ని సందర్భములలో పునరుక్తి (వీప్సా) దూషణముగ గాకుండ భూషణముగానే పరిగణించబడును.

శ్లో॥ పౌనరుక్త్యం న దోషోఽత్ర శబ్దేనార్థేన వా భవేత్ ।
అభ్యాసేన గరీయస్త్వమర్థస్య ప్రతిపాద్యతే ॥
(మానసోల్లాసము. 8–4)

భావము :- దార్శనిక గ్రంథములలో చెప్పబడిన సత్యము, బ్రహ్మ చర్యాది నియమములచే సాహిత్య సౌందర్యము నష్టమగును. అనగా ఒక శాస్త్రములో చెప్పిన నియమములు వేఱొక శాస్త్రములో నన్వయించవు. ఈ నియమానుసారము సాహిత్య శాస్త్రములో చెప్పబడిన పునరుక్తి దోషము వేదాంతశాస్త్రము, భక్తిశాస్త్రములలో నన్వయించదు. ఒకే శబ్దమును పునఃపునః కథనము చేయుట శబ్ద పౌనరుక్త్యము. ఒకే అర్థమును పదే పదే ప్రతిపాదించుట అర్థ పౌనరుక్త్యము. ఈ రెండును దర్శన శాస్త్రములలో ప్రయోగింప బడును. కాని ఈ పౌనరుక్త్యము(అభ్యాసము, వీప్సా, పునః

పునః ప్రయోగము) యేదిగలదో ఇది వేదాంత శాస్త్రములో దోషముగా లెక్కించ బడదు. మరేమనగా! ప్రతిపాద్య విషయము యొక్క గరీయస్త్వము (శ్రేష్ఠత, స్పష్టత) పెంపొందును. విషయము సరళముగా నవగతమగును. "అభ్యాసే హి భూయస్త్వ మర్థస్య భవతి" (భామతీ-1. పృష్ఠము. 9.) ఒకే తత్త్వమును (శబ్దము లేదా అర్థమును) పునః పునః సంకీర్తనముచే, దాని యొక్క సౌందర్యము, ఔత్కృష్ట్యము ఉత్తరోత్తరము వృద్ధి నొందును.- - -

ఏయే సందర్భములలో పునరుక్తి భూషణమగునో నిమ్నాంకిత శ్లోకము ద్వారా దెలియ వచ్చును.

శ్లో॥ విస్మయే చ విషాదే చ దైన్యే చైవావధారణే ।
సంప్రసాదనే హర్షే చ వాక్యమేకం ద్విరుచ్య తే ॥

అర్థము :- ఆశ్చర్యకరమైన, విషాద (దుఃఖ) ప్రసంగమునందు, దీన (దయనీయ, దౌర్భాగ్య) పరిస్థితుల యందు, నిశ్చయము, సంప్రసాదన (అనుగ్రహ, కృపా కళ్యాణకారి) ప్రసంగములందు మరియు హర్షము (ఆనందము, సంతోషము) ఇత్యాది సందర్భముల యందు ద్విరుక్తి ప్రయోగము నిర్దుష్టము.

1. విస్మయము :- దీనికి ఉదాహరణము -

శ్లో॥ అహోశాస్త్ర మహోశాస్త్ర మహోగురు రహో గురుః ।
అహో జ్ఞాన మహో జ్ఞాన మహో సుఖ మహో సుఖమ్ ॥
(వే. పం.ద. 7-297)

అర్థము :- ఆహా! శాస్త్రమెంత యద్భుతము! గురు వెంతటి మహాత్ముడు! ఈ జ్ఞానమెంతటి యద్భుతము! ఈ సుఖమెంత యనంతము!

**2. విషాదము :- దీనికి ఉదాహరణము -**

**శ్లో॥ కృష్ణ! కృష్ణ ! మహాయోగిన్! విశ్వాత్మన్! విశ్వభావన! ।**
**ప్రపన్నాం పాహి గోవింద! కురు మధ్యేఽవసీదతీమ్ ॥**
(మహాభారతము - సభాపర్వము- 68-43)

**అర్థము :-** ఓ సచ్చిదానంద స్వరూప శ్రీకృష్ణ! మహాయోగీ! విశ్వాత్మా! విశ్వభావన! గోవింద! నిండు కౌరవసభలో దుఃశాసనుచే హృత వస్త్ర కేశను, అబలను మరియు నీకు సంపూర్ణ శరణాగతనైన నన్ను (ద్రౌపదిని) రక్షింపుము స్వామీ!

**3. దైన్యము :- దీనికి ఉదాహఅణము -**

**శ్లో॥ కృష్ణ! కృష్ణ! మహాబాహో! దేవకీనందనావ్యయ! ।**
**వాసుదేవ! జగన్నాథ! ప్రణతార్తి వినాశన! ॥**

**దుఃశాసనాదహం పూర్వం సభాయాం మోచితా యథా ।**
**తథైవ సంకటాదస్మా న్మాముద్ధర్తు మిహార్హసి ॥**
(మహాభారతము - వనపర్వము - 163-8,16)

**అర్థము :-** హే కృష్ణ! హే మహాబాహు శ్రీకృష్ణ! హే దేవకీ నందన! హే అవినాశి వాసుదేవ! నీ చరణములను శరణజొచ్చిన దుఃఖితుల యొక్క దుఃఖమును దూరము చేయు నో జగదీశ్వరా! హే భగవన్! పూర్వము కౌరవసభలో దుఃశాసనుని బారి నుండి ఏవిధముగా నన్ను పరిరక్షించితివో, అట్లే ఈ దుర్వాసమునీశ్వరుని మూలమున సంప్రాప్త సంకటమునుండి (భిక్షను ప్రసాదించి) నన్ను ఉద్ధరింపుము స్వామీ! (అని ద్రౌపది శ్రీకృష్ణ పరమాత్మను వేడుకొనెను).

4. అవధారణము (నిశ్చయము) :- దీనికి ఉదాహరణము -

శ్లో॥ నానుష్ఠానాత్పరం కార్యం త్రిషు లోకేషు విద్యతే ।
సత్యం సత్యం పునః సత్యమితి మామక భాషితమ్ ॥

అర్థము :- "అనుష్ఠానాన్ని మించిన శ్రేష్ఠమైన కార్యము మరొకటి లేదు. ఇది ముమ్మాటికి నిజమని నేను చెబుతున్నాను". అని "శ్రీమలయాళ యతీంద్ర గీత"లో శ్రీమలయాళ సద్గురు దేవులు నుడివిరి.

5. సంప్రసాదనము :- దీనికి ఉదాహరణము -

శ్లో॥ సూత! సూత! మహాప్రాజ్ఞ! నిగమాగమ పారగ! ।
గురు స్వరూప మస్మాకం బ్రూహి సర్వమలాపహమ్ ॥
(గురుగీత 1-2)

అర్థము :- మహాధీమంతుడవగు నో సూతమహర్షీ! వేదములను, ఆగమములను పూర్తిగా తెలిసికొనిన నో సూతఋషివరేణ్యా! సమస్త మాయా మాలిన్యములను నిశ్శేషముగ నపహరించునట్టి గురుస్వరూపమును మాకు జెప్పుమా! అని శౌనకాది మహర్షులు సకల పురాణ ప్రవక్త యగు శ్రీసూత మహర్షిని గడు నాదరముతో నడిగిరి.

శ్లో॥ తాం హతాం భీరు సంకాశాం దృష్ట్వా సురపతిస్తదా ।
సాధు సాధ్వితి కాకుత్థ్సం సురాశ్చాభి పూజయన్ ॥
(శ్రీవాల్మీకి రామాయణము 1-26-26 )

అర్థము :- శ్రీరామచంద్రునిచే భయంకరమైన రాక్షసి తాటకి మఱణించుట గాంచి ఇంద్రాది దేవతలు కాకుత్థ్సకులతిలకుండైన శ్రీరామ చంద్రుని సాధు సాధు (చాలా బాగు, చాలా బాగు) అని ప్రశంసించిరి.

6. హర్షము :- దీనికి ఉదాహరణము-

శ్లో॥ ధన్యోఽహం ధన్యోఽహం నిత్యం స్వాత్మానమంజసా వేద్మి ।
ధన్యోఽహం ధన్యోఽహం బ్రహ్మానందో విభాతి మే స్పష్టమ్ ॥
(వేదాంత పంచదశి. 7-292)

అర్థము :- నేను ధన్యుడను! కృతార్థుడను! దేశకాలాద్య పరిచ్ఛిన్నమైన ప్రత్యగాత్మను నిరంతరము సాక్షాత్తుగా తెలిసికొనుచున్నాను. తత్ఫలముగ నాకు బ్రహ్మానందము యథా తథముగ స్ఫురించుచున్నది. 1.

సంసార దావాగ్నిచే పరితప్తమగుచున్న నన్ను పరుగు పరుగున వచ్చి కాపాడవమ్మా అంటూ మాతృభావముచే వేడుకుంటున్నాడు. శ్రీ తుకారామ స్వామి. అమ్మా! పాండురంగే! విఠలే! అలనాడు మొసలి బారి నుండి రక్షించమని సరోవరములోని కమలము పూవును తొండమున ధరించి పైకెత్తి హే శ్రీహరీ! యని మొరబెట్టుకున్న గజేంద్రుని పూర్వాపర విచారము జేయక పరుగున వచ్చి నీవు రక్షించలేదా! అట్లే నన్ను రక్షించలేవా!

గజేంద్రుడు శ్రీమన్నారాయణుని మొరబెట్టుకున్న తీరును, ఆర్తనాదమును అతి గంభీరముగా వర్ణించారు- శ్రీ మద్భాగవతములో శ్రీపోతనామాత్యులు.

ఉ॥ ఎవ్వని చే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై
యెవ్వని యందు డిందు బరమేశ్వరుడెవ్వడు మూలకారణం
బెవ్వడనాది మధ్యలయుఁడెవ్వడు సర్వము దానె యైన వా
డెవ్వడు వాని నాత్మ భవు నీశ్వరునే శరణంబు వేడెదన్ .

శా॥ లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువు న్డస్సెన్ శ్రమంబయ్యెడిన్.

**నీవే తప్ప నితఃపరం బెఱుంగ మన్నింపందగుం దీనునిన్**
**రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!.**

ఇత్తెఱంగున మకరి నోరున కఱువబడిన కరి, పరి పరి తెఱంగుల పరి రక్షించుమని కరుణా మూర్తియగు శ్రీహరిని మొఱబెట్టుకొనగా, నత్తఱి సిరికిం చెప్పక, గరుడాది పరివారము ననుసరింపక దైత్యారియును, ఆర్త సంరక్షకుడునునగు శ్రీహరి త్వర త్వరగా మకరి పీడిత కరి ధరికిఁ జేరవచ్చెను.

**మ॥ సిరికిం జెప్పడు శంఖ చక్ర యుగముం జేదోయి సంధింపడే।**
**పరివారంబును జీఱడభ్రగ పతిం బన్నింపదా కర్ణికాం ।**
**తర ధమ్మిల్లము జక్క నొత్తదు వివాద ప్రోత్థిత శ్రీ కుచో ।**
**పరి చేలాంచలమైన వీడడు గజప్రాణావనోత్సాహియై ॥**

భక్తుడైన గజేంద్రుని రక్షించుటకు వైకుంఠమును వీడి బయలుదేరిన శ్రీమన్నారాయణుని లక్ష్మీదేవి వెంబడించెను. ఆమెవెంట గరుత్మంతుడు, అతని వెంట ధనుష్షు, శంఖ చక్ర, గదాదులును, వాటి వెంట నారదమహర్షియును వెడలిరి. ఈ ప్రకారముగా ఋతుమంతమున సరోవరములో మొసలి నోట జిక్కుకొని పీడింపబడుచున్న గజరాజును శ్రీనాథుడు తన సుదర్శనముచే మకరిని ఖండించి కాపాడెను. కావున తనను శరణు జొచ్చిన వారిని సంరక్షింప సమర్థుడైన శ్రీహరినే సర్వులు ఆశ్రయించి తరించాలి. 2.

శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు - హే పాండురంగే! భక్తుల కొఱకు నీవు ఎంతటి కష్టమునైనా ఓర్చుకొంటివి. శ్రీఅంబరీషుని కొఱకు పది జన్మలను స్వీకరించితివి. (స్కం.పు. కార్తీక మాస మాహా. అధ్యా. 25 మరియు 26)

హే విఠలే! పరమ భాగవతోత్తముడైన శ్రీభక్త ప్రహ్లాదుని రక్షించి జ్ఞానామృతమును ప్రసాదించితివి గదా! మరి నన్నేల రక్షించుటకు జాగు చేయుచుంటివి. శ్రీహరి భజన మానుమని, అతనికి విస్మరించుమని తండ్రియగు హిరణ్య కశ్యపుడు ప్రహ్లాద స్వామిని ఏనుగులతో త్రొక్కించినను, సింహములకాహారముగ వైచినను, పర్వతములనుండి పడద్రోసినను, సర్పములచే కఱిపించినను– ఇత్యాది ఎన్నెన్నో కష్టములను పెట్టినప్పటికిని వాటి నుండి కాపాడితివి. ఏడిరా! నీ శ్రీహరీ! ఎక్కడున్నాడురా నీ యారాధ్య దైవము యని అగ్రహోదగ్రుడైన దానవాగ్రణియగు హిరణ్యకశ్యపుడు భక్తాగ్రేసరుడైన బాల ప్రహ్లాదుని యడుగ, శ్రీ ప్రహ్లాదస్వామి అంటున్నాడు.

మ॥ కలడంభోధిఁ గలండు గాలిఁగలఁడా కాశంబునం గుంభినిం
గలఁడగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాదులం
గలండోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగ వ్యక్తులందతటం
గలండీశుండు గలండు తండ్రి వెదుకంగా నేల యీ యాయెడన్.

కం॥ ఇందుగలడందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలడు దానవాగ్రణి వింటే.

ఈ తీరున భక్త శిరోమణియగు బాలప్రహ్లాదుండు బలుక క్రోధాగ్నిచే సంతప్త మత్త చిత్తంబుగల దైత్యేంద్రుడు తన కొమరుని – ఏమిరా! ఈ స్తంభము నందు గలడా నీ శ్రీహరి? యని నిర్జించి గర్జించగా నా బాలుడు నిర్భయనిర్దంభమనస్కుండై నిర్దయుడైన నిర్జరవైరితో సవినయముగా నిట్లనియె.

శా॥ అంభోజాసనుడాదిగాగ ద్రుణపర్యంతంబు విశ్వాత్ముడై
సంభావంబున నుండు ప్రోడ విపులస్తంభంబునందుండడే
స్తంభాంతర్గతుడౌటకున్ దలపనే సందేహమున్ లేదు ని
ర్దంభత్వంబున నేడు గానబడు బ్రత్యక్ష స్వరూపంబునన్.

ప్రహ్లాదస్వామి యీ తీరున గంభీరస్వరముతో బలుక, అగ్రహోదగ్రుడైన దనుజాగ్రణి హిరణ్యకశ్యపుడు గద్దియదిగి నుఱికి యొఱబెఱికి ఖడ్గంబు చేగొని ఝుళిపించుచు మహాభాగవత శిఖామణియైన ప్రహ్లాదుని ధిక్కరించుచు నెదుటఁగల స్తంభమును నఱచేతితో గ్రుద్దెను. వెంటనే భయంకరమైన రూపముతో శ్రీ నరసింహమూర్తి స్తంభము నుండి బ్రత్యక్షమాయెను.

కం॥ నరమూర్తి గాదు కేవల
హరి మూర్తియుగాదు మానవాకారము గే
సరి యాకారము నున్నది
హరి మాయారచితమగు యథార్థము జూడన్

తన యనన్య భక్తుడైన ప్రహ్లాదుని ఉద్ధరించుటకై శ్రీమహావిష్ణువే ఈ రూపములో ప్రకటమాయెను. అప్పుడు తనపై తలపడిన దనుజేంద్రుని శ్రీనరసింహమూర్తి తన తొడపై పడనిడి స్వనఖములచే నుదర విదారణము గావించి చంపివైచెను. ఈ రీతిగా పరమభాగవతోత్తముడగు శ్రీ ప్రహ్లాద స్వామిని యుద్ధరించి జ్ఞానామృతమును ప్రసాదించి ముక్తి నొసంగినాడు- భక్తవత్సలుడగు భగవంతుడు - శ్రీమన్నారాయణుడు. 4.

హే మా ఉలీ! విఠలే! ఉపమన్యుని యొక్క తపోనిష్ఠకు, నీయందు గల అతని యకుంఠిత విశ్వాసము (శ్రద్ధా), భక్తికి సంతుష్టుడవై నతని

నుద్ధరించుటకు పరుగునఁ విచ్చేసి, క్షీరసాగరమునిచ్చి, ప్రేమామృతమును పంచి, నిజమైన క్షీరమును త్రాగించితిని. (శివ పురాణము - వాయవీయ సంహితా - పూర్వఖండము 34 మరియు 35 అధ్యాయములలో గనందగును. ). 5.

అట్లే నిండు కౌరవ సభలో దుఃశాసనుడు ద్రౌపది వస్త్రాపహరణము గావించి యవమానించు సమయమున నీవు పరుగు పరుగున వచ్చి స్వయముగా నీవే వస్త్రరూపమును దాల్చి ద్రౌపది మానము (గౌరవము, శీలము)ను కాపాడితివి గదా! అలాగే దీనుడనైన నాకు నీ దర్శన భాగ్యము కలిగించి ఉద్ధరింపుము స్వామీ! అని శ్రీతుకారాం మహారాజుగారు శ్రీపాండురంగ (తల్లి)ని వేడుకుంటున్నాడు. దుఃశాసనుని బారి నుండి కాపాడుమని నిస్సహాయురాలగు అబల ద్రౌపది శ్రీకృష్ణ పరమాత్మను వేడుకున్న తీరును శ్రీ వ్యాసభగవానుడు మహాభారతములో చాలా చక్కగా వర్ణించారు.

శ్లో॥ గోవింద ద్వారకా వాసిన్ కృష్ణ గోపీ జనప్రియ ।
కౌరవైః పరిభూతాం మాం కిం న జానాసి కేశవ! ॥

శ్లో॥ హే నాథ! హే రమానాథ! వ్రజనాథార్తినాశన! ।
కౌరవార్ణవ మగ్నాం మా ముద్ధరస్వ జనార్దన! ॥

శ్లో॥ కృష్ణ! కృష్ణ! మహాయోగిన్! విశ్వాత్మన్! విశ్వభావన! ।
ప్రపన్నాం పాహి గోవింద! కురుమధ్యేఽవసీదతీమ్ ॥

అర్థము :- హే గోవింద! హే ద్వారకావాసి శ్రీకృష్ణ! హే గోపీ జన ప్రాణవల్లభ! కేశవ! కౌరవులు నన్ను వస్త్రాపహరణము చే నవమానించు చున్నారు. ఏమి? నీకు తెలియుట లేదా! హే నాథ! హే రమానాథ!

హేవ్రజనాథ! హే సంకట నాశన జనార్దన! నేను ఈ కౌరవరూప సముద్రములో మునిగి పోవుచున్నాను. నన్ను ఉద్ధరింపుము స్వామీ! సచ్చిదానంద స్వరూప హే శ్రీకృష్ణ! మహాయోగీ! విశ్వాత్మా! విశ్వభావన! గోవింద! కౌరవుల మధ్యలో దుఃఖము (కష్టము)ను పొందుచున్న అబలనైన మరియు నీకు సంపూర్ణ శరణాగతనైన నన్ను రక్షింపుము.

ఈ ప్రకారము త్రిలోక స్వామియైన శ్యామసుందర శ్రీకృష్ణ పరమాత్మను పదే పదే స్మరిస్తూ, మానినియగు ద్రౌపది దుఃఖ సంతప్తయై మొగమున కొంగు పెట్టుకొని (కప్పుకొని) బోరు బోరున ఏడుస్తూ మొఱబెట్టుకొనెను.

అంతట కృష్ణ, గోవింద, విశ్వాత్మా, హరి, నర అను నిత్యాది భగవన్నామములను జోరు జోరుగా నుచ్చరిస్తూ, శీఘ్రముగా నన్ను రక్షింపుము అని వేడుకుంటున్న ద్రుపద నందిని యొక్క మొఱలను కరుణా మూర్తి యగు శ్రీకృష్ణ డాలకించి గద్గదుడై, శయ్యను మరియు ఆసనమును వదలేసి దయచే ద్రవీభూతుడై నతి త్వరగా విచ్చేసి ధర్మ స్వరూపుడు, మహాత్ముడునగు శ్రీకృష్ణ పరమాత్మ అవ్యక్త రూపములో ద్రౌపది వస్త్రమున ప్రవేశించి, చిత్ర విచిత్ర సుందర మగు ననేక వలువలచే ద్రౌపది నాచ్ఛాదించి కాపాడెను. (శ్రీమన్మహాభారతము - సభాపర్వణి ద్యూతపర్వము - అధ్యాయము 68, శ్లోకము 41 నుండి 48 పర్యంతము.) 6.

ఒకసారి వనవాస సమయములో పాండవులు, ద్రౌపది మరియు తదితర అతిథ్యాదులందరు తృప్తిగా భుజించి విశ్రాంతి తీసికుంటున్న అదను చూసి పదివేల మంది శిష్యబృంద సమేతుడై శ్రీ దుర్వాస మునీంద్రులవారు ధర్మరాజు చెంతకు విచ్చేసెను. అదిగనిన ధర్మరాజు తన సోదరులందరితో దుర్వాసమునీశ్వరునికి ఎదురేగి చేతులు జోడించి ప్రణమిల్లి, సత్కార

పూర్వకముగా తీసికు వచ్చి ఉన్నతమైన సుందర ఆసనముపై కూర్చుండ బెట్టి, విధిపూర్వకముగా పూజలు నలిపి, మా ఆతిధ్యమును స్వీకరింపవలసినదని నిమంత్రణమిస్తూ ఇలా వేడుకున్నాడు. హే భగవన్! మీరు నిత్యకర్మ వినివృత్తులై శీఘ్రముగా విచ్చేసి, భోజనమును స్వీకరించగలరని మనవి.

దుర్వాసమునివర్యులు తమ శిష్యబృందముతో కలసి స్నాన సంధ్యాదులు తీర్చుకొనుటకు వెడలిపోయిరి. కాని, ఇంతమంది శిష్యులతో సహితమైన నాకు ధర్మరాజు భోజనమును ఎలా సిద్ధము చేయగలడు? అని మాత్రము విచారించలేదు. సమస్త శిష్యమండలి స్నానము చేసి, ఏకాగ్ర చిత్తులై ధ్యానము చేయుచుండిరి.

ఇక్కడ పతివ్రత ద్రౌపదికి భోజనము గూర్చి గొప్ప చింతగలిగెను. చాలగా ఆలోచించినది, విచారించినది. కాని ఇంతమందికి అన్నమును సమకూర్చుటకు ఏమియును ఉపాయము దోచదయ్యెను. అప్పుడు మనస్సులో శ్రీకృష్ణపరమాత్మను స్మరించుకొని నిస్సహాయురాలై, గత్యంతరము దోచక, దైన్యముతో హృదయపూర్వకముగా ఇలా వేడుకొనసాగెను.

శ్లో॥ కృష్ణ కృష్ణ మహాబాహో దేవకీనందనావ్యయ ।
వాసుదేవ జగన్నాథ ప్రణతార్తి వినాశన ।
విశ్వాత్మన్ విశ్వజనక విశ్వహర్తః ప్రభోఽవ్యయః ॥

శ్లో॥ ప్రసన్నపాల గోపాల ప్రజాపాల పరాత్పర ।
ఆకూతీనాం చ చిత్తీనాం ప్రవర్తక నతాస్మితే ॥

శ్లో॥ వరేణ్య వరదానంత అగతీనాం గతిర్భవ ।
పురాణ పురుష ప్రాణమనో వృత్త్యాద్యగోచర ॥

శ్లో॥ సర్వాధ్యక్ష పరాధ్యక్ష త్వామహం శరణం గతా ।
పాహి మాం కృపయా దేవ శరణాగతవత్సల ॥

శ్లో॥ నీలోత్పలదళశ్యామ పద్మగర్భారుణేక్షణ ।
పీతాంబర పరీధాన లసత్కౌస్తుభభూషణ ॥

శ్లో॥ త్వమాదిరంతో భూతానాం త్వమేవ చ పరాయణమ్ ।
పరాత్పరతరం జ్యోతిర్విశ్వాత్మా సర్వతోముఖః ॥

శ్లో॥ త్వమేవాహుః పరం బీజం నిధానం సర్వసంపదామ్ ॥
త్వయా నాథేన దేవేశ సర్వాపద్భ్యో భయం నహి ॥

శ్లో॥ దుఃశాసనాదహం పూర్వం సభాయాం మోచితా యథా ।
తథైవ సంకటాదస్మాన్మాముద్ధర్తు మిహార్హసి ॥
(మహాభారతము- వనపర్వము. 263-8.నుండి 16.వరకు)

అర్థము :- హే కృష్ణ! హే మహాబాహు శ్రీకృష్ణ! దేవకీనందన! హే అవినాశి వాసుదేవ! నిన్ను శరణు జొచ్చిన దుఃఖితుల దుఃఖమును దూరము చేయు నో జగదీశ్వర! నీవే సంపూర్ణ జగత్తుయొక్క ఆత్మ (స్వరూపము) వున్నావు. ఈ విశ్వము యొక్క సృష్ట్యంతములు నీ చేతియాట. ప్రభో! నీవు అవినాశివి. హే గోపాల! నీవు శరణాగత రక్షకుడువు. సమస్త ప్రజలను రక్షించు పరాత్పర పరమేశ్వరుడవు. నీవు ఆకూతి (మనస్సు)నకు మరియు చిత్తి (బుద్ధి)కి ప్రేరక పరమాత్మవు ఉన్నావు. అటువంటి నీకు నేను ప్రణామములు చేయుచుంటిని. సర్వులచే వరేణ్యుడవు. వరదాతవు అయిన ఓ అనంత! రమ్ము! ఎవరికి నీవు దప్ప ఇతరులెవరునూ సహాయకులు, రక్షకులు లేరో, అటువంటి అసహాయభక్తులకు సహాయము చేసి రక్షించుము. హే పురాణ పురుష! ప్రాణమనోవృత్తులు నిన్ను చేరలేవు. హే

సర్వ సాక్షి పరమాత్మా! నేను నీకు శరణు జొచ్చితిని. హే శరణాగతవత్సల! కరుణించి నన్ను రక్షింపుము. నీలకమలదళముతో సమానమగు నో శ్యామసుందర! కమలపుష్పములోపలి భాగము వలె కించిత్ ఎరుపు వర్ణము నేత్రములవాడా! కౌస్తుభమణి విభూషిత! మరియు పీతాంబరధారి యగు నో శ్రీకృష్ణ! నీవే సమస్త భూతములకాదియును, అంతమును నైయున్నావు. నీవే పరమాశ్రయుడవు. నీవే పరాత్పరుడవు, జ్యోతిర్మయుడవు, సర్వవ్యాపకుడవు మరియు సర్వాత్మయై యున్నావు. నీవే జగత్తునకు పరమకారణమని, సమస్త సంపదలకధిష్ఠానమని జ్ఞాని పురుషులు చెప్పుచున్నారు. హే దేవేశ! నీవు నాకు రక్షకుడవై, అండగానుండగ, సమస్త విపత్తులు నాపై విరిగిపడినప్పటికి భయము లేదు. ఇంతకు పూర్వము సభలో దుఃశాసనుని బారి నుండి నన్నెలా రక్షించితివో, అట్లే ఇప్పుడు దుర్వాసమునీంద్రుల వారి మూలమున గలిగిన ఈ గొప్ప విపత్తు నుండి గూడ భోజనమును (భిక్షను) ప్రసాదించి నన్ను ఉద్ధరింపుము.

ద్రౌపది ఈ తీరును భగవంతుడైన శ్రీకృష్ణపరమాత్మను స్తుతించగా అచింత్య గతి పరమేశ్వరుడు, దేవాధిదేవుడు, జగన్నాథుడు భక్తవత్సలుడైన భగవాన్ కేశవుడు ద్రౌపది సంకటములో నున్నదని తెలిసికొని అతి శీఘ్రముగ నేతెంచి, ద్రౌపదిచే నక్షయ పాత్రను తెప్పించుకొని, అందులోని యవశిష్ట ఉచ్ఛిష్ట పత్రము నొకదానిని తిని, ద్రౌపదితో ఇలా అన్నాడు పరమాత్మ- "ఈ కూరాకు (పత్రము)తో సంపూర్ణ విశ్వమునకు ఆత్మ అయిన యజ్ఞ భోక్త సర్వేశ్వరుడు భగవాన్ శ్రీహరి పరితృప్తుడగు గాక!" ఇంతటితో దుర్వాసుడు మరియు నతని శిష్యులందరు మధురమైన పక్వాన్నభోజనములను కంఠము వరకు భుజించినట్లుగా పరిపూర్ణతృప్తితో త్రేపులు తీసిరి. ఇక ధర్మరాజు వద్దకు వెళ్ళి భోజనమును స్వీకరించుటకు లజ్జితులై పలాయనము చిత్తగించిరి.

శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు- ఒకానొక ఎంగిలియాకు (వనస్పతి)ని భుజించి, వనవాసములో నున్న ధర్మరాజును అవమానించుటకు పదివేల మంది శిష్యులతో సమేతముగా విచ్చేసిన దుర్వాస మునీశ్వరుని తృప్తి పరచి ద్రౌపదీ సమేత పాండవులను విపత్తు నుండి కాపాడితివి. 7. కావున హే విఠలే! కృపాళువైన మా ఉలీ! భక్తికి మరియు ముక్తికి భాండాగారమువైన నీవు సంసారదావాగ్నిచే పరితప్తుడనగు నన్ను స్వీకరించి రక్షింపుము. నీ యొక్క దివ్యమైన శ్యామ సుందర విగ్రహ(స్వరూప) సందర్శన భాగ్యమును కలిగించి దీనుడనగు నన్ను ధన్యునిగా జేయుము. 8.

**36. అభంగము :-**

**కోఠేఁ గుంతలాసీ కోణాచ్యాధా వయాం ।**
**ఆలీ దేవరాయా నిద్రా తుజ ॥1॥**

కోఠే గుంతలాసీ భక్తి ప్రేమసుఖేఁ ।
**న సుటతీ ముఖేఁ గోపికాంచీఁ ॥2॥**

**కాయ పడలే తుజ కోణాచేఁ సంకట ।**
**దురీ పంథ వాటన చలవే ॥3॥**

**కాయ మాఝే తుజ గుణదోష దిసతీ ।**
**హ్మణోని శ్రీపతి కోపలాసీ ॥4॥**

**కాయ ఝాలే సాంగ మాఝియా కపాళా ।**
**ఉరలా జీవ డోళాం తుకా హ్మణే ॥5॥ (1622)**

ప్ర.ప :- దేవరాయా! = ఓ దేవరాయా! (విఠలా! నీవు); కోఠే = ఎక్కడ; గుంతలాసీ = చిక్కులో పడ్డావు?; కోణాచ్యా = ఏ భక్తుని యొక్క (సంకటమును దూరము చేయుటకు); ధావయాం = పరుగెత్తుకొని వెళ్ళావు?;

(లేదా) తుజ = నీకు; నిద్రా = నిద్ర; ఆలీ= వచ్చినదా? 1. కోఠే = ఎక్కడ; గుంతలాసీ= నిమగ్నమయ్యావు?; గోపికాంచీం= గోపికల యొక్క భక్తిప్రేమ సుఖేం = భక్తి ప్రేమ సుఖము వలన (చుంబనాది రాసక్రీడలలో మైమరచిపోయావా? ఎందుకంటే గోపికల యొక్క); ముఖే = ముఖముల నుండి (నీవు); న సుటతీ = విడివడవు. 2. కోణాచే = యే భక్తుని యొక్క; సంకట = సంకటము (విపత్తు యేదయినా అకస్మాత్తుగా); తుజ = నీపై; పడలే కాయ? = పడినదా యేమి?; (లేక) పంథవాట = మార్గము; దురీ = దూరమున్నదని; న చలవే = నడవ(లేనని) రాదని; (నాకు దర్శనమిచ్చుటకు వచ్చుట లేదా?)3. కాయ = ఏమి? మాఝె = నాయొక్క; గుణదోష= అపరాధములు; తుజ =నీకు; దిసతీ= కనిపించినవా?; శ్రీపతి = హే లక్ష్మీపతి!; హ్మణోని = అందుకని; కోపలాసీ = (నాపై) అలగితివా? (కోపించితివా?)4. (రంగా) కాయ = ఏమి; ఝాలె = అయినది; సాంగ = చెప్పు; (నీయొక్క దర్శన భాగ్యము కలుగకుండుట యేది గలదో యది) మా ఝియా = నాయొక్క; కపాళా = దైవము (ప్రారబ్ధము అంటావా? నీ దారి కోసము ఎదురు చూస్తూ) జీవ = ప్రాణము; డోళాం = కళ్ళలోకొచ్చి; ఉరలా = మిగిలింది అనగా నిలిచింది; (అని) తుకాహ్మణే = శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు. 5.

తా॥ హే దేవరాయా! విఠలా! రంగా! నీవు ఎక్కడ చిక్కుకు పోయావయ్యా. ఏ భక్తుని యొక్క సంకటమును దూరము చేయుటకు పరుగెత్తుకొని వెళ్ళలేదు గదా! లేక నీకు నిద్ర పట్టలేదు గదా! 1. ఏదైనా విశేష కార్యములో నిమగ్న మయ్యావా? చెప్పవయ్యా! భక్తి ప్రేమ సుఖము వలన గోపికలతో చుంబనాది రాసక్రీడలలో నిమగ్న మయ్యావా? ఎందుకనగా! గోపికల యొక్క ప్రేమ ముదిత మోములు (ముఖములు) నిన్ను ఆకర్షించి వదలలేవు. 2. లేక అకస్మాత్తుగా యే భక్తుని యొక్క

సంకటమయినా వచ్చి నీపై బడినదా? లేక మార్గము చాలా దూరమున్నదని, వెళ్ళలేనని యెంచి, నాకు దర్శనమొసంగుట కరుదెంచలేదా? 3. హే లక్ష్మీపతి! నా యందేమైనా అక్షమ్య దోషములు గనుపించినవా? అందువలన నాపై కోపము బూనితివా? 4. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు – హేరంగా! నీ రాక కోసము ఎదురు చూస్తూ నా ప్రాణములు కళ్ళలోకొచ్చాయి. నాకీ దుర్దైవమెందు కొచ్చినదో చెప్పవయ్యా! 5.

**37.** అభంగము :-

కాం హెూ యెథే కాళ అలా ఆమ్హాం ఆడ ।
తుహ్మాపాశీం నాడ కరావయా ॥1॥

కాం హెూ విచారాచేం పడిలే సాంకడేం ।
కాయ ఐసేం కోడేం ఉపజలేం ॥2॥

కాం హెూ ఉపజేనా ద్యావీ ఐసీ భేటీ ।
కాయ ద్వైత పోటీం ధరిలేం దేవా ॥3॥

పాప ఫార కింవా ఝూలాసీ దుర్బళ ।
మాగిల తే బళ నాహీం ఆతాం ॥4॥

కాయ ఝూలేం దేణేం నిఘాలేం దివాళేం ।
కీం బాంధలాసీ బళేం ఋణాపాయీం ॥5॥

తుకా హ్మణే కారే ఐసీ కేలీ గోవీ ।
తుఝీ మాఝీ ఠేవీ నివడునీ ॥6॥ (489)

ప్ర.వ :- హెూ = ఓ దేవా!; తుహ్మాపాశీం = నీవద్దకు (నీదర్శనమునకు); నాడ = ప్రతిబంధకము; కరావయా = చేయుటకు;

ఆహ్మే = మా; యెథే = వద్దకు(ఎదుటకు); ఆడ = మధ్యలో (అడ్డముగా); కాళ = (ఈ) దుర్దైవము; కాం = ఎందుకు; అలా = వచ్చినది. 1. హెూ = ఓదేవా!; (నాకు దర్శనము యిచ్చుటకు వీలుగాకుండ) ఐసే = ఇటువంటి (అంతటి); కోడేc= చిక్కుప్రశ్న; కాయ = ఏమి; ఉపజలేc = ఏర్పడినది?; (నీకు) విచారాచేc= విచారించదగిన; సాంకడేc = సంకటము; కాం?= ఏమి?; పడలీ = పడింది.(కలిగింది)2. హెూ = ఓ దేవా!; (నాకు) బేటీ = దర్శనము, ద్యావీ = ఇవ్వాలి; ఐసీ = అనునటువంటి; (సంకల్పము నీమనస్సులో); కాం = ఎందుకు; ఉపజేనా = ఉత్పన్నమగుట లేదు; దేవా= ఓ పాండురంగా!; (నా విషయంలో) పోటీ = పొట్టలో (మనస్సులో); ద్వైత= ద్వైత బుద్ధి (వెరబుద్ధి); కాయ = ఎందుకు; ధరిలేc = ధరించినావు? 3. (ఓ దేవా! నీవు నాకు దర్శనమివ్వకుండుటకు కారణము నాయొక్క) పాప = పాపము ; ఫార = ప్రబలముగా నున్నదా?; కింవా = లేక; (నీవు); దుర్బల= దుర్బలుడవు; ఝలాసీ = అయినావా?; మాగిల = పూర్వపు (దుష్టులను సంహరించినటువంటి) తేc = ఆ =బళ=బలము ; ఆతాం = ఇప్పుడు ; నాహీc=లేదా (ఏమి?)4.(ఓ దేవా!) దేణే ఝాలే కాయ = ఎవరికైనా అప్పుల బడితివా? (అప్పులపాలయ్యావా?) లేక); దివాళేc నిఘాలేc = దివాలు దీసితివా?(దరిద్రుడవయితివా?) కీం = లేక;ఋణాపాయీc = ఋణదాత చెంత;బళేc= బలవంతముగా; బాంధలాసీ= కట్టివేయ బడితివా? 5. తుకా హ్మణే = శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు; కారే = ఏమయ్యా!; తుఝీ = నీయొక్క; మాఝీ = నాయొక్క ; ఠేవీ = ఉపాధిరూప నిధిని; నివడునీ = వేఱుజేసి; ఐసీ = ఇటువంటి; గోవీ = కుట్ర (ఎందుకు); కేలీ= పన్నినావు? 6.

**తా॥** దేవా! నీ యొక్క దివ్య సుందరరూప సందర్శన భాగ్యము కలుగకుండా ప్రతిబంధకమై ఈ కాలము (దుర్దైవము) మా ముందుకు

యెందుకు వచ్చినదో?1. రంగా! నాకు నీ దర్శన మిచ్చుటకు నంతగా విచారించ దగిన సంకటమేమి యేర్పడినది?2. విఠలా! "నాకు (ఈ తుకారాం కు) దర్శనమివ్వాలి" యను సంకల్పము నీ మనస్సులోని కెందుకు రావటము లేదు? దేవా! నాపట్ల యింత కఠినముగా నెందుకు వైరము బూనితివి?3. పాండురంగా! నీవు నాకు దర్శనమివ్వకుండుటకు కారణము నా పాపము ప్రాబల్యమా? లేక, నీ దౌర్బల్యమా? ఏమయ్యా! పూర్వము హిరణ్యకశ్యపున్ని మరియు రావణాదులను శిక్షించిన బలము ఇప్పుడు నీలో లేదా? 4. దేవా! యెవరికైన అప్పులు బడితివా? లేక దివాలా దీసినవా? లేక నీవు అప్పు దీర్చలేవని యే ఋణదాత యైనా (అప్పిచ్చిన వాడు) నిన్ను బలవంతముగా కట్టివేసినాడా? ఏమైందో నాకు తెలియుడము లేదు. 5. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు – దేవా! ఒకవేళ నీకు నన్ను ముక్తుని జేయుటకిష్టమే లేకుంటే, నీయొక్క యుపాధి(మాయను) మరియు నా యొక్క యుపాధి (యవిద్యను) వేఱుజేసి మన యొక్క "ఆనందము" అను నిధిని విభాగము జేసి నీవు శాశ్వతానందమును దీసికొని, నాకు క్షణికము, దుఃఖమిశ్రితమైన స్వల్పానన్దమును యిచ్చి, చాలా నైపుణ్యముతో, యుక్తితో కుట్రబన్ని నన్ను దరిద్రుని జేసి సంసారబంధములో యెందుకు పడద్రోసితివి? 6.

శ్లో॥ సర్వజ్ఞస్త్వం నిరవధికృపాసాగరః పూర్ణశక్తిః
కస్మాదేనం న గణయసి మామాపదబ్ధౌ నిమగ్నమ్ ।
ఏకం పాపాత్మకమపి రుజా సర్వతోఽత్యన్తదీనం
జన్తుం యద్యుద్ధరసి శివ కస్తావతాతిప్రసంగః ॥

అర్థము :– హే శివ! నా యొక్క హృత్తాపస్థితిజ్ఞుడవు, కృపాళువు, పరిపూర్ణ సమర్థుడవై యుండియు ఈ భవరోగగ్రస్తుడను, అత్యంత

పాపాత్ముడను, నీవు తప్ప అన్యమగు దిక్కు లేని దీనుడను, సంసారారణ్య ప్రయాణములో ఏకాకిని, నిస్సహాయుడనగు నన్ను ఉద్ధరించుటకు నీకేమి భారమగు చున్నది? ఉద్ధరింపబడు నీ భక్తకోటిలో నన్నెందుకు లెక్కించుట లేదు? సంసార సముద్రములో మునిగి యున్న నన్ను యెందుకు ఉ ద్ధరించుట లేదు?

(శ్రీమదప్పయ్య దీక్షిత విరచిత "ఆత్మార్పణస్తుతి-31)

ఈ అభంగములో శ్రీతుకారామస్వామి వక్రోక్తిచే వ్యంగ్యముగా మాట్లాడినప్పటికి భగవంతునిపై తనకు గల యకుంఠిత భక్తి ద్యోతితమగు చున్నదని దెలియవలెను.

**38. అభంగము :-**

**ఆముచా తూ ఋణీ రాయాంచాచి దేవా ।**
**మాగావయా తేవా ఆలోం దారా॥1॥**

**వర్మ తుఝె ఆమ్హాం సాంపడలేం హాతీం ।**
**ధరియేలేం చిత్తీం దృఢపాయ ॥2॥**

**బైసలోం ధరణేం కోండోనియా ద్వారీం ।**
**అంతూని బాహరీం యేవోం నేదీ ॥3॥**

**తుజ మజ సరీ హోఊల యా విచారేం ।**
**జళోం భాండఖోరేం నిలాజిరీం ॥4॥**

**భాండవల మాఝేం మిరివిసీ జనీం ।**
**సహస్ర ఓవణీ నామ మాలా॥5॥**

**తుకా మ్హణే ఆమ్హీ కేలీం జీవేం సారీం ॥**
**తుమ్హా ఆమ్హా తుటీ ఘాలూం ఆతాం ॥6॥ (2167)**

ప్ర.ప :- హే పాండురంగా!; తూ = నీవు; అముచా = మాయొక్క (ఆత్మరూప ధనమును); తాయాంచాచి = అనాది కాలమునుండి; (నీవద్ద ఉంచుకొని, మాకు) ఋణీ = ఋణపడి(బాకీ) ఉన్నావు. (కావున) దేవా! = ఓ దేవా!; లేవా = మా ఆత్మరూపధనమును; మాగావయా = తిరిగి మాకు యిచ్చి వేయుమని యడుగుట కొరకు; దారా = (నీ)ద్వారము వద్దకు; ఆలోఁ= వచ్చితిని. 1. ఆమ్హా = మాకు; తుఝె = నీయొక్క వర్మ = రహస్యము; హాతీఁ= చేతికి; సాంపడలేఁ = దొరికింది; (అందువల్లనే) చిత్తీఁ= చిత్తమునందు; (నీయొక్క) పాయ = పాదములను; దృఢ = గట్టిగా; ధరియేలేఁ= ధరించి యున్నాను. 2. (నిన్ను=లోన) కోండోనియా = బంధించి; (నీ) ద్వారి = ద్వారమునందు; ధరణే = బాకీ వసూలు చేయుటకు (నిరాహారదీక్షబట్టి) బైసలోఁ = కూర్చున్నాను. (ఇప్పుడు నిన్ను) అంతూని = లోపలనుండి; బాహెరీఁ= బయటకు, యేవోఁ నేదీ = రానివ్వను. 3. మజ= నాకు; (నాస్వరూపధనమును తిరిగి యిచ్చివేస్తే = నేను) తుజ = నీతో; సరీ= సమానుడను; హెూ ఈల = అవుతానేమోనని; యా ఈ; విచారే = ఆలోచనచే (నీవునాకు నాధనమును ఇవ్వడము లేదు గదా!; ఇటువంటి); భాండఖోరేఁ = జగడాల మారి; నిలాజిరీఁ=సిగ్గులేని (ఆలోచనలు); జళోఁ= కాలిపోవుగాక!. 4. (నీవు) మాఝేఁ = నాయొక్క; భాండవల = పెట్టుబడి (తీసికొని); జనీఁ= జనములో (లోకములో); మిరివిసీ = (నేను దేవుడినని) ఊరేగుచున్నావు గదా!; (నీయొక్క) సహస్రనామమాలా = దివ్యనామ సహస్రమను పుష్పమాలరూప గుచ్ఛమును. 5. ఆమ్హీ = మేము; సారీఁ జివేఁ = సంపూర్ణ జీవితమును (సమర్పించి) ; కేలీఁ = చేసితిమి (అల్లితిమి); తుకామ్హణే = శ్రీ తుకారాం మహారాజుగారు అంటున్నారు; ఆతాం = ఇప్పుడు (మాత్రము); తుమ్హా = నీకు; అమ్హా = మాకు (గల స్వామి సేవక సంబంధము); తుటీ = త్రెంచి; ఘాలూఁ = పడవేసెదము. 6.

**తా॥** హే పాండురంగా! అనాది కాలము నుండి నీవు మా యొక్క ఆత్మరూపధనమును నీవద్ద ఉంచుకొని మాకు ఋణపడియున్నావు. అందువలన మా ధనమును మాకు తిరిగి యిచ్చి వేయుమని యడుగుట కొఱకు నీ ద్వారము వద్దకు వచ్చితిని. 1. దేవా! ఇప్పుడు నీ యొక్క ప్రాప్తి రహస్యము మా చేతికి దొరికింది. (తెలిసింది) అందుకే నీయొక్క దివ్య పాదారవిందములను చిత్తము నందు గట్టిగా ధరించితిమి. 2. రంగా! నిన్ను లోన బంధించి మా బాకీ మాకు యిచ్చేంతవఱకు ఇక్కడ నుండి కదలమని నిశ్చయించుకొని నీ ద్వారమున కూర్చొని యున్నాను. ఇప్పుడు నిన్ను లోపల నుండి బయటకు వెళ్ళనివ్వను. నా బాకీ నాకు యిచ్చి తీరాలి. యిచ్చిన తరువాతే నీవు యిక్కడినుండి కదలాలి. 3. "ఆత్మరూప ధనమును తిరిగి యిచ్చివేస్తే తుకారాం సచ్చిదానందరూపుడవతాడని, నాతో సమానుడవుతాడని, దానిచే నా మాహాత్మ్యము యేమియును, ఉండదని" యీ విధముగా తలంచి నీవు మా యాత్మధనమును మాకు యివ్వడము లేదు గదూ! ఆహా! యేమి నీ యుక్తి(కుట్ర). ఇటువంటి యబద్ధాలకోరు, జగడాలమారి మరియు సిగ్గులేని విచారమునకు అగ్నితగులబడు గాక! 4. దేవా! నీవు లోకములో మా యొక్క పెట్టుబడిని(మూలధనమును) గైకొనియే గదా- నేను దేవుడని విఱ్ఱవీగుచు ఊరేగుచున్నావు. ఒక వేళ నేను నీ భక్తుడనై సేవచేయకుంటే, నిన్ను దేవుడని యెవరంటారు? చెప్పుము నీయొక్క దివ్య సహస్రనామమాలారూప పుష్పగుచ్ఛమును-5. నా జీవితమంతా సమర్పించి యల్లితిని. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - విఠలా ఇప్పుడు మాత్రము నీకు మాకు గల స్వామి సేవక సంబంధమును త్రెంచి పారవేసెదము. 6.

39. అభంగము :-

స్వప్నీఁ తోహి కైసా న పడసీ డోళాం ।
సుందర సావళా ఘవ ఘవీత ॥1॥

చతుర్భుజ మాళా రుళే ఏకావళీ ।
కస్తూరీ నిఢళీం రేఖిలీసే ॥2॥

శంఖ చక్ర గదా రుళే వైజయంతీ ।
కుండలే తళపతీ శ్రవణీఁ దోన్హీఁ ॥3॥

తుకా మ్హణే స్వప్నీ దావీ ఆతా పాయ ।
పాండురంగే మాయా కృపావంతే ॥4॥ (3263)

ప్ర.ప :- (దేవా!) సావళా = శ్యామలవర్ణము గల (నీయొక్క); సుందర = సుందరమైన (రూపము, అత్యద్భుతముగా); ఘవఘవీత = మెఱయు చున్నది; తోహి = అటువంటి (నీ సుందర రూపము, నాకు); స్వప్నీఁ= స్వప్నమందైననూ, డోళాం = దృష్టియందు; న పడసీ = పడుట లేదు; కైసా = ఎందుకు? 1. (దేవా! నీవు) చతుర్భుజ = నాలుగు చేతులు గల వాడవై; (కంఠమునందు) ఏకావళీ మాళా = పుష్ప మాలల గుచ్ఛము (సముదాయముచే); రుళే శోభించుచున్నావు; నిఢళీం = నుదుట కస్తూరిచే (తిలకము) ; రేఖిలీసే = దిద్దబడి యున్నావు. 2. శంఖ, చక్ర, గదా (పద్మ)= శంఖ, చక్ర, గదాదులు (నాలుగు చేతులలో గలవాడవై, మెడలో); వైజయంతీ= వైజయంతీమాల(ను ధరించి); రుళే = శోభించుచున్నావు; దోన్హీ = రెండు; శ్రవణే = చెవులయందు; కుండలే = కుండలములు; తళపతీ = మినుకు మినుకు మని ప్రకాశించుచున్నవి. 3. తుకా మ్హణే = శ్రీతుకోబారాయ్ అంటున్నాడు; పాండురంగే = హే పాండురంగ(మాతా)! కృపావంతే =

కృపాళువైన, మాయ = తల్లీ!; ఆతా = ఇప్పుడు; స్వప్నీ = స్వప్నములోనైనా; (నీయొక్క) పాయ = చరణారవిందములను; దావీ= దర్శింపజేయును. 4.

**తా॥** హే రంగా! ఇన్ని రోజులుగా నీయొక్క భక్తిని జేయుచున్నాను. కాని, శ్యామసుందరరూపంతో ధగ ధగ మెఱయుచున్న నీ దివ్య మంగళ దర్శనమును వ్పప్నములో గూడ చూపించవైతివి. ఎందుకు స్వామీ? 1. దేవా! నీవు చతుర్భుజుడవై, మెడలో సుగంధ పుష్పగుచ్ఛములు, లలాటమున కస్తూరి తిలకము దిద్దబడినవాడై శోభిల్లుచున్నావు. 2. నాలుగు చేతులలో శంఖ, చక్ర గద మరియు పద్మమును ధరించినవాడవై, మెడలో వైజయంతీ మాలతో శోభించుచున్నవాడవై రెండు కర్ణపుటములందు మినుకు మినుకున మెఱయు కుండలములు గలవాడవైయున్నావు. ఇటువంటి నీ సుందర రూపమును ఒకసారి యైనా దర్శించి ధన్యుడను కావాలను కోవడము స్వాభావికము. అందువలన. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - హే కృపాళువైన పాండురంగ మాతా! ఇప్పటికైనా నీవు నీ దివ్యస్వరూపమును స్వప్నమందైననూ చూపించి, నా మనస్సునకు శాంతిని, తృప్తిని ప్రసాదించుము. 4.

**సు.వ్యా :-** శ్రీ తుకారాం మహారాజుగారు తన యొక్క భగవద్దర్శనోత్కంఠను వ్యక్తీకరిస్తూ పరమాత్మయొక్క సగుణ స్వరూపమును చక్కగా వర్ణించారు.

**శ్లో॥ కస్తూరీ తిలకం లలాట ఫలకే వక్షఃస్థలే కౌస్తుభం**
**నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్ ।**
**సర్వాంగే హరిచందనం చ కలయన్ (సులలితం) కంఠే చ ముక్తావళీం**
**గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాలచూడామణిః ॥**
(శ్రీబిల్వ మంగళ విరచిత - శ్రీకృష్ణకర్ణామృతమ్ 2-109)

**అర్థము :-** ఎవరి లలాటమందు (నుదుటియందు) కస్తూరి తిలకము గలదో, వక్షఃస్థలమున కౌస్తుభమణి, నాసాగ్రము (ముక్కు చివరన)న సుందరమైన క్రొత్త ముత్యమును, కరతలము నందు వేణువు; చేతుల యందు కంకణములు సుశోభితమై యున్నవో, సంపూర్ణ శరీరమందు హరిచందనము పూయబడి యున్నదో మరియు యెవరి కంఠము నందు మనోహరమైన ముత్యాల హారము గలదో, అటువంటి గోపాలశ్రేష్ఠుడగు శ్రీకృష్ణుడు గోపికలు తన్ను చుట్టి ముట్టి నిలువగా మిగుల విరాజిల్లుచున్నాడు.

శ్లో॥ సశంఖ చక్రం సకిరీట కుండలం,
సపీతవస్త్రం సరసీరుహేక్షణమ్ ।
సహారవక్షఃస్థల కౌస్తుభశ్రియం
నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్ ॥
(బ్రహ్మాండ పురాణము విష్ణు పంజర స్తోత్రములో)

**అర్థము :-** ఎవడు శంఖచక్రములను ధరించి యున్నాడో, కిరీటము మరియు కుండలములచే విభూషితుడై యున్నాడో, పీతాంబరమును ధరించి, సుందరమైన కమలములవంటి కన్నులు గలవాడై యున్నాడో, మరియు యెవరి వక్షఃస్థలము వనమాల సహితముగా కౌస్తుభమణితో అత్యద్భుతముగా సుశోభితమై యున్నదో - అటువంటి చతుర్భుజుడైన శ్రీ మహావిష్ణువునకు నేను శిరము వంచి ప్రణమిల్లుచున్నాను.

శ్రీతుకారాం మహారాజుగారు అభంగములోని ప్రథమాంతిమ చరణములలో తనయొక్క తీవ్ర భగవద్దర్శనేచ్ఛను వ్యక్తము చేస్తూ జాగునోపలేక భగవద్దర్శనము యింకెప్పుడగునా - అను నసీమతపనతో స్వప్నములో నైనా కనుపించమని వేడుకొనుచున్నాడు.

శ్లో॥ త్వమేకో లోకానాం పరమ ఫలదో దివ్యపదవీం
వహంతస్త్వన్మూలాం పునరపి భజన్తే హరిముఖాః ।
కియద్వా దాక్షిణ్యం తవ శివ మదాశా చ కియతీ
కదా వా మద్రక్షాం వహసి కరుణాపూరిత దృశా ॥
(శివానందలహరి. 18.)

**అర్థము :-** హే శివ! సకల జీవుల కర్మఫల ప్రదాతవు నీవొక్కడవే. విష్ణ్వాదులు నీచే సంప్రాప్తమైన యలౌకిక పదవుల ననుభవిస్తూ గూడ యనన్య భక్తితో నహర్నిశలు నిన్నే భజించుచున్నారు. నీ యొక్క శక్తి (సామర్థ్యము) అపారము. అందులో నా ప్రార్థన యెంత? (అత్యల్పము) నీవు తలిస్తే నన్ను తరింపజేయుటకు క్షణము పట్టదు. కావున నో శివ! నీ కరుణా కటాక్ష వీక్షణములచే నన్నెప్పుడు రక్షించెదవు. ఈ భవసాగరము నుండి యెప్పుడు తరింప జేసెదవు.

**40. అభంగము :-**

నకో బ్రహ్మజ్ఞాన ఆత్మస్థితిభావ ।
మీభక్త తూ దేవ ఐసేఁ కరీ ॥1॥

దావీఁ రూప మజ గోపీకారమణా ।
ఠేవీన చరణావరీఁ మాథా ॥2॥

పాహీన శ్రీముఖ దే ఈన ఆలింగన ।
జీవే నింబలోన ఉతరీన ॥3॥

పుసతాం సాంగేన హితగుజ మాత ।
బైసోనీ ఏకాంత సుఖ గోష్టీ ॥4॥

**తుకా మ్హణే యాసీఁన లావీఁ ఉశీర ।**
**మాఝే అభ్యంతర జాణోనియాం ॥5॥ (2264)**

ప్ర.ప :- (దేవా!నాకు నీ యొక్క) బ్రహ్మజ్ఞాన = బ్రహ్మజ్ఞానము (గాని); ఆత్మస్థితి భావ = ఆత్మనిష్ఠ (గాని) ; నకో = వలదు. (దానికంటె); మీ భక్త = నేను భక్తుడను (మరియు); తూదేవ = నీవు దేవుడవు (అను ఉపాస్య ఉపాసక భావము); ఐసేఁ కరీ = ఈ విధముగా నుండునట్లు జేయుము. 1. గోపికారమణా = గోపికారమణ! ; మజ = నాకు (నీయొక్క శ్యామ సుందర)రూప= రూపమును ; దావీఁ = చూపుము ; మాథా = నా శిరస్సును; (నీయొక్క ) శ్రీముఖ = ఐశ్వర్య సంపన్నమైన సుందరముఖమును; పాహీన = చూచెదను; (మరియు) ఆలింగన = కౌగిలి; దేఈన = ఇవ్వగలను; జీవేఁ = మనః పూర్వకముగా ; నింబలోన = దిష్టి; ఉతరీన = తీయగలను. 3. (ఒకవేళ నీవు నన్ను) పుసతాం = అడిగినచో ; హితగుజ మాత = గుహ్యమైన రహస్య ముచ్చట్లు ; సాంగేన = చెప్పగలను; ఏకాంత = ఒంటరిగా (నీతో); బైసోనీ = కూర్చొని; సుఖ గోష్టీ = సంతోషకరమగు విషయములు (చెప్ప గలను). 4. తుకామ్హణే = శ్రీ తుకోబారాయ్ అంటున్నాడు; మాఝే = నా; అభ్యంతర = అంతఃకరణములోని నీ దర్శనోత్కంఠను (వ్యాకులతను); జానోనియాం = తెలిసికొని ; యాసీఁ = సగుణరూపమును చూపించుట యందు; ఉశీర = ఆలస్యమును; నలావీఁ = చేయకుము. 5.

**తా॥** దేవా! విఠలా! నీ యొక్క దివ్యమంగళ శ్యామసుందర, మనమోహన సగుణ సాక్షాత్కారమునకు ప్రతిబంధకమగు నీ యొక్క నిర్గుణ శుద్ధబ్రహ్మ జ్ఞానము గాని, ఆత్మనిష్ఠ (బ్రాహ్మీస్థితి)గాని నాకపేక్ష లేదు. దానికంటె "నేను భక్తుడను, నీవు దేవుడవు" అను యీ యుపాస్య ఉపాసక భావమే ఎల్లప్పుడు నుండునట్లనుగ్రహింపుము. 1. గోపికలతో రాసక్రీడలు

సల్పు నో గోపికా రమణ! పరమపావనమైన సగుణ స్వరూపము నాకు చూపించుము. నా మస్తకమును నీ దివ్య చరణారవిందముల చెంత నుండనిమ్ము. 2. ఒక వేళ నీవు నీ సగుణరూపమును దర్శించు భాగ్యమును గలిగించినచో సకలైశ్వర్యసంపన్నమగు శ్రీముఖమును కనురెప్పలు కదల్చకుండా తనవిదీరా చూడగలను, మరియు వైమరచి యాలింగనమొనర్చుకొనగలను. నీ మనోహరరూపమునకు దుష్ట దృష్టి పడకుండా హృత్పూర్వకముగా దిష్టి దీయగలను. 3. హే పాండురంగా! ఒక వేళ నీవు నా హితగుహ్యము నడిగినచో నదియును చెప్పగలను, మరియు నీతో నేకాంతముగ గూర్చొని సుఖసల్లాపము లాడెదను. 4. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - హే రంగా! నా యంతఃకరణములోని యావేదన, నీ దర్శనోత్కంఠను దెలిసికొని జాగు చేయకుండగా నీ శ్యామసుందర సగుణ రూపమును దర్శింప జేయ ప్రార్థన. 5.

సు.వ్యా :- పుష్పములోని మకరందమును తనివిదీర యస్వాదించిన భృంగము కైపెక్కి మైమరచి బాహ్యాభ్యంతరముల నేవిధముగ మరచి అన్యమునపేక్షింపక స్వస్థమై యుండునో, అట్లు శ్రీకృష్ణ దివ్య పాదారవిందములయందాసక్త చిత్తము త్రైలోక్యాధిపత్యము మరియు మోక్షమును గూడ కాలదన్ని శ్రీకృష్ణచరణారవిందముల యందే యాసక్తమగును. ఇవ్విషయమును శ్రీ మద్భాగవతములో-

శ్లో॥న పారమేష్ఠ్యం న మహేంద్ర ధిష్ణ్యం
న సార్వభౌమం న రసాధిపత్యమ్ ।
న యోగసిద్ధీరపునర్భవం వా
మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాన్యత్ ॥
(శ్రీమద్భాగవతము. 10-14-14)

**అర్థము :-** ఎవరు సంపూర్ణముగా నాకు సమర్పిత మనస్కుడగునో నతడు నాకంటే యన్యము నెద్దియునూ యిచ్ఛగించడు. ఎందుకనగా! మద్వ్యతిరిక్తమేది గలదో తత్సర్వమునూ మిథ్యయై యున్నది. దుఃఖరూపమై, నశ్వరమై యున్నందుననతడు బ్రహ్మాధిపత్యమునుగాని, స్వర్గాధిపత్యమును గాని, సంపూర్ణ భూమండలమునకు సార్వభౌమత్వమును గాని, పాతాలాది స్వామిత్వమునుగాని, అణిమాద్యైశ్వర్యములు గాని, తుదకు పునరావృత్తిరహిత మోక్షమును గూడ నొల్లనేరడు. అమృతమును ద్రాగువాడు గంజి నొల్లనటుల, ప్రాసాదనివాసి జీర్ణకుటీరము నొల్లనటుల, ఇక్షురసతృప్త గజరాజు కటిక చేదుగల వేము నిచ్ఛగించనటుల మానస సరోవర వాస్తవ్య హంసకులావతంసము మురికి గుంటను గోరనట్లు - నాచరణారవింద మకరందము (ఆనందము) నందాసక్త చిత్తుడు నాకంటె వేఱెద్దియు నపేక్షింపడని సాక్షాత్ శ్రీకృష్ణభగవానుడే భక్తాగ్రేసరుడైన యుద్ధవున కుపదేశించెను.

**41. అభంగము :-**

**మజ సంతాంచా ఆధార । తూం ఎకలేఁ నిర్వికార ॥1॥**
**పాహో విచారూనీ దేవా । నకో అమ్హా సవేఁ దావా ॥2॥**
**తుజ బోల న బోలవే । అమ్హా భాండా యాచీ సవే ॥3॥**
**తుకా హ్మణే తరీ । ఐక్య భావేఁ నురే ఉరీ ॥4॥ (398)**

ప్ర.ప :- (హేదేవా! నీయొక్క అస్తిత్వమునకు) మజ = నాకు ; సంతాంచా = సంతుమహాత్ముల యొక్క వచనములే; ఆధార = ఆధారములు (ప్రమాణములు); తూం = నీవు; ఎకలేఁ-భేదశూన్యుడవని; నిర్వికార = షడ్భావ వికార శూన్యుడవని (బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు. కావున)1.

దేవా! = హే పాండురంగా!; (నిజంగా నేను చెప్పినట్లు నీవున్నావా? బాగుగా); విచారూనీ = విచారించి; పాహే = చూసుకో; (దేవా!) ఆమ్హాసవేం= నాతో (ఎలాంటి); దావా = ఫిర్యాదులు; నకో = చేయకుము. 2. తుజ = నీకు ; బోల = ఒక్క శబ్దముగూడ; న బోలవే = మాట్లాడరాదు; ఆమ్హా = నాకు (మాత్రము నీతో); భాండా యాచీ = జగడమాడుటకు; సవే = అలవాటు (ఉన్నది). 3. తుకా హ్మణే = శ్రీ తుకోబారాయ్ అంటున్నాడు; (నీయొక్క పారమార్థిక స్వరూపము నందు) ఐక్యబావే = జీవబ్రహ్మైక్య భావము; తరీ= గూడ; నురే ఉరీ = మిగలదు. 4.

తా॥ హే పాండురంగా! నీయొక్క సగుణ భక్తి ప్రేమ విషయములో గాని, నిర్గుణస్వరూపజ్ఞానవిషయములో గాని నాకు సత్పురుషుల (బ్రహ్మజ్ఞానుల) యొక్క వచనములే ఆధారములు ( ప్రమాణములు). నీవు భేద శూన్యుడవని, షడ్భావవికారవర్జితుడవని, నిర్గుణుడవని మరియు నిష్క్రియుడవని బ్రహ్మవేత్తలు చెప్పగా విన్నాను. 1. దేవా! నీవు నేను చెప్పినట్లుగానే (నిర్గుణము ఇత్యాది రూపముగానే) యున్నావా? లేదా? ఈ విషయములో నీవు స్వయముగా విచారించి చూసుకో. ఎందుకనగా! నేను నీతో ఏమి మాట్లాడినా, ఏమి యడిగినా(విచారించినా) నీవు నాతో ఒక్క శబ్దము గూడ మాట్లాడవైతివి. కాని, రంగా! నీవు నాతో ఏలాంటి ఫిర్యాదులు చేయవద్దు. నాపై ఎలాంటి ద్వేషము, వైరమునూ బూనగూడదు సుమా. 2. నీకు ఒక్క శబ్దముగూడ మాట్లాడే సామర్థ్యము లేదు. కాని, నాకు మాత్రము నీతో జగడమాడు యలవాటు గలదు. అలాంటప్పుడు నీకు నాకు పొందిక యెలా కుదురును. 3. శ్రీ తుకారామస్వామి - అంటున్నాడు- హే విఠలా! నీ యొక్క పారమార్థిక స్వరూపము నందు జీవబ్రహ్మైక్యము గూడ మిగలదు. అట్టి యెడ ఎవరు ఎవరితో మాట్లాడాలి? 4.

**సు.వ్యా :-** అభంగములోని "ఎకలేఁ" శబ్దమునకు ఏకము అనగా సజాతీయ స్వగత, విజాతీయ భేద శూన్యమని దెలియవలెను." ఏకమేవాద్వితీయమ్". (ఛాం.ఉ. 6-2-1)

నిర్వికారము అనగా యాస్కముని చెప్పినట్లుగా - జాయతే = పుట్టుట, అస్తి = ఉండుట; వర్ధతే = వృద్ధినొందుట; పరిణమతే = మార్పునొందుట; అపక్షీయతే = క్షీణించుట (జీర్ణించుట); వినశ్యతి = నశించుట యను నీ షడ్భావ వికారములు లేనివాడు ప్రత్యగభిన్న పరమాత్మ (పాండురంగడు) అని తెలియవలెను.

"తుజ బోల న బోలవే" నీకు ఒక్క శబ్దము గూడ మాట్లాడే సామర్థ్యము లేదు. అనగా నిరవయవము, నిర్గుణము మరియు నిష్క్రియ మున్నందున యింద్రియాది సాధనాభావము వలన పరమాత్మ మాట్లాడుటకసమర్థుడగును.

"అప్రాణో హ్యమనాః శుభ్రో" (ముం.ఉ. 2-1-2) తథా తత్రైవ భాష్యే -

అప్రాణోఽవిద్యమానః క్రియ శక్తి భేదవాంశ్చలనాత్మకో వాయుర్యస్మిన్నసావప్రాణః । తథాఽమనాః అనేక జ్ఞానశక్తి భేదవత్ సంకల్పాద్యాత్మకం మనోఽప్యవిద్యమానం యస్మిన్సోఽయం అమనాః । అప్రాణోహ్యమనాశ్చేతి ప్రాణాదివాయుభేదాః కర్మేంద్రియాణి తద్విషయాశ్చ తథా చ బుద్ధి మనసీ బుద్ధీంద్రియాణి తద్విషయాశ్చ ప్రతిషిద్ధాః వేదితవ్యాః।

**అర్థము :-** ఎవనియందు క్రియాశక్తి భేదముగల చలనాత్మక వాయువు లేదో, మరియు ననేక జ్ఞానశక్తి భేదముగల సంకల్పాదిరూప మనస్సు గూడ లేదో - అది అక్షరమైన బ్రహ్మము. అప్రాణః, అమనాః

అను నీరెండు విశేషణములచే ప్రాణాదివాయుభేదములు, కర్మేంద్రియములు మరియు వాటి విషయములు, తథాబుద్ధి, మనస్సు, జ్ఞానేంద్రియములు మరియు వాటి విషయములు గూడ పరమాత్మయందు ప్రతిషేధము చేయబడినవని యెఱుంగవలెను.

అన్యత్ర గూడ - "అపాణి పాదో జననో గ్రహీతా, పశ్యత్యచక్షుః స శ్రుణోత్యకర్ణః" (శ్వే.ఉ. 3-19) ఇత్యాది. శ్రుతులచే పరమాత్మకు ఇంద్రియాదులు ప్రతిషేధము జేయబడినవని దెలియవలెను. అందువలన పరమాత్మ మాట్లాడుట కసమర్థుడగును.

జీవుడు బ్రహ్మముతో నైక్యమొంది అద్వితీయ బ్రహ్మమే యగును. అప్పుడు జీవ బ్రహ్మల భేదము భిన్నమైనందున, (నాశనమైనందున), రెండవ వస్తువే మిగలనందున నత్తటి యెవరు యెవరితో మాట్లాడుతారు?

"యత్ర వాస్య సర్వమాత్మైవాభూత్త త్కేన కం జిఘ్రేత్, తత్కేన కం పశ్యేత్, తత్కేన కం శ్రుణుయాత్, తత్కేన కమభివదేత్" (బృ.ఉ. 2-4-14)

**అర్థము** :- ఎప్పుడు బ్రహ్మవిద్యచే నవిద్య నాశమొందినదో, అప్పుడు ఆత్మ వ్యతిరిక్త జడ. చేతనాత్మక నామ రూప ద్వైతము సంపూర్ణముగా బ్రహ్మవేత్త స్వరూపము (ఆత్మ) యందే విలీన మయ్యెను. ఎప్పుడు సర్వము ఆత్మయే ఆయెనో, అప్పుడు యే యింద్రియము ద్వారా వాసన పీల్చుటకు యోగ్యమగు యే (ఘ్రాతవ్య) పదార్థమును యెవరు ఆఘ్రాణింతురు? ఏ యింద్రియముచే నే దృశ్యము నెవరు జూతురు? యే యింద్రియముచే నే శ్రోతవ్య (శబ్ద)ము నెవరు వినెదరు? యే యింద్రియము చే నే వక్తవ్యము (మాట) నెవరు మాట్లాడెదరు? ఎందుకనగా! సర్వత్ర క్రియ కారక సాధ్యముండును. కావున కారకాభావమున్నందున క్రియ సంభవింప నేరదు.

నీకు ఒక్క శబ్దము గూడ మాట్లాడే సామర్థ్యము లేదు. నాకేమో నీతో జగడమాడు స్వభావము గలదు. అత్తటి నీకు నాకు పొందిక యెలా కుదురును? సర్వము ఆత్మయే యగుచో యెవరు యెవరితో మాటాడగలరు? అను నీ వ్యంగ్యోక్తి (వక్రోక్తి)లో శ్రీతుకారాం మహారాజుగారి యభిప్రాయము యీ విధముగా నున్నది. అది యేమన! చతుర్భుజాది యాకార విశిష్ట సగుణ "హరి" మెడలో ముత్యాల హారములు, తులసీమాలలు వేయవచ్చును. పత్ర, పుష్ప, ఫల, నైవేద్యాదులను సమర్పించుకోవచ్చును. తనివిదీర ముచ్చటించ వచ్చును. శ్యామసుందర మనమోహన దివ్య మంగళ మూర్తిని కనులారగాంచి మైమరచి యమితానందముతో నృత్యము చేయవచ్చును. గానము చేయవచ్చును. కాని నిర్గుణ స్వరూపములో యే వ్యవహారము సిద్ధించదు. నిర్గుణాపేక్షచే సగుణ స్వరూపవిశేషమునందే యత్యధిక యానందము గలదు. కావున నాతో ప్రేమచే మాట్లాడగలుగునటువంటి లేదా నేనతనితో హృద్గతగుహ్యమును చెప్పుకొని, భక్తి ప్రేమతో నమితానందభరితుడనై మాట్లాడ గలుగు భగవంతుని యొక్క సగుణ సాకార సుందర రూపమే నాకు చాలా యిష్టమను స్వాభిప్రాయము సూచితమగు చున్నది.

**శ్లో॥ ధ్యానాతీతం కిమపి పరమం యేతు జానంతి తత్త్వం**
**తేషామాస్తాం హృదయకుహరే శుద్ధ చిన్మాత్ర ఆత్మా ।**
**అస్మాకం తు ప్రకృతి మధురః స్మేర వక్త్రారవిందో**
**మేఘశ్యామః కనక పరిధిః పంకజాక్షోఽయమాత్మా ॥**

**అర్థము :-** యేతు = ఏ జ్ఞానులు (బ్రహ్మనిష్ఠులు) అయితే; పరమం= పరాన్ దృశ్యాన్ మిమీతే = ప్రకాశతే – తం = సమస్త దేహాదిక దృశ్యజాతమును ప్రకాశించు యే చైతన్యము గలదో దానిని; ధ్యానాతీతం–

ధ్యానమునకు అనగా మనస్సున కగోచరమైనదో; (అటువంటి) కిమపి - అవర్ణనీయమగు; తత్త్వం - యథార్థ (బ్రహ్మ స్వరూపమును); జానంతి - తెలిసికొను (అనుభూత మొనర్చుకొను) చున్నారో; తేషాం - వారియొక్క (ఆ); శుద్ధ చిన్మాత్ర ఆత్మా = రాగ ద్వేషాది రహితము లేదా మాయారూప మల రహితము, జ్ఞానస్వరూపమగు ఆత్మా (బ్రహ్మా)నుభూతి; (వారి) హృదయ కుహరే = అంతఃకరణము నందు; ఆస్తాం = విద్యమానమై (ప్రకాశించుచూ) ఉండుగాక!; తు = పరంతు(కాని); అస్మాకం = మాకు; కనక పరిధిః = సవర్ణ (బంగారు) భూషణవలయములచే విభూషితుడును; పంకజాక్షః = తామరపూల రేకుల వంటి కన్నులు గలవాడును; స్మేర వక్త్రారవిందః = ముసిముసి నవ్వులు వెదజల్లు ముఖకమలము గలవాడును; ప్రకృతి = మధురః = స్వాభావిక ఆనందస్వరూపుడు లేక సుమధురభాషియు (మరియు); మేఘశ్యామః = నీలమేఘము వంటి శరీర ఛాయ గలవాడు నగు (సగుణ సాకార దివ్య మంగళమూర్తి యగు శ్రీకృష్ణుని యొక్క); అయమాత్మా = ఈ సుందర స్వరూపమేది గలదో (అదియే అత్యంత ప్రియమున్నది).

42. అభంగము :-

పిరవిలీఁ దోనీ । కన్యా ఆణి చక్రపాణి ॥1॥

ఝాలా ఆనందీ ఆనంద । అవతరలే గోవింద ॥2॥

తుటలీఁ బంధనేఁ । వసుదేవ దేవకీ చీ దర్శనేఁ ॥3॥

గోకుళాసీ ఆలేఁ । బ్రహ్మ అవ్యక్త చాంగలేఁ ॥4॥

నంద జసవంతీ । ధన్య దేఖిలే శ్రీపతీ ॥5॥

నిశీ జన్మకాళ । ఆలే అష్టమీ గోపాళ ॥6॥

ఆనందలీ మహీ । భారగేలా సకళహి ॥7॥

తుకా మ్హణే కంసా । ఆత బోంవిలా వళసా ॥8॥ (1138)

గమనిక :- ఈ అభంగమునకు సాదృశ్యము 3801 వ అభంగమును గూడ నవలోకించ వచ్చును.

ప్ర.ప :- (వసుదేవుడు) చక్రపాణి = శ్రీకృష్ణున్ని ; ఆణి = మరియు; కన్యా = యోగమాయా రూప కన్యను; దోనీ = ఇద్దరిని; ఫిరవిలీ = తారుమారు చేసెను. 1.గోవింద = గోవిందుడు; అవతరలే = అవతరించగానే; (సర్వత్ర) ఆనందీ ఆనంద = ఆనందమే ఆనందము; ఝాలా = ఆయెను. 2. దర్శనేఁ = శ్రీకృష్ణ పరమాత్మ అవతార దర్శనముచే; దేవకీ వసుదేవచీ = దేవకీ వసుదేవుల యొక్క; బంధనేఁ= బంధనములు; తుటలీ = త్రెంచబడినవి. 3. అవ్యక్త బ్రహ్మ = ప్రత్యక్షాది ప్రమాణాగోచరుడగు పరబ్రహ్మము; చాంగలేఁ = సుందరమైన (నామరూపములను ధరించి); గోకులాసీ = గోకులమునకు; ఆలేఁ = విచ్చేసెను. 4. నంద = నందబాబా; జసవంతీ = యశోదా; శ్రీపతీ = లక్ష్మీపతిని; దేఖిలే = దర్శించి; ధన్య = ధన్యులైరి. 5. అష్టమీ = అష్టమి తిథి; నిశీ = మధ్యరాత్రి; జన్మకాళ = జన్మకాలమున; గోపాళ = శ్రీగోపాల కృష్ణమూర్తి; ఆలే = అవతరించెను. 6. (భగవంతని అవతరణచే ) మహీ - భూదేవి; ఆనందలీ = సంతసించెను; (ఎందుకనగా?) సకళహీ = సర్వదైత్యుల; భార = భారము; గేలా= దిగిపోయింది. 7. తుకా హ్మణే = శ్రీ తుకారామస్వామి అంటున్నాడు; (భగవంతుని అవతార వార్తను వినగానే) కంసా = కంసునికి ; ఆఠ = ఎనిమిది దిక్కులనుండి; (భయరూప) భోంవిలా = సుడిగుండములో (పడి); వళసా = మతి దప్పిన వాడాయెను. 8.

తా॥ ధర్మమును స్థాపించుటకు, సాధువులను పరిరక్షించుటకు మరియు దుష్టులను శిక్షించుట కొఱకు భగవంతుడు మథురానగరములో ప్రకటమయ్యెను. కాని, అచ్చట కంసుని భయముండుటచే వసుదేవుడు

శ్రీకృష్ణభగవానుని యశోద చెంతన చేర్చి, యశోదకు జన్మించిన యోగమాయారూప శిశువును తిరిగి మధురకు చేర్చెను. ఈ విధముగా వసుదేవుడు శ్రీకృష్ణున్ని మరియు యోగమాయను తారుమారు చేసెను. 1. గోవిందుని అవతరణచే సర్వత్ర సర్వులకు ఆనందమే యానందమాయెను. 2. శ్రీహరి యొక్క యవతారదర్శన మాత్రము చేతనే దేవకీ వసుదేవుల యొక్క సంకెళ్ళ రూప బంధము మరియు అవిద్యా - కామ-కర్మాది రూప బంధనములు త్రెంచబడినవి. 3. ప్రత్యక్షాది ప్రమాణములకగోచరమగు నవ్యక్తరూప పరబ్రహ్మము సుందరమైన నామరూపములను ధరించి అవతరించి, గోకులమును పావనము జేయుటకు విచ్చేసెను. 4. లక్ష్మీపతి యొక్క ప్రత్యక్ష దర్శనముచే నందబాబా మరియు యశోదా మాతయును ధన్యులైరి. 5. గోపాల కృష్ణమూర్తి యొక్క జననము శ్రావణమాసము కృష్ణపక్ష అష్టమి తిథి, రోహిణీ నక్షత్రము, బుధవారము రోజున మధ్యరాత్రి యగు శుభకాలమందాయెను. 6. భగవంతుని ప్రాకట్యముచే పృధ్వీ మాత సంతసించెను. ఎందుకనగా! భగవదవతారముచే సకలదైత్యులు రూపుమాపబడిరి. 7. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు కంసుడు తన వైరి యగు శ్రీహరి జన్మించిన వార్తను విని దిక్కుదోచనివాడై, భయరూప సుడిగుండములో స్మృతి దప్పి గిరగిర తిరుగుచుండెను. 8.

## - అవతార విశేష వర్ణనము -

సం.వ్యా :- శ్రీమద్భగవద్గీత సంబంధ భాష్యములో శ్రీమజ్జగద్గురువులు ఆద్యశంకరాచార్యులవారు భగవంతుని అవతార ప్రయోజనమును సూచిస్తూ ఇలా వివరించారు. వేదోక్త ధర్మము ద్వివిధము. స్వస్వ వర్ణాశ్రమ విహిత కర్మానుష్ఠానము - ప్రవృత్తి లక్షణ (రూప) ధర్మము మొదటిది. వాటి నుండి (కర్మలనుండి) విరమించి జ్ఞానమార్గము

నవలంబించుట నివృత్తిలక్షణ ధర్మము రెండవది. ధర్మము చేతనే యీ జగత్తు స్థితి గలిగి యున్నది. ప్రాణులకు సాక్షాత్తు అభ్యుదయాన్ని (ఐహిక, పారలౌకిక సుఖాద్యభివృద్ధిని) మరియు నిఃశ్రేయస్సును (సంసారబంధ నివృత్తి రూప మోక్షమును) యిచ్చే ఈ ధర్మము శ్రేయస్సు కావాలనే కోరిక గల ఆయా వర్ణాలకు జెందిన బ్రాహ్మణాదులచేత, గార్హస్థ్యాద్యాశ్రమాల్లో ఉన్న వారి చేత అనుష్ఠింపబడుచున్నదై, సుదీర్ఘ కాలమునకు ఈ ధర్మానుష్ఠానము చేయువారిలో కామము (దురాశ) పెరిగి, దానితో వారిలోని వివేక జ్ఞానము సన్నగిల్లి అధర్మము పెచ్చు పెరిగి ధర్మమును అణచి వేయడము ప్రారంభించింది. అలాంటి పరిస్థితిలో జగత్తు యొక్క స్థితిని పరిపాలించే ఉద్దేశ్యంతో మొట్టమొదట సృష్టికర్తయైన నారాయణుడనే విష్ణువు భౌమమైన (భూమి మీదనున్న) బ్రహ్మను అనగా బ్రాహ్మణత్వాన్ని రక్షించుట కొఱకు (లేదా భూలోకంలో నున్న వేదాన్నీ, బ్రాహ్మణత్వాన్ని రక్షించుట కొఱకు) ఒక అంశంతో వసుదేవుని ద్వారా దేవకి యందు జన్మించినాడట. వర్ణాశ్రమ భేదాలు బ్రాహ్మణత్వము మీద ఆధారపడి ఉంటాయి. గాన బ్రాహ్మణత్వాన్ని రక్షిస్తే వైదిక ధర్మాన్ని రక్షించినట్లవుతుంది.

సకల విషయాలను తెలిసికొనగలుగు నిత్యజ్ఞానము, సర్వమునూ తన వశంలో ఉంచుకొనగలుగు ఐశ్వర్యము, యోగ్యా యోగ్యమైన కార్యములను సాధించునటువంటి మరియు అన్యథాకరణ యోగ్యమగు సామర్థ్యరూప శక్తి, సహాయ సంపత్తి రూప బలము, సామర్థ్య యుక్త ఉత్సాహరూప వీర్యము మరియు ఎవరిచేతనూ ఎదిరింప వీలులేని తేజస్సు మొదలగు విశేషణ విశిష్ట భగవంతుడు సత్త్వ రజ తమస్సులను మూడు గుణములే స్వరూపముగా గలది (త్రిగుణస్వరూపమైనది), విష్ణువునకు (పరమేశ్వరునకు) సంబంధించినదియు, మూల ప్రకృతి యగు

స్వకీయమాయను తన వశంలో నుంచుకొని తాను అజుడు (జన్మలేని వాడు) అవ్యయుడు (ఎట్టి మార్పు లేనివాడు), సకల ప్రాణులకు నియామకుడు, స్వభావముచే నిత్యుడు, శుద్ధుడు(మాయా మలము లేక రాగద్వేషాది కాలుష్యము లేనివాడు), బుద్ధుడు (జ్ఞాన స్వరూపుడు), ముక్తుడు (సంసారముతో ఏవిధమైన సంబంధము లేనివాడు) అయినా కూడ, తన మాయ చేతనే దేహం ధరించిన వానివలె, పుట్టిన వాని వలె, లోకానుగ్రహం చేస్తున్న వాని వలె చూపట్టుచున్నాడు. (కనబడుచున్నాడు).

బ్రహ్మసూత్ర భాష్యంలో గూడ ఇలా చెప్పారు. "స్యాత్పరమేశ్వరస్యాపి ఇచ్ఛా వశాన్మాయామయం రూపం సాధకానుగ్రహార్థమ్" ।

**శ్లో॥ మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద! ।**
**సర్వభూత గుణైర్యుక్తం మైవం మాం జ్ఞాతుమర్హసి ॥**

(మ.భా.శాం.ప. 339-45)

ఇతిస్మరణాత్ అపి చ యత్ర తు నిరస్త సర్వ విశేషం పారమేశ్వరం రూప-ముపదిశ్యతే, భవతి తత్ర శాస్త్రమ్ - "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్" (కఠ. 1-3-15) ఇత్యాది. సర్వ కారణత్వాత్తు వికారధర్మైరపి కైశ్చిద్విశిష్టః పరమేశ్వరః ఉపాస్యత్వేన నిర్దిశ్యతే. "సర్వకర్మా సర్వకామః సర్వగన్ధః సర్వరసః (ఛాం.ఉ. 3-14-2) ఇత్యాదినా. తథా హిరణ్యశ్మ శ్రుత్యాది నిర్దేశోఽపి భవిష్యతి. (బ్ర.సూ. 1-1-20)

అర్థము :- సాధకులను అనుగ్రహించుట కొఱకు పరమేశ్వరునికి గూడ మాయాకల్పిత రూపము తన యిచ్ఛ ప్రకారము ఉండవచ్చును. "మాయా...అర్హసి" (నారదా! నన్ను నీవు చూస్తున్న యీ సగుణరూపము మాయికమున్నది. అనగా నేను సృజించిన మాయానిర్మితమైన మూర్తి.

నకల భూతముల గుణములతో గూడిన నన్ను ఈవిధముగా గ్రహించగూడదు. అనగా ఇదే నా పరమార్థరూప మను కొనగూడదు)- అని స్మృతి చెప్పుచున్నది. మరొక విషయమేమనగా సకల విశేషములు నిరసించబడిన (ఎట్టి విశేషములు లేని) పరమేశ్వర స్వరూపాన్ని ప్రతిపాదించ వలసి ఉన్నపుడు "అశబ్దమస్పర్శమరూపమవ్యయమ్" ఇత్యాది రీతిలో శాస్త్రం ఉంటుంది. అయితే పరమేశ్వరుడన్నింటికి కారణమైనవాడుండడము వలన కొన్ని వికార (కార్య) ధర్మములతో కూడిన వాడుగా గూడ "సర్వకర్మా సర్వకామః సర్వగన్ధః సర్వరసః" ఇత్యాదులచేత నిర్దేశింపబడతాడు. హిరణ్య శ్మశ్రుత్వాది నిర్దేశం కూడ ఈ విధంగానే యుంటుంది. (బ్ర.సూ. 1-1-20)

నామము, రూపము అనే యే వికారము అనగా జగత్తు ఉన్నదో, దానిలోని హిరణ్య శ్మశ్రుత్వం మొదలైన భేదాలతోను వాటికి కారణమైన ఉపాధులతోను కూడిన బ్రహ్మము ఒకటి, ఎట్టి ఉపాధులు లేని బ్రహ్మము ఒకటి అని రెండు విధముల బ్రహ్మము (వేదాంతములలో) తెలుస్తుంది. ఒకే బ్రహ్మను కొన్ని వేదాంతవాక్యాలు ఉపాధినంబంధమును పురస్కరించుకొని ఉపాస్యముగాను, మరికొన్ని వేదాంంతవాక్యములు ఉపాధి సంబంధాన్ని దూరంగా విడచి జ్ఞేయముగాను ప్రదర్శిస్తున్నాయి. (బ్ర.సూ. 1-1-11)

శ్రీమద్భాగవతము గూడ పరబ్రహ్మ పరమేశ్వరునకు మాయారూపోపాధిసంబంధముచే సగుణ సాకారరూపము ప్రాప్తించినట్లు తెలుపు చున్నది.

శ్లో॥ కృష్ణమేనమవేహి త్వమాత్మానమఖిలాత్మనామ్ ।
జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాభాతి మాయయా ॥
(భాగ. 10-14-55)

**అర్థము :-** శ్రీశుకదేవుడు పరీక్షిన్మహారాజుకు ఇలా ఉపదేశించుచున్నాడు.

ఓరాజా! నీవు ఈ శ్రీకృష్ణుని సకల ఆత్మల (జీవుల) యొక్క ఆత్మ (స్వరూపము)గా తెలియుము. జగత్కల్యాణము కొఱకు తన యోగమాయను స్వీకరించి ఇక్కడ దేహధారి వలె కన్పట్టుచున్నాడు.

**శ్లో॥ అహెూ భాగ్య మహెూ భాగ్యం నందగోపవ్రజౌకసామ్ ।**
**యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మసనాతనమ్ ॥**
(భాగ. 10-14-32)

**అర్థము :-** ఆహా! వాస్తవముగ నందుడు మొదలగు వ్రజవాసులైన గోపాలుర యొక్క అహెూభాగ్యమని చెప్పవలెను. ఎందుకనగా! పరమానందుడు, సనాతనుడు, పరిపూర్ణుడు అయిన పరబ్రహ్మ - వారికి అత్యంత సన్నిహితుడు, మిత్రుడును ఆయెను.

**శ్లో॥ ఏషా మాయా భగవతః సర్గ స్థిత్యన్తకారిణీ ।**
**త్రివర్ణా వర్ణితా.. .. ... ॥** (భా.గ. 11-3-16)

**అర్థము :-** సృష్టి, స్థితి మరియు సంహారకారిణి యగు త్రిగుణాత్మకమైన భగవంతుని మాయను గూర్చి వర్ణించనైనది.

భగవంతుని యొక్క బహుభవనమునకు అజ్ఞానరూపోపాధియే కారణమని శ్రీ విష్ణుపురాణము చెప్పుచున్నది.

**శ్లో॥ జ్ఞాన స్వరూపమత్యన్తం నిర్మలం పరమార్థతః ।**
**తదేవార్థ స్వరూపేణ భ్రాంతి దర్శనతః స్థితమ్ ॥** (వి.పు. 1-2-6)

**అర్థము :-** పరమేశ్వరుడు పరమార్థముచే జ్ఞానస్వరూపుడు,

అత్యంత నిర్మలుడు. అతడే అవిద్యారూప భ్రాంతి దృష్టిచే ననేక పదార్థముల రూపములో భాసించుచున్నాడు.

పరమేశ్వరునకు మాయోపాధిక సగుణసాకార రూపము మరియు మాయావినిర్ముక్తనిర్గుణనిరాకారస్వరూపము అను ఉభయ రూపములున్నవని శ్రీవేదవ్యాస భగవానుడు శ్రీమదధ్యాత్మ రామాయణములో తెలియ జేసి యున్నారు.

శ్లో॥ విశ్వస్య సృష్టి లయ సంస్థితి హేతురేక
స్త్వం మాయయా త్రిగుణయా విధిరీశవిష్ణూ ।
భాసీశ మోహిత ధియాం వివిధాకృతిస్త్వం
యద్వద్రవిః సలిల పాత్రగతో హ్యనేకః ॥

(అధ్యాత్మ రామాయణము - అరణ్యకాండము. 2-30)

అర్థము :- శ్రీరామచంద్రున్ని సుతీక్ష్ణుడు ఇలా స్తుతిస్తున్నాడు - హే ఈశ్వరా! పరమార్థముచే నీవు ఏకమాత్ర, అద్వితీయుడవై యుండి నీవే ఈ విశ్వము యొక్క ఉత్పత్తి, స్థితి మరియు ప్రళయమునకు కారణమగుచు, త్రిగుణాత్మక స్వకీయమాయచే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరరూపములలో భాసించుచున్నావు. నీవే ముగ్ధ చిత్త పురుషుల దృష్టిచే మనుష్య, పశు, పక్ష్యాద్యనేకాకృతులతో ననేక జలపూరిత పాత్రలలో ప్రతిబింబిత సూర్యునివలె ప్రతీతమగుచున్నావు.

శ్లో॥ పశ్యామి రామ తవ రూపమరూపిణోఽపి
మాయావిడమ్బనకృతం సుమనుష్య వేషమ్ ।
కందర్ప కోటి సుభగం కమనీయ చాప
బాణం దయార్ద్రహృదయం స్మిత చారువక్త్రమ్ ॥

(అధ్యా.రా. అరణ్య.కాం. 2-32)

**అర్థము :-** హేరామ! నీవు స్వయముగా రూపరహితుడవై (నిరాకారుడవై) యున్నావు. అయినా గూడ నీవు స్వమాయా విలాసముచే ధరించిన నీ మనోహర లీలా మానుష విగ్రహము (స్వరూపము)ను నేను చూచుచున్నాను. నీయొక్క ఈ దివ్య మనోహర రూపము అనేకకోట్ల కామదేవుని (మన్మథుని)తో సమానముగా కాంతివంతమై యొప్పుచున్నది. మరియు కమనీయ (అందమైన) ధనుర్బాణములను ధరించియున్నది.

శ్రీమద్భగవద్గీతలో స్వయముగా శ్రీకృష్ణ పరమాత్మయే ఈ క్రింది విధముగా నర్జునునకుపదేశించెను.

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా॥ (గీత. 4-6)

**అర్థము :-** అజః = జన్మలేనివాడనైనను, అట్లే అవ్యయాత్మా = క్షీణించని జ్ఞానశక్తి స్వభావముగలవాడనైనను, అట్లే బ్రహ్మ మొదలు కొని సూక్ష్మాతి సూక్ష్మ క్రిమి విశేష పర్యంతము సమస్తభూతాలకు నియామకుడ(ఈశ్వరుడ)నైనను నేను నా ప్రకృత్యపరనామానమాయను అనగా విచిత్రానేక శక్తులు గలదియు, అఘటన ఘటనా పటీయసీ (అశక్యమునుగూడ శక్యము చేయగల కుశలయు)నగు, నాకుపాధిభూతమైన దానిని చిదాభాసరూపంలో వశీకరించుకొని దాని పరిణామ విశేషాలచేతనే దేహము గలవానివలె, పుట్టిన వాని వలెనగుచున్నాను. కాని యితర జనుల వలె వాస్తవముగా నేను పుట్టలేదు. అట్లే కల్పిత మాయోపాధిక సవిశేష నిర్విశేష భేదముచే బ్రహ్మాద్వయమును ప్రతిపాదించనైనది.

శ్లో॥ సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ (గీత. 13-14)

**అర్థము :-** పరమార్థతః బ్రహ్మము శుద్ధము, నిర్విశేషము (నిరుపాధికము) మరియు సర్వేంద్రియ వివర్జితమై (రహితమై) యున్నది. అయినను కల్పితస్వమాయచే సవిశేషము (సోపాధికము)నై సర్వేంద్రియ గుణాభాసమై యొప్పుచున్నది. అనగా సమస్త శ్రోత్రాది బాహ్యేంద్రియములు మరియు బుద్ధి మనస్సుల యొక్క గుణములచేత, నిశ్చయము, సంకల్పము, శ్రవణము, మాట్లాడడము మొదలగు వానిచేత వానివాని విషయముల రూపములో భాసించుచున్నట్లు (సర్వేంద్రియ వ్యాపారముల చేత వ్యాపారవంతమైనట్లు) ఉన్నది. "ధ్యాయతీవ, లేలాయతీవ" (బృ.ఉ. 4-3-7) శ్రుతి ప్రమాణము వలన ధ్యానము చేస్తూన్నట్లు వలె, పనిచేస్తూన్నట్లువలె భాసించు చున్నది. ఇచ్చట ధ్యానం జ్ఞానేంద్రియ వ్యాపారములకుపలక్షణము. లేలాయనం (చలనం) కరేంద్రియ వ్యాపారములకుపలక్షణము. ఈ విధముగా బ్రహ్మము (జ్ఞేయము) పరమార్థముచే నసక్తము - (సర్వసంబంధ శూన్యము)నై యున్నప్పటికిని స్వమాయచే సద్రూపంతో సంపూర్ణ కల్పిత పదార్థములను ధారణ - పోషణ చేస్తూంది. కావున సర్వభృత్ కూడ. ఎందుకనగా! అధిష్ఠానము లేకుండా భ్రమ సంభవింపమిచేత. అట్లే పరమార్థతః నిర్గుణము సత్త్వరజతమోగుణములు లేనిదయినను గుణ భోక్తయునై యున్నది. అనగా శబ్దాదుల ద్వారా సుఖదుఃఖ మోహాకారంలో పరిణమించిన సత్త్వరజ తమో గుణాలను భుజించునది - గ్రహించునదియునై ఆ జ్ఞేయబ్రహ్మమున్నది.

ధర్మమూర్తి యైన శ్రీరామచంద్రుడు మానుషవేషధారియైన పరబ్రహ్మ మేయని పరమపవిత్రమైన శ్రీరామాయణ మహాకావ్యములో శ్రీ వాల్మీకి మహర్షులవారు వర్ణించియున్నారు.

**శ్లో॥ అక్షరం బ్రహ్మ సత్యం చ మధ్యే చాన్తే చ రాఘవ! ।**
**లోకానాం త్వం పరో ధర్మో విష్వక్సేనశ్చతుర్భుజః ॥**
(శ్రీ వాల్మీకి రామాయణము - యుద్ధకాండము. 117-14)

**అర్థము :-** శ్రీ బ్రహ్మదేవుడు శ్రీరఘురామునితో ఇలా అంటున్నాడు. ఓ రాఘవ! నీవు సాక్షాత్తు అవినాశియైన పరబ్రహ్మము అయి ఉన్నావు. సృష్టి యొక్క ఆది, మధ్యము మరియు అంతము లందు సత్యస్వరూపముచేత విద్యమానమై యున్నావు. నీవే సకలలోకములయొక్క పరమ ధర్మమై యున్నావు. నీవు విష్వక్సేనుడవు అయియున్నావు. (అనగా నీవు యుద్ధమునకుపక్రమించి నంతనే యసురసేన యంతయు భీతితో చెల్లాచెదరై పారిపోవుటచే నీవు విష్వక్సేనుడవు). మరియు నీవే చతుర్భుజ ధారియైన శ్రీహరివియునై యున్నావు.

**శ్లో॥** వ్యక్తమేష మహాయోగీ పరమాత్మా సనాతనః ।
అనదా మధ్య నిధనో మహతః పరమో మహాన్ ॥

తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః ।
శ్రీవత్స వక్షా నిత్యశ్రీ రజయ్యః శాశ్వతో ధృవః ॥

మానుషం రూపమాస్థాయ విష్ణుః సత్యపరాక్రమః ।
సర్వైః పరివృతో దేవై ర్వానరత్వముపాగతైః ॥

సర్వలోకేశ్వరః శ్రీమాన్ లోకానాం హితకామ్యయా ।
స రాక్షస పరీవారం దేవశత్రుం భయావహమ్ ॥

(శ్రీ వాల్మీకి రామాయణము-యుద్ధకాండము. 111-10 నుండి 14)

**అర్థము :-** రఘుపతియగు శ్రీరామునిచే హతుడైన పతిని గాంచి దైత్యాధిపతి సతి యగు మండోదరి గతి దెలియని మతిగలదై మృత పతి

యగు రావణుని యుద్దేశించి ఈ రీతిగ విలపింప సాగెను. హే నాథ! ఈ శ్రీరామ చంద్రుడు నిశ్చయముగా మహాయోగియు మరియు స్వయముగా సాక్షాత్సనాతన పరమాత్మయే అయి ఉన్నాడు. ఇతనికి ఆదిమధ్యాంతములు లేవు. మహత్తు కంటె మహత్తై, అజ్ఞానాంధకారము కంటెను పరమై (ప్రకాశకుడై), సమస్తమును ధరించువాడైన సర్వ నియంతయగు పరమేశ్వరుడున్నాడు. తన యొక్క కరకమలములయందు శంఖ, చక్ర, గదాదులను ధరించినవాడు, వక్షఃస్థలమున శ్రీవత్సమను చిహ్నమును ధరించినవాడు, ఎల్లప్పుడు భగవతి లక్ష్మి చెంతనగలవాడు, అజేయుడును, నిత్యము, స్థిరము మరియు సకలలోకేశుడును నగు సత్యపరాక్రముడైన విష్ణువు (వ్యాపక పరమాత్మ)యే సమస్త లోక కల్యాణమును గోరి, మనుష్య రూపమును ధరించి, సమస్తదేవతలు వానర రూపములో ప్రకటమై (జన్మించి) తనకు సహాయము కాగా, దేవతలందరికి శత్రువు, సంపూర్ణ జగత్తునకు భయ కారకుడవైన నిన్ను (రావణున్ని) వధించెను.

వేదాంతములైన ఉపనిషత్తులు గూడ పరబ్రహ్మమునకు సగుణ సాకార రూపము మరియు నిర్గుణ నిరాకారస్వరూపము – అను నుభయ రూపములు గలవని నుడువుచున్నవి.

**శ్లో॥ రామ ఏవ పరం బ్రహ్మ రామ ఏవ పరం తపః ।**
**రామ ఏవ పరం తత్త్వం శ్రీరామో బ్రహ్మతారకమ్ ॥**

(రామరహస్యోపనిషత్. 1–6)

అర్థము :– శ్రీరాముడే పరబ్రహ్మము. శ్రీరాముడే పరమ తపస్సు. శ్రీరాముడే పరమతత్త్వము. అట్లే శ్రీరాముడే గర్భ, జన్మ, జరా, మరణ మరియు సంసారమను మహాభయములనుండి జీవులను ముక్తులను జేయు తారక బ్రహ్మయని తెలియవలెను.

**శ్లో॥ రమన్తే యోగినోఽనన్తే నిత్యానన్దే చిదాత్మని ।**
**ఇతి రామపదేనాసౌ పరం బ్రహ్మాభిధీయతే ॥**

(రామపూర్వతాపనీయోపనిషత్ 1-6)

**అర్థము :-** యోగిజనులు యే యనంత, నిత్యానంద స్వరూప, చిద్రూప పరమాత్మ యందు రమించుదురో, ఆ పరబ్రహ్మ పరమేశ్వరుడే "రామ" పదముచే పిలువబడుచున్నాడు.

**శ్లో॥ చిన్మయస్యాద్వితీయస్య నిష్కలస్యాశరీరిణః ।**
**ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా ॥**

(రామపూర్వతాపనీయోపనిషత్. 1-7.)

**అర్థము :-** చిద్రూపమైన పరమాత్మ, అద్వితీయుడును, నిష్కలుడును మరియు (పాంచభౌతిక) దేహరహితుడయ్యును, భక్తజనాభీష్ట సిద్ధ్యర్థము, లోక కళ్యాణమును గోరి నిరాకార బ్రహ్మము సాకారరూపమును ధరించును.

**"ఏతావానస్య మహిమాఽతో జ్యాయాంశ్చ పూరుషః । పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" । (శు.య. 31-3), (ఋ. 10-90-3) , (ఛాం. 3-12-6)**

**అర్థము :-** అతీతానాగత వర్తమానకాల సంబద్ధ చరాచర జగత్తు యేది గలదో, ఏతావాన్ = ఆ సర్వ ద్వైతప్రపంచము; అస్య - పురుషుడైన ఈ బ్రహ్మము యొక్క; మహిమా = విభూతి విస్తార వివర్తము ; (స్వకీయ మాయాసామర్థ్య విశేష విలసితము, పారమార్థికము మాత్రము కాదు. పరమార్థ నిర్విశేష శుద్ధ పురుషుడైతే) అతః = అస్మాత్ అనగా వాచారంభణ మాత్రము, బ్రహ్మవిద్యా బాధ్యమునగు ఈ మహిమాన్విత జగజ్జాలము కంటె; జ్యాయాన్ = అతిశయ(అధిక) మహత్తరమైనది. (అవికారము,

పారమార్థికము); పూరుషః = సర్వత్ర వ్యాపించి నిండి నిబిడీకృతమై సంపూర్ణ జగత్తును తనచేత పూరింపజేయుట వలన పురుషుడు లేదా శరీరరూప పురమునందు శయనించుటచేతను పురుషుడనబడుచున్నాడు. (బ్రహ్మము యొక్క సవిశేష నిర్విశేషరూపములు రెండును స్పష్టము జేయబడుచున్నవి. ఎట్లనగ! ఆ ఈ పురుషుని యొక్క); పాదః = చతుర్థాంశము ఈ పృథివ్యాది స్థావరజంగమాత్మకకాలత్రయవర్తి; విశ్వా = సమస్త; భూతాని = భూతములు; అస్య = ఈ పురుషుని యొక్క పరిశిష్ట నిర్విశేష శుద్ధ స్వరూపము; త్రిపాత్ = మూడు పాదములు; అమృతం = అవినాశి పరమానంద పూర్ణమై; దివి = స్వప్రకాశ స్వాత్మస్వరూపము నందవస్థితమై యున్నది. ఈ ఛాందోగ్య శ్రుతిచే బ్రహ్మము యొక్క విశిష్టము, ఉపాసనాగమ్యమునగు సోపాధికస్వరూపము మరియు శుద్ధము, జ్ఞానగమ్యమునకు నిరుపాధికస్వరూపము - రెండునూ వర్ణింపబడినవి.

ఇంద్రోమాయాభిః పురురూప ఈయతే । (బృ.ఉ. 2-5-19)

**భాష్యమ్** :- ఇంద్రః = పరమేశ్వరుడు; మాయాభిః = ప్రజ్ఞలచేత లేదా నామ రూపోపాధి జనిత మిథ్యాభిమానము చేత; పురురూప = బహు రూపములుగా నయినట్లు; ఈయతే = తెలియబడుచున్నది; నతు పరమార్థతః = వాస్తవముగా ననేక రూపములు లేవు. అనగా పరమేశ్వరుడు ప్రజ్ఞానఘనైక రూపముచే నుండియు మాయాజనిత ప్రజ్ఞలచేత (శక్తులచేత, వృత్తుల చేత) అనేక రూపులుగా భాసించుచున్నాడు.

అదృష్టము (జ్ఞానేంద్రియములకగోచరము), అవ్యవహార్యము (అర్థక్రియారహితము),అగ్రాహ్యము కర్మేంద్రియముల కవిషయము, అలక్షణము (లింగాభామున్నందున అననుమేయము), అచింత్యము (మనస్సునక గోచరము); అవ్యపదేశ్యము (శబ్దమునకు విషయము గానిది),

ఏకాత్మ పత్యయసారము, ప్రపంచోపశమము (జాగ్రదాదిస్థాన ధర్మాభావము గలది); శాంతము (రాగద్వేషాది రహిత అవిక్రియ కూటస్థము), శివము (అత్యంత శుద్ధ పరమానందబోధరూపము) మరియు అద్వైతము (సజాతీయ, విజాతీయ, స్వగత భేద రహితము)నగు యే ప్రత్యగభిన్న పరమాత్మ (బ్రహ్మము) గలదో అదియే అఘటన ఘటనా పటీయస్త్వము (సామర్థ్యము)గల స్వ మాయచే నుపాస్యమగు సవిశేష (సోపాధిక) రూపమును ధరించ గలదనుటలో నుపరోక్తరీతిగా వందలకొలది శాస్త్రప్రమాణములాధారమై యున్నందున అవ్యక్తము, నిర్వికారము, నిర్గుణమైన పరమేశ్వరుడు సగుణ సాకారరూపములో భక్తానుగ్రహార్థమవతరించునది (ప్రకటమగునని) సునిశ్చితమైనది.

శ్లో॥ అనుగ్రహాయ భూతానాం మానుషం దేహమాస్థితః ।
భజతే తాదృశీః క్రీడా యాః శ్రుత్వా తత్పరో భవేత్ ॥
(భాగ. 10-33-37)

అర్థము :- భగవంతుడు జీవులననుగ్రహించుట కొఱకు, తాను మనుష్యరూపములో ప్రకటమై, వేటిని శ్రవణము చేసి జీవుడు భగవత్పరాయణుడగునో, అటువంటి లీలలను గావించును.

అవ్యక్త చైతన్యము వ్యక్తమగుటయే అవతారము. అవతారమనగా క్రిందికి దిగుట యని యర్థము. నిర్గుణనిరాకారపరమాత్మ సగుణ సాకారముగ వ్యక్తమగుటయే అవతారముయొక్క సామాన్యలక్షణము.

శ్లో॥ ఏతన్నానావతారాణాం నిధానం బీజమవ్యయమ్ ।
యస్యాంశాంశేన సృజ్యంతే దేవ తిర్యఙ్నరాదయః ॥
(భాగ. 1-3-5)

**అర్థము :-** పరమ పురుషుడైన ఈ నారాయణుడే అనేక అవతారములకు బీజము అక్షయమగు కోశముగా నున్నాడు. అతని నుండియే ఈ సమస్త స్థావర జంగమాత్మకమగు జగద్రూప అవతారము ప్రకటమగుచున్నది. ఇతని యొక్క చిన్న చిన్న అంశముల చేతనే దేవతా శరీరములు, పశు, పక్షి మరియు మనుష్యాది యోనుల సృష్టి (అవతారముల ప్రాకట్యము) జరుగుచున్నది. అందుకే భాగవతము చెప్పుచున్నది. ఏమనగా!

**శ్లో॥ అవతారా హ్యసంఖ్యేయా హరేః సత్త్వనిధేర్ద్విజాః ।**
**యథా విదాసినః కుల్యాః సరసః స్యు సహస్రశః ॥** (భాగ. 1-3-26)

అర్థము :- ఓ శౌనకాది ఋషి పుంగవులారా! ఏ విధముగా అగాధ సరోవరము నుండి వేలాది చిన్న చిన్న సెలయేరులు వెలువడునో, అట్లే సత్త్వనిధియగు శ్రీహరి యొక్క అసంఖ్య అవతారములు వెలువడును. సామాన్యముగా సంపూర్ణ జగత్తు సేవ్యసేవక (ఉపాస్య ఉపాసక) భేదముచే భగవంతుని యొక్క అవతారమేయై యున్నది.

**శ్లో॥ విష్ణ్వాద్యుత్తమదేహేషు ప్రవిష్టో దేవతా భవేత్ ।**
**మర్త్యాద్యధమదేహేషు స్థితో భజతి దేవతామ్ ॥**
(వే.పంచదశి. 10-2)

**అర్థము :-** ఆ పరమాత్మ విష్ణువు మొదలగు ఉత్తమ దేహములందు ప్రవేశించి దేవతలయ్యెను. మానవులు మొదలగు అధమదేహములందుండి ఆ దేవతలను పూజించును.

"పురుష ఏవేదం సర్వమ్" (పురుష సూక్తము), (శ్వే.ఉ. 3-15) ఈ దృశ్యమాన, శ్రూయమాన సంపూర్ణ జగత్తు పురుషుడే. "వాసుదేవః సర్వమ్" (గీత. 7-19) సమస్తమూ వాసుదేవుడే. "భగవద్రూపమఖిలం

నాన్యద్వస్త్విహ కించన" (భాగ. 10-15-56) నిఖిల జగత్తు భగవత్స్వరూపమై యున్నది. భగవంతునికి వ్యతిరిక్తముగా యేవస్తువు లేదు. ఇత్యాది శ్రుతి స్మృతులచే సంపూర్ణ జగత్తు భగవత్స్వరూపమే (భగవదవతారమే)- యని తెలియబడుచున్నది. అయినప్పటికిని సకల రూపముల(ఉపాధుల)లో విచిత్ర కార్యానుకూల శక్త్యసన్నిధానము వలన (కూడి లేనందు వలన) వాటికి అవతారత్వ వ్యపదేశము చేయబడలేదు. (వాటికి యవతారములని చెప్పబడ లేదు.).

"సర్వథాఽ విలుప్త జ్ఞాన క్రియా శక్తిత్వే సతి సాక్షాన్మాయిక విలాసవత్వ మవతారత్వమ్।" దేశము చేతగాని, కాలము చేతగాని అథవా అవస్థలచే గాని, స్వతహాగాని, అన్యనిమిత్తముచేతగాని ఎప్పుడు గూడ లోపము (అభిభూతము) గాని పరిపూర్ణ జ్ఞాన శక్తి, క్రియాశక్తి గల్గియుండి సాక్షాన్మాయా కార్యమగు మనుష్యాది రూపములను ధరించుట"అవతార" విశేష లక్షణము.

అవతారా హ్యసంఖ్యేయా హరేః సత్త్వనిధేర్ద్విజాః ॥ (భాగ. 1-3-26) అని చెప్పినట్లు విచిత్ర కార్యానుకూల విశిష్టశక్తి (జ్ఞాన క్రియాశక్తి) సన్నిధీభూత విశేష అవతారములు గూడ అసంఖ్యాకములున్నాయి. అందులో శ్రీమద్భాగవతము స్కంధము. 1. తృతీయాధ్యాయములో ఇరువది రెండు చెప్పబడినవి. (భాగ. 1-3-6 నుండి 1-3-26 వరకు) వీటికి మరి రెండు (11-4-17) చేర్చి మొత్తము ఇరువది నాలుగు అవతారములని చెప్పబడుచున్నవి. అవి, క్రమముగా. 1. సనక, సనందన, సనాతన మరియు సనత్కుమారావతారము 2. వరాహావతారము, 3. నారదావతారము, 4. నరనారాయణావతారము, 5. కపిల దేవుని యవతారము, 6. దత్తాత్రేయావతారము, 7. యజ్ఞభగవానుడు. 8. ఋషభదేవుడు. 9. పృథు

మహారాజు. 10. మత్స్యావతారము11. కూర్మావతారము. 12. ధన్వంతరి భగవానుడు. 13. మోహినీ యవతారము. 14. నృసింహావతారము. 15. వామనావతారము. 16. పరశురామావతారము. 17. వేదవ్యాసుడు. 18. శ్రీరామ అవతారము. 19. బలరామావతారము. 20. శ్రీకృష్ణావతారము. 21. బుద్ధావతారము. 22. కల్కి అవతారము. ఇవి భాగవతానుసారము. మరి రెండు. 23. హంసావతారము. 24. హయగ్రీవావతారము. అని ఇరువది నాలుగు అవతారములు చెప్పబడినవి.

వీటిలో పది యవతారములే ప్రధానములని పురాణములో పేర్కొనబడినవి.

శ్లో॥ మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహోఽథ వామన ।
రామో రామశ్చ కృష్ణశ్చ బుద్ధః కల్కీ చ తే దశ ॥
(పద్మ.పు. ఉ.ఖం. 68-57)

అర్థము :- సుగమము.

పైన పేర్కొనబడిన దశావతారముల కార్యము (ప్రయోజనము) నుల్లిఖిస్తూ శ్రీకృష్ణ భగవంతునికి నమస్కరిస్తున్నాడు - శ్రీ జయదేవుడు.

శ్లో॥ వేదానుద్ధరతే జగన్తి వహతే భూగోళముద్బిభ్రతే
దైత్యం దారయతే బలిం ఛలయతే క్షత్ర క్షయం కుర్వతే ।
పౌలస్త్యం జయతే హలం కలయతే కారుణ్య మాతన్వతే
మ్లేచ్ఛాన్మూర్ఛయతే దశాకృతి కృతే కృష్ణాయ తుభ్యం నమః ॥
(గీత గోవిందము)

అర్థము :- (మత్స్యరూపుడవై) వేదములనుద్ధరించినవాడవు ; (కూర్మ రూపుడవై) సంసార భారమును మోయువాడవు, (మంథరము నెత్తిన వాడవు);

(వరాహ రూపుడవై) పృథివిని పాతాళము నుండి తెచ్చినవాడవు; (నృసింహరూపుడవై) హిరణ్య కశ్యపుని ద్రుంచిన వాడవు; (వామనుడవై) బలిచక్రవర్తిని వంచించి పాతాళమునకు పంపిన వాడవు; (పరశురాముడవై) క్షత్రియులను రూపుమాపినవాడవు; (శ్రీరాముడవై) రావణున్ని జయించిన వాడవు; (బలరాముడవై) హలమును (నాగలిని) ధరించిన వాడవు; (బుద్ధ రూపుడవై) కరుణను విస్తరింపజేసినవాడవు– అదే విధముగా (కల్కిరూపుడవై) మ్లేచ్ఛులను (హిందూలేక ఆర్యలేదా వైదిక సంప్రదాయమును పాలించని వారిని) నాశనము చేయువాడవునగు, దశావతారములను ధరించిన శ్రీకృష్ణుడవగు నీకు నమస్కారము. ఈ శ్లోకములో శ్రీకృష్ణున్ని అవతారముగా గ్రహించకుండా అవతారిగా (అవతారములను ధరించిన వానిగా)నుల్లిఖించడమైనది. "కృష్ణస్తు భగవాన్ స్వయమ్" (భాగ. 1–3–28) అని వచింపబడినందువలన.

పురాణాదులందు భగవంతుని యొక్క అవతారములను అనేక విధములుగా వర్ణించడమైనది. పూర్ణావతారము, విభవావతారము, స్వరూపావతారము, అంశావతారము, గుణావతారము, వ్యూహావతారము, ఆవేశావతారము, స్ఫూర్త్యవతారము మరియు అర్చావతారాది భేదములచే నభివర్ణించనైనది.

నిత్య లీలా విభూతి నిలయమై షోడష (పదహారు) కళలతో పూర్ణమై యేది యుండునో నది పూర్ణావతారమనబడును. భగవంతుడగు శ్రీకృష్ణుడు పూర్ణావతారుడని ప్రసిద్ధి.

వివిధ విస్మయత్వాపాదక అతిమానుష కార్య యోగ్యమైన దివ్యదేహ ప్రాకట్యములు యేవి గలవో, అవి విభవావతారములనబడును. వామన నృసింహ మత్స్య కూర్మ వరహాద్యవతారములు విభవావతారములు.

ఏవిధమైన విచిత్ర కార్య కరణ శక్త్య సన్నిధీ భూత కేవల స్వరూపావస్థాన లక్షణములు యేవి గలవో, అవి స్వరూపావతారము లనబడును. కపిల వ్యాస దత్తాత్రేయ శేషాద్యవతారములు స్వరూపావతార ములు.

అంశముచే నవతరించియున్నవి యేవోనవి అంశావతారము లనబడును. పృథు ధన్వంతర్యాద్యవతారములు అంశావతారములు. (మహాభారతము ఆది పర్వము అరువది నాలుగవ అధ్యాయమున గనందగును.) అంశః- శక్తిసమావేశః.

బ్రహ్మ చర్యాద్యుత్కృష్ట గుణ సంపన్నములు గుణావతారములు. సనకాద్యవతారములు.

సామూహికముగా కార్య విశేషములను గావించునవి వ్యూహావతారములు. శ్రీకృష్ణ సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ చతుష్టయము. శ్రీకృష్ణుడు పూర్ణావతారమైనప్పటికిని యిందులో నంతర్గతమున్నందున వ్యూహావతారుడని గూడ చెప్పవచ్చును.

అద్భుత శక్త్యావేశముచే నభివ్యక్తమైనవి ఆవేశావతారములు. పరశు రామాద్యవతారములు.

ఆయా అసాధారణ స్ఫూర్త్యాది ధర్మములచే ప్రకటమైన ప్రసిద్ధ ఆధునిక మహానుభావులెవరు గలరో, వారిని భగవంతుని యొక్క స్ఫూర్త్యవతారములని యెఱుంగవలయును. "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" ఇత్యాది (గీత 7-18) వచనముల వలన.

అర్చకాద్యాత్మ స్థితికములు (అంతఃకరణస్థభావవిశేషములు) అర్చావతారములు. ఇవి గృహ, ఆయతన భేదముచే ద్వివిధములు. వీటిలో

మంత్రాదులచే సంస్కరింపబడి ఆరాధ్య (పూజ్య) త్వముచే ఉపాసక భక్తులచే గృహ దేవాలయాదులందు స్థాపించబడిన మూర్తులు (విగ్రహములు) గృహార్చావతారములనబడును. మంత్రాది బలముచే వీటిలో నావిష్టుడై విచిత్ర మహిమలను గావించుట వలన "మూర్తులు" భగవంతుని యొక్క గృహార్చావతారములుగ చెప్పబడినవి.

ఉపాసకుడు స్వసంకల్పాదులచే శాలగ్రామ నర్మదేశ్వర తత్తత్పవిత్ర మంత్రనామాదులందు పరమాత్మత్వముచే పూజ జపాదులచే నుపాసించుట వలన నతనికి ఆయా ఫలలాభమగుటంజేసి శాలగ్రామాదులను భగవంతుని యొక్క ఆయతనార్చావతారములని శాస్త్రములందు పేర్కొనబడినవి.

శ్రీకృష్ణుడు నిత్యలీలా విభూతి నిలయుడు, షోడశకళా పరిపూర్ణుడగు పూర్ణావతారుడని శాస్త్రమునందు ప్రసిద్ధము - అని లోగడ తెలుసుకున్నాము. ఆ షోడశకళలేమిటో - శాస్త్రము ఈ క్రింది విధముగా వర్ణించినది.

ఒకరి యొక్క కర్మ లేదా స్థితిని తెలియజేయునది "కళ" అనబడును. అథవా జ్ఞాన ప్రయోజనం "కళ" (భాగ. 1-3-28 శ్రీధరి).

సమస్త ప్రాణికోటులన్ని పరమేశ్వరుని యొక్క విభూతులే. కావున ప్రతి జీవిలో వాటి వాటి విశేషత, శక్తి మరియు స్థితి తారతమ్యముచే ఒక్కొక్క ప్రాణిలో కొన్ని కళలు ఉంటాయి. ఎట్లనగా! ఉద్భిజ్జములు - లతా, వృక్ష, గుల్మములు మొదలగు వాటిలో అన్నమయ (కోశము) కళ ఉ ంటుంది. అనగా ఆహారమును గ్రహించి, వికాసమును పొందుట మాత్రమే యున్నది. అట్లే స్వేదజములు - ఈగలు, దోమలు మొదలగు వాటిలో అన్న మయము మరియు ప్రాణమయము - అను రెండు కళలున్నాయి. అండజములు - పక్ష్యాదులందు అన్నమయ, ప్రాణమయ, మరియు మనోమయమను మూడు కళలున్నాయి. జరాయుజములైన అశ్వ, గజ,

గోవు మొదలగు వాటిలో అన్నమయ, ప్రాణమయ, మనోమయ మరియు విజ్ఞానమయమను నాలుగు కళలుంటాయి. మానవులలో అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ మరియు ఆనందమయమను నైదు కలళుంటాయి. కొందరు విశిష్ట పురుషులలో (మహాత్ములలో) గత ఐదు కోశముల (కళల) కంటే నతిరిక్తము మరి మూడు కళలు తెలియబడుచున్నవి. 1. అతిశాయినీ కళ, 2. విపరిణామినీ కళ, 3. సంక్రామిణీ కళ. మొదటి అతిశాయినీ కళచేతనే శ్రీ ఆద్యశంకరాచార్యులు సామాన్య మానవులకు కల్పనాతీతమైన అద్భుత కార్యములను పండ్రెండు సంవత్సరములలోపునే చేసి చూపించాడు. రెండవదగు విపరిణామినీ కళచే సాధకుడు అణిమాద్యష్టైశ్వర్యముల ద్వారా మహిమలు చూపించగలడు.

మూడవదగు సంక్రామిణీ కళద్వారా సాధకుడు తన శక్తిని యితరులలో ప్రవిష్టము చేయగలడు. ఉదా! శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందునిలో శక్తిపాతము గావించాడు. అదే విధముగా యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు సంజయునికి దివ్యదృష్టిని ప్రసాదించాడు. ఇంత వరకు తెలుపబడిన ఎనిమిది కళలు మనుష్యుల పర్యంతము సీమితములు- అనగా ఇంతకు మించిన కళలు మానవులు పొందలేరు. ఇకముందు తొమ్మిది నుండి పదహారు కళల పర్యంతము దేవతలకు మరియు అవతారములలో సంభవించును. మిగిలిన ఎనిమిది కళలు ఈ ప్రకారముగానున్నవి. 1. ప్రభ్వీ, 2. కుణ్ఠినీ, 3. వికాసినీ, 4. మర్యాదినీ, 5. సంహ్రాదినీ, 6. ఆహ్లాదినీ, 7. పరిపూర్ణ మరియు 8. స్వరూపావస్థితి.

1. కర్తుమకర్తు మన్యథా కర్తుం యోగ్యతా (సామర్థ్యం) "ప్రభ్వీ"- అనగా నసంభవమును సంభవము చేసి చూపించుట ప్రభ్వీకళ అంటారు. ఉదా:- స్తంభము నుండి నృసింహప్రాకట్యము.

2. పంచభూతముల యొక్క లేదా విషాదుల యొక్క సామర్థ్యమును అభిభూతము (ప్రభావరహితము) జేయుట "కుణ్ఠినీ" కళ యనబడును. ఉదా:- శివుడు హాలాహలమును, ప్రభావము తగ్గించి పానము చెసెను.

3. "వికాసినీ" కళ ద్వారా వామనుడు మూడడుగలచే సంపూర్ణ బ్రహ్మాండమును వ్యాపించెను.

4. "మర్యాదినీ" కళ ద్వారా శ్రీరామ చంద్రుడు సర్వశక్తి సంపన్నుడై యుండిగూడ మర్యాద (సీమ, పరిమితి)కు బద్ధుడై మర్యాద పురుషోత్తముడని పిలువబడెను.

5. "సంహ్రాదినీ" కళచే శ్రీకృష్ణుడు ఋతుభిన్న కాలములో పుష్ప - ఫలాదులను గావించి ప్రకృతి నియమమును తన చేతిలోకి తీసికున్నాడు.

6. "ఆహ్లాదినీ" కళచేత రాధికా నిత్యము కృష్ణుని సాన్నిధ్యములో నుండి రమించగల్గినది.

7. "పరిపూర్ణ" కళావతారము శ్రీకృష్ణావతారము.

**శ్లో॥ ఏతే చాంశకలాః పుంసః "కృష్ణస్తు భగవాన్ స్వయమ్" ।**
**ఇంద్రాది వ్యాకులం లోకం మృడయన్తి యుగే యుగే ॥**

(భాగ. 1-3-28)

**అర్థము :-** శ్రీకృష్ణుని కంటె భిన్నమగు సమస్త అవతారములు భగవంతుని (పరమేశ్వరుని) యొక్క శక్తి సమావిష్టమైన అంశావతారములు లేక జ్ఞాన ప్రబోధన రూప కళావతారములు. (అంశః = శక్తి సమావేశః; కళా = జ్ఞాన ప్రబోధనమ్ ఇతి వంశీధరీ)

కాని, భగవాన్ శ్రీకృష్ణుడైతే స్వయముగా భగవంతుడు (అవతారి యగు పరమేశ్వరుడు). ఎప్పుడు ప్రజలు దైత్యులచే నత్యంతముగా పీడింపబడుదురో, అప్పుడు యుగ యుగములందు యనేక రూపములను

ధరించి (అవతరించి) వారిని రక్షించుచుండును. అందుకే కృష్ణావతారము పరిపూర్ణావతారము.

శ్లో॥ రామాది మూర్తిషు కళానియమేన తిష్ఠన్
నానావతారమకరోద్భువనేషు కింతు ।
కృష్ణః స్వయం సమభవత్పరమః పుమాన్యో
గోవిందమాది పురుషం తమహం భజామి ॥

అర్థము :- రామాద్యవతారములందు నియమిత కళలను పోషిస్తూ లోకములలో అనేక యవతారములను భగవంతుడు ధరించాడు. కాని యే పరమపురుషుడగు కృష్ణుడు స్వయముగా నావిర్భవించెనో, నా యాదిపురుషుడగు గోవిందుని నేను భజింతును. (బ్రహ్మసంహితాయామితి వంశీధరి. 1-3-28)

8. "స్వరూపావస్థితి" రూప కళ గూడ శ్రీకృష్ణునిలో ఉంది. సంపూర్ణ కళలను తన యందు సమావేశము జేసుకొని తన మూల (నిజ, శుద్ధ) స్వరూపము చేనవస్థితమై యుండుట "స్వరూపావస్థితి" రూప కళ యనబడును. ద్వాపరాంతమున శ్రీకృష్ణుడు తన సంపూర్ణకళలను తన యందు సమావేశము గావించుకొని, తనమూల స్వరూపములో నుండి పోయాడు. అందువలన శ్రీకృష్ణుడు షోడశకళలతో పరిపూర్ణుడై పూర్ణావతారముగా ప్రసిద్ధి కెక్కెను.

శ్లో॥ అంశాంశకాంశకళాద్యవతార వృన్దై
రావేశపూర్ణ సహితైశ్చ పరస్య యస్య ।
సర్గాదయః కిల భవన్తి తమేవ కృష్ణం
పూర్ణాత్పరం తు పరిపూర్ణతమం నతాః స్మః ॥
(గర్గసంహితా - గోలోకఖండము. 11-10)

**అర్థము** :- ఏ పరమేశ్వరుని యొక్క అంశావతారము, అంశాంశావతారము, కళావతారము, ఆవేశావతారము మరియు పూర్ణావతార సహిత విభిన్న అవతారములచే విశ్వసృష్టి పాలనాది కార్యములు సంపన్నమగుచున్నవో, ఆ పూర్ణము కంటె గూడ పరమైన పూర్ణతమ భగవాన్ శ్రీకృష్ణునకు మేము ప్రణామము లొనరించుచున్నాము.

నిర్గుణము, నిరాకారము, అవాఙ్మానసగోచరము, శుద్ధమునగు పరబ్రహ్మము దుష్టులను శిక్షించి, ఉపాసకభక్తులను (సాధువులను) రక్షించి లోకములో ధర్మమును నిలబెట్టుట కొఱకు పరమేశ్వరుడు స్వ మాయా యోగముచే వాఙ్మనసగోచరమగు సగుణ సాకార మనోహర దివ్య మంగళ విగ్రహమును (రూపమును) ధరించి ప్రతి యుగములో నవతరించు చున్నాడు. ఈ విషయమును స్వయముగా శ్రీకృష్ణ పరమాత్మయే వాక్రుచ్చి యున్నారు.

**శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవత భారత! ।**
**అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్ ॥**
(గీత. 4-7)

**అర్థము** :- వేదవిహితము, ప్రాణుల అభ్యుదయ నిఃశ్రేయసమునకు సాధనము, ప్రవృత్తి నివృత్తి రూపము, అదే విధముగా వర్ణములు, ఆశ్రమములు మరియు వాటి ఆచారములచే వ్యక్తమగు ధర్మము ఎప్పుడెప్పుడు క్షీణించునో, ఓ జ్ఞానరతుడవగునో భారత! ఎప్పుడెప్పుడు వేదనిషిద్ధము, అనేకప్రకారదుఃఖసాధనము మరియు ధర్మవిరోధియగు నధర్మముద్భవించునో, అప్పుడప్పుడు నిత్యసిద్ధ శుద్ధ స్వరూపమునే మాయా యోగముచే దేహమును ధరించినట్లు (సృష్టించినట్లు) చూపుచున్నాను.

శంక :- ధర్మమునకు హాని కలిగినపుడు, అధర్మంయొక్క వృద్ధి అయినపుడు నేను ప్రకటమవుతాను అంటున్నావు - అయితే ఇవి నీ

సంతోషానికి హేతువులా? అలా అయితే నీ యవతారము అనర్థమునిచ్చునదే అవుతుందిగదా! అంటే అలా కాదు అని చెప్తూన్నాడు.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ (గీత. 4-8)

అర్థము :- ధర్మహాని వలన క్షీణిస్తున్న సాధువులను, వేదమార్గములో ఉండి పుణ్యము చేయువారిని అన్నివిధముల పరిరక్షించుటకొరకు అట్లే అధర్మబుద్ధితో పెరుగుతూన్న పాపములను జేయు వేదమార్గ విరోధులగు పాపాత్ములను నాశనము చేయుట కొఱకు. 'ఈ రెండు ఎలా సిద్ధిస్తాయి'- అంటే చెబుతున్నాడు ధర్మసంస్థాపనము కొఱకు అని. అధర్మమును చక్కగా నివారించుట ద్వారా ధర్మము యొక్క స్థాపనము అనగా! వేద మార్గ పరిరక్షణమే ధర్మస్థాపన. దాని కోసమే ముందుచెప్పినట్లు ప్రతియుగములో జన్మిస్తాను. (మదుసూదనీ)

ఇంతవరకు విస్తారముగా వర్ణింపబడిన పరబ్రహ్మ పరమేశ్వరుడు స్వమాయచే వేదమార్గ పరిరక్షణ ద్వారా ధర్మమును స్థాపించి, దుష్టులను దునుమాడి, సాధువులను (భక్తులను) ఉద్ధరించు నిమిత్తము (జగత్కల్యాణము కొఱకు) మథురానగరిలో, చెఱసాలలో వసుదేవుని ద్వారా దేవకి యందు దేహధారివలె చతుర్భుజుడుగా ప్రకట మయ్యెను.

బోలో శ్రీగోపాల కృష్ణ భగవాన్ కీ జై...
జయ్ కన్హైయా లాల్ కీ జై ......
బృందావన విహారీకీ జై ......
శ్రీకృష్ణ చంద్ర దేవ్ కీ జై ....

ప్రకృతము ననుసరించెదము. ఈ విధముగా నవతరించిన పుత్రరూప భగవానుని గాంచి శ్రీవసుదేవుడు ఇలా అంటున్నాడు.

శ్లో॥ వసుదేవశ్చ తం రాత్రౌ జాతం పుత్రమధోక్షజమ్ ।
శ్రీవత్సలక్షణం దృష్ట్వా యుతం దివ్యైశ్చ లక్షణైః ॥
ఉవాచ వసుదేవస్తు రూపం సంహర వై ప్రభో ॥

(హరివంశ పురాణము - విష్ణు పర్వము. 4-22)

అర్థము :- వసుదేవుడు గూడ రాత్రి యందు పుత్రరూపములో నవతరించిన భగవానుడగు నధోక్షజుని స్తుతించెను. శ్రీవత్స చిహ్నము మరియు దివ్య లక్షణ సంపన్నుడగు భగవంతుని జూచి వసుదేవుడు ఇలా అన్నాడు. ప్రభో! మీరు ఈ చతుర్భుజ స్వరూపమును ఉపసంహరించుడు.

శ్రీమద్భాగవతములో గూడ-

శ్లో॥ ఉపసంహర విశ్వాత్మన్నదో రూపమలౌకికమ్ ।
శంఖచక్రగదాపద్మ శ్రియా జుష్టం చతుర్భుజమ్ ॥

(భాగ. 10-3-30)

అర్థము :- హే విశ్వాత్మా! శంఖ, చక్ర,గద, కమలములచే సుశోభితము, లక్ష్మీ దేవిచే సదా సేవ్యము నగు ఈ అలౌకిక రూపము యేది గలదో, దానిని నీవు ఉపసంహరింపుము.

శ్లో॥ భీతోఽహం దేవ కంసస్య తస్మాదేవం బ్రవీమ్యహమ్ ।
మమ పుత్రా హతాస్తేన తవ జ్యేష్ఠామ్బుజేక్షణ! ॥

( హరివంశపురాణము. విష్ణుపర్వము. 4-23)

అర్థము :- హే దేవా! నేను కంసుని భయముచే భీతిల్లుచుంటిని. అందుకే నీతో ఇలా అనుచుంటిని. హే కమలనయన! నీకు జ్యేష్ఠులైన నా యనేక పుత్రులను కంసుడు చంపివైచెను.

**శ్లో॥ వసుదేవవచః శ్రుత్వా రూపం చాహరదచ్యుత ।**
**అనుజ్ఞాప్య పితృత్వేన నందగోపగృహం నయ ॥**

(హరివంశపు. వి.ప. 4-24)

**అర్థము :-** వసుదేవుని మాటలు విని అచ్యుతుడైన భగవంతుడు తండ్రియైనందున వసుదేవుని ఆజ్ఞను స్వీకరించి; అతనితో భగవంతుడు ఇలా అన్నాడు - నీవు నన్ను నందగోప గృహమున (నందుని యింటికి)కు జేర్చి; (నందుని యొక్క నవజాత శిశును యిక్కడకు చేర్చుము) అని చెప్పి, తన చతుర్భుజ స్వరూపమును ఉపసంహరించుకొనెను.

**శ్లో॥ వసుదేవస్తు సంగృహ్యా దారకం క్షిప్రమేవ చ ।**
**యశోదాయా గృహం రాత్రౌ వివేశ సుతవత్సలః ॥** (4-25)

అర్థము :- అప్పుడు పుత్రవత్సలుడగు వసుదేవుడు బాలకుడైన భగవంతుని యొడిలో నిడుకొని, రాత్రి యందు యశోద మాత గృహమున ప్రవేశించెను.

**శ్లో॥ యశోదాయాస్త్వ విజ్ఞాత స్తత్ర నిక్షిప్య దారకమ్ ।**
**ప్రగృహ్యా దారికాం చైవ దేవకీ శయనే న్యసత్ ॥** (4-26)

**అర్థము :-** యశోదమాతకు వసుదేవుని రాక యేమియును తెలియకుండెను. వసుదేవుడు తన బాలకుని యశోదమాత పడకన నుంచి, ఆమెకు అప్పుడే జన్మించిన నవజాత కన్యను గైకొని వచ్చి దేవకి యొక్క శయ్యపై పరుండబెట్టెను.

**శ్లో॥ పరివర్తే కృతే తాభ్యాం గర్భాభ్యాం భయవిక్లవః ।**
**వసుదేవః కృతార్థో వై- ..........॥** (హరివంశ.పు. వి.ప. 4-27)

**అర్థము** :- ఈ ప్రకారముగా నా యిరువురు నవజాత శిశువులను తారుమారు జేసి కృతార్థుడైన వసుదేవుడు భయముచే వ్యాకులుడైనాడు..........

ఈ ఉపరోక్త హరివంశపురాణోక్త ప్రకారమును అనగా శ్రీకృష్ణుని యొక్క ప్రాకట్యమును మరియు వసుదేవుడు యిరువురి శిశువులను తారుమారు గావించిన యుదంతమును స్మరిస్తూ శ్రీతుకారాం మహారాజుగారు నలుబది రెండవ యభంగములోని మొదటి చరణము ద్వారా "ఫిరివిలీదోనీ కన్యా ఆణి చక్రపాణి"- అని తెలిపి యున్నారు.

రెండవ చరణములో శ్రీతుకారామస్వామి అంటున్నాడు - గోవిందుని అవతరణచే (ప్రాకట్యముచే) సర్వత్ర సర్వులకు ఆనందమే ఆనందామాయెను. "గోవిందః" అను శబ్దమునకు అర్థము మహాత్ములు ఈ క్రింది విధముగా నిర్వచించిరి. 1. "గో" అనగా భూమి యని అర్థము. అగాధమగు సాగరగర్భంలో భూమి అదృశ్యమైనపుడు వరాహావతారమెత్తి భూమిని వెలికి తెచ్చినందున శ్రీమన్నారాయణుడు గోవిందుడయ్యెనని మహాభారతము చెప్పుచున్నది.

**శ్లో॥ నష్టాం వై ధరణీం పూర్వమవిందద్వృద్గుహాగతామ్ ।**
**గోవింద ఇతి తేనాహం దేవైర్వాగ్భిరభిష్టుతః ॥**

(శ్రీమన్మహాభారతము - శాంతిపర్వము. 342-70)

**అర్థము** :- పూర్వము నష్టమై రసాతలమునకు వెళ్ళిన పృథివిని, నేను వరాహరూపమును ధరించి తిరిగి పొందితిని. కావున దేవతలు వారి వాణిచేత నన్ను "గోవిందు"డని స్తుతించిరి. "గాం - పృథివీం, విందతి - ప్రాప్నోతి ఇతి గోవిందః" పృథివిని ఎవడు పొందెనో వాడు గోవిందుడు - శ్రీహరి.

**2. శ్లో ॥ అహం కిలేంద్రో దేవానాం త్వం గవామింద్రతాం గతః**
**గోవింద ఇతి లోకాస్త్వాం స్తోష్యన్తి భువి శాశ్వతమ్ ॥**

(హరివంశ పురాణము. 2-19-45)

**అర్థము :-** నేను దేవతలకు ఇంద్రుడనై యున్నాను. మరియు నీవు గోవులకు ఇంద్రుడవైనావు. కావున నేటినుండి సనాతనుడ (శాశ్వతుడ)వగు నిన్ను ఈ భూతలముననున్న లోకులందరు గోవిందుడని స్తుతించెదరు.

**3. శ్లో॥ గౌరేషా తు యతో వాణీ తాం చ వేద యతో భవాన్ ।**
**గోవిందస్తు తతో దేవ మునిభిః కథ్యతే భవాన్ ॥**

(హరివంశపురాణము. 3-88-50)

**అర్థము :-** ఓ దేవా! ఈ వాణి "గౌ" అను పేరుతో ప్రసిద్ధమున్నది. దానిని నీవెఱుగుదువు గాన, మునులు నిన్ను "గోవిందుడు" అని చెప్పుదురు.

4.గోభిః వాణీభిః విందతే, వేత్తి వేదాంత వాక్యైరితి వా "గోవిందః". భగవంతుడు "గో" అనగా వాణిచేత ప్రాప్తమగును లేదా వేదాంత వాక్యములచే తెలిసికొందురు. కావున "గోవిందుడు" అనబడును. (విష్ణు సహస్రనామ భాష్యము)

**శ్లో॥ గోభిరేవ యతో వేద్యో గోవిందః సముదాహృతః ॥**

**అర్థము :-**భగవంతుడు వాణిచేతనే తెలియబడును గాన "గోవిందుడు" అని చెప్పబడెను.

5. "గో" అనగా వేదము. మత్స్యావతారమెత్తి హయగ్రీవుడను రాక్షసుని సంహరించి వేదములను తిరిగి పొందినందువలన శ్రీహరి గోవిందుడయ్యెను.

పై నిర్వచనముల యనుసారము కృష్ణరూప విష్ణువే గోవిందుడు గాన నతని యావిర్భావముచే సంపూర్ణ జగత్తు అహ్లాదితమయ్యెను. గో గోప గోపికలందరికి ఆనందమే ఆనందము గలిగెను. దేవతలందరు సంతసించిరి.

**శ్లో॥ తజ్జన్మ దినమత్యర్థ మాహ్లాద్యమల దిఙ్ముఖమ్ ।**
**బభూవ సర్వలోకస్య కౌముదీ శశినో యథా ॥** (వి.పు. 5-3-3)

**శ్లో॥ సంతస్సంతోషమధికం ప్రశమం చండమారుతాః ।**
**ప్రసాదం నిమ్నగా యాతా జాయమానే జనార్దనే ॥** (వి.పు. 5-3-3)

**అర్థము :-** చంద్రుని యొక్క వెన్నెలవలె భగవంతుని యొక్క ప్రాకట్యము సంపూర్ణ జగత్తునకు ఆహ్లాదమును కలిగించెను. సమస్త దిశలు అత్యంత నిర్మలమయ్యెను. శ్రీజనార్దనుని జననముచే సంతు జనులు పరమ సంతోషమును బడసిరి. ప్రచండవాయువు శాంతించెను. నదులన్నియు నత్యంత స్వచ్ఛమయ్యెను.

**శ్లో॥ అవాద్యన్త విచిత్రాణి వాదిత్రాణి మహోత్సవే ।**
**కృష్ణే విశ్వేశ్వరేఽనన్తే నందస్య వ్రజమాగతే ॥** (భాగ. 10-5-13)

**శ్లో॥ గోపాః పరస్పరం హృష్టాదధిక్షీర ఘృతామ్బుభిః ।**
**ఆసించంతో విలింపన్తో నవనీతైశ్చ చిక్షిపుః ॥** (భాగ. 10-5-14)

**అర్థము :-** భగవాన్ శ్రీకృష్ణుడు సంపూర్ణ జగత్తుకు ఏకైక స్వామి ఉన్నాడు. అతని యొక్క ఐశ్వర్యము, మాధుర్యము, వాత్సల్యము - అన్నియు ననంతములే. అతడు ఎప్పుడు నందబాబా యొక్క వ్రజభూమిలో ప్రకటమయ్యెనో, అపుడతని జన్మ మహోత్సవము ఘనముగా జరుపబడినది.

గొప్ప గొప్ప విచిత్ర మంగళమయ బాజా (వాద్య విశేషములు) మ్రోగించ (వాయించ) బడినవి. ఆనందోత్సాహముచే మత్తులై గోపగణము ఒకరికొకరు పాలు, పెరుగు, నెయ్యి మరియు నీళ్ళు పైన గుప్పించి చల్లుకొనుచుండిరి. ఒకరి ముఖమునకు మరొకరు నవనీతమును (వెన్నను) రుద్దు కొనుచుండిరి. వెన్నముద్దలు విసరుకొనుచుండిరి. (కుంకుమ గులాలు పరస్పరము పై జల్లుకొనుచుండిరి) ఈ ప్రకారముగా నానంద జన్మ మహోత్సవమును వర్ణనాతీతముగ జరుపుకొనుచుండిరి.

శ్రీ హరియొక్క అవతారదర్శనమాత్రము చేతనే దేవకీ వసుదేవుల యొక్క సంకెళ్ళ రూప బంధము మరియు అవిద్యా - కామ - కర్మాది రూప సంసార బంధనములు త్రెంచబడినవి శ్రీతుకోబారాయ్ అభంగములోని మూడవ చరణములో తెలియజేయుచున్నారు.

శ్లో॥ తయా హృత ప్రత్యయ సర్వవృత్తిషు
ద్వాఃస్థేషు పౌరేష్వపి శాయితేష్వథ ।
ద్వారస్తు సర్వాః పిహితా దురత్యయాః
బృహత్కపాటాయసకీల శృంఖలైః ॥

శ్లో॥ తాః కృష్ణవాహే వసుదేవ ఆగతే
స్వయం వ్యవర్యంత యథా తమో రవేః ।
వవర్ష పర్జన్య ఉపాంశు గర్జితః
శేషోఽన్వగాత్ వారి నివారయన్ ఫణైః ॥

అర్థము :- ఆ యోగమాయ చేత ద్వారపాలకుల యొక్క మరియు పురవాసులయొక్క సమస్త యింద్రియవృత్తులు హరింపబడినవి. అందరు అచేతనులైనారు. పెద్ద పెద్ద ఇనుప గొలుసుల చేతను, గొప్ప తాళములు వేయబడి, కారాగృహము మూసి వేయబడి, దుర్భేద్యమై యున్నది.

కాని వసుదేవుడు భగవంతుని వచనానుసారము (కన్నయ్యను నందగోపగృహమునకు చేర్చి యశోదమాతయొక్క నవజాత కన్యను తీసుకురావడానికి భగవంతున్ని గంపలో నిడుకొని) శిరమున ధరించి ఎప్పుడు ద్వారము చెంతకు వచ్చెనో, వెంటనే ద్వారము దానంతట అదే (స్వయముగా) తెఱువబడెను. అట్లే - సూర్యోదయముచే చీకటి తొలగునట్లు మందమందముగా మేఘములు గర్జిస్తూ జలమును వర్షించుచుండెను. శేషుడు తన పడగలను భగవంతునికి గొడుగుగా పట్టి వర్షపు జలమును నివారిస్తూ వెనువెంట జనుచుండెను.

మస్తకములో బుద్ధి యున్నది. ఎప్పుడు బుద్ధి ఈశ్వరానుభూతి నొందునో, అప్పుడు సమస్త సంసార బంధనములు త్రెంచబడును. ఎవరు భగవంతుని శిరమున ధరించెదరో, వారి కారాగృహ ద్వారమేమిటి - మోక్షద్వారము గూడ తెఱువబడును. వారి జీవనయాత్రలో ఏవిధమైన విఘ్నములు తటస్థించవు. అహంతా మమతారూప సంసారబంధములు విచ్ఛిన్నమగును. హృదయ గ్రంథి (చిజ్జడ తాదాత్మ్యాధ్యాస) భిన్నమగును. సర్వసంశయములు ఛేదించబడును. సమస్త జన్మారంభక కర్మలు క్షీణించి పోవును. అవిద్యా, కామ, కర్మాది రూప సంసార బంధనములు త్రెంచబడి కృతకృత్యుడగును. కావున వసుదేవునివలె భగవంతుని దర్శించి, శిరమున ధరించవలెను. నిత్య నిరంతర ఆదరణీయముగ శ్రీకృష్ణుని యొక్క యథార్థ తత్త్వమేమిటో, దానినెల్లపుడనుసంధించు చుండవలెనని భావము.

అభంగములోని నాలుగవ చరణములో శ్రీతుకారామస్వామి అంటున్నాడు - ప్రత్యక్షాది ప్రమాణముల కగోచరుడగు నవ్యక్త పరమాత్మ మనమోహన సుందర దివ్య మంగళ విగ్రహ (సగుణ రూప) మును ధరించి, మనో వాక్కులకు విషయమై ఉపాసక భక్తులు దర్శించుకొని.

తన్మయత్వములో ఆనందడోలికలలో నూగిసలాడుతూ, తనివిదీర మైమరచి గానము చేస్తూ, నృత్యముజేసి తరించుటకు వీలగు లీలామానుష రూపముతో గోకులమును పునీతము జేయుటకు నందబాబా గృహమునకరుదెంచెను. నిజముగా వ్రజవాసులు ధన్యాత్ములు. పుణ్యాత్ములు.

శ్లో॥ అహోభాగ్య మహో భాగ్యం నందగోప వ్రజౌకసామ్ ।
యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మసనాతనమ్ ॥
(భాగ. 10-14-32)

**అర్థము :-** అహో! వాస్తవముగ నందుడు మొదలగు వ్రజవాసులైన గోపాలురయొక్క అహోభాగ్యమని చెప్పవలెను. ఎందుకనగా! పరమానందుడు, సనాతనుడు, పరిపూర్ణుడగు పరబ్రహ్మము వారికి మిత్రుడును, అత్యంత సన్నిహితుడును ఆయెను.

శ్లో॥ అనుగ్రహాయ భక్తానాం మానుషం దేహమాస్థితః ।
భజతే తాదృశీః క్రీడా యాః శ్రుత్వా తత్పరో భవేత్ ॥
(భాగ. 10-33-37)

**అర్థము :-** భక్తుల ననుగ్రహించుటకై భగవంతుడు మనుష్య రూపములో ప్రకటమై, వేటిని శ్రవణము చేసి జీవుడు భగవత్పరాయణుడై తరించగలడో, అటువంటి లీలలను గావించును.

లక్ష్మీపతి యొక్క ప్రత్యక్ష దర్శనముచే నందబాబా మరియు యశోదా మాతా ధన్యులయ్యారని ఐదవ చరణములో శ్రీతుకోబారాయ్ నుడువు చున్నాడు. వాస్తవముగా ఈ దంపతులు శ్రీకృష్ణ భగవంతునికి స్వయముగా జన్మనివ్వకున్నప్పటికిని, వారు కాయిక, వాచిక, మానసికముగ (త్రికరణ శుద్ధిగ) కన్నయ్యకు అనన్యభక్తితో (ప్రేమ)తో సేవచేసి ధన్యులైనారు.

ఈ శరీరము కృష్ణునిది, కృష్ణునిసేవ కొఱకు ఉన్నది. భగవంతుని సేవలో శరీరమును నియోగించిన చాలదు. మనస్సును గూడ అచ్యుతునికి అంకితము చేయాలి. హృదయములో ప్రేమ పెల్లుబికి రావాలి. నేత్రములలో ప్రేమాశ్రువులు నింపుకోవాలి. మనస్సులో మాధవుడు మెదులుతూ ఉండాలి. కన్నులలలో కన్నయ్య కదులుతూ ఉండాలి. చేతులతో సేవ చక చకా జరుగుతూ ఉండాలి. అధరముల నుండి శ్రీహరి యొక్క సుమధుర గానము వెల్లువై వెలువడుచుండవలెను. శిరమున హరిని ధరించి, యురమున మురహరి యొక్క పరిపూరిత ప్రేమను పూరించుకొని, జలపూరిత నేత్రములతో, పరమాత్మయే జీవితపరమలక్ష్యమని యెంచి, దైనందిన వ్యవహారమును పరిశుద్ధముగావించుకొని, నటవరుని సేవగా భావించి యొనరించుచుండ వలెను.

అట్లు యశోదమాత వ్రజ కిశోరుని యెల్లపుడు దృష్టి యందిడుకొని, యెదలో శ్రీకృష్ణుని యందనురక్తి (నిర్మల మగు భక్తిని) నింపుకొని కరకమలములచే కర్మలు కొనసాగిస్తూ ఉండెడిది. నందకిశోరునికి స్వయముగా పాలచ్చి, వెన్నముద్దలు తినిపించి, లాలించి, పాలించి తన యొడిలో నిదురింప జేసెడిది. పలువిధముల పరిచర్యలు చేసెడిది. సకల ప్రపంచమునకు ఆశ్రయము (అధిష్ఠానము) అయిన పరబ్రహ్మ పరమాత్మకు తన యొడిలో నాశ్రయమిచ్చిన యశోదమాత నిజముగా యెంతటి ధన్యురాలు. ఆ నందబాబా యెంతటి పుణ్యాత్ముడు.

శ్లో॥ నన్దః కిమకరోద్ బ్రహ్మన్ శ్రేయ ఏవం మహోదయమ్ ।
యశోదా చ మహాభాగా పపౌ యస్యాః స్తనం హరిః ॥

శ్లో॥ పితరౌ నాన్వవిందేతాం కృష్ణోదారార్భకే హితమ్ ।
గాయన్త్యద్యాపి కవయో యల్లోకశమలాపహమ్ ॥

(భాగ. 10-8-46,47)

శ్రీ శుకదేవునితో పరీక్షిన్మహారాజు అంటున్నాడు. హే భగవన్! నందబాబా యింతటి గొప్ప మంగళమయసాధన యేమి చేసి యుండ వచ్చును? పరమపావనియగు యశోదమాత యే తపస్సు చేసి యుండవచ్చును? దానిచే స్వయముగా భగవంతుడు తన శ్రీముఖముచే స్తన్యపానము చేయగలిగెను.

త్రికాలజ్ఞానులైన మహాత్ములు గూడ ఇప్పటికిని భగవంతుని యొక్క గానము చేయుచున్నారు. వేటి యొక్క దర్శన, శ్రవణ, కీర్తనాదులచే సమస్త జనులయొక్క సకలపాపతాపములు శాంతింపగలవో, అటువంటి పరమ పవిత్రమైన బాలలీలలను, తన ఐశ్వర్యమును, గొప్పతనమును దాచియుంచి గోపబాలురకు, నంద యశోద దంపతులకు చూపించెను. ఆ లీలలు స్వయముగా జన్మదాతలు అయిన దేవకీ వసుదేవులకు దుర్లభమయ్యెను. కాని, నందయశోద దంపతులు బాలకృష్ణుని యొక్క బాల లీలలు తిలకించి, అపార సుఖమును దోచుకొనగలిగిరి. దీనికి కారణమేమై యుండ వచ్చును? కావున, నంద బాబా మరియు యశోదమాత భగవంతుని యొక్క దర్శన, స్పర్శన, సంభాషణ, సేవాదుల ద్వారా ధన్యులైరి.

శ్రీకృష్ణుని యొక్క జననకాలము శ్రావణమాసము కృష్ణపక్షము అష్టమి తిథి రోహిణీ నక్షత్రము బుధవారము మధ్యరాత్రి యని శాస్త్రములు చెప్పుచున్నవి- అంటూ శ్రీ తుకారాం మహారాజుగారు అభంగములోని ఆరవ చరణములో ఉపలక్షణముగా "నిశీ జన్మకాళ। ఆలే అష్టమీ గోపాళ"॥ అని తెలియజేయుచున్నారు. కృష్ణాష్టమి గూర్చి వాచస్పత్యములో ఈ క్రింది విధముగా తెలియజేయబడినది.

శ్లో॥ నైశీథః సమయోఽష్టమీ బుధదినం.............., ,
శ్రీకృష్ణాభిధమమ్బుజేక్షణమభూదావిః పరం బ్రహ్మ తత్ ॥

(జ్యోతిర్నిబంధే )

**అర్థము :-** మధ్యరాత్రి సమయములో అష్టమీతిథి బుధవారము రోజున కమలముల వంటి కన్నులు గల శ్రీకృష్ణుడను అభిదేయము (పేరు) గల ఆ పరబ్రహ్మము యొక్క ఆవిర్భావమాయెను.

గోపాలకృష్ణునియొక్క జన్మవిషయములో శాస్త్రభేదముచే మాసభేదము గాన వచ్చుచున్నది. కొన్ని గ్రంథములలో శ్రీకృష్ణుని జన్మ తిథి శ్రావణమాసము బహుళాష్టమి యని, మరికొన్ని గ్రంథములలో భాద్రపద మాసము బహుళాష్టమి యని చెప్పబడుచున్నది. రోహిణీ యోగమునకు "జయంతీ" అంటారు. దీనిని ప్రధానముగా దృష్టి యందిదుకొని శాస్త్రములు శ్రీకృష్ణ జనన కాలమును చెప్పుచున్నవి. సనత్కుమార సంహితలో -

**శ్లో॥ శ్రుణుష్వావహితో రాజన్! కథ్యమానం మయానఘ! ।**
**శ్రావణస్య చ మాసస్య కృష్ణాష్టమ్యాం నరాధిప! ।**
**రోహిణీ యది లభ్యేత జయంతీ నామ సా తిథిః ॥**

**అర్థము :-** హే రాజన్! ఓ పాపరహితుడా! ఓ నరాధిప (రాజా)! నేను చెప్పుచున్నది సావధాన చిత్తుడవై వినుము. శ్రావణ మాసము కృష్ణపక్షము అష్టమీ తిథిలో రోహిణీ యోగము సంప్రాప్తించినచో దానిని (ఆ తిథిని)" జయంతీ" అని అంటారు.

విష్ణురహస్యములో -

**శ్లో॥ అష్టమీ కృష్ణపక్షస్య రోహిణీ ఋక్ష సంయుతా ।**
**భవేత్ ప్రోష్ఠపదే మాసి జయంతీ నామ సా స్మృతా ॥**

**అర్థము :-** భాద్ర పదమాసము కృష్ణపక్ష అష్టమీ తిథి ఋక్షసంయుక్త రోహిణీ యోగము యెప్పుడు సంభవించునో దానిని "జయంతీ" అంటారు.

అయితే శ్రీకృష్ణ జననము శ్రావణమాసములో జరిగినదనిగాని, భాద్రపదమాసములో జరిగినదనిగాని యభినివేశము ఆగ్రహము) చేయకూడదు. రెంటిలో ఏ మాసమైనా యుండుగాక! కాని, కృష్ణపక్ష అష్టమీతిథి రోహిణీ నక్షత్ర యోగము (జయంతీ) యెప్పుడు లభించునో దానిని (ఆరోజు) శ్రీకృష్ణజన్మాష్టమిగా నెఱుంగవలయును- అని శ్రీవసిష్ఠ సంహిత చెప్పుచున్నది-

**శ్లో॥ శ్రావణే వా నభస్యే వా రోహిణీ సహితాష్టమీ ।**
**యదా కృష్ణా నరైర్లబ్ధా సా జయంతీతి కీర్తితా ॥**

**అర్థము :-** పైన తెలుపనైనది. నభస్య = భాద్రపదమాసము. "స్యుర్నభస్య ప్రౌష్ఠపద భాద్ర భాద్రపదాః సమాః"॥ (అమరః 1-4-17)

శ్రీకృష్ణ జన్మాష్టమి శ్రావణ మాస కృష్ణపక్ష అష్టమి అని చెప్పినా లేక భాద్రపద మాస కృష్ణపక్ష అష్టమి అని చెప్పినా భ్రమ జెందనవసరము లేదు. ఎందుకనగా! శబ్దభేదమే గాని అర్థభేదము లేదు. ఏప్రకారముగా చెప్పినా "కృష్ణాష్టమి" రోజు మాత్రము అదే (ఒకటే). శ్రావణ కృష్ణపక్ష అష్టమి ఏరోజున వస్తుందో అదే రోజున భాద్రపద కృష్ణపక్ష అష్టమి అగును. ఈ రెంటికి నెలరోజుల వ్యత్యాసముంటుంది గదా అని భ్రమజెందగూడదు. ఎట్లనగా? కొన్ని ప్రదేశములలో పౌర్ణిమాస్యాంత అనగా పున్నమితో అంతమగు (పూర్తి యగు) మాసములను స్వీకరించెదరు. అట్లగుచో శ్రావణ పౌర్ణమి నాటికి శ్రావణమాసము సమాప్తమగును. మరుసటి రోజు కృష్ణ పక్ష ప్రతిపద (బహుళ పాడ్యమి) భాద్రపద మాసము ప్రారంభమగును. ఎనిమిదవ రోజుకు కృష్ణపక్ష అష్టమి సంప్రాప్తించును. అదే శ్రీకృష్ణ జన్మాష్టమి. లోక వ్యవహారభేదము చేతనే శాస్త్ర (శబ్ద) భేదమున్నది, కాని అర్థభేదమేమియును లేదని యెఱుంగవలయును. ఏ విధము చేసైనను

ముఖ్యముగా కృష్ణపక్ష అష్టమీ రోహిణీ యోగమనబడు "జయంతీ" ఎప్పుడు సంప్రాప్తమగునో నా తిథియే కృష్ణాష్టమిగా నెఱుగవలయును.

విష్ణు ధర్మములో -

**శ్లో॥ రోహిణీ చ యదా పక్షే కృష్ణేఽ ష్టమ్యాం ద్విజోత్తమ! ।**
**జయంతీ నామ సా ప్రోక్తా సర్వ పాపహరా తిథిః ॥**

**అర్థము :-** పైన దెలుపనైనది.

మరియు, శ్రీకృష్ణ జన్మాష్టమి విషయములో బ్రహ్మపురాణములో యుగభేదమును గూడ చెప్పబడినది.

**శ్లో॥ అథ భాద్రపదే మాసి కృష్ణాష్టమ్యాం కలౌ యుగే ।**
**అష్టావింశతి యే జాతః కృష్ణోఽ సౌ దేవకీ సుతః ॥**

**అర్థము :-** ఇరువది యెనిమిదవ మహా యుగములో యే కలియుగము వచ్చియుండెనో, ఆ కలియుగమున భాద్రపదమాసములో కృష్ణపక్ష అష్టమీ తిథి యందు దేవకీకుమారుడగు శ్రీకృష్ణుడు జన్మించెను.

"కల్ప భేదము" చేత వైవస్వత మన్వంతర ఇరువది యెనిమిదవ మహాయుగములోని కలియుగములో శ్రీకృష్ణుని జననము జరిగినదని చెప్పబడినందున భ్రమ జెందనవసరము లేదు. ఒకానొక కల్పములో కలియుగములో జన్మించి యుండవచ్చుననుట యుచితమే.

సారాంశమేనగా - శ్రావణ మాసము కృష్ణపక్షము అష్టమీ తిథి రోహిణీ నక్షత్రయోగమే శ్రీకృష్ణుని జన్మతిథి (శ్రీకృష్ణ జన్మాష్టమి) యని శాస్త్రార్థ నిర్ణయము విష్ణు పురాణములో -

**శ్లో॥ ప్రావృట్కాలే చ నభసి కృష్ణాష్టమ్యామహం నిశి ।**
**ఉత్పత్స్యామి ..........................॥** (వి.పు. 5-1-78)

**అర్థము :-** శ్రీమన్నారాయణుడు యోగనిద్రతో (భగవంతుని యొక్క మహామాయతో) ఇలా చెప్పెను. హే శుభే! వర్షాకాలములో శ్రావణ మాసము కృష్ణపక్ష అష్టమీ తిథి రాత్రి సమయములో నేను జన్మించగలను. (నభసి = శ్రావణ మాసము నందు. (హలాయుధము) తథా అమరమునందు గూడ (1-4-16). "శ్రావణే తు స్యాన్నభాః శ్రావణికశ్చ సః" )

శ్రీకృష్ణ జన్మాష్టమి పర్వకాలమున అనన్యభక్తితో శ్రీకృష్ణుని అర్చించి ఉపవాస వ్రతమును ఆచరించాలని శాస్త్రము విధానము చేసింది.

వహ్ని పురాణములో -

**శ్లో॥ సప్తజన్మకృతం పాపం రాజన్! యత్త్రివిధం నృణామ్ ।**
**తత్క్షపయతి గోవింద స్తిథౌ తస్యాం సమర్చితః ॥**
**ఉపవాసశ్చ తత్రోక్తో మహాపాప ప్రనాశనః ॥**

**అర్థము :-** హే రాజన్! ఎవరు శ్రీకృష్ణ జన్మాష్టమి పర్వకాలమున అనన్య మనస్కుడై శ్రీకృష్ణుని సమ్యగ్రీతిచే (శాస్త్రోక్త ప్రకారముగ) నారాధించునో, అతని (ఆనరుని) మనో వాక్కాయములతో చేసిన ఏడు జన్మల పాపములను శ్రీ గోవిందుడు నాశనము చేయును. మరియు మహాపాపప్రణాశిని యగు ఉపవాస వ్రతమును గూడ ఆరోజున ఆచరించాలని శాస్త్రోక్తి.

వ్రతమును ఆచరించని వానిని శాస్త్రము నిందించు చున్నది.

**శ్లో॥ శ్రావణే బహుళే పక్షే కృష్ణ జన్మాష్టమీ వ్రతమ్ ।**
**న కరోతి నరో యస్తు భవతి బ్రహ్మరాక్షసః ॥** (భవిష్యత్పురాణము)

**అర్థము :-** శ్రావణ బహుళాష్టమీ రోజున యే నరుడు శ్రీకృష్ణ జన్మాష్టమీ వ్రతము నాచరించడో, వాడు బ్రహ్మరాక్షసుడగును.

స్కంధపురాణములో గూడ -

**శ్లో॥ యే న కుర్వన్తి జానన్తః కృష్ణ జన్మాష్టమీ వ్రతమ్ ।**
**తే భవన్తి నరాః ప్రాజ్ఞ! వ్యాళా వ్యాఘ్రాశ్చ కాననే ॥**

**శ్లో॥ రటన్తీహ పురాణాని భూయో భూయో మహామునే! ।**
**అతీతానాగతం తేన కులమేకోత్తరం శతమ్ ॥**
**పతితం నరకే ఘోరే భుఞ్జతా కృష్ణవాసరే ॥**

**అర్థము :-** కృష్ణాష్టమీ వ్రతమును తెలిసి యెవరు ఆచరించరో, హే బుద్ధిశాలి! వారు అరణ్యమున సర్పములు, పులులు అగుదురు. హే మహామునే! శ్రీకృష్ణ జన్మాష్టమీ రోజున యెవడు భుజించునో, వాని యొక్క గడచి పోయిన మరియు రానున్న నూట ఒక్క కులము (పిడీలు) ఘోర నరకమున పడుదురని శాస్త్రములు మళ్ళీ మళ్ళీ ఉద్ఘోషించుచున్నవి. కావున, "జయంతీ" అనబడు శ్రీకృష్ణజన్మాష్టమీ పర్వకాలమున శ్రీగోవిందుని మనఃపూర్వకముగా శాస్త్రోక్త ప్రకారముగా నారాధించి, ఉపవాస వ్రతము నాచరిస్తూ, కృష్ణ కథా (లీలల) శ్రవణము చేస్తూ, యథాశక్తి గో, భూ, హిరణ్య, వస్త్రదానాది పుణ్యకార్యములను జేసి శ్రీఅచ్యుతుని యొక్క కృపకు పాత్రులు గావలెను.

భగవంతుడగు శ్రీకృష్ణుని యొక్క ప్రాకట్యముచే పృథివీ మాత సంతసించెను. ఎందుకనగా - భగవదవతారముచే సకల దైత్యులు రూపు మాపబడిరి - అని శ్రీతుకారాం మహారాజుగారు అభంగములోని ఏడవ చరణములో తెలియజేసిరి. దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మసంస్థాపనమను కార్యము చే భూభారమును దించుటయే భగవదవతారముయొక్క ప్రయోజనము. భాగవతములో శ్రీవేదవ్యాసులు ఇలా చెబుతున్నారు -

శ్లో॥ భూమేర్భారాయమాణానాం దైత్యానాం చ వధోద్యమమ్ ।
(భాగ - 10- 1-64)

అర్థము - నారదమహర్షి కంసునితో ఇలా అంటున్నాడు. దైత్యులవలన భూభారము అధికమైంది కావున, భూభారమునకు కారణమగు దైత్యులను వధించుటకు ప్రయత్నము జరుగుచున్నది.

శ్లో॥ భూమేర్భారావతరణాయ యదుష్వజన్మా
జాతః కరిష్యతి సురైరపి దుష్కరాణి । (భాగ. 11-4-22)

అర్థము :- స్వరూపముచే జన్మరహితుడైనను భూభారమును దించుటకు భగవంతుడు యదువంశములో జన్మించి, దేవతలకు గూడ దుస్సాధ్యమగు కర్మలు చేయగలడు.

భారవాహి పురుషుని శిరోభారమును దించినచో నతనికెట్లు సుఖానుభవము గలుగునో, అట్లు భగవంతుడవతరించి భూభారమునకు కారణమైన కంసుడు, శిశుపాలుడు మరియు దన్తవక్త్రాదులను (భాగ. 10-74-43) (భాగ. 10-78-8,9,10) సంహరించి భూభారమును దించినందున పృథివి సంతసించిన దాయెను- అని శ్రీతుకారాం మహారాజుగారు చెప్పుచున్నారు.

శ్లో॥ మత్స్యం కూర్మం చ వారాహం నారసింహం చ వామనమ్ ।
రామం రామం చ కృష్ణం చ బుద్ధం కల్కిం నమోఽస్తు తే ॥
(పద్మ.పు. 68-51)

అర్థము :- సుగమము.

నలుబది రెండవ అభంగములోని అంతిమ చరణములో

శ్రీతుకారామస్వామి అంటున్నాడు - కంసుడు తన వైరి యగు శ్రీకృష్ణ జన్మ వార్తను విని దిక్కుదోచని వాడై, భయరూప సుడిగుండములో స్మృతి దప్పి గిరగిర దిరుగుచుండెను. భాగవతములో -

**శ్లో॥ తతో బాలధ్వనిం శ్రుత్వా గృహపాలాః సముత్థితాః ।**
**తే తు తూర్ణముపవ్రజ్య దేవక్యా గర్భ జన్మ తత్ ।**
**ఆచఖ్యుర్భోజరాజాయ యదుద్విగ్నః ప్రతీక్షతే ॥**

(భాగ. 10-4-1,2)

**అర్థము :-** నవజాత శిశువు (యోగమాయ) యొక్క రోదనమును విని ద్వారపాలకుల నిద్ర భంగమయ్యెను. (నిద్ర నుండి మేల్కాంచిరి.) వారు వెంటనే భోజరాజు కంసుని (హరివంశ.పు. 2-28-57 నుండి 109 వరకు) (భాగ. 9-24-24) వద్దకు వెళ్ళి, దేవకికి సంతానము గలిగిన విషయము చెప్పిరి. కంసుడు వ్యాకుల చిత్తముచే భయకంపితుడై ఈ వార్త కోసమే నిరీక్షించుచుండెను.

**శ్లో॥ స తల్పాత్ తూర్ణముత్థాయ కాలోఽయమితి విహ్వలః ।**
**సూతీగృహమగాత్ తూర్ణం ప్రస్ఖలన్ ముక్తమూర్ధజః ।**

(భాగ. 10-4-3)

**అర్థము :-** ద్వారపాలకుల మాటలు వినిన వెంటనే శయ్య నుండి దిగ్గున లేచి, ఈసారి నా మృత్యువే జన్మించాడు అని ఆలోచిస్తూ, భయముచే విహ్వలుడై, కురులు చిందర వంద అయినవి గూడ తెలియకుండా, మార్గములో (ఎన్నో) సార్లు పడుచూ, లేస్తూ అడుగులు తడబడుచుండగా నతి శీఘ్రముగా ప్రసూతి గృహమున కేతెంచెను. అలమితి విస్తరేణ.

43. అభంగము :-

శిళా స్ఫటికాచీ న పాలటేభేదేఁ ।
దాఊనియా ఛందేఁ జైశీఁ తైశీఁ ॥1॥

జైసా కేలా తైసా హోయ క్షణ క్షణా ।
పేడావీ వాసూ భక్తిభావే ॥2॥

ఫేడావయా ఆలా అవఘియాంచీ ధణీ ।
గోపాళ గౌళణీ మాయబాప ॥3॥

మాయబాప సోడవిలే బందీహూనీ ।
చాణూర మర్దునీ కంసాదిక ॥4॥

అధిక నాహీఁ దేణేఁ అరిమిత్రా ఏక ।
పూతనా కంటక ముక్త కేలీ ॥5॥

ముక్త కేలా మామా కంస మహాదోషీ ।
బాళహత్యా రాశీ పాతకాంచా ॥6॥

పాప కోఠే రాహే హరి ఆఠవితాఁ ।
భక్తి ద్వేషేఁ చింతా జైసాతైసా ॥7॥

సాక్షీ తయాపాశీఁ పూర్వీల కర్మాచా ।
బాంధలా సేవేచా ఋణీదేవ ॥8॥

దేవ భోళా ధాంవే భక్తా పాఠోవాఠీ ।
ఉచ్చారితా కంఠీఁ మాగే మాగే ॥9॥

మానాచా కంటాళా తుకా హ్మణే త్యాసీ ।
ధాంవతో ఘరాశీఁ భావికాంచ్యా ॥10॥ (3804)

ప్ర.ప :- స్ఫటికాచీ శిళా = స్ఫటిక మణి (యొక్క సాన్నిధ్యములో నేదైన నొక పూవు నుంచిన యెడల నా పుష్పము యొక్క రంగు) ; భేదేం= భేదముచే (ఆ స్ఫటికముయొక్క మూలస్వరూపము) ; న పాలటే = మారదు.(అదేవిధముగా పరబ్రహ్మ పరమాత్మ శ్రీకృష్ణుడు గోకులములో అనేకమైన) ఛందేం = లీలలు (గావించియును) జైశీం = తైశీం = తన మూల స్వరూప స్థితిలో నిర్వికారముగ నుండెను. 1. (భగవంతున్ని) భక్తిభావేం= అనన్య భక్తిభావనచే; జైసా కేలా = (భక్తిని) ఎలా చేసిరో, (వారియొక్క) వాసనాఫేడావీ = ఇచ్ఛ పూర్తిజేయుట కొఱకు; (భగవంతుడు) క్షణ క్షణా = క్షణ క్షణము; తైసా హెూయం = ఆయా రూపములుగానగుచుండెడివాడు. 2. (ఆ దేవుడు) గోపాళ = గోపాలురయొక్క; గౌళణీ - గోపికలయొక్క ; మాయ బాప = తల్లిదండ్రులయొక్క (మరియు); అవఘియాంచే = సకల భక్తుల యొక్క ; ధణీ = మనోరథమును; ఫేడావయా= పూర్తి చేయుటకు; ఆలా = సాకారరూపములో నవతరించెను. 3. (తాను) కంస = కంసుడు; చాణూర ఆదిక = చాణూరుడు మొదలుకొని (అనేక దుష్టులను) ; మర్దునీ = నాశనము చేసి; మాయ బాప = దేవకీ వసుదేవులను; బందీహూనీ = చెఱసాల నుండి; సోడవిలే = విడిపించెను. 4. (భగవంతునికి) అరి = శత్రువులకు; మిత్రా = మిత్రులకు ; దేణే; = మోక్షమునిచ్చుటలో; ఏక = ఇద్దరు సమానులే; (అతనికి) అధిక నాహీం= విశేషమేమియును లేదు; కంటక = శిశుఘాతినియగు ; పూతనా = పూతనను (గూడ); ముక్తకేలీ = ముక్తురాలిని చేసెను. 5. బాలహత్యా = శిశుహత్యరూప; పాతకాంచ్యా = పాపముల యొక్క; రాశి = సమూహము (మరియు); మహాదోషి = గొప్ప దోషి (ముద్దాయి)యగు; మామా = మేనమామయగు; కంస - కంసున్ని (గూడ); ముక్త కేలా = ముక్తుని జేసెను. 6. భక్తి = భక్తి ప్రేమ చేతకాని; ద్వేషేం=ద్వేషము చేతగాని, జైసా తైసా = ఏప్రకారము

చేసైనను; హరి = నారాయణుని; చింతా = చింతనము చేస్తూ; ఆఠవితా = స్మరించినచో; పాప = పాపము ; కోఠే రాహే = ఎక్కడుండును? 7. పూర్వీల= వెనుకటి; కర్మాచా = కర్మకు; దేవ = దేవుడు; సాక్షీ = సాక్షి (అయి ఉన్నాడు); సేవేచా = (భక్తుల యొక్క) సేవారూప; ఋణీ = ఋణముచేత; బాంధలా = బంధింపబడి (భక్తులకు వారివారి కర్మలకు ఫలము నిచ్చుటకు); తయాపాశీఁ= భక్తుల చెంతనే ఉంటాడు. 8. కంఠీ = కంఠము నుండి (భగవన్నామమును) ; ఉచ్చారితా = ఉచ్చరించిన; మాగే మాగే =వెను వెంటనే; దేవ = భగవంతుడు ; భక్తా = భక్తుల యొక్క; పాఠోవారీ = వెను వెంటే; బోళా = నిష్కపటముతో ధాంవేఁ = పరుగెత్తుకొని వచ్చును. 9. తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; (భగవంతుడు) మానాచా = ఎవరైతే దురభిమానులుంటారో; త్యాశీ = వారినుండి, (చాలా) కంటాళా = విసుగెత్తిపోయాడు; (ఎవరైతే) భావికాంచ్యా = శ్రద్ధాయుక్త నిష్కపట భక్తులున్నారో, వారి యొక్క ఘరాశీఁ=గృహమునకు (స్వయముగా); ధాంవతో = పరుగెత్తును. 10.

**తా॥** స్ఫటిక శిల (మణి) సాన్నిధ్యములో నేదైన రంగుగల పుష్పము నుంచినచో నా పుష్పము యొక్క రంగు స్ఫటికమందు భాసించినప్పటికిని, ఆ రంగు భేదముచే స్ఫటికము తన మూలస్వరూపము నుండి మార్పుజెందదు. అదే విధముగా శ్రీకృష్ణుడు గోకులములో ననేక లీలలను గావించియు తన మూల శుద్ధస్వరూపస్థితిలో నిర్వికారుడై యుండెను. 1. భక్తులు భగవంతుని యే యే భావముచే నుపాసింతురో, క్షణ క్షణము ఆయారూపములుగా వారి మనోరథములను పూర్తి జేయుటకు ప్రకటమగు చుండును. 2. ఆ దేవుడు (కృష్ణుడు) గోపాలుర యొక్క ; గోపికలయొక్క రోహిణియొక్క మరియు తల్లిదండ్రుల యొక్క యభీష్టమును నెరవేర్చుట

కొఱకు సగుణ సాకారరూపముచే నవతరించెను. 3. అతడు దుష్టులైన కంస చాణూరాదులను దునుమాడి (నాశనము జేసి) తల్లిదండ్రులగు దేవకీ వసుదేవులను కారాగారగృహము నుండి విడిపించెను. 4. దుష్టులను నాశనము చేయుటయే గాకుండా వారికి ముక్తిని గూడ ప్రసాదించెను. ఎందుకనగా, భగవంతునికి, తనను ప్రేమభక్తిచే గాని, వైరభక్తిచే గాని అనన్యముగా నిరంతరము ఉపాసించు మిత్రులు గాని, శత్రువులు గాని ఇద్దరూ సమానులే. వారికి మోక్షమునిచ్చుటలో నతనికి యేమియును విశేషము (భేదము) గోచరించదు. బాలఘాతకి యగు దుష్ట పూతనకు గూడ చిన్నికృష్ణుడు ముక్తిని ప్రసాదించెను. 5. ఎవడు దేవకి యొక్క సంతానమును నష్టము జేసి పాపరాశిని సమకూర్చుకొనెనో, అపాపరాశి, మహాదోషి, శిశుఘాతకుడైన కంస మామకు కూడ ముక్తిని ప్రసాదించెను. 6. భక్తి ప్రేమతోగాని, ద్వేషముతో గాని, భయముచేగాని, స్నేహముచేగాని యే విధమైన భావనచే నైనను నిరంతరము హరి చింతన – స్మరణ చేయు వానికి పాపమెక్కడుంటుంది? 7. ప్రతి మనుష్యుని (ప్రాణి)యొక్క ప్రతి కర్మకు సాక్షి ఆదేవుడే (కృష్ణుడే). అందువలననే ప్రతి ప్రాణికి వారివారి కర్మానురూప ఫలమును యిచ్చును. కావున, భగవంతుడు భక్తుల సేవారూప ఋణముచే బద్ధుడైనందున వారి చెంతనే నిలిచి యుంటాడు. 8. భక్తుల యొక్క కంఠమున (ముఖారవిందమునుండి) శ్రీహరియొక్క దివ్యనామోచ్ఛారణ జరుగుచుండినచో, భగవంతుడు భక్తుల వెంట పరుగెత్తుకొని వస్తాడు. 9. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు – దేవుడు దురభిమానుల పట్ల విసుగెత్తినాడు. అందుకే వారు ఆహ్వానించినప్పటికిని వారి గృహమున కెళ్ళడు. కాని, నిరభిమానులై, శ్రద్ధాభక్తి పురఃసరులై, నిష్కపట ప్రేమ హృదయులై, నిరంతరము భగవంతుని భజించు విదురుని వంటి భాగ్య వంతుల యింటికి స్వయముగానే పరుగెత్తుకొని వచ్చును.

**సు.వ్యా:-** శ్రీకృష్ణుడు భక్తానుగ్రహార్థము సగుణ సాకారముచే నవతరించి గోకులములో ననేక యలౌకికమైన లీలలను (క్రీడలను) గావించియును, తాను స్వస్వరూపస్థితిలో నిర్వికారముగ "స్ఫటిక లౌహిత్య" న్యాయము వలెనుండెనని శ్రీతుకోబారాయ్ చెప్పుచున్నాడు. జపాకుసుమము యొక్క లౌహిత్యము స్ఫటికములో భాసించినప్పటికిని స్ఫటికము లౌహిత్యముచే రంజితము కాదు, ఏలాంటి వికారమును (మార్పును) జెందదు. అట్లే సచ్చిదానందము, నిర్గుణము, నిర్వికారము, నిష్క్రియమునగు పరమాత్మ గోకులములో సగుణ సాకారముచే నెన్నియో విచిత్ర లీలలు జేసి చూపించాడు. కాని స్వరూపముచే నిర్వికారము నిర్గుణము, నిరుపాధిక స్వరూపముతో నుండెను. "కుసుమ వచ్చ మణిః" (సాంఖ్య సూత్రము. 2-35) పరమాత్మ నిర్మల స్ఫటికమణివలె యున్నాడు.

**శ్లో॥ యథా సంలక్ష్యతే రక్తః కేవల స్ఫటికో జనైః ।**
**రంజకాద్యుపధానేన తద్వత్ పరమ పూరుషః ॥**

(కూర్మ.పు. 2-2-28)

**అర్థము :-** ఏ విధముగా లోకులచే జపాకుసుమాది ఎర్రని వస్తువుల సాన్నిధ్యములో స్ఫటిక మణి యుంచబడినపుడు స్ఫటికము రక్తవర్ణములో కానుపించ బడునో, అట్లే పరమ పురుషుడు ఉపాధియోగముచే తద్రూపముగ గోచరించును. ఉపాధి (జపాకుసుమ) సంపర్కముచే స్ఫటికము అన్యరూపముచే ప్రతీతమగుచున్నను, స్ఫటికము అన్యరూపమును బొందక శుద్ధమునై నిర్వికారముగనే యున్నట్లు పరమాత్మవిషయములో గూడ దెలియనగును.

**శ్లో॥ నానావిధ వస్తూనాం వర్ణాన్ ధత్తే యథా మలః స్ఫటికః ।**
**తద్వదుపాధే ర్గుణభావితస్య భావం విభుర్ధత్తే ॥**

శ్లో॥ విగతోపాధిః స్ఫటికః స్వప్రభయా భాతి నిర్మలో యద్వత్ ।
చిద్దీపః స్వప్రభయా తథా విభాతీహ నిరుపాధిః ॥
( పరమార్థసారః 16 మరియు 61)

అర్థము :- నానావిధ వస్తువుల సాన్నిధ్యములో నుంచబడిన నిర్మలమగు స్ఫటికము అనేక విధ వర్ణములను ధరించునట్లు, వ్యాపకమైన, శుద్ధమైన పరమాత్మ స్వమాయారూపోపాధియోగముచే (దేవకీ వసుదేవుల పుత్రుడుగా) సగుణరూపములో (గోపాల కృష్ణుడుగా) గోచరిస్తున్నాడు. ఉపాధిభూతములగు నానావస్తువులను తొలగిస్తే స్ఫటికము తన నిజరూపములో నిర్మలముగా నున్నట్లు, మాయోపాధిని విడిచినచో నిరుపాధిక చిద్రూప చైతన్యము స్వపకాశముచే భాసించును. 1. భక్తులు భగవంతుడగు శ్రీకృష్ణుని యేయే భావముతో నుపాసింతురో, క్షణ క్షణము వారి మనోరథములను పూర్తిజేయుటకు ఆయా రూపములలో ప్రకటమగు చుండును. భగవద్భక్తులగు పుణ్యాత్ములు నాలుగు ప్రకారములుగా నుంటారని శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణుడే తెలిపి యున్నాడు.

శ్లో॥ చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥(గీత. 7-16)

అర్థము :- హే భరతకులశ్రేష్ఠుడా! అర్జునా! కష్టాలలో నున్నవాడు తత్త్వం తెలిసికొనదలచినవాడు ధనసంపత్తులు కోరేవాడు మరియు జ్ఞానవంతుడను నాలుగు విధాలైన సుకృతులు (పుణ్యాత్ములగు భక్తులు) నన్ను సేవిస్తూంటారు.

శ్లో॥ ద్వే రూపే వాసుదేవస్య వ్యక్తం చావ్యక్త మేవ చ ।
అవ్యక్తం బ్రహ్మణో రూపం వ్యక్తమేతచ్చరాచరమ్ ॥

**అర్థము :-** శ్రీ వాసుదేవునకు వ్యక్తము, అవ్యక్తమను రెండు రూపములు గలవు. నిర్గుణము, నిరాకారమునగు శుద్ధ వ్యాపక పరబ్రహ్మమేది గలదో అది వాసుదేవుని యొక్క అవ్యక్త స్వరూపము. ఇక నరసురాసురతరు తిర్యగాది చరాచర నామరూపాత్మక ప్రపంచమేది గలదో - అది వ్యక్త స్వరూపము.

**శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్ ।**
**మమ వర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥** (గీత. 4-11)

**అర్థము :-** హే పార్థ! యెవరు నన్నెట్లు భజించెదరో (ఆశ్రయించెదరో) వారిని నేనట్లే యనుగ్రహిస్తాను. మనుష్యులందఱు అన్ని విధముల నా యొక్క మార్గాన్నే యనుసరిస్తున్నారు.

భగవంతుని భజించు పుణ్యాత్ములగు భక్తులు నలువిధములని తెలిసికున్నాము. ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసువులు మరియు జ్ఞానులు, అముముక్షువులగు ఆర్తులను, అర్థార్థులను ఆర్తహరణము చేతను, అర్థదానము చేతను అనుగ్రహిస్తాను. యజ్ఞాది శ్రుతివిహిత నిష్కామ కర్మానుష్ఠానపరులగు జిజ్ఞాసువులను జ్ఞానప్రదానము చేతను మరియు జ్ఞానులను (ముముక్షవులను) మోక్షప్రదానము చేతను యనుగ్రహిస్తానని భగవంతుడు "యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" యెవరి భావన యెట్లుండునో, వారికి అట్లే (సిద్ధి ఫలము గలుగునను నియమము ననుసరించి వాక్రుచ్చియున్నారు.

**శ్లో॥ యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।**
**తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥** (గీత. 7-21)

**అర్థము :-** ఏయే కామి భక్తుడు యేయే ఫలములను గోరి యేయే దేవతా స్వరూపమును పూజించుటకిచ్ఛగించునో (కోరునో), ఆయా కామిభక్తునకు అశ్రద్ధనే స్థిరమైన దానినిగ జేస్తాను. (వారి యిచ్ఛానుససారము వారిని నేననుగ్రహిస్తాను)

ఫలమతః ఉపపతేః (బ్ర.సూ. 3-2-38) ఫలమ్ = కర్మఫలము, అతః = ఈ పరమేశ్వరుని వలననే కలుగును, ఏలయన, ఉపపత్తేః = అలా చెబితేనే ఉపపన్నంగా ఉంటుంది.

ఇత్యాది శాస్త్రవచనములచే యెవరెవరు యేయే ఫలములను గోరి యేయే రూపములనుపాసించుదురో, భగవంతుడు ఆయా రూపములచే ప్రకటమై వారి ననుగ్రహించునని తేటతెల్లమగుచున్నది. 2. ఆదేవుడు (శ్రీకృష్ణుడు) గోపాలురయొక్క, గోపికలయొక్క, తల్లిదండ్రులయొక్క మనోరథములను పూర్తి జేయుటకు సగుణ సాకారరూపములో విచ్చేసిరి - యని యభంగములోని మూడవ చరణములో తెలియజేయుచున్నారు.

**శ్లో॥ యశోదా రోహిణీ నందో గోప్యో గోపాశ్చ కౌరవ! ।**
**కృష్ణం సమేత్య లబ్ధేహా ఆసంల్లబ్ధమనోరథాః ॥** (భాగ. 10-17-15)

**అర్థము :-** హే కౌరవ (పరీక్షిత్!) - యశోదారాణి, రోహిణి, నందబాబా మరియు గోపీగోపాలురు - వీఅందరు శ్రీకృష్ణుని సాకార శ్యామసుందర స్వరూపమును పొంది సచేతునులయ్యారు. వారి యొక్క మనోరథములను పొందినవారైరి. 3.

భూభారమును దించుటకవతరించిన భగవంతుడగు శ్రీకృష్ణుడు కంస, చాణూరులనుద్ధరించి తల్లి దండ్రులగు దేవకీ వసుదేవులను చెఱసాల నుండి విడిపించెనని నాలుగవ చరణములో శ్రీతుకోబారాయ్ తెలియ జేయుచున్నాడు.

శ్లో॥ సమగ్రహీద్దుర్విషహోగ్రతేజా
యథోరగం తార్క్ష్యసుతః ప్రసహ్య ॥ (భాగ. 10-44-36)

శ్లో॥ ప్రగృహ్య కేశేషు చలత్కిరీటం
నిపాత్య రంగోపరి తుంగమంచాత్ ।
తస్యోపరిష్టాత్ స్వయమబ్జనాభః
పపాత విశ్వాశ్రయ ఆత్మతంత్రః ॥ (భాగ. 10-44-37)

శ్లో॥ తం సంపరేతం విచకర్ష భూమౌ
హరిర్యథేభం ................। (భాగ. 10-44-37)

అర్థము :- భగవంతుడగు శ్రీకృష్ణుని యొక్క ప్రచండ తేజస్సు అత్యంత దుఃసహమై యున్నది. గరుత్మంతుడు సర్పమును యే విధముగా పట్టుకుంటాడో, అట్లు భగవంతుడు కంసున్ని బలపూర్వకముగా గట్టిగా పట్టుకొనెను.

అదే సమయములో కంసుని యొక్క వజ్ర విభూషిత సువర్ణ కిరీటము క్రిందబడెను. శ్రీకృష్ణుడు కంసుని యొక్క కేశములను పట్టి ఉన్నతాసనము నుండి రంగభూమిలో పడవేసెను. తదుపరి పరమ స్వతంత్రుడు, సంపూర్ణ జగత్తున కాధారభూతుడగు కృష్ణుడు స్వయముగా కంసునిపై దూకెను.

భగవంతుడు దూకుటచేతనే కంసుడు మృతినొందెను. గజమును చంపి సింహము యేవిధముగా కళేవరమును ఈడ్చుకొని పోవునో, అట్లు శ్రీకృష్ణభగవానుడు కంసుని మృతశరీరమును ఈడ్చుచుండెను.

ఈవిధముగా భగవంతుడు కంసుని ఉద్ధరించెను. అట్లే చాణూరుని గూడ నుద్ధరించెను.

శ్లో॥ నా చలత్తత్ప్రహారేణ మాలాహత ఇవ ద్విపః ।
బాహ్వోర్నిగృహ్య చాణూరం బహుశో భ్రామయన్ హరిః ॥

శ్లో॥ భూపృష్ఠే పోథయామాస తరసా క్షీణజీవితమ్ ।
విస్రస్తా కల్ప కేశస్రగింద్ర ధ్వజ ఇవాపతత్ ॥

(భాగ. 10-44-22,23)

అర్థము :- (శ్రీకృష్ణుని యెదపై చాణూరుడు ప్రహారము గావించెను) కాని దానిచే భగవంతుడు యేమాత్రము విచలితుడుగాకుండెను. ఎట్లనగా పూలమాల ప్రహారముచే గజమువలె. భగవంతుడు చాణూరుని యొక్క రెండు భుజములను గట్టిగా పట్టుకొని అంతరిక్షమునందు చాలా వేగముగా గిరగిర త్రిప్పి ధరణిపై నుతికెను. ఆకాశములో త్రిప్పుచున్న సమయములోనే చాణూరుని యొక్క ప్రాణము వెళ్ళిపోయెను. వాడి యొక్క వేష -భూషణములు అస్తవ్యస్తమై పోయినవి. కేశములు, మాలలు చిందర వందర అయిపోయినవి. వాడు యింద్రుని యొక్క ధ్వజము వలె పడిపోయెను. (ఇంద్రధ్వజోనామ గౌడేషు ప్రసిద్ధః కస్మింశ్చిదుత్సవే మహాంస్తంభో ధ్వజపతాకాద్యలంకృతః పురుషాకృతి రుచ్ఛ్రీయతే - ఇంద్రధ్వజమనగా గౌడదేశీయులలో ప్రసిద్ధమైన ఒకానొక యుత్సవములో జెండా మొదలగు వాటితో నలంకరింపబడిన పురుషాకృతి గల గొప్ప స్తంభము - అని (శ్రీధరస్వామి).

ఉపరోక్త రీతిగా శ్రీకృష్ణ భగవానుడు చాణూరుని మరియు కంసుని సంహరించెను. మరియు బలరాముడు గూడ ముష్టికుని మర్దించెను. తదనంతము బలరామకృష్ణులు చెఱసాలలో కంసునిచే బంధింపబడిన తల్లిదండ్రులగు దేవకీవసుదేవులను విడిపించిరి.

**శ్లో॥ మాతరం పితరం చైవ మోచయిత్వాஉథ బంధనాత్ ।**
**కృష్ణరామౌ వవందాతే శిరసాஉస్పృశ్య పాదయోః ॥**
(భాగ. 10-45-50)

**అర్థము :-** తదనంతరము బలరామకృష్ణులు కారాగారము వద్దకు వెళ్ళి తల్లిదండ్రులను విడిపించి, వారి చరణములను శిరముచే స్పృశించి వందనమాచరించిరి. 4.

శత్రువై వైరభక్తి చేయువాడు, మిత్రుడై సఖ్యభక్తి చేయువాడును ఇద్దరూ భగవంతునికి సమానులే. మోక్షము నిచ్చుటలో నతనికి యేమియును భేదము గోచరించదు - అని ఐదవ చరణములో పూర్వార్ధములో శ్రీతుకోబారాయ్ తెలియ జేయుచున్నారు.

**శ్లో॥ తస్మాద్వైరానుబంధేన నిర్వైరేణ భయేన వా ।**
**స్నేహాత్కామేన వా యుంజ్యాత్(యుంజ్యాత్)కథంచిన్నేక్షతే పృథక్॥**
(భాగ. 7-1-25)

**అర్థము :-** అందువలన, వైరభావము చేతగాని, వైరహీన భక్తి భావముచేతగాని, భయము చేతగాని, స్నేహముచేతగాని లేక కామనచేతగాని - యేనకేన ప్రకారేణ భగవంతుని యందు మనస్సును సంపూర్ణముగా సంలగ్నము చేయవలెను. మనస్సును సమర్పించడములో అందరూ సమానులేగావున భగవంతుని దృష్టియందు పై భావములలోనే భేదమునూ లేదు. అందరికి మోక్షమును సమానముగానే ప్రసాదించును.

అట్లే శిశుఘాతకి యగు దుష్ట పూతనకు గూడ చిన్నికృష్ణుడు ముక్తి ప్రసాదించెనని యభంగములోని ఐదవ చరణములోని ఉత్తరార్ధములో చెప్పుచున్నాడు. బాలఘాతకి యగు దుష్టరాక్షసి పూతన, తన నిజరూపమును వదలి అపురూపమైన సుందర స్త్రీ రూపమును ధరించి వచ్చినది.

శ్లో॥ తస్మింస్తనం దుర్జరవీర్యముల్బణం
ఘోరాఙ్కమాదాయ శిశోర్దదావథ ।
గాఢం కరాభ్యాం భగవాన్ ప్రపీడ్య తత్
ప్రాణైః సమం రోషసమన్వితోఽపిబత్ ॥
(భాగ. 10-6-10)

అర్థము :- చిన్ని కృష్ణుని చెంతకు వచ్చిన భయంకర రాక్షసి పూతన తన స్తనములలో యేప్రకారముచే గూడ పచనమగుటకు వీలులేని ఘోరమగు విషదుగ్ధమును ధరించి, బాలకృష్ణుని తన యొడిలోకి తీసికొని, విషపూరిత తన స్తనమును చిన్నికృష్ణుని ముఖారవిందము నందు నివేశింప జేసెను. అప్పుడు భగవంతుడు క్రోధ సమన్వితుడై తన యుభయహస్తములచే పూతన యొక్క స్తనములను గట్టిగా పట్టుకొని, యా దుష్టరాక్షసి యొక్క ప్రాణములతో పాటు పాలను త్రాగదొడఁగెను.

శ్లో॥ సా ముంచ ముంచాలమితి ప్రభాషిణీ
నిష్పీడ్యమానాఖిల జీవమర్మణి ।
వివృత్య నేత్రే చరణౌ భుజౌ ముహుః
ప్రస్విన్నగాత్రా క్షిపతీ రురోద హ ॥ (భాగ. 10-6-11)

అర్థము :- అప్పుడు పూతన యొక్క ప్రాణములకాశ్రయభూతమగు సకల మర్మస్థానములు పెకలింపబడుచుండెను. అది గొప్ప శబ్దము జేయుచు - ఒరే బాలుడా! వదులుము. వదులుము. ఇక చాలించుము. చాలించుము- అని భయంకరమైన కేకలు వేయదొడఁగెను. పునః పునః కాళ్ళు చేతులు కొట్టుకొనుచు యేడవ సాగెను. కనుగ్రుడ్లు తలక్రిందులు చేసెను. సంపూర్ణ శరీరము చెమటలతో తడిపి పోయెను.

శ్లో॥ నిశాచరీత్థం వ్యథితస్తనా వ్యసు
ర్వ్యాదాయ కేశాంశ్చరణౌ భుజావపి ।
ప్రసార్య గోష్ఠే నిజరూప మాస్థితా
వజ్రా హతో వృత్ర ఇవాపతన్నృప! ॥ (భాగ. 10-5-13)

**అర్థము :-** ఓపరీక్షిత్ రాజా! ఈ ప్రకారముగా నిశాచరి యగు పూతన యొక్క స్తనములందు తన స్వరూపమును దాచుకోలేనంతటి పీడ గలిగెను. వెంటనే తన నిజరూపమగు రాక్షసి రూపము ప్రకటమాయెను. వజ్రాయుధముచే కొట్టబడి పడిపోయిన వృత్రాసురుని వలె, బయటకు వచ్చి గతప్రాణయై, కాళ్ళు చేతులు చాచుకొని, నోరు తెఱచుకొని, వెంట్రుకలు చిందరవందరయై పశువుల కొట్టములో పడిపోయెను.

ఈ విధముగా చిన్నికృష్ణుడు దుష్ట పూతననుద్ధరించెను. 5.

ప్రాణుల యొక్క శుభాశుభ కర్మసాక్షి ఆ దేవుడే (శ్రీకృష్ణుడే) అందువలననే ప్రతిప్రాణికి వారి వారి కర్మానుసారము ఫలమునిచ్చును. కావున, భగవంతుడు భక్తుల సేవారూప ఋణముచే బద్ధుడైనందున వారి చెంతనే నిలిచియుంటాడని యెనిమిదవ చరణములో శ్రీ తుకారాం మహారాజుగారు తెలియ జేయుచున్నాడు. "గతిర్భర్తా ప్రభుఃసాక్షీ" (గీత. 9-18), "కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః, సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ" (శ్వే.ఉ. 6-11). గతి అనగా కర్మఫలము, పోషించేవాడు, ప్రభుః = స్వామి,ప్రాణి కర్మలకు సాక్షి - అని గీతావచనము. పరమాత్మ (కృష్ణుడు) సకల ఉపాధులనధిష్ఠించి వాటి ధర్మములను చూస్తూంటాడు. కావున అధ్యక్షుడు. నిరవయవము, నిష్క్రియమున్నందున సకల భూతములకు, వాటి కర్మలకు, తత్ఫలభోగములకు సాక్షియై యున్నాడు, కాని తాను స్వయముగా కర్త గాదు, భోక్తయును గాదు. (సర్వప్రాణి కృతవిచిత్ర

కర్మాధిష్ఠాత యని యర్థము). సర్వభూతములు శుక్తి యందు రజతము వలె, దర్పణము నందు నగరమువలె వసించి యున్నందున సర్వభూతాధి వాసుడు, లేక సకల భూతముల యందు పరమాత్మ వసించియున్నందున సర్వభూతిధి వాసుడనబడుచున్నాడు. బుద్ధి తద్ధర్మములకు సాక్షియు, సకలప్రాణులకు చేతనత్వ ప్రదాతయు, నిరుపాధికుడును, నిర్ధర్మియును మరియు సత్వాది గుణరహితుడునై యున్నాడు అని శ్రుతి వచనము.

కావుననే భక్తుల యొక్క ప్రేమను వీక్షించి, వారి యారాధన మరియు సేవారూప ఋణమునకు బద్ధుడై భక్తుల చెంతనే ఉంటూ, వారి చాకిరి చేస్తూంటాడు. ఉదా:- శ్రీఖండియా యను పేరుతో శ్రీకృష్ణుడు శ్రీ ఏకనాథస్వామి గృహములో పండ్రెండు సంవత్సరములు సేవ చేసెను. 8. భక్తుల యొక్క ముఖారవిందము నుండి భగవంతునియొక్క దివ్యనామగానము (భజన) యెక్కడ జరుగు చుండునో, అక్కడికి భగవంతుడు వివశుడై పరుగెత్తుకుంటూ విచ్చేయును.

**శ్లో॥** నాహం వసామి వైకుంఠే యోగినాం హృదయే న చ ।
మద్భక్తాః యత్ర గాయన్తి తత్ర తిష్ఠామి నారద! ॥
(పద్మపురాణము - ఉత్తరఖండము 94-23)

**అర్థము :-** హే నారద! నేను వైకుంఠములో గాని, యోగుల హృదయములలో గాని నివసించను. అయితే మీ చిరునామా ఎక్కడ? నా భక్తులు నా యొక్క గుణగానము యెక్కడ చేస్తుంటారో, నేను గూడ అక్కడే ఉంటాను.

**శ్లో॥** అహం భక్త పరాధీనో హ్యస్వతంత్ర ఇవ ద్విజ! ।
సాధుభిర్గ్రస్త హృదయో భక్తైర్భక్త జన ప్రియః ॥ (భాగ. 9-4-63)

అర్థము :- ఓ దుర్వాసా! నేను ఎల్లపుడు భక్తులకు అధీనుడై యున్నాను. నాకు ఏమాత్రము గూడ స్వాతంత్ర్యము లేదు. నాయొక్క ప్రియాతి ప్రియమైన సరళ (నిర్మల) భక్తులు నా హృదయమును వారి చేతుల్లో నుంచుకున్నారు. భక్తులు నన్ను అమితముగా ప్రేమిస్తారు. మరియు నేను వారిని గూడ.

శ్లో॥ ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం, అహం స చ మమప్రియః ।
(శ్రీమద్భగద్గీతా 7-71)

అర్థము :- జ్ఞాని భక్తునికి నేను మిక్కిలి ఇష్టమైనవాడను, అతడున్నూ నాకు మిగుల ఇష్టుడే, 9.

44. అభంగము :-

జగాచా హా బాప దాఖవలేఁ మాయ ।
మాతీ ఖాతాం జాయ మారావయా ।1॥

మారావయా తినేఁ ఉగారిలీ కాఠీ ।
భువనేఁ త్యా పోటీ చౌదా దేఖే ॥2॥

దేఖే భయానక ఝూంకియేలే డోళే ।
మాగుతా తో ఖేళే తియేపుఢేఁ ॥3॥

గళా బాంధూనియాం ఉఖలాసీ దావేఁ ।
ఉన్మళీ త్యా భావేఁ విమలార్జున ॥4॥

న కళే జునాట జగాచే జీవన ।
ఘూతలే మోహన గౌళియాంసీ ॥5॥ (3811)

ప్ర.ప :- (ఒకానొకప్పుడు శ్రీకృష్ణుడు) హా జగాచా - ఈ జగత్తునకు; బాప = తండ్రిని (కారణము నేనేయని); మాయ = తల్లియగు యశోద

మాతాజీకి; దాఖవలేం = చూపించెను. (ఎట్లనగా? ఒకనాడు కన్నయ్య ఉద్దేశ పూర్వకముగా); మాతీ ఖాతాం = మన్ను తినగా (అప్పుడు తల్లియగు యశోదమాత కన్నయ్యను) మారావయా జాయ = కొట్టుటకు వెళ్ళెను. 1. మారావయా = (కన్నయ్యను) కొట్టుటకు; తినేం = ఆమె (యశోద మాత); కాఠీ = కర్రను; ఉగారిలీ = పైకెత్తెను; (వెంటనే కన్నయ్య నేను మట్టి తినలేదమ్మా" అంటూ తన ముఖారవిందమును తెఱచి చూపించెను. అప్పుడు యశోద మాత) త్యా = అతని ; పోటీ = పొట్టలో (ఉదరమున); చౌదా భువనేం = పదునాలుగు భువనములు (లోకములు); దేఖే = చూసెను. 2. (అత్తఱి యశోదమాత కృష్ణుని యొక్క ఆ) భయానక = భయంకరమైన రూపమును; దేఖే = చూసి (వెంటనే భయపడి); డోళే = నేత్రములను; ఝూంకియేలే = మూసికొనెను; మాగుతా = తిరిగి (కండ్లు తెఱచి చూసేసరికి); తో = అతడు; తియేపుఢే = ఆమె ముందు; ఖేళే = (పిల్లవాడై) ఆడుచుండెను 3. (ఒకరోజున యశోదమాత) దావేం = తలుగు త్రాడుతో; గళా = కృష్ణుని యొక్క మెడను; బాంధూనియాం = బంధించి; ఊఖలాసీ= రోటను (కుదురునకు కట్టివేసెను); (అప్పుడు కన్నయ్య) విమలార్జున = విమలార్జునులను ఉద్ధరించాలి అను) త్యాభావేం = ఆ ఉద్దేశముతో ; (రెండు వృక్షముల మధ్యగుండా వెళ్ళి, ఆరెండు వృక్షములను) ఉన్మళీ = సమూలముగా పెకిలించి వేసెను. 4. (శ్రీకృష్ణుడు) జునాట = అనాది (ఉన్నాడు); జగాచే = జగత్తునకు; జీవన = జీవనము (ఆధారము) ఉన్నాడు (కాని ఈ విషయము) న కళే = (ఎవరికిని) తెలియకుండెను. (ఎందుకనగా? (శ్రీకృష్ణుడు) గౌళియాంసీ = గొల్లలను (వ్రజవాసులందఱిని) మోహన ఘాతలే= తన యోగమాయచే ఆవరించెను (కప్పివేసెను). 5.

**తా॥** ఒకసారి శ్రీకృష్ణ పరమాత్మ ఈ జగత్తునకు తండ్రిని (అభిన్న నిమిత్తోపాదానకారణము) నేనేయని తల్లియగు యశోద మాతకు

చూపించెను. ఎట్లనగా? ఒకనాడు కన్నయ్య ఉద్దేశ పూర్వకముగా మన్ను దినెను. అది తెలిసిన యశోదమాత కన్నయ్యను శిక్షించుటకు కఱ్ఱ పైకెత్తెను. వెంటనే శ్రీకృష్ణుడు "నేను మట్టి తినలేదమ్మా" అంటూ తన ముఖారవిందమును తెఱచెను. అప్పుడు యశోదమాత అతని ఉదరమున పదునాలుగు లోకములను గాంచెను. 2. భయంకరమైన విశ్వరూపమును చూసి, జడిసి కనులు మూసికొనెను. తిరిగి కనులు తెఱచి చూసేసరికి కృష్ణుడు పిల్లవాడై ఆమె ముందు ఆటలాడుచుండెను. 3. ఒకనాడు యశోదమాత తలుగు త్రాడుతో కన్నయ్య మెడను బంధించి రోట కట్టివైచెను. అప్పుడు చిన్ని కృష్ణుడు విమ (యమ) లార్జునులనుద్ధరించాలి యను నుద్దేశముతో రెండు వృక్షముల మధ్యగుండా రోలును ఈడ్చుకుంటూ వెళ్ళి, ఆ రెండు వృక్షములను సమూలముగా పెకిలించి వైచెను. 4. శ్రీకృష్ణుడు అనాది స్వరూపుడు. సమస్త జగత్తునకు జీవనము (ఆధారము). కాని ఈ విషయము ఎవరికిని తెలియకుండెను. ఎందుకనగా? శ్రీకృష్ణుడు వ్రజవాసులందఱిని తన యోగమాయచే ఆవరణము గావించెను. 5.

సు.వ్యా :- యేది ఉత్పన్నమగునో దానిని "కార్య"మందురు.

అనన్యథాసిద్ధమై కార్యోత్పత్తికంటె అవ్యవహిత పూర్వక్షణావచ్ఛిన్నమై నవశ్యముగా నేది యుండునో దానిని "కారణ" మందురు. ఈ కారణము సాధారణము, అసాధారణము అని రెండు విధములు.

ఏది సర్వ కార్యములకు కారణమగునో నది సాధారణ కారణమగును. ఇవి తొమ్మిది గలవు. 1. ఈశ్వరుడు. 2. ఈశ్వరుని జ్ఞానము, 3. అతని ఇచ్ఛా, 4. ప్రయత్నము (కృతి), 5. దేశము, 6. కాలము, 7. అదృష్టము, 8. ప్రాగభావము, మరియు 9. ప్రతిబంధకాభావము.

ఏదో ఒక కార్యమునకు ఏది కారణమగునో దానిని యసాధారణ కారణమందురు. ఇవి రెండు విధములు. 1. ఉపాదాన కారణము. 2. నిమిత్తకారణము.

ఏది కార్యముయొక్క స్వరూపమునందు ప్రవేశించి యుండునో, మరియు యేది లేనిచో కార్యము యొక్క స్థితి యుండదో - అది ఉపాదాన కారణమనబడును. లేదా కార్యము యొక్క ఉత్పత్తి, స్థితి మరియు లయము - ఈ మూడింటికి యేది కారణమో అది ఉపాదాన కారణమనబడును. ఉపాదానకారణము పునః ద్వివిధము 1. పరిణామి ఉపాదానకారణము 2. వివర్తోపాదానకారణము. పరిణామి ఉపాదానకారణమునకు ఉదా:- ఘటరూప కార్యమునకు మృత్తికా ఉపాదాన కారణము. వివర్తోపాదాన కారణమునకు ఉదా :- రజ్జుసర్పము - సర్పరూపకార్యమునకు ఉపాదాన కారణము రజ్జువు (త్రాడు).

ఏది కార్యము యొక్క స్వరూపమునందు ప్రవేశించి యుండదో, కాని కార్యమునకు తటస్థముగా (భిన్న స్థితి గలిగి) యుండి కార్యము నుత్పన్నము చేయునో మరియు యేది నశించిన కార్యమునకు నాశనము లేదో - అది నిమిత్తకారణమనబడును. ఉదా:- ఘటరూప కార్యమునకు కులాలుడు, దండ, చక్రము మొదలగునవి నిమిత్తకారణములు.

జగత్తునకు ఉపాదానము మరియు నిమిత్తము అను రెండు ప్రకారములచేత గూడ ఈశ్వరుడే కారణము ఉన్నాడు. ఉదా:- ఊర్ణనాభి (లూత లేక సాలెపురుగు) యొక్క జడ శరీరము జాలరూప కార్యమునకు ఉపాదానము మరియు అంతఃకరణసహిత చేతనభాగము నిమిత్త కారణమున్నది. ఒకానొక కళాకారుడు నఖరూప లేఖనముతో స్వశరీరముపై చిత్రమును లిఖించును. ఆనందించును. తుడిచివేయును. ఆ చిత్రమునకు

కళాకారుని జడ శరీరము ఉపాదానకారణము మరియు అంతఃకరణ సహిత చేతన భాగము నిమిత్త కారణము. అట్లే సచ్చిదానందరూప బ్రహ్మము తమఃప్రధానమగు స్వమాయను ఉపాధిగా స్వీకరించి అధ్యస్త సమస్త చరాచరాత్మక కార్యవర్గము (జగత్తు)నకు అధిష్ఠానము (వివర్త ఉపాదానకారణము) ఆయెను. మరియు శుద్ధసత్త్వప్రధాన స్వమాయను ఉపాధిగా స్వీకరించి ఉపాదానాద్యభిజ్ఞుడై (కర్తరూప) నిమిత్తకారణమాయెను. ఈ అభిన్న నిమిత్తోపాదానకారణమగు ఈశ్వరుడే తత్పదవాచ్యము.

**శ్లో॥ జగతో యదుపాదానం మాయామాదాయ తామసీమ్ ।**
**నిమిత్తం శుద్ధసత్త్వాం తాముచ్యతే బ్రహ్మ తద్గిరా ॥** (వే.పం. 1-44)

**తా॥** పైన తెలుపనైనది.

ఈశ్వరుడు జగత్తునకు అభిన్న నిమిత్తోపాదానకారణము (ఉభయ కారణము) అని ముండక శ్రుతిగూడ ప్రమాణముగా నున్నది.

మంత్రము :- **యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ**
**యథా పృథివ్యామోషధయః సమ్భవన్తి ।**
**యథా సతః పురుషాత్కేశలోమాని**
**తథాఽక్షరాత్సమ్భవతీహ విశ్వమ్ ॥** (ముం.ఉ. 1-1-7)

**అర్థము :-** లోకములో ప్రసిద్ధమైన ఊర్ణనాభి (సాలెపురుగు) సాధనాంతరములయపేక్ష లేకుండా స్వశరీరము నుండి తంతువులను ఉత్పన్నము చేస్తుంది మరియు తనయందే లయము గూడ చేసుకుంటుంది. ధాన్యాది స్థావర పర్యంతము (ఓషధులు మరియు వనస్పతు)లు (పార్థివములు) ఉత్పన్నములగును. మరియు సజీవ పురుషుని నుండి విలక్షణమగు (జడములగు) కేశములు, రోమములు, నఖములు

ఇత్యాదులుత్పన్న మగును. పై దృష్టాంతము లెట్లో – అట్లే అక్షర పరబ్రహ్మము నుండి ఈ సమస్త జగత్తు ఉత్పన్న మగుచున్నది. అనేక దృష్టాంతోపాదానము సుఖార్థ ప్రబోధనార్థమని తెలియదగును. ముఖ్య దృష్టాంతము స్వప్నము. ఏ విధముగా సాక్షి చైతన్యము స్వప్న ప్రపంచమునకు అభిన్న నిమిత్తోపాదాన కారణమో, అట్లే ఈశ్వరుడు జగత్తునకభిన్న నిమిత్తోపాదాన కారణమని తెలియవలెను.

ఒకసారి బ్రహ్మదేవుడు గోవులను, గోపాలురను అపహరించు కెళ్ళినపుడు శ్రీకృష్ణపరమాత్మ స్వయముగా గో, గోపాలురరూపములో అయ్యి, ఈ సంపూర్ణ ప్రపంచమునకభిన్న నిమిత్తోపాదానకారణము నేనే యని నిదర్శనముగా చూపినయుదంతము శ్రీమద్భాగవతములో అన్యత్ర గనందగును.

ఈ విషయమును దెలియపరచుటకే శ్రీతుకారాం మహారాజుగారు అభంగములోని మొదటి చరణము ద్వారా – ఒకనాడు శ్రీకృష్ణ పరమాత్మ ఉద్దేశపూర్వకముగా మన్నుదిని తల్లియగు యశోద మాతకు తన విశ్వరూపమును ప్రదర్శింపజేసి, ఈ విశ్వమునకు బాపును, (తండ్రిని) అనగా అభిన్న నిమిత్తోపాదాన కారణము నేనే యని నిరూపించినట్లు – ప్రతిపాదించు చున్నారు. (తుకోబారాయ్). 1.

శ్లో॥ ఏకదా క్రీడమానాస్తే రామాద్యా గోపదారకాః ।
కృష్ణో మృదం భక్షితవానితి మాత్రే న్యవేదయన్ ॥

(భాగ. 10-8-32)

అర్థము :- ఒకసారి బలరాముదు మొదలుకొని గొల్ల పిల్లలందరు శ్రీకృష్ణునితో ఆటలాడుచుండిరి. వారందరు యశోదమాతవద్దకు వచ్చి "అమ్మా! కన్నయ్య మన్ను తిన్నాడమ్మా" అని చెప్పారు.

**శ్లో॥ సా గృహీత్వా కరే కృష్ణముపాలభ్య హితైషిణీ ।**
**యశోదా భయసంభ్రాంత ప్రేక్షణాక్షమభాషత ॥** (భాగ. 10-8-33)

**అర్థము :-** హితైషిణీ యశోద కన్నయ్య చేయి పట్టుకొనగా నతని నయనములు భయ సంభ్రమముచే నృత్యము చేయుచుండెను. యశోదమాత కృష్ణుని బెదిరించుచూ ఇలా పలికెను-

**శ్లో॥ కస్మాన్మృదమదాన్తాత్మన్ భవాన్భక్షితవాన్ రహః ।**
**వదన్తి తావకాహ్యేతే కుమారాస్తేగ్రజోఽప్యయమ్ ॥**
(భాగ 10-3-34)

**అర్థము :-** ఏఁరా చపలగాత్ర! నీవు మరీ తుంటరివయ్యావు. ఒంటరిగా దాగి దాగి మన్ను తింటున్నావెందుకురా? చూడుము. నీ తోటి పిల్లలందఱేమంటున్నారు. నీ యగ్రజుడు (బలరాముడు)గూడ వారి పక్షమునే వహించి సాక్ష్యము చెప్పుచున్నాడు.

అప్పుడు తల్లితో కన్నయ్య నేనేమియు నెఱుగనన్నట్లు నటిస్తూ ఇలా పలుకు చుండెను.

**శ్లో॥ నాహం భక్షితవానమ్బ సర్వే మిథ్యాభిశంసినః ।**
**యది సత్య గిరస్తర్హి సమక్షం పశ్య మే ముఖమ్ ॥** (భాగ 10-8-35)

**అర్థము :-** అమ్మా! నేను మన్ను తినలేదమ్మా. వీరంతా కల్లమాటలచే వాగుచున్నారు. ఒకవేళ నీవు వారి మాటలు నిజమని నమ్మినచో - ఇదిగో - నా ముఖము నీ యెదురుగానే ఉందిగదా. నీ కన్నులతో చూడమ్మా.

ఇక్కడ కొంచెము చింతనీయమున్నది. మన్నుదినియు "నేను తినలేదు" అని చెప్పుట యేది గలదో అది మిథ్యాభాషణమగును. సాక్షాత్తు

పరమాత్మయే (కృష్ణుడే) అబద్ధమాడినచో, యిక లోకము సంగతేమిటి? లోకులు ధర్మము తప్పి చరించి పతనమగు సంభవము గలదు. కాని, భగవంతుడు సత్యవాది గనుక మిథ్యావచనము పలుకుట యసంభవము. తాను స్వయముగా శ్రీమద్భగవద్గీతలో యిలా వాక్రుచ్చియున్నారు.

"ఉత్సీదేయురిమే లోకాః న కుర్యాం కర్మ చేదహమ్" (గీత. 3-24) నేను కర్మ (ధర్మము) నాచరించని యెడల ఈ లోకులు చెడిపోయెదరు. మరియు శ్రీమద్భాగవతములో అన్యత్ర ఇలా చెప్పబోవును. "న మయోదిత పూర్వం వా అనృతం తదిమే విదుః" । (భాగ. 10-22-11) నా చేత యెప్పుడును ఏవిధమైన మిథ్యావచనము చెప్పబడలేదు. ఈ విషయము నా ప్రాణసఖులైన ఈ గోపాలురందఱకు తెలియును. పై గీతా, భాగవత వచనములను బట్టి భగవంతుడు మిథ్యావాది గాదని స్పష్టమగుచున్నది. అయితే "నాహం భక్షితవానమ్బ!"

అమ్మా! నేను మన్ను తినలేదు అను వచనము యొక్క అంతరార్థమేమిటి? ఈ ప్రశ్నకు సమాధానము శ్రీవంశీధరస్వామి ఇలా చెప్పుచున్నారు. 1) ప్రాణరక్షణార్థము ముఖముచే భక్షించుట యేది గలదో అది ముఖ ప్రాణముల ధర్మమున్నది, గాని నాకు భక్షకత్వము లేదు. "స చాన్యః ప్రాణదేహయోః" అది (ఆత్మ) ప్రాణదేహములకంటె వేరుగానే యున్నది. ఈ వచనానుసారము ఆత్మరూపుడనగు నేను వాటికంటె భిన్నంగా యున్నాను. గావున నాకు భక్షకత్వము లేదు. భగవంతుడు ఆత్మరూపుడనుటలో శ్రీమద్భగవద్గీతయే ప్రమాణము. "అహమాత్మా గుడాకేశ" (1)-20) హే గుడాకేశ (అర్జున)నేను ఆత్మనై యున్నాను. ఆత్మకు భక్షకత్వం లేదంటూ శ్రుతి ఉద్ఘోషించుచున్నది. "ఏష ఆత్మాఽపహతపాప్మా విజరో విమృత్యు విశోకో విజిఘత్సోఽపిపాసః" (ఛాం. 8-1-5). ఈ

ఆత్మ నీ స్వరూపము. దాని యొక్క లక్షణము వినుము. ధర్మాధర్మసంజ్ఞక ఏ పాపము లేనందున అది అపహత పాప్మ ఉన్నది. జరా (ముసలితనము) మృత్యు రహితమున్నది. ఇష్టాది వియోగ నిమిత్త మానస సంతాపరూప శోకము లేనిది. తినాలని గాని, త్రాగాలనిగాని కోరిక లేనిది ఆత్మ. కావున "ఆత్మస్వరూపదనగు నాకు భక్షకత్వం లేనందున నేను మన్ను తినలేదమ్మా" అని అంటున్నాడు కృష్ణుడు. 2) లేక "నాహం భక్షితవానమ్బ" అను శ్లోకమునకు మరొక విధమైన వ్యుత్పత్తి చెబుతూ (శ్రీవంశీధరస్వామి :- "న హ్యతి బధ్నాత్యావరణ శక్త్యా చిదంశమితి నహా మాయా తస్యా ఇదం కార్యం నాహమ్, మాయా కార్యమిదం జగత్" ఈ ఉక్తి ననుసరించి ఈ సమస్త విశ్వమంతయు 'నాహమ్' శబ్ద వాచ్యము. లేక నహ్యతే బధ్యతే ఉజ్ఞానేన యత్రేతి నహః ప్రపంచః స ఏవ నాహః తం ప్రళయే భక్షితవానస్మి" ప్రళయకాలములో ఈ విశ్వమునంతటిని భక్షిస్తాను. తతః = కావున, సర్వే= ఈ గోపాలురందఱు, అమిథ్యాభిశంసినః సత్యవచనాః = సత్యమునే చెప్పుచున్నారు. హే అంబ! = ఓ తల్లీ! నా ముఖమును సమక్షముగా చూడుము. "సమక్షం" అనగా "సమ్యగక్షం జ్ఞానం యత్ర తత్సమక్షం మహత్త ద్దివ్య దృష్టిపూర్వకం పశ్య" దివ్యమైన జ్ఞాన దృష్టి పూర్వకముగా చూడుము. సమస్త (ప్రాపంచిక) వస్తువులు జ్ఞానముచే వ్యాప్తమై తెలియబడుచున్నందు వలన. ఎటువంటి ప్రపంచము? అనగా స = సత్ చ, త్య = త్యత్ చ = సత్య-" సచ్చత్యచ్చాభవత్" (తై. 2-6-1) (సత్య - ప్రపంచము), తద్గిరతి భక్షతీతి సత్యగిరః. ప్రళయకాలములో ఈ ప్రపంచమును మ్రింగుతాను (భక్షస్తాను) కావున నేను సత్యగిరుడను. అటువంటి నన్ను ఓ అమ్మా! జ్ఞానదృష్టితో చూడుము. "అత్తా చరా చర గ్రహణాత్" (బ్ర.సూ. 1-2-9) చరాచర ప్రపంచమును ప్రళయకాలములో పరమాత్మ సంహారము చేయు చున్నాడు. గావున పరమాత్మ శ్రీకృష్ణుడు సర్వభక్షకుడు.

శ్లో॥ యద్యేవం తర్హి వ్యాదేహీత్యుక్తః స భగవాన్ హరిః ।
వ్యా దత్తా వ్యాహతైశ్వర్యః క్రీడామనుజబాలకః ॥ (భాగ. 10-8-36)

అర్థము :-యశోదమాత అంటున్నది - సరే, అట్లయినచో యేది నీ నోరు తెఱువుము. తల్లి యిలా అనగానే భగవాన్ శ్రీకృష్ణుడు తన దివ్యమగు ముఖారవిందమును తెఱచి చూపించెను. హే పరీక్షిత్! భగవంతుడగు శ్రీకృష్ణుని యొుక్క ఐశ్వర్యము అనంతము. అతడు కేవలము లీలామాత్రమునకే మనుష్యబాలకుడాయెను.

శ్లో॥ సా తత్ర దదృశే విశ్వం జగత్ స్థాస్ను చ ఖం దిశః ।
సాద్రిద్వీపాబ్ధి భూగోళం సవాయ్వగ్నీందు తారకమ్ ॥
(భాగ. 10-8-37)

శ్లో॥ జ్యోతిశ్చక్రం జలం తేజో నభస్వాన్ వియదేవ చ ।
వైకారికాణీంద్రియాణి మనో మాత్రా గుణాస్త్రయః ॥
(భాగ. 10-8-38)

అర్థము :- కన్నయ్య నోటిలో యశోదమాత ఈ విధమగు దృశ్యమును చూసెను- చరాచర సంపూర్ణ జగత్తు, దేనియందు దేనియొక్క గతి లేదో అటువంటి శూన్యరూప ఆకాశమము, దిశలు, పర్వతములు, ద్వీపములు మరియు సముద్రములతో సహితమగు సంపూర్ణ భూమండలము; వాయువు; మెఱుపు; అగ్ని; చంద్రుడు మరియు నక్షత్రములతో సహిత సంపూర్ణ జ్యోతిర్మండలము; జలము; తేజము; పవనము; వియత్ (ప్రాణులకు తిరుగుటకు అవకాశమిచ్చు ఆకాశము); వైకారిక అహంకారము యొక్క కార్యములు దేవతలు; మనస్సు; ఇంద్రియములు; పంచతన్మాత్రలు మరియు మూడు గుణములు మొదలగు పదునాలుగు భువనములను గాంచెను. 2.

**శ్లో॥ సా వీక్ష్య విశ్వం సహసా రాజన్! సంజాత వేపథుః ।**
**సమ్మీల్య మృగశావాక్షీ నేత్రే ఆసీత్ సువిస్మితా ॥** (భాగ. 10-7-37)

**అర్థము :-** హే పరీక్షిత్! ఈ ప్రకారముగ పుత్రునియొక్క ముఖారవిందమున సమస్త బ్రహ్మాండమును చూసిన మృగశావకనయన (లేడిపిల్ల కన్నులను బోలు నేత్రములు గల) యగు యశోదాజీ శరీరము భయముచే కంపించెను. ఆమె తన విశాలనేత్రములను మూసికొనెను. అత్యంతాశ్చర్యచకితురాలాయెను.

తిరిగి యశోదమాత కనులు తెఱచి చూసేసరికి చిలిపికృష్ణుడు ఆమె ముందు పిల్లవాడై ఆటలాడ దొడంగెను.

**గమనిక :-** శ్రీకృష్ణ పరమాత్మ విశ్వరూపమును ప్రదర్శించిన ఉదంతములనేకములున్నవి. శ్రీమద్భాగవతము దశమ స్కంధము ఏడవ అధ్యాయములో మరియు యెనిమిదవ అధ్యాయములోను గూడ గలవు. కృష్ణునియొక్క విశ్వరూపమును చూసి భయకంపితురాలై యశోదమాత కనులు మూసికొనిన ప్రసంగము ఏడవ అధ్యాయములో గలదు. మృద్భక్షణ ప్రసంగమున యెనిమిదవ అధ్యాయములో శ్రీ వ్యాసభగవానులు ఉల్లేఖించలేదు. కాని, శ్రీతుకారాం మహారాజుగారు మృద్భక్షణ ప్రసంగములో యశోదమాత భగవంతుని యొక్క విశ్వరూపమును చూసి భయముచే కనులు మూసికొనినట్లు భావావేశములో ప్రమాదముచే పలికెనని సారగ్రాహి దృష్టితో గనఁదగును. ఇంకను కొన్ని ప్రసంగములలో గూడ పాఠాంతరములు గనుపించును. భావమును మాత్రము గ్రహించాలి. 3.

ఒకరోజు తనకు బొజ్జనిండా పాలివ్వలేదను కోపముతో కన్నయ్య సమీపస్థ దధిభాండమును భగ్నము చేసాడు ఇది చిలిపికృష్ణుని యొక్క

చేష్టయేయని గమనించిన యశోదమాత దండముచే దండించుట కుద్యుక్త యయ్యెను. అప్పుడు -

శ్లో॥ తామాత్తయష్టిం ప్రసమీక్ష్య సత్వర -
స్తతోఽవరుహ్యాపససార భీతవత్ ।
గోప్యన్వధావన్న యమాప యోగినాం
క్షమం ప్రవేష్టుం తపసేరితం మనః ॥ (భాగ. 10-9-9)

**అర్థము :-** బెత్తమును చేబూని తనవైపు కేతెంచుచున్న తల్లిని చూసిన రోటిపై నిలుచున్న కొంటె కృష్ణుడు రోటిపై నుండి దుమికి భయపడుచున్న వానివలె పరుగెత్తి వెళ్ళాడు. గొప్ప గొప్ప యోగులు గూడ కఠోరమైన తపస్సు చేత వారి మనస్సు నత్యంత సూక్ష్మ మొనర్చి, మరియు శుద్ధము చేసి యెవనిని ప్రవేశింపనసమర్థులైరో, పొందలేకపోయిరో, అటువంటి పరమాత్మను పట్టుకొనుటకు వెన్నంటి పరుగెత్తుచున్నది యశోదమాత.

భగవంతుడు భయపడి పరుగెత్తుట యేదిగలదో, అది నిజముగా చాలా అద్భుతమైన దృశ్యము. తల్లియొక్క వాత్సల్య ప్రేమకు తన ఐశ్వర్యమునే నైవేద్యముగా చెల్లించి వ్రజభూమి బయట విసరివేసాడు. ఎవరైనా అసురులు అస్త్ర - శస్త్రముల గైకొని వస్తే, తాను సుదర్శనచక్రమును స్మరిస్తాడు. తల్లియొక్క బెత్తమును నివారించుటకు యే అస్త్ర - శస్త్రములు చేబూనడు. ఆహా! భగవంతునియొక్క భయభీతమూర్తి యెంత మధురము. ఆ భయమునకు ధన్యవాదములు.

వస్తుతః సర్వ జగన్నియామకుడగు పరబ్రహ్మమునకు యెవరివలననూ భయము లేదు. ఇంతేగాదు, తానే సర్వభయకారణమని శ్రుత్యుద్ఘోష.

శ్రుతి :- భీషోఽస్మాద్వాతః పవతే । భీషోదేతి సూర్యః ।
భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ । మృత్యుర్ధావతి పంచమ ఇతి ॥
(తై. 2-8-1)

**అర్థము :-** ఈ పరమేశ్వరుని భయముచే వాయువు వీచుచున్నది సూర్యుడుదయించుచున్నాడు. ఇతని భయము వల్లనే అగ్ని, ఇంద్రుడు మరియు పంచముడగు మృత్యువు గూడ స్వస్వనియత కార్యముల యందు పరుగెత్తు చున్నారు. (ప్రవృత్తములగు చున్నారు). మరియు - అవాఙ్మనసగోచరమగు పరమాత్మ కరకమలములచే పట్టుబడుట సర్వథా యసంభవమని శ్లోకము యొక్క ఉత్తరార్థములో "గోప్యన్వధావన్న యమాప యోగినాం" అంటూ శ్రీవ్యాసభగవానులు నుడువుచున్నారు.

శ్రుతి:- యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ। (తై. 2-4-1)

**అర్థము :-** దేని నుండి మనస్సహిత వాణి (దానిని) పొందలేక వెనుదిరుగుచున్నదో (అది పరబ్రహ్మము). అని శ్రుతిమాత తెలియ జేయుచున్నది. మరియు వ్యాసభగవానులు గూడ మున్ముందు దెలుప గలరు.

శ్లో॥ నైతన్మనో విశతి వాగుత చక్షురాత్మా
ప్రాణేంద్రియాణి చ యథానలమర్చిషః స్వాః ।
శబ్దోఽపి బోధకనిషేధతయాఽత్మమూల
మర్థోక్తమాహ యదృతే న నిషేధసిద్ధిః ॥
(భాగ. 11-3-36)

**పై శ్లోకాభిప్రాయము :-** ఈ బ్రహ్మాఖ్య పరతత్త్వమునందు మనస్సు ప్రవేశింప సమర్థము కాదు. అనగా మనస్సు పరతత్త్వమును విషయము చేయజాలదు. అందువలన వాణిగూడ నిరూపించుటకసమర్థమగును. అట్లే

నేత్రము గూడ ఈ పరబ్రహ్మమును చూడజాలదు. జీవుడు గూడ ఇదం రూపముచే తెలిసికొనజాలడు ప్రాణము తన క్రియాశక్తిచేత దానిని పొందజాలదు. మరియు అన్య ఘ్రాణ, త్వక్, శ్రోత్ర, జిహ్వాలనబడు జ్ఞానేంద్రియములు గూడ దానిని తెలిసికొనజాలవు. అట్లే పాణి, పాద, పాయూపస్థలనబడు కర్మేంద్రియములు గూడ ఈ పరతత్త్వమును పొందుటకసమర్థములగును. అదేవిధముగా శ్లోకస్థ "చ" కారముచే మనస్సు మొదలగు వాని అధిష్ఠాన దేవతలు గూడ పరమాత్మ తత్త్వమును పొందలేరు. యే ప్రకారముగా అగ్న్యంశభూతములగు విస్ఫులింగములు అన్య వస్తువులను యత్కించిత్ప్రకాశనాదికము లొనర్చినప్పటికిని, స్వమూల అంశీరూప అగ్నిని మాత్రము ప్రకాశింప జాలవు మరియు దహింపజాలవు. అదే ప్రకారముగా మన ఆది వృత్తులు వాటి యందభివ్యక్త (ప్రతిబింబిత)మగు ఆత్మచైతన్యాంశముచే సమస్త బాహ్య వస్తువులను ప్రకాశింపజేసినప్పటికిని, స్వాభివ్యంజక (ప్రకాశక) బింబభూత చిదాత్మను మాత్రము విషయము చేయజాలవు.

**శంక:-** బ్రహ్మము యే ప్రమాణమునకు గూడ విషయము కానిచో "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" (బృ.ఉ. 3-9-25) నేను ఉపనిషత్తుల జ్ఞానముచే గమ్య మగు (తెలియబడు) ఆత్మను గూర్చి నిన్ను అడుగుచున్నాను. అంటూ ఉపనిషద్ జ్ఞానగమ్యముగా ఎందుకు చెప్పబడినది?

సమాధానము :- బ్రహ్మమునందు ప్రమాణభూత వేదాత్మక శబ్దము గూడ "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" ఇత్యాది వచనముల ద్వారా బ్రహ్మమును సాక్షాత్తుగా (శక్తివృత్తిచే) బోధించుటలో స్వయముగా తనను అసమర్థముగా ప్రకటిస్తూ , అనగా తాత్పర్యమును (లక్షణావృత్తిచే)

తాను (శబ్దము) యేదైతే బోధించుచున్నదో దానిని గూడ నిషేధముఖము ద్వారా (బ్రహ్మమును) నిరూపించుచున్నది. ఎందుకనగా – బ్రహ్మము స్వయం ప్రకాశము (ప్రమాణనిరపేక్షము)న్నది. సాక్షాద్విధిముఖముచే ఇదమిత్థముగా నిర్దేశింపబడకుండా, సమస్త ద్వైత ప్రపంచ నిషేధము ద్వారా పరతత్త్వము నిషేధావధిరూపముచే అర్థాత్ (గమ్యము) తెలియబడుచున్నది.

కేవలో నిరధిష్ఠానవిభ్రాంతేః క్వాప్యసిద్ధితః ॥ (వే.పం. 7–6)

అధిష్ఠాన (అవధి) రహిత కేవల భ్రాంతి (నిషేధ్యము) ఎక్కడనూ ప్రసిద్ధము లేదు. "అవధిలేకుండా నిషేధము ఎక్కడగూడ ఉండదు". ఈ నియమము సిద్ధాంతరూపముచే సర్వత్ర స్వీకరించబడినందున నిషేధావధిరూపముగా బ్రహ్మమును అంగీకరించకుండా "యతో వాచో నివర్తన్తే" "నేతి నేతి" ఇత్యాది నిషేధము సిద్ధింపనేరదు. సమస్త ద్వైతప్రపంచ అవధిభూత బ్రహ్మము స్వయంప్రకాశము (నిర్విషయము). అందువలన శ్రుతిగూడ స్వోక్త నిషేధావధిభూత బ్రహ్మము నుండి సాక్షాత్తుగా (శక్తివృత్తి చేత) విషయము చేయలేక నివృత్తమై, తాత్పర్య విషయముగా (లక్షణావృత్తిచే) తనకు (శబ్దమునకు) మూల కారణమగు బ్రహ్మమును బోధించుచున్నది.

ఇటువంటి అవాఙ్మానసగోచరమగు పరమాత్మను కఠోరమగు తపస్సుచే నత్యంత సూక్ష్మము మరియు శుద్ధ మొనర్చబడిన యోగుల మనస్సు గూడ ప్రవేశింప నసమర్థమగుచున్నది, పొందుటయు నత్యంత దూరము. ఈ విధమగు నగమ్య పరమాత్మను (శ్రీకృష్ణ చంద్రుని) తన కరకమలములచే పట్టుకొనుటకు వెన్నంటి పరుగెత్తుచున్నది యశోదమాత. ఆ మాతృశ్రీ యొక్క అకుంఠితమైన విశ్వాసమునకు, సాహసమునకు మరియు ప్రయత్నమునకు

ఎట్టకేలకు బహుళప్రయాసచే యశోదమాత కన్నయ్యను పట్టుకోగలిగింది. వాస్తవముగా తల్లి యొక్క పట్టుదలకు, ప్రయాసకు ద్రవిత హృదయుడై తానే స్వయముగా పట్టుబడ్డాడు. కృష్ణుని కరకమలములను పట్టుకొని తల్లి గద్దించి భయపెట్ట సాగెను. అప్పుడు చిన్నికృష్ణుని యొక్క ముఖారవిందము కళ (వన్నె లేదా దృశ్యము) చాలా విలక్షణముగా నుండెను. యశోదమాత కన్నయ్యను ఇలా బెదిరించు చున్నది. ఒరే! అశాంత ప్రకృతి! వానరబంధు! మంథనీస్ఫోటక! ఇప్పుడు నీవు నవనీతము (వెన్న)ను ఎక్కడ ఎలా ప్రాశనము చేస్తావో (తింటావో) చూస్తాను. ఈ రోజు నిన్ను ఎలా కట్టేస్తానంటే - ఇక నీవు పిల్లలతో ఆటలాడలేవు. మరియు వెన్న దొంగతనము లాంటి వెధవ పనులు చేయలేవు. ఏ రా! నేను నిన్ను బెత్తముతో కొడుతానని, ఏమీ - భయపడు చుంటివా? అంటూ బెదిరించుచూ దండమును పైకెత్తి కొట్టుటకుద్యమించెను. (కాని, కొట్టలేదు)

అప్పుడు కన్నయ్య చేతులతో కన్నులు నలుముకుంటూ రోదనము సాగించాడు. అపరాధమైతే చేసాడు. కాని, ఓదార్చినా ఆపుకోలేనంతగా ఏడుస్తున్నాడు. కన్నులు నలుముకుంటే కాటుక ముఖమంతా వ్యాపించినది. తల్లి కొట్టు నేమో యని భయపడుతూ కన్నులు పైకెత్తి చూస్తూంటే, అతని వ్యాకులత సూచితమగుచుండెను. భయవిహ్వాలుడైన కృష్ణుడు తల్లితో ఇలా అంటున్నాడు. అమ్మా! నన్ను కొట్టవద్దమ్మా! అప్పుడు యశోదమాత అంటుంది. ఏంరా! నీకు యింతటి విశేషభయమే ఉంటే, పెరుగు కుండనెందుకు పగుల గొట్టావురా? అది విని కృష్ణుడంటున్నాడు - అమ్మా! ఇకపై అలాంటి పనులు ఎప్పుడూ చేయనమ్మా! అమ్మా! బెత్తమును చేయి నుండి పడవేయమ్మా! అప్పుడు మాతా యశోద -

శ్లో॥ త్యక్త్వా యష్టిం సుతం భీతం విజ్ఞాయార్భకవత్సలా ।
ఇయేష కిల తం బద్ధుం దామ్నాతద్వీర్య కోవిదా ॥
(భాగ 10-9-12)

అర్థము :- చిన్నికృష్ణుని భయావస్థను గమనించి, హృదయము నుండి ఉప్పొంగి వచ్చిన వాత్సల్య స్నేహముచే చేతిలోని దండమును పడవేసెను. తదుపరి తల్లి ఇలా ఆలోచించింది – "కన్నయ్య చాలా భయపడ్డాడు. (ఒకవేళ నేను వదలిపెట్టినచో వనములోకి ఎక్కడ పారిపోతాడో ఏమో. ఆకల దప్పులకు ఓర్చుకోలేక ఎంత బాధపడతాడో) కావున కొంత తడవు ఇతనిని త్రాటితో రోట కట్టి వేసెదను" వాస్తవముగా తల్లి, కుమారునియొక్క ఐశ్వర్యమును యెఱుగకుండెను.

ఈ విధంగా ఆలోచించిన యశోదమాత –

శ్లో॥ తద్దామ బధ్యమానస్య స్వార్భకస్య కృతాగసః ।
ద్వ్యంగులోనమభూత్తేన సందధేఽన్యచ్చ గోపికా ॥
(భాగ. 10-9-15)

శ్లో॥ యదాఽసీత్తదపి న్యూనం తేనాన్యదపి సందధే ।
తదపి ద్వ్యంగులం న్యూనం యద్యదాదత్తబంధనమ్ ॥
(భాగ. 10-9-16)

అర్థము :- తన కుమారుడగు తుంటరి చిలిపికృష్ణుని త్రాటిచే బంధించుటకుపక్రమించెను. అప్పుడు రెండంగులముల త్రాడు తక్కువ పడగా మరొక త్రాడును తెచ్చి జోడించింది గోపికా (యశోద). ఎప్పుడైతే అదిగూడ తక్కువపడిందో, దానికి మరొక త్రాడును జోడించింది. ఇత్తెఱంగున యెట్లెట్లు త్రాళ్ళను తెచ్చి జోడించి కట్టుచుండెనో, అట్లట్లు రెండంగులముల త్రాడు కొఱతబడు చుండెను.

భగవంతుని బంధించుటలో రెండంగులముల త్రాడు మాత్రమే తక్కువ బడుటయను లీలా రహస్యమును మహాత్ములు ఈ క్రింది విధముగా వారి భావమును వ్యక్తీకరించుచున్నారు.

1. ఎంతవరకు ద్వైతము నివర్తించదో, అంతవరకు నేను వశ్యుడను కాను. అను భావము ఈ లీల ద్వారా ద్యోతితమగుచున్నది.

2. నేను రజ్జువులచే కట్టుబడుటకు శక్యుడను గాను, మరేమనగా భక్తి, వైరాగ్యరూపములగు రెండు బంధన హేతువులచేతనే కట్టుబడుదును -అని భగవదభిప్రాయము.

3. భగవంతుడు ఇట్లు విచారించెను. ఏమనగా " ఎక్కడ నామము మరియు రూపము ఈ రెండుంటాయో అక్కడే బంధముంటుంది. పరబ్రహ్మమునకు నాయందు బంధకల్పన యెట్లుండును?" అనగా యీ రెండు (నామము మరియు రూపము) నాయందంత్యంతాభావమున్నవి యని తెలుపుటకే రెండంగులముల న్యూనతను సూచించాడు.

4. "సత్త్వగుణ ప్రధాన హృదయులగు భక్తజనులకే నేను దర్శన మిస్తాను. సత్త్వ భిన్న రజోగుణము. తమోగుణము గలవారికి కాదు". అందుకే త్రాటిని రెండంగులములు తక్కువజేసి తన భావమును ప్రకటించాడు భగవంతుడు.

5. రజ్జువు (త్రాడు) గోవులకు బంధనహేతువగును, కాని గోపాలునకు గాదు. అట్లే శబ్దాది విషయములు (విషిన్వన్తీతి విషయాః) గోవులకు (ఇంద్రియములకు) బంధనహేతువులగును. కాని గో-పతి (ఇంద్రియములకు పతి -స్వామి)యగు సాక్ష్యభిన్న పరబ్రహ్మమును బంధింపజాలవు. శబ్దాది పంచ విషయాలలో స్పర్శ విషయము మరియు

రస విషయము ఈ రెండు చాలా ప్రబలమైనవి. ఇవి రెండు గుహ్యేంద్రియమును మరియు జిహ్వేంద్రియమును వశమొనర్చుకొని పురుషున్ని పరమార్థపథమునుండి అధఃపతనము గావించుచున్నవి. "ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః" (కఠ. 1-3-10) ఇంద్రియముల అపేక్ష చేత విషయములు శ్రేష్ఠములు (బలవత్తరములు). కావున ఇంద్రియములను బంధింపగలవు. సాధారణముగా యే విషయములు గూడ పరమాత్మను బంధింప లేక పోయినప్పటికిని, సామాన్య జీవుల అపేక్ష చేత ప్రబలవిషయములుగా పైన పేర్కొనబడిన స్పర్శ విషయము మరియు రసవిషయము – ఈ రెండు నన్ను బంధింప సమర్థములు గావను నైజమును దెలుపుటకే భగవంతుడు రెండంగులముల త్రాటిని తక్కువజేసి చూపించెను. సరే, ప్రకృతముననుసరించెదము.

ఈ విధముగా యశోదరాణి పట్టువిడువనిదై భగవంతుని బంధనోద్యమములో నిమగ్నమై –

శ్లో॥ ఏవం స్వగేహదామాని యశోదా సందధత్యపి ।
గోపీనాం సుస్మయంతీనాం స్మయంతీ విస్మితాభవత్ ॥

శ్లో॥ స్వమాతుః ఖిన్నగాత్రాయా విస్రస్తకబరస్రజః ।
దృష్ట్వా పరిశ్రమం కృష్ణః కృపయాఽసీత్ స్వబంధనే ॥
(భాగ. 10-9-17-18)

అర్థము :– ఇంటిలోని త్రాళ్ళన్నియును జోడించి బంధించుచున్ననూ యశోదమాత చిన్నికృష్ణుని బంధించుటలో విఫలమగు చుండెను. ఆమె యొక్క అసఫలతను అవలోకిస్తున్న గోపికలు ముక్కుమీద వ్రేలిడుకొని నవ్వసాగిరి. మరియు యశోదమాత గూడ నవ్వుతూ ఆశ్చర్య చకితురాలయ్యెను. శరీరమంతా చెమటలు పట్టి తడిసినదాయెను. శిఖలోని

పూలమాలలన్ని పడిపోయినవి. చాలగా అలసిపోయెను. తల్లి యొక్క ఈ దురవస్థను గమనించిన శ్రీకృష్ణుడు కృపచే స్వయముగా తల్లియొక్క బంధనములో బంధింపబడెను.

కుమారుని యొక్క స్వాభావిక మహిమారూప సిద్ధిని దెలియలేక తల్లి విస్మయమొందెను. ఏమిటా విస్మయమనగా! ఏమిటి? ఈ కన్నయ్య ఎవరైనా దేవుడై యుండవచ్చునా? లేక, ఎవరైనా యక్షుడై యుండవచ్చునా? అథవా, ఎవరైనా దైత్యుడై యుండ వచ్చునా? వీడి యుదరము పిడికెడంత ఉంది. కాని, శతహస్త పరిమిత (రజ్జువు) త్రాటిచే గూడ బంధింపబడుట లేదే! ఆహా! వీడి కడుపు తిల మాత్రము (నువ్వుగింజంత) గూడ (విపులము) పెద్దది యగటు లేదు. త్రాడుగూడ అంగులమాత్రముగూడ తక్కువగుట లేదు. అయినా కట్టుట పూర్తి యగుట లేదే! (అనగా, కృష్ణుడు బంధింపబడుట లేదే!) ప్రతిసారి రెండంగులముల పరిమిత త్రాడు మాత్రమే తక్కువగు చున్నది. కాని, మూడంగులములు, లేక నాల్గంగులములు, అథవా, ఒక అంగులము త్రాడు తక్కువగుటలేదే! ఇది యేమి యలౌకిక చమత్కారము?

బహుళప్రయాసతో గూడిన ప్రయత్నముచే గూడ యశోదాదేవి చేతిలో కట్టుబడని శ్యామసుందరుని గాంచి ఇరుగు పొరుగు గోపికలందరు గుమిగూడి అంటున్నారు. ఓ యశోదా రాణీ! కన్నయ్య నడుము పిడికెడు మోస్తరు ఉంది. అందులో చిన్నదైన మణిమయ గజ్జెల మొలత్రాడు గణ గణ ధ్వని చేయు చున్నది. గృహస్థిత సమస్త రజ్జువులచే గూడ బంధనము సుసంపన్నము (పూర్తి) అగుట లేదు. ఆహా! ఈ బాలునికి శుభమగు గాక! ఎందుకంటే - బహుశః బ్రహ్మదేవుడు ఇతని లలాటమున బంధింపబడుట వ్రాయలేదేమోయని యనుమితమగుచున్నది. అందువల్ల ఓ యశోదాజీ! ఇక మీ ఉద్యోగమును (ప్రయత్నమును) విరమించండి.

అప్పుడు యశోదమాత అంటుంది - ఈ గ్రామములో నున్న త్రాళ్ళన్నియును సేకరించవలసి వచ్చినా, సంధ్యాకాలము వరకైననూ సరే, వీడిని బంధించి, వీడి యుదరము యొక్క అంతు (అవధి) యేమిటో తెలిసి కొనెదను - అని అంటూ పుత్రాభిమానియగు యశోదమ్మ హఠముచే పరమేశ్వరుని బంధించుటలో నిమగ్నమయ్యెను. "భగవంతుని మరియు భక్తుని యొక్క హఠములో విరోధమేర్పడినప్పుడు భక్తుని హఠమే నిలుచును".

**శ్లో॥ అహం భక్తపరాధీనో హ్యస్వతంత్ర ఇవ ద్విజ! ।**
**సాధుభిర్గ్రస్త హృదయో భక్తైర్భక్త జనప్రియః ॥** (భాగ. 9-4-63)

**అర్థము** :- ఓ దుర్వాస మునీంద్రా! నేను సర్వథా భక్తులకు అధీనుడనై యున్నాను. నాకు కొంచెమైననూ స్వాతంత్ర్యము లేదు. సరళ స్వభావముగల నాయొక్క అనన్య సద్భక్తులు నా హృదయమును వారి గుప్పిటిలో పెట్టుకున్నారు. భక్త జనులు నన్ను ప్రేమిస్తారు. నేను వారిని ప్రేమిస్తాను - అని స్వయముగా భగవంతుడే వాక్రుచ్చి యున్నాడు.

భక్తుల పరిశ్రమను గాంచి భగవంతుడు యెప్పుడు కృపా పరవశు డగునో, అప్పుడు తాను స్వయముగా బంధింపబడును. భక్తుల పరిశ్రమ మరియు భగవంతుని యొక్క కృపా న్యూనత యేదిగలదో, అదియే రెండంగులము న్యూనత. భగవంతుడు మిక్కిలి కోమలహృదయుడు - ఎందుకంటే - భక్తుల ప్రేమను వృద్ధిపరచు పరిశ్రమను గూడ సహించలేడు. భక్తుని పరిశ్రమ (కష్టము, ప్రయాస) నుండి ముక్తుని జేయుటకు తాను స్వయముగా బంధనమును స్వీకరించును. ఎప్పుడైతే తల్లియగు యశోద అలసిపోయిందో, శరీరమంతా చెమటతో తడిసి పోయిందో, అప్పుడు తల్లియొక్క శ్రమనవలోకించి మాతృవత్సలుడైన భగవంతుడే స్వహఠమును పరిత్యజించెను. భగవంతుని సర్వశక్తి చక్రవర్తిని పరమ ప్రకాశస్వరూపమగు

భగవతి కృపాశక్తి యేది గలదో, అదియే భగవంతుని చిత్తమును వెన్నవలె ద్రవీభూతమొనర్చి, అతని సత్యసంకల్పత్వమును మరియు వ్యాపకత్వమును అంతర్హితము గావించెను. దానిచే పూర్ణోదరుడగు పరమేశ్వరుడు దామోదరుడాయెను. అనగా తల్లియొక్క బంధనములో పట్టుబడినవానివలె నయ్యెను.

భగవంతుడు ఇలా ఆలోచించెను - ఎప్పుడైతే మా తల్లి తన హృదయము నుండి ద్వైతభావమును దూరము చేయుట లేదో, అలాంటప్పుడు నేను వ్యర్థముగా నాయొక్క అసంగత్వము నెందుకు ప్రకటించాలి? మాతల్లి నన్ను బద్ధునిగా తలంచినప్పుడు, ఆమె కోసం నేను బంధమును స్వీకరించుటయే యుచితము - అని ఆలోచించి స్వయముగానే బంధమును స్వీకరించెను.

**శ్లో॥ ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా ॥**
**వితథైః సదృశాః సన్తోఽవితథా ఇవ లక్షితాః ॥**

(మాండూక్య కారికా. 2-6)

అర్థము :- ఏ వస్తువు ఆది యందు మరియు అంతమందు అసద్రూపమై యుండునో, అది మధ్యలో గూడ అసద్రూపముగానే పరిగణింపబడును. మృగజలము ఆది యందు మరియు అంతమందునూ లేదు. అందువలన మధ్యలో ప్రతీయమానమగుచున్ననూ అది లేనిదిగానే లోకములో నిశ్చయింపబడినది. అట్లే ఈ పరిదృశ్యమాన జగత్తు గూడ ఆద్యంతముల యందు లేనిదై వర్తమానములో గోచరించు చున్నప్పటికిని వాస్తవముగా మిథ్యా యని శాస్త్రము మరియు విద్వానులచే నిశ్చయింపబడినది. అయిననూ మూఢు (అజ్ఞపురుష) లచే సత్యముగా చూడబడుచున్నది.

మధ్యభాగము (ఉదరభాగము)లో బంధనమును స్వీకరించి, సర్వాధిష్ఠానమైన పరమాత్మ పై కారికలో చెప్పబడిన తథ్యమునే సూచించు చున్నారు.

**శంక:-** భగవంతుడు స్వతంత్రుడని, పరమేశ్వరుడని సకల వేద, శాస్త్రములు గానము చేయు చున్నవి. అలాంటి వాడు "బంధింపబడినాడు" అని చెబితే అతనియొక్క స్వాతంత్ర్యనాశనముచే పరతంత్రతా రూప దోషము ప్రాప్తించును గదా?

**సమాధానము :-** "సర్వస్య వశీ, సర్వస్యేశానః, సర్వస్యాధిపతిః" (బృ.ఉ. 4-4-22). ఆ ఈ మహా అజన్మ ఆత్మా (పరమాత్మ) సర్వమును తన వశములో ఉంచుకొనువాడు, సర్వమును శాసించువాడు మరియు సర్వమునకు అధిపతి - అని శ్రుతి ఉద్ఘోషించుచున్నది.

**శ్లో॥ ససురాసురగంధర్వం సయక్షోరగరాక్షసమ్ ।**
**జగద్వశే వర్తతేదం కృష్ణస్య సచరాచరమ్ ॥**
(విష్ణుసహస్రనామము - మాహాత్మ్యము)

**అర్థము :-** దేవతలు, అసురులు, గంధర్వులు, యక్షలు, సర్పములు మరియు రాక్షసులతో సహితము ఈ సంపూర్ణ చరాచర జగత్తు శ్రీకృష్ణుని యొక్క వశమునందే ఉన్నది.

ఇత్యాది శ్రుతి స్మృత్యనుసారము యద్యపి భగవంతుడు స్వయముగా పరమేశ్వరుడు మరియు స్వతంత్రుడైనప్పటికిని పరమ ప్రేమపారవశ్య నిబంధనము (హేతువు)చే బంధింపబడుట పరమ చమత్కారమగుట వలన, ఈ లీల పరమాత్మునకు భూషణమే గాని దూషణము గాదు. స్వయముగా తాను ఆత్మారాముడై యుండి ఆకలి గొనుట, పూర్ణకాముడై యుండి

అతృప్తుడుగా యుండుట, శుద్ధ సత్త్వ స్వరూపుడైనప్పటికిని కోపగించుట, స్వారాజ్య లక్ష్మీయుక్తుడై యున్నను దొంగతనము చేయుట, మహాకాలుడగు యముడు మొదలగు వారికి భయప్రదుడైననూ భయపడుట మరియు పరుగెత్తుట, మనస్సు కంటే తీవ్రగతిగలవాడైననూ తల్లి చేతులతో పట్టుబడుట, ఆనందమయుడై యుండి దుఃఖించుట, ఏడ్చుట - మరియు సర్వవ్యాపకుడైననూ బంధింపబడుట మొదలగు లీలలచే భగవంతుని స్వాభావిక భక్త వశ్యతా చక్కగా ప్రదర్శింపబడినది. భగవంతుని దెలియని అజ్ఞ పురుషులకిది ఉపయుక్తము గాకున్ననూ, యెవరైతే శ్రీకృష్ణుని "కృష్ణస్తు భగవాన్ స్వయమ్" (భాగ. 1-3-28) సకలైశ్వర్య సంపన్నుడగు భగవంతుడే యని సాక్షాత్తుగా గుర్తించెదరో, వారికత్యంత చమత్కార్యములున్నవి. గోపికా నందనుడగు భగవానుడు తన యనన్య భక్తుల కెంత సులభ్యుడో, అంత - దేహాభిమానముగల కర్మిష్ఠులకు, తపస్విలకు, అట్లే తన స్వరూపభూత జ్ఞానులకు గూడ సుగమ్యుడు గాడు. భగవంతుని లీలలను గాంచి భక్తుల హృదయము ద్రవించి, భక్తి పారవశ్యముచే గానము చేస్తూ నాట్యము చేయుదురు. ఆహా! ఏమిటీ - భగవంతుని లీలా విలాసము.

ఈ ప్రకారముగా మాతృ వత్సలుడగు భగవాన్ శ్యామసుందరుడు భక్తిపారవశ్యముచే స్వతంత్రుడు, పరమేశ్వరుడైనప్పటికిని మాతృదేవి నందరాణి యశోదచే రోట బంధింపబడినవాడాయెను.

బోలో కన్నైయా లాల్ కీ జై ....భక్తవత్సల భగవాన్ కీ జై... ప్రాసంగికము నుండి ప్రకృతములోనికి ప్రవేశించెదము.

"గళా బాంధూనియా ఉఖలాసీ దావేఁ ।
ఉన్మళీ త్యాభావేఁ విమలార్జున" ॥

పై ప్రకారముగా యశోదమాతచే రోట బంధింపబడిన చిన్నికృష్ణుడు విమలార్జునులను (యమలార్జునులను) ఉద్ధరించాలను ఉద్దేశముతో రెండు అర్జున వృక్షముల మధ్యగుండా రోలును ఈడ్చుకుంటూ వెళ్ళి, ఆ రెండు వృక్షములను సమూలముగా పెకిలించి వైచెను.

అభంగములోని “గళా” శబ్దము ప్రామాదికము.

కుబేరుని పుత్రులగు నలకూబరుడు మరియు మణిగ్రీవుడను వారు పూర్వము నారదమహర్షి శాపము వలన అర్జున వృక్షములుగా జన్మించిరి. వారిని శాపవిముక్తులను చేయుటకే భగవంతుడు ఈ దివ్య లీల గావించెను. తాను స్వయముగా బద్ధుడై, శాపగ్రస్తులై వృక్షరూపములో బంధనములో పడిఉన్న యక్షుల యొక్క ముక్తిని గూర్చి భగవంతుడు చింతజేయుట –” సత్పురుషులకిది స్వాభావికము మరియు సర్వథా యోగ్యము”.

దామోదరునిచే కూల్చబడిన వృక్షముల నుండి అగ్నితో సమానమగు తేజస్వి పురుషులు ఇరువురు (నలకూబరుడు మరియు మణిగ్రీవుడు) బయల్వెడలి శ్రీకృష్ణ పరమాత్మ చరణకమలముల యందు శిరసు నుంచి ప్రణమిల్లి, చేతులు జోడించి శుద్ధ హృదయముతో అనేక విధములుగా సన్నుతించి, ప్రసన్నుడైన భగవంతుని ఆజ్ఞను బడసి, పదేపదే నమస్కరించి, పరిక్రమణము గావించి, అటనుండి నిష్క్రమించిరి.

నేను సర్వదా ముక్తుడనై యుంటాను. బద్ధ జీవులు నన్ను స్తుతిస్తూంటారు. కాని, ఈరోజు నేను బద్ధుడుగా యున్నాను. ముక్త జీవులు (యక్షులు) నను స్తుతించు చున్నారు అని ఈ విపరీత దశను గాంచి సౌందర్య మాధుర్యనిధి గోకులేశ్వరుడగు శ్రీకృష్ణ భగవంతుడు నవ్వుకున్నాడు. 4.

**45. అభంగము :-**

కోణీ ఏకీ భులలీ నారీ ।
వికితాం గోరస ఘ్యాహ్మణే హరి ॥1॥

దేఖిలా డోళా బైసలా మనీఁ ।
తోచి వదనీఁ ఉచ్చారీఁ ॥2॥

ఆపులియాచా విసరబోళా ।
గోవింద కళా కౌతుకేఁ ॥ 3॥

తుకాహ్మణే హాఁసే జన ।
నాహీఁ కాన తే ఠాయీఁ ॥4॥ **(3794)**

ప్ర.ప :- కోణీ ఏకీ నారీ = ఒకానొక (గోపికా) స్త్రీ; భులలీ = మైమరచి; (వీధులలో) గోరస = పాలు, పెరుగు; వికితాం = అమ్ముతూ; హరి ఘ్యా హ్మణే = "హరిని" తీసికోండి అని అంటూ (తిరుగుచుండెను). 1. డోళా = (తాను) కన్నులతో; దేఖిలా = (హరి యొక్క యే సుందరరూపము) చూచెనో; మనీఁ= (అది) మనస్సులో; బైసలా = గట్టిగా నాటు కొనెను. మరియు (హరిరూపమును పునః పునః స్మరిస్తూ, ఆగోవిందుని నామమునే) వదనీఁ= నోటితో; ఉచ్చారీఁ= ఉచ్చరించుచుండెను. 2. ఆపులియాచా = స్వతః తనయొక్క; విసరభోళా = శరీర భానము లేనిదై; గోవింద = గోవిందుని యొక్క; కళా = గుణములను (కీర్తిస్తూ); కౌతుకేఁ = ఆనందములో నిమగ్నమైనది. 3. తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; (ఆమెను చూసి) జన = జనులు; హాఁసే = నవ్వుకొనుచుండిరి; (కాని అమె) కాన = చెవి; తే = వారి యొక్క; ఠాయీఁ= నవ్వులవైపు; నాహీఁ=లేకుండెను (పోకుండెను). 4. ఈ అభంగమునకు సాదృశ్యము 3769.వ అభంగమును గూడ తెలియవచ్చును.

**తా॥** ఒకానొక గోపికా స్త్రీ పాలు, పెరుగును నెత్తినెత్తుకొని, చిత్త చోరుడైన శ్రీకృష్ణునకు సమర్పిత చిత్తయై వీథుల్లో దిరుగుతూ నేను పాలుపెరుగు అమ్ముచున్నానను స్పృహ గూడ లేనిదై మైమరచి "హరిని తీసికోండి" హరిని తీసుకోండి" అని అరచు చుండెను. 1. ఆమె తన నేత్రములతో యే శ్యామసుందరుడగు హరియొక్క దివ్యరూపమును గాంచెనో, అది తన మదిలో గట్టిగా నాటుకొని పోయెను. నిరంతరము మదిలో మెదలుచున్న దామోదరుని స్మరిస్తూ "హరిని తీసికోండి" "హరిని తీసికోండి" అని కేకలు వేయు చుండెను. 2. హరి రూపమునకు ముగ్ధురాలై తన్నుతాను మరచినదై, గోవిందునియొక్క గుణగుణమును కీర్తిస్తూ ఆనందములో నిమగ్నమయ్యెను. 3. శ్రీ తుకారామ్ మహారాజు గారంటున్నారు – ఆమె దేహభానము లేనిదై తన్మయత్వములో "గోవిందుని తీసికోండి" హరిని తీసికోండి" అని అరచుచుంటే యితర అభక్తజనులు చూసి నవ్వుచుండిరి. కాని, అటువైపు చెవినిడక ఏమాత్రము లెక్కపెట్టకుండెను. 4.

సు.వ్యా :-

**శ్లో॥ విక్రే తు కామాఖిల గోపకన్యా, మురారి పాదార్పిత చిత్తవృత్తిః ।**
**దధ్యాదికం మోహవశాదవోచద్, గోవింద దామోదర మాధవేతి ॥**

(శ్రీబిల్వ మంగళ విరచితము)

**అర్థము :–** పాలు పెరుగులను అమ్మదలంచిన గోపికా కన్యలందరు వాడ వాడల్లో దిరుగుతూ చిత్త చోరుడగు మురారి (గోపాలకృష్ణుని) యొక్క పాదారవిందములకు సమర్పిత మత్త చిత్త వృత్తి గలవారై మోహవశాత్తు మైమరచి "పాలోయమ్మ పాలో" "పెరుగోయమ్మ పెరుగో" "పాలు తీసికోండి",

పెరుగు తీసికోండి" యని కేకవేయుటకు బదులుగా, గోవిందుని తీసికోండి, దామోదరుని తీసికోండి, మాధవుని తీసికోండి - అని అరచు చుండిరి.

ఆహా! నిర్మల హృదయులు, గోవిందపాదారవిందములకు సమర్పించిన చిత్తముగల గోపికల యొక్క అనన్య భక్తి పారవశ్యమునకు జయము జయము. ఆ గోపికలకు ధన్యవాదములు.

**46. అభంగము :-**

జియేవేళీ చోరూనియాం నేలీం వత్సేం ।
తయాలాగీ తైసే హోణే లాగే ॥1॥

లాగే దోహాం ఠాయీం కరావేం పాళణ ।
జగాచా జీవన మాయబాప ॥2॥

మాయ ఝూలా హరీ అవఘ్యా వత్సాంచీ ।
ఘరీం వత్సేం జీచీం తైసా ఝూలా ॥3॥

ఝూలా తైసా జైసే ఘరీచే గోపాళ ।
ఆణిక సకళ మోహరీ పాంవే ॥4॥

మోహరీ పాంవే శింగెం వాహిల్యా కాహోళా ।
దేఖిలా సోహోళా బ్రహ్మాదికీం ॥5॥

బ్రహ్మాదికాం సుఖ స్వప్నీం తేంహి నాహీం ।
తైసేం దోహీం ఠాయీం వోసండలేం ॥6॥

వోసండల్యా క్షీర అముప త్యా గాయీ ।
జైసీ జ్యాచీ ఆఈ తైసా ఝూలా ॥7॥

లాఘవ కళలేం బ్రహ్మాయాసీ యాచేం ।
పరబ్రహ్మ సాచేం అవతరలేం ॥8॥

తరలే హే జన సకళహి ఆతాం ।
ఐసేం తో విధాతా బోలియేలా ॥9॥

లాగలా హే స్తుతి కరూం అనంతాచీ ।
చతుర్ముఖే వాచీ భక్తి స్తోత్రేం ॥10॥

భక్తికాజేం దేవేం కేలా అవతార ।
పృథివీచా భార ఫేడావయా ॥11॥

పృథివీ దాటిలీ హెూతీ యా అసురీం ।
న సహావేం వరీ భార తయే ॥12॥

తయా కాకులతీ ఆపల్యా దాసాంచీ ।
తయా లాగీం వేంచీ సర్వస్వ హి ॥13॥

స్వహిత దాసాంచే కరావయా లాగీం ।
అవ్యక్త హేం జగీం వ్యక్తీ ఆలేం ॥14॥

లేఖా కోణ కరీ త్యాంచియా పుణ్యాచా ।
జయాంసవే వాచా బోలే హరి ॥15॥

హరీ నామమాత్రేం పాతకాంచా రాశీ ।
తో ఆలా ఘరాసీ గౌళియాంచ్యా ॥16॥

గౌళియే అవఘేం ఝూలీం కృష్ణమయ ।
నామే లోకత్రయ తరతీల ॥17॥

తరతీల నామేం కృష్ణాచియా దోషీ ।
బహుత జ్యాం పాశీం హెూఈల పాప ॥18॥

పాప ఐసేం నాహీం కృష్ణనామే రాహేం ।
ధన్య తోచి పాహే కృష్ణముఖ ॥ 19॥

ముఖ మాఝే కాయ జోమీ వర్ణూ పార ।
మగ నమస్కార ఘాలీ బ్రహ్మో ॥20॥

బ్రహ్మో నమస్కార ఘాలీ గోధనాసీ ।
కళలా తయాసీ హాచి దేవ ॥21॥

దేవచి అవఘా ఝూలాసే సకళ ।
గాఈ హా గోపాళ వత్సేం తేథేం ॥22॥

తేథే జే పాహణేం ఆణిక దూసరేం ।
మూర్ఖత్వా అంతరే రుజా నాహీం ॥23॥

దుజాభావ తుకాహ్మణే జయా చిత్తీం ।
రౌరవ భోగితీ కుంభీపాక ॥24॥ (3818)

కుంభీపాకలాగే తయాసీ భోగణేం ।
అవఘాచీ నేణే దేవ ఐసా ॥1॥

దేవ ఐసా త్యావా నాహీం జయా జనా ।
తయాసీ యాతనా యమ కరీ॥2॥

కళలా హాదేవ తయాసీచ ఖరా ।
గాఈ వత్సేం ఘరా ధాడీ బ్రహ్మో ॥3॥

బ్రహ్మాదికా దేవ ఐసా అగోచర ।
కైసా త్యాచా పార జాణవేల ॥4॥

జాణవేల దేవ గౌళీయాంచా భావేం ।
తుకా హ్మణే వ్హావేం సంచిత హేం ॥5॥ (3819)

ప్ర.ప :- జియే వేళీ = యే సమయము నందు; (బ్రహ్మదేవుడు) వత్సే = గోవత్సములను; చోరూనియాం నేలీం = అపహరించు కెళ్ళాడో, (అప్పుడు) తయాలాగీం = భగవంతుడగు శ్రీకృష్ణునకు; తైసే = గోవత్స, గోపాలుర రూపములో; హెూణేంలాగే = కావలసి వచ్చెను. 1. దోహెూం ఠాయిాం = రెండు వైపుల (భగవంతునికి); పాళణ కరావేం లాగె = పాలన చేయవలసి వచ్చెను; (ఎందుకనగా) జగా చా మాయబాప = దేవుడు జగత్తునంతటికిని తల్లిదండ్రియై యుండి; జీవన = జగత్తునకు జీవనమై యున్నాడు. 2. అవఘ్యా = అన్ని; వత్సాంచీ = వత్సములు (లేగదూడల) యొక్క; మాయ = తల్లి; హరి = హరియే (కృష్ణుడే); ఝాలా = అయెను, ఘరీ = ఇంటివద్ద; జీచీ = యే తల్లి యావు యొక్క; వత్సేం = లేగదూడ (ఎట్లు ఉన్నదో); తైసా = అట్లే (తాను) ఝాలా = అయెను; 3. ఘరీచే = ఏయింటి; గోపాళ = గోపాలుడు; జైసే = యెట్లుండెనో; తైసా ఝాలా = (తాను) అట్లే అయెను; ఆణిక = ఇంతేగాకుండా (మరియు); సకళ = సకల (వస్తువులు); మోహరీ = పిల్లనగ్రోవి; పాంవే = పీకె (వాద్యవిశేషము తానే అయెను)4. మోహరీ = మురళీపాంవే = పీకెలు; శింగే = కొమ్ముల వంటి వాద్యవిశేషములు; కాహోళా = నగారా (రణభేరి); మరియు; వా హిల్యా = కప్పుకొను వస్త్రము లేక గొంగడి (ఇత్యాది అనేక రూపములుగా అయిన ఈ) సోహోళా = అద్భుత దృశ్యమును; బ్రహ్మాదికీం = బ్రహ్మాదులు; దేఖిలా = గాంచిరి. 5. సుఖ = యే సుఖమైతే ; బ్రహ్మాదికాం = బ్రహ్మాదులకు;

స్వప్నీ తేంహీ నాహీం = స్వప్నము నందుగూడ దొరుకదో; తైసేం = అటువంటి (సుఖము); దోహీంఠాయీం = రెండు చోట్ల; (గోవులు గోవత్సముల యందు మరియు గొల్లపిల్లల తల్లులు వారి పిల్లల యందు); వోసండలేం = పొంగి వచ్చెను (అనుభూతమగుచుండెను). 6. జ్యాచీ = ఏ లేగదూడ యొక్క; ఆఈ = తల్లి; జైసీ = ఎట్లుండెనో; (కృష్ణుడు) తైసా ఝూలా = అట్లే ఆయెను; త్యాగాయీ = ఆతల్లి యావు (తన లేగదూడను చూసి); అముప = అధికముగా; క్షీరం = పాలు; వోసండల్యా = చిమ్ముచుండెను. 7. (శ్రీకృష్ణుడు) సాచేం = సాక్షాత్తుగా; పరబ్రహ్మ = పరబ్రహ్మయే; అవతరలేం = అవతరించెనని, యాచేం = కృష్ణుని యొక్క ; లాఘవ = మహిమ; బ్రహ్మయాసీ = బ్రహ్మదేవునికి; కళలేం = తెలిసివచ్చెను. 8. ఆతాం = ఇప్పుడు; హే జన = ఈ గోకులవాసులు; సకళహి = అందరునూ; తరలే = ఉద్ధరించ బడ్డారు; (అని) ఐసేం = ఈ ప్రకారముగా; తో = ఆ; విధాతా = బ్రహ్మదేవుడు; బోలియేలా = పలుకుచుండెను. 9. (తుదకు బ్రహ్మదేవుడు భగవంతునికి శరణు జొచ్చి భక్తి స్తోత్రేం = భక్తి స్తోత్రములచే; చతుర్ముఖే= నాలుగు ముఖముల ద్వారా; వాచీ = గానము చేయుచుండెను; అనంతాచీ= అనంతుని యొక్క; హే స్తుతి కరూం లాగలా = అనేక విధములుగా స్తుతి చేయ దొడంగెను. 10. (బ్రహ్మదేవుడు ఇలా అంటున్నాడు) దేవేం = భగవంతుడు; పృథివీచా భార = భూభారమును; ఫేడావయా = దించుటకు; భక్తి కాజే = భక్తరక్షణ అను కార్యము కొఱకు; అవతార కేలా = అవతరించెను. 11. (భగవంతుడు అవతరించక పూర్వము) పృథివి = భూదేవి; యా ఆసురీం = దైత్యులు కలిగించు దుఃఖములచే; దాటిలీ హోతీ= నిండియుండెను; వరీ భార = తలపైని భారము; తయే = ఆమెకు (భూదేవికి); నసాహోవే = సహనము గాకుండెను. 12. (భగవంతునికి) ఆపల్యా దాసాంచీ= తన దాసులయొక్క (భక్తుల యొక్క కష్టమును జూచి); తయా = అతనికి;

కాకులతీ = దయగలుగును; తయాలాగీం = వారి కోసము ; (తనయొక్క) సర్వస్వ హి వేం చీ = సర్వస్వమును యిచ్చుటకు ప్రవృత్తమగును. 13. దాసాంచీ స్వహిత = భక్తుల యొక్క హితము; కరావయా లాగీం = చేయుట కొఱకు; అవ్యక్త = అవ్యక్త స్వరూపుడగు పరబ్రహ్మ; హేం జగీం = ఈ జగత్తులో ; వ్యక్తీ ఆలేం = సగుణ రూపములో (శ్రీకృష్ణ రూపములో) ప్రకటమయ్యెను. 14. హరి = భగవంతుడు; జయాంసవేం = యెవరితో ముఖాముఖిగా ; = వాచాబోలే = మాట్లాడు చున్నాడో; త్యాంచియా పుణ్యాచా = వారి పుణ్యము యొక్క; లేఖా కోణకరీ = గణన యెవరు చేయగలరు?; 15. హరీ = (ఏ) హరియొక్క; నామమాత్రేం = నామోచ్చారణ మాత్రముచే; పాతకాంచ్యా రాశీ = పాపరాశి (కాలిపోవునో); తో = అటువంటి (హరి); గౌళియాంచ్యా = గొల్లల యొక్క; ఘరాసీ ఆలా = ఇంటికి వచ్చెను. 16. నామేం = యే నామ మహిమచేత; లోకత్రయ = మూడు లోకములు; తరతీల = తరించి పోవునో; (ఆకృష్ణనామముచే) అవఘీ గౌళియే = గొల్లలందరు; కృష్ణమయ ఝాలీం = కృష్ణమయులు అయిరి. 17. జ్యాంపాశీ= యెవరి వద్ద; బహుత పాప హెూఈల = అత్యధిక పాపము ఉండునో; (అటువంటి) దోషీ = పాపి(గూడ); కృష్ణాచియా నామేం = శ్రీకృష్ణ దివ్య నామముచే; తరతీల = తరించును. 18. కృష్ణనామేం = శ్రీకృష్ణ నామోచ్చారణచే; రాహేం = ఉండును; ఐసే పాప నాహీం = ఇటువంటి పాపము లేదు. (యెవరైతే) కృష్ణ ముఖ = శ్రీకృష్ణుని ముఖారవిందమును; పాహే చూచిరో; తోచి ధన్య = వారు ధన్యులు; 19. (బ్రహ్మదేవుడంటాడు) మీ పార వర్ణూ = నేను నీయొక్క కీర్తిని వర్ణించుటకు; మాఝె ముఖ కాయ= నా ముఖము ఏపాటిది?; మగ = అని చెప్పి; బ్రహ్మే = బ్రహ్మదేవుడు; నమస్కార ఘాలీ = నమస్కరించెను. 20. బ్రహ్మే = బ్రహ్మదేవుడు; గోధనాసీ= (వృందావనములో నున్న) గో; గోవత్స, గోపాలురందఱకు; నమస్కార ఘాలీ=

నమస్కరించెను; తయాసీ = అతనికి; హాచి దేవ = వీరందఱు (ఈ కృష్ణుడే) నిజముగా దేవుడని; కళలా = తెలిసి వచ్చెను. 21. తేథే = అక్కడ; దేవచి = దేవుడే (కృష్ణుడే); అవఘూగాఈ = అన్ని గోవుల రూపములో; సకళ గోపాళ= గోపాలురందఱి రూపములో; హా వత్సే = లేగదూడల రూపములో; ఝూలాసే= ఆయెను. 22. తెథే = అచ్చట; జేం = ఎవడైతే; ఆణీక = భగవంతున్ని విడిచి; దూసరేం = రెండవది; పాహాణేం = దర్శించుట; మూర్ఖ = మూర్ఖత్వము. (లేదా భేదమును చూచువాడు మూర్ఖుడని అర్థము) (ఎందుకనగా?) త్యా అంతరే = ఆ భగవంతునికంటె; దుజా = రెండవది (ద్వైతము); నాహీం = లేదు. 23. తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; జయా చిత్తీం = యెవడి చిత్తములో; దుజాభావ= ద్వైతభావముండునో; (వాడు) రౌరవ కుంభీపాక = రౌరవకుంభీపాక నరకమును; భోగితీ = అనుభవించును. 24. (3818)

దేవ = దేవుడు; అవఘాచి ఐసా = అంతట ఉన్నాడు అని; (ఎవడు) నేణే = తెలియడో; తయాసీ = వాడికి; కుంభీపాక = కుంభీపాక నరకము; భోగణే లాగె = అనుభవింప వలసి వచ్చును. 1. జయాజనా = యే జనులకైతే; దేవ ఐసా = భగవంతుడు సర్వవ్యాపకుడని; ఠావానాహీం = గురుతు దెలియదో; తయాసీ = వారికి; యమ = యమధర్మరాజు; యాతనా కరీ = శిక్షించును. 2. బ్రహ్మా = బ్రహ్మదేవునికి; హా ఖరాదేవ = ఇతడు (కృష్ణుడు) నిజముగా దేవుడే యని; కళలా = తెలిసిన (పిదప); తయాసీచ = వారి వారి; గాఈ వత్సే = గోవులను; దూడలను; (వారి వారి) ఘరీ = ఇండ్లకు; ధాడీ = పంపించెను. 3. ఐసా దేవ = ఇటువంటి దేవుడు; బ్రహ్మాదికాం = బ్రహ్మాదులకు గూడ; అగోచర = (అగమ్యుడు) తెలియబడనివాడై యుండగా; త్యాచా పార = అతని అంతు (సామాన్య జనులు); కైసా జాణవేల = ఎలా

తెలియగలరు? 4. తుకా హ్మణే = శ్రీతుకోబారాయ్ అంటున్నాడు; (ఎవరికి) గౌళియాంచ్యా భావేం = గోకులవాసులవంటి ప్రేమ (భక్తి); సంచిత = పూర్వపుణ్య సంచయము; వ్హావేం = గలిగియుందురో; (వారు) హే దేవ జాణవేల = ఈ దేవున్ని తెలిసికొనగలుగుదురు. 5. (3819)

**తా॥** ఎప్పుడైతే బ్రహ్మదేవుడు గోవత్సములను, గోపాలురను అపహరించుకువెళ్ళెనో, అప్పుడు యే ఆవు దూడ ఎలా ఉండెనో, ఏతల్లి కుమారుడు ఎలా ఉండెనో- అదే విధముగా కృష్ణునకు కావలసి వచ్చెను. 1. అక్కడ బ్రహ్మదేవుడపహరించిన వత్సములను, గోపాలురను మరియు ఇక్కడ గోవులను మరియు గోపాలురతల్లులను పాలించ (సంభాలించ) వలసి వచ్చెను. ఎందుకనగా? భగవంతుడు జగత్తునకు మాతా, పితా మరియు జీవనాధారము అయి యున్నాడు.

**శ్లో॥ పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః ॥** (గీత. 9-17)

**అర్థము :-** ఈ జగత్తునకు తండ్రిని నేనే అయి ఉన్నాను. తల్లిని నేనే, పోషించేవాడిని నేనే అయి యున్నాను. మరియు తండ్రి యొక్క తండ్రి (పితామహుడను) నేనే అయి ఉన్నాను. "జీవనం సర్వభూతేషు" (గీత. 7-9) సమస్త ప్రాణులయందు జీవనము నేనే ఇయి యున్నాను. ఇత్యాది వచనములు ప్రమాణములచే స్వప్నసాక్షివలె సర్వాధిష్ఠానము పరమాత్మయే అయి యున్నాడు. 2. ఏయింట్లో యే లేగదూడ యొక్క తల్లి యావు ఎలా ఉండెనో, ఆ తల్లి మరియు ఆ తల్లియావు యొక్క బిడ్డ సదృశము తానే అయ్యెను. 3. ఏయింటి గోపాలురు ఎట్లుండిరో, మరియు ఆ గోపాలురవద్ద ఎలాంటి వేణువులు, పీకెలు (వాద్యవిశేషములు) ఉండెనో - శ్రీకృష్ణుడు ఆయారూపములను ధరించెను. 4. శ్రీహరి గోపాలుర రూపములో, మరియు వారి వద్దనున్న మురళీ, పీకెలు, కొమ్ముల రూపములో

నుండు వాద్యవిశేషములు; నగారాలు (రణబేరులు) మరియు భుజమునవేసుకొను గొంగళ్ళు మొదలగు అన్ని రూపములుగా నయ్యెను. హరియొక్క యీ యద్భుత లీలను బ్రహ్మాది దేవతలందరు గాంచిరి. 5.

సు.వ్యా :- శ్లో॥ తతఃకృష్ణో ముదం కర్తుం తన్మాతౄణాం చ కస్య చ ।
ఉభయాయితమాత్మానం చక్రే విశ్వకృదీశ్వరః ॥

శ్లో॥ యావద్వత్సపవత్సకాల్పకవపుర్యావత్కరాంఘ్ర్యాదికమ్ ।
యావద్యష్టి విషాణవేణుదలశిగ్యావద్విభూషామ్బరమ్ ॥

యావచ్ఛీలగుణాభిధాకృతి వయో యావద్విహారాదికమ్ ।
సర్వం విష్ణుమయం గిరోఽఙ్గవదజః సర్వస్వరూపో బభౌ ॥

శ్లో॥ స్వయమాత్మాఽఽత్మ గోవత్సాన్ ప్రతివార్యాత్మవత్సపైః ।
క్రీడన్నాత్మ విహారైశ్చ సర్వాత్మా ప్రావిశద్వ్రజమ్ ॥

శ్లో॥ తత్తద్వత్సాన్పృథఙ్నీత్వా తత్తద్గోష్ఠే నివేశ్య సః ।
తత్తదాత్మాభవద్రాజన్! తత్తత్సద్మ ప్రవిష్టవాన్ ॥
(భాగ. 10-13-18 నుండి 21 వరకు)

కలాపకార్థము :- శ్రీకృష్ణభగవంతుడు వత్సములకు, గోపాలుర తల్లులకు అట్లే బ్రహ్మదేవునకు గూడ ఆనందమును కలిగించుటకొఱకు తనకు తాను స్వయముగా వత్సములుగను, గోపాలబాలురుగను ఉభయరూపములుగా కల్పించుకొనెను. ఎందుకనగా? తానే సంపూర్ణ విశ్వమునకు సర్వశక్తివంతుడగు కర్తా ఈశ్వరున్నాడు. హే పరీక్షిత్! ఆ వత్సములు మరియు బాలకులు ఎంతసంఖ్యలో ఉండిరో; ఎంతెంత అల్పకాయులుగనుండిరో, వారి చేతులు, కాళ్ళు ఎట్లుండెనో, వారివద్ద ఎన్ని, ఎటువంటి బెత్తములు, కొమ్ములవంటి వాద్యవిశేషములు, వేణువులు,

తాటియాకు మొదలగు వాటితో చేసిన పీకెలు(వాద్యవిశేషములు), వడిశెల లేదా కావడికి తగిలించు ఉట్టి ఇత్యాది గోపాలుర పరికరములు, మరియు ఎవరెవరికి ఎటువంటి, ఎన్ని వస్త్రములుండెనో– ఆ వస్త్రాభూషణముల రూపములో కృష్ణుడే అయ్యెను. గోపాలుర యొక్క శీల, స్వభావ, గుణ, నామము, రూపములు మరియు అవస్థలు ఎట్లుండునో - అట్లు మరియు వారి తినుట - త్రాగుట - నడచుట ఇత్యాది వ్యవహారములెట్లుండెనో - అట్లే సర్వ స్వరూపుడగు భగవంతుడు ప్రకటమయ్యెను. అప్పుడు వేదవాణి మూర్తీభవించినదా యన్నట్లు "సర్వ జగత్తు విష్ణురూపమాయెను. సర్వాత్మకుడగు భగవంతుడు శ్రీకృష్ణుడు స్వయముగా వత్సములుగను, గొల్లబాలురుగను అయి, ఆత్మరూపమగు వత్సములను ఆత్మ స్వరూపమగు గోపాలురచే చుట్టు ముట్టి తన చేతనే తాను అనేక ప్రకారముల ఆటలాడుతూ గోకులములో ప్రవేశించెను. హే పరీక్షిత్! యే గోపాలుని వత్సములు యేవియుండెనో, వాటిని ఆ గోపాలుని రూపములో వేరువేరుగా వాటి వాటి గోష్ఠములో (పశువుల కొట్టము) ప్రవేశింపజేసెను. మరియు భిన్నభిన్న బాలకుల రూపములో భిన్న భిన్న మగు వారి వారి యిండ్లలోకి శ్రీకృష్ణుడే వెళ్ళిపోయెను. 5.

ఏసుఖము బ్రహ్మాది దేవతలకు స్వప్నమునందు గూడ పొందుటకు సాధ్యముగాదో, అది గోకులములో గో, గోవత్సములకు మరియు గోపికా, గోపబాలురకు సులభ్యమయ్యెను. 6. ఏ లేగదూడ యొక్క తల్లి ఎలా ఉండెనో, అట్లే భగవంతుడు తద్రూపమును ధరించెను. ఆ తల్లి, లేగదూడకు అత్యధికముగా పాలు యివ్వ దొడంగెను. 7. సాక్షాత్తుగా పరబ్రహ్మ పరమాత్మయే యీ శ్రీకృష్ణుడుగా నవతరించెనని బ్రహ్మదేవునకు తెలిసి వచ్చెను. 8. బ్రహ్మదేవుడంటున్నాడు - "ఇప్పుడు ఈ శ్రీకృష్ణుడవతరించుట వలన గోకుల వాసులందరు ఉద్ధరించ బడ్డారు".

**శ్లో॥ అహెూభాగ్యమహెూభాగ్యం నందగోప వ్రజౌకసామ్ ।**
**యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మ సనాతనమ్ ॥**
(భాగ. 10-14-32)

**అర్థము :-** ఆహా! నందాది వ్రజవాసులగు గోపాలురు ధన్యులు. ఏమి వారి అహెూభాగ్యము. ఎందుకనగా పరమానంద స్వరూప సనాతన పరిపూర్ణ పరబ్రహ్మము స్వయముగా వారికి అత్యంత సన్నిహిత సుహృదుడాయెను. 9. ఇక గత్యంతరము లేక బ్రహ్మదేవుడు శ్రీకృష్ణపరమాత్మకు శరణు జొచ్చి, అనేక భక్తి స్తోత్రములచే స్తుతింపదొడంగెను. 10. బ్రహ్మదేవుడు ఇలా స్తుతిస్తూన్నాడు - పృథివి యొక్క భారమును దించుటకు, భక్తులను పరిరక్షించుట కొఱకు భగవంతుడు అవతరించెను. 11. భగవదవతారమునకు పూర్వము దైత్యులచే పృథివీమాత అసహ్య దుఃఖితయై యుండెను. 12. భక్తులపై యత్యంత దయచేత, వారికోసము తన సర్వస్వమును ప్రసాదించుటకు భగవంతుడు సర్వదా తత్పరుడై యుండును. 13. భక్తుల హితము కోసము అవ్యక్త పరమాత్మ కృష్ణరూపములో వ్యక్తమాయెను. 14.

**సు.వ్యా :- శ్లో॥ భూమిర్దృప్తనృపవ్యాజ దైత్యానీక శతాయుతైః ।**
(భాగ. 10-1-17)

**అర్థము :-** ఆ సమయములో లక్షలకొలది దైత్యవర్గము మహాగర్వయుక్తమగు రాజుల రూపములో భూమికి భూరి భారమై ఆక్రమించి యుండిరి.

**శ్లో॥ భూమేర్భారాయమాణానాం దైత్యానాం చ వధోద్యమమ్ ॥**
(భాగ. 10-1-64)

అర్థము :- దైత్యులకారణముచే భూభారమధికమాయెను. అందువలన వారిని వధించుటకు తగిన ప్రబంధము జరుగుచున్నది.

శ్లో ॥ జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవా భాతి మాయయా ॥
(భాగ - 10-14-55)

అర్థము :- జగత్కల్యాణార్థము యోగమాయను స్వీకరించి ఈ వ్రజకులములో దేహధారివలె - భగవంతుడు కన్పట్టుచుండెను.

శ్లో॥ త్వం మాయయా త్రిగుణయాత్మని దుర్విభావ్యం,
వ్యక్తం సృజస్యవసి లుమ్పసి తద్గుణస్థః ।
నై తైర్భవానజిత కర్మభిరజ్యతే వై,
యత్స్వే సుఖేఽవ్యవహితేఽభిరతోఽనవద్యః ॥ (భాగ. 11-6-8)

అర్థము :- ఓ అజితమగు పరమాత్మా! నీవు మాయికమగు రజ ఆది గుణములలో స్థితమైయుండి, ఈ అచింత్య నామరూపాత్మక ప్రపంచమును త్రిగుణాత్మకమగు నీ మాయచేత అవ్యక్తమగు నీవు నీయందే వ్యక్తరూపములో సృజించుచున్నావు, పాలించుచున్నావు, మరియు సంహారము చేయుచున్నావు. ఇవన్నియు చేస్తూ గూడ నీవు స్వరూపముచే అలిప్తుడవై యున్నావు. ఎందుకనగా? నీవు రాగద్వేషాది దోషములచే సర్వథా ముక్తుడవు. నీవు నీయొక్క నిరావరణ అఖండ స్వరూపభూత పరమానందములో మగ్నుడవై యుంటావు. 14.

శ్రీహరి యెవరితో ప్రత్యక్షముగా మాట్లాడునో వారి పుణ్యమును యెవరు లెక్కింపగలరు? 15. ఏ హరియొక్క నామమాత్రముచేతనే సకల పాపరాశి కాలిపోవునో, అతడే ఇప్పుడు గోపాలుర యిండ్లలోకి వచ్చాడు. 16. ఏ కృష్ణ నామముచేత త్రైలోక్యము ఉద్ధరింపబడునో, ఆ కృష్ణ నామముచే

గోకులమంతయు కృష్ణరూపమయ్యెను. 17. ఎవరి వద్ద అత్యధిక పాపము గలదో, అటువంటి పాపిగూడ కృష్ణ నామముచే తరించబడును.

సు.వ్యా :- శ్లో॥ హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః ।
అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యేవహి పావకః ॥

అర్థము :- ఏప్రకారముగా అనిచ్ఛా పూర్వకముగానైనను అగ్నిని స్పర్శించినచో ఎట్లు దహించునో, అట్లు ఇచ్ఛ లేనప్పటికిని నిమిత్తాంతరముచేనైనను హరినామము నుచ్చరించిన దుష్టచిత్తుల సకల పాపరాశి దహించబడును. అలాంటప్పుడు సామాన్యుల పాపములు నశింపవా?

శ్లో॥ సకృదుచ్చరితం యేన హరిరిత్యక్షరద్వయమ్ ।
బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి ॥
(స్కం.పు. ప్రభాస ఖం. 317- 18)

అర్థము :- ఎవడు "హరి" యను రెండక్షరములను ఒక్కసారి ఉచ్చరించెనో; అతడు మోక్షమును చేరుటకు నడుము కట్టినాడు (కటిబద్ధుడైనాడు) అని తెలియవలెను. 18. శ్రీకృష్ణునియొక్క దివ్యనామోచ్చారణానంతరము గూడ నశించకుండా ఉండే పాపము ఈ జగత్తులో లేదు. ఎవరు కృష్ణదేవుని ముఖారవిందమును దర్శించెదరో, వారు ధన్యజీవులు. 19. బ్రహ్మదేవుడంటున్నాడు :- ఓ దేవా! నా ముఖము లెంత పాటివి. నీయొక్క యపారకీర్తిని వర్ణించుటకు నసమర్థుడను - అని శ్రీకృష్ణునకు నమస్కరించెను. 20. బృందావనములోని గోవులకు, గోవత్సములకు మరియు గోపాలురందఱకును బ్రహ్మదేవుడు నమస్కరించెను. ఎందుకనగా! వీరందఱు భగవత్స్వరూపలే య్యి

ఉన్నారని బ్రహ్మదేవునికి దెలియబడినందువలన. 21. గోవులు, గోవత్సములు మరియు గోపాలుర రూపములో సర్వము శ్రీకృష్ణుడే - "స్వప్నసాక్షియే సర్వస్వాప్నిక పదార్థ రూపములలో అయినట్లు" ఆయెను. 22. ఇక్కడ భగవంతునికంటె యన్యము నెవడు చూచునో వానికంటె మూర్ఖుడు మరొకడుండబోడు. ఎందుకనగా! పరమార్థతః ద్వైతము యత్కించిత్ గూడ లేదు గదా!

శ్లో॥ మాయామాత్రమిదం ద్వైతం పరమార్థతః ॥

(మాండూక్య కారికా. 1-17)

ఈద్వైతప్రపంచము మాయా మాత్రమున్నది. గారడివానిచే సృష్టించబడు మాయిక పదార్థముల వంటిది. వాస్తవముగా (గారడి వానివలె) అద్వితీయంమగు పరబ్రహ్మమే ఉన్నది. 23. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - ఎవరి చిత్తమునందు ద్వైత సత్త్వము యొక్క భావము అనగా ప్రపంచ సత్యత్వబుద్ధి (నిశ్చయము) ఉండునో, వానికి రౌరవము మరియు కుంభీపాకాది నరకము ననుభవించ వలసి యుండును. 24. (3818).

దేవుడు సర్వ వ్యాపకుడున్నాడని యెవడు దెలియడో వాడు కుంభీపాక నరకము ననుభవింపవలసివచ్చును. 1. ఈ సమస్త జగత్తు పరబ్రహ్మ స్వరూపమని యెవనికి దెలియదో,వానిని యమధర్మరాజు కఠినముగా శిక్షించును. 2. ఎప్పుడైతే బ్రహ్మదేవునికి శ్రీకృష్ణునియొక్క మహిమ పూర్తిగా దెలియ బడినదో, అప్పుడు తానపహరించిన వత్సములను, గోపాలురను వారి వారి యిండ్లకు తిరిగి పంపించెను. 3. బ్రహ్మాదులకు గూడ దేవుడు అగమ్యమయినపుడు, యిక సామాన్య మానవులకు భగవంతుని మహిమ ఏమి దెలియును?

సు.వ్యా:- శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్ ॥ (గీత. 9-11)

అర్థము :- నా యొక్క పారమార్థిక తత్త్వము నెఱుంగని మూఢులు (అవివేకులు), మానుష శరీరమును గ్రహించిన సంపూర్ణభూతములకు మహేశ్వరుడనగు నన్ను అనాదరించుచున్నారు.

శ్లో॥ అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మామబుద్ధయః ।
పరభావమజానన్తో మమావ్యయమనుత్తమమ్ ॥ (గీత. 7-24)

అర్థము :- నా యొక్క అవినాశి స్వరూపమును మరియు సర్వోత్తమము, అట్లే సర్వకారణరూప భావమును దెలియని బుద్ధిహీనులగు పురుషులు అవ్యక్తరూపమగు నన్ను వ్యక్తరూపముగా అనగా కృష్ణుడు దేవకీ వసుదేవుల నందనుడు సామాన్యమానవుడు - అని భావిస్తున్నారు. 4. శ్రీ తుకోబారాయ్ అంటున్నాడు - గోకులవాసులలో నున్నటువంటి ప్రేమ, మరియు పూర్వపుణ్యము గలిగి యున్నవారికే - భగవంతునియొక్క యథార్థ జ్ఞానము గలుగును. 5. (3819)

**47. అభంగము :-**

వరతా వేంధోనీ ఘాతలీ ఉడీ ।
కళంబా బుడీం యమునేసీ ॥1॥

అవఘే మిళోని కోల్హాళ కేలా ।
ఆతా హెూతా హ్మణతీ గేలా ॥1॥

భ్యాలీం జివా చుకలీం దేవా।
నాహీం ఠావా జవలీం తో ॥1॥

ఆహేకటా కరతీ హాయ ।
హాత డోకీం పిటితీ పాయ ॥2॥

జవళీ హెూతా న కళే ఆమ్హాం ।
గేల్యా సీమా నాహీం దుఃఖా ॥3॥

కాళీయా నాథూనీ ఆలా వరీ ॥
పైల హరీ దాఖవితీ ॥1॥

హరి గోపాళాం సవే సకళాం ।
భేటే గళ్యా గళా మేళవూనీ ॥2॥

యోగియాంచా ధ్యానా నయే ।
భాకరీ త్యాంచా మాగోనీ ఖాయ ॥3॥

తుకా హ్మణే అసే శాహాణియాం దురీ ।
బోబడియా దాసాం హోకా మారీ ॥4॥

(3755 నుండి 3759 పర్యంతము)

ప్ర.ప :- (ఒకనాడు శ్రీకృష్ణుడు) కళంబావరతా = కదంబ వృక్షముపై నుండి; వేంధోనీ = అత్యద్భుతముగా; ఉడీ ఘాతలీ = ఎగిరి దుమికి; యుమునేసీ బుడీం = యమునా నదిలో మునిగిపోయాడు. (అది కాళీయ నివాసము). 1. అవఘే మిళోని = గోపాలురందఱుకలిసి; కోల్హాళకేలా= కోలాహలము చేసిరి; (కృష్ణుడు) ఆతా = ఇప్పుడు (చెట్టుపై); హెూతా = ఉండెను; (ఇప్పుడే) గేలా = యమునలో వెళ్ళి పోయినాడు = అని; హ్మణతీ = (పరస్పరము) చెప్పుకొనుచుండిరి. 1. (గోపాలురు) జివా= వారి ప్రాణమునకు; భ్యాలీం = భయపడిరి; (అందువలననే వారు) దేవా = దేవున్ని; చుకలీం = పోగొట్టుకున్నారు; (వాస్తవముగా) తో = ఆ దేవుడు

(కృష్ణుడు); జవళీం = వారికి అత్యంత సమీపములోనే ఉన్నాడు; (కాని వారికి) ఠావానాహీం = తెలియకుండెను. 1. ఆహోకటా కరితీ = హాహాకారము చేయుచుండిరి. హోయ = హోయ హోయ మంటూ గగ్గోలు బెట్టు చుండిరి; హోత, డోకీం, పాయ = చేతులు తల, కాళ్ళు; పిటితీ = కొట్టుకొను చుండిరి. 2. జవళీ హెూతా = (శ్రీకృష్ణుడు) వారిచెంతనే యుండెను. (కాని వారంటున్నారు) ఆమ్హా నకళే = దేవుడు , మాకు కనుపించుట లేదు"; గేల్యా = పోయినాడు (యిక లేదు = రాదు); దుఃఖా = (ఇటువంటి) వారి దుఃఖమునకు;సీమానాహీం = అవధులు లేకుండెను. 3. (ఇంతలో శ్రీకృష్ణుడు కాళీయుని మర్దించి బయటకు వచ్చెను. అతనిని చూసిన పిల్లలందరు అంటున్నారు) కాళీయా నాథూనీ వరీ ఆలా = (అరెరే! అటు చూడుము శ్రీకృష్ణుడు) కాళీయుని మర్దించి బయటకు (పైకి) వచ్చాడు; పైల = (అదుగో!) ఆ ఒడ్డున;హరీ = కృష్ణుడు (అగుపడుచున్నాడు);దాఖవితీ = ఈ ప్రకారముగా అనుకుంటూ పరస్పరము చూపించుకొనుచుండిరి. 1. (యమునా నది నుండి బయటకు వచ్చిన) హరి = చిన్నికృష్ణుడు; సకళాం గోపాళాం = సవేం = గోపబాలురందఱితో; గల్యా గళా మిళవూనీ భేటే = మెడలో మెడను కలిపి ఆలింగనము చేసికొనెను. 1. యోగియాంచా = యోగులచే; ధ్యానా = ధ్యానమునకు; నయే = విషయము కాదు;(కాని) త్యాంచా = గోపాలురయొక్క భాకరీ = రొట్టెను; మాగోనీ = అడుగుకొని; ఖాయ = తినుచున్నాడు. 3. తుక్హామణే = శ్రీతుకోబా అంటున్నాడు; అసే = ఇటువంటి దేవుడు; శాహాణియాం = తెలివైన వారి నుండి; దురీ = దూరముగా ఉంటాడు; బోబడియాం = అమాయక భక్తులకు; దాసాం = దాసుడై; హాకా మారీ = (వారిని) పిలుస్తూ (వెంటపడుతాడు). 4.

**తా॥** ఒకనాడు శ్రీకృష్ణుడు కదంబవృక్షము నెక్కి యమునానదిలో దూకి అద్భుతమైన లీలను ప్రదర్శించెను. (తాను కాళీయ సర్పమును

మదమణచి, అక్కడి నుండి పారద్రోలు ఉద్దేశముతో, కాళీయుని నివాస స్థానములో దుమికెను) 1. అప్పుడు గోపబాలురందఱు గుమిగూడి గొప్పగా కోలాహలము చేసిరి. కృష్ణుడు ఇప్పుడే వృక్షముపై యుండెను. ఇంతలోనే యమునాజీలో దూకినాడు - అని పరస్పరము అనుకొనుచుండిరి. 1. ఆ గొల్లపిల్లలందఱు ప్రాణభీతిచే గట్టుననుండియే ఆక్రాంతము చేయుచుండిరి. కాని, కన్నయ్యను వెలికి తీయుటకు మాత్రము ప్రయత్నము చేయకుండిరి. అందుకే వారు దేవున్ని కోల్పోయిరి. వాస్తవముగా భగవంతుడు వారి సమీపములో హృదయమునందే యుండెను. కాని, వారికి గురుతు దెలియకుండెను 1. అయ్యయ్యో! ఇప్పుడేమి చేసేది? హరి మునిగి పోయాడు- అని గోపాలురందఱు హాహాకారములతో కోలాహలము చేయదొడంగిరి. కాళ్ళు , చేతులు మరియు తలను కొట్టుకొను చుండిరి. 2. నందనందనుడు అందఱి యొక్క డెందమునందే విరాజమానవ్త్రై యుండగా"దేవుడు లేడు, కనుపించుట లేదు" (నాస్తి, నభాతి) అని ఏడుస్తూన్నారు. వారి దుఃఖమునకు అవధులు (సీమ) లేకుండెను. 3. ఇంతలో శ్రీకృష్ణుడు కాళీయుని మర్దించి బయటకు వచ్చెను. అతనిని చూసిన పిల్లలందఱు అంటున్నారు - అరెరే! అటు చూడుము. శ్రీకృష్ణుడు కాళీయుని మర్దించి (వాని మదమునణచి) పైకి వచ్చాడు. అదుగో! ఆప్రక్కన అగుపడుచున్నాడు - అని పరస్పరము (ఒకరికొకరు) చూపించు కొనుచుండిరి. 1. యమునా నది నుండి బయటకు వచ్చిన హరి గోపాలురందఱితో గళము (మెడ)తో గళము (మెడ)ను కలిపి ప్రేమతో దృఢాలింగనమొనర్చుకొనెను. 1. ధ్యానముచే యోగులకు గూడ అగమ్యమగు పరమాత్మ గోపాలుర యొక్క రొట్టెను అడుగుకొని తినుచున్నాడు. 3. అటువంటి దేవుడు తెలివైన వారికి చాలా దూరంగా ఉంటాడు. అనన్య మగు అమాయక భక్తులకు దాసుడై, వారిని పిలుస్తూ వెంటబడుతాడు. 4.

48. అభంగము :-

ఖేళతాం మురారీ జాయ సరోవరా తిరీం ।
తంవ నగ్నచీ నారీ తెథేం దేఖియేల్యా ।
మాండిలేం విందాన ఖ్యాల సుఖాచేం సంధాన ।
అంగ లపవునీ మాన పిలంగత చాలే ॥1॥

సాడ్యా సాఉలీం పాతళే గోండే కసణీయా చోళ్యా ।
బుంథీ ఘేఉనీ సకళాం కళంబావరీ పళే ।
ఖాందీ ఘాలునియాం కరీం । దృష్టీ ఘాలోనీ సామోరీ ।
బైసే పాలా ఓఢీవరీ । ఖదఖదా హాంసే ॥2॥

ఆనందే కల్లోళాం బాళా ఖేళతీ సకళా।
దేతీ ఉలటియా చపళా ఎకీ ఎకీహుని ।
మైస వేల సురకాడీ । ఎకీ నాగవితీ కోడీం ।
నానా పరీచా వికడీ । ఖేల మాండియేలా ॥3॥

ఎకీ ఆలియా బాహరీ । పాహే లుగడేం తంవ నారీ ।
మ్హణే నాహీం నేలేం చోరీ । కాయ జాణోం కేవ్హా।
కేలా సకళీ హాకారా । తంవ ఆలియా బాహెరా ।
ఆతా హ్మాణతీల ఘరా । జావేం కైశా పరీ ॥4॥

తంవహాంసే వనమాళీ । వరీ పాహెూ నీ సకళీ ।
లాజా రిఘాలియా జళీం । మాగే పుఢేంహోత ।
లాజ రాఖావీ గోపాళా । అమ్హా జణీంచీ సకళాం ।
కాయ మాగసీ యే వేళాం । దేఊ గుళవాటీ ॥5॥

ఖ్యాల మాండిలారే ఖ్యాల మాండిలారే ।
పాయా పడతాం న సోడీ నేదీ సాఉలారే ॥6॥

జోడోనియా కర । యా గే సకళీ సామోర ।
వాంయా న భోలావేంసార ॥
బడబడ కాంహీం భాతుకేం భూషణ ।
నాహీం చాడ నేఘే ధన । కరా ఏక చిత్త మన ।
యాగే మజపాశీం ॥7॥

ఎకా ఎకీకడే పాహే । లాజ సోడూనియాంరాహే ।
హ్మణే చలా ఆతాంసయే । జాఊం తయాపాశీం ।
జోడోనియా హాత । కైశా రాహిల్యా నివాంత ।
తుకా హ్మణే కేలీ మాత । లాజ రాఖిలీ తయాంచీ ॥8॥ (3788)

ప్ర.ప :- (ఒకనాడు) మురారీ = శ్రీకృష్ణుడు; ఖేళతాం = ఆడుచూ సరోవరా తీరీం = సరోవరము ఒడ్డునకు; జాయ = వెళ్ళెను; తంవ = అప్పుడు; తెథే = అక్కడ; నగ్నచీ నారీ = నగ్నముగా స్నానము చేస్తున్న కొంతమంది కన్నెలను; దేఖియేల్యా = చూచెను; (అప్పుడు శ్రీకృష్ణుడు ఇది) సంధాన = (సంధి) అవకాశముగా తలంచి; విందాన = (తన) చాతుర్యముచే; సుఖాచేం ఖ్యాల = (ఒక) వినోదపు చేష్ట; మాండలేం = రచించెను; (ఆకన్నెల యొక్క సకల వస్త్రములను ఎత్తుకొని) మాన = తల (వంచుకొని); అంగలపువూని = తన శరీరము యెవరికి కనబడకుండా దాచుకుంటూ; పిలంగత = పొంచి పొంచి; చాలే = (ఒకానొక కదంబ వృక్షంవైపు) వెళ్ళెను. 1. సాఉలీం = నల్లనయ్య (కృష్ణుడు); సాడ్యా, పాతళే, గోండే, కసణీయా, చోళ్యా బుంథీ = స్త్రీలు ధరించు చీరెలు మొదలగు వస్త్ర విశేషములు; సకళాం ఘే ఊనీ = అన్ని తీసికొని; కళంబావరీ పళే =

కదంబ వృక్షమునెక్కి (పైన); కరీం = ఒక చేయిని; ఖాందీ = చెట్టు కొమ్మపై; ఘాలునియాం = వేసి; సామోరీ = నగ్నకుమారికల వైపు; దృష్టీఘాలోనీ = చూస్తూ; వరీ = చెట్టుపైన; పాలా = ఆకులు; ఓఢీ = లాగుతూ (కొమ్మలు కదిలిస్తూ); బైసే = కూర్చొని; ఖదఖదా = ఫకఫక; హాంసే = నవ్వు చుండెను. 2. బాళా = ఆకుమారికలు (స్త్రీలు); సకళా = అందఱు; కల్లోళాం= ఎంతో కోలాహలము చేస్తూ; (ఆ సరస్సులో) ఆనందే = ఆనందముతో; ఖేళతీ = జలక్రీడలు చేయు చుండిరి; (కొందఱు) చపళా = చపలకన్నెలు; ఎకీ ఏకీహుని = ఒకరి పైబడి మరొకరు; ఉలటియా దేతీ = తలక్రిందులుగా జలములో దుముకు చుండిరి; (కొందఱు) మ్హైస = బఱ్ఱెల(వలె); వేల = ఆలస్యముగా (నెమ్మదిగా); సురకాడీ = ఈదు చుండిరి; ఎకీ = ఒకరు; వికడీ = చాలా చాతుర్యముతో (ఒకచోట మునిగి మరొక చోట తేలుతూ యితరులకు దొరుకకుండా); కోడీం = లోతుగా మునిగి; నాగవితీ = ఒకరినొకరు మోసము చేసుకొను చుండిరి; (ఇట్లు) నానా పరీచా = నానా ప్రకారములుగా; ఖేల = జలక్రీడలు; మాండియేలా = రచించి ఆడుచుండిరి. 3. (ఇంతలో) ఎకీ = ఒకరు; బాహరీ = బయటకు; ఆలియా= వచ్చి; లుగడేం = వస్త్రము (చీరెలు) కొఱకు; పాహే = చూచినది. (చీరెలు కనుపించలేదు); తంవ = అప్పుడు; నారీ మ్హణే = ఆమె యితరులతో ఇట్లనెను; (ఓ యమ్మలారా!) నా హీం = మన చీరెలు (వస్త్రములన్నియు) లేవు; చోరీ = ఎవడో ఒక దొంగ; నేలేం = దొంగిలించి తీసికెళ్ళాడు; కెవ్హా= ఎప్పుడు; కాయ = ఎట్లు; జాణోం = తెలియుదుము?; తంవ = అప్పుడు; సకళీ = అందఱు; బాహెరా = సరోవరము బయటకు; ఆలియా = వచ్చి; హాకారా = హాకారము; కేలా = చేసిరి; మ్హణతీల = పరస్పరము ఇట్లనుచుండిరి; ఆతాం = ఇప్పుడు; కైశాపరీ = ఏ విధముగా; ఘరా = ఇండ్లకు; జావేం = వెళ్ళుదుము? 4. తంవ = అప్పుడు; వనమాలీ = కృష్ణుడు;

సకళీ = ఆ భామలందఱి కోలాహలమును; వరీ = కదంబవృక్షముపై నుండి; పాహెూని = చూచి; హాఁసే = నవ్వుచుండెను; (అప్పుడు ఆ కుమారికలందఱు కృష్ణుని చూసి) లాజా = లజ్జచే; మాగే = వెనుక; పుఢేం= ముందు; హాత = చేతులతో శీలమును దాచుకుంటూ; జళీం = జలములో; రిఘాలియా = (కంఠము వరకు) ప్రవేశించిరి (మునిగిరి); (మరియు కృష్ణునితో నిట్లనిరి) గోపాళా = హే గోపాలా! ఆమ్హా సకళాం జణీంచీ = మా అందఱి యొక్క; లాజ = గౌరవమును; రాఖావీ = కాపాడుము; యే వేళాం = ఈ సమయమున; (నీవు) గుళవాటీ = బెల్లము= కొబ్బరి (ఇత్యాది); కాయ మగాసీ = ఏమి కోరెదవో (అది) దేఊ = ఇస్తాము. (కానిమా శీలము మాత్రము కాపాడుము). 5. పాయాపడతాం = కాళ్ళు మ్రొక్కినా (గాని); నసోడీ = (వస్త్రములను) వదలను; నేదీ = ఇవ్వను; (అని) సాఉలా రే = నల్లనయ్య (నిశ్చయించుకొని) ఖ్యాల మాండిలారే ఖ్యాల మాండిలారే = వినోదపు ఈ చేష్ట రచించెను. (అవదారణే వీప్సా). 6. (అప్పుడు కృష్ణుడంటున్నాడు = ఓ భామలారా!) వాంయా = వ్యర్థముగా; ఫార = చాలగా; కాంహీం = ఏమియును; బడ బడ న బోలావేం = బడబడ మాటలు మాట్లాడకండి; (మీ యొక్క) భాతుకేం = రుచికరమైన భోజనము; భూషణ = అలంకారములు; ధన = ఐశ్వర్యము; (నాకు) చాడ = ఇష్టము; నాహీం = లేదు; నేఘే = (నేను) తీసికోను; (మరేమనగా?) సకళీ = మీరందఱు; కర జోడోనియా = చేతులు జోడించుకొని; సామోర = నా యెదుటకు; యాగే = రండి; (మరియు నా యందు) ఏక చిత్త = ఏకాగ్ర చిత్తమును (మరియు); మన = మనస్సును; కరా = చేయండి (పిమ్మట); మజపాశీం = నావద్దకు; యాగే = రండి. 7. (ఇది విన్న వారందఱు) ఎకా ఎకీకడే = ఒకరికొకరు; పాహే = చూచుకొంటూ; హ్మణే = ఇలా అటున్నారు; సయే = ఓ సఖులారా!; రాహే = స్థిర చిత్తము గలిగి; లాజ సోడూనియాం=

సిగ్గు విడచి; ఆతాం చలా = ఇక పదండి; హాత జోడూనియా = చేతులు జోడించుకొని; తయాపాశీం = అతని వద్దకు; జా ఊం = పోయెదము; తుకాహ్మణే = శ్రీతుకోబారాయ్ అంటున్నాడు; కైశా రాహిల్యా = చిట్ట చివరకు; (వారు చేతులు జోడించుకొని) నివాంత = నెమ్మదిగా (కృష్ణుని సమ్ముఖమునకు వచ్చి నిలబడ్డారు. ఈ ప్రకారముగా శ్రీకృష్ణుడు) మాత కేలా = బుద్ధికౌశల్యముతో అద్భుతలీలను గావించి; తయాంచీ = వారియొక్క లాజ రాఖిలీ = గౌరవమును కాపాడెను. 8. (3788)

**తా॥** ఒక దినమున శ్రీకృష్ణుడు ఆడుతూ ఆడుతూ సరోవరము (యమునానది) తీరమునకు వచ్చెను. ఆ సరోవరములో కొందఱు గోపికా కుమారికలు (స్త్రీలు) నగ్నముగా స్నానము చేయుట చూచెను. ఇది అవకాశముగా దలంచిన గోపాలకృష్ణుడు బుద్ధి కౌశల్యముతో ఒక లీలను రచించెను. ఒడ్డున వదిలిన కుమారికలయొక్క చీరలు మొదలగు వస్త్రములన్నియు తీసికొని, తన శరీరమును యెవరికి కనిపించకుండా దాగి దాగి తలవంచి పొంచి పొంచి నడుస్తూ వెళ్ళి ఒక కదంబవృక్షముపై నెక్కను. "తాసాం వాసాంస్యుపాదాయ నీపమారుహ్యా సత్వరః" (భాగ. 10-22-9) ఆ గోపికల యొక్క వస్త్రములను ఎత్తుకొని తొందరగా ఒక కదంబవృక్షము నెక్కెను. 1. కదంబవృక్షము నెక్కి ఒక చేయిని కొమ్మపై వేసి కూర్చొని ఎదుట నదిలో నగ్నముగా స్నానము చేయుచున్న కన్నియలను చూస్తూ ఫకఫక నవ్వసాగెను. 2. గోపికలు - వస్త్రములనెత్తుకొని పోయిన సంగతి దెలియక నదిలో ఆనందముగా జలక్రీడలు చేయుచుండిరి. కొందఱు చపల కన్నెలు జలములో తలక్రిందులుగా దుముకు చుండిరి. కొందఱు బట్టెల వలె నెమ్మదిగా ఈదుచుండిరి. కొందఱు ఒక చోట మునిగి మరొక చోట తేలుచుండిరి. లోతుగా మునిగి మరొకరికి దొరుకకుండా ఒకరినొకరు మోసము చేసుకొను చుండిరి. ఈ విధముగా చాలా చాతుర్యముతో అనేక

విధములుగా జలక్రీడలు గావించుచూ కోలాహలము చేయుచుండిరి. 3. ఇంతలో ఒక కుమారిక సరోవరమునుండి బయటకు వచ్చి చూచింది. వస్త్రములు కనుపించకపోవడముతో యితరులతో అన్నది – ఓ యమ్మలారా! యెవరో మన చీరలెత్తుకెళ్ళారు. యెవరు, ఎప్పుడు, ఎట్లు దొంగిలించెనో దెలియకుండెను. ఈ మాటలు విన్న కుమారికలందఱు భయపడి బయటకు వచ్చిరి. మరియు ఆతురముతో – ఇప్పుడు మనము ఇండ్లకు ఎలా పోయేది – అని పరస్పరము అనుకొనుచుండిరి. 4. ఈ ప్రకారమగు వారి యొక్క హడావిడిని చూసి, కదంబ వృక్షముపై నున్న కృష్ణుడు నవ్వసాగెను. అందరి దృష్టి కన్నయ్య పైబడింది. కృష్ణున్ని చూసిన కుమారికలందఱు సిగ్గుతో వెనుక ముందు చేతులిడుకొని, త్వర త్వరగా నీటిలో కెళ్ళి కంఠము వరకు మునిగిరి. మరియు కృష్ణునితో ఈ విధముగా అనుచుండిరి – హే కృష్ణ! నీవు మా అందఱి గౌరవమును కాపాడుము. నీకేమి కావాలన్నా (బెల్లము, కొబ్బెర ఇత్యాది) ఇచ్చెదము, కాని, మా చీరెలు మాకివ్వుము. మా అంతు చూడకుము. 5. కాని, వారు కాళ్ళు మ్రొక్కినా వారికి వస్త్రములు ఇవ్వను అని నిశ్చయించుకొని నల్లనయ్య ఈ చమత్కారిక లీలను రచించెను. 6. అప్పుడు ఆ గోపికాకుమారికలతో కృష్ణుడు ఇలా అంటున్నాడు – ఓ భామలారా! మీరందఱు చేతులు జోడించుకొని నాయెదుటకు రండి. ఎక్కువగా వ్యర్థమైన బడ బడ మాటలు మాట్లాడకండి. నాకు మీయొక్క భోజనము, భూషణములు మరియు ఐశ్వర్యము వలదు. మీరిచ్చినా నేను తీసికోను. నా యందు చిత్తమును లగ్నము చేసి, మనస్సును ఏకాగ్రము చేసి నా చెంతకు రండి. మీ వస్త్రములిచ్చెదను. 7. శ్రీ తుకోబారాయ్ అంటున్నాడు – కన్నయ్య మాటలు విన్న గోపికలు ఒకరినొకరు చూచుకొని, ఇలా అనుకొనుచుండిరి – ఓ సఖులారా! పదండి. సిగ్గు విడిచి కృష్ణుని వద్దకు వెళ్ళెదము. గత్యంతరము లేదు. చిట్టచివరకు అందఱు చేతులు

జోడించుకొని నెమ్మదిగా వచ్చి నల్లనయ్య ముందు నిలబడ్డారు. ఈ విధంగా కృష్ణుడు తన బుద్ధికౌశల్యముతో చమత్కారమగు లీలను గావించి, వారి వస్త్రములు వారికిచ్చి గౌరవమును గాపాడెను. 8.

**సు.వ్యా :-**1. చీరహరణమను లీలను గావించి శ్రీకృష్ణపరమాత్మ (నవనీత చోరుడు), భగవంతుని మహిమ నెఱుంగక మరియు పూర్వాపర విచారణ చేయక దుష్ప్రచారము చేయునవిచారబాలురయొక్క నిందకు గురయ్యాడు. సచ్చిదానంద ఘన భగవంతుని దివ్య మధుర రసమయ లీలలయొక్క రహస్యము నెఱుంగు సౌభాగ్యము - యే కొద్ది మందికే లభించును. పరమ పవిత్ర హృదయములు, క్షణకాల వియోగమును గూడ భరించలేని అనన్య ప్రేమికులగు గోపికలకు మాత్రమే భగవంతుని మధురమగు దివ్యాతిదివ్యమైన పరమ గోప్యమగు లీలారహస్యము దెలియును.

**1. శ్లో॥** దేహాభిమానే గళితే విజ్ఞాతే పరమాత్మని ।
యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర సమాధయః ॥
(సరస్వతీ రహస్యోపనిషద్)

**అర్థము :-** దేహాభిమానము గళితము (నాశనము) అయ్యి, పరమాత్మ యొక్క యథార్థ (అభేద) జ్ఞానము కలిగినప్పుడు మనస్సు ఎక్కడెక్కడ వెళ్ళితే అక్కడక్కడ (చిన్మాత్ర వాసనా సద్భావముచే) ఆకాశరూప లక్ష్యము నందు వదిలిన బాణము వలె స్వరూపము యొక్క భానము చేత సమాధులే కలుగును. (ఇది ఒక అర్థము)

**ద్వితీయార్థము :-** దేహాభిమానము నశించక, పరమాత్మ జ్ఞానము గలుగకున్నచో, యెక్కడెక్కడ మనస్సు వెళ్ళునో అక్కడక్కడ సమ్యక్ ఆధులు (మానసిక వ్యథలు) కలుగును.

శ్లో॥ దేహాభిమాన పాశేన చిరం బద్ధోఽపి పుత్రక! ।
బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీ భవ ॥
(అష్టావక్ర గీత 1-14)

అర్థము :- హే పుత్రక! ఓ జనకా! నీవు దేహాభిమానమను త్రాటిచేత చిరకాలము నుండి కట్టబడినావు. నేను జ్ఞాన స్వరూపుడనను జ్ఞాన ఖడ్గముచేత ఆ పాశమును త్రెంచి సుఖివి కమ్ము.

ఇత్యాది శ్రుతిస్మృతి వచనానుసారము దేహాభిమానము జన్మమరణ రూప సంసారమునకు నిదానమని తెలియబడుచున్నది.

2. శ్లో॥ యేతు సర్వాణి కర్మాణి మయి సన్యస్య మత్పరాః ।
అనన్యే నైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ॥

శ్లో॥ తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి న చిరాత్పార్థ! మయ్యావేశితచేతసామ్ ॥ (గీత 12-6,7)

అర్థము :- కాని, యెవరు సంపూర్ణ కర్మలను నాకు సమర్పించి, నాయందే తత్పరులై అనన్య భావరూపయోగము చేత నా ధ్యానము చేస్తూ ఉపాసిస్తారో, హే అర్జున! నా యందు చిత్తమును సమర్పించి ఉపాసించు అనన్య భక్తుల యొక్క మృత్యురూప జన్మమరణ సంసారమను అగాధ అపార సాగరము నుండి నేను ఉద్ధరించు వాడనగుచున్నాను. అని శ్రీకృష్ణ వచనము.

3. ఇక గోపకుమారికలయొక్క పరిస్థితిని పరికింప -

కం॥ ఓ కాత్యాయని! భగవతి!
నీకును మ్రొక్కెదము మేము నేఁ డనుకంపన్ ।
మీకిందఱకును వైళమ
శ్రీకృష్ణుడు మగడు గాఁగఁ జేయుము తల్లీ! ॥
(పోతన భాగవతము 10-22-806)

శ్లో॥ నద్యాం కదాచిదాగత్య తీరే నిక్షిప్య పూర్వవత్ ।
వాసాంసి కృష్ణం గాయన్త్యో విజహ్రుః సలిలే ముదా ॥
(భాగ. 10-22-7)

అర్థము :- ఒక రోజున గోపకన్నియలందఱు ప్రతిదినము వలెనే యమునా తటమునకెళ్ళి వారివారి వస్త్రములను వదలి, శ్రీకృష్ణ భగవంతుని యొక్క గుణ గానము చేస్తూ, నగ్నలై అమితానందమగ్నలై జలక్రీడా నిమగ్నలైరి.

కావున, శ్రీకృష్ణనే మాకు పతిగా జేయుమని మాసము దినములు కాత్యాయనీ (భద్రకాళి) దేవిని సమభ్యర్చించి, సచ్చిదానంద ఘనుడగు ఘన శ్యాముని దివ్య మధుర రసమయమగు మహిమలను, అచ్యుతాసక్త చిత్తలై నిత్యనిరంతర ఆదరపూర్వకముగా తన్మయులై గానము చేస్తూ, తమ సర్వస్వమును శ్రీకృష్ణ చరణారవిందములకడ తిలాంజలులు సమర్పించిన అనన్యోపాసకులగు నిర్మలాంతఃకరణలగు గోపికారమణుల (3)లో జన్మమరణరూప సంసారమునకు నిదానము (కారణము)అగు అనాది యనిర్వచనీయ ఆవరణ విక్షేప శక్తులు గల భావరూప పదార్థమగు అజ్ఞాన శబ్ద పర్యాయ వాచియగు దేహాభిమానమను (మోక్షప్రతిబంధకమగు దేహ వాసనయను) త్రుటిని (న్యూనతను) (1) గమనించి, సర్వస్వమును తనయందు సమర్పించి, నిరంతరము అనన్య భావముతో భజించు భక్తులను (ఉపాసకులను) మృత్యు సంసారము నుండి ఉద్ధరించు ప్రతిజ్ఞా పరిపాలకుడగు (2) గోపికారమణుడు గోపికా కుమారికలలోగ మోక్షప్రతిబంధకమగు దేహాభిమానమును నిర్మూలనము చేసినాడనునదియే చీర హరణరూప లీలా రహస్యమని యెఱుంగవలయును.

2. నగ్నముగా స్నానము చేయుట లోకవిరుద్ధము మరియు శాస్త్రనిషిద్ధము. ప్రతి వస్తువులో ఆయా అధిష్ఠానదేవత ఉంటాడనేది భారతీయ

ఆర్షసిద్ధాంతము. జలాభిమాని దేవత వరుణుడు. నగ్నముగా స్నానమాచరించుట యేది గలదో, అది వరుణదేవుని యవమానించుట యగును. కావున నది దోషావహమగును.

శ్లో॥ స్నానం దానం తథా హోమం శయనం గమనం భుజిమ్ ।
వివస్త్రో న ప్రకుర్వీత కుర్వాణః పాపకృద్భవేత్ ॥ (వంశీధరి-లో)

**అర్థము** :-స్నానము, దానము, హోమము, శయనము (నిద్రించుట), గమనము మరియు భోజనము మొదలగునవి నగ్నముగా చేయగూడదు. చేసినచో పాపకారి యగును - అని శాస్త్రవచనము.

అభీష్టసిద్ధి కొఱకు గోపికలు యేదైతే తపస్సు చేయుచున్నారో, దానికి విరుద్ధముగా యీ నగ్నస్నానము అనిష్ట ఫలదాయకమగును. తన యనన్య భక్తులు పరమార్థమార్గము నుండి పతితులగుటకిష్టపడని కిష్టయ్య వారి ననుగ్రహించుట కొఱకు మరియు వరుణదేవునికి యవమానము జరిగినందు వలన దానికి గోపికల చేత అంజలి ఘటించి క్షమాప్రార్థనారూప ప్రాయశ్చిత్తమును గూడ యీ దివ్యలీల ద్వారా చేయించెను. నగ్నముగా స్నానమాచరించు దురాచారమును నష్టము జేసెను.

3. చీర హరణము శ్రీకృష్ణుని తొమ్మిదవ యేట జరిగినది. రాసలీల పదవ యేట జరిగినది. శ్రీకృష్ణుడు పదునొకండు సంవత్సరముల వరకే వ్రజకులములో నివసించెను. కావున, ఒక సామాన్య మానవ దృష్టితో విచారించినను యింత చిన్న వయసులో కామోత్తేజనము, అవైధ సంబంధము సర్వథా అనుపపన్నమగును.

4. అధ్యాత్మ దృష్టికోణము నుండి చూసినా - జ్ఞాని పురుషులు శ్రీకృష్ణుని తమ ఆత్మ (స్వరూపము)గా మరియు గోపికలను వృత్తులుగా

చూస్తారు. వృత్తులయొక్క ఆవరణమును నష్టము చేయుటయే "చీరహరణ"లీల, అత్మయందు రమించుటయే "రాసలీల". ఈ దృష్టి చేత గూడ భగవంతుని సమస్త దివ్య లీలల యొక్క సంగతి యసంగతము గాదు. భగవంతుని లీలలను, వాటి రహస్యమును నిరంతరము చింతించు సాధకునియొక్క అంతఃకరణస్థ అనాది వాసనాజాలము తత్కారణాజ్ఞానము దగ్ధమై, కృష్ణునియొక్క అనగా సచ్చిదానందప్రత్యగభిన్న పరమాత్మయొక్క సాక్షాత్కారముచే సాధకుడు ముక్తి నొందుటయే శ్రీకృష్ణలీలలయొక్క పరమ రహస్యము. ఇంతదనుక శాస్త్రము మరియు సత్పురుషులయొక్క దివ్యవాణి ఆధారముగా నుపలక్షణముచే కృష్ణ లీలల రహస్యమును గూర్చి యథామతిగా కించిద్విచారము చేయునైనది.

49. అభంగము :-

తో హా సాచ భావ న కళే చి ఇంద్రా ।
హ్మణ ఊనీ ధారా ఘాలీ మేఘ ॥1॥

వేదావలీం కాయ కరావేం యా కాళీం ।
హ్మణే వనమాళీ గోపాళాంసీ ॥1॥

గోవర్ధన ధరూం శిరీం ఉచలూనీ ।
హ్మణే తుమ్హీ కోణీ భిఊం నకా ॥2॥

పర్వతాసీ హోత లావిలా అనంతేం ।
తో జాయ వరతేం ఆపోఆప ॥3॥

ఆపల్యా ఆపణ ఉచలిలా గిరీ ।
గోపాళ హే కరీ నిమిత్తాసీ ॥4॥

నిమిత్త కరూనీ కరావే కారణ ।
కరితా ఆపణ కళోం నేదీ ॥5॥

కృపావంతేం హోక దిలీ సకళికాం ।
మాజీ యారే నకారాహెూం కోణీ ॥1॥

నిఘాలే యా భేణేం పా ఊసాచ్యా జన ।
దేఖే గోవర్ధన ఉచలిలా ॥2॥

జిహీం హ్మణిలేం హరీచే అంకిత ।
జాతీచే తే హెూత కోణీతరీ ॥3॥

జాతి కుళ నాహీం తయాసీ ప్రమాణ ।
అనన్యా అనన్య తుకా హ్మణే ॥4॥

విచారితాం ఉచలిలా గోవర్ధన ।
అవతార పూర్ణ కళోం ఆలా ॥1॥

ఆలా గౌళియాంచా ఘరా నారాయణ ।
కరితో స్తవన ఇంద్ర త్యాంచేం ॥2॥

(3857 నుండి 3860) మరియు (3872)

ప్ర.ప :- తో హా = అ ఈ (శ్రీకృష్ణుడు గోకులములో ఉన్నాడు అను) ; సాచభావ = వస్తుస్థితి; ఇంద్రా = ఇంద్రునికి; నకళేచి = తెలియకుండెను; హ్మణ ఊనీ = అందువలన; మేఘధారా ఘాలీ = (ఇంద్రుని ఆజ్ఞచే) మేఘములు శిలావృష్టిని కురియుచుండెను. 1. (3857). (సకల జనులు) వేడావలీం = దిక్కుదోచనివారై; యాకాళీం = ఇప్పుడు; కాయకరావేం = ఏమి చేయాలో (తెలియకుండిరి. అప్పుడు); వనమాళీ = గోపాలకృష్ణుడు; గోపాళాంసీ = గోపాలురతో; హ్మణే = ఇట్లనెను. (1) (నేను)

గోవర్ధన = గోవర్ధన గిరిని; ఉచలూనీ = ఎత్తి; శిరీం = ధరూం = శిరమున ధరించెదను. తుమ్హీ = మీరు, కోణీ = ఎవరు గూడ; భిఊ నకా = భయపడకండి; (అని) హ్మణే = అనెను. (2). (3858). (తదనంతరము) అనంతేం = అనంతుడగు శ్రీకృష్ణుడు; పర్వతాసీ = గోవర్ధన పర్వతమునకు; హాత లావిలా = చేయి తగిలించిన (వెంటనే); తో = ఆ పర్వతము; ఆపో ఆప = తనంతటతానే; వరతేం జాయ = పైకి లేచెను. 3. (కృష్ణుడు) ఆపల్యా ఆపణ = తన సామర్థ్యముతోతాను; గిరీ = గోవర్ధనమును; ఉచలిలా = పైకి లేపెను; (కాని) గోపాళ = గోపాలురను; నిమిత్తాసీ = నిమిత్తమాత్రమునకు; హే కరీ = మీరు కూడ చేతులు మోపండి అని చెప్పెను. 4. (శ్రీకృష్ణుడు ఎవరినైనా) నిమిత్త కరూనీ = నిమిత్తముగా జేసి; కారణ కరావే = కార్యము చేయును; ఆపణ కరితా = తాను చేస్తున్నది; (ఎవరికి) కళోం నేదీ = తెలియనివ్వడు. 5. (3859) కృపావంతేం = కృపాసాగరుడగు భగవంతుడు; సకళికాం = గోపాలురందఱికి; హాక దిలీ = పిలిచాడు; (ఏమనగా) కోణీ = ఎవరుగూడ; రాహెూం నకా = బయట నిలబడకండి; మాజీం యారే = గోవర్ధన పర్వతము క్రిందకురండి. 1. గోవర్ధన = గోవర్ధన గిరిని; ఉచలిలా = (కృష్ణుడు) పైకెత్తుట; దేఖే = చూచి; జన = సకల గోపాలురందఱు; యా పాఉసాచే = ఈ వర్షము యొక్క; భేణే= భయముచే; నిఘాలే = గోవర్ధనము క్రిందకు ఆశ్రయము కోసము బయలు దేరిరి. 2. జిహీం = ఎవరు (స్వయముగా); హరీచే = హరియొక్క; అంకిత = ఆజ్ఞాధారక దాసుడను అని; హ్మణిలే - అనిపించు కున్నారో; తే= వారు; కోణీజాతీచే హెూత = ఏజాతికి చెందిన వారైయున్నను; తరీ = అయినప్పటికిని (వారందఱకును భగవంతుడు ఆశ్రయము నిచ్చెను.)3. తుకా హ్మణే = శ్రీతుకోబారాయ్ అంటున్నాడు; తయాంసీ = భగవంతునికి; జాతి, కుళ = జాతిగాని, కులముగాని; ప్రమాణ నాహీం = ప్రమాణము

(సమ్మతము) గాదు; అనన్యా = అనన్య భక్తులతో (తాను); అనన్య = అనన్యుడై యుంటాడు. 4. (3860). (ఇంద్రుడు) విచారితాం = విచారించినపుడు (అతనికి తెలిసింది); ఉచలిలా గోవర్ధన = శ్రీకృష్ణుడు) గోవర్ధన గిరిని ఎత్తినాడని; (అప్పుడు ఇంద్రునికి) కళోం = ఆలా = తెలిసి వచ్చినది (ఏమనగా); పూర్ణ అవతార = (కృష్ణుడు) పూర్ణావతారుడని. 1. ఇంద్ర = ఇంద్రుడు; త్యాంచే గౌళియాంచే = ఆ గొల్లల యొక్క (నందుని యొక్క) ఘరీ ఆలా = ఇంటికి వచ్చెను; నారాయణ స్తుతి కరితో = నారాయణుని స్తుతించెను. 2. (3872)

**తా॥** గోకులములో నున్న శ్రీకృష్ణునియొక్క "ఈశ్వరత్వము" అభక్తుడు మరియు అభిమానియగు యింద్రునికి తెలియనందువలన కోపముతో భయంకరమగు శిలావృష్టిని కురిపింప దొడంగెను. 1. (3857)

**సు.వ్యా :- శ్లో॥ వాచాలం బాలిశం స్తబ్ధమజ్ఞం పండితమానినమ్ ।**
**కృష్ణం మర్త్యముపాశ్రిత్య గోపా మే చక్రురప్రియమ్ ॥**
(భాగ. 10-25-5)

**అర్థము :-** కృష్ణుడు - వదురుబోతు, అతిబాలుడు, అభిమాని, మూర్ఖుడు అయినను నేను గొప్ప జ్ఞానిని యని యనుకొనువాడు, తాను స్వయముగా మృత్యువునకు కబలమై యున్నాడు. అయినప్పటికిని ఈ గొల్లలు అతని సహాయమును తీసికొని (ఆశ్రయించి) నన్ను అవహేళనము చేసిరి.

అని తన పూజకు విఘ్నము కలిగించిన కోపముతో సాంవర్తకమను మేఘగణమును పిలిచి వ్రజకులమును సర్వనాశనము చేయండి అని ఆజ్ఞాపించెను.

శ్లో॥ ఇత్థం మఘవతాఽఽజ్ఞప్తా మేఘా నిర్ముక్త బంధనాః ।
నందగోపకుల మాసారైః పీడయామాసురోజసా ॥
(భాగ - 10- 25- 8)

అర్థము :- ఈ ప్రకారముగా ఇంద్రుడు ప్రళయమేఘములను ఆజ్ఞాపించి వ్రజకులముపై వదిలెను. (ప్రళయము చేయుటయే మేఘముల యొక్క నిర్ముక్తత్వము). అప్పుడు ఆ మేఘసమూహము నందగోపకులము నాక్రమించి, భయంకరమైన జలధారసంపాతములచే (వడగండ్లవాన) వర్షము కురియ దొడఁగెను. 1. (3857).

ఆ భయంకరవర్షముచే గోపాలుర విచారశక్తి కుంఠితమై, పిచ్చివానివలె దిక్కుదోచక కర్తవ్యవిమూఢులైరి. అప్పుడు వారిని గూర్చి భగవంతుడు ఇలా అన్నాడు. 1. మీరెవ్వరు భయపడకండి. నేను శిరమున గోవర్ధన గిరిని ధరించెదను. 2. (3858)

సు.వ్యా :- శ్లో॥ అత్యాసారాతివాతేన పశవో జాతవేపనాః ।
గోపా గోప్యశ్చ శీతార్తా గోవిందం శరణం యయుః ॥
(భాగ. 10-25-11)

అర్థము :- ఈ ప్రకారముగా భీకర ఝంఝా మారతము మరియు మూసలధార వర్షము (శిలావృష్టి)చే చలికి వణకు బట్టి పశువులు కంపాయమానమగుచుండెను. గోపాలురు, గోపికలు గూడ భరించలేని చలిచే నత్యంతవ్యాకులురై గోవిందుని శరణు జొచ్చిరి.

ఉ॥ అక్కట! వానఁ దోఁగి వ్రజమాకులమయ్యె గదయ్య! కృష్ణ! నీ
విక్కడ నుండి యింతతడవేల వహించితి నీ పదాబ్జముల్
దిక్కుగ నున్న గోపకులు దీనతనొంద భయాపహారి వై
గ్రక్కున గావ కిట్లునికి కారుణికోత్తమ! నీకుఁ బాడియే.

కం॥ ఈ యుఱుములు నీమెఱుములు,
నీ యశని విఘోషణములు నీ జలధారల్
నీ యాన తొల్లి యెఱుఁగము
కూ యాలింపం గదయ్య! గుణరత్ననిధీ!

(పోతన భాగ. 10-25-903-904)

ఈ విధమగు గోపాలుర మొరనాలకించి, సర్వజ్ఞుండైన కృష్ణుండంతయు నెఱింగి-

శ్లో॥ శిలావర్షనిపాతేన హన్యమానమచేతనమ్ ।
నిరీక్ష్య భగవాన్ మేనే కుపితేంద్ర కృతం హరిః ॥

(భాగ. 10-25-14)

అర్థము :- వడగండ్లవానచే పీడితులై స్మృతి తప్పిన గోపాలుర దశను నిరీక్షించిన భగవంతుడు – "తన యజ్ఞమును కొనసాగించని నెపమున క్రుద్ధుడైన యింద్రుడే" యీ ఘోరవిపత్తునకు కారణమని యెఱింగెను.

మరియు గోవిందుడిట్లు యోచించెను -

శ్లో॥ తస్మాచ్ఛరణం గోష్ఠం మన్నాథం మత్పరిగ్రహమ్ ।
గోపాయే స్వాత్మయోగేన సోఽయం మే వ్రత ఆహితః ॥

(భాగ. 10-25-18)

అర్థము :- ఈ సమస్త వ్రజకులము నన్నాశ్రయించినది. నాచే స్వీకరింపబడినది. మరియు నేను మాత్రమే దీనికి (గోకులమునకు) రక్షకుడను. కావున, నా యోగమాయచే దీనిని రక్షించెదను. "సత్పురుషులను రక్షించుట నావ్రతమై" యున్నందున, అట్టి యవసరము యిప్పుడేతెంచినది.

**శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ ॥**
(శ్రీమద్వాల్మీకి రామాయణము 6-18-33)

**అర్థము** :- ఎవరు ఒకసారి మాత్రము నన్ను శరణు జొచ్చునో, మరియు "నేను నీవాడను" అని యాచించునో, అతనికి నేను సమస్త ప్రాణుల నుండి అభయమొసంగెదను. ఇది నా "వ్రతము"న్నది.

ఈ ప్రకారముగా తన వ్రతమును పాలించుటకును - మరియు ఇంద్రుని గర్వభంగమొనర్చుట కొఱకును బాగుగా విచారించి భగవంతుడు గోపాలురతో యిట్లనెను. ఓ గోపాలులారా! మీరెవ్వరు భయపడకండి. మిమ్ములను యీ ఘోర విపత్తునుండి కాపాడుట కోసము - యిదుగో! ఈ గోవర్ధనమును నా శిరమున యెత్తి నిలిపెదను - అని అభయమిచ్చెను. (3858).

ఈ విధముగా వాగ్దానము చేసి, అనంతుడగు గోవిందుడు గోవర్ధన గిరికి చేయిని మోపిన తోడనే తనంతట తానే (పర్వతము)పైకి లేచెను.

**సు.వ్యా :- కం॥ కిరి యై ధర యెత్తిన హరి,**
**కరి సరసిజ ముకుళమెత్తుగతి c ద్రిభువన శం-**
**కరకరుడై గోవర్ధన,**
**గిరి యెత్తెం జక్కనొక్క కేలన్ లీలన్ ॥**
(పో.భా. 10-25-912). 3.

యోగేశ్వరుడగు కృష్ణుడు తన యోగమాయా సామర్థ్యము చేత గోవర్ధనమును పైకెత్తినాడు. అయినను మీరు గూడ గోవర్ధనమునకు చేతులు పెట్టండి అని గోపాలురనుద్దేశించి (నిమిత్త మాత్రులుగజేసి) చెప్పెను. 4.

భగవంతుడు తరచుగా యేదైన కార్యమును యెవరినైన నిమిత్తమాత్రముగ ముందుంచి, తన సామర్థ్యమెవరికిని దెలియకుండ,తానే స్వయముగా యుక్తితో చేస్తాడు. ఉదా - అర్జునుని నిమిత్తముగా (జేసి దుర్యోధనాదులను నాశనము చేసినాడు. "నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్" (గీత. 11-33). హే అర్జున! నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము.5. (3859)

"మీరెవరు గూడ బయట ఉండకండి, అందరూ గోవర్ధనము క్రిందకు రండి" అని కరుణాసముద్రుడగు శ్రీకృష్ణచంద్రుడు అందరిని పిలిచి చెప్పెను.1. అప్పుడు గోవిందుడు గోవర్ధనము నెత్తినది గాంచి, వర్షభీతిచే స్వస్వ రక్షణార్థము గోవర్ధనగిరి నాశ్రయించిరి - అనగా అధ్యస్తము అధిష్ఠానము నాశ్రయించి యుండునట్లు సర్వాధిష్ఠానమైన సచ్చిదానందఘన పరమాత్మయగు శ్రీకృష్ణుని ఆశ్రయించిరి2.

సు.వ్యా :- ఈ సన్నివేశమును శ్రీపోతనామాత్యులు చిత్రీకరిస్తూ :-

ఇట్లు గోత్రంబు (గిరిని) ఛత్రంబుగా (బట్టి, గోపజనులకు గోపాల శేఖరుండిట్లనియె. (పో.భాగ. 10-25-916)

కం॥ రా తల్లి! రమ్ము తండ్రీ!
వ్రేతలు గోపకులు రండు విను(డీ గర్త
క్ష్మాతలమున నుండు(డు గో-
వ్రాతముతో మీరు మీకు వలసిన యెడలన్ ॥ (917)

శా॥ బాలుండీతడు కొండ దొడ్డది మహాభారంబు సైరింప(గా
జాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింప(గా( బోలదీ
శైలాంభోనిధి జంతు సంయుత ధరాచక్రంబుపై( బడ్డ నా
కే లల్లాడదు బంధులార! నిలు(డీ క్రిందన్ బ్రమోదంబునన్. (918)

ఇట్లు పలుకు చున్న హరి పలుకులు విని, నెమ్మనముల నమ్మి, కొండయడుగునఁ దమతమ యిమ్ములం బుత్ర మిత్ర కళత్రాది సమేతులై, గోవులుం,దారును, గోపజనులు, జనార్దన కరుణా విలోకనామృత వర్షంబున నాఁకలి నీరు దప్పుల చొప్పెఱుంగక, కృష్ణ కథా వినోదంబుల నుండిరి. (919).

**జిహీం హ్మణిలేం హరీచే అంకిత ।**
**జాతీచే తే హెూత కోణీ తరీ ॥3॥**

**జాతి కుళనాహీం తయాసీ ప్రమాణ**
**అనన్యా అనన్య తుకాహ్మణే॥ 4 ॥** (3860)

యెవరు స్వతః హరియొక్క ఆజ్ఞాధారక దాసుడను అని యనిపించుకొనిరో, వారు యే జాతి వారైనప్పటికిని, వారందటికి దేవుడు ఆశ్రయమిచ్చెను. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు – పారమార్థిక క్షేత్రములో భగవంతునికి జాతి, కులము మొదలగునవి ప్రామాణికములు గావు. మరేమనగా అనన్య భక్తునితో తాను అనన్యుడయిపోతాడు.

**సు.వ్యా :–** ప్రత్యగభిన్న పరమాత్మ యగు జనార్దను (కృష్ణు)ని జప, ధ్యాన, భజన మరియు విచారము చేయుటకు వర్ణాశ్రమ వయోఽవస్థాదులు ప్రతిబంధకములు గావు. ఈ జాత్యాదులు భగవంతునికి (ఆత్మకు) లేవు. వర్ణాశ్రమ విచక్షణ లేకుండా యెవరైననూ భగవంతున్ని చేరుకోవచ్చు (ఆశ్రయించవచ్చు). 1. విచారించి చూచినచో ఈ జాత్యాదులు దేహాదులకు గూడ సిద్ధించుట లేదు. ఇక ఆత్మకు (భగవంతునికి) ఉంటాయా? కైముతిక న్యాయముచే ఉండవు అని అర్థము. "జాతిరితి చ న చర్మణో న రక్తస్య న మాంసస్య న చాస్థినః । న జాతిరాత్మనో । జాతిర్వ్యవహార ప్రకల్పితా"॥ (నిరాలంబోపనిషత్ – 10) జాతి యనునది శరీరము యొక్క

చర్మము, రక్తము, మాంసము మరియు యెముకలు మొదలగు వాటికి లేదు. ఆత్మకు గూడ అత్యంతాభావమున్నది. మానవత్వ, పశుత్వ, పక్షిత్వ, బ్రాహ్మణత్వ మరియు క్షత్రియత్వాదిజాతులు వ్యవహారము కొఱకు పరికల్పించబడినవి – అని ఉపనిషదుద్ఘోషిస్తున్నది.

2. శ్లో॥ మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాంగతిమ్ ॥
(గీత 9–32)

అర్థము :– హేపార్థ! ఎవరు పాపజన్మము (నీచజన్మము)గల వారై యుందురో, వారును, స్త్రీ,వైశ్య, శూద్రులు గూడ నన్నాశ్రయించి సర్వోత్కృష్ట పదవిని (మోక్షమును) పొందుచున్నారు – అని శ్రీకృష్ణపరమాత్మ లింగభేదము గాని, జాతి భేదముగాని నన్ను పొందుటకు అడ్డు రాదని నుడివిరి.

శ్లో॥ పుంస్త్వే స్త్రీత్వే విశేషో వా జాతి నామాశ్రమాదయః ।
న కారణం మద్భజనే భక్తిరేవ హి కారణమ్ ॥

శ్లో॥ యజ్ఞ దాన తపోభిర్వా వేదాధ్యయన కర్మభిః ।
నైవ ద్రష్టుమహం శక్యో మద్భక్తి విముఖైస్సదా ॥
(అధ్యాత్మ రామాయణము – అరణ్యకాండము. 10–20–21)

యుగ్మకార్థము :– శ్రీరామచంద్రుడంటున్నాడు = ఓ భామిని! (శబరీ!) పురుషత్వ, స్త్రీత్వభేదము గాని లేక జాతినామము, అట్లే ఆశ్రమము ఇవి యేవి గూడ నా భజనకు హేతువులు గావు. దానికేకైకకారణము నాయొక్క అనన్య భక్తియే. ఎవరు నా భక్తి చేయక విముఖులై యుందురో, వారు యజ్ఞము, దానము, తపము లేక వేదాధ్యయనాది యే కర్మ చేత గూడ నన్ను చూడలేరు (సాక్షాత్కరించు కొనలేరు).

3. ఒకానొకప్పుడు శ్రీ శంకరుని పరిపూర్ణతత్త్వజ్ఞానమును పరీక్షింపగోరి, పరమకరుణానిధియగు శంకరుడు చండాలవేషధారియై కాశీ పత్తన వీథియందు పోవుచు శ్రీశంకరాచార్యులను సమీపించిరి. అప్పుడు శ్రీశంకరాచార్యులవారు చండాల వేషధారి యగు శంకరుని గాంచి దూరముగా తొలగుము! తొలగిపొమ్ము! అని చెప్పిరి. పిమ్మట ప్రసన్నమూర్తియు భగవంతుడునగు శ్రీసాంబసదాశివ మూర్తి వారితో నిట్లు పలికెను.

శ్లో॥ అన్నమయాదన్న మయమథవా చైతన్య మేవ చైతన్యాత్ ।
యతివర దూరీకర్తుం వాంఛసి కిం బ్రూహి గచ్ఛ గచ్ఛేతి ॥

**అర్థము :-** "స వా ఏష పురుషోఽ న్నరసమయ ఇతి" (తై.ఉ. 2-1-1) అను శ్రుతి వాక్యానుసారముగ శరీరమన్నమయము గావున నీ శరీరమెట్లన్న - వికారమయినదో, అట్లు నా శరీరము గూడ నన్న వికారమయినది. కాబట్టి మన యిద్దఱి దేహములు నొకే విధమయినవి. ఇట్లుండగా నీ దేహము మాత్రము శుచియైనది, నా దేహమశుచియైనదా! లేదా మన యిద్దఱి కాయములు శుచియైనవా! నన్ను తొలగి పొమ్మనుట యుచితముగాదు. ఒకవేళ నా దేహము మాత్రమశుచి యని పొమ్మనెదవా! నీ దేహము గూడ నట్లశుచియై యున్నది. కావున శరీర దృష్ట్యా నన్ను దూరముగ పొమ్మనుట నీకు ధర్మముగాదు. "ఏకోదేవః సర్వభూతేషు గూఢ స్సర్వ వ్యాపి సర్వభూతాన్తరాత్మ" (శ్వే.ఉ. 6-11) అనెడు శ్రుతి వచనానుసారము చైతన్య స్వరూపమగు నంతరాత్మ పిపీలికాది బ్రహ్మాదేవుని పర్యంతము సర్వదేహములందు నేకరీతిగ నుండుచు సర్వసాక్షియై యుంటున్నాడు. ఆ పరిపూర్ణమగు ప్రత్యగాత్మ అచలము. ఒకచోట నుండి మరొక చోటుకు పోవునది గాదు. కావున నో యతివరా! శరీరమును

దూరముగ పొమ్మనెదవా! మన యిద్దఱి శరీరము లొకే విధమై యున్నవి. చైతన్యమగు నాత్మను దూరీకరింతువా! ఆ యాత్మ యచలమై యందఱిలో నొకే విధమున నుండునది. అందుకే "దూరం గచ్ఛ" యను ఉక్తి సయుక్తికము గాదు, సప్రమాణకముగాదు. కావున మీ బోటి వారికిది ధర్మము గాదు. బాగుగా నాలోచించి దేనిని దూరముగ పొమ్మనెదవో చెప్పుము.

శ్లో॥ ప్రత్యగ్వస్తుని నిస్తరంగ సహజానందావబోధామ్బుధౌ
విప్రోఽయం శ్వపచోఽయ మిత్యపి మహాన్ కోఽయం విభేద భ్రమః।
కిం గంగామ్బుని బింబితేఽమ్బరమణౌ చండాల వీథీపయః
పూరేవాన్తరమస్తి కాంచన ఘటీ మృత్కుమ్భయోర్వాఽమ్బరే ॥

**అర్థము :-** అలలులేని మహాసముద్రమువలె నిర్వికల్పము, అఖండము, పరిపూర్ణమైన పరబ్రహ్మమునందు వీడు బ్రాహ్మణుడు వీడు చండాలుడను మొదలుగాగల భేదము లెక్కడివి? మరియు పరమ పవిత్రమగు గంగాజలమునందు ప్రతిబింబిత సూర్యునకును చండాలుని వీథియందు పోవు మురికి జలధార నీళ్ళలో ప్రతిఫలించు భాస్కరునకు భేదము లేనట్లు నీయంతః కరణము నందు ప్రతిఫలించిన పరబ్రహ్మ చైతన్యమునకును, నాయంతఃకరణమున ప్రతిబింబించిన చైతన్యమునకును రెండు నొకే సద్వస్తువగుట వలన భేదము లేదు గదా! మరియు స్వర్ణమయ ఘటములో నుండు నాకాశమునకును, మట్టికుండలో నుండు నాకాశమునకును పాధిద్వయావచ్ఛిన్న ఆకాశము నొకటే గనుక భేదము లేనట్లు, అంతఃకరణోపాధిద్వయావచ్ఛిన్న పరమాత్మ యొకటే గాన, నో యతివరా! నన్నేల దూరముగ పొమ్మనెదవు? ఇది నీకు యుక్తము గాదు. అయ్యో! నీవు వేదవేదాంతముల నెఱింగిన బ్రహ్మజ్ఞానివిగ నుండియు నీకీ భ్రాంతి గలుగవచ్చునా?

ఈ విధముగ చండాల వేషధారి యగు పరమ శివుండభేద జ్ఞానమును బోధించి యదృశ్యుండాయెను. తదనంతరము శ్రీశంకరాచార్యస్వాములవారు చండాలవేషముతో వచ్చిన వానిని పరమశివునిగ దెలిసి యనేక విధములుగ స్తుతించుచు, భేదరహిత జ్ఞాన పరిపూర్ణుండై, స్వానుభవమునొందెను. (శ్రీ శంకర విజయము)

ఇట్లు జనార్దనుని భజించి తరించిన గుహుడు, శబరి, సంజయుడు మొదలుగాగల అంత్యజులు యెందరో గలరు. మరియు ఈ కలియుగము నాటి శ్రీతుకారాం మహారాజుగారు గూడ శూద్రుడే. "శూద్ర వంశీ జన్మలోం। హ్మణోని దంభేం మోకలిలోం" ॥ (1542) దేవా! నేను శూద్ర వంశములో జన్మించినాను. అందుకే దంభము యొక్క తాకిడినుండి రక్షింపబడ్డాను.

కావున 1. శ్రుతి. 2. స్మృతి. 3. యుక్తి (దృష్టాంతము) మొదలగు వాటిచే భగవద్భజనకు జాతి, కుల, లింగ, వయోఽవస్థా భేదములు యేవియును ప్రతిబంధకములు గావు. అనన్యమగు భక్తియే యేకైక సాధనమని ఋజువగుచున్నది. అందుకే -

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥
(గీత. 18-66)

అర్థము :- సమస్త ధర్మములను, కర్మములను పరిత్యజించి అద్వితీయాత్మ స్వరూపుడనైన నన్నొక్కనినే శరణు బొందుము. నిన్ను సమస్త పాపముల నుండి విడిపించెదను. దుఃఖింపకుము - అని భగవంతుడభయ మొసంగెను.

కావుననే, కరుణాసాగరుడగు గోపాలకృష్ణుడు తన ప్రతిజ్ఞను నిలబెట్టుకొనుటకు, శరణాగత త్రాణమను వ్రతమును పరిపాలించుట

కొఱకు, తనకు శరణు జొచ్చిన వారికందఱకు జాతి, కుల భేదమును జూడకుండ గోవర్ధనముక్రింద తన సాన్నిధ్యములో ఆశ్రయమిచ్చి కాపాడెను. (3860)

ఇట్లు యేడహెూరాత్రములు హరి, గిరిని ధరించి వ్రజవాసులను పరిరక్షించగా, గిరిభేది (ఇంద్రుడు) విసిగి, విఫల మనోరథుండై మేఘములనుపసంహరించుకొనియెను. ఎవరు గోవర్ధనమునెత్తి గో, వ్రజమును శిలావృష్టిబారి నుండి రక్షించెనో, నా యొక్క దర్పమడంగించెనో నతడు గోపాలకృష్ణుడని, మరియు నతడు సామాన్య మానవుడు గాడని, పరమాత్మ యొక్క పూర్ణావతారమని విచారించి తెలిసికొని-

శ్లో॥ గోలోకాదావ్రజత్ కృష్ణం సురభిః శక్ర ఏవ చ । (భాగ. 10-27-1)

**అర్థము :-** శ్రీకృష్ణునకు (ఆపదనుండి తన జాతిని పరిరక్షించినందు కభినందనలు తెలుపుటకు) సురభి (కామధేనువు) మరియు (తన యపరాధమునకు క్షమాపణ చెప్పుకొని మన్నించమని ప్రార్థించుటకు) దేవరాజగు యింద్రుడు గూడ గోలోకము నుండి (స్వర్గమునుండి) గోకులమునకేతెంచిరి. (గోశబ్దో స్వర్గవాచి - హలాయుధే).

ఇత్తెఱంగునఁ డెందంబునఁ లజ్జఁ బూని మందగమనుడై నందునిగేహమునకఱుదెంచిన సురేంద్రుడు మందభాగ్యుడనగు నన్ను మన్నింపందగునని శ్యామసుందరుడగు నందనందనుని పదములనందుకొని వందనమాచరించి పరిపరివిధముల సంస్తుతిఁ జేసెను. (3872)

**50. అభంగము :-**

పడిలీ భులీ ధాంవతీ స్టైరాట ।
ఛంద గోవిందా చా చో జివితీ వాట ।

మాగే సారూనీ సకళ బోభాట ।
వందీ పజాంబుజేం రేవూనీ లలాట వో ॥1॥

కోణీ సాంగా యా గోవిందాచీ శుద్ధీ ।
హెూతే వాహిలేం లపాలా ఆతాం ఖాందీ ।
కోఠేం ఆడ ఆలీహే దేహబుద్ధీ ।
ధాంవా ఆళవా కరుణా కృపానిధీ వో ॥2॥

మాగే బహుతాంచా అంతరలా సంగ ।
ముళేం జగాచియా తేణేం కేలా త్యాగ ।
పైల పాహోతాంతేం హరపలేం అంగ ।
ఖుంటలీ వాట నాహీంసేం ఝూలేం జగ వో ॥3॥

వియోగ ఘడలా సకళాంచా ।
గేలా శరణ హా అన్యాయ ఆముచా ।
కేలా ఉచ్చార ఘడల్యా దోషాంచా ।
ఝూలా ప్రకట స్వామీ తుకయాచా వో ॥4॥ (3773)

ప్ర.ప :- (ఒకానొక గోపిక) భులీ = గొప్ప భ్రమలో; పడలీ = పడ్డది; సైరాట = పిచ్చి పట్టినట్లు; ధాంవతీ = ఇటునటు పరుగెత్తుచున్నది; గోవిందాచా = గోవిందుని యొక్క; ఛంద = ప్రేమలో (పడి); చోజవితీ = (గోవిందుని) శోధిస్తూ; వాట = మార్గము (గుండా వెళ్ళుచున్నది); మాగే = వెనుకటి; సరళ = సమస్త; బోభాట = ప్రాపంచిక సందడి; సారూనీ = తుడిచిపెట్టి; వో = అహెూ!; పజాంబుజేం = (కృష్ణుని యొక్క) పదకమల చిహ్నములకు; లలాట రేవూనీ = లలాటమును మోపి; వందీ = నమస్కరించెను. 1. (ఆ గోపిక లతలను, వృక్షములను సంబోధించి = ఇలా అంటున్నది. ఓ లతా, వృక్షములారా!) కోణీ = (మీలో) యెవరైనా;యా

గోవిందాచీ = ఈ గోవిందుని యొక్క; శుద్ధి = శుద్ధి (జాడ); సాంగా = చెప్పండి; ఆతా = ఇప్పుడే; (నన్ను) ఖాందీ = (తన) భుజముపై (నెక్కించుకొని) హెూతేం = ఉండెను; (కాని యింతలోనే) వాహిలేం = అకస్మాత్తుగా; లపాలా= అదృశ్యమై పోయాడు; వో = అహెూ; హే దేహబుద్ధి = (నాకు) ఈ దేహాభిమానము; కోఠే = ఎక్కడ (నుండి లేక ఎందుకు); ఆడ = అడ్డము; ఆలీ = వచ్చెను; (ఓసఖులారా!) ధాంవా = పరుగెత్తండి; కృపానిధి = కృపానిధి యగు గోవిందుని (ఎవరైనా); కరుణా ఆళవా = కరుణించమని వేడుకోండి. 2. ముళేం = (ఈ గోవిందుని) కొఱకు; మాగేం = వెనుకటి; జగా చియా = ప్రపంచములోని; బహుతాంచా సంగ = అనేక మంది (ఇంటివారు మరియు బంధువుల యొక్క) సంబంధము; అంతరలా = తెగత్రెంచుకున్నాను; (కాని తుదకు) తేణేం = ఆ గోవిందుడే (నన్ను); త్యాగకేలా = త్యజించాడు; వో = అహెూ!; పైల పాహతాం = ఎంత దూరము చూసినా; తేం = తాను; అంగ = (తన) శరీరమును; హరపలేం= దాచుకున్నాడు (అగుపడుట లేదు); (నాదృష్టిలో) జగనాహీసేం ఝూలేం = జగత్తు నష్టమై పోయినది; (మరియు శ్రీకృష్ణప్రాప్తి) వాట = మార్గము(గూడ); ఖుంటలీ = కుంఠితమైనది (దొరుకుట లేదు); 3. (ఈవిధముగా) సకళాంచా= అందఱి గోపికల యొక్క; వియోగ = శ్రీకృష్ణ వియోగము; ఘడలా = సంభవించినది; (తుదకు గోపికలందఱు గోవిందునకు) శరణ గేల్యా = శరణు జొచ్చిరి; (మరియు) ఆముచా = మాయొక్క; హా అన్యాయ = మా అభిమానము ఉచితము గాదని; ఘడల్యా దోషాంచా = జరిగిన దోషముల యొక్క; ఉచ్చార కేలా = ఉచ్చారణ జేసిరి. (పొరపాటును స్వీకరించిరి.); వో = అహెూ; (శ్రీతుకారాం మహారాజుగా రంటున్నారు = ఓ భక్తజనులారా! అప్పుడు శ్రీ గోపీ జన వల్లభుడు); తుకయాచా స్వామీ = నా స్వామి యగు శ్రీపాండురంగడు (కృష్ణుడు); ప్రకట ఝూలా = ప్రకట మయ్యెను. 4. (3773)

**తా॥** ఒకానొక గోపిక శ్రీకృష్ణుడు కనుపించకపోయె సరికి భ్రమలోపడి పిచ్చిదానివలె అటునిటు పరుగెత్తుచుండెను. గోవిందుని ప్రేమలో పడి వెనుకటి ప్రపంచముయొక్క సందడి, గోడు, బాధలు అన్నిటిని తుడిచిపెట్టి శ్రీకృష్ణుని వెతుకుతూ మార్గముగుండా వెళ్ళుచుండెను. భూమిపై పడిన గోపాలునియొక్క పద చిహ్నములకు శిరసు వంచి నుదుటితో స్పృశించి నమస్కరించుచుండెను. 1. శ్రీకృష్ణవియోగమును భరించలేని ఆ గోపిక లతలను, వృక్షములను సంబోధించి–"ఓ లతలారా! ఓ వృక్షములారా! మీరెవరైనా గోవిందుని చూసారా? అతని జాడ చెప్పండి. ఇప్పుడే నన్ను తన భుజముపై నెక్కించుకొని యుండెను. ఇంతలోనే ఆ మాయదారి కృష్ణుడు మాయమైపోయాడు. ఎక్కడెళ్ళాడో తెలియుట లేదు" అని అంటున్నది. మరియు తనలో తాను ఇలా అనుకుంటుంది. తన భుజములపై నన్ను యెక్కించుకొమ్మని నేను అడిగినందుకు, తాను యెక్కించుకున్నట్లే చేసి నన్ను వదిలేసి అదృశ్యమైపోయాడు. అహో! ఈ దేహాభిమానము నాకెందుకొచ్చెనో, తెలియుటలేదు. ఓ చెలియలారా! పరుగెత్తండి! ఆకరుణానిధి యగు గోవిందుని కరుణించమని వేడుకోండి. 2. శ్రీకృష్ణుని కోసము మాయింటి వారితో, బంధు మిత్రాదులతో సంబంధము త్రెంచుకున్నాను. కాని, చివరికి ఆకృష్ణుడే నన్ను ఏకాకిని జేసి, మోసగించి, వదిలేసినాడు. కంటి చూపు మేరకు చూసినా తాను కనుపించుటలేదు. నాదృష్టిలో ఈ జగత్తే నష్టమై పోయినది. శ్రీకృష్ణప్రాప్తి మార్గము కుంఠితమైనది. నా గోవిందుడు కనుపించుట లేదు. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు – ఈప్రకారముగా శ్రీకృష్ణుని విరహముచే ఈ ఒక్క గోపికయే కాదు – సకల గోపికలకు శోకము గలిగినది. చిట్ట చివరకు గోపికలందరు మానసికముగా భగవంతునికి శరణు జొచ్చిరి. దేహాభిమాన పూర్వకముగా జరిగిన పొరపాటు (గొప్ప అపరాధము)ను క్షమించమని

పశ్చాత్తాపయుక్తులై పదే పదే భగవంతుని వేడుకొనిరి. అప్పుడు వారి నిరభిమానస్థితిని మరియు అనన్యభావమును గ్రహించి నాస్వామి పాండురంగడు (శ్రీకృష్ణుడు) వెంటనే ప్రకటమయ్యెను. 4. (3773)

**సు.వ్యా :-** ప్రకృత అభంగములో శ్రీతుకోబారాయ్ రాసలీల ప్రసంగమును చక్కగా చిత్రీకరించెను. చిత్తచోరునికి సంపూర్ణముగా సమర్పిత చిత్తలగు గోపికారమణులతో గోపికారమణుడు నందనందనుడు ఆనందకందుడు శ్రీకృష్ణచంద్రుడు ఆనందప్రదమగు శ్రీయమునానదీ తీరపు యిసుకతెన్నెలపై ఆనందముగా ఆత్మారాముడై క్రీడించుచుండెను.

**శ్లో॥** బాహుప్రసార పరిరంభకరాల కోరు -
నీవీస్తనాలభననర్మనఖాగ్రపాతైః ।
క్ష్వేల్యావలోకహసితైర్వ్రజసుందరీణా-
ముత్తంభయన్ రతిపతిం రమయాం చకార ॥ (భాగ. 10-29-46)

**అర్థము :-** చేతులు చాచుట, ఆలింగనమొనర్చుట, గోపికల యొక్క కరములను, కురులను, ఊరువులను, నడుము లేక నాభి స్థానమును (నడికట్టు) మరియు కుచములు మొదలగు స్థానములను స్పృశించుట, వినోదము చేయుట, నఖక్షతము (గిల్లుట), వినోదపూర్వకముగా మనోరంజకముగా చూచుట మరియు మందహాసము చేయుట - ఇత్యాది కామశాస్త్రోక్తక్రియలచే గోపికలయొక్క కామరసమును, పరమోజ్వల ప్రేమ భావమును ఉత్తేజితము చేస్తూ వారిని (వ్రజసుందరీమణులను) శ్రీకృష్ణ పరమాత్మ ఆనందితులను జేయు చుండెను.

**శ్లో॥** ఏవం భగవతః కృష్ణాల్లబ్ధమానా మహాత్మనః ।
ఆత్మానం మేనిరే స్త్రీణాం మానినోऽభ్యధికం భువి ॥
(భాగ. 10-29-47)

**అర్థము :-** ఉదార శిరోమణి, సర్వవ్యాపకుడగు శ్రీకృష్ణభగవానుడు ఈ ప్రకారముగా గోపికలను ఎప్పుడైతే సగౌరవముగా ఆనందింపజేసెనో, అప్పుడు ప్రపంచములోని స్త్రీలందరిలో మేము సర్వశ్రేష్ఠులమని, సౌభాగ్యవతులమని, మాతో సమానులెవరు లేరను అభిమానము గోపికలకు కలిగినది.

వారిలో ఒక గోపిక శ్రీకృష్ణ భగవానునితో ఇలా అంటున్నది.

**శ్లో॥ తతో గత్వా వనోద్దేశం దృప్తాకేశవమబ్రవీత్ ।**
**న పారయేహం చలితుం నయ మాం యత్ర తే మనః ॥**
(భాగ. 10-30-38)

**అర్థము :-** శ్రీకృష్ణునితో వన విహారము చేస్తున్న ఆ గోపిక తన యొక్క ప్రేమ మరియు సౌభాగ్య మదముచే మత్తెక్కి గోవిందునితో యిలా అంటున్నది. -"ప్రియ! ఇక నేను ముందుకు నడవలేను. నా యొక్క సుకుమార పదకమలములు శ్రమించినవి. నన్ను నీ భుజములపై నెక్కించుకొని నీ యిచ్ఛ వచ్చిన చోటకు తీసికెళ్ళుము"

**శ్లో॥ ఏవముక్తః ప్రియామాహ స్కంధ ఆరుహ్యతామితి ।**
**తతశ్చాంతర్దధే కృష్ణః సా వధూరన్వతప్యత ॥** (భాగ. 10-30-39)

**అర్థము :-** తన యొక్క ప్రియతమ యగు గోపిక మాటలు విని శ్యామసుందరుడంటున్నాడు. అలాగైతే ప్రియా! నీవు నిస్సంకోచముగా నా భుజముపై నధిరోహించుము. గోవిందుని ఈ మాటలు విన్న ఆగోపిక మిక్కిలి సంతసించి గోపాలుని భుజముపై నెక్కుటకుపక్రమించెను. ఇంతలోనే కృష్ణుడు అంతర్ధానమయ్యెను. అప్పుడు ఆ సౌభాగ్యవతి తన దౌర్భాగ్యమునకు పశ్చాత్తాపము జెందుతూ, విలపించుచున్నది.

**శ్లో॥ హే నాథ! రమణ! ప్రేష్ఠ! క్వాసి క్వాసి మహాభుజ! ।**
**దాస్యాస్తే కృపణాయా మే సఖే! దర్శయ సన్నిధిమ్ ॥**
(భాగ. 10-30-40)

**అర్థము :-** హే నాథ (పాలకుడా!) హేరమణ (కాంతోచితప్రద!), హే ప్రేష్ఠ (ప్రియతమ!) హే మహాభుజ! నీ వెక్కడున్నావు! నీవెక్కడున్నావు! ఓ నా ప్రియసఖా! నేను నీ యొక్క దీన - హీన దాసిని ఉన్నాను. వెంటనే నీయొక్క సాన్నిధ్యానుభవమును కలిగించుము. నాకు దర్శనమివ్వుము.

కేవలము ఈ ఒక్క గోపికయే కాదు. వ్రజ గోపికలందఱకు గోవిందునియొక్క పిచ్చి పట్టినది. శ్రీకృష్ణ ధ్యానము చేస్తూ స్వదేహ భావము లేనివారై కృష్ణమయులై “నేనే శ్రీకృష్ణుడను” అని అంటూ శ్రీకృష్ణ గుణగానము చేస్తూ, శ్రీకృష్ణలీలలను వర్ణిస్తూ అభినయించు చుండిరి. గోవిందుని యన్వేషణలో వెళ్తూ మార్గములో కనిపించిన లతలను, వృక్షములను శ్రీకృష్ణుని జాడ దెలుపుడని వేడుకొనసాగిరి.

**శ్లో॥ దృష్టో వః కచ్చిదశ్వత్థ ప్లక్ష న్యగ్రోధ నోమనః ।**
**నందసూనుర్గతో హృత్వా ప్రేమహాసావలోకనైః ॥** (భాగ. 10-30-5)

**అర్థము :-** ఓ అశ్వత్థమా! (రాగిచెట్టు), ఓ ప్లక్షమా! (జువ్విచెట్టు), ఓ న్యగ్రోధమా! (మర్రిచెట్టు) నందనందనుడగు శ్యామసుందరుడు తన యొక్క ప్రేమ పూరిత చిరునగవులతో, వాలు చూపులతో మా మనస్సును దొంగిలించుకొని వెళ్ళి పోయాడు. ఆ చిత్తచోరుని మీరు చూసారా! దయచేసి చెప్పండి. మఱియును-

**ఉ॥ నల్లనివాడు పద్మనయనంబులవాడు కృష్ణపారసంబు పైఁ**
**జల్లెడు వాడు మౌళిపరిసర్పిత పింఛమువాడు నవ్వు రా**

జిల్లెడు మోమువాడొకఁడు చెల్వల మానధనంబు దెచ్చెనో
మల్లియలార! మీ పొదలమాటున లేఁడు గదమ్మ! చెప్పరే.
(పోతన.భాగ. 10-30-1010)

శ్లో॥ ఏవం కృష్ణం పృచ్ఛమానా వృందావనలతాస్తరూన్ ।
వ్యాచక్షత వనోద్దేశే పదాని పరమాత్మనః ॥ (భాగ. 10-30-24)

అర్థము :- ఈ ప్రకారముగా గోపికలు వృందావనస్థ సకల వృక్షములను, లతలను గోవిందుని గూర్చిన జాడలు అడుగుకుంటూ వెళ్తూ ఉండగా ఒక చోట భగవంతుని యొక్క చరణ చిహ్నములను చూచిరి.

శ్లో॥ పదాని వ్యక్తమేతాని నందసూనోర్మహాత్మనః ।
లక్ష్యంతే హి ధ్వజాంభోజ వజ్రాంకుశ యవాదిభిః ॥
(భాగ. 10-30-25)

అర్థము :- గోపికలు పరస్పరము ఇలా అనుకుంటున్నారు – ఈ పదచిహ్నములు అవశ్యముగా ఉదార శిరోమణియగు నందనందనుడైన శ్రీ శ్యామసుందునివే అయి ఉంటాయి. ఎందుకనగా! ఆ పదముల యందు ధ్వజా, కమలము, వజ్రము, అంకుశము మరియు యవల చిహ్నములు స్పష్టముగా కన్పట్టుచున్నవి.

శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు – ఆ గోపికలు భగవంతుని చరణ చిహ్నములను భక్తితో శిరసువంచి నుదుటితో స్పృశించి నమస్కరించిరి. మఱియు శ్రీకృష్ణ వియోగ దుఃఖమును భరించలేక ఈ ప్రకారముగా విలపిస్తూ అంటున్నారు.

శ్లో॥ పతి సుతాన్వయ భ్రాతృబాంధవా
నతివిలంఘ్య తేఽన్త్యచ్యుతాగతాః ।

**గతి విదస్తవోద్గీత మోహితాః**

**కి తవ! యోషితః కస్త్యజేన్నిశి ॥** (భాగ. 10-31-16)

**అర్థము :-** ఓ ప్రియమైన శ్యామసుందర! మేము మా భర్తలను, పుత్రులను, అన్నదమ్ములను, బంధుమిత్రులను మరియు కుల పరివారము నంతటిని త్యాగముచేసి, వారి యాజ్ఞలనుల్లంఘించి, నిన్ను గోరి జేరవచ్చితిమి. "మేము నీతో రమించుటకు వస్తున్నాము." అని తెలిసి గూడ మమ్ములను వదలి వెళ్ళిపోయినావు. హే అచ్యుత! వీర్యచ్యుతి రహితత్వముచే నీవు నపుంసకుడవా యేమి? మాయొక్క ఆగమనం నీ దర్శనార్థమే అయినపుడు, నీయొక్క గమనం ఉన్మాదచేష్టయే యగును. అందుకని మేము నీచేత త్యాజ్యులము గాము. ముల్లోకములను మోహింపజేయు నీవేణుగీతగతి విశేషమును తెలిసి నీ వేణువు ఉద్గానమునకు ముగ్ధులమై, నీవు మమ్ములనుపేక్షింపనేరవని నిన్ను జేరవచ్చినారము. హే కపట శౌరి! రాత్రియందు వలచి వచ్చిన యువతులను నీవు తప్ప, యే పురుషుడు విడిచివెళ్ళగలడు. భీరువులు, అబలలు నగు యువతులను, రాత్రిపూట స్వయముగా గోరివచ్చిన వారిని నిర్దయుడవు, వంచకుడవునగు నీవు తప్ప, ఎవరు గూడ త్యజింపజాలరని యర్థము.

శ్రీతుకోబారాయ్ అంటున్నాడు - గోపికల దృష్టిలో పతి. పుత్ర, బంధు, మిత్రాదిక బాహ్య ప్రపంచము సంపూర్ణముగా నష్టమై పోయినది. ప్రత్యగభిన్న పరమాత్మయగు సచ్చిదానంద ఘన ఘనశ్యాముడు (శ్రీకృష్ణుడు) తప్ప అన్యమెద్దియును గోచరించుట లేదు.

**శ్లో॥ కుర్వన్తి హి త్వయి రతిం కుశలాః స్వ ఆత్మన్**

**నిత్యప్రియే పతిసుతాదిభిరార్తిదైః కిమ్ ।**

**తన్నః ప్రసీద పరమేశ్వర! మాస్మ ఛింద్యా**

**ఆశాం భృతాం త్వయి చిరాదరవింద నేత్ర! ॥** (భాగ. 10-29-33)

**అర్థము :-** హే పరమేశ్వర! నీవు నిత్యము, ప్రియము మరియు స్వాత్మయై యున్నందున, ఆత్మ జ్ఞానము నందు నిపుణులగు మహాపురుషులు నిన్నే తప్ప అన్యమును ప్రేమించరు. అనిత్యము, దుఃఖప్రదమగు పతిపుత్రాదులచేనేమి ప్రయోజనము? అందుకని, మాపై ప్రసన్నుడవు కమ్ము. మమ్ము కరుణించుము. చిరకాలము నుండి నీ కోసము పాలించి, పోషించుకున్న నిగనిగలాడుచున్న ఆశ - అభిలాషరూప లతను ఛేదించకుము. హే కమల నయన! మమ్మనుగ్రహింపుము.

ఉపరోక్త గోపికలయొక్క అభిప్రాయము శ్రుతి సమ్మతమునై యున్నది. "ప్రియం (తవ) ( రోత్స్యతి" (బృ.ఉ. 1-4-8). పుత్రాద్యనాత్మ విశేషమును ఆత్మకంటె ప్రియతరమని చెప్పువానిని గూర్చి ఆత్మప్రియవాది ఇలా అంటున్నాడు. -"నీయొక్క ప్రియములు (పుత్రాదులు) నష్టమై నిన్ను ఏడిపించెదరు".

"కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయం లోక ఇతి".

ఈ ఆత్మ లోకమే యభీష్టమై యున్న మాకు ఈ (పుత్రాది) ప్రజల చేనేమి ప్రయోజనము? (బృ.ఉ. 4-4-22).

పై వచనములనుబట్టి గోపికలకు శ్రీకృష్ణుని పట్ల పరమాత్మ దృష్టియే గలదు గాని, దేహదృష్టి (వికార దృష్టి) యత్కించిత్ గూడ లేదని సుస్పష్టమగుచున్నది.

శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - ఈ విధముగా వ్రజగోపికలు వారియొక్క మిథ్యాభిమానరూప గొప్ప అపరాధమును క్షమించుమని మనస్ఫూర్తిగా వేడుకొంటూ, గోవిందుని విరహమును

భరించనివారై, కృష్ణుని దివ్యసందర్శనము కొఱకు తల్లడిల్లుచు, కృష్ణ వియోగదుఃఖముచే కట్టలు తెంచుకొని పొంగి పొరలి ప్రవహిస్తున్నదా యన్నట్లు దేహస్మృతి గూడ లేనివారై విలపించుచుండిరి.

**శ్లో॥ ఇతి గోప్యః ప్రగాయన్త్యః ప్రలపన్త్యశ్చ చిత్రధా ।**
**రురుః సుస్వరం రాజన్ కృష్ణదర్శన లాలసాః ॥**(భాగ. 10-32-1)

**అర్థము :-** శ్రీశుకభగవానులు అంటున్నారు. హే పరీక్షిత్! స్వప్రేమామృతకల్లోలములచే విహ్వాలీకృత వివశచిత్తలై, మూర్ఛితులైన గోపికలు, కంఠములు మూర్తిమంతమై సప్త స్వరములతో సవరించబడి ఆశ్చర్య తాళతానాది ప్రకారములచే గానము చేస్తూ, అతివైవశ్యోద్రేకముచే ప్రలపిస్తూ, శ్రీకృష్ణదర్శన లాలసలై, కరుణా జనక సుమధుర స్వరముతో గోడు గోడున యేడ్వసాగిరి.

అప్పుడు గోపికారమణుల యొక్క నిరభిమానస్థితిని, అనన్య భావమును మరియు విరహవిలాపమును గాంచిన కరుణామయుడగు గోపికారమణుడు గోపాలకృష్ణుడు వారి మధ్యలో వెంటేనే ప్రకటమయ్యెను.

**శ్లో॥ తాసామావిరభూచ్ఛౌరిః స్మయమాన ముఖామ్బుజః ।**
**పీతాంబరధరః స్రగ్వీ సాక్షాన్మన్మథమన్మథః ॥** (భాగ. 10-32-2)

**టీక ॥** గోపికలు ఇంతదనుక పరిపరివిధముల ప్రలపించిననూ ప్రకటము గాని శూరవంశజుడగు కపట కఠినాత్ముడు "శౌరి" యని శ్రీగోపీజనపక్షపాతి యగు శ్రీశుకదేవుని యొక్క శ్రీకృష్ణుని పట్ల అసూయోక్తి. లేక కామమును జయించినవాడు గావున "శౌరి" అని పిలువబడినాడు కృష్ణుడు. అందుకే సాక్షాన్మన్మథమన్మథుడని చెప్తున్నాడు శ్రీశుకభగవానుడు. మన్మథుడనగా మనస్సును మథించేవాడు క్షోభపెట్టేవాడు అని యర్థము.

"అపూర్వేయం ధనుర్వియం ధనుర్విద్యా మన్మథస్య మహాత్మనః । శరీరమక్షతం కృత్వా భినత్యంతర్గతం మనః ॥ మహాత్ముడగు మన్మథుని ధనుర్విద్య చాలా అపూర్వమైనది. ఎందుకనగా? శరీరమును గాయపరచకుండానే లోన ఉన్న మనస్సును భేదించుచున్నాడు. కోటి మన్మథలావణ్యము గల భగవంతుని సురూపదర్శనముచే కాముడు గూడ మోహితుడైనాడు గాన శ్రీకృష్ణుడు మన్మథ మన్మథుడు. భక్తవత్సలుడగు వనమాలి గోపికలయొక్క స్వవిరహ దుఃఖమునకు హృదయకమలమునందు సంతప్తుడై, వారిని ఆనందపఱచుటకై ప్రపుల్లీకృత ముఖకమలముతో, వారి యశ్రుధారలను తుడుచుటకు, భుజములపై నుండి ముందుకు వ్రేలాడబడుచున్న పీతవస్త్రమును చేతులతో ధరించిన పీతాంబరధారి వారి (గోపికల) యపరాధమును క్షమించి, దుఃఖమును నివారించుటకు వెంటనే వారి మధ్యలో ప్రకటమయ్యెను. (వంశీధరి).

బోలో శ్రీ గోపాలకృష్ణ భగవాన్ కీ జై....
భక్తవత్సల భగవాన్‌కీ జై...... (3773)

**విశేషము :-** శ్రీకృష్ణపరమాత్మయొక్క దివ్యమంగళస్వరూప సందర్శన సౌభాగ్యముచే గోపసుందరీమణుల డెందమున గలిగిన యానందమును మరియు తృప్తిని శ్రీశుకదేవుడు ఇలా వర్ణిస్తున్నాడు.

శ్లో॥ సర్వాస్తాః కేశవాలోక పరమోత్సవ నిర్వృతాః ।
జహుర్విరహజం తాపం ప్రాజ్ఞం ప్రాప్య యథా జనాః ॥
(భాగ. 10-32-9)

**టీక॥** యథా = ఏప్రకారముగా; జనాః = సంసారసంతప్తులైన (ముముక్షువులకు) ప్రాజ్ఞం = ఉపాసనచేత ఈశ్వరసాక్షాత్కారము గలుగుట తోడనే సంసారతాపహాని యగునో; లేక "జ్ఞానాదేవ తు కైవల్యమ్" ఈ శ్రు

తి చెప్పినట్లు జ్ఞానమే సంసార నివర్తకమున్నందువలన "ప్రాజ్ఞం" = బ్రహ్మజ్ఞం= జ్ఞాని యొక్క నిరంతర సహవాసముచేత తదుపదిష్ట మహావాక్య విచారముచేనప్రతిబద్ధ బ్రహ్మ సాక్షాత్కారముచే ననాది యనిర్వచనీయ యజ్ఞానము నివృత్తమై ముముక్షువునకు పరమానంద స్వరూపప్రాప్తిచే సంసార తాపహాని (యెట్లు) గలుగునో; అథవా, "అయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతరమ్", "పితాఽపితా భవతి.... తీర్ణో హి తదా సర్వాన్ శోకాన్ హృదయస్య భవతి". (బృ.ఉ. 4-3-21 -22) ఈ శ్రుత్యనుసారము జాగ్రత్స్వప్నాభిమాని యగు విశ్వతైజసాభిధ జీవుడు సుషుప్త్యవస్థలో సుషుప్త సాక్షి (బ్రహ్మము)తో సంపన్నుడై బాహ్యం = జాగ్రత్, ఆంతరమ్ = స్వప్నము = ఈ ఉభయకాలిక సకల దుఃఖములను పరిత్యజించి "సుఖమహమస్వాప్సమ్" ఈ పరామర్శవలన నుషుప్తిలో కేవల నుఖరూపుడై యుండుట యెట్లు ఆబాలకమలాసనపర్యంతము సర్వాను భవసిద్ధమో; తథా = అట్లు; తాః సర్వాః = ఆ వ్రజసుందరీ మణులందరు; (కః = బ్రహ్మము; ఈశః = శివుడు) సర్వేశ్వరులైన బ్రహ్మ శివులనుగూడ వశమొనర్చుకొన సమర్థుడగు కేశవాలోక పరమోత్సవ కేశవుని యొక్క దివ్య సందర్శనమే పరమానందప్రదముగావున పరమోత్సవము, దానిచేత; నిర్వృతాః = పరమ నుఖమును బొందినవారై; విరహజం తాపం = ఇంతదనుక శ్రీకృష్ణవిరహనిబంధనదుఃఖమేదియుండెనో, దానిని; జహుః = పరిత్యజించిరి. శ్రీకృష్ణవియోగదుఃఖము నుండి గోపికలు ముక్తులై, పరమ శాంతిరూప సముద్రములో మునకలు వేయుచుండిరి. (వంశీధరి).

అటు పిమ్మట శ్రీకృష్ణ భగవానుడు గోపసుందరీమణులను వెంట నిడుకొని శ్రీయమునా తటమున ప్రవేశించెను. అచ్చట గోపికల ప్రేమ సేవను గూర్చి శ్రీ శుకమునీంద్రులు వర్ణించుచున్నారు.

శ్లో॥ తద్దర్శనాహ్లాద విధూత హృద్రజో
మనోరథాంతం శ్రుతయో యథా యయుః ।
స్వైరుత్తరీయైః కుచకుంకుమాంకితై-
రచీక్లృపన్నాసనమాత్మబంధవే ॥ (భాగ. 10-32-13)

టీక॥ యథా = ఏ విధముగా; శ్రుతయః = ఉపనిషత్తులు (తదభిమానిదేవతలు) పూర్వమీమాంసలో కేవల సకామ కర్మ ప్రతిపాదనము చేనభిలషితార్థములను పొందలేక, పరమాత్మను దర్శించలేక అపూర్ణకాములై చివరకు జ్ఞానకాండను ప్రతిపాదించుటకుపక్రమించెను. ఉత్తర మీమాంసారూప జ్ఞానకాండలో "సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఛాం.ఉ. 3-14-1), "అహం బ్రహ్మాస్మి" (బృ.ఉ. 1-4-10) ఈ రీతిగా చరాచరాత్మసహిత పరమాత్మ తత్త్వమును ప్రత్యగభిన్నత్వముచే ననుభవించి స్వాత్మజ్ఞానానందపూర్ణులై కామానుబంధమును అనగా తత్తత్కర్మజసుఖేచ్ఛను వదలిపెట్టినవి. మనోరథాంతం యయుః = అభిలషితార్థముల యొక్క పరాకాష్ఠము చేరినవి. దేనికంటె నధిక మనోరథము లేదో దానిని పొందినవి. ఎందుకంటె, బ్రహ్మానందములోనే సర్వానందములంతర్భూతములై యున్నందున. "ఏతస్యైవాఽఽనందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి". (బృ.ఉ. 4-3-32) ఈ బ్రహ్మస్వరూపభూత అనందమునే బ్రహ్మాతిరిక్త సకల జీవులు అవిద్యాద్వారా ప్రత్యుపస్థాపిత విషయేంద్రియ సంపర్కముచే గలుగు (మాత్ర) కళను ఆశ్రయించుకొని బ్రహ్మానంద అంశమునే) ఉపభోగిస్తూ జీవిస్తున్నాయి. దృష్టాంతమును స్పష్టీకరించి ఇప్పుడు దార్ష్టాంతమును ప్రతిపాదించుచున్నాడు. (తథా = అట్లే) తద్ = తస్య - రాసక్రీడా విశేషమునందు ఔత్సుక్యతగల విభువగు శ్రీకృష్ణుని యొక్క; దర్శనాహ్లాదః (తేన) = దర్శనానందముచే; విధూత = విశేషముగా నశింపబడిన; హృద్రజః=

హృదయములోనున్న రజః శబ్దోపలక్షిత సకల ఆధులు (తాపములు = నశింపబడినవారైరి), కేవలము పరమదుఃఖ శాంతియే గాక, పరమసుఖ ప్రాప్తి గూడ కలిగినదని చెప్పుచున్నాడు = మనోరథాంతం యయుః = వాంఛితార్థము యొక్క పరాకాష్ఠను చేరుకున్నారు. పూర్ణకాములైనారు. అనగా సచ్చిదానందమగు ప్రత్యగభిన్నపరమాత్మ (శ్రీకృష్ణుని) యొక్క దర్శనభాగ్యముచే (సాక్షాత్కారముచే) వ్రజసుందరీమణులు "సర్వదుఃఖనివృత్తి, మరియు పరమానందప్రాప్తి" రూప మోక్షమును (పరమ పురుషార్థమును) బొందినారని యర్థము. ఆప్తకాములు (పూర్ణమనోరథు) లైనప్పటికిని గోవిందుని యందు గల అతిశయ ప్రేమ (అనురాగము) చే గోపికలు; కుచకుంకుమాంకితైః = శ్రీకృష్ణవియోగదుఃఖజాశ్రుధారాపాతముచే కుచములపై నున్న కుంకుమ తడిసి రంజితము గావింపబడిన; స్వైరుత్తరీయైః= కుచకంచుకముపై స్వయముగా కప్పుకొన్న ప్రావరణరూప సూక్ష్మ వస్త్ర విశేషము చేత; ఆసనమచీక్ల్ృపన్ = (శ్రీకృష్ణుని కోసము) ఆసనమును చక్కగా రచించిరి; స్వోపయుక్తమగు యేకైక వస్త్రమును శ్రీకృష్ణునకు ఆసనముగా నిచ్చుటచే గోపికారమణులు లజ్జను వదలి స్వమర్యాదనుల్లంఘించిన వారగుదురుగదా యను శంకకు సమాధానముగా చెప్పుచున్నాడు = ఆత్మబంధువే యని. పరమ ప్రేమాస్పదత్వముచే నాత్మీయుడై నందువలన గోపికలు గోవిందునికి స్వవచేలాంచలములనానంద పారవశ్యముచే నాసనముగానిచ్చుట దూషణము గాక భూషణమే యగును. ఎందుకనగా! దేహబంధుదర్శనము చేతనే స్వకర్తవ్య విమూఢులగుదురనగా, యిక యాత్మ బంధుదర్శనముచే వేరుగ చెప్పవలెనా? కైముతిక న్యాయము. ఇట్లు గోపికలందఱు వారివారి సూక్ష్మ వస్త్రమయపరిటలను పఱచి విస్తృతైకాననమును విడివిడిగా గావించి శ్రీకృష్ణునకు ప్రేమ సేవలనందించిరి. (వంశీధరి)

**శ్లో॥ తత్రోపవిష్టో భగవాన్ స ఈశ్వరో యోగేశ్వరాంతర్హృది కల్పితాసనః**
**చకాస గోపీ పరిషద్గతోఽర్చితస్త్రైలోక్య లక్ష్మ్యేకపదం వపుర్దధత్ ॥**
(భాగ. 10-32-14)

**టీక॥** "భగవత్" శబ్దార్థము :-

**శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః ।**
**జ్ఞాన వైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరిణా ॥** (వి.పు. 6-5-24)

**తా॥** (సమగ్రస్య = సంపూర్ణమైన. ఈ శబ్దము "ఐశ్వర్యస్య" ఇత్యాదులన్నింటికీ విశేషణంగా అన్వయిస్తుంది) సంపూర్ణమైన ఐశ్వర్యమునకు (నియమన శక్తికి), ధర్మమునకు, యశస్సునకు, లక్ష్మికి, జ్ఞానమునకు మరియు వైరాగ్యమునకు - ఈ ఆరింటికి "భగం" అని పేరు. ఈ ఐశ్వర్యాదులు ఆరుగూడ ఎల్లప్పుడు అప్రతిబద్ధమై, పరిపూర్ణముగా యెవరియందుండునో అతడు "భగవంతుడు".

**శ్లో॥ ఉత్పత్తిం ప్రళయంచైవ భూతానామాగతిం గతిమ్ ।**
**వేత్తి విద్యామవిద్యాం చ సవాచ్యో భగవానితి ॥** (వి.పు. 6-5-78)

**తా॥** భూతముల పుట్టుకను, ప్రళయమును, రాక పోకలను, విద్యను మరియు అవిద్యను యెవరు తెలిసికొనగలుగుదురో అతనినే "భగవంతుడు" అనాలి.

ఉపరోక్త లక్షణ విశిష్ట సర్వాంతర్యామి యగు శ్రీకృష్ణ భగవానునకు సిద్ధసమాధినిష్ఠులగు శ్రీరుద్రాదులు మరియు సనకాది యోగీశ్వరులు విమలోత్కర్షవిశిష్ట యోగసాధనలనవలంబించి హృత్పద్మకర్ణిక యందు భావనామాత్రముచే నాసనమును స్థాపించిరి. వారికి విపుల ప్రయత్నముచే హృదయాభ్యంతరమున మనస్సు చేత తీసుకురాబడినవాడై పరోక్షరీతిగానే క్షణమాత్రము దర్శనమిచ్చును. సర్వశక్తివంతుడైన ఆభగవంతుడే

నందనందనరూపముచే (సహస్రాధిక) గోపీసభామధ్యమున గోపికల యొక్క నిర్మాల్యవస్త్రములచేత మరియు స్వోపభుక్తగంధములచే కల్పింపబడిన యాసనమున యుపవిష్టుడై హృదయబహిరంగమున ప్రకాశించుచుండెను. "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" (బృ.ఉ. 2-5-19) ఇంద్రుడు (పరమేశ్వరుడు) తన మాయలచేత అనేకరూపములచే భాసించును. ఈ శ్రుత్యనుసారము భగవంతుడు తన యోగమాయాశక్తిచేత సహస్రాధిక సంఖ్యాక గోపికలయొక్క పృథక్ పృథక్ ఆసన, తాంబూల, విలాస, స్మిత మృదుమధుర భాషణ, వాలు చూపులు మొదలగు ప్రేమపూరిత హావభావములచే నర్చితుడై (సమ్మానితుడై త్రైలోక్యసంపత్తికి, సౌందర్యమునకు ఏకమాత్ర ఆశ్రయభూతుడై ప్రకాశించుచుండెను)

ఆహా! గోపికల యొక్క పుణ్య మేమని వర్ణింపను. వారు నిజముగా ధన్య జీవులు. మహాసుకృతాత్ములే వ్రజభూమిలో జన్మించెదరు. అందులో గోపికలు అతిశ్రేష్ఠులు - అని స్వయముగా శ్రీశుకదేవులే గోపికలయొక్క సౌభాగ్యమును వర్ణించుచున్నారు.

**శ్లో॥ గోప్యస్తపః కిమచరన్ యదముష్య రూపం**
**లావణ్య సారమసమోర్ధ్వ మనన్య సిద్ధమ్ ।**
**దృగ్భిః పిబన్త్యను సవాభినవందురాప -**
**-మేకాంత ధామ యశసః శ్రియ ఐశ్వరస్య ॥** (భాగ. 10-44-14)

**టీక॥** పూర్వోక్త ప్రకారముగ యశస్సు, లక్ష్మి మరియు ఐశ్వర్యముల చేనుపలక్షితమగు నారు భగములకు నవ్యభిచారి స్థానమగు శ్రీకృష్ణుని యొక్క రూపము - లావణ్య (సౌందర్య) సారము. గోవిందుని యొక్క రూప లావణ్యము కృత్రిమము గాక స్వాభావికము మరియు ప్రతిక్షణము నూతనమై (నిత్యనూతనమై)నది.

**శ్లో॥ అంగాన్యభూషితాన్యేవ ప్రేక్షణీయైర్విభూషణైః ।**
**యేన భూషితవద్భాన్తి తద్రూపం ప్రోచ్యతే బుధైః ॥**

(ఉజ్వలనీలమణిః)

సుందరమైన ప్రేక్షణీయమగు నాభరణములచే నలంకరింపబడకున్నను, అంగములు ఆభరణములచే నలంకరింపబడినట్లు దేనిచే భాసించుచుండునో, అది పండితులచే "రూపము" అని చెప్పబడుచున్నది. లక్ష్మీదేవికి గూడ దుర్లభమగు భగవంతునియొక్క ఈ రూప లావణ్యమునకు సమానమైనది ముల్లోకములంగు గూడ లేదు. యిక దీనికంటె నధికముండదని వేరుగ చెప్పనక్కరలేదు. ఇటువంటి రూపామృతమును వ్రజగోపికలు దప్పికగొన్నవారివలె వారినేత్రములతో నిరంతరము రెప్పవాల్చకుండ త్రాగుచున్నారు (చూస్తున్నారు) శ్రీశుక భగవానులంటున్నారు – ఆహా! గోపికారమణులు భగవదారాధన రూపమగు నే తపస్సు చేసియున్నారో తెలియకుండెను. "నాతపస్వినో యోగః సిధ్యతి" (వ్యాసభాష్యము. పా.యో.సూ. 2-1) తపస్సు చేయనివానికి పరమాత్మ యొక్క యోగము (సాక్షాత్కారము) సిద్ధించదు. ఈ వ్యతిరేకోక్త్యనుసారము గోపికలు యేదో గొప్ప తపస్సు చేసి యుంటారు. ఆ తపస్సేదో తెలిస్తే మనము గూడ చేసి తరించెదము గదా! నిజముగా గోపికల జన్మ ధన్యము. వారు యెంతటి పుణ్యాత్ములో. ప్రత్యగభిన్న సచ్చిదానంద ఘన శ్యామసుందరుని యొక్క సందర్శన, స్పర్శన, సంభాషణ భాగ్యము వారికే దక్కినది. ఇతరులకు దుర్లభమని యర్థము.

**బోలో శ్రీగోపికారమణులకు జై ..................**
**శ్రీ గోపికారమణునకు జై....................**
**శ్రీ గోపాల కృష్ణ భగవాన్ కీ జై.....................**

ఈ విధముగా వ్రజసుందరీమణుల యొక్క చేలాంచలముల యందుపవిష్టుడైన కృపామూర్తి యగు శ్రీకృష్ణ పరమాత్మ, వారి నిరభిమాన స్థితిని, అనన్య భావమును, త్యాగనిరతిని మరియు నిర్మల ప్రేమ పారవశ్యమును వీక్షించి వివశుడై, ఆర్ద్రహృదయుడై గోపికలతో నిట్లు పలుకుచున్నాడు.

**శ్లో॥ న పారయేఽహం నిరవద్యసంయుజాం**
**స్వసాధుకృత్యం విబుధాయుషాపి వః ।**
**యా మాభజన్ దుర్జరగేహ శృంఖలాః**
**సంవృశ్చ్య తద్ వః ప్రతియాతు సాధునా ॥** (భాగ. 10-32-22)

**టీక॥** ఆత్మీయులగు నో సఖీమణులారా! ఒక పరమ సత్యమును చెబుతున్నాను వినండి. గొప్ప గొప్ప యోగులకు గూడ దుర్భేద్యములగు, లేక పతివ్రతలగు కులస్త్రీలచే ఛేదించుటకశక్యమగు గృహసంబంధమగు = పతి,శ్వశ్రు, పితా, సుత, భ్రాతృ తథా మిత్రాది విషయక స్నేహ శృంఖలములను = ఐహికపారలౌకికసుఖకర లోక ధర్మ ఆర్యమర్యాదలను ఛేదించి మీరు నన్ను భజించినారు (సేవించినారు) అనగా = పరమాను రాగముచే నాయందాత్మనివేదనమొనర్చినారు. మద్విషయక చిత్తైకాగ్రతారూప మన యొక్క సంయోగము (కలయిక) యేది గలదో నది కామమయముగా తోచినప్పటికిని, లోక ధర్మశాస్త్రాపేక్షారహితముచే నిర్మల నిరుపాధిక ప్రేమ విశేషమయమగుటచే వస్తుతః నిర్దోషమై యున్నది. ఏదో ఒక వస్తు సంపర్కముచే నాపాదింపబడినది గాకుండా, స్వాభావికమగు మీ యొక్క యే అసాధారణ స్వసాధుకృత్యము (అనగా = త్యాగనిరతి, నిర్మల సేవ మరియు అనన్యమగు ప్రేమయుక్త ఆత్మనివేదనము యేది) గలదో, దానికి బదులుగా, నేను అన్యత్ర ప్రేమయుక్తుడనై యున్నందున అనగా పితృభ్రాతృ

స్వబంధువులయందు స్నేహము గలిగి యున్నందున, అమరజీవుడనై మరియు అక్షరదేహముచే అనంతకాలమునకైననూ (మీ యొక్క) ఋణము చెల్లించుకొనుటకసమర్థుడనై యున్నాను. మీరు మీయొక్క సౌమ్య స్వభావము చేత మరియు అనన్య ప్రేమ చేత నన్ను ఋణవిముక్తున్ని చేయగలరు. కాని నేను మాత్రము మీకు సదా ఋణపడియే యుంటాను.

అందుకే కాబోలు శ్రీకృష్ణుడు వృందావనమును విడిచి ఒక్క అడుగు గూడ వెళ్ళలేదు.

"వృందావనం పరిత్యజ్య పాదమేకం న గచ్ఛతి" తదనంతరము ఆత్మారాముడగు గోపీ జన వల్లభుడు (శ్రీకృష్ణుడు) శ్రీ యమునా పులినమున (తీరమున) మహారాసలీలను గావించెను.

**శ్లో॥ తత్రారభత గోవిందో రాసక్రీడామనువ్రతైః ।**
స్త్రీరత్నైరన్వితః ప్రీతైరన్యోన్యా బద్ధబాహుభిః ॥ (భాగ. 10-33-2)

**అర్థము :-** చేతులలో చేతులు వేసికొని నిలుచున్న ప్రేమికులు మరియు సేవికలునగు గోపికా స్త్రీ రత్నములతో శ్రీయమునా నదీ తటమున గోవిందుడు తన యొక్క రసమయమగు రాసక్రీడను ప్రారంభించెను.

**51. అభంగము :-**

**యమునే పాబళీం । గడియాం బోలే వనమాళీ ।**
**అణా శిదోర్యా సకళీం । కాలా కరూం ఆజీ॥1॥**

**అవఘే ఎకే ఠాయీం । కరూనీ స్వాద త్యాచా పాహీం ।**
**మజపాశీ ఆహే తేంహీ । తుమ్హా మాజీ దేతోం ॥2॥**

**మ్హణతీ బరవేం గోపాళ । మ్హణతీ బరవేం గోపాళ ।**
**వాహాతీ సకళ మోహరీ పాంవే ఆనందేం ॥3॥**

ఖడకీం సోడియేల్యామోటా । అవఘా కేలా ఎకవటా ।
కాలా కరూనియాం వాంటా । గడియాం దేతో హరి ॥4॥

ఎకా పుఢే ఎక । ఘాలీ హోత పసరీ ముఖ ।
గోళా పాంవే తయాసుఖ । అధికచి వాటే ॥5॥

అవఘియాంచే ఖాయ । కవళ కృష్ణ మాగ్ఝ మాయ ।
సురవర మ్హణతీ హోయ హోయ । సుఖా అంతరలో ॥6॥

దేంవ పాహతీ సకళ । ముఖే ఘోటూనియాం లాళ ।
ధన్య మ్హణతీ గోపాళ । ధిగ్ ఝాలో ఆమ్హీ ॥7॥

మ్హణతీ కైసే కరావేం । మ్హణతీ కైసే కరావేం ।
యమునా జళీం వ్హావేం । మత్స్య శేష ఘ్యావయా ॥8॥

సురవరాంచే థాట । భరలే యమునేచేం తట ।
తంవ అధికచి ఓఠ । మట మటాం వాజతీ ॥9॥

ఆనందే గోపాళాసహిత । క్రీడాకరీ గోపీనాథ ।
మ్హణే యమునేత హోత । నకా ధువూం కోణీ ॥10॥

మ్హణతీ జానే జీవీంచేం । లాజే త్యాస యేథే కైంచేం ।
శేష యా కృష్ణాచేం ।లాభే థోరివే ॥11॥

ధన్య దివస కాళ । ఆజి ఫావలా గోపాళ ।
మ్హణతీ ధాలోం రే సకళ । తుఝియానీ హోతేం ॥12॥

తుఝా సంగ బరవా । నిత్య అమ్హాంజీ ద్యావా ।
ఐసే కరూనియాం జీవా । నిత్యదేవా చాలావేం ॥13॥

**తుకా మ్హణే ప్రేమేం ధాలీం । కోణా న సహావే చాలీ ।**
**గాఈ గోపాళాంసీ కేలీ । ఆపణయాం సరీ ॥14॥ (3672)**

ప్ర.ప :- యమునే పాబళీం = యమునానది తీరమున (ఒకనాడు); వనమాలీ = శ్రీకృష్ణ భగవానుడు; (నిలబడి); గడియాం బోలే = గొల్ల పిల్లలతో ఇలా అన్నాడు; (ఓ గోపాలులారా!); సకళీం = మీరందఱూ; శిదోర్యా = చల్ది అన్నము; ఆణా = తీసికురండి; (ఎందుకనగా) ఆజీ = ఈ రోజు; కాలా కరూం = కాలా చేయుదము. 1. అవఘేం = అందఱి యొక్క చల్ది అన్నమును; ఎకే ఠాయీ కరూనీ = ఒకచోట చేర్చి (మిశ్రణము లేదా కిచిడీ చేసి); త్యాచా స్వాద = దానియొక్క రుచిని; పాహీం = (ప్రప్రథమమున నేను) చూచెదను; (తరువాత) మజపాశీ = నావద్ద; ఆహే = ఉన్న (చల్ది అన్నమును); తేంహీ = దానినిగూడ; తుమ్హామాజీ దేతోం = మీ అన్నములో కలిపెదను. 2. (అప్పుడు) గోపాళ = గోపాలురందరూ; బరవేం = చాలాబాగు; (అని) మ్హణతీ = అంటారు; (ద్విరుక్తి ఆదరార్థము); సకళ = అందఱు; ఆనందేం = ఆనందముతో; (వారి వారి) మోహరీ పాంవే = వాద్య విశేషములను; వాహాతీ = వాయించిరి. 3. (తదనంతరము వారి వారి) మోటా = చల్ది మూటలను; (ఒకానొక) ఖడకీం = రాతి గుంటలో; సోడియేల్యా = విడిచిరి; (మరియు) అవఘా = అన్నిటిని; ఎకవటా కేలా = ఒకచోట మిశ్రణము గావించిరి; (అప్పుడు) హరి = శ్రీకృష్ణ పరమాత్మ; కాలా = మిశ్రితాన్నమును; వాంటా = భాగములుగా; కరూనియాం = జేసి; గడియాం= పిల్లలకు; దేతో = ఇచ్చెను. 4. ఎకా పుఢే ఎక = ఒకరికంటె ముందు మరొకరు; హాత పసరీ = చేతులు చాచి; (కాలాను తీసికొని); ముఖ = ముఖములో; ఘాలీ = వేసికొనిరి; (ఎవరు కాలాయొక్క) గోళా = ముద్ద; (అధికముగా) పావేం = పొందిరో; తయా = వారికి; సుఖ = సుఖము;

అధికచి వాటే = ఎక్కువగానే కలిగెను. 5. (శ్రీతుకోబారాయ్ అంటున్నాడు) మాఝీ మాయ కృష్ణ = నా తల్లి యగు పాండురంగడు (శ్రీకృష్ణుడు)); అవఘియాంచే = గొల్లలందఱి చేతులతో; కవళ = కాలా అన్నము ముద్దలు; ఖాయ = తింటూ ఉన్నాడు; (అది చూసిన) సురవర = ఇంద్రాది దేవతలు; మ్హణతీ = అంటున్నారు; హాయ హాయ = ఆహా, ఆహా!; సుఖా = (ఈ) సుఖమును; అంతరలో = కోల్పోయితిమి గదా!. 6. సకళ దేంవ = ఇంద్రాదిక సకల దేవతలు; ముఖేం లాళ ఘోటూనియాం = నోటిలో ఉవ్విళ్ళు (లాలాజలము) ఊరుచుండగా; పాహాతీ = చూస్తున్నారు. (మరియు) గోపాళ= గోపాలురు; ధన్యం = ధన్యులు;ఆమ్హీ = మేము; ధిగ్ ఝాలోం = ధిక్కరింపబడినాము (మాకు ధిక్కారమగు గాక) అని; మ్హణతీ = అంటున్నారు. 7. (మరియు) క్రైసే కరావేం = (ఇప్పుడు) ఎలా చేయుదము; (దైన్యార్థే ద్విరుక్తిః ) శేష ఘ్యావయా = శ్రీకృష్ణుని యొక్క కరకమలములలో నున్న ఉచ్ఛిష్టాన్నమును గ్రహించుటకు; యమునాజళీం = యమునా నదీ జలములో (మనము); మత్స్య వ్హావేం = చేపలము అగుదుము (అని); మ్హణతీ = అనుకొనిరి. 8. (ఇట్లు అందఱు సమ్మతించి చేపలరూపమును ధరించి యమునాజలములో ప్రవేశించిరి) యమునేచేం తట = యమునా తటమున (జలములో); సురవరాంచే థాట భరలే = దేవతల యొక్క గుంపు నిండిపోయెను; తంవ = అప్పుడు (గోపాలురు కాలా భోజనమును తినుచూ) ఓఠ = పెదవులను; అధికచి = అధికముగా; మటమటాం = చప్పరించుచూ; వాజతీ = చప్పుడు చేయుచుండిరి. 9. గోపీనాథ = గోపీనాథుడు (శ్రీకృష్ణుడు); గోపాళాం సహిత = గోపాలురతో గూడి; ఆనందేం = ఆనందముతో; క్రీడా కరీ = క్రీడిస్తూ; (గోపాలురతో ఇలా) మ్హణే = అన్నాడు; (ఏమనగా) కోణే= మీరు ఎవరుగూడ, యమునేత = యమునానదిలో, హాత ధువూం నకా = చేతులు కడగకండి. 10. (ఒకానొక తెలివైన గోపాలుడు) మ్హణతీ =

అంటున్నాడు; (ఎమనగా! శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు గావున) జీవీంచే = జీవుల (దేవతల) యొక్క హృద్గతాభిప్రాయమును; జాణే తెలిసికున్నాడు; థోరివే = (మేము) దేవతలము) గొప్ప వారము అను అభిమానముచే; లాజే = లజ్జితులగు; త్యాస = వారికి (దేవతలకు); యెథే = ఇక్కడ; యా కృష్ణాచేం శేష = ఈ శ్రీకృష్ణపరమాత్మయొక్క ఉచ్ఛిష్టము; కైంచే లాభే = ఎలా దొరుకును?11. (ఆ గోపాలుడు శ్రీకృష్ణునితో ఇలా అంటున్నాడు) రే గోపాళ= ఓ దేవా! గోపాలకృష్ణా!; ఆజీ దివసకాళ = ఈనాటి సమయము; ధన్య పావలా = ధన్యమగు (ఈ దినమును) పొందితిమి; (ఎందుకనగా) సకళ = మేమందఱము; తుఝియానీ హాతేం = నీ యొక్క కరకమలములచే కాలారూప మహాప్రసాదమును పొంది; (ఆరగించి); ధాలోం = తృప్తులమయ్యాము (అని) మ్హణతీ = అంటున్నాడు. 12. (మరియు) దేవా= ఓ దేవా!; నిత్య = ఎల్లప్పుడు (జన్మజన్మలకు); ఆమ్హాంసీ = మాకు; తుఝా సంగ = నీయొక్క సాంగత్యమును; ద్యావా = ప్రసాదింపుము; (ఎందుకనగా) బరవా = (అదే చాలా) మంచిది; జీవా = (మా) మనస్సునకు (ఎల్లపుడు ఆనందమును); ఐసేం కరూనియాం = ఇట్లే కలిగింపజేయుము; (మరియు మేము) నిత్య = ఎల్లప్పుడు (ఇలాగే); చాలావేం = వర్తించు చుండునట్లు (అనుగ్రహింపుము). 13. తుకా మ్హణే = శ్రీతుకారాం మహారాజు గారంటున్నారు; (ఈ విధముగా) ప్రేమేం ధాలీం = కృష్ణుడు మరియు గోపాలురందఱు నిర్మలమగు అన్యోన్య ప్రేమచే పరితృప్తులైనారు; కోణా ఎవరికి గూడ (కృష్ణుని విడిచి ఒక్క అడుగు) చాలీ = వెళ్ళుటకు; న సహావే= సహించలేని వారైరి; (ఈప్రకారముగా శ్రీకృష్ణుడు) గా ఈ గోపాళాంసీ = గోవులను, గోపాలురను; ఆపణయాం సరీ = తనవలె; కేలీ = చేసికున్నాడు. 14.

**తా॥** శ్రీయమునా తీరమున నిలబడి భగవంతుడు ఇలా అంటున్నాడు - ఓ మిత్రులారా! మీరందఱు మీమీ చల్ది అన్నమును (చద్దిమూటలను) తీసికురండి. ఈ రోజు మనము "కాలా" (అందఱి అన్నమును ఒక చోట మిశ్రణము) చేసెదము. 1. అందఱి అన్నమును ఒకచోట చేర్చి, మొదట నేను దాని రుచిని చూచెదను. తరువాత నావద్ద ఉన్న అన్నమును గూడ మీ అన్నములో కలిపి అందఱికి పంచెదను. 2. అప్పుడు గోపాలురందఱు సమ్మతించి - "కృష్ణా చాలా బాగుంది. చాలా బాగుంది" అని అంటూ ఆనందముతో వారి వారి వాద్య విశేషములను వాయించిరి. 3. తదుపరి వారి చల్ది మూటలన్నింటిని ఒక బండరాయి గుంటలో వదిలి, అన్నిటిని ఒక చోట కలిపి "కాలా" చేసిరి. మరియు శ్రీహరి ఆ "కాలా" అన్నమును గోపబాలురందఱుకు ప్రసాదిస్తూ ఉన్నాడు. 4. అప్పుడు గోపాలురందఱు ఒకరికంటె ముందు మరొకరు చేతులు చాచు చుండిరి. ఇట్లు ఒకరి ముఖములో ఒకరు పరస్పరము గోరుముద్దలు వేసికొనుచుండిరి. ఎవరికి అన్నము ముద్దలు ఎక్కువగా దొరికెనో వారికి అధిక సుఖము లభించెను. 5. శ్రీతుకోబారాయ్ అంటున్నాడు - నా తల్లియగు శ్రీపాండురంగడు (కన్నయ్య) వృందావనములో గోపాలురందఱి చేతులతో అన్నము ముద్దలు తింటూ మరియు అందఱికి తన కరకమలములచే తినిపిస్తూ ఉన్న ఈ అద్భుత దృశ్యమును చూసి ఇంద్రాది దేవతలు ఇలా అంటున్నారు - అయ్యయ్యో! మేము ఈ దేవ శరీరము నొంది వృథాగా శ్రీకృష్ణపరమాత్మయొక్క పవిత్రమైన గోరుముద్దలకు నోచుకోలేక కోల్పోయితిమి గదా!. 6.

సు.వ్యా:- చల్దులారగించుటకు అనుకూల స్థలముగా నెంచి శ్రీయమునా పులినమును స్తుతించుచున్నాడు శ్రీగోపాలకృష్ణుడు.

శ్లో॥ అహెూఽతిరమ్యం పులినం వయస్యాః
స్వకేలి సంపన్మృదులాచ్ఛ వాలుకమ్ ।
స్ఫుటత్సరో గంధ హృతాలి పత్రిక-
-ధ్వని ప్రతిధ్వానల సుద్రుమాకులమ్ ॥ (భాగ. 10-13-5)

అర్థము :- ఓ ప్రియమైన మిత్రులారా! ఆహా! ఇటుచూడండి. యమునానదీ తీరము అత్యంత రమణీయమై యొప్పుచున్నది. ఈ పరిదృశ్యమానమగు యిసుక తెన్నెలు తృణ కంటక శర్కరారహితమై యెంత కోమలము, స్వచ్ఛమునై యున్నవి. మనము క్రీడించుటకు వలసిన సామగ్రులన్నియును విద్యమానములై యున్నవి. అటు చూడండి. రంగురంగుల తామరలు వికసించి యున్నవి. వాటి యొక్క సుగంధమునకాకర్షింపబడిన భ్రమరములు ఎంత ఆనందముగా ఝుంకారము చేయుచున్నవి. మరియు రకరకములైన అతి సుందరమగు పక్షులు మధురమైన గొప్ప కలకలారవము జేయుచున్నవి. పక్షుల కలరవ ప్రతిధ్వనిచే సుశోభిత వృక్షములు ఈ స్థానమునకు శోభను పెంపొందింప జేయు చున్నవి.

శ్రీకృష్ణుడంటున్నాడు - ఓ నేస్తములారా! మనమంతా క్షుద్బాధచే బాధపడుచున్నాము. ఇప్పటికే చాలా ప్రొద్దుపోయినది. లేగ దూడలు ఈ పరిసరప్రాంతములలో పచ్చిక మేయుచుండును. మనము భుజించుటకిది యనువైన ప్రదేశము. రండి చల్దు లారగించెదము.

శా॥ ఎండన్ మ్రగ్గితిరాకటఁ బడితిరింకేలా విలంబింపఁగా
రండో బాలకులార! చల్దిగుడువన్ రమ్య స్థలంబిక్క డీ ।
దండన్ లేగలు నీరుద్రావి యిరవందం బచ్చికల్ మేయుచుం
దండంబై విహరించు చుండగ నమంద్ర ప్రీతి భక్షింతమే ॥
(పో.భా. 10-13-491)

అని శ్రీకృష్ణుడు పిలువగా గోపాలురందఱు "బాగు" "బాగు" యనుచు గోవత్సరములను మేతకు బంపి, శ్రీయమునా సైకత ప్రదేశములో శ్రీకృష్ణుని చుట్టూ కూర్చొనిరి. వారి వారి చల్ది మూటలను విప్పి భగవంతునితో పాటు ఎంతో ఆనందముతో భుజించుచుండిరి. ఆ నయన మనోహర సుందర దృశ్యమును శ్రీశుకదేవులు అత్యద్భుతముగా వర్ణించుచున్నారు.

శ్లో॥ కృష్ణస్య విష్వక్ పురురాజిమండలై-
రభ్యాననాః పుల్లదృశో వ్రజార్భకాః ।
సహోపవిష్టా విపినే విరేజు
శ్చదా యథామ్భోరుహకర్ణికాయాః ॥ (భాగ. 10-13-8)

**అర్థము :-** కమలము మధ్యమునందు ఉన్న కర్ణికకు చుట్టూ పెద్దవి చిన్నవియునగు రేకులు గోచరించునట్లు శ్రీగోవిందుని చుట్టూ గోపాలురు అత్యంతసన్నిహితముగా అనేకవరుసలలో కూర్చుండిరి. గోపాలుర నేత్రములు పరమానందముతో వికసించుచుండెను. వనభోజనము చేయుచున్న సమయములో శ్రీకృష్ణునితో కూర్చున్న గోపబాలురు ఎంతో శోభాయమానమై సంతుష్టచిత్తులై కన్పట్టు చుండిరి. శ్రీకృష్ణుడు తమవైపే చూస్తున్నాడని ప్రతి ఒక్కరు భావింపసాగిరి. భగవంతునికి చాలా దగ్గరగా కూర్చొనవలెనని తమవద్దనున్న పదార్థములను శ్రీకృష్ణునికే సమర్పించవలెనని కుతూహల పడుచుండిరి.

యజ్ఞభోక్తయగు శ్రీమన్నారాయణుడు బాల్యక్రీడ జరుపుచు, వేణువును మొలలో పెట్టుకొని, మీగడ పెరుగుతో కలిపిన బంతి చల్దులను చేతియందిడుకొని, వ్రేళ్ళ సందుల యందు వ్యంజనములను నింపుకొని, అందరికి యభిముఖముగ మధ్యలో గూర్చుండి, ఛలోక్తులతో చెలికాండ్రను నవ్వించుచు "కాలా"భోజనమునారగించుచున్న ఈ దివ్యలీలను

దేవతలందఱు ఆకాశమున నిలుచుండి పరమానందముతో వీక్షించు చుండిరి.

సీ॥ కడుపున దిండుగాఁ గట్టిన వలువలో
లాలిత వంశనాళంబుఁ జొనిపి ।
విమల శృంగంబును వే్త్రదండంబును
జాఱి రానీక డా చంక నిఱికి ।
మీఁగడ పెరుఁగుతో మేళవించిన చల్ది
ముద్ద డాపలి చేత మొనయ నునిచి ।
చెలరేగి కొసరి తెచ్చిన యూరగాయలు
వ్రేళ్ళ సందులను దా వెలయ నిఱికి ।

ఆ॥ సంగడీల నడుమఁ జక్కనఁ గూర్చుండి
నర్మభాషణముల నగవు నెఱపి ।
యాగభోక్త కృష్ణుఁ దమరులు వెఱఁగంద
శైశవంబు మెఱసి చల్ది గుడిచె ॥ (పోతన. భాగ. 10-13-496)6.

పై సన్నివేశములో అమరులను గూర్చి మరింత మనోరంజకముగా వర్ణిస్తున్నాడు శ్రీతుకోబారాయ్.

భగవంతునితో గోపాలుడు చల్దు లారగించు దృశ్యమును చూసిన దేవతలకు నోటిలో ఉవ్విల్లు (లాలాజలము) ఊరుచుండెను. మరియు ఇలా అంటున్నారు - అహెూ! గోపాలుర, జన్మధన్యము. మాకు ధిక్కారమగు గాక!7. శ్రీకృష్ణ - గోపాలుర యొక్క కాలాప్రసాదము మనకు లభించవలెనన్న యేదో నొక యుక్తిని యెన్నవలెనని ఇంద్రాది దేవతలు పరస్పరము విచారించు చుండ, కొందఱు దేవతలు యిలా అన్నారు - గోపాలురు చేతులు కడుగుకొనుటకు అవశ్యముగా యమునా జలములోకి వస్తారు. వారి యొక్క

శేషము (ఉచ్ఛిష్టము)ను గ్రహించుటకు మనము నీటిలో చేపల మగుదము. దానికందఱు సమ్మతించిరి. 8. ఈ ప్రకారముగా శ్రీయమునా జలములో చేపల రూపములో ఇంద్రాది దేవతల సందడి యేర్పడెను. అప్పుడు గోపాలురందఱు కాలా ప్రసాదమును భుజించుచూ పెదవులతో చప్పరించుచూ అధికముగా చప్పుడు చేయుచుండిరి. 9. ఈ విధముగా గోపాలురతో సహా ఆనందముగా క్రీడిస్తూ మధ్యలో శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు – "ఈ రోజు మీరెవ్వరు గూడ యమునలో చేతులు కడుగ వద్దు". 10. ఇంతలో ఒక తెలివైన గోపాలుడంటున్నాడు – సర్వజ్ఞుడైన భగవంతుడు యమునానదిలో దాగి యున్న దేవతలయొక్క మనసోగతమును బహుశ:తెలిసికున్నాడు. కాకుంటే మరేమిటి? తమ ఉత్కృష్టతయొక్క అభిమానముచే లజ్జితులైన వారికి, భగవంతుని యొక్క ఉచ్ఛిష్టము ఎలా లభించును? 11. గోపాలుడంటున్నాడు – ఈ రోజు ఎంతో చక్కని సుదినము మాకు ప్రాప్తించినది. దేవా! నీయొక్క కరకమలములచే పరితృప్తులమై పరమానందమొందితిమి. 12. దేవా! మాకు జన్మ జన్మలకు నీయొక్క సాంగత్యమునే ప్రసాదింపుము. ఎందుకనగా – నీయొక్క సాన్నిధ్యమే మాకు పరమానందము. దేవా! నీవు మాకు ఎల్లప్పుడూ ఇలాగే ఆనందమును యిచ్చుచుండునట్లుగా, మాయొక్క వృత్తి, ప్రవృత్తి యిలాగే ఉండునట్లు అనుగ్రహింపుము.

సు.వ్యా :– విష్ణు ( కృష్ణ)భక్తుడు భగవత్సాంగత్యము, అనన్య భక్తి తప్ప బ్రహ్మాది లోకముల ప్రాప్తిగాని, సాలోక్యాది క్రమముక్తిగాని మరియు కైవల్యముక్తిని గూడ ఇచ్ఛగించడు.

శ్లో॥ సాలోక్య సార్ష్టి సామీప్య సాయుజ్య శ్రీహరేరపి ।
తత్ర నిర్వాణ మోక్షం చ న హి వాంఛన్తి వైష్ణవాః ॥

(బ్ర.వై.పు. బ్రహ్మఖండము. 12-35)

**అర్థము :-** శ్రీహరియొక్క సాలోక్యము, సార్ష్టి, సామీప్యము మరియు సాయుజ్యమునుగాని, అట్లే నిర్వాణ మోక్షమును గూడ వైష్ణవ జనులు ఇచ్ఛగించరు.

**శ్లో॥** న నాకపృష్ఠం నచ సార్వభౌమం
న పారమేష్ఠ్యం న రసాధిపత్యమ్ ।
న యోగ సిద్ధీరపునర్భవం వా
వాంఛన్తి యత్పాదరజః ప్రపన్నాః ॥ (భాగ. 10-16-37)

**అర్థము :-** హే ప్రభో! యెవరు నీ యొక్క చరణధూళి నాశ్రయిస్తారో, వారు (ఆ కృష్ణభక్తులు) స్వర్గాధిపత్యముగాని, పృథ్వీ సార్వభౌమత్వము గాని, రసాతలాధిపత్యముగాని, బ్రహ్మము యొక్క పదవిని గాని, అణిమాద్యష్ట (యోగ) సిద్ధులు గాని మరియు జన్మ మరణములను విడిపించు కైవల్య మోక్షమును గూడ వాంఛింపరు.

**శ్లో॥** కర్మభిర్భ్రామ్యమాణానాం యత్ర క్వాపీశ్వరేచ్ఛయా ।
మంగళాచరితైర్దానై రతిర్నః కృష్ణ ఈశ్వరే ॥ (భాగ . 10-47-67)

**అర్థము :-** నందబాబా మరియు వ్రజవాసులగు గొల్లలు మొదలగు వారు ఉద్ధవునితో ఇలా అంటున్నారు. హే ఉద్ధవా! మేము సత్యమును చెబుతున్నాము వినుము. మాకు మోక్షము యొక్క యిచ్ఛ యేమాత్రమును లేదు. మేము భగవంతుని యిచ్ఛచేత మా కర్మానుసారము యే యోనిలోనైనా జన్మించెదము గాక - అది మాకు యభీష్టమే. కాని మేము కోరునది యింతే. ఏమనగా! అక్కడ గూడ మేము సదాచారసంపన్నులమై దానము మొదలగు శుభకర్మలు చేస్తూ ఉండాలి. మరియు తత్ఫలముగా మాకు ఈశ్వరుడగు శ్రీకృష్ణుని యందు ప్రీతి ఉత్తరోత్తరము వృద్ధియగు చుండవలెను.

శ్లో॥ మనసో వృత్తయో నః స్యుః కృష్ణపాదాంబుజాశ్రయాః ।
వాచోఽభిదాయినీ ర్నామ్నాం కాయస్తత్ప్రహ్వాణాదిషు ॥
(భాగ. 10-47-66)

**అర్థము :-** ఓ ఉద్ధవా! ఇప్పుడు మేము ఇంతకంటే వేరెద్దియును కోరుటలేదు. ఏమనగా! మాయొక్క ఒక్కొక్క మనోవృత్తి, ఒక్కొక్క సంకల్పము శ్రీకృష్ణునియొక్క చరణకమలములనే యాశ్రయించి యుండవలెను. మాయొక్క మనస్సు, వాక్కు మరియు కాయము క్రమముగా భగవచ్చింతన, భగవన్నామోచ్చారణ, ప్రణామమాచరించుట, భగవంతుని యాజ్ఞా పాలన మరియు సేవాదుల యందు తత్పరములై యుండవలెను.

అందుకే గోపాలుడంటున్నాడు - ఓ దేవా! మాకు జన్మ జన్మలకు నీ యొక్క చరణ సాన్నిధ్యమునే ప్రసాదింపుము. నీవు మాకెల్లప్పుడు యిలాగే ఆనందమునందిస్తూ ఉండాలి. మా యొక్క వృత్తి (వ్యాపారము) ఎల్లప్పుడు యిలాగే యుండునట్లనుగ్రహింపుము. 13. శ్రీతుకారాం మహారాజుగా రంటున్నారు. ఈ ప్రకారముగా గోపబాలురు మరియు శ్రీకృష్ణుడు పరమానందముచే పరితృప్తులైనారు. ఏ ఒక్కరికి గూడ కన్నయ్యను విడిచి ఒక్క అడుగు గూడ వేయుటకు సహనమగుట లేదు. ఇట్లు గోవిందుడు గో - గోపాలురను ఆత్మసాత్ చేసుకున్నాడు. 14.

**52.** అభంగము :-

ఘాలీ కవాడ టళలీ వాడ రాతీ ।
కామేం వ్యాపిలీ కాం పడలీ దుశ్చిత్తీ ।
కోణే లాగలాగే సదైవేచే హోతీం ।
ఆజీ శూన్య శేజే నాహీం దిసే పతి వో ॥1॥

బోలే దూతికేశీఁ రాధాహేఁ వచన ।
మశీఁ లాఘవ దాఖలీ నారాయణ ।
మ్హణే కోమల పరీ బహుగే నిర్గుణ ।
యాశీఁ న బోలేఁ కళలా మజ పూర్ణవో ॥2॥

ధాడిలే గరుడా ఆణిలేఁ హనుమంతా ।
తై పాచారిలే హెూ ఉనీ యే వో సీతా ।
లాజిన్నలీ రూప న యే పాలటితాం ।
ఝాలా భీమకీ ఆపణ రామ సీతా వో ॥3॥

సత్యభామా దాన కరీ నారదాసీ ।
తై కళలా వో మజ హృషీకేశీ ।
తుళే ఘాలితాం వో న యే కనకరాశీ ।
సమ తుకేం ఏక పాన తులసీ వో ॥4॥

మజ భులీ పడలీ కైశాపరీ ।
ఆమ్హా భోగూనీ మ్హణే మీ బ్రహ్మచారీ ।
దిలీ వాట యమునే మాయే ఖరీ ।
తుమ్హా ఆమ్హా న కళే అద్యాపవరీ వో ॥5॥

జాణే జీవీంచే సకళ నారాయణ ।
అసే వ్యాపూనీ పరీ న దిసే లపూన ।
రాధా సంబోఖిలీ ప్రీతి ఆలింగూన ।
తుకా మ్హణే యెథేఁ భావచి కారణ వో ॥6॥ (3776)

ప్ర.ప :- (కృష్ణుడు వచ్చే సమయము) టళలీ = మించిపోయినది; (ఎందుకనగా?) రాతీ వాడ = రాత్రి అధికమైనది; (అందుకని రాధా) కవాడ

ఘాలీ = ద్వారము మూసి వేసెను; (కాని, ఆమె హృదయము శ్రీహరి విషయమై) కామేఁ = కామముచే; వ్యాపిలీ = వ్యాప్తమై (యుండెను); కాం= సందేహములో (పడి); దుశ్చిత్తీ = నిరాశతో ఉదాసీనురాలై; (పడకపై) పడలీ = పడిపోయినది; (కాని, నిద్ర పట్టలేదు. అందుకని రాధ తన నెచ్చెలితో ఇలా అంటున్నది) గే = సఖీ!; ఆజీ = ఈ రోజు; (శ్రీకృష్ణుడు) కోణే = యే; సదైవేచే = భాగ్యవంతురాలగు (గోపిక యొక్క); హాతీఁ = చేతిలో; లాగలా= చిక్కెనో (గదా!); వో = అహెూ!; (ఈ రోజు నా) శేజే = శయ్య; శూన్య = శూన్య మయ్యెను; పతి = నాపతి యగు శ్రీహరి; నాహీ దిసే = అగుపడకుండెను. 1. రాధా = రాధ; దూతికేశీ; = సేవకురాలితో; హే వచన = ఈ వచనములు; బోలే = పలికెను; (ఏమనగా!) నారాయణ = శ్రీమన్నారాయణుడగు గోపాలకృష్ణుడు; మశీఁ= నాతో;(తరచుగా) లాఘవ= కపట భావముతో; దాఖలీ = చూపిస్తాడు; (పైకి చూడడానికి మాత్రము చాలా) కోమల = మృదువుగా; మ్హణే = అనిపించును (కనుపించును); పరీ= కాని; (అంతర్యములో) గే = ఓ సఖీ; బహు = చాలా; నిర్గుణ – కఠిన హృదయుడు; వో = అహెూ; (యిక మీదట) యాశీం = అతనితో; న బోలేఁ = మాట్లాడను; (ఎందుకనగా!) మజ = నాకు (అతని నాటకము); పూర్ణ = పూర్తిగా; కళలా = తెలిసినది. 2. (ఒకసారి మారుతి రాయుడు సహజముగా ద్వారకకు వచ్చియుండెను. అప్పుడు శ్రీకృష్ణుడు) గరుడా = గరుత్మంతుని; ధాడిలేం = పంపించి; హనుమంతా = హనుమంతున్ని; ఆణిలేఁ = తెచ్చి; తై = అప్పుడు; (సభలోకి) పాచా రిలేఁ= ఆమంత్రించెను; (ఆంజనేయుడు ఏకనిష్ఠ రామభక్తుడు. అతడు శ్రీరామచంద్రప్రభువును తప్ప అన్యులను దర్శించుట కిష్టపడడు. కావున, శ్రీకృష్ణ పరమాత్మ సత్యభామతో ఇలా అన్నాడు) వో = ఓ భామ! (నీవు) సీతా హెూఉనీ = సీతగా వేషము మార్చుకొని; యే = రమ్ము; (కాని, సత్యభామకు) రూప =

తన రూపమును; పాలటితాం = మార్చుకొనుటకు; నయే = రాకుండెను. (దానితో ఆమె) లాజిన్నలీ = సిగ్గుపడెను; వో = అహో!; (అప్పుడు) ఆపణ= తాను (కృష్ణుడు); రామ = రాముడుగా (మరియు శ్రీ రుక్మిణీ ) సీతా = సీతగా; భీమకీ = భూమికలను; ఝాలా = అయిరి (దాల్చిరి). 3. (ఒకసారి) సత్యభామా = సత్యభామ; నారదాసీ = శ్రీనారదమునీంద్రులవారికి; (శ్రీకృష్ణున్ని) దానకరీ = దానము చేసెను; వో = ఓసఖీ! (ఆహో)!; తై = అప్పుడు; మజ = నాకు; హృషీకేశీ = శ్రీకృష్ణుని యొక్క (గొప్ప తనము) కళలా – తెలిసి వచ్చెను; (ఏమనగా! శ్రీకృష్ణున్ని సత్యభామ) తుళే ఘాలితాం= తక్కెడ (తరాజు, త్రాసులో) కూర్చుండబెట్టి; (మరొక ప్రక్క అంతఃపురములోని మొత్తము) కనరాశి = బంగారు రాసులను పోసి (తూచినా); వో= అమ్మో!; న యే = కృష్ణునకు సరితూగుటలేదు; (కాని, రుక్మిణి) ఏక తులసీ పాన = ఒకానొక తులసి దళమును (త్రాసులో వేయగా) వో = అహా! (ఏమి ఆశ్చర్యము); సమ తుకేం = (తులసి దళమునకు) సరితూగెను. 4. (ఓసఖీ!) మజ = నాకు (నేనుగూడ); కైశాపరీ = ఎటువంటి; భులీ పడలీ = భ్రమలో పడ్డానో (చెబుతాను విను, శ్రీకృష్ణుడు ఒకసారి యమునా నదిని దాటవలసి వచ్చినప్పుడు "నేను ఒకవేళ నైష్ఠిక బ్రహ్మచారినైతే యమునానది నాకు దారి యివ్వవలయును" అని) ఆమ్హా = మమ్ములను (అందటిని); భోగూనీ= అనుభవించి; మీ = నేను; బ్రహ్మచారీ = నైష్ఠిక బ్రహ్మచారిని (అని); మ్హాణే= అన్నాడు; (అప్పుడు=ఓ చెలీ!) ఖరీ = నిజముగానే; యమునే మాయే = శ్రీయమునా మాత; వాట దిలీ = దారినిచ్చెనే; వో = అహెూ! ఏ ఆశ్చర్యము; అద్యాపవరీ = ఇప్పటి వరకు గూడ; తుమ్హా = మీకు గాని; ఆమ్హా = మాకుగాని; (శ్రీకృష్ణుని యొక్క మాహాత్మ్యము) న కళే = తెలియకుండెను. 5. తుకామ్హణే = శ్రీతుకోబారాయ్ అంటున్నాడు; నారాయణ = శ్రీమన్నారాయణుడు; సకళ జీవీంచే = సమస్త ప్రాణుల (అంతఃకరణగత

కామనలను) జాణే = తెలిసికొనును; (అతడు సర్వత్ర) వ్యాపూని అసే = వ్యాపించి యుంటాడు; పరీ = కాని; లపూన = మాయ యొక్క ఆవరణచే ఆచ్ఛాదింప బడినవానివలె; న దిసే = అగుపించదు; (ఈ ప్రకారముగా శ్రీకృష్ణుడు) రాధా = రాధను, ప్రీతి = ప్రేమచే; ఆలింగూని = ఆలింగన మొనర్చుకొని; సంబోఖిలీ = (మనస్సును) తృప్తిపరచెను. (కామమును శాంతింపజేసెను); వో = ఆహా!; యేథే = యిక్కడ; రాధ చెప్పిన విషయములన్నిటికి; కారణ = హేతువు (నిమిత్తము); భావచి = శుద్ధ సాత్త్విక భావమే (యని యెఱుంగనగును.)6.

**తా॥** రాత్రి ఎక్కువగా అయినందున, శ్రీకృష్ణుడేతెంచు వేళ దాటిపోయినదని యెంచి శ్రీరాధాదేవి గడియవేసికొనెను. కాని, ఆమె హృదయము కామముచే వ్యాపించి యుండెను. శ్రీకృష్ణ విరహబాధను తాళలేకుండెను. శ్రీకృష్ణ సందర్శన అలాభముచే నిరాశతో ఉదాసీనురాలై శయ్యపై పడిపోయెను. కాని నిద్ర పట్టుట లేదు. అప్పుడు శ్రీరాధాదేవి తన నెచ్చెలితో యిలా అంటున్నది – హే సఖీ! ఈ రోజు నా మనమోహనుడు (శ్రీకృష్ణుడు) యే భాగ్యవంతురాలగు గోపిక చేతిలో జిక్కెనో గదా! నాపతియొక్క అభావముచే, నా శయ్య శూన్యమయ్యెను. నా శ్యామసుందరుడగుపించడాయె గదా!1. శ్రీరాధాదేవి తన దాసితో యిలా అంటున్నది – శ్రీకృష్ణుడు ఎప్పుడూ తరచుగా నాతో కపటముతో వ్యవహరిస్తూంటాడు. పైకి యెంతో మృదువుగా కనిపించినప్పటికిని, లోన మాత్రము చాలా నిర్గుణుడు, నిష్ఠురుడునై యున్నాడు. యిక మీదట నేనతడితో మాట్లాడను. ఎందుకనగా! అతడు యెంతటి నటవరుడో నాకు పూర్తిగా తెలిసినది.2. ఓ చెలీ! శ్రీకృష్ణుని యొక్క పూర్వవృత్తాంతమును చెబుతాను వినుము. ఒకసారి మారుతిరాయుడు సహజముగా ద్వారకకు

యేతెంచెను. అప్పుడు శ్రీకృష్ణుడు గరుత్మంతుని పంపించి హనుమంతుని తెప్పించి, తన కొలువులోనికాహ్వానించినాడు. ఆంజనేయుడు గొప్ప ఏకనిష్ఠ రామభక్తుడు. అతడు శ్రీరామ చంద్ర ప్రభువును తప్ప అన్యులను దర్శింప నిచ్ఛగింపడు. అందుకని ఈ కపట వేషధారియగు నటవరుడు (కృష్ణుడు) శ్రీరామ చంద్రుని భూమికను ధరించెను. మరియు సత్యభామకు సీత పాత్రను ధరించుమని చెప్పెను. కాని, ఆమెకు తన రూపమును మార్చుకొని సీత భూమికను పోషించుటకు యే విధముగను రాకుండెను. చిట్టచివరకు తన యొక్క అసమర్థతకు సత్యభామ లజ్జితురాలాయెను. అప్పుడు శ్రీ రుక్మిణి సీత భూమికను మరియు శ్రీకృష్ణుడు రాముని భూమికను ధరించిరి. 3. ఒకసారి సత్యభామ శ్రీనారద మహర్షులవారికి శ్రీకృష్ణున్ని దానము చేసెను. అప్పుడు హృషీకేశుడు శ్రీనారదులవారి వెంట వెంట జనుచుండెను. అది తెలిసిన పదుహారు వేల గోపికలు మరియు శ్రీరుక్మిణితో సహా అందఱునూ భయము జెందిరి. వెంటనే పరుగు పరుగున శ్రీనారద మునీంద్రులవారి చెంత కేతెంచి "మా కృష్ణుని మాకిచ్చి వేయండి" అని పదే పదే ప్రార్థించిరి. అప్పుడు శ్రీనారదులవారంటూరు– మాతలారా! మీకు శ్రీకృష్ణుడు కావలయునన్న "అతని బరువునకు సరితూగు బంగారమును దానము చేయండి" అని చెప్పెను. అది విన్న సత్యభామ వెంటనే శ్రీకృష్ణున్ని త్రాసులో ఒకవైపు గూర్చుండ జేసి, మరొక ప్రక్కనంతఃపురములోని సువర్ణమునంతయు నుంచెను. కాని, శ్రీకృష్ణుడు కూర్చున్న త్రాసు పళ్ళెము కొంచెము గూడ పైకి లేవదాయెను. తన యొక్క అహంకారమునకు సత్యభామ సిగ్గుపడెను. తన యొక్క అసమర్థతకు చాలా దుఃఖించెను. అప్పుడు శ్రీ రుక్మిణిదేవి అనన్య భక్తి భావముతో నొక తులసీ దళమును త్రాసులో వేయగా దానికి శ్రీకృష్ణుడు సరితూగెను. ఆ ప్రసంగములో శ్రీహృషీకేశుడు యెంతటి గొప్పవాడో – నాకు తెలిసినది. 4. (ఇట్లు రాధ తన చెలికత్తెతో చెప్పుచున్నది.)

నేను గూడా యెంత భ్రమలో పడ్డానో - చెబుతాను. విను. ఒకసారి అకస్మాత్తుగా పొంగి పొరలి ప్రవహిస్తున్న యమునానదిని, శ్రీకృష్ణునితో సహా మేమందఱము గోపికలము దాటవలసి వచ్చెను. ఆ సమయములో శ్రీకృష్ణుడు యిలా అన్నాడు- "ఒకవేళ నేను నైష్ఠిక బ్రహ్మచారినై యుంటే, యమునానది నాకు దారి ఇవ్వవలయును". ఓ సఖీ! నిజముగానే యమునామాత దారి యిచ్చినది. కాని, మాకు మాత్రము చాలా ఆశ్చర్యము కలిగినది. ఎందుకనగా! శ్రీకృష్ణుడు స్వయముగా మమ్ములందఱిని భోగించియు తాను నైష్ఠిక బ్రహ్మచారి యనిపించు కున్నాడు. ఇది యాశ్చర్యము గాదా! దీనినిబట్టి శ్రీకృష్ణుని మాహాత్మ్యమేమిటో ఇప్పటికి గూడ మీకు గాని, మాకుగాని దెలియ లేదనే చెప్పుకోవాలి. 5. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు- ఆ శ్రీమన్నారాయణుడు సకల ప్రాణుల యంతఃకరణగత కోరికలను తెలుసుకుంటాడు. తాను సర్వత్ర వ్యాపించి యుండియు, మాయయొక్క ఆవరణ చేత ఆచ్ఛాదింపబడినవానివలె యుండి కనిపించుట లేదు. ఈ ప్రకారముగా రాధ తన స్నేహితురాలితో చెప్పుచుండెను. అదే సమయములో శ్రీకృష్ణుడు రాధ యింటిలోనే యెవరికి తెలియకుండా చీకటిలో దాగుకొని యుండి రాధయొక్క మాటలు వింటూ ఉండెను. శ్రీకృష్ణవిరహమును భరించలేక కామజ్వరముతో నతి విహ్వలయగు రాధ యొక్క అవస్థను గమనించిన రాధారమణుడు రాధయెదుట ప్రకటమై "రాధా! ఇదుగో! నేను వచ్చేసాను. యిటు చూడుము" అని పలుకరించెను. మరియు రాధాదేవిని శ్రీకృష్ణుడు ప్రేమతో దృఢముగా నాలింగనమొనర్చి, ఆమె మనస్సునకు శాంతిని ప్రసాదించి, తృప్తిపరచెను. ఈ ప్రకారముగా రాధ చెప్పిన విషయములన్నిటికి "శుద్ధ సాత్త్వికభావమే" యని యెఱుంగనగును. 6.

53. అభంగము :-

నారాయణ భూతీం న కళే జయాసీ ।
తయాం గర్భవాసీ యేణే జాణే ॥1॥

యేణే జాణే హెూయ్ భూతాంచ్యా మత్సరేం ।
న కళతాం ఖరేం దేవ్ ఐసా ॥2॥

దేవ్ ఐసా జయా కళలా సకళ ।
గేలీ తళమళ ద్వేషబుద్ధి ॥3॥

బుద్ధీచా పాలట నవ్హే కదా కాళీం ।
హరీ జళీ స్థళీ తయా చిత్తీం ॥4॥

చిత్త తే నిర్మళ జైసేం నవనీత ।
జాణిజే అనంత తయామాజీం ॥5॥

తయామాజీం హరీ జాణిజే త్యా భావేం ।
ఆపులే పరావే సారిఖేంచే ॥6॥

చింతనే తయాచ్యా తరతీం అనేక ।
జోహేం సకళీక దేవ్ దేఖే ॥7॥

దేవ్ దేఖే తోహీ దేవ్ కైసా నవ్హే ।
ఉరలా సందేహ కాయ్ తయాసీ ॥8॥

కాయావాచా మనేం పూజావే వైష్ణవ ।
మనీం శుద్ధభావ ధరూనియాం ॥9॥

యాంసీ కవతుక దాఖవిలేరానీం ।
వోణవా గిళూనీ గోపాళాంసీ ॥10॥

గోపాళాంచే డోళేc । ఝూకవిలే హాతేc ।
దరిలేc అనంతేc విశ్వరూప ॥11॥

పసరూనీ ముఖ గిళియేలీ జ్వాళ ।
పాహాతీ గోపాళ భోటాసంధీ ॥12॥

సంధీ సారూనియాc పాహిలేc అనంతా ।
మ్హణతీ తేc ఆతాc కళలాసీ ॥13॥

కళలా హా తుఝా దేహ నవ్హే దేవా ।
గిళీలా హోణవా ఆణీక తో ॥14॥

తోc తయాం కళలా ఆరష గోపాళాc ।
దుర్గమ సకళాం సాధనాంసీ ॥15॥

శీణ ఉరే తుకా మ్హణే సాధనాంచా ।
భావికాంసీ సాచా భావ దావీ ॥16॥ (3827)

ప్ర.ప:- జయాంసీ = ఎవరికైతే; భూతీc = సకల భూతము (ప్రాణు)లయందు;నారాయణ = నారాయణుడు; న కళే = తెలియబడలేదో; తయాc = అతనికి; యేణే జాణే గర్భవాసీ = గర్భమునందు రావడము మరియు పోవడము (జన్మ మరణములు) తప్పవు. 1. భూతాంచ్యా = సకల చరాచర ప్రాణులయందు; మత్సరేc = మాత్సర్య భావము కలిగియున్నందు వలన; (మరియు) ఐసాదేవ్ = సర్వవ్యాపకుడైన పరమాత్మ తత్త్వము; ఖరేc= యథార్థముగా; న కళతాం = తెలుసుకొననందున; యేణే జాణే హెూయ్= పుట్టి చచ్చుట సంభవించును. 2. జయా = ఎవరికైతే; ఐసా దేవ్ = వ్యాపక బ్రహ్మ తత్త్వము; సకళ = సంపూర్ణముగా; కళలా = తెలియబడినదో (వారియొక్క); ద్వేషబుద్ధి తళమళ = మాత్సర్యరూప జ్వలనము; గేలీ =

నష్టమగును. 3. (ఎవరి యొక్క) చిత్తీఁ = చిత్తమునందు; జళీ స్థళీ = జలము మరియు తలమునందు సర్వత్ర; హరి = శ్రీహరియొక్క వాసమున్నదని; (జ్ఞానము కలిగినదో) తయా = అతని యొక్క; బుద్ధీచా = బుద్ధియొక్క; పాలట = తారుమారు; కదా కాళీఁ= ఏకాలమునందు గూడ; నవ్హే = జరుగదు. 4. జైసే = ఏ విధముగా; నవనీత = వెన్న మృదువుగా ఉంటుందో; (అట్లు ఎవరియొక్క) తే చిత్త = ఆ చిత్తము; నిర్మళ = నిర్మలముగా (మృదువుగా) ఉండునో; తయా మాజీఁ = దాని యందు; అనంత = అనంతుడు (నివాసము ఉంటాడని); జాణిజే = తెలియవలెను. 5. (ఎవరైతే) త్యాభావేఁ = సర్వవ్యాపకుడిగా; హరి = హరిని; జాణిజే = తెలుసుకున్నాడో; తయామాజీ; = (అతని) చిత్తమున; ఆపులేఁ= తనకు; పరావేఁ = పరులకు; సారిఖేఁచీ = సమభావన ఉండును. 6. జో = ఏమహాత్ముడైతే; హే సకళీక= ఈ జగత్తంతా; దేవ్ దేఖేఁ = హరి మయముగా దర్శించాడో; తయాచ్యా = ఆ మహాత్ముని యొక్క; చింతనేఁ = చింతనము (సేవ) చేత; అనేక తరతీ= అనేక సామాన్య జనులు తరింపబడుదురు. 7. (ఎవరైతే) దేవ్ దేఖే = దేవుని యొక్క యథార్థ స్వరూపమును తెలిసికొని, అనుభూతమొనర్చుకొనిరో; తోఁహి = అతడు (స్వయముగా) ; దేవ్ కైసా నవ్హే = దేవుడు ఎట్లు కాడు?; తయాసీ = అతని (విషయములో); సందేహ = సంశయము; ఉరలా కాయ? = ఏమి మిగిలినది?. 8. (అటువంటి మహాత్ముని) కాయా వాచామనేఁ = మనో వాక్కాయములచే; వైష్ణవ = భగవద్భక్తులైనవారు; మనీ = మనస్సునందు; శుద్ధ భావ = త్రికరణ శుద్ధిని; ధరూనియాం = ధరించి; పూజావేఁ = పూజించవలెను; 9. యాంసీ = (భగవంతుడు) తన యొక్క; కవతుక = చమత్కారమును; రానీఁ = వనమునందు; వోణవా = దావాగ్నిని; గిళూనీ = మ్రింగి; గోపాళాంసీ = గోపాలురకు; దాఖవిలే = చూపించెను. 10. గోపాలాంచే = గోపాలురయొక్క; డోళేఁ = నేత్రములను;

హాతేఁ = చేతులతో; ఝూకవిలే = మూయించి; అనంతేఁ= అనంతుడగు గోపాల కృష్ణుడు; విశ్వరూప = విశ్వరూపమును; ధరిలేఁ= ధరించెను. 11. (శ్రీకృష్ణుడు) ముఖ పసరూనీ = ముఖమును తెఱచి, జ్వాళ = దావాగ్నిరూప జ్వాలను; గిళియేలీ = మ్రింగెను; (ఆ దృశ్యమును) గోపాళ = గోపాలురు; బోటా సంధీ = వ్రేళ్ళ సందులనుండి; పాహాతీ = దర్శించిరి. 12. అనంతా= కృష్ణుని; సంధి సారూనియాం = వ్రేళ్ళ సందులను వెడల్పు గావించి; పాహిలేఁ= చూసినారు; (తదనంతరము గోపాలురు కృష్ణునితో) మ్హణతీ = అంటున్నారు; తే = నీ యొక్క మాహాత్మ్యము (మాకు); ఆతాం = ఇప్పుడు; కళలాసీ = తెలిసినది. 13. దేవా! = హే దేవా!; హా = ఈ (ప్రత్యక్ష నీ) దేహ= దేహము; తుఝా నవ్హే = నీది కాదు (అని); కళలా = తెలిసినది; ఆణీక = మరియు; తో వోణవా = ఆ దావానలమును; గిళీలా = (మీరు) మ్రింగినది (మేము ప్రత్యక్షముగా చూసితిమి. 14. సకళాం = సమస్త; సాధనాంసీ = సాధనములకు (గూడ); దుర్గమ = కష్టసాధ్యమైన (స్వరూపము);తోఁ = అది; తయాం ఆరుష = ఆ అజ్ఞాని; గోపాళాం = గోపాలురకు; కళలా = తెలిసినది. 15. తుకా మ్హణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; (భావపూర్వక భక్తి లేని) సాధనాంచా = సాధనములకు; శీణ ఉరే = శ్రమయే మిగులును; భావ = భావపూర్వకమైన; సాచా = నిజమైన; భావికాంసీ = భక్తులకు; (భగవంతుడు) దావీ = (స్వయముగా తాను) దర్శనమొసంగును. 16. )3827)

**తాత్పర్యము :-** సమస్త స్థిర చరాత్మకమైన ప్రాణికోట్లయందు శ్రీమన్నారాయణుడు వసించి యున్నాడని యెవరెఱుంగుదురో, వారికి పునః గర్భవాసము మరియు జనన మరణములుండవు. 1. తోటి ప్రాణికోట్లయందు మాత్సర్యభావము గలిగియున్న పాపముచేత చావు పుట్టుకలు సంభవించును.

"దేవుడు సర్వ వ్యాపకుడు' అని యెవరికి తెలిసినదో వారికి యే ప్రాణి పట్లను మత్సరముండదు.

**సు.వ్యా :- మంత్రము:- ఏకో దేవః సర్వభూతేషు గూఢః**
**సర్వవ్యాపీ సర్వ భూతాన్తరాత్మ ।**
**కర్మాధ్యక్షః సర్వ భూతాధివాసః,**
**సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ ॥** (శ్వే.ఉ. 6-11)

**అర్థము :-** సంపూర్ణ ప్రాణులలో ఒకే దేవుడు (పరమాత్మ) గూఢమై ఉన్నాడు. అతడు సర్వ వ్యాపకుడు సమస్త ప్రాణుల యొక్క 'అంతరాత్మ, అందటి కర్మలకు అధీశ్వరుడు, సకల ప్రాణులయందు అధివసించి (విద్యమానమై), సర్వ సాక్షియై, పూర్ణ చైతన్య రూపుడై, నిరవయవ, నిర్గుణ మరియు సర్వ విశేషాభావ స్వరూపుడై యున్నాడు.

**శ్రుతేరయమర్థః :-** బ్రహ్మాది స్తంబ పర్యంతము ప్రాప్త జగత్తునకు అనేకేశ్వరత్వమును నిరసించుటకు గాను "ఏకః" అను శబ్ద ప్రయోగము జరిగినది. "ఏక ఏవ హి రుద్రో న ద్వితీయాయ తస్థుః" ఇతి శ్రుత్యంతర ప్రసిద్ధిః. దీనిచే బ్రహ్మ విష్ణ్వాదులకు గల ఐశ్వర్యము ప్రాకృతము, అనిత్యము మరియు ఆభాసము అని సూచించడమైనది. అట్టైనచో ఏకత్వము మరియు కారణత్వము అవ్యాకృతము (మాయ)కు ప్రసక్తమగుట వలన, దానిని నిరసిస్తూ "దేవః" అను శబ్దము నివేశింపబడినది. కాలత్రయము నందు నిరపేక్ష అఖండచిద్రూపమై స్వయముగానే ప్రకాశించునదై యున్నందున పరమాత్మ "దేవుడు" అనబడ్డాడు. అవ్యాకృతము జడమై యున్నందున దేవత్వము సంభవించదు. మరియు దానికి స్వతః కారణత్వము గూడ సంభవింపదు. ఏకత్వ, దేవత్వములు సూర్యునికి గూడ ప్రాప్తములు గాన సూర్యునికి ఈశ్వరత్వ ప్రసక్తి నిరాసార్థము "సర్వభూతేష్వితి". పరమాత్మ

సకల భూతముల యందు చిదేక రసాత్మకమై (తెలివి ప్రకాశ స్వరూపమై) యున్నది. సూర్యునికి ఏకత్వ, దేవత్వములున్నప్పటికిని చిద్రూపమై సకల భూతములందుండుట సంభవింపనందున ఈశ్వరత్వా భావము గలదు. సర్వ భూతముల యందు సర్వదా ఏకరూపమై చిద్రూపమై యున్న బ్రహ్మము సర్వులకు (అజ్ఞ, తజ్ఞులకు) వేద్యమై (తెలియబడునదై) యుండవలయును గదా, అని ఆశంకించుకొని "గూఢః" అని చెప్పినది శ్రుతిమాత. సర్వభూతములయందు ప్రకాశ స్వరూపమై విద్యమానమైనను మేఘములచే సూర్యునివలె అవిద్యా, తత్కార్యములైన దేహాదులచే తిరోహితమై యున్నందున పరమాత్మ సర్వులకు గోచరించుట లేదు. భూతములయందు గూఢముగా ఉన్న బ్రహ్మమునకు బుద్ధ్యాదులవలె పరిచ్ఛిన్నత్వ ప్రాప్తిని తొలగిస్తూ "సర్వ వ్యాపీ"తి. ఘట శరావాదులను మృత్తిక వలె జగత్తు బాహ్యమున మరియు లోననూ సర్వత్ర స్వసత్త చేత వ్యాపించి యున్నందున సర్వ వ్యాపి బ్రహ్మము అపరిచ్ఛిన్నము. గూఢాత్మకమై, సర్వవ్యాపకమై యున్నందున ఆకాశమునకు ఈశ్వరత్వము పర్యవసన్నమగుటను నిరసిస్తూ "సర్వభూతాన్తరాత్మా" ఇతి. సకల భూతముల యొక్క అంతః = బుద్ధిరూప గుహయందు ఆత్మరూపముచేత (ఆత్మా హి నామ స్వరూపమ్) స్థితమై యున్నది బ్రహ్మము. ఆకాశము సర్వవ్యాపకమై యున్నప్పటికిని జడమున్నందున సర్వభూతముల ఆత్మయగుట సంభవింపమిచే, బ్రహ్మము అగుట సంభవింపదు. సకలభూతముల యొక్క ఆత్మ (స్వరూపము) అగుట వలన బ్రహ్మమునకు కర్తృత్వము, తత్ఫలభోక్తృత్వము మరియు సంసారిత్వము ప్రాప్తమగునేమో యని సందేహము కలుగవచ్చును. దానిని నిరసిస్తూ ఉపనిషత్ జనని "కర్మాధ్యక్షః" అని నుడివినది. ఉపాధిని యధిష్ఠించుకొని దాని ధర్మములను వీక్షించుచున్నందున పరమాత్మ "అధ్యక్షుడు" అనబడుచున్నాడు. భూతములకు, వాటి కర్మలకు మరియు

తత్ఫలభోగములకు సాక్షిమాత్రమగుచున్నది. ఆత్మ నిరవయవము (అందువలన నిష్క్రియము)న్నందున తాను స్వయముగా ఏమియును కర్మ చేయుటలేదు మరియు దాని ఫలమును అనుభవించుటయును లేదు. సర్వ భూతాన్తరాత్మ యగుటవలన బ్రహ్మమునకు సర్వభూతాశ్రయత్వము మరియు తదధీనత్వము ప్రాప్తించుటను నిరసిస్తూ "సర్వభూతాధివాసః" అని చెప్పనైనది. సర్వము దీని యందు అధ్యస్తము. అధ్యస్త వస్తువునకు అధిష్ఠానము కంటె పృథక్సత్తా ఉండదు. అధిష్ఠానము నాశ్రయించుకొనియే భాసించును. అధివసత్యస్మిన్ సర్వం ఇతి అధివాసః (పరమాత్మ). ఏది దేనికధిష్ఠానమో (వివర్తోపాదానమో), అది దానికి (జ్ఞాత) సాక్షియై యుండును. ఉదా:- సాక్షియందు అధ్యస్తమగు స్వప్న ప్రపంచమునకు సాక్షియే ప్రకాశకము. పరమాత్మ కేవలము జీవుల కర్మలకు మాత్రమే జ్ఞాత గాదు, మరేమనగా భూతములకు, వాటి ధర్మములకు, వాటి కర్మలకు, తత్ఫలానుభవమునకు మరియు వాటి అవస్థలకు గూడ ద్రష్టమై యున్నందున మంత్రములో "సాక్షి" పదము నివేశింపబడినది. ఇతర ప్రకాశములను గాని, ప్రత్యక్షాది ప్రమాణములనుగాని అపేక్షింపకుండా సాక్షాత్తుగా సర్వమును ప్రకాశించుట వలన పరమాత్మ "సాక్షి" యనబడు చున్నాడు. "జ్ఞాతతయా అజ్ఞాతతయా వా సర్వం సాక్షిభాస్యమేవ" (వివరణే). "యః సర్వజ్ఞః సర్వవిత్" ఇతి (ముండకే) ఆత్మకు ఈక్షణక్రియా కర్తృత్వమును నివారించుటకుగాను శ్రుతిలో "చేతా" అను పదప్రయోగము జరిగినది. చేతయితృత్వం - అవిక్రియత్వము అనగా ఆత్మ స్వయమవిక్రియ స్వరూపమై యుండి సర్వమును ప్రకాశించు చున్నది. అవిక్రియత్వమునకు హేతువును చెప్పుచున్నది-"కేవల" ఇతి. అనగా నిరవయవము అని అర్థము. నిరవయవమున్నందున అవిక్రియము. "శబ్దగుణకమాకాశమ్" ఈ లక్షణము

ప్రకారము నిరవయవమగు నాకాశమునకెట్లు గుణము గలదో అట్లే బ్రహ్మమునకు గూడ సత్తు, చిత్తు మొదలగునవి గుణములే యను ప్రాప్తశంకా పరిహారార్థము "నిర్గుణ" ఇతి. "ఆత్మనః ఆకాశః సంభూతః" ఈ శ్రుతిచే ఆకాశము యొక్క ఉత్పత్తి (పుట్టుక) వినబడుచున్నందున, ఆకాశము సావయవమే యని చెప్పవలసి యుండును. సావయవమునకు గుణవత్త్వము యుక్తమే. బ్రహ్మమునకు "నిష్కలమ్" అను శ్రుత్యంతరము చేత గూడ నిరవయవత్వము సిద్ధమగుచున్నందున గుణవత్త్వము అనుపపన్నము. ఎట్లు దాహకత్వము మరియు ప్రకాశకత్వము అగ్ని యొక్క స్వరూపమో, అట్లే సత్వము, చిత్వము ఇత్యాదులు బ్రహ్మము యొక్క స్వరూపమే గాని గుణములుగావు. సర్వ విశేషాభావ ప్రతిపాదనార్థము "చ"కారము, లేక సర్వదోషాభావ ప్రతిపాదనార్థము అని తెలియవలెను.

శ్రుతి:- వ్యాపకోఽలింగ ఏవ చ । (కఠ. 2-3-8)

అర్థము :- ఆకాశాది సకల పదార్థములకు కారణమున్నందున పురుషుడు వ్యాపకుడు. దేనిచేత ఒకానొక వస్తువు తెలియబడునో - బుద్ధ్యాదులు లింగము అనబడును. అవి దేనికి లేవో అది అలింగము - పురుషుడు. సంపూర్ణ సంసారధర్మములు లేనిది యని అర్థము. 2.

ఉపరోక్తరీత్యా శ్రీమన్నారాయణుడు సర్వవ్యాపకుడని యెవరెఱుంగుదురో వారి ద్వేషబుద్ధిరూప జ్వాల చల్లారును (నష్టమగును). 3.

మ॥ కలఁడంభోధిఁ గలండు గాలిఁగలఁడాకాశంబునం గుంభినిన్,
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్ ।
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగ వ్యక్తులం దంతటన్,
గలఁడీశుండు గలండు దండ్రి! వెదకంగా నేల యీ యా యెడన్॥

కం॥ ఇందు గలడందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన,
నందందే గలడు దానవాగ్రణి! వింటే ॥

పై ప్రహ్లాద నిశ్చయ వాక్కుల రీతిగా యెవరు జల స్థలములందంతట శ్రీహరి నిండి నిభిడీకృతమై యున్నాడని నిశ్చయాత్మక బుద్ధి (జ్ఞానము) గలిగి యుందురో వారి బుద్ధి ఏకాలమునందు మారదు. 4.

ఎవరి చిత్తము శుద్ధము (రాగద్వేషాది రహితము) మరియు నవనీతము (వెన్న)వలె మృదువుగా నుండునో, అచ్చట శ్రీ అనంతుడు వసించును. 5. సర్వత్ర హరిని దర్శించు వానికి నేను - తాను, అది - ఇది యను భేదబుద్ధి లేక సమదర్శనుడై యుండును.

శ్లో॥ విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శనః ॥ (గీత. 5-18)

**అర్థము** :- పండా = ఆత్మ విషయక బుద్ధి (సకల మిదమహం చ బ్రహ్మైవ) యెవరికి గలదో అతడు పండితుడు. అథవా యెవరి యజ్ఞానము జ్ఞానముచే నాశనమైనదో అతడు పండితుడు అనబడును. అతడు తత్త్వమును ఎలా దర్శిస్తాడు? చెప్పుచున్నాడు. విద్యా = సర్వ వేద శాస్త్రాధ్యయనము అథవా తదర్థజ్ఞానము (బ్రహ్మవిద్యా) వినయము = నమ్రత, అనుద్ధతా (అహంకారరాహిత్యము), ఉపశాంతి అని అర్థము. ఈ రెంటితో పాటు స్వధర్మపరాయణత, ప్రతిగ్రహ విముఖత, సత్యము, శౌచము మరియు దయా ఇత్యాది శుభగుణములచే సంపన్నుడైన జగత్పూజ్య బ్రాహ్మణుని యందును, జాతి చేతను, గుణము చేతను మరియు ధర్మము చేతను పరమ నికృష్టుడై ఉదరపోషణకొఱకు కుక్కమాంసము వండుకొనువాడు,

లేక రెండవ దినము భోజనము కొఱకు ముందు రోజుననే వండుకొనువాడు (శ్వపాకః)నగు చండాలుని యందును, జాత్యాదులచే నతి నికృష్టమైన, తుచ్ఛపదార్థములను భక్షించు కుక్కయందును, జాతిచేతను, సంచారము చేతను, క్షీరము మొదలగు గవ్యములచేతను లోకపావనియగు గోమాత యందును, రాజపూజిత యేనుగు (భద్రగజము) నందును; చకారముచే మట్టి పెళ్ళ (గడ్డ), రాయి, సువర్ణము మొదలగు సత్వ, రజ, తమోగుణ యుక్తమగు సకల పదార్థముల యందును, సత్త్వాది గుణములచేతగాని, వాటిచే గల్గిన సంస్కారముల చేతగాని స్పృశింపబడకయే యున్నట్టి సమమగు బ్రహ్మమును దర్శించు స్వభావము గలవారు సమదర్శులు (ఒకే దృష్టిగలవారు), పండితులు, జ్ఞానులు అనబడుతారు. ఎట్లు గంగాజలమందు, తటాకమునందు, సురా(మద్యము) యందును మరియు మూత్రమునందును ప్రతిబింబించే సూర్యునకు వాని గుణదోషాలతో సంబంధము లేదో అట్లే చిదాభాసుని ద్వారా ప్రతిబింబించు బ్రహ్మమునకు గూడ ఉపాధిలోగల గుణదోషాలతో సంబంధము లేదు అని అనుసంధిస్తూ అంతటా సమదృష్టి గల్గి, రాగ ద్వేషాలు లేని వారై పరమానంద స్ఫూర్తిని అనుభవించు చున్నారని యర్థము. (శంకరానందీయము)6.

ఎవరు ఈ జగత్తును పరమాత్మస్వరూపము (సర్వం ఖల్విదం బ్రహ్మ) అని తెలియుదురో, అట్టి మహాత్ముల యొక్క చింతనము (సేవ) చేసిన సామాన్య జనులు ఉద్ధరించబడుదురు. 7.

ఎవరు దేవున్ని యెఱుగుదురో వారు దేవుడే ఎందుకు కారు? ఈ విషయములో సంశయించుటకు కారణమేమి? "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" (ముం.ఉ. 3-2-9) బ్రహ్మమునెఱింగినవాడు బ్రహ్మమే యగును- అని అర్థము. 8. దేవున్ని యథార్థముగా (తత్త్వతః) తెలిసికొని, అనుభూత

మొనర్చుకున్న వైష్ణవుని (మహాత్ముని) యందు శుద్ధమగు శ్రద్ధనుంచి, ఆయన సాక్షాత్తు పరమాత్మయే యని భావించి త్రికరణ శుద్ధిచే (మనోవాక్కాయములచే) ఆయనను పూజించవలెను. 9. భగవంతుడు ఒకానొక ప్రసంగము నందు వనములో దావానలమును మ్రింగి, అద్భుత లీలను ప్రదర్శించి, తాను సర్వవ్యాపకుడనున్నానని స్వయముగా గోపాలురకు నిరూపించెను. 10. అరణ్యమునకు నలువైపుల నిప్పంటుకున్నది. అప్పుడు భగవంతుడు గోపాలురకు వారి వారి హస్తములచే నేత్రములు మూసికొనుమని చెప్పి, తాను స్వయముగా విశ్వరూపమును ధరించి, 11, స్వముఖముచే భయంకరమైన దావాగ్ని జ్వాలలను మ్రింగివేసెను. ఈ అద్భుత దృశ్యమును గోపాలురు వారి వ్రేళ్ళ సందులనుండి గాంచిరి. 12. భగవంతుడు తన లీలను ఉపసంహరించిన పిమ్మట - గోపాలురు వారి చేతులను నేత్రముల నుండి తొలగించి శ్రీకృష్ణుని తో ఇలా అంటున్నారు. దేవా! నీవు యెంతటి వాడవో, మాకు ఇప్పుడు నిజముగా దెలిసెను. 13. దేవా! నీవు ఈ కనబడుచున్న దేహముచే మర్యాదితుడవు (పరిచ్ఛిన్నుడవు) కావు. నీ ఈ దేహము మాయికము. విశ్వరూపమును ధరించి భయంకరమగు దావాగ్నిని నీవు మ్రింగుటను మేము ప్రత్యక్షముగా గాంచితిమి. 14. యోగయాగాది కఠోర సాధనలచేతగూడ దుర్గమమైన దైవదర్శనము, సామాన్య అజ్ఞాని గొల్లపిల్లలకు ప్రాప్తించినది. అహెూ! ఆ గోపాలుర భాగ్యమేమన వచ్చును?

**శ్లో॥ అహెూ భాగ్యమహెూభాగ్యం, నందగోప వ్రజౌకసామ్ ॥**

(భాగ. 10-14-32)

శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - భగవంతుని చేరుటకు భక్తిభావము తప్ప ఇతర సాధనలచే కేవలము శ్రమయే మిగులును. అనన్య

భక్తులకు మాత్రము భగవంతుడు తన నిజ స్వరూపమును ప్రదర్శింపజేసి అనుగ్రహించును. "భవతః దర్శనం మే స్యాదపునర్భవ దర్శనమ్" (భాగ. 1-8-25). 15,16.

**54. అభంగము :-**

ధ్యానీం ధ్యాతాం పంఢరిరాయా ।
మనాసహిత పాలటే కాయా ॥1॥

తెథేం బోలా క్రైంచీ ఉరీ ।
మాఝె మీపణ ఝూలా హరి ॥2॥

చిత్త చైతన్యా పడతాం మిఠీ ।
దిసే హరిరూప అవఘీ సృష్టి॥3॥

తుకా మ్హణే సాంగోం కాయ ।
ఏకా ఎకీ వృత్తీ హరిమయ ॥4॥ (3142)

ప్ర.ప:- పంఢరీరాయా = పంఢరిరాయుని; ధ్యానీంధ్యాతాం = అఖండ ధ్యానము చేసినట్లయితే; మనాసహిత = మనస్సుతోపాటు; కాయా= శరీరము; పాలటే = మారిపోవును, అనగా హరి రూపమగును. 1. తెథేం = ఆ అవస్థలో; బోలా = చెప్పుటకు; క్రైం చీ ఉరీ = ఏమియును మిగలదు; మాఝె = నాది; మీపణ = నేను (అను మిథ్యాభిమానము గూడ); హరి ఝూలా = హరిరూపమే అగును. 2. చిత్త = ఈ చిత్తము; (మరియు) చైతన్యా= చైతన్యమునకు; మిఠీ పడతాం = ఆలింగనము (కలయిక) అయిన (వెంటనే); సృష్టి = ఈ ప్రపంచము; అవఘీ = అంతయును; హరిరూప = హరిరూపమే; దిసే = కానుపించును. 3. తుకా మ్హణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; (ఈ విషయములో) సాంగోం కాయ = ఏమి

చెప్పును?; (ధ్యానముచే) ఏకా ఎకీ = ఒక్కసారిగా; వృత్తీ = అంతఃకరణము యొక్క సర్వ వృత్తులు; హరిమయ = హరిరూపమగు చున్నవి. 4.

**తాత్పర్యము :-** శ్రీ పాండురంగని యఖండ ధ్యానము వలన మనః సహిత దేహమే మారిపోయి శ్రీహరిరూపమగును. 1. ఆ అవస్థలో ఇంద్రియములతో సహా మనస్సు తద్రూపమగుట వలన, సకల వ్యవహారములు కుంటుబడును. కావున వాక్కు ఆగిపోవును. ఇక మాట్లాడుటకేమియును మిగలదు. అంతఃకరణమే హరిరూపమైనందున దాని ధర్మములగు అహంకార, మమకారరూప అభిమానము గూడ హరిమయమగును. 2. ఈ చిత్తము, చైతన్యముతో ఐక్యము నొందిన వెంటనే, పరిదృశ్యమాన సంపూర్ణ జగత్తు హరిరూపమగును. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు – ఈ విషయంలో అధికముగా నేమి చెప్పగలను? ధ్యానముచేత అంతఃకరణముయొక్క సర్వవృత్తులు ఒక్కసారిగా హరిరూపమగు చున్నవి. 4. (3142)

**సు.వ్యా:-** విశేషము – పై అభంగములో "ధ్యానీ ధ్యాతాం పంఢరిరాయా" ఈ చరణముచే, మరియు "దిసే హరిరూప అవఘీ సృష్టి" ఈ చరణము చేత (దాదాపుగా మొత్తము అభంగము చేత) శ్రీ తుకారాం మహారాజుగారు సగుణోపాసన చెప్పి యున్నారు. ధ్యానము అనగా ఉపాసన అని అర్థము చేయాలి.

> "ధ్యానారాధన ప్రసంఖ్యాననిధిధ్యాసనశబ్దాః
> ఉపాసనశబ్ద సమానార్థాః" ।

(శబ్దకల్పద్రుమ) ఉపాసనం – సమానప్రత్యయ ప్రవాహకరణమ్. ఉపాసనమనగా సమానమైన వృత్తుల (జ్ఞానాల) ప్రవాహాన్ని నడిపించడము. (బ్ర.సూ. భాష్యము. 4-1-7). అపి చ ధ్యాయత్యర్థ ఏష యత్సమానప్రత్యయ

ప్రవాహకరణమ్. మరొక విషయమే మనగా - సమానప్రత్యయ ప్రవాహకరణమ్ - అనేది ధ్యా(ధ్యై) ధాతువునకు కూడ అర్థము. (బ్ర.సూ. భాష్యము. 4-1-8) పై కోశ, భాష్యముల ప్రకారము "ఉపాసన" మరియు "ధ్యాన"శబ్దములు ఏకార్థ బోధక పర్యాయములు.

"ఉపాసనం నామ యథా శాస్త్రం ఉపాస్యస్య అర్థస్య విషయీ కరణేన, సామీప్యముపగమ్య తైలధారావత్ సమానప్రత్యయ ప్రవాహేణ దీర్ఘకాలం యదాసనం తదుపాసనమ్ ఆచక్షతే" (గీతాభాష్యము. 12-3) ఉపాసనం అనగా - ఉపాసించ దగిన వస్తువును శాస్త్రానుసారం విషయంగా చేసికొని (తెలిసికొని) దాని దగ్గఱకు చేరుకొని (ఆ వస్తువుతో మానసికంగా సంనిహితత్వాన్ని ఏర్పరచుకొని) తైలధార వలె ఒకే తీరున ఉండే (ఒకే విధమైన) జ్ఞాన ప్రవాహంతో చాలాకాలం కూర్చొనడం - ఉపాసనం అని చెపుతారు.

రజః తమోగుణములచే నంధీభూతులైన, పూర్తిగా ఆత్మానాత్మ వివేక హీనులగు అజ్ఞమనుష్యులకు అవిద్యా కామకర్మలచే కలుషీకృత చిత్తమునందు నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావ ప్రశాన్త విమల జ్యోతిః స్వరూపమునగు సర్వ భూతాన్తరాత్మ సమ్యగ్ రీతిచే ప్రతిభాసించుట లేదు (గోచరించుట లేదు). ఇట్లు ఆత్మ స్వరూపమును తెలియనప్పటికిని సకల జనులు పరమప్రేమాస్పదమగు (ఆత్మను) స్వరూపమును భజిస్తు (ప్రేమిస్తు)న్నారు. "తదేతత్ప్రేయః" (బృ.ఉ. 1-4-8), "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" (బృ.ఉ.2-4-5) మరియు

శ్లో॥ ఇయమాత్మా పరానన్దః పరప్రేమాస్పదం యతః ।
మా న భూవం హి భూయాసమితి ప్రేమాత్మనీక్ష్యతే ॥

(వే.పం. 1-8)

**శ్లో॥ సర్వం యదర్థమిహ వస్తు యదస్తి కించిత్**
**పారార్థ్య ముజ్ఝతి చ యన్నిజ సత్తయైవ ।**
**తద్వర్ణయంతి హి సుఖం సుఖ లక్షణజ్ఞాః**
**తత్ప్రత్యగాత్మని సమం సుఖతాస్య తస్మాత్ ॥** (సం.శా. 1-24)

**అర్థములు :-** ఆ యీ ఆత్మయే ప్రియమున్నది. ఆత్మ కొఱకే సర్వము ప్రియమగుచున్నది.

ఆ యీ ఆత్మ ఆనంద స్వరూపము. ఏలయన, అది పరమ ప్రేమకు విషయము. "నేను లేకపోదునుగాక" అని యెవరును భావింపరు. "నేను శాశ్వతముగ నుందును గాక" అను ప్రేమయే ఆత్మయందు కన్పించు చున్నది.

ఈ విశ్వములోని సమస్త పదార్థములు యెవరి కొఱకు (అంగములు, శేషములు) ఉన్నవో, మరియు యెవరు స్వసత్తా మాత్రముచే పరార్థత్వమును త్యజించి యున్నారో, ఆ సర్వశేషియై అనన్యశేషియగు వాడే సుఖస్వరూపదు అని సుఖలక్షణమును తెలిసిన విద్వాంసులు వర్ణించి చెప్పుచున్నారు. ఈ లక్షణము ప్రత్యగాత్మకే అన్వయించును గాన ప్రత్యగాత్మయే సుఖస్వరూపము.

పై శ్రుతిస్మృతులు మరియు అనుభవమును బట్టి ఆత్మ పరమ ప్రేమాస్పదము అని సిద్ధమగుచున్నది. లేనిచో సకల జనులు ఆత్మజ్ఞాన విమూఢులైనప్పటికిని "ఇదం మే స్యాదిదం మేస్యాత్" "అనేనైవ మే శ్రేయో భవితా అస్మిన్ జ్ఞాతేఽహం సుఖీ భవేయమ్" ఇది నాకు కావాలి, ఇది నాకు కావాలి, దీనిచేత నాకు సుఖము కలుగవలెను, దీన్ని తెలుసుకుంటే నేను సుఖముగా నుందును - ఇట్లు ఆత్మ సుఖము కొఱకు ఎందుకు ప్రవృత్తులగుదురు? ఆత్మ సకల జీవుల యొక్క అంతరాత్మయై నిత్యసంబద్ధమై యున్నది. అయినను సర్వ శోకప్రదాయిని జ్ఞానావరణకారిణి యగు నవిద్య

చేత సర్వ సుఖ ప్రదాత, తాపత్రయ వినాశి, నిరతిశయ ప్రీతికి విషయము మరియు నిత్యానంద స్వరూపుడగు ప్రత్యగభిన్న పరమేశ్వరుని యందు ఐకాంతిక (అవ్యభిచరిత) నిశ్చయము కుదురుట లేదు. కావున రజః తమోగుణములచే నభిభూతమైన సత్త్వము (మలినసత్త్వము) ప్రధానముగా గల అవిద్యను ప్రనష్టము చేయుటకే శాస్త్రము "ఉపాసనను" అవశ్యముగా విధానము చేసినది. జీవుల నిఃశ్రేయసము (మోక్షము) కొఱకు స్వస్వ మతానుసారముగా అనేక మార్గములు బోధించినప్పటికిని అనాది యవిద్యా అత్యంత నివృత్తికి (నాశనమునకు) ఆత్మజ్ఞానమొక్కటే సాక్షాత్సాధనమనుటలో వేదాంత, పాతంజల మరియు సాంఖ్య శాస్త్రములకు ఐకమత్యము గలదు. కాని ఈ ఆత్మజ్ఞానము, అంతఃకరణగత మల విక్షేప దోషములు తొలగనిదే (నివృత్తముకానిదే) ఉదయించుట యసంభవము. తన్నివృత్త్యర్థము శాస్త్రము (వేదము)" ఉపాసనను" కర్తవ్యముగా విధించినది.

"ఉపాసనాని సగుణబ్రహ్మవిషయ మానసవ్యాపారరూపాణి శాండిల్యవిద్యాదీని" (వేదాంతసారము) సగుణబ్రహ్మకు సంబంధించిన మానసవ్యాపారము (ధ్యానము) "ఉపాసన" యని చెప్పబడును. ఇచ్చట ఆది శబ్దము చేత దహర వైశ్వానరాది ఉపాసనలను గ్రహించవలెను.

**"ఏతేషాం నిత్యాదీనాం బుద్ధిశుద్ధిః పరం ప్రయోజనముపాసనానాంతు చిత్తైకాగ్ర్యం - తమేతం ఆత్మానం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన (బృ.ఉ. 4-4-22)- ఇత్యాది శ్రుతేః। తపసా కల్మషం హన్తి (మనుస్మృతి - 12-104) - ఇత్యాది స్మృతేశ్చ".**

ఈ నిత్యాది కర్మలకు బుద్ధిశుద్ధిః (అంతఃకరణశుద్ధి) ముఖ్య ప్రయోజనము. ఉపాసనకు చిత్తైకాగ్రత ముఖ్యప్రయోజనము. "తమేతమాత్మానం" (ఆత్మ స్వరూపమును బ్రాహ్మణులు (జిజ్ఞాసువులు)

వేదవచనములచేత యజ్ఞముల చేత తెలిసికొనుటకు కోరుచున్నారు.) అని శ్రుతి. "తపసా కల్మషం హన్తి" (తపస్సు చేత పాపము హరించబడును) అని స్మృతి గూడ తెలుపుచున్నది. (వేదాంతసారము).

"ఉపాసనాని శాండిల్య విద్యాదీని. ఉపాసనస్య చిత్తైకాగ్ర్యం పరం ప్రయోజనం, అర్చిరాది మార్గేణ బ్రహ్మలోక ప్రాప్తిరవాంతరఫలమ్". ఉపాసనలు శాండిల్యాది విద్యలు. ఉపాసనకు చిత్తైకాగ్రత ముఖ్య ప్రయోజనము. అర్చిరాది మార్గము ద్వారా బ్రహ్మలోకప్రాప్తి అవాంతర ఫలము. (వా చస్పత్యము)

శ్లో॥ చిత్తస్యైకాగ్ర్య జననాద్బ్రహ్మలోకాప్తితోఽథవా ।
జ్ఞాన ఏవోపాసనాని పర్యవస్యంతి సర్వథా ॥ (బృ.వా.సా...)

**అర్థము :-** ఉపాసనకు పరమ ప్రయోజనము చిత్తైకాగ్రత మరియు అవాంతర ప్రయోజనము బ్రహ్మలోకప్రాప్తి. ఎట్లైననూ - ఉపాసన బ్రహ్మజ్ఞానము నందే పర్యవసించుచున్నది.

ఉప= సమీపే, ఆస్యతే = స్థీయతే, అనేన ఇత్యుపాసనమ్ । ఈ వ్యుత్పత్త్యనుసారము = దేనిచేత ఉపాస్య స్వరూపమునందు (సగుణ బ్రహ్మము నందు) ఉపాసకుని యొక్క చిత్తస్థైర్య లాభము (మానసవ్యాపారరూపక్రియ) గలుగునో అది "ఉపాసన" యనబడును. ఆ వ్యాపారము శాండిల్య విద్యాదులు. శాండిల్య ఋషి ద్వారా ఉపదిష్టవిద్య శాండిల్యవిద్య. విద్యతే - లభ్యతే, ఉపాస్యే చిత్త స్థైర్యం యయా క్రియయా సా విద్యా । ఏ క్రియ చేత ఉపాస్యమునందు ఉపాసకుని యొక్క చిత్త స్థైర్య లాభము గలుగునో ఆ క్రియ "విద్యా" యనబడును. ఈ విద్యా యొక్క వర్ణనము ఛాందోగ్యోపనిషత్‌లో ఈ ప్రకారముగా నున్నది-

**"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత । అథ ఖలు క్రతుమయః పురుషో యథాక్రతురస్మిన్ లోకే పురుషో భవతి, తథేతః ప్రేత్య భవతి, స క్రతుం కుర్వీత ।"** (ఛాం.ఉ. 3-14-1)

ఈ సంపూర్ణ జగత్తు బ్రహ్మ స్వరూపమే. ఎందుకనగా - తజ్జలాన్ ఉన్నందున. తజ్జలాన్ యొక్క వివరణ ఇలా ఉంది. "తదితి సర్వనామ సర్వం చ బ్రహ్మ" తత్ - బ్రహ్మము. తజ్జ - ఈ జగత్తు బ్రహ్మము నుండియే ఉత్పన్నమయినది. తల్ల - బ్రహ్మమునందే లీనమగును. మరియు తజన్ - ఉత్పత్తి, లయ మధ్యకాలములో బ్రహ్మమునందే సక్రియరూపముచే అవస్థితమైయున్నది. ఈ ప్రకారముగా జగత్తు మూడు కాలముల యందు (అనగా భూతకాలము - ఉత్పత్తికి పూర్వకాలము, వర్తమానకాలము అనగా ఉత్పత్తి మరియు స్థితికాలము తథా భవిష్యత్కాలము అనగా లయకాలము) ఎప్పుడు గూడ బ్రహ్మము కంటె భిన్నముగా లేదు. అందువలన జగత్తులో సమస్త జడ - చేతనముల యందు రాగద్వేషములు లేకుండ శాంతభావముచే బ్రహ్మము యొక్క ఉపాసన చేయవలెను. ఈ ఉపాసన ఉక్తరీతిచే బ్రహ్మము యొక్క క్రతు = నిశ్చయముచే సంభవించును. ఎందుకనగా పురుషః = జీవుడు. క్రతుమయః = నిశ్చయ ప్రధానము గలవాడు. ఈ లోకములో అతడు ఎట్లు క్రతు = నిశ్చయము చేయునో, మరణించిన పిదపగూడ అట్లే యగును. ఎందువలన ఇతనికి క్రత్వనురూపముగా ఫలము ప్రాప్తించుచున్నదో, అందువలన యే క్రతు - నిశ్చయానుసారముగ నుపాసించగలుగునో, ఆ క్రతు = నిశ్చయమును చేయవలెను.

మనోమయః ప్రాణశరీరో భారూపః సత్యసంకల్పః ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామః సర్వగంధః సర్వరసఃసర్వమిదమభ్యాత్తోఽ వాక్యనాదరః" (ఛాం.ఉ. 3-14-2)

బ్రహ్మము = ఈశ్వరుడు మనోమయుడు. మనస్సు విషయాల యందు ప్రవృత్తమగునప్పుడు తానుగూడ విషయాలయందు ప్రవృత్తమగు చున్నాడు. మనస్సు విషయాలనుండి నివృత్తమైనపుడు తాను గూడ నివృత్తమగు చున్నాడు. ఈ ప్రకారముగా మనస్సు యొక్క ప్రవృత్తి, నివృత్తిపై ఈశ్వరుని యొక్క ప్రవృత్తి, నివృత్తి నిర్భరమై యున్నందున - మనోమయుడనబడుచున్నారు.

ఈశ్వరుడు ప్రాణశరీరుడు. ప్రాణమనగా విజ్ఞానశక్తి మరియు క్రియాశక్తి. ఆత్మ ఈ రెండు శక్తులచే సంపన్నమున్నది. ఈరెండు శక్తులే అతని శరీరము. ఎందుకనగా - శరీర సాధ్య సమస్త కార్యములు ఈ రెండు శక్తులచేతనే సంపన్నమగుచున్నవి. మనోహీన(జడ)మునందు విజ్ఞానశక్తి మరియు క్రియాశక్తియొక్క కార్యములు కనుపించుటలేదు గాన ఈ రెండు శక్తులు మనోమయుని యందే సంభవించును.

ఈశ్వరుడు భా-రూపుడున్నాడు. భా - భానము అనగా స్వయంప్రకాశము (ఉత్పత్తి, నాశనము లేని అనాద్యనంత నిత్య బోధరూప చైతన్యము). స్వీయ ప్రకాశము ఎప్పుడును లోపించకుండ, అన్యమైన సకలమును ప్రకాశించును.

ఈశ్వరుని సంకల్పము సత్యము (అబాధితము) గాన సత్య సంకల్పుడనబడుచున్నాడు. ఆయన సంకల్పము ఎప్పుడును అసత్యము గానేరదు. జీవుని సంకల్పము అసత్య మగుట సంభవమున్నది. ఎందుకనగా - మిథ్యా ఫలాకాంక్ష (ఏ వస్తువు లేదా కార్యము చేత ఏ ఫలము సంభవించదో, ఆ వస్తువు లేదా ఆ కార్యము చేత ఫలమును ఆకాంక్ష) చేయును. మనుష్యుడు అనేక సార్లు ఈ ప్రకారమైన ఆకాంక్షచే ప్రేరితుడై క్రియాశీలుడు (ప్రవృత్తుడు) అగుచున్నాడు. అందువలన అసత్యమగుచున్నది.

ఈశ్వరుడు వైషమ్య, నైర్ఘృణ్య, రాగద్వేషాది దోషరహితుడగు యథార్థ ద్రష్ట అయినందున మిథ్యా ఫలాకాంక్ష చేయడు. కావున ఆయన సంకల్పము అసత్యమగుటకు సంభావనయే లేదు.

ఏ విధముగా నాకాశము సర్వ వ్యాపి, సూక్ష్మము, నిర్లేపము మరియు నీరూపము (రూపాది రహితము)నై యున్నదో, అట్లే ఈశ్వరుని స్వరూపమున్నందున – ఆకాశాత్మ యనబడుచున్నాడు. (దృష్టాంతము ఏక దేశియుండునని గమనించాలి).

సంపూర్ణ జగత్తునకభిన్న నిమిత్తోపాదానము గావున ఈశ్వరుడు సర్వకర్మ (సర్వకర్త). ఈశ్వర ప్రయత్నము లేకుండా జగత్తులో యే ఒక్క కార్యము గూడ ఉత్పన్నమగుటలేదు.

ధర్మావిరుద్ధ సర్వవిషయక ఇచ్ఛ (కోరిక)లకు ఆశ్రయమున్నందున ఈశ్వరుడు సర్వకాముడు. ఈశ్వరునికి ఇష్టము కాని (లేని) వస్తువునకు అస్తిత్వమే అసంభవము. ఈశ్వరుని యొక్క ఇష్యమానత వస్తుత్వమునకు వ్యాపకమున్నది. (యత్ర వస్తుత్వం, తత్ర ఈశ్వర ఇష్యమానత్వమ్).

సుఖప్రదము, శోభనమునగు గంధము వైపునకు ఎట్లు మనుష్యుడు అతివేగముచే గతిశీలుడ (ప్రవృత్తుడ)గుచున్నాడో, అట్లే ద్రుతగతిచే (అతివేగముచే) మనుష్యుడు ఈశ్వరుని కభిముఖముగా గతిశీలుడగుచున్నాడు. ఎందుకనగా – సుఖకర సమస్త పుణ్యరూప గంధము ఈశ్వరునిలో విద్యమానమున్నందున. "పుణ్యో గంధః పృథివ్యామ్" (గీత. 7–9). అందు వలన ఈశ్వరుడు సర్వగంధుడు.

ఈశ్వరుడు సర్వరసుడు. అతని యందు సుందరమైన సకల రసములు విద్యమానములై యున్నవి. ఎవరు ఈశ్వరుని చింతనము

చేయుదురో వారికి సుందరమైన సమస్తరసములయొక్క ఆస్వాదము (ఆనందము) ప్రాప్తమగును. ఈశ్వరుని ధ్యానము ఒకానొక నీరస వ్యాపారముగాదు. మరేమనగా అత్యంత రసమయవ్యాపారము. ఒక్కసారి ఈశ్వరుడు మనుష్యునికి ధ్యానగతుడయినచో (ధ్యానము యొక్క రసానుభవమును పొందునో), ఇక అతడు ఎప్పుడు గూడ దాని నుండి విచలితుడగుటకిష్టపడడు.

ఈశ్వరుడు సంపూర్ణ జగత్తును వ్యాపించి యున్నాడు . ఈశ్వరుని ఒడిలో లేని వస్తువంటూ లేదు. అతడు అవాకి ఉన్నాడు. "యద్వాచా౾నభ్యుదితవ్" వాగింద్రియమునకగోచరుడు (కే.ఉ. 1-5) ఉపలక్షణముగా సకలేంద్రియ సాపేక్ష లేనివాడై, సర్వేంద్రియ కార్యములను చేయు చున్నాడు.

"అపాణిపాదో జవనో గ్రహిత, పశ్యత్య చక్షుః స శృణోత్యకర్ణః"

చేతులు లేవు - సర్వమును గ్రహిస్తాడు, పాదములు లేవు - అన్నిటికంటె వేగముగా పరుగెత్తగలడు, నేత్రములు లేవు- సమస్త రూపాదులను చూచును, కర్ణములు (చెవులు) లేవు - సకల శబ్దములను వింటాడు. (శ్వే.ఉ. 3-19)

ఈశ్వరుడు అనాదరుడు. అనగా ఆదరహీనుడు - సంభ్రమ హీనుడు. ఏ వస్తువును గూడ సంభ్రమ భావము చేత పరిగ్రహించడు. ఒకానొక అప్రాప్తము, అపూర్వమునగు వస్తువు యెవరికైనా లభించినచో, ఆ అనాప్తకామునికి దాని యందు సంభ్రమము (ఆదరము) కలుగుటకు సంభవమున్నది. ఈశ్వరుడైతే పూర్ణరూపముచే ఆప్తకాముడు గావున అతనికి యే వస్తువుగూడ అపూర్వము, అప్రాప్తము లేదు. అందువలన నతడు సకల వస్తువుల పట్ల అనాదరుడు - సంభ్రమహీనుడు.

"ఏష మఆత్మాన్తర్హృదయేఽణీయాన్ వ్రీహేర్వా యవాద్వా సర్షపాద్వా శ్యామాకాద్వా శ్యామాకతండులాద్వైష మ ఆత్మాఽన్తర్హృదయే జ్యాయాన్ పృథివ్యా జ్యాయానన్తరిక్షాత్ జ్యాయాన్దివో జ్యాయనేభ్యః లోకేభ్యః।

(ఛాం.ఉ. 3-14-3)

ఉక్త గుణములచే సంపన్నుడగు నీశ్వరుడు నా హృదయము నందు విద్యమానమై, నా ఆత్మయే (స్వరూపమై) యున్నాడు. అతడు వ్రీహి = ధాన్యము, యవధాన్యము (బార్లీ యనెడు ధాన్యము), ఆవాలు, చామలు = ఒక ధాన్య విశేషము; మరియు చామ బియ్యము వీటన్నిటికంటెను అణువై (సూక్ష్మమై) యున్నాడు. నా హృదయమందు విద్యమానమై, ఉక్తగుణములచే యుక్తమగు నా ఆత్మ పృథ్వీ, అన్తరిక్షము, ద్యులోకము = వీటన్నింటికంటెను గొప్పది. ఆత్మకు అణు మరియు మహాన్ అను విశేషణములు చెప్పి ఎలాంటి పరిమాణ విశేషము (మర్యాద) లేనిదని సూచించడమైనది.

"సర్వకర్మా సర్వకామః సర్వగంధః సర్వరసః సర్వమిదమభ్యాత్తో-వాక్యనాదరః ఏష య ఆత్మాన్తర్హృదయ ఏతద్ బ్రహ్మైతమితః ప్రేత్యాభిసంభవితాస్మీతి యస్య స్యాదద్ధా న విచికిత్సాస్తీతి హస్మాహ శాండిల్యః"।

(ఛాం. ఉ. 3-14-4)

ఎవరు సర్వ కర్మా = సమస్త కార్యములకు కర్త; సర్వకామః = సర్వవిషయక ఇచ్ఛకు ఆశ్రయము; సర్వగంధః = సకల మనోరమ గంధములతో యుక్తము; సర్వరసః = సర్వ రమణీయ రసములచే మండితము, సర్వమిదమభ్యాత్తః = ఈ సమస్త జగత్తును నలువైపుల వ్యాపించి ఉన్నవాడు; అవాకి = వాక్కు మొదలగు సకలేంద్రియములకగోచరుడును మరియు అనాదరుడు = సంభ్రమరహితుడై యున్నాడో, ఆ ఈశ్వరుడు నా హృదయములో విద్యమానమై, నా ఆత్మ (స్వరూపము) అయి ఉన్నాడు. ఈ

ఆత్మయే బ్రహ్మము. ఈ లోకము నుండి ప్రయాణమైన పిమ్మట నేను బ్రహ్మస్వరూపుడనగుదును.. ఈ విధముగా యెవరికి నిశ్చయమగునో, ఈ విషయములో ఏమాత్రము గూడ సందేహము లేదో, అతడు మరణించిన పిమ్మట నిశ్చయముగా బ్రహ్మభావమును పొందును.

ఈ పై వాక్యములో ప్రస్తుత ఖండములోని రెండవ వాక్యము యొక్క "మనోమయ" మొదలుకొని "ఆకాశాత్మ" వరకు పూర్వ భాగమును వదిలేసి శేషభాగమును గ్రహించి, సర్వకర్మత్వాది రూపములచే లక్షించి, మనోమయత్వాది రూపములచే ఈశ్వరుని ధ్యానాత్మక ఉపాసన చేయాలి అని సంకేతము చేయనైనది. అలక్షితము = అజ్ఞాతము యొక్క ఉపాసన సంభవించదు గాన ఉపాస్యమును యే రూపములచే లక్షించ (గుర్తించ) వలెనో, ఆ రూపములను రెండవ (మనోమయః ఇత్యాది) వాక్యములో విశదీకరించనైనది. ఉపాస్యము యొక్క స్వరూపమును ఒకసారి ధ్యానగత మొనర్చుకొన్న పిదప, దానిని అంతిమ క్షణము వరకు గుర్తించు కోవాలి. విస్మరించగూడదు. ఒకవేళ త్యాగము చేసినచో చిత్తైకాగ్రత సిద్ధించదు.

జ్ఞాన వైలక్షణ్యమును సూచించుటకు గాను ఉపాసనను మనోమయ వ్యాపారము అని చెప్పుట జరిగినది. సత్త్వగుణ ప్రధాన అంతఃకరణ భాగమునకు బుద్ధి యని, రజోగుణప్రధాన అంతఃకరణ భాగమునకు మనస్సు అని శాస్త్రోక్తి. బుద్ధి జ్ఞానశీలము మరియు మనస్సు క్రియాశీలము, చంచలము ఉంటుంది. బుద్ధియొక్క సత్త్వాంశ విషయకారపరిణామమునకు జ్ఞానమని, మనస్సు యొక్క రజో అంశ విషయాభిముఖ గతి(ప్రవృత్తి)కి మనో వ్యాపారమని అంటారు. అందుకే ఉపాసనను మనో వ్యాపారము అని చెప్పడమైనది. "చిత్త నదీ నామోభయవాహినీ వహతి కళ్యాణాయ వహతిపాపాయ చ" (యోగభాష్యము 1-12) చిత్తము ఒక నది వంటిది.

దీనికి రెండు ప్రవాహములు (పాయలు లేక చీలికలు) గలవు. అందొకటి కళ్యాణవహము (కైవల్యము = మోక్షమునకు చేరును). అందు రెండవది పాపవహము. సంసార పర్యంతము (విషయ భోగపర్యంతము) చేరును. సంసారమునకు హేతువగు చిత్తము యొక్క స్వాభావిక విషయోన్ముఖ ప్రవృత్తి నుండి మళ్ళించి ఉపాస్యమునకభిముఖము చేయు ప్రయాస - ప్రయత్నపూర్వక చిత్తవ్యాపారమునకే "ఉపాసన" అంటారు. ఈ చిత్త వ్యాపారరూప ప్రవాహమును సాతత్య = ఎల్లపుడు ఉపాస్యమునందు స్థాపనము చేయుట యేదిగలదో దానికే చిత్త స్థైర్యము లేక చిత్త ఏకాగ్రత అందురు. ఇదియే ఉపాసన యొక్క ముఖ్య ప్రయోజనము.

".తమేతమాత్మానం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన" ఇత్యాది శ్రుతిని (బృ.ఉ. 4-4-22), "తపసా కల్మషహన్తి" (మనుస్మృతి. 12-104) ఇత్యాది స్మృతిని కొంచెము నెమ్మదిగా పరీక్షించినచో ఉపాసన యొక్క ప్రయోజనము (చిత్తైకాగ్రత) సిద్ధించును. శ్రుతిలో వేదాధ్యయనము మరియు యజ్ఞమునకు ప్రయోజనముగా వేదతాత్పర్య విషయీభూతమగు ఆత్మస్వరూపము యొక్క "వివిదిషా" చెప్పబడినది. వేదాధ్యయనము చే వేదార్థ జ్ఞానము కలుగును. సగుణ బ్రహ్మము గూడ వేదార్థమే ఉన్నది. సతతవేదాధ్యయనము చేత సతతము ఉపస్థితమైన సగుణ బ్రహ్మము నందు చిత్తవృత్తి - సాతత్యరూప "ఉపాసన" వేదాధ్యయన శబ్దముచే నిష్పన్నమగుచున్నది. అట్లే యజ్ఞమునందు గూడ సగుణ బ్రహ్మరూప విష్ణ్వాది ధ్యానము ఆవశ్యకము. మరియు నగుణ బ్రహ్మ ధ్యానము ఉపాసనారూపమున్నది. "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" (బ్ర.సూ. 1-1-1) ఇచ్చట భాష్యకారులు "అథ" శబ్దమునకు అర్థము చెప్తూ-

"అత్ర అథ శబ్దః ఆనన్తర్యార్థకః పరిగృహ్యతే" ఈ సూత్రంలోని "అథ" శబ్దమునకు "తరువాత" అని అర్థము. అనగా సాధన చతుష్టయ

సంపత్యనంతరము బ్రహ్మ జిజ్ఞాసా (విచారము) కర్తవ్యము – అని చెప్పారు. బ్రహ్మజిజ్ఞాస–కు పూర్వము సాధన చతుష్టయ సంపత్తి కలిగి యుండాలి. మలదోషము, విక్షేపదోషము దొలగిపోయి కేవలము స్వరూపాజ్ఞానము గలవాడు అధికారి (సాధన చతుష్టయ సంపన్నుడు). చిత్తశుద్ధికి మరియు చిత్తస్థైర్యమునకు ప్రతిబంధకములు మలదోషము మరియు విక్షేప దోషము. అనగా – బ్రహ్మ జిజ్ఞాసకు పూర్వము చిత్త శుద్ధి మరియు చిత్తైకాగ్రత గలిగి ఉండాలి– అని అర్థతః సిద్ధమైనది. కావున, "తమేతమాత్మానం" అను శ్రుతిలో వేదాధ్యయనమునకు మరియు యజ్ఞమునకు ప్రయోజనముగా జిజ్ఞాసా పర్యాయవాచి "వివిదిష" చెప్పబడినందున పై శృతిలో ఉపాసనయొక్క ముఖ్య ప్రయోజనము చిత్తస్థైర్యము లేదా చిత్తైకాగ్రత నిస్సందేహముగా చెప్పబడినట్లు గ్రహించాలి. అట్లే "తపసా" అను స్మృతిలో కల్మషము = పాపము. ఇది చిత్తైకాగ్రతకు బాధకము. తపస్సుచేత కల్మషనాశనము చెప్పబడినందున ఉపాసనాత్మక తపస్సుచేత, ఉపాసన యొక్క ముఖ్యప్రయోజనమగు చిత్తైకాగ్రత అనాయాసముగా సిద్ధమగుచున్నది.

ఈ సందర్భములో బ్రహ్మసూత్ర, శాఙ్కర భాష్యములో చెప్పబడిన ఉపాసనాఫలములపై ఒకసారి దృష్టిని సారించుట ఎంతైనా అవసరము. అచ్చట ఈ విధముగా చెప్పబడినది – "(1) తత్ర కానిచిద్ బ్రహ్మణ ఉపాసనాన్యభ్యుదయార్థాని, (2) కాని క్రమముక్త్యర్థాని, (3) కాని చిత్కర్మ సమృద్ధ్యర్థాని" । (బ్రహ్మసూత్ర భాష్యము 1–1–11) (1) బ్రహ్మము యొక్క కొన్ని ఉపాసనలకు ఫలము అభ్యుదయము = విషయాభిముఖ్యేన ఉదయతే జాయతే యత్సుఖం తద్ । ఇహలోక సంబంధమైన స్త్రీధనాదులచేగాని, పరలోకసంబంధమైన స్వర్గాదుల (విషయముల) చేగాని గల్గు సుఖము. (2) కొన్ని ఉపాసనలకు ఫలము – క్రమముక్తి = ఆయా ఉపాస్య దేవతా స్థానాలలో కొంతకాలం సుఖంగా ఉండి తరువాత మోక్షము

పొందుతారు. ఈ క్రమ ముక్తిని శ్రీ వ్యాసభగవానులు బ్రహ్మసూత్ర చతుర్థాధ్యాయము మూడవ పాదములో మొదటి సూత్రము "అర్చిరాదినా తత్ప్రథితేః" నుండి మొదలుకొని విస్తారముగా వర్ణించారు. అర్చిరాదిమార్గముచేత బ్రహ్మలోక ప్రాప్తిని చెప్తూ - "తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసన్తి" (బృ.ఉ. 6-2-15) ఆ బ్రహ్మలోకాలలో దీర్ఘాయుర్దాయవంతుడైన పరావంతుని యొక్క (హిరణ్యగర్భుని యొక్క) దీర్ఘమైన సంవత్సరాలు నివసిస్తారు. అట్లే "న స పునరావర్తతే" ఇత్యాది శ్రుతుల ప్రకారము మరియు "బ్రహ్మణా సహతే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే । పరస్యాన్తే కృతాత్మానః ప్రవిశన్తి పరం పదమ్ ॥" పరిశుద్ధమైన అంతః కరణము గలవాళ్ళు ప్రళయం రాగానే కార్యబ్రహ్మ యగు హిరణ్యగర్భుడు అంతము పొందగా, ఆ బ్రహ్మతో సమ్యక్ జ్ఞానముగలవాళ్ళై హిరణ్యగర్భునికంటె పరమ్ - పరిశుద్ధమైన విష్ణువుయొక్క పరమపదమును హిరణ్యగర్భునితో గూడ పొందుతారు. ఇత్యాది స్మృతుల ప్రకారము "కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్" (బ్ర.సూ. 4-1-10) కార్యాత్యయే = బ్రహ్మలోకం ప్రళయం పొందునపుడు; తదధ్యక్షేణసహ = కార్య బ్రహ్మలోకాధిపతితో గూడ; అతః= హిరణ్యగర్భునికంటె, పరమ్ = పరమైన బ్రహ్మను పొందుతారు; అభిధానాత్ = అట్లు శాస్త్రములో చెప్పడం వల్ల - అని సూత్రార్థము. "స్మృతేశ్చ" (బ్ర.సూ. 4-3-11) స్మృతి వల్ల గూడ కార్య బ్రహ్మనే పొందుతారు - అని సూత్రార్థము. ఈ మొదలగు సూత్రములచే శ్రీవేదవ్యాస భగవానులు క్రమముక్తిని ప్రతిపాదించారు. (3)

ఇక మరికొన్ని ఉపాసనలకు ఫలము - కర్మ సమృద్ధి = కర్మలు చక్కగా అందంగా ఉండటం కొఱకు ఉద్దిష్టమైనవి. అభ్యుదయార్థాని ప్రతీకోపాసనాని, క్రమ ముక్త్యర్థాని దహరాదీని, కర్మసమృద్ధ్యర్థాన్యుద్గీథా దీని । (కల్పతరు) (న్యాయనిర్ణయః)

**శంక:-** ఉపరోక్త సూత్ర, భాష్యములలో ఉపాసనకు చెప్పబడిన ఫలములతో పాటు ముఖ్యప్రయోజనమగు చిత్తైకాగ్రతను ఉల్లేఖించలేదు గదా! అంటే చిత్తైకాగ్రతను ఉపాసనకు ఫలముగా చెప్పుటకు ఆచార్యులకు ఇష్టము లేదా?

**సమాధానము :-** శంక చేయనవసరము లేదు. ఉపాసనకు ముఖ్య ప్రయోజనము చిత్తైకాగ్రతయే ఉంది. ఇది మొదటి సూత్రమునందే చెప్పకుండానే చెప్పినట్లయినదని ఇంతకుముందే తెలిసికొని వచ్చాము. ఇచ్చట ఉపాసనకు ఆనుషంగిక (అవాంతర) ఫలములను మాత్రమే ఉల్లేఖించారు. "తేషాం చిత్తైకాగ్ర్య ద్వారా జ్ఞానం ముఖ్యం ఫలమితి తద్వాక్యానామపి మహాతాత్పర్యం బ్రహ్మణీతి మన్తవ్యమ్" (రత్నప్రభ) ఆ ఉపాసనలకు చిత్తైకాగ్రత ద్వారా జ్ఞానము ముఖ్యఫలము గావున ఆ వాక్యములకు బ్రహ్మము నందే మహాతాత్పర్యము గలదని స్వీకరించవలెను - అని అచార్యుల యొక్క అభిప్రాయమును టీకాకారులు వ్యక్తము చేసారు.

ఛాందోగ్యోపనిషత్తు నందు శాండిల్య విద్యా ప్రకరణములోని "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఈ మహావాక్యమును దృష్టిలో పెట్టుకొని, దీని యొక్క భావమునే వ్యక్తం చేస్తూ "ధ్యానీ ధ్యాతాం పంధరిరాయా" అను అభంగమును శ్రీతుకారాం మహారాజుగారు పారవశ్యములో కీర్తించారు. (అలమితి విస్తరేణ).

- అధికారి వర్ణనము -

స్థూలదేహమునందు వాతము, పిత్తము మరియు కఫము అను మూడు దోషములున్నవి. వాటి నివృత్త్యర్థము ధన్వంతరి మొదలగు వారు ఆయుర్వేద శాస్త్రమును రచించారు. అట్లే సూక్ష్మదేహము (అంతఃకరణము నందు మలము, విక్షేపము మరియు ఆవరణము (అజ్ఞానము) అను మూడు

దోషములున్నవి. వాటి నివృత్యర్థము కర్మకాండము, ఉపాసనా కాండము మరియు జ్ఞానకాండము అను మూడు కాండములతో గూడిన ఈశ్వరరచిత నాలుగు వేదములున్నాయి.

1. మల దోషము = పాపదోషము. ఇది జన్మాంతరములందు చేసిన అశుభకర్మలచే గల్గును. అధర్మము, అపూర్వము మరియు అదృష్టము అను పదములు పాపశబ్ద పర్యాయములు. ఈ పాపము అంతఃకరణము నందు సంస్కార (వాసనా) రూపముచే అత్యంత సూక్ష్మముగా నుండును, గావున ప్రత్యక్షము లేదు. అందుకే అదృష్టము అన్నారు. "అధర్మో నరకాదీనాం హేతుర్నిందిత కర్మజః। ప్రాయశ్చిత్త వినాశ్యోఽసౌ - (కారికావళి). అధర్మము శాస్త్రనిషిద్ధాచరణ (నిషిద్ధకర్మ) జన్యము. నరకాది సమస్త దుఃఖములకు మరియు నారకీయ శరీరాదులకు అసాధారణ నిమిత్త కారణము "మా హింస్యాత్సర్వాభూతాని", సురాం న పిబేత్", మాంసం న భక్షయేత్", "బ్రాహ్మణో న హన్తవ్యః" ఇత్యాదులు నిషేధ శాస్త్రము. ఒక వేళ శాస్త్రనిషిద్ధ అభక్ష్య భక్షణము, అపీయపానాదులు చేసినచో పాపము గల్గును నరకాదులకు హేతువగును.

"విహితస్యాననుష్ఠానాత్ నిందితస్య చ సేవనాత్ ।
అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి ॥
తస్మాత్తేనేహ కర్తవ్యం ప్రాయశ్చిత్తం విశుద్ధయే ।"

శాస్త్రము విధానము చేసిన కర్మలనాచరించనిచో, శాస్త్ర నిషిద్ధా చరణ (నిందిత కర్మాచరణ) చేతను ఇంద్రియనిగ్రహము లేని నరులు పతనమును (పాపమును) పొందుదురు. అందువలన పాపమును పోగొట్టుకొని పరిశుద్ధుడగుటకు ప్రాయశ్చిత్త కర్మల నాచరించవలెను. ఒకవేళ అధర్మమే లేనిచో, అది ప్రాయశ్చిత్తముచే నశించుట సంభవించదు.

పురుషుడు నిషిద్ధకర్మలు చేయవలెననిగాని, విషయముల ననుభవింప వలెనని గాని ఇచ్ఛగించినచో (కోరినచో), అతని చిత్తములో అశుభ (పాప) వాసన ఉన్నట్లు గమనించాలి. దీనిచే నతడు మలదోషము చేత యుక్తుడు అని తెలియవలెను. ఈ పాపము ఉక్తరీతిచే అగమానుమానములచే దెలియబడుచున్నది. అందువలన మలదోష గ్రస్తుడైన వానికి తన్నివృత్త్యర్థము నిష్కామ కర్మ, లేక సకల భూతముల (ప్రాణుల) యందు దయ, అథవా ఈశ్వరనామోచ్చారణ మొదలగు సాధనములు కర్తవ్యములున్నవి. వీటిలో రీతిపూర్వక ఈశ్వరనామోచ్చారణ చేత పాపరూప మలము మరియు విక్షేప (చంచలత) రూప మలము - రెండు ప్రకారముల మలము నాశనమగుచున్నది. అన్యములగు నిష్కామ కర్మ మరియు సర్వభూతదయ వీటిచే కేవలము మలదోషమే నాశనమగును.

2. 1. విక్షేపము అనగా చిత్త చాంచల్యము. ఎవరి చిత్తము వేదాంత శ్రవణాదులందుగాని మహావాక్యార్థరూప స్వస్వరూపమునందు గాని స్థిరపడుట లేదో మరియు ప్రాపంచిక విషయములందు పరిభ్రమించున్నదో - ఆ పురుషుడు విక్షేపదోషముచే యుక్తుడు - అని తెలిసికోవలెను. అందువలన అతనికి ఈశ్వరనామము లేక అజపాగాయత్రీ (సోఽహం) మంత్రోచ్చారణ మరియు ఈశ్వరుని యొక్క (సగుణబ్రహ్మము యొక్క) మూర్తి ధ్యానము లేక నిర్గుణ బ్రహ్మము యొక్క చింతనము మొదలుకొని ఉపాసనలు కర్తవ్యములున్నవి. ఎందుకనగా - ఉపాసనచేత చిత్తము యొక్క ఏకాగ్రత గల్గి విక్షేపదోషము నివృత్తమగును. 2. అథవా మనో వాక్కాయ ధనాదులచే నిష్కపటుడు, దయాళువు మరియు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన సద్గురువు యొక్క సేవ ఈశ్వరభావముతో యెవరు చేయుదురో, వారికి ఉపాసనచేయకుండానే చిత్తశుద్ధి మరియు ఏకాగ్రత గల్గుచున్నవి. 3. అథవా

అప్రమత్తుడగు మందజిజ్ఞాసువు వేదాంతశ్రవణమునందు మరియు అభ్యాసమునందు ప్రీతిపూర్వకముగా ప్రవృత్తుడైనచో, అతనికి గూడ కర్మ ఉపాసనలు చేయకుండానే చిత్తశుద్ధి మరియు ఏకాగ్రత గల్గుచున్నవి. ఎందుకనగా-

**శ్లో॥ దినే దినే తు వేదాంత శ్రవణాద్భక్తిసంయుతాత్ ।**
**గురుశుశ్రూషయా లబ్ధాత్ కృచ్ఛాశీతి ఫలం లభేత్ ॥**

**అర్థము :-** శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడైన శ్రీగురుపాదారవిందముల సేవతో, గురువు మరియు ఈశ్వరునియందు అకుంఠితమైన భక్తితో కూడి యుండి, ప్రతిదినము వేదాంతశ్రవణము చేయు అధికారి పురుషునకు యెనబది కృచ్ఛ్రచాంద్రాయనాది వ్రతముల ఫలము లభించును.

దీనిచే పాపరూప మల నివృత్తి పూర్వక చిత్తశుద్ధి మరియు "స తు దీర్ఘకాల నైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః (యో.సూ. 1-14) దీర్ఘకాల నిత్య నిరంతర ఆదరపూర్వక వేదాంత శ్రవణాభ్యాసము చేత, దృష్టాంతములు మరియు ఇతిహాసాదులచేత, (ఎట్లు నాటకము చూచువానికి వినోదము గల్గునో, అట్లు) బుద్ధికి వినోదము గల్గును. దానిచే విక్షేపరూపముల నివృత్తి పూర్వక చిత్తైకాగ్రత గల్గును.

3. "బ్రహ్మరూప ఆత్మను నేనెఱుగను' అను నీ వ్యవహారమునకు హేతువు అజ్ఞానము. ఇటువంటి ప్రతీతి యెవరి చిత్తమునందు గలదో, అతడు అజ్ఞాని యనబడును. అతనికి తత్త్వజ్ఞానము సంపాదించుట యోగ్యమైయున్నది. ఎందుకనగా! తత్త్వజ్ఞానముచేత ఆవరణము (అజ్ఞానము) నివృత్తమగుచున్నది. అన్యసాధనముల చేత గాదు. కాని, ఈ తత్త్వజ్ఞానము అధికారి పురుషునికి మాత్రమే కల్గును. అధికారియనగా! ఈ జన్మము

నందుగాని, జన్మాంతములందుగాని చేయబడిన నిష్కామ కర్మ మరియు ఉపాసనలచేత యెవరియొక్క మలదోషము మరియు విక్షేపదోషము నాశమయ్యెనో మరియు మూడవది యగు అజ్ఞానము (స్వరూపావరణము) మాత్రము మిగిలి యున్నదో, అటువంటి వివేకాది నాల్గు సాధనములచే సంపన్నుడైన పురుషుడు వేదాంత విచారమునకు (శ్రవణాదులకు), తజ్జన్య బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానమునకు మరియు తద్ద్వారా మోక్షమునకు అధికారి యగుచున్నాడు. (వేదాంతబాల బోధము).

**- సాధన చతుష్టయ సంపత్తి -**

అద్వితీయమగు ప్రత్యగభిన్న బ్రహ్మమునందు వాస్తవముగ బంధము గాని మోక్షముగాని దుర్నిరూప్యములు. అజ్ఞాన తత్కార్య సంబంధ రూప భ్రమ యేది గలదో అదియే బంధము. తన్నివృత్తి పూర్వక స్వరూపావస్థానమే మోక్షము. బంధము విచారప్రాగభావోపలక్షిత అజ్ఞానముచే గలిగినందు వలన, విచారజన్య దృఢాపరోక్ష బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముచే తప్ప అన్యసాధనములచే నివృత్తి యగుట కసంభవముగాన విచారము అవశ్యకర్తవ్యమైయున్నది.

**శ్లో॥ అవిచారకృతో బంధో విచారేణ నివర్తతే ।**
**తస్మాజ్జీవ పరాత్మానౌ సర్వదైవ విచారయేత్ ॥** (వే.పం. 10-5)

**అర్థము :-** అవిచారముచే నేర్పడిన బంధము, విచారముచేతనే నివర్తించును గాన ఎల్లప్పుడు జీవపరమాత్మలను గూర్చి విచారించవలెను.

విచారమునకు విషయములు జీవుడు, పరమాత్మ మరియు జగత్తును గూడ గ్రంథాంతరములలో చెప్పడమైనది. కావున ఈ మూడింటిని సాక్షాత్కార పర్యంతము విచారించవలయును. బంధనివృత్త్యర్థము శ్రవణ,

మనన, నిధిధ్యాసన రూప విచారమునవశ్యము చేయవలయును. విచారము చేయగల యధికారి యెవరు? యెవరికి మల దోషము, విక్షేపదోషములు లేవో, కేవల స్వరూపాజ్ఞానము మాత్రము గలదో, మరియు వివేకము, వైరాగ్యము, షట్ సంపత్తి మరియు ముముక్షుత్వము అను సాధన చతుష్టయ సంపత్తి గలదో అతడే వేదాంత విచారమునధికారి యగును. నిష్కామ కర్మచే మలదోషము నివర్తించును. ఉపాసనచేత విక్షేప (చిత్త చాంచల్యము)ము నివర్తించును. మరియు సాధన చతుష్టయ సంపన్నుడై తత్త్వవిచారము గావించినచో దృఢాపరోక్షజ్ఞానముచే ఆవరణ (అజ్ఞాన) దోషము నివర్తించును. కావున శ్రీతుకారాం మహారాజుగారు ముముక్షువులనుద్దేశించి, సాధనలను అవశ్యముగా సమకూర్చుకొనవలెనని తన యొక్క అభంగవాణి ద్వారా తెలియజేయుచున్నారు. గమనక్రియ జరుగనిదే గమ్యము ప్రాప్తించనట్లు, సాధనలను సమకూర్చుకొననిదే, సాధ్యము (మోక్షము) ప్రాప్తించదు. గాన ప్రప్రథమమున సాధన చతుష్టయ సంపత్తిలోని మొదటి సాధనయగు వివేకమును మరియు దానికి సాధనమగు హరినామ చింతనను గూర్చి తెలియపరచుచున్నారు.

**55. అభంగము :-**

సారాసార విచార కరా ఉఠా ఉఠీ ।
నామ ధరా కంఠీ విఠోబాచే ॥1॥

తయాచ్యా చింతనేఀ నిరసేల సంకట ।
తరాల దుర్ఘట భవ సింధూ ॥2॥

జన్మోనియాం కుళీఀ వాచేఀ స్మరే రామ ।
ధరీ హాచి నేమ అహర్నిశీ ॥3॥

**తుకాహ్మణే కోటీ కుళేం తీం పునీత ।**
**భావేం గాతాం గీత విఠోభాచే ॥4॥** (3147)

ప్ర.ప :- ఓ జనులారా!; ఉఠాఉఠీ = సత్వరమే; సారాసార విచార = సారాసార విచారమును; కరా = చేయండి; (మరియు) కంఠీ = కంఠమునందు, విఠోబాచే = శ్రీ విఠలుని యొక్క; నామ ధరా = నామమును ధరించండి. 1. తయాచా = అతని యొక్క; చింతనే = చింతనముచే; సంకట = సంకటములు; నిరసేల = నిరసింపబడును; దుర్ఘట = కఠినమైన; భవసింధూ = భవనదిని; తరాల = తరించగలవు. 2. కుళీం = ఉత్తమ మానవ కులములో; జన్మోనియా = జన్మించి; వాచే = వాక్కుచే; రామ = శ్రీరాముని (మనసారా); స్మరే = స్మరించండి; అహర్నిశీ = రాత్రింబవళ్ళు; హాచీ = ఇదే; నేమ = నియమమును; ధరీం = ధరించండి (పెట్టుకోండి. 3. తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; విఠోబాచే = శ్రీవిఠలుని యొక్క ; గీత = గుణగానమును (ఎల్లప్పుడు); భావే = భావ పూర్వకముగా; గాతాం = గానము చేయుచున్నచో; తీం - అతని యొక్క ; కోటీకుళేం = కోటికులములు; పునీత = పవిత్రమై ఉద్ధరింపబడును. 4.

**తా॥** ఓ జనులారా! ఈ జగత్తులో సత్యమేమిటో? మిథ్యా ఏమిటో? చిత్ ఏమిటో? అచిత్ ఏమిటో? సుఖము దేనియందు గలదో? దుఃఖము దేనియందు గలదో? వీటికి సంబంధించిన విచారము చేసి, సత్ చిత్ సుఖముయొక్క ప్రాప్తి కొఱకు త్వరపడండి. మరియు విఠలుని దివ్య నామమును కంఠమున ధరించండి. 1. విఠోబారాయుని చింతనము చేతనే నీయొక్క సర్వ సంకటములు దూరమగును. మరియు దుస్తరమైన భవనదిని అనాయాసముగ దాటగలవు. 2. మనుష్యయోనిలో మంచికులమందు జన్మించి నిరంతరము శ్రీరాముని చింతన చేయుట నియమముగా

పెట్టుకొనవలెను. 3. శ్రీ తుకారాం మహారాజు గారంటున్నారు. శ్రీవిఠోబా యొక్క దివ్యనామమును కీర్తించిన తోడనే కోటికులములు (తరములు) పవిత్రమై ఉద్ధరింపబడును. 4.

**విశేషము :-** శ్రీ తుకారాం మహారాజుగారు పై యభంగములోని మొదటి చరణముచే నిత్యానిత్యవస్తువివేకము చేయవలెనని బోధిస్తున్నారు. నిత్యమనగా? కాలానవచ్ఛిన్నత్వమ్. భూత, భవిష్య, వర్తమాన కాలములచే పరిచ్ఛిన్నము (మర్యాదితము) కానిది. అన్ని కాలములలో నుండునది యని అర్థము. అనిత్యమనగా తద్విపరీతము కాలముచే గ్రసింపబడునది యని అర్థము. ఈ వస్తువు నిత్యము, ఇది అనిత్యము అని వివేచనము చేయుటయే నిత్యానిత్యవస్తువివేకము. ఇది ఆపాతముగా వేదార్థము నెఱింగిన యనుమాన కుశలుడగు బ్రహ్మతత్త్వ జిజ్ఞాసువునకు బ్రహ్మమే నిత్యమగు వస్తువు, తదన్యమగు సర్వము అచేతనము అనిత్యమను వివేకము గలుగును. "నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మమ్" (ముం.ఉ. 1-6); "అజో నిత్యః శాశ్వతోఽయం పురాణః" (కఠ. 2-18); "నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః" (గీత 2-24) ఇత్యాది ప్రమాణములు ఆత్మతత్త్వము నిత్యమనుటలో ఆధారములు. "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించన మిషత్" (ఐ.ఉ. 1-1); "నేతి నేతి" (బృ. 3-9-26); "నేహనానాస్తి కించన" (బృ. 4-4-19); "అథ యదల్పం తన్మర్త్యమ్" (చాం. 7-24-1); "ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత" (గీత. 2-14) ఇత్యాది ప్రమాణములు ఆత్మవ్యతిరిక్తదృశ్యజాతమంతయును అనిత్యమనుటలో ఆధారభూతములుగానున్నాయి. ఆత్మ అవినాశి అచలముగానున్నది, జగత్తు దానికి ప్రతికూలముగా (విరుద్ధము)నున్నదను నిత్యానిత్యవస్తువివేకమేది గలదో, అదియే సర్వసాధనములకు

మూలమైయున్నది. అందుకే శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు "సారాసార విచార కరా ఉతా ఉరీ" - అని. పై విధముగా వివేచించిన యెడల బ్రహ్మముయొక్క విజ్ఞానము కలుగుచున్నందున ఇంతటితో విచారధారను ఆపి వేసినచో నేమియును ఆపత్తి లేదు గదా! అని శంకించవలదు. ఎందనకనగా! ఆపాతముగా నిత్యవస్తువగు బ్రహ్మము తెలియ బడినప్పటికిని, దాని యొక్క అద్వితీయత్వ ప్రత్యగభిన్నత్వాదుల నిర్ధారణగానందున, బ్రహ్మతత్త్వ జిజ్ఞాస నివృత్తము గానందువల్ల గూడ బ్రహ్మ విచారము నాపి వేయగూడదు. కొనసాగించ వలెను. శ్రీతుకోబారాయ్ సారాసార వివేచనము చేయవలెనని బోధించి, మల, విక్షేప దోషములు నివర్తించనిదే వివేకాదులు పట్టుబడవు గావున వివేకాది సాధనలకు సాధనమైన హరినామ స్మరణ (ఈశ్వరోపాసన)ను వెనువెంటనే "నామ ధరా కంఠీ విఠోబాచే" అని చెబుతున్నాడు. శ్రీవిఠోబా (విఠలుని) యొక్క దివ్యనామమును కంఠమున ధరించండి. అనగా ఎల్లప్పుడు విఠలుని నామ సంకీర్తనము గావించండి అని చెప్పుచున్నాడు.

ప్రాసంగికముగా "విఠల్" అను శబ్దార్థమును తెలిసికొనెదము.

(1) విద్ - జ్ఞానే ధాతువుతో "విదా జ్ఞానేన ఠాన్ శూన్యాన్ లాతి గృహ్ణాతి ఇతి విఠలః"। అనగా జ్ఞానశూన్యులైన అజ్ఞజనులను అనుగ్రహిస్తాడు, కావున విఠలుడని పిలువబడుచున్నాడు. అథవా-

"వి"= భేదము (జీవబ్రహ్మల భేదము)ను "ఠ' = అభావము లేదా నాశనము, "ఠోబా" = నాశనము చేయువాడు. అందువలన పాండు రంగ భగవానునికి "విఠోబా" అను పేరు వచ్చెను.

(2) శ్రీతుకారామ్‌జీ అభంగానుసారము - "వీచా కేలా ఠోబా। హ్మణోని నాంవ విఠోబా" (3170) వీ= పక్షి; ఠోబా = వాహనము. అనగా

పక్షిని (గరుత్మంతుని) వాహనముగా యెవరు జేసికొనిరో వారు (విష్ణువు) "విఠోబా" అని పిలువ బడుచున్నాడు.

(3) కొందరు వారి బుద్ధి చాతుర్యముతో ఇలా గూడ చెప్పినారు. వీ = (విద్)= జ్ఞానము, దానియొక్క ఠోబా = ఆకారము (మూర్తి) అనగా జ్ఞానమూర్తి (పరబ్రహ్మముయొక్క సగుణ సాకార మూర్తి - విఠోబా).

(4) కొందరు "విష్ణు" శబ్దము ప్రాకృత బాషలో విఠూ లేదా విఠోబా గా మారినదని అంటారు.

(5) మరి కొందరు "విటస్థల" అనగా ఇటుక ఎవరికి స్థలమో అనగా ఎవరు ఇటుకపై నిలబడి యున్నాడో అతడు "విఠలః" అనబడును - అని చెప్పుదురు.

ఉండనిమ్ము. ప్రకృతము ననుసరించెదము. శ్రీతుకారాం మహారాజుగారు చెప్పుచున్నారు. అహర్నిశలు హరినామ సంకీర్తన చేయండి. శ్రీరాముని మనస్సునిండా స్మరించండి. విఠలుని నిత్య నిరంతర ఆదరపూర్వకముగా చింతించండి. దానిచే మీ సంకటములు (విఘ్నములు) అన్ని దూరమగును. మరియు దుస్తరమైన భవనదిని దాటగలరు.

ఈశ్వర నామోచ్చారణ, చింతనచేత, భక్తిచేత ఈశ్వరాను గ్రహమునకు పాత్రులగుదురు. జ్ఞానమునకు ప్రతిబంధకమగు (పాప దోషము) మల దోషము, విక్షేప దోషము నివర్తింపబడును.

**శ్లో॥ జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః ।**
**యథా దర్పతల ప్రఖ్యే పశ్యత్యాత్మాన మాత్మని ॥** (శాం.ప. 204-8)

**అర్థము :-** పాపకర్మ నశించడం వల్ల, అద్దం వంటి అంతఃకరణంలో, ఆత్మను సాక్షాత్కరించేటట్లుగా, పురుషులకు జ్ఞానం కలుగుతుంది.

**శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్ ॥** (గీత. 5-12)

**అర్థము :-** ఈశ్వరునియందు సమాహితచిత్తము గలవాడు, కర్మఫలమును విడిచిపెట్టి మోక్షమనే శాంతిని పొందుతాడు. నైష్ఠికీమ్ అనగా నిష్ఠయందు గలిగేది అని అర్థము. అంతఃకరణ శుద్ధి, జ్ఞానప్రాప్తి, సర్వకర్మ సన్న్యాసము, జ్ఞాననిష్ఠ క్రమముగా పొంది, ఆ నిష్ఠవల్ల గలిగే శాంతిని (మోక్షమును) పొందుతాడు.

**శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।** (గీత. 18-45)

**అర్థము :-** స్వ స్వ వర్ణాశ్రమాలలో ఉంటూ ఈశ్వరార్పణ బుద్ధిచే, విహిత కర్మలననుష్ఠించినచో జ్ఞాననిష్ఠా యోగ్యతా లక్షణ సిద్ధిని పొందుదురు.

**శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।**
**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥** (గీత 18-46)

**అర్థము :-** ఏ పరమాత్మవలన ప్రాణులయొక్క ప్రవృత్తి = తమ తమ పనులలో ప్రవర్తించడము జరుగుచున్నదో, ఏ పరమాత్మచేత ఇదంతా (జగత్తంతా) వ్యాపించియున్నదో, ఆ పరమాత్మను స్వ విహిత కర్మానుష్ఠానము చేత పూజించి మానవుడు జ్ఞాననిష్ఠాయోగ్యత (సాధనచతుష్టయసంపత్తి రూప) సిద్ధిని పొందును. అథవా పరంపరగా శాంతిరూప మోక్షమును పొందును.

**శ్లో॥ స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్ ।**
**సాధనం చ భవేత్పుంసాం వైరాగ్యాది చతుష్టయమ్**
(అపరోక్షానుభూతిః -3)

**అర్థము :-** స్వ వర్ణాశ్రమ విహితకర్మానుష్ఠానముచేతను, తపస్సు చేతను, భగవంతుని సంతోషపెట్టగల భూతదయ మొదలగు సామాన్య

ధర్మములచేతను, సాధనములనబడు వైరాగ్యాది నాలుగున్ను మానవులకు సంభవించును. యద్యపి సాధనచతుష్టయము వివేకాది క్రమముచే చెప్పబడినప్పటికిని, వైరాగ్యము అసాధారణకారణముగా తెలియజేయుట కొఱకు శ్లోకములో మొదట గ్రహించనైనది.

ఈ ప్రకారముగ స్వ వర్ణాశ్రమ ధర్మోచిత కర్మలను ఈశ్వరార్పణ బుద్ధిచే ఫలాభిసంధి రహితముగ నాచరించుట చేతను, ఈశ్వర నామోచ్చారణ మరియు ఉపాసనచేత క్రమముగా మలదోషము, విక్షేప దోషము నివర్తించి ఈశ్వరానుగ్రహముచే సాధన చతుష్టయ సంపత్తి ప్రాప్తించును. అందులో మొదటిదగు సారాసార (నిత్యానిత్య) వివేకమును సాధకుడు అవశ్యముగా చేయువలెనని చెప్పుచూ, మరియు ఈశ్వర శరణాగతి గూడ అత్యంతావశ్యకమని ఈ క్రింది అభంగము ద్వారా శ్రీ తుకారామస్వామి బోధిస్తున్నాడు.

**56.** అభంగము :-

ఆతాం ఉఘడీ డోళే । జరీ అద్యాపి న కళే ।
తరీ మాతేచియా ఖోళే । దగడ ఆలా పోటాసీ ॥1॥

మనుష్యదేహా ఐసా నిధ । సాధీల తేc సాధేc సిద్ధ ।
కరూని ప్రబోధ । సంతపార ఉతరలే ॥2॥

నావ చంద్రభాగే తీరీc । ఉభీ పుండలికాచే ద్వారీc ।
కట ధరూనియాc కరీc । ఉభాఉభీ పాలవీ ॥3॥

తుకా హ్మణే పుకాసాఠీc । పాయీc ఘాతలియా మిఠీ ।
హెహొతో ఉదా ఉఠీ । లవకరీచ ఉతార ॥4॥ (86)

ప్ర.ప :- (అరే నరుడా!) డోళే = కన్నులు; ఉఘడీ = తెరువుము; అద్యాపి = ఇప్పటికి కూడ; జరీ = ఒకవేళ; న కళే = (నీకు) సత్యమేమిటో తెలియనిచో; తరీ = అట్లగుచో; మాతేచియా = తల్లియొక్క; పోటాసీ = గర్భమునకు; ఖోళే = ముసుగు (ఆచ్ఛాదనము) వేసికొని; ఆలా = వచ్చిన; దగడ = బండఱాయివి. (అనబడుతావు). 1. మనుష్యదేహా = మానవ శరీరము; ఐసా నిధి = ఇటువంటి నిధి (మూలధనము)గా ఉన్నది; సాధీలతే = సాధించదగినదేదో దానిని; సాధే సిద్ధ = సాధ్యముగా పొందవచ్చును; (ఈదేహముతో) సంత = సత్పురుషులు; ప్రబోధ = జ్ఞానబోధ; కరూని = చేసి; పార = సంసారము అను నదియొక్క అవతలి తీరమును; ఉతరలే = చేరుకొనిరి. 2. చంద్రభాగే తీరీం = చంద్రభాగ నదీ తీరమున; పుండలికాచే ద్వారీం = భక్త పుండరీకుని గృహ ద్వారమున; (ఒకానొక) నావ = పడవ; ఉభాఉభీ = నిలుచుండి; (భక్తులను భవనది నుండి తరింపజేస్తాను అని) పాలవీ = పాలించుచున్నది అనగా పిలుచుచున్నది; (ఆనావ) కట = నడుమున; కరీం = చేతులు; ధరూనియాం = ధరించి; ఉభీ = నిలబడి యున్నది. 3. తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; పుకా సాఠీ = ఒక్క పైసగూడ తీసికొనకయే; (ఎవరైతే శ్రీపాండురంగని) పాయీం= పాదములను; మిఠీ ఘాతలియా = దృఢాలింగనము చేసికొందురో వారికి; ఉఠాఉఠీ లవకరీచ = చాలా తొందరగా; ఉతార హెూతో = ఉద్ధరణ జరుగును. 4.

**తా॥** ఒరే నరుడా! నీ చావు దగ్గరకు రాబోతున్నది. ఇప్పటికైనా నీ యొక్క వివేక నేత్రమును తెఱువుము. సంసారము (దృశ్యజాతము) మిథ్యా ఎట్లు? ప్రత్యగభిన్న బ్రహ్మము సత్యమెట్లు? బాగుగా విచారించి (వివేకము జేసి) పరమార్థ సాధనయందు తగుల్కొనుము. సంతుమహాత్ములు (శంకరాచార్యులు మొదలగు వారు)" బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ

నాపరః” అని ఎంతగానో చెబుతూనే ఉన్నారు; ఈ జగత్తులో నీవు స్వతః అనేక సుఖదుఃఖములననుభవించు చుండియు గూడ నీవు అనాది అజ్ఞాన నిద్రనుండి మేల్కొంచుటలేదు. నీవు మనిషివేనా? లేక తోలు తొడుగు వేసికొని తల్లిగర్భమున జన్మించిన బండఱాయివా? 1. దుష్కరకార్యములు గూడ ప్రయత్నముచే సాధించే అవకాశము ఈ మనుష్య దేహమునకే గలదు. ఈ మానవ దేహములో ఈశ్వర ప్రదత్తమైన వరప్రసాదరూప నిధి (ఆత్మజ్ఞాన రూప నిధి – నిక్షిప్తమై) ఉన్నది. దీపమున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకోవాలి. కావున ఓ నరుడా! త్వరపడుము. ఆత్మానాత్మ వివేకము చేసి ఆత్మతత్త్వమును యథార్థముగా నెఱింగి పరమ విశ్రాంతి ధామమగు మోక్షమును బడయుము. ఎందరో మహాత్ములు ఈ శరీరముతో తీవ్రతమ సాధనలు చేసి, జగత్తునకు బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానమును బోధించి, ఎందరినో తరింప జేసి, వారు గూడ ఈ మహా దుస్తరమగు సంసారరూపనది దాటి ధన్యులైనారు. 2. ఈ జననమరణరూప సంసారమును దాటుటకు చంద్రభాగ నదీ తీరమున, శ్రీభక్త పుండరీకుని గృహద్వారమున, నడుముపై చేతులిడుకొని (పాండురంగడు అనునొక) నావ నిలబడి ఉన్నది. (ఇరువది ఎనిమిది యుగముల నుండి) నదీ తీరమున అలాగే.... నిలబడి సకల జనులను ఈ సంసారరూప నది నుండి దాటించెదను – రండి, అని పిలుచుచున్నది. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు – ఒక్క పైసా గూడ యాచించకుండా ఉచితముగానే, యెవరు శ్రీపాండురంగని దివ్య చరణారవిందములను గట్టిగా వాటేసుకుంటారో వారిని అనాయాసముగా అతి త్వరలో సంసారనదినుండి తరింపజేస్తాడు – (శ్రీబాలకృష్ణరూప రంగడు). 4.

**విశేషము :–** శ్రీ తుకారాంమహారాజుగారు ప్రస్తుత అభంగములోని మొదటి చరణము ద్వారా తన యొక్క ఖేదమును ప్రకటన చేశాడు. సకల

జీవులు ఎలా తరిస్తారు? ఎప్పుడు తరిస్తారు? జీవితమును అనర్థములైన ఇంద్రియార్థముల ఉప భోగమునందు నిరర్థకముగ వ్యర్థపుచ్చుకుంటున్నారే! అను దుఃఖముతో హృదయము నిండా సమస్త భూతములపట్ల కరుణను నింపుకొని, పైకి మాత్రము వ్యంగ్యముగా కోపించినట్లు తన యొక్క అనుకంపా (దయ)ను వ్యక్తము చేసాడు. ఒరే నరుడా! నీకు దినదినము మృత్యువు సమీపిస్తున్నది. అమూల్యమైన మానవదేహాముతో ప్రయత్నపూర్వకము ఏది సాధించదలచినను సాధించుటకు యోగ్యమున్నది గదా! "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్" అను నానుడు వినలేదా! ఆత్మానాత్మ వివేకము చేసి స్వస్వరూపమును యథాతథము తెలియనిచో ఈ శరీరమెందులకు? నిరర్థకము.

శ్లో॥ శునఃపుచ్ఛమివ వ్యర్థం జీవితం విద్యయా వినా ।
న గోపయతి గోప్యాంగం న వారయతి మక్షికాన్ ॥

**అర్థము** :- విద్యలేని మానవజన్మము కుక్కతోకవలె వ్యర్థము. అనగా కుక్కతోక దానియొక్క మర్మస్థానమును కప్పియుంచుటకున్ను, దేహమును బాధించు ఈగలను దోమలను తోలుటకున్ను ఉపయోగపడదు. కావున విద్య లేనివాని దేహము కేవలము భారమే గాని ఏమియును ఉపయోగపడదు.

ఒరే నరుడా! వ్యాస వసిష్ఠ శంకరాది మహాత్ములు "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నాపరః" అని బాహువులెత్తి చాటుచున్నను తెలియవైతివి. హా కష్టము. ఏమి నీ దౌర్భాగ్యము.

శ్లో॥ ఊర్ధ్వ బాహుర్విరౌమ్యేష న చ కశ్చిచ్ఛృణోతి మామ్ ।
ధర్మాదర్థశ్చ కామశ్చ స ధర్మః కిం న సేవ్యతే ॥

అర్థము :- నేను రెండు చేతులు పైకెత్తి చెప్పుచున్నాను. ధర్మమార్గమున ప్రవర్తించువారికి చతుర్విధపురుషార్థములు గలుగును. అధర్మ ప్రవృత్తియగు ప్రాణిహింస, మద్యపానాదులు చేయువారికి నరక ప్రాప్తియే గలుగును. అయ్యో! నా మాటలు ఎవరును వినుట లేదే! హా కష్టము ఈ విధంగా ప్రజలు ధర్మమును ఆచరించుట (సేవించుట) లేదని శ్రీవేదవ్యాస మహర్షుల వారు రెండు చేతులు పైకెత్తి దుఃఖముతో చాటించిరి.

ఒరే మానవుడా! ఎందరో మహాత్ములు ఆత్మతత్త్వమును గూర్చి పరిపరి విధముల బోధిస్తున్నా, దానిని పెడచెవినపెట్టి, వారి ననాదరించు చున్నావు. అసలు నీవు మనిషివేనా? లేక తోలుతొడుగు వేసికొని తల్లి గర్భమునుండి జన్మించిన బండరాయివా?

శ్లో॥ బోధేఽప్యనుభవో యస్య న కథంచన జాయతే ।
తం కథం బోధయే చ్ఛాస్త్రం లోష్టం నరసమాకృతిమ్ ॥
(వే.పం.3-19)

అర్థము :- ఏవిధముగ బోధించినను ఎవనికి యనుభవము రాదో అట్టి నరరూప మట్టిపెల్లకు శాస్త్రము మాత్రము ఎట్లు బోధింపగలదు? బోధింప జాలదని యర్థము.

ఈ ప్రకారముగా శ్రీతుకారాం మహారాజుగారు ఎంతో దుఃఖముతో అజ్ఞజనులయందు గల దయచేత వ్యంగ్యముగా కోపగించినట్లు చెప్పుతూ మానవునకు ఆత్మానాత్మ (నిత్యానిత్య) వస్తు వివేకము అత్యంతావశ్యకమని బోధించి తదనంతరము ఈ వివేకమునకు కారణము ఈశ్వర నామోచ్చారణ, ఉపాసన (భక్తి), సంపూర్ణ శరణాగతి యని బోధించుచున్నారు.

చంద్ర భాగనదీతీరమున శ్రీ భక్త పుండరీకుని గృహద్వారమున తన రెండు చేతులను నడుముపై నిడుకొని సకల జీవులను "సంసారరూపనది

నుండి తరింపజేస్తాను - రండి" అని పిలుస్తూ పాండు రంగడు అను నావ ఇటుకపై నిలబడి ఉన్నది. ఆ పాండరంగని పవిత్ర నామమును అహర్నిశలు ప్రేమతో ఉచ్చరిసన్తా, అరాధిసన్తా (ఉపాసిసన్తా) యెవరు అతని దివ్యపాదారవిందములకు సంపూర్ణముగా శరణగతి యగుదురో, వారిని అతి శీఘ్రముగా అనాయాసముగా సంసారనదినుండి - శ్రీపాండురంగ భగవానుడు ఉద్ధరిస్తాడు.

**శ్లో॥ అపారసంసారసముద్ర మధ్యే సమ్మజ్జతో మే శరణం కిమస్తి ।**
**గురో కృపాళో కృపయా వదైత ద్విశ్వేశ పాదాంబుజ దీర్ఘ నౌకా ॥**

(ప్రశ్నోత్తర మణిరత్నమాల)

ప్రశ్న:- దయాసముద్రుడవైన ఓ గురువర్యా! అనుగ్రహించి నాకీ విషయమునుఁ దెలియజేయుము. అపారమైన ఈ సంసారసముద్రము నందు మునిగిపోవుచున్న నాకు దిక్కేది? ఉత్తరము:- సర్వేశ్వరుని యొక్క పాదపద్మమనెడి ఉత్తమ నావయే దిక్కు.

ఉపరోక్త అభంగ ద్వయము ద్వారా శ్రీ తుకోబారాయ్ నిష్కామముగా ఈశ్వరనామోచ్చారణ మరియు ఉపాసన చేయుట చేత క్రమముగా మల, విక్షేప దోషములు నివర్తింపబడి, ఈశ్వరానుగ్రహముచే వివేకాది సాధన చతుష్టయ సంపత్తి ప్రాప్తించునని బోధిస్తూ అందులో మొదటి సాధనమగు వివేకము మానవులకవశ్య కర్తవ్యముగా నొక్కి వక్కాణించిరి. ఈశ్వరాభిన్న శ్రీగురుదేవులయొక్క సేవ నిష్కామముగా అనన్య భక్తి శ్రద్ధలతో చేసినా గూడ మల విక్షేప రూప దోషములు నివర్తింపబడి సాధన చతుష్టయ సంపత్తి ప్రాప్తి ద్వారా జీవుడు ఉద్ధరింపబడగలడను సత్యమును గూడ యిచ్చట సాధకులు గమనింప దగియున్నది.

శ్రీ పాండురంగాయ నమః

ఈ సంసారములో బాగుగా విచారించి చూచినచో గృహ క్షేత్రాదులందుగాని, పుత్రమిత్ర కళత్రాదులందుగాని, ధనకనక వస్తు వాహన స్రక్చందనాదులందుగాని ఏమైనా సుఖమున్నదా? ఒక వేళ ఉంటే - బుద్ధ భగవానుడు, నచికేతుడు, సమర్థ రామదాసు మొదలగు మహాత్ములు ప్రాపంచిక సుఖాలను కాలదన్ని నివృత్తి మార్గము నెందులకవలంబించారు? శ్రీకృష్ణ పరమాత్మ ఇలా ఎందుకు చెప్పి యుంటాడు?

**శ్లో॥ యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః ॥** (గీత. 5-22)

**అర్థము :-** ఓ కౌన్తేయ! విషయేంద్రియముల సంపర్కం వల్ల కలిగిన యే భోగాలున్నాయో, అవి దుఃఖానికి కారణములే అయి యున్నవి. ఆది అంతములు గలవి. కావున వాటియందు పండితుడు (వివేకి) రమించడు - ఆనందించడు.

మహాత్ముల యనుభవమును బట్టి, శ్రుతి స్మృతి పర్యాలోచన చేతగూడి ప్రపంచములో నిజముగా సుఖము లేదని నిర్ధారించబడినది. కాని యనాది యవిద్యచే మోహితుడైన జీవునకు సంసారములో సుఖభ్రాంతి కలిగినది. నీటిగుంటలోని నీరు ఇంకిపోయినను ఆ గుంటను వీడుట కిష్టపడని కర్కాటకము (ఎండ్రకాయ) యేవిధముగా మరణించునో అట్లే ఆపాతరమణీయముగా దోచు గృహాదులందు సుఖిత్వభ్రమచే, వాటిని వదలలేని మనుష్యుడు వంచితుడై నశించి పోవుచున్నాడు. అహం మమాధ్యాస చేత కోశకారక్రిమి (పట్టుపురుగు) వలె సంసార జాలము నుండి బయటపడుట కసమర్థుడైన జీవుడు బద్ధుడై దుఃఖిస్తున్నాడు. కావున ముముక్షువగు పురుషుడు బ్రహ్మలోక పర్యంతమగు భోగములయందు గూడ వైరాగ్యము గలిగి దోషదర్శనముచే విముఖుడైతేనే మోక్షము సిద్ధించును.

శ్లో॥ వైరాగ్యం పుష్కలం నస్యాన్నిష్ఫలం బ్రహ్మదర్శనమ్ ।
తస్మాద్రక్షేత విరతిం బుధో యత్నేన సర్వదా ॥

అర్థము :- ఐహికాముష్మికములందు సంపూర్ణముగా దృఢ వైరాగ్యము లేనిదే బ్రహ్మజ్ఞానము నిష్ఫలమగును. అందువలన బుద్ధిమంతుడగు పురుషుడు ఎల్లప్పుడు ప్రయత్న పూర్వకముగా వైరాగ్యమును రక్షించుచుండవలెను.

శ్లో॥ యదా మనసి వైరాగ్యం జాయతే సర్వవస్తుషు ।
తదైవ సన్యసేద్విద్వాన్ అన్యథా పతితో భవేత్ ॥

అర్థము :- ఏ సమయమున సమస్త వస్తువులయందు వైరాగ్య ముదయించునో, అదే సమయమున విద్వాంసుడు సన్యసించవలెను. లేనిచో పతితుడు కాగలడు.

శ్లో॥ ఐహికాముష్మికార్థేషు హ్యనిత్యత్వేన నిశ్చయాత్ ।
నైఃస్పృహ్యం తుచ్ఛబుద్ధ్యా యత్తద్వైరాగ్యమితీర్యతే ॥
(సర్వ వేదాంత సిద్ధాంత సారసంగ్రహము-22)

అర్థము :- ఈ లోకసంబంధమైన, పారలౌకిక సంబంధమైన సమస్త భోగముల యందు అనిత్యత్వ, తుచ్ఛత్వ (మిథ్యాత్వ) బుద్ధితో నిశ్చయపూర్వకముగా ఏ నైఃస్పృహ్యము గలుగునో, దానినే వైరాగ్యమందురు.

శ్లో॥ కాకస్య విష్ఠావదసహ్యా బుద్ధిర్భోగ్యేషు సా తీవ్ర విరక్తిరిష్యతే ।
విరక్తి తీవ్రత్వ నిదానమాహుర్భోగ్యేషు దోషేక్షణమేవ సన్తః ॥
(స.వే.సి.సా.సం. 24)

అర్థము :- భోగ్య పదార్థములయందు కాకి మలమువలె యే

యనహ్యా బుద్ధి ఉదయించునో దానిని వైరాగ్యమని యందురు. భోగ్యపదార్థముల యందు దోషదర్శనమే వైరాగ్యమునకు హేతువైయున్నది.

**శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ ।**
**జన్మ మృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥** (గీత. 13-8)

**అర్థము :-** ఇంద్రియ విషయములందు వైరాగ్యము గలిగి యుండవలెను. అహంకారము లేకుండా ఉండాలి. జన్మ, మరణము, ముసలితనము మరియు వ్యాధులందు దోషమును దర్శించు చుండవలయును.

ఇంత గ్రంథ సందర్భముచే వైరాగ్యము బ్రహ్మజ్ఞానమునకు అసాధారణ కారణముగా తెలియబడుచున్నందున ముముక్షువగువాడు దృఢ వైరాగ్యము నాశ్రయించవలెనని శ్రీతుకారాం మహారాజుగారు స్వయముగా జీవిత సత్యమును "అభంగవాణి" ద్వారా నిదర్శనముగా చూపుచున్నారు.

**57. అభంగము :-**

మృత్యులోకీ ఆమ్హాం అవడతీ పరీ ।
నాహీం ఎకా హరినామేంవిణ ॥1॥

విటలేం హేంచిత్త ప్రపంచాపాసూని ।
వమన తేం మనీం బైసలసేం ॥2॥

సోనేం రూపేం ఆమ్హాం మృత్తికేసమాన ।
మాణికపాషాణ ఖడే జైసే ॥3॥

తుకా మ్హణే తైశా దిసతీల నారీ ।
రిసాచియాపరీ ఆమ్హా పుఢే ॥4॥

ప్ర.ప :- ఆమ్హా = మాకు; మృత్యులోకీ = ఈ మానవలోకంలో; ఎకా = ఒకానొక; హరినామేఁ విణ = శ్రీహరియొక్క మధురమైన దివ్య నామము తప్ప; పరీ = అన్యము; ఆవడతీ నాహీఁ = రుచించడము లేదు. 1. (మాయొక్క) హేఁ = ఈ; చిత్త = చిత్తము; ప్రపంచాపాసూని = ప్రపంచము నుండి; విటలేఁ = విరతిని పొందినది; వమన = వాంతిజేయబడిన అన్నము పట్ల ఎట్లు హేయ బుద్ధి గలుగునో; తేఁ = అటువంటి హేయ బుద్ధిఁ, మనీఁ = నా మనస్సులో; బైసలసేఁ = కూర్చొనినది. 2. సోనేఁ = బంగారము; రూపేఁ = రూపాయిలు; ఆమ్హా = మాకు; మృత్తికేసమాన = మట్టితోసమానము; మాణిక = మాణిక్యములు, ముత్యములు మొదలగునవి(మాకు) పాషాణ ఖడే జైసే = పాషాణఖండములవలె దోచును. 3. తుకాహ్మణే = శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు; ఆమ్హా పుఢే = మాయెదుటవచ్చి; నారీ = స్త్రీ; రిసాచియాపరీ = ఎలుగుబంటు పగిది; తైశా = అట్లు; దిసతీల = అగుపించును. 4.

**తా॥** ఈ మృత్యులోకములో మాకు శ్రీహరి యొక్క దివ్య నామము ఒకటి తప్ప అన్య మెద్దియును రుచించడము లేదు. 1. ప్రపంచము పట్ల మా చిత్తము విరక్తిని పొందినది. వమనము చేసిన అన్నము పట్ల ఎట్లు హేయ బుద్ధి కలుగునో, అటువంటి హేయబుద్ధి మామనస్సులో నిలచినది. 2. మాకు బంగారము, రూపాయిలు మట్టితో సమానము. మాణిక్యములు, ముత్యములు మొదలగునవి పాషాణఖండములతో సమానముగ దోచును. 3. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు - మా ముందు వచ్చిన స్త్రీ ఎలుగుబంటువలె లావణ్యహీనము మరియు భయప్రదముగ కానుపించును. 4.

అభంగము :-

స్త్రియాంచా తో సంగ నకో నారాయణా ।
కాషాయ పాషాణ మృత్తికేచ్యా॥1॥

నాఠవే హాదేవ నఘడే భజన ।
లావలేం మన ఆవరేనా ॥2॥

దృష్టిముఖే మరణ ఇంద్రియాంచ్యా ద్వారేం।
లావణ్య తే ఖరేం దుఃఖమూళ ॥3॥

తుకా హ్మణే జరీ అగ్ని ఝాలా సాధూ ।
తరీ పడే బాధూ సంఘష్టణే ॥4॥ (239)

ప్ర.ప :- నారాయణా = ఓ నారాయణా!; స్త్రియాంచా సంగ = స్త్రీలతో యే సంబంధము గలదో; తో = అది; (నాకు) నకో – వద్దు; యా = ఈ; కష్ఠా = కాష్ఠనిర్మితములగు; పాషాణ = శిలా నిర్మితములగు; మృత్తికేచ్యా = మృన్మయములగు స్త్రీలతో గూడ సంబంధము వలదు. 1. (ఎందువల్లననగా? దానిచే) దేవ = భగవంతుడు; నాఠవే = గుర్తుకు రాడు; హా = ఈ; భజన = భగవద్భజన; నఘడే = సంభవించదు; లాంచావలేం మన = (ఒక్కసారి) భోగాసక్తమైన మనస్సు; (మళ్ళీ) ఆవరేనా = అదుపులోనికి రాదు. 2. (స్త్రీలయొక్క సౌందర్యమును) దృష్టిముఖే = దృష్టిపథములోకి వస్తే చాలు అనగా ఒకమారు స్త్రీలను చూస్తే చాలు (భోగవాసన నిర్మాణమగును); ఇంద్రియాంచ్యా ద్వారేం = (ఇక) సాక్షాత్తుగా ఇంద్రియముల ద్వారా అనుభవించినచో; మరణ = మరణమే సంభవించును. (యేనకేన ప్రకారముగా) తే ఖరేం= ఇది మాత్రము సత్యము (ఏమిటి?) ; లావణ్య = స్త్రీలయొక్క రూప లావణ్యము (సౌందర్యము); దుఃఖమూల = దుఃఖమునకు

కారణము. 3. తుకాహ్మణే = శ్రీతుకారాంమహారాజుగారంటున్నారు; అగ్ని= నిప్పు; జరీ సాధూ ఝాలా = ఎంత మంచిదయినప్పటికిని; సంఘష్టణే = దాని సంబంధముచే; తరీ బాధూ పడే = తప్పకుండా దుఃఖము కలుగుతుంది (కాల్చుతుంది.) గదా! 4.

**తా॥** హే నారాయణా! నాకు స్త్రీలతో ఏమాత్రము గూడ సంపర్కము వలదు. మనుష్య జాతిస్త్రీలతోనైతే సంబంధము వద్దే వద్దు. ఇంతే కాదు, కాష్ఠనిర్మిత, శిలానిర్మిత, మృన్మయమగు నచేతన స్త్రీ ఆకృతి చేతగూడ నాకు సంబంధము వలదు. 1. ఎందుకనగా? దానిచేత భగవంతుడు జ్ఞప్తికి రాదు, భజన జరుగదు. మరియు ఒకసారి మనస్సు భోగాసక్త మయినచో అది మళ్ళీ అదుపు (వశము) లోనికి రాదు. 2. స్త్రీల యొుక్క రూపలావణ్యమునొకసారి చూస్తే చాలు, అంతఃకరణములో భోగవాసన నిర్మాణమగును. ఇక ప్రత్యక్షముగా ఇంద్రియములచే స్త్రీసౌఖ్యము ననుభవించినచో, (కైముతిక న్యాయముచే) మరణమే ప్రాప్తించును. యేనకేన ప్రకారేణ స్త్రీల యొుక్క రూపలావణ్య దర్శనము దుఃఖకారణము. ఇది సుపరి నిశ్చితము. 3. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు. అగ్ని ఎంత సుందరముగా నున్నప్పటికిని, ఎంతో ఉపయుక్తమున్నప్పటికిని, దానిని స్పృశించినచో నది దహించివేయును. అట్లే స్త్రీ సంసర్గముచే, పురుషుడు అశేషదుఃఖమునకు గురి యయ్యి నశించును. 4.

**విశేషము:–** పై యభంగముల ద్వారా శ్రీతుకారాం మహారాజుగారు పురుషులకు స్త్రీల సాంగత్యముగాని, స్త్రీలకు పురుషుల సాంగత్యముగాని సర్వదా త్యాజ్యమని బోధిస్తున్నారు. స్త్రీలయొుక్క రూపరూపలావణ్య దర్శనమాత్రము చేతనే గొప్ప గొప్ప తాపసులు గూడ పతనమైనట్లు తెలుస్తున్నది. ఇక సామాన్య సాధకుల విషయమేమి చెప్పేది?

శ్లో॥ నిస్సంగతా ముక్తిపదం యతీనాం సంగాదశేషాః ప్రభవంతి దోషాః।
ఆరూఢయోగోఽపి నిపాత్యతేఽధఃసంగేన యోగీ కిముతాల్ప బుద్ధిః॥
(విష్ణుపురాణము 4-2-124)

అర్థము :- యతులకు (సాధకులకు) నిఃసాంగత్యమే ముక్తి సాధనము. సాంగత్యముచే సమస్త దోషములు వాటిల్లును. సంగదోషముచే ఆరూఢయతిగూడ పతితుడౌతాడు. ఇక మంద్రప్రజ్ఞులగు మనుష్యుల సంగతేమిటి?"గజాః అపి పలాయంతే మశకానాం కింవక్తవ్యమ్" భీకరపెనుగాలి ఒరవడికి ఏనుగులే కొట్టుకొని పోతుంటే ఇక దోమసంగతేమిటి? చెప్పండి.

శ్లో॥ విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబు పర్ణాశనా
స్తేఽపి స్త్రీ ముఖపంకజం సులలితం దృష్ట్వైవ మోహం గతాః ।
శాల్యన్నం సఘృతం పయోదధియుతం యే భుంజతే మానవా
స్తేషా మింద్రియ నిగ్రహో యది భవేద్ వింధ్యస్తరేద్ సాగరమ్ ॥

అర్థము :- వాయువు, జలము, వృక్షములయొక్క పత్రములను భక్షించి తపస్సు జేయు పరాశరుడు, విశ్వామిత్రుడు మొదలగు ఋషివృందమే స్త్రీ ముఖకమల సందర్శనమాత్రముచేతనే విమోహితులై పథభృష్టులై పోయారు. అలాంటప్పుడు పాలు, పెరుగు, నెయ్యితోటి కమ్మగా భాసుమతి బియ్యంతో గాంచిన షడ్రసోపేతమగు పుష్టికరమగు నాహారమును భుజించిన మానవులు ఒకవేళ ఇంద్రియములను నిగ్రహించగలిగినచో, వింధ్య పర్వతము సముద్రమును తరించినట్లేయని భావించవలెను. అనగా అసంభవమని యర్థము.

శ్లో॥ అగ్నికుండ సమా నారీ ఘృతకుంభ సమో నరః ।
సంసర్గేణ విలీయేత తస్మాత్తాం పరివర్జయేత్ ॥

**అర్థము :–** స్త్రీ అగ్నికుండము వంటిది. పురుషుడు నేతి కుండ వంటి వాడగును. స్త్రీ సంసర్గముచే పురుషులు నశించుచున్నారు కావున స్త్రీ సర్వథా త్యాజ్యము.

**శ్లో॥ నారీ స్తనభరనాభినివేశం, దృష్ట్వా మాగా మోహావేశమ్ ।**
**ఏతన్మాంసవసాది వికారం, మనసి విచింతయ వారం వారమ్ ॥**

**అర్థము :–** ఓ మూఢుడా! స్త్రీయొక్క స్తనములను, నాభీస్థలమును జూచి మోహము జెందుకుము. దీనిని మాంసము, రక్తము, క్రొవ్వు, చీము మొదలగు దుర్గంధమైన సమూహమని మనసునందు మాటి మాటికి విచారము చేసి గోవిందుని స్మరించుము. నారాయణ ధ్యానము చేయుము. రామభజన జేయుము అని శ్రీశంకరులు బోధించిరి.

ఈప్రకారముగా స్త్రీలో గల సమస్తదోషములు వైరాగ్యమును బోధించుటకొఱకు శాస్త్రాంతరములలో (గ్రంథాంతరములలో) సవిస్తరముగా వర్ణింపబడినవి. గ్రంథవిస్తరభయముచే నుల్లిఖించుట లేదు. వివేకి యగువానికి అధికముగా చెప్పనవసరము లేదు. ముఖ్యముగా పరమార్థసాధకుడు స్త్రీవిషయములో చాలా సావధానముగా నుండవలెను. ఎందుకనగా!

**శ్లో॥ యస్యస్త్రీ తస్యభోగేచ్ఛా నిఃస్త్రీకస్య క్వ భోగ భూః ।**
**స్త్రియం త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీ భవేత్ ॥**

**అర్థము :–** వనిత యున్న వానికే భోగేచ్ఛ, వనిత లేనిచో భోగమున కాస్కారమెచట? అందువలన, కామినీ త్యాగమవశ్య మొనరింపవలెను. రమణిని త్యజించుట యనిన జగత్తును త్యజించుటయే, జగత్తును త్యజించిన సుఖియగును – అని యోగవాసిష్ఠము నుడువుచున్నది. కావున దోషదర్శనముచేత సాధకుడు దృఢవైరాగ్యమును సంపాదించవలెనని

శాస్త్రాధారములచే జనులకు బోధించుటయే గాకుండా స్త్రీలపట్ల మరియు ప్రపంచము పట్ల ఎంతటి విరక్తుడు, నిఃస్పృహుడై యుండెనో శ్రీతుకారాం మహారాజు యొక్క జీవిత చరిత్రయే నిదర్శనమని గత రెండు అభంగములచేత మరియు వక్ష్యమాణ అభంగము ద్వారా తెలియబడు చున్నది. శ్రీశుకముని సమీపమునకు రంభ వచ్చినట్లు, అర్జునుని చెంతకు ఊర్వశి యేతెంచినట్లు ఒకనాటి రాత్రి శ్రీతుకోబారాయని చెంతకు ఒక కుబుద్ధి గల స్త్రీ యరుదెంచి తన దుష్ట బుద్ధిని ప్రకటించెను. ఏ విధముగా శ్రీశుకముని రంభను నిరాకరించెనో, అర్జునుడు ఊర్వశిని యనాదరించెనో, యట్లే శ్రీతుకారాం మహారాజుగూడ తన వద్దకు పొందిక చేయుమని వచ్చిన వనిత నుద్దేశించి ఆమెను నిరాకరిస్తూ పలికిన పలుకులివి–

**58. అభంగము :–**

**పరావియా నారీ రఖుమాఈ సమాన ।**
**హేం గేలేం నేమూన ఠాయీంచేంచి ॥1॥**

**జాఈ వో తూం మాతే న కరీ సాయస**
**ఆమ్హీ విష్ణుదాస తైసేం నవ్హోం ॥2॥**

**న సహావే మస తుఝే హేం పతన ।**
**నకోహే వచన దుష్ట వదో ॥3॥**

**తుకామ్హణే తుజ పాహిజే భ్రతార ।**
**తరీ కాయ నర థోడే జాలే ॥4॥ (240)**

ప్ర.ప :– (ఓ పడతీ! మాకు) పరావియా నారీ = పరస్త్రీ; రఖుమాఈ సమాన = రుక్మిణీమాతతో సమానము; హే = ఇది; (మేము పూర్వమే) ఠాయీంచేంచి = నిశ్చయముగా; నేమూన గేలేం = నియమించకున్నదే

ఉన్నది. 1. (అందువలన) వో మాతే = ఓ తల్లీ! (నీవు); సాయాస = వ్యర్థ ప్రయాస; న కరీ = చేయకుండా; జాఈ = వెళ్ళిపో; ఆమ్హీ = మేము; విష్ణుదాస = విఠలుని దాసులమైయున్నాము; (కావున) తైసే నవ్హో = అలాంటి పాపకర్మ చేయువారము కాదు. 2. హేం = ఈ; తుఝే = నీయొక్క; పతన= తప్పటడుగు; మజ = నాకు; న సాహావే = సహనమగుట లేదు. హే = ఈ, దుష్టవచన = దుర్భాష (నన్ను పొందు చేయుమనుట) నకో వదో = మాట్లాడకుము. 3. తుకా హ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; తుజ = నీకు; భ్రతార = మగ పురుషుడు, పాహిజే = కావలెనన్నచో; తరీ= అట్లయిన; (ఈజగత్తులో అటువంటి పాపకర్మ జేయు) నర = పురుషులు; థోడే జాలే కాయ? = తక్కువ అయినారా ఏమి? (ఎంతో మంది ఉన్నారు. కావున నీవు వారి వద్దకు వెళ్ళి నీ కోరిక నెరవేర్చుకొనవచ్చును. ఇక్కడ నుండి వెళ్ళిపొమ్ము.)4.

**తా॥** ఓ పడతీ! మాకు పరస్త్రీ రుక్మిణీ మాతతో సమానము. ఇది మేము పూర్వమే నిశ్చయించుకున్న నియమము. 1. అందువలన ఓ తల్లీ! నీవు వ్యర్థమగు (శ్రమ) ప్రయాసను చేయకుండా వచ్చినట్లే తిరిగి వెళ్ళిపొమ్ము. మేము విష్ణుదాసులము, కావున అలాంటి (పరస్త్రీగమనమను) పాపకార్యము చేయు వారము కాదు. 2.

**శ్లో॥ మాతృవత్పరదారాణి పరద్రవ్యాణి లోష్టవత్ ।**
**ఆత్మవత్సర్వభూతాని వీక్షన్తే ధర్మబుద్ధయః ॥**

(పంచ తంత్రము. 1-435)

(స్వభావాదేవ న భయాద్యః పశ్యతి స పశ్యతి ॥)

(అన్నపూర్ణోపనిషత్. 1-38) (శ్రీ యోగవాసిష్ఠము 5-56-49. పృష్ఠము 1755). (గరుడ పురాణము. 1-111-12) (చాణక్యనీతి 12-14) (హితోపదేశము. 1-14)

ధర్మబుద్ధిగల వాడు పరస్త్రీలను తల్లివలెను, పరుల ద్రవ్యమును మట్టి పెల్ల (గడ్డ) వలెను, సకల జీవులను తనవలెను, భయము చేగాక స్వభావముగనే గాంచును. అట్లు ఎవడు గాంచునో, వాడే నిజముగ గాంచువాడగును.

కావున నో మాత! నీ యొక్క తప్పటడుగు (అడ్డునడక)ను జూచి నేను సహింప జాలకున్నాను. నీ యొక్క అధఃపతనమును జూడలేక పోతున్నాను. అందువలన "నాతో పొందుజేయమ"ను దుష్టభాషణము జేయ బోకుము. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు. అమ్మా! నీకు మొగడే (భర్తయే) కావలసి వచ్చినచో, పాపకర్మజేయు మనుష్యులు ఈ జగత్తులో తక్కువయ్యారా ఏమి? కోకొల్లలున్నారు. వారిచెంతకు వెళ్ళి నీ చింత దీర్చు కొనవచ్చును. ఇంతటితో నీ పంతము మాని ఇక్కడనుండి వెళ్ళిపొమ్ము. 4.

"వైరాగ్యం పుష్కలం నస్యా న్నిష్ఫలం బ్రహ్మదర్శనమ్ ।"

ఐహికాముష్మికములందు సంపూర్ణముగా దృఢవైరాగ్యము లేనిచో బ్రహ్మజ్ఞానము నిష్ఫలమగును.

"వైరాగ్యేన వినా జ్ఞానం కదాచిన్నోపజాయతే" ।

దృఢవైరాగ్యము లేనిదే దృఢాపరోక్ష బ్రహ్మజ్ఞానము ఎప్పుడును గలుగ నేరదు - ఇత్యాది శాస్త్ర వచనముల యనుసారము ముముక్షువగు పరమార్థ సాధకుడు పురుషప్రయత్నముచే వివేకయుక్త దోషదర్శన పూర్వకముగా దృఢవైరాగ్యమును సంపాదించవలయునని తన జీవిత చరిత్రను నిదర్శనముగా జూపుతూ శ్రీతుకారాం మహారాజుగారు తన యభంగవాణి ద్వారా లోకులకుపదేశించుచున్నారు.

చిత్త (మనో) రూప నది బాహ్యాభ్యంతర భేదముచే నుభయవాహిని ఉన్నది. ఆత్మకళ్యాణార్థము అభ్యంతరమునకు (లోపలికి) ప్రకృతి పురుష వివేకరూపమగు మార్గముగుండా ప్రవహించును. మరియు అవివేక రూపమగు మార్గముగుండా బాహ్యమునకు జన్మ మరణాది సంసారము వైపుకుగూడ ప్రవహించును. ఇందు సత్త్వ పురుషాన్యథాఖ్యాతి (ప్రకృతి పురుష వివేకజ్ఞానము) యొక్క యభ్యాసముచే నాత్మకళ్యాణాభిముఖ అంతఃప్రవాహము దెరువ బడును. బాహ్య విషయాభిముఖ పాప ప్రవాహము విషయములయందు దోషదృష్టి పూర్వక వైరాగ్యముచే నిరోధించబడును. "అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః "(యో.సూ. 1-12) అభ్యాసము మరియు వైరాగ్యము అను నీ రెండు ఉపాయములచేత చిత్తవృత్తులను నిరోధించ వచ్చునని పతంజలి భగవానుడు నుడివి యుండెను. మరియు శ్రీమద్భగవద్గీత 6-35. గూడ చూడదగినది.

శ్లో॥ మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ ।
అశుద్ధం కామసంపర్కా చ్ఛుద్ధం కామవివర్జనాత్ ॥
( మైత్రాయణ్యుపనిషత్ 6-34)

**అర్థము** :- మనస్సు శుద్ధము అశుద్ధము అని రెండు విధములుగ జెప్పబడినది. కోరికలతో కూడిన మనస్సు అశుద్ధము. కోరికలు లేని మనస్సు శుద్ధము.

శ్లో॥ మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥
(మై. ఉ. 6-34)

**అర్థము :-** బంధమునకుగాని మోక్షమునకుగాని మనస్సు మాత్రమే కారణము. మనస్సు విషయాసక్తమైనచో బంధము కలిగించును. విషయ రహితమైన మనస్సు ముక్తికి దారి చూపును.

చిత్తవేం నంసారవుు. దానిని అతిప్రయత్నముతో అభ్యాసవైరాగ్యములతో రజస్తమస్సులనే కల్మషములను తొలగించి యేకాగ్రము చేయవలెను. ఏలన? తన చిత్తము దేనియందు సంలగ్నమై యుండునో తనను దానినిగనే మర్త్యుడు భావించు కొనును. ఇదియే యనాది సిద్ధమైన రహస్యము. ఆత్మ స్వభావముచేత పరిశుద్ధము కాని చిత్తము తోడి సంపర్కముచేత దానికి సంసారిత్వము. ఆపాదింపబడుచున్నది. కనుక చిత్తశుద్ధి వలన ఆత్మదర్శనము సింద్ధించునని భావము.(వే.పం)

**శ్లో॥ మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ।**

(గీత. 6-14)

అర్థము :- మనస్సును వశములో ఉంచుకొని నాయందే చిత్తము గలవాడై, నేనే అత్యుత్తమ లక్ష్యంగా గలవాడై, సమాహితుడై కూర్చుండవలెను- అని గీతావచనము.

ఇంధనము లేని (దగ్ధకాష్ఠ) యగ్ని జ్వాలాది విశేష స్వరూపమును పరిత్యజించి ఎట్లు స్వ కారణమగు తేజోమాత్రరూపముచే నవశిష్టమై యుండునో అట్లే చిత్తముగూడ (అంతఃకరణముగూడ) అభ్యాస పాటవముతో దాని విశేషవృత్తులన్ని నిరోధింపబడినపుడు దాని కారణములో అనగా అపంచీకృత పంచమహాభూత సత్త్వప్రధానాంశకముగ సత్తామాత్రమై ఉండును. చిత్తము ప్రయత్న పూర్వక ధ్యానాద్యభ్యాసముచే ప్రశాంతమైనపుడు పుణ్యపాప కర్మలు నశించును. ఆత్మయందు సంలగ్నమైన ఉపశాంత చిత్తము అక్షయమైన సుఖము ననుభవించును. (వేదాంత పంచదశి).

దేహేంద్రియాది విషయకానురాగముచే పురుషుడు బంధింపబడుచున్నాడు. ఈ బంధమునకు విషయాత్మకమగు మనస్సే కారణము. ఇది మహావ్యాఘ్రమువలె భయంకరమగు జనన మరణరూప యనర్థకారియని శ్రీఆది శంకరులు శ్రీవివేకచూడామణిలో సాధకులను జాగృతి జేయుచున్నారు. (మేల్కొల్పుచున్నారు)

**శ్లో॥ మనోనామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు ।**
**చరత్యత్ర న గచ్ఛన్తు సాధవో యే ముముక్షవః ॥** (178)

**అర్థము :-** మనస్సని ప్రసిద్ధిజెందిన ఒక పెద్దపులి శబ్దాది విషయములను కారడవులయందు సంచరించుచున్నది. కావున మోక్షేచ్ఛగల సాధువులు యెవరు గలరో, వారు ఈ విషయారణ్యమునందు పోకుందురు గాక!.

ఆత్మ అసంగచిద్రూపుడైనను, యట్టి యాత్మను యీ మనస్సే దేహేంద్రియాదులనెడు బంధములచే బంధించి అనగా నవియే నేనను భ్రమను గలిగించి నేను నాది యనెడి భావముచే తన కార్యములయందును, సుఖ దుఃఖరూప ఫలానుభవములయందును త్రిప్పుచున్నది. అనగా జన్మ మరణాత్మక దుఃఖ సంసారములో పడద్రోయు చున్నది. మనస్సే యవిద్య. మాయ యనగా మనస్సును వదిలి మరొకటి లేదు. కావున మోక్షేచ్ఛగలవాడు మిగుల ప్రయత్నమును బూని మనస్సును పరిశుద్ధముగ జేసి కొనవలయును. ఈమనస్సు పూర్తిగా శుద్ధమయినచో మోక్షమనునది కరతలఫలము వలె వాని చేతిలో నున్నది. అనగా మనస్సును శుద్ధిపరచిన మోక్షము అతిసులభసాధ్యమని యర్థము. అందువలననే మనస్సును శబ్దాది విషయ సమూహము నుండి ప్రయత్న పూర్వకముగ నరికట్టి, ఆత్మ ధ్యానము (ఈశ్వర నామోచ్చారణ, ఉపాసనాదుల)చే శుద్ధ మొనర్చి ఆత్మ (స్వరూపము) యందు

స్థాపించవలెను. దీనినే శమాది షట్కసంపత్తి అనగా 1. శమము, 2. దమము, 3. ఉపరతి, 4. తితీక్ష, 5. శ్రద్ధ,6. సమాధానము - అనబడు ఆరు విధముల సంపత్తిలో మొదటిదగు- "శమ" మందురు.

**శ్లో॥ విరజ్య విష వ్రాతాద్దోష దృష్ట్వా ముహుర్ముహుః ।**
**స్వలక్ష్యే నియతావస్థా మనసః "శమ" ఉచ్యతే ॥ (వి.చూ)**

**అర్థము :-** స్రక్చందన వనితాది ఇంద్రియార్థములగు శబ్దాది విషయ సమూహము నుండి దోషదృష్టిచేత పునః పునః విరక్తి జెంది తన లక్ష్యమగు బ్రహ్మమందు మనస్సు యొక్క చలించని యునికి యేది గలదో, అదియే "శమ" మని చెప్పబడుచున్నది.

ఈ శమమును గూర్చి తెలియ జేయుచూ, ఒక రోచక పద్ధతిలో గమ్మత్తుగా, చాలా కౌశల్యముతో మనస్సును సంబోధిస్తూ, తన యభంగవాణిచే శ్రీతుకారాం మహారాజుగారు విన్నవించుకుంటున్నారు.

**59. అభంగము :-**

**మనా సాండీc హే వాసనా దుష్ట ఖోడీ ।**
**మతీమానసీc ఏక హే వ్యర్థగోడీ ।**
**అసే హీత మార్ఝేc తుజ కాంహీc ఏక ।**
**ధరీ విఠలీం ప్రేమ హేc పాయిc సూఖ ॥ 1 ॥**

**అసా సర్వభావేc తుజ శరణ ఆలోc ।**
**దేహ దుఃఖ హేc భోగితాం ఫార భ్యాలోం**
**భవతారితే దూసరేc నాహీc కోణీ ।**
**గురు హెూత కాందేవ ఆణిక తీన్హీ ॥2॥**

జనా వాసనా హే ధనా థోరి అహె ।
తుజ లాగలీ సంగతీ తేచి సోయే ।
కరీ సర్వసంగీc పరిత్యాగు రాయీాం ।
తుకా వీనవీ తేవునీ శీర పాయీాం ॥3॥ (3360)

ప్ర.ప:- హే మనా! = ఏ మనసా!; వాసనా = విషయ వాసన; దుష్టఖోడీ = దుష్ట వ్యసనము; సాండీc = వదిలిపెట్టుము; మతీ + మానసీ= బుద్ధి మరియు మనస్సు (చిత్తము)నందు; గోడీ = విషయాభిలాష ఉండుట; హే ఏక = ఇదొక; వ్యర్థ = వ్యర్థమగు అలవాటు; మాఝే = నాయొక్క; హీత = హితము; తుజ = నీవద్ద; కాహీc = ఏక = ఒకానొకటి (చాలా గొప్పదైనది); అసే = ఉన్నది; (ఓ మనసా!) హే = (నీకు) ఇదే(నా విన్నపము); విఠలీం ప్రేమ ధరీ = శ్రీ పాండురంగిని యందు మిగుల ప్రేమను కలిగి యుండుము, (ఎందుకనగా?) పాయీాం = రంగని పాదములచెంత; సూఖ = సుఖమున్నది. 1. (ఓమనసా!) అసా= ఈ ప్రకారముగ; సర్వభావేc = సర్వభావముచే (నీవే సర్వస్వమని); తుజ = నీకు; శరణ ఆలోం = శరణు జొచ్చితిని; దేహా = దేహసంబంధమగు; హే దుఃఖ = ఈ దుఃఖమును; భోగితాం = అనుభవిస్తూ (నేను) ఫార = చాలా; భ్యాలోం = భయము జెందితిని; (ఓమనసా!) భవతారితే = (ఈ) భవసాగరము నుండి తరింపజేయగల సమర్థులు (నీకంటె) దూసరే = రెండవవాడు; కోణీనాహీc = ఎవరును లేరు; ఆణీక = హితులైన వారు; గురు = గురువు; తీన్హీ దేవ = బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు; కాం హెూత = ఉన్నప్పటికి; (నీ సహాయము లేక వారు ఏమియు చేయజాలరు.)2. తుకా = శ్రీతుకారాం మహారాజుగారు (చెబుతున్నారు); (ఓమనసా!) జనా = జనులకు; ధనా = ధనముయొక్క వాసన; థోరి ఆహే = అత్యధికముగ నున్నది; తుజ = నీకు (గూడ) తోచి = అదే (వారియొక్క); సంగతి = సహవాసమే; సోయే =

ఆశ్రయంబాయెను; లాగలీ = నీవుగూడ వారి మార్గమునే అనుసరించితివి; (నీవు) తాయీం = నిశ్చయముగా; సర్వసంగీపరిత్యాగు కరీ = సర్వ సంగ పరిత్యాగము చేయుము; (నీయొక్క) పాయీం = చరణములయందు; శీర= శిరమును; తేవూని = ఉంచి; వీనవీ = విన్నవించుకుంటున్నాను. 3.

**తా॥** ఓ నా మనసా! శబ్దాది విషయవాసన; వాటికి సంబంధించిన దుష్ట వ్యసనమును వదిలివేయుము. బుద్ధియందు మరియు చిత్తము (మనసు)నందు విషయముల యెడ ప్రీతి యేదిగలదో, అది వ్యర్థమగు దురలవాటు అగును. ఓ మనసా! నీ చెంత నాయొక్క గొప్ప హితము (మోక్షము) ఉన్నది. అందువలన నీకు ఇదేనా వినతి – ఏమనగా? నీవు విఠలుని యందు మిగుల ప్రీతి గలిగియుండుము. ఎందుకనగా? అతని దివ్య పాదారవిందముల చెంత అక్షయమగు సుఖము గలదు. 1. ఓ మనసా! నేను నీకు సంపూర్ణముగా శరణు జొచ్చితిని. నీయొక్క సహవాసము వలన నాకు అనేక దేహములు ప్రాప్తించినవి. వాటిచేగలుగు పలుదుఃఖముల ననుభవించి భయము జెందితిని. ఓ మనసా! నీవు తప్ప భవసాగరమునుండి తరింపజేయగల సమర్థులెవరును గూడ లేరు. నీకంటే అన్యులగు గురువులు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతలు ఉన్నప్పటికిని, నీ సహాయము లేకుండా ఏమియును చేయజాలరు. 2. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు ఓ మనసా! లోకులకు ధనవాసన యధికమైనది. నీకు వారి సంగతి లభించినందున నీవు గూడ వారి మార్గమునే యవలంబించితివి. గావున నో మనసా! నీవు ముఖ్యముగా సర్వసంగ పరిత్యాగము జేయుము. నీపాదములయందు శిరము నుంచి (వంచి) విన్నవించుకుంటున్నాను. 3.

**విశేషము :–** శ్రీ తుకారాం మహారాజుగారు అభంగములోని మొదటి చరణము ద్వారా మనస్సులో ప్రాంపచిక వాసన యేదిగలదో, యది మహా

యనర్థము (జనన మరణరూప సంసారము)నకు హేతువనియు వాసనా సంపరిత్యాగమే పురుషార్థమనియు బోధించుచున్నారు.

**శ్లో॥ సదైవ వాసనాత్యాగః శమోఽయమితి శబ్దితః ।**

(అపరోక్షానుభూతి)

**అర్థము :-** సర్వకాలములయందును, అంతఃకరణములోని పూర్వాజ్ఞానజన్యసంసారరూప వాసనయేది గలదో, దానిని త్యాగము చేయుటయే "శమ" మని చెప్పబడినది.

**శ్లో॥ దృఢ భావనయా త్యక్త పూర్వాపరవిచారణమ్ ।**
**యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా ॥** (యో.వా. 5-91.2)

అర్థము :- పూర్వకాలిక దృఢభావనావశమున, పూర్వాపర విచారణను వదలి, దేహాద్యనాత్మ పదార్థములను "నేను" "నాది" మున్నగు సంస్కారములచే గ్రహించుట యేది గలదో అదియే "వాసన" యని చెప్పబడినది.

**శ్లో॥** వాసనా వలితం జన్మ మోక్ష నిర్వాసనం మనః ।
**ప్రాణం చ రామ! గృహ్ణాతి యథేచ్ఛసి తథా కురు ॥**

(యో.వా 5-78-47)

**అర్థం :-** ఓ రామా! వాసనా యుక్తమగు చిత్తము జన్మమును, శరీరమును, ప్రాణమును గ్రహించును. వాసనారహితమగునది మోక్షమునే గ్రహించును. యిక నీ యిచ్ఛ వచ్చినట్లాచరింపుము.

జీవునియొక్క కళ్యాణము (మోక్షము) అంతఃకరణము (చిత్తము)చెంతనే యున్నది. కావున శ్రీతుకారాం మహారాజు మనస్సునకు విజ్ఞప్తి చేయుచూ, ఓమనసా! అనాదికాలిక యనంతజన్మల వైషయిక వాసన

యేదిగలదో అది వ్యర్థమగు దురలవాటగును. మోక్షమునకు ప్రతి బంధకమగును.

**శ్లో॥ మలినో హి యథాదర్శో రూపాలోకస్య న క్షమః ।**
**తథాఽవిపక్వ కరణ ఆత్మజ్ఞానస్య న క్షమః ॥**

(యాజ్ఞ.యతిధర్మ. 141)

**అర్థము :-** ఏప్రకారముగా మలిన దర్పణమునందు రూపము చూడబడదో అట్లే యే యంతఃకరణము పరిపక్వము (వాసనారహితము) కాలేదో, అది ఆత్మజ్ఞానప్రాప్తికి యోగ్యము కాదు.

కావున నో మనసా! నీవిపుడు శ్రీ విఠలునియొక్క దివ్యమైన పాదారవిందములయెడ ప్రీతి గల్గియుండి, నిరంతరము భజించు చుండుము. ఎందుకనగా అతని చరణారవిందముల చెంత అక్షయమగు సుఖము (పరమ శాంతి)గలదు.

**శ్లో॥ రే చిత్త! చింతయ చిరం చరణౌ మురారేః,**
**పారం గమిష్యసి యతో భవసాగరస్య ।**
**పుత్రాః కళత్రమితరే న హి తే సహాయాః,**
**సర్వం విలోకయ సఖే! మృగతృష్ణికాభమ్ ॥**

**అర్థము :-** అరే ఓ నా చిత్తమా! నీవు నిరంతరము శ్రీకృష్ణ చరణారవిందములను స్మరించుము. తద్వారా నీవు భవసాగరము నుండి తరించగలవు. పుత్ర మిత్ర కళత్రాదులెవరును నీకు సహాయము కాజాలరు. హే మిత్రమా! ఈ ఐహిక పారలౌకిక భోగములన్నియు మృగజలము (ఎండమావులు) వంటివని యెఱుంగుము.

"అహం బ్రహ్మాఽస్మి" యను జ్ఞానమునకు ఉపాదాన కారణము అంతఃకరణము. దాని పరిపూర్ణకృప లేనిచో నితరసాధనములన్నియును

నిష్ఫలములు. అందుకే శ్రీతుకారాం మహారాజుగారు మనస్సును ప్రార్థిస్తూ- ఓ మనస్సా! నీకు నేను సంపూర్ణముగా శరణాగతినొందితిని. ఈ భవసాగరమునుండి తరింపజేయగల సమర్థులు నీవు తప్ప మరెవరును లేరు. గురువు, బ్రహ్మాదిదేవతలుగూడ నీ సహాయములేనిచో యేమియును చేయజాలరు - అని అంటున్నారు.

శ్లో॥ తటస్థితా బోధయంతి గురవశ్శ్రుతయో యథా ।
ప్రజ్ఞయైవ తరేద్విద్వాన్ ఈశ్వరానుగృహీతయా ॥ (వి.చూ.477)

**అర్థము :-** వేదముల వలె జ్ఞానసంపన్నులైన గురువులు నిమిత్తమాత్రులై జ్ఞానోపదేశము చేయుచున్నారు. తత్త్వజ్ఞుడు ఈశ్వరానుగ్రహముచే సిద్ధమైన ప్రజ్ఞ (బుద్ధి) చేతనే సంసార సాగరమును దాటవలయును.

ఇచ్చట వేదము (శాస్త్రము), గురువు మరియు ఈశ్వరుడు నిమిత్త కారణములుగను, అంతఃకరణము బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానమునకు ఉపాదానకారణముగా దెలియబడుచున్నది.

జీవునకు మోక్షము గలుగవలెనన్న దానికి సాక్షాత్సాధనమునగు దృఢ అపరోక్ష బ్రహ్మజ్ఞానము కలగాలి. నేనెవరిని? బ్రహ్మమనగా యెవరు? జగత్తు అనగా ఏమిటి? ఈ మూడింటి విచారమనే దృఢఅపరోక్ష బ్రహ్మజ్ఞానముదయించును. ఈ విచారమునకు హేతువు లేమనగా? చతుర్విధ కృపలు కలిగితేనే జీవునికి విచారము పొడమును. అవి వరుసగా1. ఈశ్వర కృప. 2. వేద(శాస్త్ర) కృప. 3. గురు కృప. మరియు 4. అంతఃకరణ కృప.

1. సద్గురువు మొదలగు జ్ఞాన సామగ్రులు ప్రాప్తించినచో "ఈశ్వర కృప" కలిగినదని తెలియవలెను.

2. యథా తథముగ శాస్త్రార్థముయొక్క ధారణాశక్తి యేది గలదో దానిని "వేద (శాస్త్ర) కృప" యని తెలియాలి.

3. శాస్త్రము మరియు స్వానుభవానుసారముగ యథార్థ ఉపదేశము చేయుట "గురుకృప" యనబడును.

4. గురు శాస్త్ర వచనానుసారము సాధనములను సంపాదించుకొని, పరమార్థ సాధనకు మనస్సు అనుకూలించినచో దానిని "అంతఃకరణ కృప" యందురు.

కావున బ్రహ్మాత్మైక విజ్ఞానమునకు (ముఖ్య) ఉపాదానకారణమగు మనస్సు (అంతఃకరణము)ను విషయ సమూహమునుండి దోషదృష్టిచే మళ్ళించి, స్వలక్ష్యమగు బ్రహ్మమందు స్థిరపరచ వలయును. దీనినే "శమ" మందురు.

అథవా మనస్సును అనగా అంతఃకరణమును శబ్దాది విషయములనుండి బలాత్కారముగ నిగ్రహించుటయే "శమ" మనినచో శ్రవణాది విషయములనుండి గూడ మనోనిగ్రహము ప్రాప్తించుటచే, నిగ్రహమునకు జ్ఞానానుకూలత్వాऽభావమేర్పడుటచే వైయర్థ్యము ప్రసక్తమగును. కావున – శ్రవణ, మనన, నిధిధ్యాసనలకు వ్యతిరిక్తమగు విషయములనుండి మనస్సును మరలించుట యేది గలదో దానిని "శమ" మందురు (వేదాంత సారము.)

సాధన చతుష్టయ సంపత్తిలో మూడవదగు శమాది షట్క సంపత్తి యందు మొదటిదగు "శమము" తరువాత "దమము" పేర్కొనబడినది. దమమనగా–

**శ్లో॥ విషయేభ్యః పరావర్త్య స్థాపనం స్వస్వగోళకే ।**

**ఉభయేషా మింద్రియాణాం స దమః పరికీర్తితః ॥** (వి.చూ. 23)

**అర్థము :-** జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను తమ తమ విషయములనుండి వెనక్కి మళ్ళించి అనగా శ్రవణాది వ్యతిరిక్త బాహ్య వైషయిక వృత్తులను తిరస్కరించి తమ తమ ఇంద్రియ గోళకములయందు నిలుపుట యేది గలదో, అయ్యది "దమము" అని కీర్తింపబడినది.

ఇంద్రియముయొక్క వ్యుత్పత్తిని వ్యాకరణ (అష్టాధ్యాయి) సూత్రకారులగు శ్రీపాణిని గారు ఇలా సూత్రీకరించారు.

ఇంద్రియమింద్రలింగమింద్రదృష్ట మింద్రసృష్టమింద్ర జుష్టమింద్రదత్తమితి వా (పా.సూ. 5-2-93)

1. ఇంద్రస్య ఆత్మనః లింగం చిహ్నం = "ఇంద్రియమింద్ర లింగమ్"

లింగ్యతే జ్ఞాప్యతే గమ్యతే అనేనేతి లింగమ్ ।

ఇంద్రియముచేత జీవాత్మ తెలియబడును గావున ఇంద్రునికి= ఆత్మకు ఇంద్రియము లింగమైయున్నది. చక్షురాది కరణములచేత ఆత్మ యొక్క అనుమానము చేయబడును.

**అనుమాన ప్రయోగము :-** కరణ వ్యాపారము సకర్తృకము, కరణ వ్యాపారమున్నందువలన, ఛేదనక్రియయందు అంపము మొదలగు వాటి వ్యాపారమువలె. కరణవ్యాపారముచేత కర్తయొక్క అనుమానగమ్యత్వ సాజాత్యమువలన జ్ఞానక్రియాకరణముగూడ సకర్తృకమైయుండును. ఎందుకు? కరణత్వమున్నందువలన. ఇట్లు చక్షురాది జ్ఞానసాధనములచే ఆత్మయొక్క అనుమానము చేయబడును. గావున "ఇంద్రస్య ఆత్మనః లింగం

ఇంద్రియమ్" అని షష్ఠీ సామర్థ్యముచేత ఇంద్రియముయొక్క వ్యుత్పత్తి చెప్పబడినది.

2. "ఇంద్రియమింద్రదృష్టమ్" (తృతీయా సామర్థ్యముచేత) ఇంద్రేణ జీవాత్మనా దృష్టమ్ ఆత్మత్వేనాభిమతమ్ కాణోఽహమ్, బధిరోఽహ మిత్యాద్యభిమతమ్. ఇంద్రుడు అనగా జీవాత్మ నేను మెల్లవాడిని, నేను చెవిటివాడిని అని ఇంద్రియధర్మములను తనయందు అధ్యాసముచేత యభిమానించుచున్నాడు. ఆరోపించుకుంటున్నాడు.

3. "ఇంద్రియమింద్రసృష్టమ్" ఇంద్రేణ ఈశ్వరేణ సృష్టమ్ ।

"ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ" (ముం. ఉ. 2-1-3) ఇంద్రుడు అనగా ఈశ్వరుడు. అతనిచే సృష్టింపబడినందున "ఇంద్రియమింద్రసృష్టమ్".

4. "ఇంద్రియమింద్రజుష్టమ్". ఇంద్రేణ జీవాత్మనా జుష్టమ్ సేవితమ్, తద్ద్వారా విజ్ఞానోత్పాదనాత్। చక్షురాదీంద్రియముల ద్వారా జీవాత్మ రూపాద్యుపలబ్ధిని(జ్ఞానమును) పొందుచున్నాడు.

5. "ఇంద్రియమింద్రదత్తమ్" ఇంద్రునిచే = ఈశ్వరునిచే ఇంద్రియములకు స్వస్వ కార్యములయందు ప్రవృత్తములగుటకొఱకు ఐశ్వర్యము ఇవ్వబడినది. అందుకే అవి జీవులను స్వస్వ విషయములందు బలాత్కారముగ ప్రవర్తింప జేయుచున్నవి.

6 అథవా "ఇంద్రేణ జీవాత్మనా దుర్జయ మింద్రియమ్ (సి.కౌ)

జీవులచేత ఇంద్రియములు దుఃఖముచేత (కష్టముచేత), పురుష ప్రయత్నముచేత ఒకానొక ధీరపురుషునిచేత మాత్రమే జయించ బడుచున్నవి. గావున ఇంద్రియములు దుర్జయములైయున్నవి. ఎందుకనగా?

శ్లో॥ పరాంచిఖాని వ్యతృణత్స్వయంభూ-
స్తస్మాత్పరా న్పశ్యతి నాన్తరాత్మన్ ।
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్ష-
దావృత్త చక్షురమృతత్వమిచ్ఛన్ ॥ (క.ఠ. ఉ. 2-1-1)

**అర్థము** :- స్వయంభూ (పరమాత్మ) ఇంద్రియములను బాహ్యములగు శబ్దాదివిషయములను ప్రకాశింపజేయుట కొఱకే బహిర్ముఖముగ ప్రవృత్తములగునట్లు సృష్టించాడు. కావున జీవుడు స్వాభావికముగ బాహ్య విషయములనే చూస్తున్నాడు. కాని అంతరాత్మను (తనను తాను) తెలిసికొనుట లేదు. కాని అమృతత్వము (మోక్షము) ను గోరు ఒకానొక ధీరపురుషుడు ఇంద్రియములయొక్క స్వాభావిక ప్రవృత్తిని (నదీప్రవాహమును ప్రయత్నముచే విపరీత దిశకు మరల్చునట్లు) అరికట్టి ప్రత్యగాత్మను దర్శించుకొనగలుగుచున్నాడు.

ధీరుడెవరనగా? కాళిదాసకవి కుమారసంభవములో (1-52) ఈ క్రింది విధముగా నిర్వచించారు.

శ్లో॥ వికారహేతౌ సతి విక్రియన్తే
యేషాం న చేతాంసి త ఏవ ధీరాః ॥

**అర్థము** :- మనస్సును వికారమును పొందించు శబ్దాది విషయములు ఎదురుగ ఉన్నా, వాటిని యనుభవించ గలుగు యోగ్యత ఉన్నా, యెవరు మనస్సును వికృతముగాకుండా నిగ్రహించగలుగుదురో వారే ధీరపురుషులు.

ఇంద్రియములయొక్క దౌష్ట్యమును గూర్చి శ్రీగీతాచార్యులు గూడ స్పష్టముగా తెలిపి యున్నారు.

**శ్లో॥ యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః ।**
**ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥** (గీత. 2-60)

**అర్థము :-** ఓ కుంతీనందన! పునః పునః విషయదోష దర్శనాత్మక ప్రయత్నము చేయుచున్న యత్యంత వివేకి పురుషునియొక్క నిర్వికార మనస్సును గూడ ఈ దుష్ట (అనర్థకారకములగు) యింద్రియములు బలాత్కారముగ వికృతము చేయుచున్నవి. వివేకమును భ్రష్టమొనర్చుచున్నవి.

**శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి ॥** (గీత. 2-67)

**అర్థము :-** ఇంద్రియములు తమ తమ విషయముల వైపు సంచరిస్తూండగా, యే మనస్సు వాటి వెనుకనే తిరుగుతూ అనుసరిస్తుందో, అది - గాలి నీటిలోని నావను వలె - వీని ప్రజ్ఞను హరించివైచును.

**శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥** (గీత. 2-68)

**అర్థము :-** ఓ మహాబాహో (అర్జునా!) అందువలన, యెవని యొక్క ఇంద్రియాలు వాటి విషయాలనుండి అన్ని విధముల (మనస్సుతో సహితముగా) నిగ్రహింపబడినవో, వానియొక్క ప్రజ్ఞ స్థిరముగా నిలిచియుండును. శ్లోకములోని "తస్య" శబ్దము సిద్ధ మరియు సాధక పరామర్శకమని తెలియాలి. ఎందుకనగా! స్థితప్రజ్ఞునికి లక్షణముగాను, ముముక్షువునకు సాధనముగాను ఉపసంహరింపవలసి యున్నందున.

ఇంద్రియనిగ్రహము లేనిదే బ్రహ్మాత్మైకత్వ నిశ్చయము కాదు. గావున బంధనివృత్త్యసంభవమగును. తదర్థము ముముక్షువగువాడు శ్రవణ, మనన,

నిధిధ్యాసములకు వ్యతిరిక్తమగు శబ్దాది విషయములనుండి దోషదర్శన పూర్వక పురుషప్రయత్నముచే దుష్టాశ్వములు రథమును గర్తములో పడదోయునట్లు, సంసారకూపములో జీవుణ్ణి బలాత్కారముగా పడదోయు దుష్టమగు యింద్రియములను నిరోధించి ఆత్మోన్ముఖముజేసి జీవితమును ధన్యము జేసుకోవలెనని, సకలజీవుల శ్రేయోభిలాషియు, కరుణా హృదయుడును, పరమభాగవతోత్తముడగు శ్రీతుకోబారాయ్ తన యభంగ వాణిచే ఈ క్రిందివిధముగా (గోప - గోపికలతో క్రీడిస్తున్న కన్నయ్య వారందటికి సందేశాన్ని అందిస్తున్న సన్నివేశాన్ని చిత్రీకరిస్తూ) జనులకుపదేశిస్తున్నాడు.

**60.** అభంగము :-

కాం రే గమావిల్యా గాఈ । ఆలీ వళతీ తుఝీ జాఈ ।
మాగేం ఝాలేం కాఈ । ఎకా తేం కాం నేణసీ ॥ 1॥

కేలాసీ ఫజీత । మాగేం పుఢే హి బహుత ।
లాజ నాహీ నిత్య । నిత్య దండ పావతాం ॥2॥

వోలా ఖోడా ఖిళ గాఢీ । ఐసా కోణ తయా కాఢీ ।
ధాంవలే కాపడీ । తుఝీ ఆధీ ఓఢాళ ॥3॥

చాలేం చాలధావేం । మీహి యేతో తుజ సవేం ।
తుకా హ్మణే జంవ । తెథేం నాహీం పావలీ ॥4॥ (3718)

ప్ర.ప :- కాం రే = ఏమిరా (గోపాలా!); గాఈ = (ఇంద్రియరూప) ఆవులను; గమావిల్యా = విచ్చల విడిగా వదిలేసారు?; వళతీ ఆలీ = (వాటిని) నిరోధించే సదవకాశము వచ్చిననూ, తురుఝు = నీయొక్క ఆయువు; జాఈ = (వృథాగా) పోవుచున్నది; మాగేం = పూర్వము; ఎకా = యెవరికి;

కాఈ = ఎట్లు (ఏమి), ఝాలే = జరిగినదో, తే = అది (నీవు) నేణసీ = ఎఱుగవా, కాం = ఏమి?॥1॥ మాగేఁ పుఢేహి = వెనుక ముందు గూడ (నీయొక్క); ఫజిత = అవమానము; బహుత = చాలగా; కేలాసీ = చేసుకున్నావు; నిత్య = ప్రతినిత్యము; (అవమానము జరుగుచునే యున్నను) నిత్య = ఎల్లప్పుడు; దండ = జన్మ మరణరూప శిక్షను; పావతాం = పొందుతున్ననూ; (నీకు) లాజ నాహీఁ = సిగ్గులేదు. 2. వోలా = (నీ శరీరమును పరులకు) కుదువ (పెట్ట వలసి వచ్చును) ; గాఢీ = దృఢమైన; ఖిళ = గొలుసులచే బంధించి; ఖోడా = చెరసాలలో (నరకములో) పడవైచెదరు; ఐసా = ఇటువంటి పరిస్థితులో (నిన్ను); తయా = ఆ నరకదుఃఖమునుండి; కోణ = ఏ సమర్థుడు; కాఢీ = విడిపించగలడు?; తుఝీ = నీయొక్క; ఓఢాళ = బలాత్కారముగా ఈడ్చుకు వెళ్ళు స్వభావముగల (రసనేంద్రియము); కాపడీ = విషయారణ్యభూమిలో సంచరిస్తూ; ధాంవలే= పరుగులు తీస్తున్నది; ఆధీ = ప్రప్రథమము (దానిని నిరోధించు)3. చాలేఁ= వెళ్ళు; చాల దావేఁ = తొందరగా వెళ్ళుము ; = (ఆ ఆవు వెంట) పరుగెత్తుము; తుజ సవేఁ = నీకు తోడుగా; మీహీ = నేను గూడ; యేతో = వచ్చెదనో; తుకామ్హణే = శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు; జంవ = ఎంతవరకు (ఇంద్రియము లనబడు గోవులు విశ్రాంతిని) పావలీ నాహీఁ = పొందజాలవో, తెథే = అంతవరకు (వాటిని వాటి వాటి విషయముల నుండి మరలించుచునే యుండవలెను). 4.

తా॥ కన్నయ్య ఇలా అంటున్నాడు. ఏమిరా గోపాలా? నీవు ఇంద్రియ రూప గోవు(ల)ను పోగొట్టుకొని కూర్చున్నావు. విషయ భూముల యందు వాటిని విచ్చలవిడిగా ఎందుకు వదిలావు? ఈ మనుష్య దేహము ప్రాప్తించినప్పుడే ఇంద్రియరూపగోవులను అదుపులో బెట్టుకొనే

నదవకాశము అదృష్టవశాత్తు లభించగా, నీవు వృథాకాలక్షేపము చేయుచున్నావు. ఇంద్రియము (గోవు)లను విచ్చల విడిగా విషయముల వైపు వదిలిన వారికి ఎటువంటి యవమానము జరిగినదో, నీకు తెలియదా యేమి? ఇంద్రునికి అహల్యమూలముగ శరీరమంతా యోనులు ప్రాప్తించినవి. నారదుడు హరిభజన జేయుటయే విస్మరించాడు. ఇటువంటి చరిత్రలు నీకు తెలియవా? 1. నీకు గూడ వెనుకనో, ముందుగనో అనేక అవమానములు జరిగినవి, జరుగబోతున్నవి వర్తమానములో గూడ నీ ఫజీతి = అవమానము అవుతూనే వుంది. ఇక జన్మమరణరూప అబాధ్య శిక్షను అనాదిగ యనుభవించుచునేయున్నావు. అయినా గూడ నీకు యెందుకు సిగ్గుగా అనిపించుటలేదు? 2. అరే గోపాలా! ఒకవేళ నీవు ఇంద్రియరూప గోవులను వాటి వాటి విషయములనుండి నిరోధింపకున్నచో, నీ దేహమును ఒకానొకరి యింటిలో ప్రతినిత్యము చాకిరి చేయుటకు కుదువ పెట్ట వలసి వచ్చును. లోకములో ఏవిధముగా దొంగతనము చేసిన వానిని రాజభటులు తీసికెళ్ళి బంధిఖాన (చెఱసాల) లో బంధించి, కాళ్ళు చేతులకు దృఢమైన గొలుసులు (ఇనుపసంకెళ్ళు) వేసి నానా చిత్రహింసలు పెట్టుదురో, అట్లే నీవు యింద్రియముల ద్వారా పాపము చేసినచో, మరణానంతరము నిన్ను యమదూతలు నరకమునకు తీసికెళ్ళి పలువిధములుగ హింసిస్తున్నపుడు, నిన్ను ఆ నరకయాతనలనుండి తప్పించు శూరుడెవడు? ఒరే గోపాలుడా! బలాత్కారముగ ఈడ్చుకెళ్లు స్వభావముగల రసనేంద్రియరూప ఆవు రసరూప విషయారణ్యమునందు నిరంతరము చరిస్తూంది. దానిని ప్రప్రథమముగ నరికట్టుము. 3. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు - వెళ్ళు, తొందరగా వెళ్ళుము. ఆ గోవును వెంబడించి పరుగెత్తుము. నేను గూడ నీకు సహాయము చేస్తూ నీతోడునీడగా

వస్తాను. ఎంతవరకు సమస్త యింద్రియములు నాస్వరూపమునందు సంపూర్ణముగా విశ్రాంతిని పొందకుండునో, అంతవరకు వాటిని దోషదర్శన పూర్వకముగా పురుషప్రయత్నముతో విషయములనుండి నిరోధిస్తూనే ఉండాలి. 4.

విశేషము :- గో అనగా ఆవు లేదా ఎద్దు అని అర్థము. పాత్రతనెఱింగి దానము చేయుటచే స్వర్గగమనమునకు సాధనమగుచున్నందున ఆవును గాని ఎద్దును గాని గౌః అంటారు. లేదా యానసాధనమైయున్నందున ఎద్దుకు గౌః అంటారు.

గమ్యతే విషయజ్ఞానం యయా = దేనిచే విషయజ్ఞానము కలుగు చున్నదో అది (విషయజ్ఞాన సాధనముగాయున్నందున) గో అనగా ఇంద్రియము (చక్షురాదులు) అని గూడ తెలియవలెను.

శ్రీతుకారాం మహారాజుగారు అభంగములోని మొదటి చరణములో "కాం రే గమావిల్యా గాఈ" ఏమిరా గోపాలా! ఆవులను (గాఈ) విషయ భూములను పచ్చిక బయళ్లలో విచ్చలవిడిగా వదిలారు - అంటూ ఇంద్రియములకు (ఆఈ) "గో"శబ్దమును ప్రయోగించారు. దీనికి రెండు హేతువులున్నాయి.

1. పైన తెలిసికొన్న విధంగా సాధనత్వ (కరణత్వ) అవిశేషము వలన, మరియు

2. ప్రవృత్తివిశేషము వలన. గోవులను వదలినచో పచ్చికభూములలోకి పరుగులు తీస్తాయి. ఇంద్రియ నిగ్రహము లేనిచో విషయభూములపై పరుగులు తీస్తాయి. గావున గోవులకు మరియు ఇంద్రియములకు ప్రవృత్తివిశేషము గలదు.

పై రెండు సామ్యములచే శ్రీ తుకారాం మహారాజుగారు ఇంద్రియములకు లాక్షణికార్థములో "గో" శబ్దమును ప్రయోగించారు.

శ్రీతుకోబారాయ్ అంటున్నాడు - గోపాలా! ఇంద్రియములను అరికట్టి జన్మను ధన్యము జేసుకునే సదవకాశము అదృష్టవశాత్తు ఈ మానవజన్మలో సంప్రాప్తించగా, ఇంద్రియములను శబ్దాది విషయ భూములందు స్వేచ్ఛగా వదిలి ఆయువును వృథా (వ్యర్థము) జేసికొను చున్నావు. ఆయువు యొక్క విలువ తెలిసికొని సద్వినియోగము జేసికొనుము.

**శ్లో॥ ఆయుషః క్షణ ఏకోఽపి సర్వ రత్నైర్న లభ్యతే ।**
**నీయతే తద్వృథా యేన ప్రమాదః సుమహానహో ॥**

(శ్రీ యోగవాసిష్ఠము ని.ప). ఉత్తరార్థము 175-78)

అర్థము :- ఒక్క క్షణమైనను ఆయువు వ్యర్థముగ గడుపబడినచో మరల అది సమస్త రత్నములచే గూడ లభింప నేరదు. కావున, ఆత్మ విచారములేక ఆయువును వ్యర్థముగ గడుపుట మహా ప్రమాదమై యున్నది.

**శ్లో॥ న బాల్యం యౌవనే లభ్యః యౌవనం స్థావిరే తథా ।**
**మృతః పితా పునర్నాస్తి నాయాత్యేవ గతం దినమ్ ॥**

(వేరం. 13-97)

**అర్థము** :- యౌవనమున బాల్యముండదు. వృద్ధాప్యమున యౌవనముండదు. చనిపోయిన తండ్రి తిరిగి రాదు. గతించిన దినము మరల రాదు.

కావున, ఆయువును వృథా చేయక ఇంద్రియములనరికట్టి ఆత్మోన్ముఖము చేయవలెను. లేనిచో మహాప్రమాదము సంభవించును. శ్రీతుకారాం మహారాజుగారు సాధకులకు హెచ్చరిక చేస్తూ - ఏమిరా

గోపాలా! పూర్వము ఇంద్రియములను స్వాధీన పఱచుకొననివారికి యెటువంటి యవమానము (ఫజీతి) జరిగినదో నీకు తెలియదా? అంటూ (కృష్ణుడు) బోధిస్తున్నాడు.

1. దశరథమహారాజు శ్రవణేంద్రియమునకు వివశుడై శ్రవణ బాలుని హతమార్చినందుచే నతని తల్లిదండ్రులు పుత్ర వియోగమును భరించలేక దుఃఖితులై, మావలెనే నీవు గూడ పుత్ర వియోగ దుఃఖముతో మరణించెదవుగాక! అని శపించిరి. దానిచే దశరథుడు శ్రీరాముడు వనవాసము వెళ్ళిన పిదప హా రామ! హా రామ! అంటూ పుత్రవియోగ దుఃఖమును సహించలేక తుదకు తుదముట్టిన రామాయణ గాథ నీకు తెలియదా?

2. విరాటరాజకొలువులో సైరంధ్రిగా వ్యవహరింపబడుచున్న ద్రౌపది మూలమున స్పర్శేంద్రియమును జయించలేని కీచకుడు భీముని చేతిలో నిర్జింపబడిన భారత ఘట్టము నీకు తెలియదా?

3. చక్షురింద్రియమునకు విషయమగు రూపమునకు వివశుడై జానకీదేవి యొక్క రూపలావణ్యమునకు ముగ్ధుడైన రావణాసురుడు శ్రీరామ చంద్రునిచే పరిమార్చబడిన (చంపబడిన) ఇతిహాసమును విస్మరించితివా?

4. రసనేంద్రియమునకు లోబడిన శుక్రాచార్యునకు దైత్యులచే చంపబడి, భస్మముగావింపబడి, మదిరలోగలుపబడి, తనచేత (శుక్రాచార్యునిచేత) ద్రావింపబడి, తన యుదరములోనే యుండిన బృహస్పతి కుమారుడగు కచునకు గత్యంతరము లేక సంజీవని విద్యను నేర్పవలసి వచ్చెనను ఉదంతము నీకు తెలియదా?

5. పారిజాతపుష్ప సౌరభముచే ముగ్ధురాలైన ద్రౌపదిదేవి యొక్క

ముచ్చట దీర్చుట కొఱకు, ఆ పుష్పమును గొని వచ్చుటకు బయలు దేరిన భీమసేనునికి మార్గమధ్యములో శ్రీ ఆంజనేయునిచే పరాభవము జరిగిన సంగతి నీకు తెలియదా?

6. ఇంద్రునికి అహల్య మూలముగ శరీరమందంతటా యోనులు ప్రాప్తించినవి.

7. నారద మహర్షి ఇంద్రియలోలుడై భగవద్భజనయే విస్మరించాడు. ఇటువంటి చరిత్రలు నీకు తెలియవా? పైన పేర్కొనబడిన వారందరు సామాన్యులు కారు కదా! అలాంటి వారే ఇంద్రియములను అదుపులో పెట్టు కొననందున (వాటికి వశీభూతులైనందున) పరాభూతులైరి (అవమానింపబడిరి). చివరికి కొందరు మృతి నొందిరి. కావున యింద్రియములనరికట్టనిచో వాటిచే పాపము ఘటిల్లును. దానిచే నరకము ప్రాప్తించును. అప్పుడు ఆ నరక యాతనలనుండి నిన్ను రక్షించు శూరుడెవ్వడు? కావున యింద్రియములను గోవులను పురుషప్రయత్నముచే దోషదర్శన పూర్వకముగా విషయారణ్య భూములనుండి విముఖము గావించి ఆత్మోన్ముఖము జేసి ధన్యులు గావలెనని శ్రీతుకారాం మహారాజుగారు లోకులనుద్దేశించి యుపదేశించుచున్నారు. శ్రీతుకోబారాయ్ ప్రథమముగా రసనేంద్రియము నరికట్టమని యాదేశిస్తున్నారు. ఎందుకనగా రసనేంద్రియము ఇంద్రియములన్నింటిలో ప్రబలమైనది. జిహ్వేంద్రియమును జయించనిచో, ఉపస్థేంద్రియము జయించబడదు. ఈరెంటిని అరికట్టలేనిచో పరమార్థ సాధనలో పథభ్రష్టుడు కాగలడు.

ఇంద్రియలోలుడైనచో యితరులకు బానిసయై పడియుండి దైన్యజీవనమును గడుపవలసి వస్తుంది. దేహమును కుదువ పెట్టవలసి

వస్తుంది. అందువలన యింద్రియములు స్వాధీనమగువరకు పురుషప్రయత్నమును వీడరాదు. దానికి భగవంతుడు గూడ తోడు కాగలడని శ్రీతుకోబారాయ్ అభంగములోని చివరి చరణములో చెప్పుచున్నాడు.

శమాదిషట్కసంపత్తిలో క్రమప్రాప్తము మూడవది "ఉపరతి" నిగ్రహింపబడిన (శ్రోత్రాది)బాహ్యేంద్రియములను మరల శ్రవణాది వ్యతిరిక్త శబ్దాది విషయముల వైపు వెళ్ళకుండునట్లు చేయుట "ఉపరతి" యనబడును. జన, వాహనాదులచే సంకులమగు రాజమార్గముపై చేరిన శిశువును అక్కడ నుండి తరలించి ఇంటిలోకి లాక్కెళ్ళడమునకు మరియు ఆ శిశువును ఇంటినుండి బయటకు (రాజమార్గముపైకి) మళ్ళీ రానివ్వకుండుట యందు ఎట్లు భేదము గలదో, అట్లే దమమునకు మరియు ఉపరతికి భేదము గలదు. ఇంద్రియములకు మరియు విషయములకు యే స్వాభావికముగా నభ్యాసవశమున ప్రాప్తించిన సంబంధము గలదో దానిని సమాప్తము చేయుట లేదా విఫలము చేయుట "దమము" యనబడును. మరియు విషయేంద్రియ సంపర్కమునే నిరోధించుట "ఉపరతి" యనబడును.

శ్లో॥ బాహ్యానాలంబనం వృత్తేరేషోపరతిరుత్తమా ॥ (వి.భూ. 24)

అంతఃకరణవృత్తి బాహ్యప్రపంచము నాధారముగ జేసికొనక యుండుట, అనగా అంతఃకరణము బహిర్ముఖము గాక యుండుట యుపరతియని చెప్పబడును. ఇదియే యంతర్దృష్టి.

ఉపరతియొక్క లక్షణము (స్వరూపము)ను వేదాంతసాధ్య బ్రహ్మసాక్షాత్కారమునకత్యంతావశ్యముగా నెంచి శ్రీ ఆద్య జగద్గురు శంకరాచార్యులవారు మరొక విధముగా నిర్వచించిరి.

శ్లో॥ సాధనత్వేన దృష్టానాం సర్వేషామపి కర్మణామ్ ।
విధినా యః పరిత్యాగః స సంన్యాసః సతాం మతః ॥

ఉపరమయతి కర్మాణీత్యుపరతి శబ్దేన కథ్యతే న్యాసః ।
(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము. 151-152)

అర్థము :- సాధనరూపముచే దృష్టమగు సమస్త నిత్య-నైమిత్తిక కర్మలయొక్క విధిపూర్వక పరిత్యాగమే సంన్యాసమని - సత్పురుషులయొక్క సమ్మతము. "ఉపరమయతి కర్మాణి ఇత్యుపరతిః" యేది సమస్త కర్మల నుండి ఉపరమణము (నివృత్తి, విరక్తిని)ను గలిగించునో అది "ఉపరతి" యను వ్యుత్పత్తిచే ఉపరతి శబ్దమునకు సంన్యాసమని చెప్పబడుచున్నది. ఇక్కడ శ్లోకములో "సర్వేషాం" అని చెప్పబడినందున శ్రుతి స్మృత్యుదిత విహిత - ప్రతిషిద్ధములగు సమస్త కర్మల పరిత్యాగమును గ్రహించనగును. ఉపరతి యొక్క పరినిష్ఠిత లక్షణాంతరము -

"విహితానాం కర్మణాం విధినా పరిత్యాగః = ఉపరతిః.

విహితానాం అనగా అవశ్య కర్తవ్యముగా విధానము చేయబడిన సంధ్యావందనాగ్నిహోత్రాది నిత్య కర్మలను, విధినా అనగా చతుర్థాశ్రమ స్వీకారముచే పరిత్యాగము (సంన్యాసము) యేదిగలదో దానిని "ఉపరతి"యందురు. కర్తృత్వ భావ పరిత్యాగము "ఉపరతి" యని యర్థము.

శ్రీ ఆద్య జగద్గురు శంకరాచార్యులవారు ఈవిధముగా లక్షణాంతరమునవశ్యమని నిర్వచించుటకనేక శాస్త్రాధారములున్నవి.

"న కర్మణా న ప్రజయా ధనేన, త్యాగేనైకే అమృతత్వ మానశుః" (మహానారాయణ -10) మోక్షార్థులగువారు కర్మచేతగాని, సంతానము చేతగాని, లేదా ధనముచేతగాని గాకుండా, కేవలము త్యాగము

(సర్వసంన్యాసము) చేతనే అమృతత్త్వము (మోక్షము)ను పొందిరి.

"పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి" (బృ.ఉ. 3-5-1) మోక్షార్థియగు వాడు పుత్ర కామనా, ధనకామనా - మరియు పదవి ప్రతిష్ఠాదుల కామనలనుండి ముక్తుడై (వదిలేసి) భిక్షువు (సంన్యాసి) ఆచరణను (వృత్తిని) స్వీకరిస్తున్నాడు.

"నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసేనాధిగచ్ఛతి" (గీ. 18-49) మోక్షకామి యగువాడు సంన్యాసము చేత నైష్కర్మ్యము (నిష్కర్మము = బ్రహ్మము, తద్విషయకవిచారజన్య జ్ఞానము నైష్కర్మ్యము). ఆ నైష్కర్మ్యరూప (బ్రహ్మసాక్షాత్కారరూప) పరమ సిద్ధిని పొందుతాడు.

మోక్షమునకు సంన్యాసమావశ్యకమను విషయము న్యాయము (యుక్తి) చేత గూడ సిద్ధమగుచున్నది. ఎట్లనగా? పురుషుని యొక్క ఉద్దేశ్య సిద్ధియందు యేది ఉపయోగమో దానిని గ్రహించాలి. యేది బాధకమో దానిని త్యజించాలి. వేదాంత విచారము తద్వారా మోక్షము మోక్షార్థియొక్క ఉద్దేశ్యమైయున్నది. దానికి కర్మలయొక్క ఉపయోగమేమియును లేదు. కర్మ నిరపేక్ష వేదాంతవిచారముచేతనే మోక్షము సిద్ధించుచున్నది. మోక్షము కర్మసాధ్యము (ఫలము) గాదు. కర్మ (విధి)కు చతుర్విధ ఫలములు గలవు.

శ్లో॥ ఉత్పత్తిరాప్తిః సంస్కారో వికారశ్చ విధేః ఫలమ్ ।
ముక్తిర్విలక్షణైతేభ్యస్తేనేహానర్థకో విధిః ॥
(బృ.సంబంధ భాష్యవార్తికమ్ 236)

అర్థము :- విధికి (కర్మకు) ఉత్పత్తి, ప్రాప్తి, సంస్కారము మరియు వికారము అని నాలుగు విధముల ఫలములు గలవు. మోక్షము వీటన్నిటికంటె విలక్షణముగానున్నందున, జ్ఞానమునందు విధి

నిరర్థకమైయున్నది. 1. కులాలుని(కుమ్మరివాని)క్రియకు ఫలరూపముగా ఘటము (కుండ) ఉత్పన్నమగును. 2. గమనరూప క్రియా ఫలముగా వాంఛితదేశ (గ్రామ)ప్రాప్తి యగును. 3. సంస్కారము రెండువిధములు :- దోషాపనయనరూపము మొదటిది. గుణాధానరూపము రెండవది. ఉదా:- వస్త్రప్రక్షాళనరూప క్రియ యొక్క ఫలము మల నివృత్తి - ఇది మొదటిది. మరియు కుసుంభ (ఎఱుపు) రంగులో వస్త్రమజ్జనము (ముంచుట) యను క్రియాఫలము వస్త్రము రక్తవర్ణ విశిష్టమగుట - గుణాధానమను రెండవది 4. బియ్యము యొక్క విక్లిత్తి (వండుట) అను క్రియాఫలము బియ్యము అన్నముగా వికారమును పొందుట. మోక్షము పైక్రియాఫలములన్నిటికంటె విలక్షణముగాయున్నది. 1. మోక్షము అనాదిగా యున్నందున ఉత్పన్నము కాదు. 2. నిత్యప్రాప్తమైయున్నందున ప్రాపణీయము గాదు. 3. నిర్గుణముగా యున్నందున సంస్కార్యము గాదు. 4. అకార్యము మరియు అపరిణామియై యున్నందున మోక్షము వికారము నొందునదియును గాదు. కావున మోక్షము కర్మ సాధ్యము (ఫలము)గాదు. వేదాంతవిచారముచేతనే (జ్ఞానము ద్వారా) మోక్షము సిద్ధించుచున్నది.

ఈవిధముగా శ్రుతి, స్మృతి మరియు న్యాయము (యుక్తి)చేత సర్వ కర్మసంన్యాసము ఆత్మజ్ఞానమున కత్యంతావశ్యకమని సిద్ధించు చున్నందున, విద్యాధికారికి (వేదాంత జ్ఞానాధికారికి) వలసిన సాధనములలో సంన్యాసము సమావేశమగుచున్నందున శ్రీ ఆద్య శంకరులు "ఉపరతి" శబ్దమునకు సంన్యాసము యని యర్థము చెప్పిరి.

1. నిగ్రహింపబడిన శ్రోత్రాదిబాహ్యేంద్రియములను శ్రవణాది వ్యతిరిక్త శబ్దాది విషయములవైపు మరల వెళ్ళకుండునట్లు చేయుట యను "ఉపరతి"యొక్క మొదటి లక్షణము యేది చెప్పబడినదో దానికి

శ్రీతుకోబారాయ్ యొక్క జీవిత సత్యమే నిర్వచనము మరియు నిదర్శనము.

ఒకనాడు శ్రీశివాజీమహారాజుగారు శ్రీతుకారాంమహారాజు గార్కి భక్తి ప్రపత్తులతో విలువైన ఆభరణములు, ధనము మొదలగు కానుకలు సమర్పించికొనుటకొఱకు శ్రీతుకారామస్వామిని సగౌరవముగా తీసికు రమ్మని ఛత్రచామరములు, దివిటీలు, గుఱ్ఱములతో సహా తనయొక్క భటులను పంపెను. అపుడు శ్రీతుకారాంమహారాజుగారు ఆ రాజభటులనుద్దేశించి శ్రీ శివాజీ మహారాజుగార్కి తన యభిప్రాయమును ప్రకటిస్తూ పంపిన సందేశమే ఈ క్రింది యభంగవాణి.

**61.** అభంగము

దివట్యా ఛత్రీ ఘోడే । హేం తో బర్యాంత నపడే ఆతాం ॥1॥
యేథేఁ పంఢరిరాయా । మజ గోవిసీ కాసయా ॥2॥
మాన దంభ చేష్టా । హే తో శూకరాచీ విష్టా ॥3॥
తుకా హ్మణే దేవా । మాఝేఁ సోడవణే ధాంవా ॥4॥ (3392).

ముంగీ ఆణి రావ । ఆమ్హాసారిఖచి జీవ ॥1॥
గేలా మోహా ఆణి ఆశా । కళికాళాచా హా ఫాంసా ॥ 2॥
సోనే ఆణి మాతీ । ఆమ్హా సమాన హేఁ చిత్తీం ॥3॥ (3396)

జీవ దేతాం తరీ । వచనా నయే ఎకా సరీ ॥
గోమాంసా సమాన తుకాహ్మణే ఆమ్హా ధన ॥ (3399)

ఏక ధరిలా చిత్తీం । ఆమ్హీ "రఖు మాఈచాపతీ ॥1॥
తేణే ఝాలేఁ అవఘేఁ కామ । నివారలా భవభ్రమ॥2॥

పరద్రవ్య పరనారీ । ఝూలీ విషాచియే పరీ ॥3॥

తుకా హ్మణే ఫార । నాహీం లాగత వ్యవహార ॥4॥ (1484)

(శ్రీ తుకోబారాయ్ - మొదట పంఢరి భగవానుని యుద్దేశించి ఇలా అన్నాడు.)

ప్ర.ప :- (హే దేవా!) దివట్యా = దివిటీలు; ఛత్రీ = గొడుగులు; ఘోడే = గుఱ్ఱములు; హేంతో = ఈ ఐశ్వర్యములు (నాదృష్టిలో ); బర్యాంత న పడే = హితకారకములు గావు. 1. పంఢరిరాయా = హే పంఢరినాథా; మజ = నాకు; ఆతాం = ఇప్పుడు; యేథే = ఇక్కడ (ఈ మోహ పాశములో); కాసయా? = ఎందుకు?; గోవిసీ = పడద్రోయుచున్నావు? 2. మాన = గౌరవము; దంభచేష్టా = దంభాచారము అథవా ఆత్మశ్లాఘరూపకర్మ; హేతో= యేదిగలదో, అది; శూకరాచీవిష్ఠా = ఊరపందియొక్క మలముతో (సమానము)3. తుకా హ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; దేవా! = ఓదేవా; మాఝేం = నన్ను (ఈ మోహపాశమునుండి) సోడవిణే= విడిపించుటకు (తొందరగా); ధాంవా= పరుగెత్తుకొని (రమ్ము). 4. (3392). (తరువాత శ్రీతుకోబారాయ్ రాజభటులతో అంటున్నాడు.) ఆమ్హా = మాకు; ముంగీ = చీమ; ఆణి = మరియు; రావ = రాజు; సారిఖచి జీవ = సమానమైన ప్రాణులే. 1. (మాకు) మోహ = విషయ వ్యామోహముగాని; ఆణి = మరియు ఆశా = ఆశగాని, గేలే = పోయినవి లేవు, ఎందుకనగా మేము కళికాళాచా = కలికాలము యొక్క హా ఫాంసా = ఈ పాశమునకు (చిక్కుబడు సామాన్య జీవులముగాదు.) 2. సోనేం= బంగారము; ఆణి = మరియు, మాతీ = మట్టి; హేం= ఇవి; ఆమ్హా = మాయొక్క; చిత్తీం = చిత్తమునందు; సమాన = సమానములే. 3. (3396). (మీరు మీఐశ్వర్యమే కాదు) జీవ దేతా తరీ = ప్రాణములు సమర్పించినప్పటికి గూడ; (నాయొక్క)

ఏకా వచనా సరీ నయే = ఒక్క (అభంగములోని) శబ్దమునకు సరి తూగదు; తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; అమ్హా = మాకు; (మీయొక్క); ధన = ధనము, గోమాంసా సమాన = గోమాంసముతో సమానము. (3399) ఆమ్హీ = మేము; చిత్తీం = చిత్తమునందు; ఏక = ఒక్క; రఖుమాఈచా పతీ = పాండురంగ భగవానుని మాత్రము ధరించి యున్నాము. 1. తేణేం = దానిచే; అవఘేకామ = సర్వ కర్తవ్యములు; ఝాలే;= తీరినవి; భవ = సంసార; భ్రమ = భ్రాంతి; నివారలా = నివర్తించినది (లేకుండా పోయింది). 2. (మాకు) పరద్రవ్య = పరులసొమ్ము(ద్రవ్యము); పరనారీ = పరస్త్రీ; విషాచియే పరీ = విషముతో సమానము; ఝాలీ = అయినవి; 3. తుకాహ్మణే = శ్రీతుకారామస్వామి అంటున్నాడు. (మాకు ఇప్పుడు ఇంతకంటె) ఫార = అధికము (ఏమియుగూడ); వ్యవహార = కర్తవ్యము; లాగత నాహీం= అవసరము లేదు. 4. (1484)

తా॥ (శ్రీతుకోబారాయ్ గార్కి శ్రీ శివాజీ మహారాజు భక్తి ప్రపత్తులతో కానుకలు సమర్పించుట కొఱకు శ్రీతుకారాంమహారాజు గారిని సగౌరవముగా తీసికురమ్మని ఛత్ర చామరాదులతో సహా తన భటులను పంపినపుడు శ్రీతుకోబారాయ్ మొదట శ్రీపాండురంగ భగవానుని యుద్దేశించి ఇలా అంటున్నాడు.) ఓ దేవా! ఈ దివిటీలు, ఛత్రచామరములు, గుఱ్ఱములు మొదలగు ఐశ్వర్యములు నా దృష్టిలో హితకారములు కావు. 1. ఫండరినాథా! నన్నిపుడు ఈ మోహపాశములో ఎందుకు పడద్రోయుచున్నావు? 2. రాజునుండిగాని, లోకులవైపు నుండిగాని గౌరవింపబడుటగాని, ఆత్మశ్లాఘము (స్తుతి)ను పొందుటవంటి దాంభిక కర్మలు యేవి గలవో, అవి ఊరపందియొక్క మలముతో సమానము. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు ఓ దేవా! నన్ను ఈ ఐశ్వర్య లోభము

మరియు మోహమను పాశమునుండి రక్షించుటకు (విడిపించుట కొఱకు) నీవు అతి త్వరగా పరుగెత్తి రమ్ము. 4. 3392) ఇపుడు శ్రీతుకోబా రాజభటులనుద్దేశించి ఇలా అంటున్నాడు. మాకు చీమగాని, రాజుగాని రెండు ప్రాణులు సమానమే. 1. మాకిపుడు ఎటువంటి విషయమునందుగూడ మోహము గాని ఆశగాని లేదు. ఎందుకనగా? మేము కలికాలముయొక్క మోహ పాశమునకు పట్టుబడునటువంటి సామాన్య జీవులము గాదు. 2. మా చిత్తమునందు బంగారము మరియు మట్టిపెళ్ళ రెండు సమానములే. 3. (3396) మీరు మీ ఐశ్వర్యమునే గాదు మీ ప్రాణములను మాకు సమర్పించినా గాని, మాయొక్క యభంగవాణిలోని ఒక్క శబ్దమునకు గూడ సరిపడవు. మా వాణి అంతపవిత్రమైనది (విలువైనది). శ్రీతుకారాం మహారాజుగారు అంటున్నారు – మీయొక్క ధనము మాకు గోమాంసముతో సమానమని తెలియండి. (3399) మేము రుక్మిణీ పతియగు శ్రీపాండురంగణ్ణి ఒక్కడిని మాత్రమే మా చిత్తమునందు ధరించి యున్నాము. 1. దానిచే మా సర్వకర్తవ్యములు ముగిసినవి. జగత్సత్యత్వ భ్రమ లేకుండా పోయింది. 2. మాకు పరద్రవ్యము, పరస్త్రీ విషముతో సమానము అయినవి. 3. శ్రీ తుకోబాగారంటున్నారు ఇపుడు మాకు ఇంతకంటె కర్తవ్యమేమియును గోచరించుట లేదు. (1484) వైకుంఠవాసియగు, నీలమేఘశ్యాముడగు పరమాత్మయే స్వయముగా మా యింటికొచ్చాడు. అతని దర్శన భాగ్యముచే మేము నిత్యానందము ననుభవించుచుండ మాకు మీ ధనమేల గావలయును? మీ ఐశ్వర్యము మీవద్దనే ఉంచుకొనుడు. మాకు వలదు. అమృతమును గ్రోలుచున్నవాడు క్షుద్రమగు గంజిని కోరుతాడా? పై యభంగవాణిచే శ్రీతుకోబారాయ్ యెంతటి వైరాగ్యోపరతులుగల నైస్పృహ్యా మూర్తియో తెలియబడుచున్నది.

శ్లో॥ ఉదారస్య తృణం విత్తం వీరస్య మరణం తృణమ్ ।
విరక్తస్య తృణం భార్యా నిస్పృహస్య తృణం జగత్ ॥
అర్థము :- సుగమము

ఇప్పుడు శ్రీతుకారాం మాహారాజుగారు "విహితానాం కర్మణాం విధినా పరిత్యాగః" అవశ్యకర్తవ్యములుగా విధానము చేయబడిన సంధ్యా వందనాగ్నిహెూత్ర పంచయజ్ఞాది నిత్యకర్మలను తురీయాశ్రమ స్వీకారముచే పరిత్యజించుట (సంన్యసించుట) యను "ఉపరతి" యొక్క లక్షణాంతరమును తన యభంగవాణిచే తెలియజేయచున్నారు.

అభంగము :-

యజ్ఞనిమిత్త శరీరాసీ బంధన! ।
కాంరే తృష్ణా వాయాంవిణ వాఢవిలీ ॥1॥

నవ్హే తీ భక్తి । పరలోక సాధన ।
విషయాంనీం బంధన కేలేం తుజ ॥2॥

ఆశాధరూని ఫలాచీ ।
తీర్థ వ్రతీం ముక్తి కైంచీ ॥3॥

తుకా హ్మణే శిణసీ వాయాం ।
శరణ న వజతాం పంఢరీరాయా ॥4॥

ప్ర.ప :- యజ్ఞ నిమిత్త = యజ్ఞము (కర్మ) చేయుట వలన; (జీవునకు) శరీరాసీ = శరీర ప్రాప్తి ద్వారా (జన్మ మరణరూప); బంధన = బంధము ప్రాప్తమగును; అందువలన వాయాంవిణ = వ్యర్థముగ; తృష్ణా = విషయవాంఛ (కోరిక); కాంరేవాఢవిలీ = ఎందుకు పెంచు కుంటున్నావురా? 1. భక్తి = హరిభక్తి; పరలోకసాధన = పుణ్యలోకములకు సాధనము; నవ్హే=

కాదు; (మరేమనగా?) తీ = అది (భక్తి = మోక్షమునకు సాధనముగానున్నది) తుజ = నిన్ను; విషయాంనీ = విషయములు; (నిజముగా) బంధన కేలేం= బంధించినవి. 2. ఫలాచీ = ఫలముయొక్క; ఆశా = ఇచ్ఛా; ధరూని = చిత్తములో ధరించి (ఆశ పెట్టుకొని) ; తీర్థీ వ్రతీం= తీర్థములు, వ్రతములు సేవించినచో; (దానిచే) ముక్తి = మోక్షము; కైంచీ - ఎక్కడిది? 3. తుకాహ్మణే= శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; పంఢరీరాయా = శ్రీపంఢరినాథుని; శరణ న వజతా = శరణు వెళ్ళకుండా; (సకామ కర్మలు చేస్తూ) వాయాం = వ్యర్థముగా; శిణసీ = (ఎందుకు) పరిశ్రమించెదవు? 4.

తా॥ పరలోకముయొక్క భోగేచ్ఛచేత యజ్ఞము (కర్మ)ను చేసినచో, దానిచే జీవునికి శరీరప్రాప్తి ద్వారా జన్మమరణరూప బంధము ప్రాప్తించును. అది అనివార్యము. అందువలన భోగాశను ఎందుకు పెంచుకుంటావు? 1. దైవభక్తి మాత్రము పరలోకమునకు సాధనము గాదు. మరేమనగా? ముక్తికి సాధనము. శబ్దాది విషయములు నిన్ను నిజముగా బంధించి వైచినవి. అందుకే నీవు సకామముచే కర్మలు చేయుచున్నావు. 2. ఫలాభిసంధిచే తీర్థములను, వ్రతములను సేవించినచో మోక్షము ఎలా ప్రాప్తించును? 3. శ్రీతుకారామస్వామి అంటున్నాడు. శ్రీపంఢరినాథుని శరణు పొందకుండా సకామముచే విహితకర్మలు చేయుటయందు వ్యర్థముగా యెందుకు పరిశ్రమించుచున్నావు? 4.

**విశేషము :-** స్వర్గాద్యుత్తమలోకములలోని దివ్యభోగముల యందాసక్త చిత్తముగలవాడై సకామముచే విహిత కర్మలనాచరించినచో, జీవునికి శరీరప్రాప్తి ద్వారా జన్మమరణరూపబంధము అనివార్యముగ సంప్రాప్తించును. అందువలన తత్త్వ జిజ్ఞాసువు (వేదాంతాధికారి) సర్వకర్మలను సంన్యసించవలయునని శాస్త్రము నుడువుచున్నది.

శ్లో॥ కర్మణా బధ్యతే జన్తుః విద్యయా చ విముచ్యతే ॥

(సంన్యాసోపనిషత్ 2-117)

సమస్తప్రాణులు కర్మలచే బద్ధులగుచున్నారు. ఆత్మజ్ఞానముచే ముక్తులగుచున్నారు.

శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ॥ (గీత. 18-66)

అర్థము :- సమస్త కర్మలను సంన్యసించి (విడిచి), అద్వితీయాత్మ స్వరూపుడనగు నన్నొక్కడినే శరణు బొందుము.

శ్లో॥ త్యక్తాశేష క్రియస్యైవ సంసారం ప్రజిహాసతః ।
జిజ్ఞాసోరేవ చైకాత్మ్యం త్రయ్యంతేష్వధికారితా ॥

(బృ.సంబంధ భాష్య వార్తికమ్- 12.)

అర్థము :- సమ్యగ్విచారపూర్వకముగా సంసారమును సర్వథా పరిత్యజింపగోరువాడును, బ్రహ్మాత్మైకత్వ జిజ్ఞాసువును, సమస్త కర్మలను పరిత్యజించిన (సంన్యసించిన) వాడు యెవడో, వాడికే వేదాంత విచారమునందధికారము గలదు.

అందువలన, శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - ఒరే నరుడా! నీవు వ్యర్థముగా విషయాశనెందుకు పెంచుకుంటున్నావు? ఎంతగా విషయములననుభవిస్తుంటే అంతకంతకు విషయ తృష్ణ యధికమవుతూనే ఉంటుంది. మరియు బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానమునకు నిత్య శత్రువై ఆవరించి మోక్షమునకు ప్రతిబంధకమగును.

శ్లో॥ న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥ (వి.పు. 4- 10-23)

**అర్థము :-** భోగాశ (విషయ తృష్ణ) భోగములననుభవించు చుండినచో యెప్పుడు గూడ శాంతించదు. కాని, యజ్ఞకుండములో ఘృతాహుతులు (ఆజ్యము)వేస్తూంటే ఎట్లు అగ్ని జ్వాలలు అధికమగుచుండునో, అట్లు అంతకంతకు వృద్ధియగుచుండును.

మరియు పరలోక భోగతృష్ణను పెంచుకుంటున్నట్లయితే గూడ యది యాత్మజ్ఞానమునకు ప్రతిబంధకమగును.

**శ్లో॥ ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।**
**కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ ॥** గీత. 3-39)

**అర్థము :-** హే కుంతీనందన! జ్ఞానవంతునకు నిత్యశత్రువు, తృప్తి పరచుటకు శక్యము గానిది, "ఇంక చాలును"' అనే మాట లేనిది, ఇచ్ఛ (కోరిక) అనే రూపం గలది యయిన ఈ కామం చేత ఆత్మజ్ఞానము కప్పబడినది.

కావున, వివేకయుక్త - దోషదృష్టిపూర్వక బాహ్యేంద్రియ ప్రవృత్త్యభావము ద్వారా తృష్ణాక్షయమును సాధించవలయును.

**శ్లో॥ యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్ ।**
**తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హతః షోడశీం కళామ్ ॥**

(గీతాప్రెస్ - మ.భా. అను.ప. దానధర్మ పర్వము పృష్ఠము 6011)

**అర్థము :-** లోకములో యేదైతే కామసుఖము గలదో మరియు పరలోకములో యే దివ్యమైన గొప్ప సుఖము గలదో, ఈ రెండు కలిసి తృష్ణాక్షయ జనిత సుఖముయొక్క పదహారవకళకు గూడ సరిపడుటకు యోగ్యములు గావు.

అందువలన నో మానవుడా! భోగకామన పెంచుకొని, జన్మమరణరూప బంధమునకు హేతువగు కర్మజాలములో పడబోకుము. మరేమనగా? సర్వకర్మలను పరిత్యజించుము. (సంన్యసించుము) అని శ్రీతుకారాం మహారాజుగారు బోధిస్తున్నారు. 1.

"నవ్హే తీ భక్తి పరలోకసాధన" భక్తి పరలోకసాధనముగాదు, మరేమనగా? మోక్షమునకుపాయమైయున్నది యని రెండవ చరణములో నుడువుచున్నారు.

భక్తిని నిర్వచిస్తూ శ్రీ ఆద్య జగద్గురు శంకరాచార్యులవారు శ్రీవివేక చూడామణిలో ఈక్రిందివిధంగా సెలవిచ్చారు.

శ్లో॥ మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ ।
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే ॥ (వి.చూ. 32)

స్వాత్మతత్త్వానుసంధానం భక్తిరిత్యపరే జగుః । (వి.చూ. 33)

**అర్థము :-** శాస్త్రములలో మోక్షమునకేయే యుపాయములు చెప్పబడినవో వానిలో భక్తియే శ్రేష్ఠమైనది. నిరంతరము స్వస్వరూపమగు పరమాత్మననుసంధించుటయే భక్తియని ఆత్మజ్ఞులచే చెప్పబడుచున్నది. మరికొందరు స్వాత్మ విచారణ దృఢముగా చేయుటయే భక్తి యని చెప్పిరి.

కావున, అవిచారముచే నేర్పడిన మిథ్యాబంధము ఆత్మవిచార జనిత దృఢాపరోక్షజ్ఞానముచే నివర్తింపబడి మోక్షము సిద్ధించునుగాని కర్మలచే గాదు.

శ్లో॥ అమృతత్వస్య నాశోఽస్తి విత్తేనేత్యేవ హి శ్రుతిః ।
బ్రవీతి కర్మణో ముక్తేరహేతుత్వం స్ఫుటం యతః ॥ (వి.చూ. 7)

**అర్థము :-** ధనముచే నమృతత్వము లభించునను యాశయే లేదని బృహదారణ్యకశ్రుతి యెట్లు చెప్పుచున్నదో, అట్లే కర్మవలన గూడ మోక్షము లభించదని యుపనిషద్వాక్యము స్పష్టముగా నొక్కి చెప్పుచున్నదిగదా!

ఒరే నరుడా! వస్తుస్థితి (యథార్థము) ఇలా ఉండగా నీవు సకామముచే కర్మలు చేయుచుండినచో నిన్ను విషయాశ దృఢముగా బంధించినదని తెలియుచున్నది.

**శ్లో॥ అకామస్య క్రియాకాచిద్ దృశ్యతే నేహ కర్హిచిత్ ।**
**యద్యద్ధి కురుతే కించిత్తత్తత్కామస్య చేష్టితమ్ ॥** (మనుస్మృతి: 2-4)

**అర్థము :-** ఈ ప్రపంచములో యే మనుష్యుడు గూడ యిచ్ఛ లేకుండ యే కర్మ గూడ చేయుట కనిపించుట లేదు. మనుష్యుడు యేమేమి కర్మ చేయుచున్నాడో, అది కామము (ఇచ్ఛా) యొక్క చేష్టయేయై యున్నది.

అందువలన, ఇహపరలోకములందలి భోగేచ్ఛను వదిలేసి, శాస్త్ర విహిత సమస్త కర్మలను సంన్యసించి, ఆత్మ విచారము చేయుచుండవలెనని తాత్పర్యము. 2.

సకామముచే తీర్థములను, వ్రతములను సేవించిన మోక్షము ఎలా ప్రాప్తించును? అని మూడవ చరణములో శ్రీతుకోబారాయ్ గారు అంటున్నారు. ఇది శాస్త్ర సమ్మతమునై యున్నది.

**శ్లో॥ ఇదం తీర్థమిదం తీర్థం భ్రమంతి తామసా జనాః ।**
**ఆత్మతీర్థం న జానంతి కథం మోక్షః శ్రుణు ప్రియే ॥**

**అర్థము :-** మహాదేవుడు పార్వతి తో అంటున్నాడు. ఓపార్వతీ! ఇది తీర్థము, అది తీర్థము యని యజ్ఞాని జీవులు భ్రమచే తిరుగు చున్నారు.

కాని, ఆత్మ తీర్థమును యెఱుంగ జాలకున్నారు. వారికి మోక్షము ఎలా ప్రాప్తించును?

శ్లో॥ తీర్థాని తోయపూర్ణాని దేవాన్కాష్ఠాది నిర్మితాన్ ।
యోగినో న ప్రపూజ్యంచే స్వాత్మప్రత్యయకారణాత్ ॥

శ్లో॥ ఆత్మతీర్థం సముత్సృజ్య బహిస్తీర్థాని యో వ్రజేత్ ।
కరస్థం స మహారత్నం త్యక్త్వా కాచం విమార్గతే ॥
(జాబాల దర్శనోపనిషత్ 4-52-50)

అర్థము :- యోగి (బ్రహ్మాత్మైకత్వ విజ్ఞాని) పురుషుడు స్వాత్మ తీర్థమునందే యత్యధిక నిష్ఠ (నైశ్చల్యస్థితి) గలిగి యుండుట చేత జలపూరిత తీర్థములను, కాష్ఠాది నిర్మిత దేవతాప్రతిమలను శరణు బొందదు (సేవించదు). యెవడు శ్రేష్ఠమైన ఆత్మతీర్థమును విడనాడి, బాహ్య తీర్థక్షేత్రములందు పరిభ్రమించునో, నతడు యమూల్యమగు రత్నమును పరిత్యజించి, గాజువక్కను వెతుకు వానివలెనగును. 3.

"పంఢరి" యే దేహము. పంఢరినాథుడే "ఆత్మ". కావున పంఢరి నాథుని (ఆత్మదేవుని) శరణుజెందకుండా సకామముచే కర్మలు చేయుట యందు వ్యర్థముగా యెందుకు పరిశ్రమించుచున్నావు? అని నాలుగవ చరణములో శ్రీతుకారామస్వామి మందలించుచున్నారు. విషయాభిలాషచేత జన్మ మరణరూప సంసారము (బంధము) నకు కారణమగు కర్మలను చేయుట మానేసి ఆత్మ విచారమును చక్కగా జేసి ప్రత్యగభిన్న పరమాత్మ తత్త్వమును యథార్థముగా నెఱింగి పరమపదమగు మోక్షస్థితిరూప పరిపూర్ణ విశ్రాంతిని బడయవలెనని యభిప్రాయము. 4. ఈ ప్రకారముగా "విహితానాం కర్మణాం విధినా పరిత్యాగః- ఉపరతిః" శాస్త్రోక్తమగు నిత్యాది సమస్త కర్మలను చతుర్థాశ్రమ స్వీకారముచే పరిత్యజించుట (సంన్యసించుట)

యేది గలదో దానిని "యుపరతి" యందురని యుపరతియొక్క లక్షణాంతరము చెప్పబడినది.

శమాది షట్కసంపత్తిలో నాలుగవది తితిక్షా. తితిక్షా యనగా -

**శ్లో॥ అధ్యాత్మికాది యద్దుఃఖం ప్రాప్తం ప్రారబ్ధవేగతః ।**
**అచింతయా తత్సహనం తితిక్షేతి నిగద్యతే ॥**
(సర్వ వేదాంతసిద్ధాంత సారసంగ్రహము. 137)

**అర్థము :-** ప్రారబ్ధకర్మ వేగముచే ఆధ్యాత్మిక, ఆదిభౌతిక మరియు ఆధిదైవికములగు దుఃఖములు ప్రాప్తించినప్పుడు, ఏ మాత్రము గూడ చింత (శోకపూర్ణ విచారము) లేకుండా వాటిని సహించుట యేదిగలదో, దానిని "తితిక్షా" యని విచారశీలురు చెప్పుచున్నారు.

**శ్లో॥ సహనం సర్వ దుఃఖానామప్రతీకారపూర్వకమ్ ।**
**చింతా విలాపరహితం సా తితిక్షా నిగద్యతే ॥** (వి.చూ. 25)

**అర్థము :-** "నా కింతటి దుఃఖము ప్రాప్తించెను గదా" యను దుఃఖపూరిత విచారము లేకుండా ప్రతిక్రియరహితమైన సర్వ ప్రాప్తదుఃఖములయొక్క సహనము యేది గలదో, అదియే "తితిక్షా" యని చెప్పబడుచున్నది.

ముముక్షువునకు తితీక్ష తో సమానమగు రక్షణ మరొకటి లేదు. దీనిని వజ్రాయుధము గూడ భిన్నము చేయలేదు. శరీరముపై కవచమును ధరించు వీరపురుషునివలె, ధీర పురుషుడు (ముముక్షువు) సర్వవిఘ్నములను తృణసమానముగ నెంచి దేనిచే మాయను జయించునో నది "తితీక్ష" యనబడును. క్షమా గలవానికే సమాధి సిద్ధించును. మోక్షము కరతలా మలకమగును. లేనిచో ఎట్లు వాయువుయొక్క ఆఘాతముచే (హోరుచే)

వృక్షమునుండి పర్ణసముదాయము రాలి నేలపై పడునో, అట్లు విఘ్నబాధలచే పతితుడగును అనగా యోగ (సాధన)భ్రష్టుడగును. తితీక్ష గలిగియున్నట్లయిన సమస్త దైవిక మరియు భౌతిక విఘ్నములు (ప్రతిబంధకములు) పలాయనము చిత్తగించును. ఇష్టసిద్ధి (మోక్షము) గలుగును. తితీక్షకు తీవ్ర ముముక్షా మరియు విషయముల యందత్యధిక ఉపేక్ష ఈ రెండు సహకారి కారణములగును. "మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ" అను గీతా. 2-14. వచనానుసారము శీతోష్ణములు, మానాపమానములు, లాభాలాభములు మరియు శోక హర్షాది ద్వంద్వ సహిష్ణుత్వము - "తితిక్షా" అని గూడ వేదాంతసారము.

ఉపరోక్త తితీక్ష ముముక్ష కళ్యాణమునకత్యంతోపయుక్తమని శ్రీతుకారాం మహారాజుగారు తన యభంగవాణిచే ఉపదేశించుచున్నారు.

**62. అభంగము :-**

**సాహోని టాంకీ ఘాయే ।**
**పాషాణ దేవచి ఝాలా పాహే ॥1॥**

**తయారీతీ దృఢ మన ।**
**కరీఁ సాధాయా కారణ ॥2॥**

**బాణ శస్త్ర సాహోని గోళీ ।**
**శూరా ఠావ ఉంచ స్థళీఁ ॥3॥**

**తుకా హ్మణే సతీ ।**
**అగ్ని న దేఖ జ్యా రితీఁ ॥4॥** (1965)

ప్ర.ప :- టాంకీ = ఉలియొక్క; ఘాయే = దెబ్బలకు; సాహోని ...ర్చుకొనియే; పాషాణ = శిల; దేవచి - దేవుడే; ఝాలా = అయిన...

పాహే = (బాగుగా) గమనించండి. 1. తయా రీతీ = ఆరీతిగనే; సాధాయా= (మోక్షరూప కార్యమును) సాధించుట; కారణ = కొఱకు; మన = మనస్సును; దృఢ = దృఢ నిశ్చయముగా (చేయుము)2. బాణ= బాణము యొక్క; శస్త్ర= శస్త్రముయొక్క; గోళీ = తుపాకిగుండ్లయొక్క (అఘాతములను) సాహొని = సహించియే; శూరా = శూరుడు (సైనికుడు) ఉంచ = గొప్పనైన; స్థళీc = (సేనాపతి) పదవిని (చేరుటకు); ఠావ = పాత్రుడగును. 3. తుకాహ్మణే = శ్రీతుకోబారాయ్ అంటున్నాడు; సతీ = (సహగమనముచేయు) స్త్రీ; జ్యా రితీc = యే ప్రకారముగc, అగ్ని న దేఖ =అగ్నివైపు చూడనే చూడదో (అట్లు సాధకుడు దుష్టులయొక్క నిందాద్వేషములవైపునకు చూడనే చూడడు)4.

**తా॥** పాషాణము (శిల) ఉలి దెబ్బలకోర్చుకొనియే దేవుడగుచున్నదని బాగుగా గమనించదగినది. శిల్పకారునిచేత ఎన్నో ఉలిదెబ్బలను సహించి యే పాషాణము సురక్షితముగా (భిన్నముగాకుండా) యుండగలుగునో, నది సర్వలోకులచే పూజింపబడును. సకల జనులు దాని పాదములకు నిత్యము మ్రొక్కెదరు. 1. అట్లే సాధకుడు మోక్షరూప కార్యమును సాధించుటకు మనస్సులో దృఢనిశ్చయము చేసుకొని, శీతోష్ణాది ద్వంద్వములను సహించుకుంటూ, ప్రారబ్ధవేగముచే ప్రాప్త సర్వ దుఃఖములను యెదుర్కొని సమస్త విఘ్నములనుండి ధైర్యముతో తప్పించుకొని, తన పరమార్థ సాధన (మార్గము) నుండి వైదొలగక, లక్ష్యమును సాధించినచో నతడు త్రైలోక్యపూజ్యుడగును. స్వయముగా నుత్తీర్ణుడై, మరెందఱినో ఉత్తీర్ణులను జేయును. 2. బాణములయొక్క, శస్త్రములయొక్క మరియు తుపాకిగుండ్ల యొక్క అఘాతములను సహించియే ఒక సామాన్య సైనికుడు, గొప్ప సేనాపతి పదవిని చేరుకొనుటకర్హుడగును. 3.

శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు యేవిధముగా పతివ్రతాస్త్రీ, తన పతిదేవుడు మరణించినచో తనపతిదేహముతోపాటు చితి మంటలను లెక్కచేయకుండా చితిలో దూకి సహగమనము చేయునో, అట్లే, సాధకుడు మోక్షరూప కార్యమును సాధించుట కొఱకు దుష్టులయొక్క నిందాద్వేషరూప ఆఘాతములను నిర్వికారవృత్తితో సహించవలెను. 4.

గమనిక :- పై యభంగములోని అంతిమ చరణముచే, మరియు గాథలోని మరికొన్ని యభంగ చరణములచే, శ్రీతుకోబారాయ్ జీవించియున్నకాలములో బాల్యవివాహము, కన్యాశుల్కము, సతీసహగమనము మొదలగు దురాచారములు ప్రచలితమై యుండెనని తెలియబడుచున్నవి.

ఇప్పుడు "సమాధానము" అనగానేమిటో చూచెదము. పరబ్రహ్మరూపలక్ష్య మాత్రమునందు చిత్తముయొక్క పరాయణత్వమేది గలదో, అదియే పురుషార్థసిద్ధికి నియమము చేత కారణమగును. లక్ష్యమును ఛేదించువాడు ఎట్లు చిత్తమును, దృష్టిని మరియు ఇంద్రియమును యేకమాత్ర లక్ష్యమునందే నిశ్చితరూపముచే బంధించి- కేంద్రీకరించి - ఏకాగ్రము చేయునో, ఏమాత్రము గూడ ప్రమాదమును (అసావధానమును) పొందకుండా లక్ష్యమును గురిపెట్టి భేదించునో, అట్లే సాధ్యసిద్ధియందు చిత్తైకాగ్రత ముఖ్యకారణము గాగలదు. అందువలన ముముక్షువు యెల్లప్పుడు చిత్తైకాగ్రత గలిగి యుండవలెను. అత్యంత తీవ్రవైరాగ్యము మరియు మోక్షరూపఫలమును పొందుటయందు ప్రబలమైన ఇచ్ఛ - ఈ రెండు చిత్తైకాగ్రతకు కారణములని తెలియవలెను. సమాధానము యొక్క లక్షణము (స్వరూపము)ను శ్రీఆద్య జగద్గురు శంకరాచార్యులవారు ఈ క్రింది విధముగా ఆనతిచ్చిరి.

**శ్లో॥ శ్రుత్యుక్తార్థావగాహాయ విదుషా జ్ఞేయ వస్తుని ।**
**చిత్తస్య సమ్యగాధానం సమాధానమితీర్యతే ॥**
(స.వే.సి.సా.సం. 218)

అర్థము :- వేదములో చెప్పబడిన అర్థము (బ్రహ్మము)ను యథా తథముగ (స్వాభిన్నముగ) సుస్పష్టముగ (కరతలామలకమునువలె) తెలిసికొనుటకు, విద్వానుని ద్వారా (అధికారి పురుషునిచే) పరబ్రహ్మరూప జ్ఞేయ వస్తువునందు చిత్తమును చక్కగ స్థిరపరచుట యేది గలదో దానిని "సమాధానము" అందురు.

"నిగృహీతస్య మనసః శ్రవణాదౌ తదనుగుణవిషయే చ సమాధిః సమాధానమ్." (వేదాంతసారము). శబ్దాది విషయములనుండి నిగ్రహింపబడిన అంతఃకరణమును జ్ఞేయవిషయక శ్రవణ, మనన, నిదిధ్యాసనములందు మరియు తదుపకారకములగు గురుశుశ్రూష, పుస్తక సంపాదనము, తద్రక్షణాదులందు అథవా అమానిత్వాది సాధన విషయములందు సమాధి = ఏకాగ్రత= తత్పరత అనగా నిరంతరచింతనము ద్వారా స్థిరపరచుట యేదిగలదో, దానిని"సమాధానము" అందురు.

శమాదులు గలవాడే వేదాంతవిద్యకు అధికారి యని శ్రుతి ప్రమాణము: "శాంతో దాంత ఉపరతస్తితిక్షుః సమాహితో భూత్వాత్మన్యేవాత్మానం పశ్యతి" (బృ.4-4-23). యెవరియొక్క మనస్సు శాంతించినదో, ఇంద్రియములు విషయములనుండి నివృత్తములైనవో, యెవరు సర్వకర్మలను విధిపూర్వకముగా సంన్యసించిరో, సాంసారిక ద్వంద్వములచే విచలితుడు కాకుండగా యున్నాడో, యెవరి చిత్తము ఆత్మజ్ఞాన సాధనములయందు యేకాగ్రత (తత్పరత) గలిగియున్నదో, అతడే ఈ దేహేంద్రియ సంఘాతరూప తనలో ప్రత్యగభిన్న పరమాత్మరూప తనను

దర్శించును. ఈ శ్రుతిలో "సమాహితః" అను చోట "శ్రద్ధావిత్తో భూత్వా" అనిగూడ శాఖాంతర పాఠము గలదు. గుణోపసంహార న్యాయము (బ్ర.సూ. 3-3-5)చే శమాది షట్కము శ్రుతి నిర్దిష్టముగా నెఱుంగవలెను.

**శ్లో॥ సమాధావచలా బుద్ధి స్తదా యోగమవాప్స్యసి ।** (గీత 2-53)

**అర్థము :-** యెప్పుడు బుద్ధి యనగా యంతఃకరణము, సమాధి యందు అనగా ఆత్మయందు స్థిరముగా నుండునో, అప్పుడు నీవు యోగమును అనగా జీవ పరమాత్మైక్యలక్షణ తత్త్వమస్యాదివాక్యజన్య అఖండ సాక్షాత్కారమును పొందగలవు.

**శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।** గీత. 12-8)

**అర్థము :-** పరమాత్మనగు నాయందే సంకల్పవికల్పాత్మకమగు మనస్సును స్థిరము చేయుము. సమస్త మనోవృత్తులను నన్నే విషయము చేయులాగున చేయుము. తాత్పర్యమేమనగా - సమస్త విషయములను విడిచిపెట్టి ఎల్లప్పుడు నాయొక్క చింతన మాత్రమే చేయుము.

పైశ్రుతి స్మృతులచే ఆత్మసాక్షాత్కారమునకు "సమాధానము" అనగా ఆత్మజ్ఞానసాధనములయందు చిత్తమును స్థిరపరచుట యత్యంతావశ్యకమని తెలియుబడుచున్నది. కావున శ్రీతుకారాం మహారాజుగారు తనయభంగవాణిచే "సమాధానము"ను చెప్పుచున్నారు.

**63. అభంగము :-**

వాసనే చ్యాముఖీఁ ఆదళూని భీతేఁ ।
నిర్వాహోపురతేఁ కారణ తేఁ ॥1॥

యా నాంవ అంతరా ఆలా నారాయణ ।
చిత్త సమాధాన ఖూణ త్యాచీ ॥2॥

సర్వ కాళ హాచి కరణేఁ విచార ।
వివేకీఁ సాదర ఆత్మత్వాచే ॥3॥

తుకా హ్మణే జోఁ జోఁ భజనాసీ వళే ।
అంగే తోఁ తోఁ కళే సన్నిధతా ॥4॥

ప్ర.ప :- నిర్వాహాపురతేఁ = దేహనిర్వహణపూర్తికి (పనిజేస్తూ, స్వాభావికమైన ఆకలి, దప్పులు అను) వాననేచ్యా ముఖీఁ = వాసనాముఖములో; భీతేఁ = బత్తెము; ఆదళూని = సాయాసముగా పడవేసి, తేఁ = ఆ; కారణ = సర్వకారణమగు (నారాయణుని చింతనచేస్తూ ఉండాలి)1. యా నాంవ = దీని పేరే (దీనికే అంటారు); నారాయణ = శ్రీమన్నారాయణుడు; అంతరా = అంతరంగములోకి; ఆలా = వచ్చాడు (అని); త్యాచీ = దానియొక్క; ఖూణ = లక్షణము, చిత్త = చిత్తము; సమాధాన= సమాధానముగ (యుండుటయే)2. హాచి విచార = దీనికి సంబంధించిన విచారమే; సర్వకాళ = ఎల్లవేళల; కరణేఁ = చేస్తూ ఉండాలి; (మరియు) ఆత్మత్వాచే = ఆత్మత్వము (స్వరూపము)యొక్క; వివేకీఁ = విచారము నందు (నిరంతరము); సాదర = ఆదర పూర్వకముగా (తత్పరుడై యుండవలెను)3. తుకా హ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; జోఁ జోఁ = ఎట్లెట్లు; (దేహేంద్రియములను, భగవంతుని యొక్క) భజనాసీ = శ్రవణాది భక్తి వైపు; వళే = మరలింతువో; తోఁ తోఁ = అట్లట్లు ; (నారాయణుని) సన్నిధతా = సాన్నిధ్యము; అంగే = అంతరంగమందు; కళే = తెలిసి వచ్చును. 4.

**తా॥** దేహనిర్వహణకు సరిపడు నంత పని చేస్తూ ఉండాలి. మరియు ఆకలి – దప్పికలు అను స్వాభావిక (అనాది) వాసనా యొక్క మొగమునందు

సాయాసముగ కొంత (అన్నపానాదులను) బత్తెము (ఆకలి దప్పులు దీరుటకు మాత్రమను భావనతో) పడవేసి, సృష్టి స్థితిలయ కారణమగు శ్రీమన్నారాయణుని చింతన చేస్తూ ఉండాలి. 1. ఈ సంతుష్టికే "నారాయణుడు అంతరంగమున ప్రవేశించాడు" అని అంటారు. ఎందుకనగా? చిత్త సమాధానమే దాని లక్షణము. 2. చిత్తము ఏవిధముగా సమాధాన స్థితిలో యుండగలదో, అదే విచారము ఎల్లపుడు చేస్తూ ఉండాలి. అనగా ఆత్మసాక్షాత్కారమునకు సాధనములగు శ్రవణ, మనన, నిదిధ్యాసనాదిరూప విచారమునందు నిత్య నిరంతర ఆదరణీయుగా తత్పరుడై యుండాలి. 3. శ్రీ తుకారాం మహారాజుగారంటున్నారు - మనుష్యుడు ఎట్లెట్లు శరీరేంద్రియమనంబులను "స్వస్వరూపానుసంధానం భక్తిః" అను ఆచార్యోక్త్యనుసారము శ్రవణాది భక్తివైపు మళ్ళించునో, అట్లట్లు నారాయణునియొక్క ఆత్మయొక్క - స్వస్వరూపముయొక్క సాన్నిధ్యము (అనుభూతి) అంతఃకరణమునందు ప్రాప్తించు చున్నట్లు దెలియవచ్చును. 4. కావున ఆత్మజ్ఞాన సాధనములగు విచారశబ్దోపలక్షిత శ్రవణాదులందు చిత్తము నేకాగ్రము (స్థిరము) జేయుట యను "సమాధాన" లక్షణమేది చెప్పబడినదో, అదియే యీ యభంగము ద్వారా శ్రీతుకారాం మహారాజుగారు తెలియజేసినారు.

బాహ్య విషయములయందాసక్తచిత్తము గల స్వభావముచేతనే ప్రవృత్తశీలురగు పురుషులయొక్క బుద్ధి యత్యంత సూక్ష్మ విషయములందు గురుతరమగు "శ్రద్ధ" లేకుండ ప్రవేశించుట చాలా కఠినము. అందుకే శ్రుతి చెప్పుచున్నది- "శ్రద్ధస్వ సౌమ్యేతి" (ఛాం.ఉ. 6-12-2) హే సౌమ్య! శాస్త్రోక్తము, అత్యంత సూక్ష్మమునగు పరమార్థ తత్వమునందు "శ్రద్ధ"

నుంచుము. శ్రద్ధలేనివానికి పరమపురుషార్థరూప మోక్షము సిద్ధించదు. శ్రీ గీతాచార్యులు గూడ జ్ఞాన ప్రాప్తికి ఉపాయము చెప్తూ -

**శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః ।**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిమచిరేణాధిగచ్ఛతి ॥** (గీత. 4-39)

**అర్థము :-** జ్ఞానప్రాప్త్యుపాయములగు గురూపసదనాదులందభి యుక్తుడు (ప్రయత్నశీలుడు)ను, జితేంద్రియుడునగు శ్రద్ధావంతుడు జ్ఞానమును పొందుతాడు. జ్ఞానమును పొంది అతి శీఘ్రు కాలములో పరమ శాంతిని పొందును.

మరియు అజ్ఞుడు (ఆత్మజ్ఞానము లేనివాడు), అశ్రద్ధ ధానుడు అదే విధముగా సంశయాంతఃకరణునకు పరమశాంతి దొరకదుగదా పైగా వినాశనమొందెదరని వ్యతిరేకముఖముగా భగవానుడు నుడివెను.

శ్రద్ధయొక్క లక్షణము (స్వరూపము)ను నిర్వచిస్తూ శ్రీ ఆద్యజగద్గురు శంకరాచార్యులవారు శ్రీసర్వవేదాంత సిద్ధాంత సారసంగ్రహము - 210 లో ఈ క్రిందివిధముగా సెలవిచ్చిరి.

**శ్లో॥ గురువేదాంతవాక్యేషు బుద్ధిర్యా నిశ్చయాత్మికా ।**
**సత్యమిత్యేవ సా శ్రద్ధా నిదానం ముక్తి సిద్ధయే ॥**

**అర్థము :-** శ్రీ గురుదేవుల మరియు వేదాంతవాక్యములయందు "ఇది సత్యమే" యను నిశ్చయాత్మిక ఆస్తిక్యబుద్ధి యేది గలదో, యది ముక్తిసిద్ధికి మూలమగు "శ్రద్ధ" యగును.

పురుషులయొక్క యథార్థవచనములే శ్రద్ధను ఉత్పన్నము చేయుటకు హేతువులగును. ఎట్లనగా? "తస్మాద్యజ్ఞాత్సర్వహుతః ఋచః సామాని జజ్ఞిరే

ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాద్యజుస్తస్మా దజాయత॥" (శు.య. రుద్రాష్టాధ్యాయి 2-7) సర్వులచే హవనము చేయబడు (సర్వహుత) యజ్ఞపురుషుని (ఈశ్వరుని) నుండి క్రమముగా ఋగ్వేదము మరియు సామవేదము ఆవిర్భూతములైనవి. మరియు నతని నుండే ఛందస్సులు, అథర్వవేదము అట్లే యజుర్వేదము ప్రకటమైనవి."వేదాః శాస్త్రాణి విజ్ఞానమేతత్సర్వం, జనార్దనాత్" (మ.భా. అను. దానధర్మపర్వము. 149-139) వేదములు, శాస్త్రములు మరియు విజ్ఞానము యివియన్నియు జనార్దనుని నుండియే వెలువడినవి. అనగా (విష్ణువు)వ్యాపకుడైన ఈశ్వరుని నుండియే (నిఃశ్వాస వలె నప్రయత్నముగ) వెలువడినవి. శాస్త్రయోనిత్వాత్ (బ్ర.సూ. 1-1-3) ఋగ్వేదాది శాస్త్రములకు కారణమగుట వలన. ఇత్యాది శ్రుతి స్మృతులచే వేదశాస్త్రములు ఈశ్వరుని నుండియే ప్రకటమైనవని తెలియబడుచున్నందున ప్రామాణికములుగానున్నవి. ఇంతే గాక, ఈశ్వరునిలో భ్రమ, ప్రమాదము (కర్తవ్య కార్య విస్మరణము), విప్రలిప్సా (వంచకత్వము) మరియు కరణ అపాటవము (ఇంద్రియ మనంబుల యసమర్థత) యను చతుర్విధ బుద్ధిగత దోషములు లేనందువల్లగూడ వేదములు ప్రామాణికములైయున్నవి. అందువలన వేద వాక్యములు విశ్వసనీయములు. వాటియథార్థత్వములో సందియము లేదు. అట్లే ముక్తపురుషులు ఈశ్వరస్వరూపులు. "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" (ముం.ఉ. 2-2-9) బ్రహ్మము నెఱిగినవాడు బ్రహ్మమే యగును. ఇత్యాది శ్రుతులచే శ్రీగురుదేవుని యొక్క వాణి (వాక్యము)గూడ ఈశ్వర వాక్యముతో సమానము (యథార్థమైయున్నందున). బుద్ధిమంతులగు సత్పురుషులకు ఈశ్వరుని మరియు శ్రీగురుదేవుల వాక్యములందు అకుంఠితమగు "శ్రద్ధ" (విశ్వాసము) కుదురును. "సా హి జననీవ కళ్యాణీ యోగినం పాతి''ఆ శ్రద్ధయే తల్లివలె శుభకరమై యోగిని (సాధకుని)గాపాడును. (యోగభాష్యము. 1-20)

**64. అభంగములు :-**

సంతాచియే పాయీం హా మాఝా విశ్వాస ।
సర్వ భావేం దాస ఝాలోం త్యాంచా ॥1॥

తేచి మాఝేం హిత కరతీ సకళ ।
జేణేం హా గోపాళ కృపా కరీ ॥2॥ (2157)

వేద శాస్త్ర నాహీఁ పురాణ ప్రమాణ।
తయాచేఁ వదన నావలోకా ॥ (2112)

నకో హెూఊఁ దేఊఁ భావీఁ అభావనా ।
యాచి నాంవేఁ జాణా బహు దోష ॥1॥

మేఘ వృష్టీ యెథె హెూతే అనివార ।
జిహ్వాళ్యా ఉఖరలాభ నాడ ॥2॥

ఉత్తమ విభాగేఁ కనిష్ఠాచీ ఇచ్ఛా ।
కల్పతరు తైసా ఫలే త్యాసీ ॥3॥

తుకామ్హణే జిణేఁ బహు థోడేఁ ఆహే ।
ఆపులియా పాహేఁ పుఢేఁబరేఁ ॥4॥ (453)

పాషాణ దేవ పాషాణ పాయరీ ।
పూజా ఏకావరీ పాయ తేవీ ॥1॥

సార తో భావ అపారతోభావ ।
అనుభవీ దేవ తేచీ ఝాలే ॥2॥

ఉదకభిన్న పాలట కాఈ ।
గంగా గోద యేరాం చవీ కాయ నాహీం ॥3॥

**తుకామ్హణే హేం భావికాంచేం వర్మ ।**
**యేరేం ధర్మాధర్మ విచారావేం ॥4॥ (2170)**

ప్ర.ప :- సంతాంచియే పాయీం = సత్పురుషుల శ్రీ చరణ కమలముల యందు; మాఝూ = నాకు; హో - ఈ (ఇంత); విశ్వాస = శ్రద్ధ (ఉన్నది, యెంత యనగా); సర్వభావేం = మనోవాక్కాయములచే; (నేను) త్యాంచా = వారికి; దాస ఝాలో = దాసుడనయ్యాను. 1. జిణేం = దేనిచేత; హా గోపాళ = ఆ(ఈ) పాండురంగ భగవానుడు (పరమాత్మ); కృపా కరీ = (నన్ను) కరుణించునో; (అప్రకారముగా) తేచి = ఆ సత్పురుషులే; మాఝే సకళ హిత = నాయొక్క సమస్త యోగక్షేమములు; కరితీ = చేయుదురు. 2. (2157). (ఎవరు) వేద, శాస్త్ర, పురాణ = వేదశాస్త్రపురాణములను; ప్రమాణ నాహీం = ప్రామాణికములుగా స్వీకరించరో; తయాచేం = వారియొక్క ; వదన = ముఖమును (గూడ); నావలోకా = చూడకండి. (2112). (ఓ జనులారా! యిప్పుడు మీకు యే వేదశాస్త్ర గురువులయందు యే) భావీం = శ్రద్ధగలదో (దాని చోట); అభావనా= అశ్రద్ధ; హెూ ఊందేఊం నకో = నిర్మాణం కానివ్వకండి; (ఎందుకనగా? అశ్రద్ధ నిర్మాణమగుటయేది గలదో) యాచి = దానికే; బహు దోష = మహాపాపము" (యను); నాంవేం = పేరు (గలదని); జాణా= తెలియండి. 1. జిహ్వాళ్యా = సారవంతమైన (భూమి); యేథే = ఉన్నచోట; మేఘవృష్టి హెూతే = మేఘము వర్షించినచో (అక్కడ ధాన్య లాభము); అనివార = అనివార్యము; ఉఖర = ఊషరభూమిలో; లాభ = ధాన్యలాభము; నాడ = రాదు (నష్టము వాటిల్లును)2. (ఏవిధముగా) కల్పతరు= కల్పవృక్షము; ఉత్తమ = ఉత్కృష్టమైన; కనిష్ఠాచీ = నికృష్ఠమైన; ఇచ్ఛా = కోరికల; విభాగేం = భేదముననుసరించి; త్యాసీ = వారికి (అయా);

ఫలే = ఫలములను (ప్రసాదించునో); తైసే = అట్లే (శ్రద్ధగూడ ఫలమివ్వగలదని తెలియాలి)3. తుకా హ్మణే = శ్రీతుకారాంమహారాజుగారంటున్నారు; (మీ ఆయువు యెంతో గడిచిపోయింది, యిక) బహుథోడే ఆహే = స్వల్పాయువు మాత్రము మిగిలి ఉంది; (కావున) పుఢే = భవిష్యత్తులో; ఆపులియా = మీయొక్క; బరేం = మేలు; జిణేం= దేనిచే జరుగునో; (అది) పాహేం = చూసుకోండి (విచారించండి)4. (453). పాషాణ = శిల; దేవ = దేవుడు (మూర్తిగా చెక్కబడినది); పాషాణ = శిలయే; పాయరీ = మెట్లుగా వేయబడినది, (ఒకదానికి దైవభావముతో) పూజా = పూజ (చేస్తారు); ఏకావరీ = ఒకదానిపై; పాయ తేవీ = కాలు మోపుతారు. 1. (దీనికి కారణము) సార తో భావ = అత్యుత్కృష్ఠమైనదను శాస్త్రీయమైన శ్రద్ధ మూర్తియందున్నది; అసారతోభావ = నికృష్టమైనదను భావము మెట్ల శిలయందున్నది; (కాని యే మూర్తియందు సత్పురుషులు దైవభావము నుంచి ఉపాసించిరో వారికి) తేచి = ఆ మూర్తియే; దేవ = దేవరూపముతో (పరమాత్మరూపముతో) అనుభవీ = అపరోక్షరూపముతో సాక్షాత్కారము; ఝాలే = అయింది. 2. (పృథివిలోని) భిన్న = వేరు వేరు; ఉదక = జలములలోని (రుచియందు); పాలట = మార్పు, కాఈ = (ఉంటుందా) ఏమి?; గంగా గోడ = గంగా జలము మధురముగా ఉంది; యేరాం = ఇతరజలములలో; చవీ = రుచి; నాహీం = ఉండదా; కాయ? = ఏమి?. 3. తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజు గారంటున్నారు; హే వర్మ = ఈ రహస్యము; భావికాంచేం = శ్రద్ధావంతులకే (తెలియును, మూర్తియందు భగవంతుడుంటాడను రహస్యము నాస్తికులకు తెలియదు); యేరేం = ఇతరులగు (పూర్వ మీమాంసకులు); ధర్మాధర్మ విధినిషేధాలను; విచారావేం= విచారిస్తూనే ఉండాలి. (కాని, ఈ రహస్యము వారికి తెలియదు). 4. (2170)

**తా॥** సంతు మహాత్ములయొక్క దివ్యమైన శ్రీ చరణ సరోజముల యెడల నాకు యిటువంటి యకుంఠితమైన విశ్వాసము (శ్రద్ధ) యేర్పడినది. నేను మనో వాక్కాయములచే సంపూర్ణముగా వారికి కింకరుడ నయ్యాను. 1. ఎందుకనగా? దేనిచేతనైతే శ్రీకృష్ణ పరమాత్మ నన్ను కరుణించునో, ఆ ప్రకారమగు (భక్తి, జ్ఞాన, వైరాగ్యములను బోధించి) సర్వహితమును చేయుచున్నారు. 2. 2157). ఎవరికి వేద శాస్త్ర పురాణాదులు ప్రామాణికములు (శ్రద్ధేయములు) కావో, అటువంటి నాస్తికులయొక్క ముఖమును గూడ చూడకండి. అనగా వేదశాస్త్రములయందు "శ్రద్ధ" యుంచుట ముముక్షువునకత్యంతకీలకమైన సాధనమని శ్రీ తుకోబారాయ్ చెప్పుచున్నాడు. (2112). ఓ జనులారా! ఇప్పుడు మీకు వేదశాస్త్రములందు మరియు గురువుల యందు నిశ్చలమైన యే "శ్రద్ధ" గలదో, దాని స్థానములో యేకారణము చేతనైనా గాని అశ్రద్ధను నిర్మాణము కానివ్వకండి. ఎందుకనగా? అశ్రద్ధ యేదిగలదో, అదియే "మహాపాపము" అనబడును. 1. పృథివిపై మేఘవృష్టి పడుతుంది. కాని భూమి సారవంతమగుచో ధాన్యలాభము గలుగును. ఊషరభూమియైనట్లయిన ధాన్యలాభము గలుగదు గదా! పైగా నష్టము వాటిల్లును. అట్లే వేదశాస్త్ర, దేవ, సాధు (గురువులు) మొదలగు జీవోద్ధారక నిమిత్తములెన్ని యున్నప్పటికిని యంతఃకరణభూమి సారవంతమైనదై (శ్రద్ధగలదియై)యుండిననే మోక్షరూప ఫలము సిద్ధించును. అంధశ్రద్ధ యున్నాగాని లేక శాస్త్రోక్త శుద్ధ శ్రద్ధ యొక్క యభామున్నాగాని నిష్ఫలమగును. 2. కల్పవృక్షము, ఇచ్ఛ (కోరిక) యొక్క ఉత్తమ, కనిష్ఠ భేదానుసారముగా ఫలము నిచ్చును. అట్లే భగవంతుడు శ్రద్ధావంతునికి ఉత్కృష్ఠమైన (జ్ఞానముద్వారా) మోక్షరూప ఫలము నొందును. అశ్రద్ధావంతునికి విపరీతఫలము నొసంగును. 3. శ్రీతుకారాం మహారాజు గారంటున్నారు – అరే బాబా! ఇప్పటికి యెంతో ఆయువు క్షీణించిపోయినది.

ఇక మిగిలింది స్వల్పాయువు మాత్రమే. ఇప్పటికయినా గురు వేదాదుల పట్ల అశ్రద్ధ నిర్మాణము గానీయకుండా, భావికాలములో మీయొక్క హితము దేనియందు గలదో, దానిని బాగుగా విచారించండి. అనగా గురు -వేదాదులందు దృఢమైన శ్రద్ధను పెట్టి భవసంద్రమునుండి తరించండి యని యర్థము. 4. (453). ఆలయములోని దేవుని యొక్క మూర్తి పాషాణ (శిలా) నిర్మితము. ఆలయ మెట్లు (సోపానములు) గూడ పాషాణములే. కాని ఒక ఫాషాణమునకు (మూర్తికి) శోడషోపచార పూజలు జరుపబడును. మరొక పాషాణముపై కాలుమోపబడును. వస్తుతః రెండు శిలలేయై యుండ ఈ భేదమెందుకు? 1. శాస్త్రోక్తమగు శుద్ధ శ్రద్ధయే దీనికి ముఖ్య కారణము. మూర్తియందు శాస్త్రానుసారము ప్రాణప్రతిష్ఠ చేయబడును. అందువల్ల ఈ మూర్తి "దేవుడు' అను శ్రద్ధ గలుగును. మెట్ల పాషాణములందు ప్రాణప్రతిష్ఠ చేయబడనందున "దేవుడు" అను శ్రద్ధ యుండదు. అనగా మూర్తి యేదిగలదో, అది ప్రత్యక్ష ప్రమాణము చేత పాషాణరూపముచే ప్రతీతమగు చున్నప్పటికిని, శాస్త్రప్రమాణముచేత ఈ శిలామూర్తి "దేవుడున్నాడు" అని శిలయందు దైవబుద్ధికి సాత్త్వికశ్రద్ధయే ముఖ్యకారణము. ఈ ప్రకారమగు శాస్త్రశ్రద్ధచేత ఆ మూర్తిని ఉపాసించి అపరోక్షదైవ సాక్షాత్కారమును పొందిన సంతు మహాత్ములు గూడ దైవరూపులయ్యారు. "తం యథా యథోపాసతే తత్తథైవ భవతి" అని వినబడు చున్నందు వలన. 2. పృథివిపై నున్న యే జలమునందైనా భేదమున్నదా? గంగాజలము మధురముగా యుండి, ఇతర జలములు రుచిగా యుండవా? కాని, గంగా పరమపవిత్రమైన మహా తీర్థమని శాస్త్రములలో చెప్పబడినందున, గంగానదికి త్రైలోక్య పూజ్యతా, మహత్వమున్నది. అట్లు ఇతర జలములకు లేదు. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు - ఈ రహస్యము శ్రద్ధావంతునికే దెలియును గాని నాస్తికునకు సుతరాం దెలియదు.

ఇంతేగాదు, వేదమునందు శ్రద్ధ ఉండి గూడ "మూర్తియందు దేవుడున్నాడు" - అని యెవరికి యంగీకార్యము లేదో, అటువంటి పూర్వమీమాంసకులకు గూడ ఈ మూర్త్యుపాసన రహస్యము దెలియదు. వారు కేవలము కర్మకాండను (విధినిషేధముల యొక్క) విచారము చేస్తూ ఉండాల్సిందే గాని, దాని కంటె యధికము వారికేమియును దెలియదు. ఎందుకనగా? "శ్రద్ధ" యభావమున్నందున. 4.

**విశేషము :-**

**శ్లో॥ దేవే చ వేదే చ గురౌ చ మంత్రే తీర్థే మహాత్మన్యపి భేషజే చ ।**
**శ్రద్ధా భవత్యస్య యథా యథా తంస్తథా తథా సిద్ధిరుదేతి పుంసామ్॥**
(సర్వవేదాంత సిద్ధాంత సార సంగ్రహము. 213

**అర్థము :-** దేవునియందు (ఈశ్వరునియందు), వేదమునందు, గురువు, మంత్రము, తీర్థము, మహాత్ములు మరియు వైద్యులయందు పురుషునికెట్లెట్లు అంతఃకరణమునందు "శ్రద్ధ" గలుగునో అట్లట్లే సిద్ధి యుత్పన్నమగును. ఇక్కడ శ్రద్ధవిషయంలో ఈ రహస్యం గలదు. గురువేదాది వాక్యములందు యే శ్రద్ధ గలదో, అది ఈశ్వరునియందు మరియు శ్రీగురుదేవులయందు భక్తి లేకుండా గలుగదు. ఎవరి చిత్తమందు మొదలు ఈశ్వరుడు, గురువు మరియు అన్య బ్రహ్మనిష్ఠులయిన ఋషిమునులెవరు గలరో, వారిపట్ల పూజ్య బుద్ధిపూర్వక ప్రీతిరూప భక్తి గలుగునో, వారికే వేదాది శాస్త్రములయొక్క మరియు శ్రీగురువులయొక్క వాక్యములందు వారి భక్త్యనుసారము (ఎంత భక్తిగలదో అంత) శ్రద్ధ నిర్మాణమగును. అందువలన భక్తియేదిగలదో, అది జ్ఞానమునకు మరియు సమస్త జ్ఞానసాధనములకు ముఖ్యకారణముగానున్నది. కావుననే శ్రద్ధ యనునది భక్తిపూర్వకమున్నందున సర్వసాధనములలో శ్రేష్ఠమైన సాధనముగా పరిగణింపబడినది.

**శ్లో॥ యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ ।**

**తస్యైతే కథితా హ్యర్థా ప్రకాశంతే మహాత్మనః ॥** (శ్వే. 6-23)

**అర్థము :-** ఏసాధకునికి పరమదేవుడైన పరమేశ్వరునియందు పరమ భక్తి గలదో, మరియు పరమేశ్వరునియందు యేప్రకారము భక్తి యున్నదో అదే ప్రకారము గురువుయందు గూడ భక్తి యున్నట్లయితే, ఆ మహాత్మునకు (ముఖ్యాధికారికి) ఈ యుపదిష్టమైన తత్త్వములు స్వానుభవమునకు విషయములగును.

అందువలన, తత్త్వజిజ్ఞాసువు పరిపూర్ణ శ్రద్ధాళువు మరియు అనన్య భక్తుడై యుండవలెను. అతనినే ముక్తికాంత వరించును.

శమాదిసాధనములకు పరస్పర సహకారిత్వమున్నందున ఈ యారింటిని కలిపి "శమాదిషట్కసంపత్తి" యని యేక సాధనముగా చెప్పుట జరిగినది. వీటియొక్క పరస్పర సహకారితా "శ్రీవిచారసాగరము" నందు పందొమ్మిదవ టిప్పణములో గనందగును. గ్రంథవిస్తరభయముచే యిక్కడ తెలుపుట లేదు.

1. విచారరూప దధి మంథనముచే ఆత్మజ్ఞానమను వెన్నను దీయుటకు వలసిన సర్వసాధనసంపత్తిరూప సామగ్రులయందు ముఖ్యమైనది "శ్రద్ధా" రూపమంథన పాత్ర. 2. పతివద్దకు వెళ్ళుట కుపయుక్తములగు (శృంగారము) అలంకారములను ధరించిన విధవ వలె శ్రవణాది విచారమునందుపయుక్తములగు శమాది సాధనములు గలిగియున్న పురుషునకు "శ్రద్ధ" యను సాధన లేనిచో, విధవయొక్క శృంగారమువలె, సర్వసాధనములు వ్యర్థములేయగును. 3. గురు వేదాంత వాక్యములందు పరమ విశ్వాసము అనగా నిశ్చయాత్మిక అస్తిక్యబుద్ధి యేది గలదో, అది "శ్రద్ధ" యని తెలుసకున్నాము. ఈ శ్రద్ధను శమాది షట్కసంపత్తిలో చివరకు

చెప్పుట యందీ యభిప్రాయము గలదు. ఏమనగా! వృక్షముయొక్క సర్వాంగములలో ఫలము చివరకు వచ్చును. అదియే అన్ని అవయవములకంటెను శ్రేష్ఠముగాయున్నందున ముఖ్యమైనది. అట్లే వివేకము, వైరాగ్యము మరియు శమాది సర్వజ్ఞానసాధనములలో "శ్రద్ధ" శ్రేష్ఠముగాయున్నందున ముఖ్యమైనది. కావున చివరలో చెప్పుట జరిగినది. మరియు ఏవిధముగా ఫలోత్పత్త్యనంతరము ఫలము యొక్క పరిపాకావస్థ యుండునో, అట్లు "శ్రద్ధ" యొక్క ఉత్పత్త్యనంతరము "ముముక్షుత్వము" గలదు. అది శ్రద్ధారూప ఫలముయొక్క పరిపక్వావస్థయై యున్నది. అందుకే యది శ్రద్ధ తరువాత చెప్పబడుచున్నది.

ఇప్పుడు సాధన చతుష్టయసంపత్తిలో ముముక్షుత్వమను చరమ సాధనము నిరూపించబడుచున్నది. ముముక్షుత్వమనగా -

**శ్లో॥ అహంకారాది దేహాంతాన్ బంధానజ్ఞానకల్పితాన్ ।**
**స్వస్వరూపావబోధేన మోక్తుమిచ్ఛా ముముక్షుతా ॥** (వి.చూ. 28)

అర్థము :- స్వస్వరూపాజ్ఞానముచే కల్పింపబడిన యహంకారము మొదలు దేహము వఱకు గల బంధములను స్వస్వరూపజ్ఞానముచే విడచుట కొఱకు యిచ్ఛగించుటయే ముముక్షుత్వమనబడును.

**ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే ।** (శ్వే.ఉ. 6-18)

(ఆత్మ (తన) బుద్ధిని ప్రకాశించు, జ్యోతిర్మయ మగు దేవుణ్ణి) నేను ముముక్షువునై (ఫలాంతరాపేక్ష లేకుండా) శరణు బొందుచున్నాను.

**శ్లో॥ తతః పదం తత్పరిమార్గితవ్యం**
**యస్మిన్ గతా న నివర్తంతి భూయః ।**
**తమేవ చాద్యం పురుషం ప్రపద్యే**
**యతఃప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥** (గీత. 15-4)

**అర్థము :-** అటు పిమ్మట దేనియందు వెళ్ళిన వాళ్ళు మరల తిరిగి రారో, అట్టి పదము (స్థానము) వెదకదగినది. యెవనినుండి యనాది సంసారవృక్షము విస్తరింపబడినదో, అట్టి ఆద్య పురుషుణ్ణే పొందుతాను. (అని అనుకొంటూ అతనినే శరణుబొంది, ఆ పదము తెలిసికొనదగినది.) ఇత్యాది శ్రుతిస్మృతులు ద్రష్టవ్యములు.

జీవబ్రహ్మైక్య స్వరూప చిన్మాత్రవిషయకాజ్ఞాన తత్కార్య సకల ప్రపంచ నివృత్తి మరియు స్వస్వరూపాఖండానంద సంప్రాప్తి యేది గలదో, అదియే మోక్షమనబడును. "తరతి శోకమాత్మవిత్" (ఛాం. 7-1-3) ఆత్మవిత్ అనగా భూమా యనబడు బ్రహాత్మసాక్షాత్కారము గలవాడు, శోక శబ్దోపలక్షిత సంసారము తత్కారణమగు యజ్ఞానమును తరించును - అతిక్రమించును. "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" (ముం. 3-2-9) యెవరు బ్రహ్మను- ప్రత్యగభిన్న పరమాత్మను, వేద - సాక్షాత్కారించుకొనునో, అతడు బ్రహ్మయే యగు చున్నాడు. ఇత్యాది శాస్త్ర ప్రమాణములు దెలియదగినవి. ఈ విధమగు మోక్షముయొక్క ఇచ్ఛ మోక్షేచ్ఛ, అది గలిగినవాడు ముముక్షువు (అధికారి) ఇచ్చట నొక సందేహముదయించుట కవకాశమున్నది - అదేమనగా!

**యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః ।**
**అథ మర్త్యోఽమృతో భవతి.................॥** (బృ. 4-4-7)

**అర్థము :-** యెప్పుడు ఈ ఆత్మకామి యగు బ్రహ్మవేత్తయొక్క అంతఃకరణము నాశ్రయించుకొనియున్న సమస్త కామనలు (ఇచ్ఛాప్రభేదములు) సమూలముగ సర్వథా విడిచి పెట్టబడునో (ప్రనష్టమగునో), అప్పుడు ఈ మర్త్యుడు మరణ ధర్మము గల వాడయ్యును. అమృతుడు (మరణము లేని వాడు - ముక్తుడు) అగుచున్నాడు - అనునీ శ్రుతి సర్వకామ విముక్తుడగు పురుషునికే మోక్షాధికారముగలదని చెప్పుటచే

మోక్షాధికారికి ఇచ్ఛ (మోక్షేచ్ఛ) యనునది విశేషణముగా చెప్పుట ఎట్లు కుదురుననిన, ఇదియేమి దోషముకాదు. ఎట్లన? అనాత్మ విషయక యిచ్ఛయే యిక్కడ శ్రుతికి కామత్వముగా వివక్షితమైయున్నది. మోక్షేచ్ఛ యేదిగలదో యది యాత్మవిషకముగానున్నందుచేత అకామత్వమే యగుచున్నది. "అథాకామయమానో యోఽకామో నిష్కామ ఆత్మకామ అప్తకామ" అను యీ శ్రుతిచే ఆత్మకాముడు అప్తకాముడగుటవలన అనగా సమస్త కామనలు (ఇచ్ఛలు) నశించినవాడగుటవలన యకాముడేయని నిరూపించబడుచున్నది. ఇట్లు పై సంశయము నివర్తింపబడినది.

ఇప్పుడు అజ్ఞాన తత్కార్యరూపబంధము నుండి విడుదల కొఱకు యే యిచ్ఛారూప (మోక్షేచ్ఛ) ముముక్షుత్వము గలదో దానిని శ్రీతుకారాం మహారాజుగారు తన యభంగవాణిచే నిరూపించుచున్నారు.

**65. అభంగములు :-**

**మేల్యావరీమోక్ష సంసార సంబంధ ।**

**ఆరాలియా బద్ధ రేవా ఆమ్హా. (2096) ।**

**ప్రపంచ ఓసరో । చిత్త తుఝెం పాయీం మురో ॥1॥**

**ఐసేం కరీ గా పాండురంగా ।**

**శుద్ధ రంగవావేం రంగా ॥2॥**

**పురేం పురేం అతాం । నకో దుజీయాచీ సత్తా ॥3॥**

**లటకేం తేం ఫేడా । తుకా మ్హణే జాయ పీడా ॥4॥ (1266)**

ప్ర.ప :- (హే పాండురంగ!) ఆరాలియా = మోక్షవిషయక ఉత్కంఠ (తీవ్ర ఇచ్ఛ గలిగియున్న); ఆమ్హా = మాకు; మేల్యావరీ = మరణించిన పిమ్మట; మోక్ష = మోక్షము (ఇస్తావా? లేక); సంసార సంబంధ = సాంసారిక

సంబంధములచే; బద్ధ రేవా = బంధించిఉంచుతావా? (2096) (దేవా) ప్రపంచ = ఈ దేహాదిక ప్రపంచము; ఓసరో = దినదినము తక్కువ కానిమ్ము; చిత్త = నామనస్సు; తుఝె = నీయొక్క; పాయిాం = శ్రీచరణముల యందు; మురో = మునుగనిమ్ము. 1. గా పాండురంగా! = హేపాండురంగదేవా! ఐసే కరీ = ఇలా చేయుము (ఎట్లనగా?); శుద్ధరంగా = నీయొక్క శుద్ధమగు రంగుచే; రంగవావే; = రంజితము జేయుము. (తన్మయము జేయుము)2. ఆతాం = ఇప్పుడు (ఇక); పురేఁ పురేఁ = (ఈ జన్మమరణరూప సంసారము) చాలు చాలు; (నాపై) దుజియాచీ = ఇతరులయొక్క (అవిద్యాదులయొక్క) సత్తా = అధికారము; నకో = వద్దు . 3. లటకేఁ తేఁ = మిథ్యా సంసారమును; ఫేడా = దూరము చేయుము; తుకాహ్మణే = శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు; పీడా = జన్మ మరణరూప పీడ (దుఃఖము); జాయ – పోనిమ్ము; (నివృత్తి జేయుము)4. (1266)

**తా॥** ఓ దేవా! మోక్ష విషయక ఉత్కంఠ (తీవ్ర ఇచ్ఛ) గలిగి యున్న మాకు మరణించినపిదప మోక్షమును ఇస్తావా? లేక ఈ సాంసారిక సంబంధములచే బంధించి ఉంచుతావా? ఈ విషయములలో నీ నిర్ణయమును విననుత్సుకత గలిగియున్న మాకు యేదో ఒకటి తేల్చి చెప్పుము. (2096). హే పాండురంగ! నా చిత్తములోని యజ్ఞానకల్పిత అహంకారాది దేహాంతమగు బంధము (ప్రపంచము) స్వస్వరూపజ్ఞానముచే దిన దినము క్రమముగా నివృత్తమగునట్లనుగ్రహించుము. మరియు నా చిత్తము యెల్లప్పుడు నీ దివ్య చరణారవిందములయందే సంలగ్నమై యుండనిమ్ము అనగా నిరంతరము నీయొక్క యథార్థ స్వరూపచింతన యందే తల్లీనమై యుండునట్లు దయజూపుము. 1. రంగా! నన్ను నీ శుద్ధమగు రంగులో రంజితము జేయుము. అనగా నీయొక్క యపార సచ్చిత్సుఖ స్వరూప సాగరములో తన్మయమై మునకలు వేయునట్లు కరుణించుము.

2. ఓ దేవా! అనాది యగు నీ సంసారములో నానా యోనులలో పుట్టుచూ, చచ్చుచూ, పరిభ్రమిస్తూ చాలా శ్రమనొందితిని. ఇక ఈ సంసారము చాలును, జన్మమరణములు చాలును. పాండురంగా! యికమీదట నాపై యితరుల (అవిద్యా, వాసన, కర్మ) యొక్క సత్త (అధికారము) వలదు. అనగా జన్మహేతువులగు అవిద్యా, వాసన మరియు కర్మలు అశేషముగా నశించునట్లనుగ్రహింపుము. 3. శ్రీతుకారాం మహారాజుగారంటున్నారు – ఈ మిథ్యా సంసారమును నా నుండి దూరము జేయుము. మరియు అనాది కాలమునుండి నన్ను వెంబడించుచున్న జన్మమరణరూప పీడ (దుఃఖము)ను సమూలముగ నివర్తింపజేయుము (1266)

**విశేషము :-** ఈ ముముక్షా (మోక్షేచ్ఛ) తీవ్ర, మధ్యమ, మంద మరియు అతిమంద భేదముచే నాలుగు విధములు (స.వే.సి.పా.సం)

1. అనేకరూపములు గల ఆధ్యాత్మిక, ఆధిభౌతిక మరియు ఆధిదైవిక తాపములచే నిత్యము సంతప్తుడగుచున్న యత్యంత వ్యాకుల చిత్తము గల పురుషుడు, దేహాదులందు నేనను బుద్ధిని, తత్సంబంధమైన పుత్ర మిత్ర కళత్రాదులందు, గృహారామక్షేత్రాదులందు మరియు స్రక్చందనాదులందు మమత్వము. రాగాదులను పొంది ఉపరోక్త దుఃఖములననుభవించి, చివరకు విరక్తుడై, సర్వ పరిగ్రహము జన్మమరణరూప అనర్థమునకు సాధనముగానున్నదను బుద్ధిచే పరిత్యజించుట యేది గలదో, యది "తీవ్ర" ముముక్షా యనబడును. ఇట్టి తీవ్ర ముముక్షుత్వము గల పురుషుడే గుర్వనుగ్రహమునకు పాత్రుడై అతిశీఘ్రముగ సంసారమును తరించి జీవన్ముక్తుడగును.

2. తీవ్రమగు తాపత్రయమును చూసి, పరవస్తువు ననుభవించి, స్త్రీ మరియు పుత్రాదులను త్యజించుటకొఱకు రెండింటిలో చిత్తము

డోలాయమానమగుట యేది గలదో, యది మధ్యమ ముముక్షా యనబడును. ఈ మధ్యముడు జన్మాంతరములో ముక్తుడు గాగలడు.

3. మోక్షము నొందుటకింకెంతో సమయము గలదు. ఇప్పుడే యింత తొందరెందుకు. భోగములను చక్కగా యనుభవించి, సమస్త కార్యములను పూర్తి జేసికొని, ఆ తరువాత ముక్తికొఱకు ప్రయత్నించెదనను బుద్ధి యేది గలదో, యదియే మందముముక్షా యనబడును. ఇతడు యుగాంతరములో ముక్తుడు గాగలడు.

4. మార్గము గుండా వెళ్ళుచున్న పురుషునకు అకస్మాత్తుగా మణి లభించిన చందమున, నాకు మోక్షము లభించినచో నేను ధన్యుడనగుదును గదా! యను నాశచే గ్రసిత మూఢబుద్ధిగల వాడియొక్క మతి యేది గలదో, యదియే అతిమంద ముముక్షా యనబడును. వీడు కోటికల్పములకైనను సంసార బంధములనుండి ముక్తుడు కానేరడు.

"ఏతం బ్రహ్మలోకం బ్రహ్మచర్యేణానువిన్దన్తి" (ఛాం. 8-4-3) (లోక్యతే = అనుభూయతే విద్వద్భిః యద్బ్రహ్మ తదేవ బ్రహ్మలోకః . విద్వాంసులచే నే బ్రహ్మము యనుభవింపబడుచున్నదో, అదియే బ్రహ్మలోకము)ఈ బ్రహ్మలోకమును బ్రహ్మచర్యము ద్వారా తెలిసికొను చున్నారు అని శ్రుత్యర్థము. మరియు "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి, యజ్ఞేన, దానేన, తపసా నాశకేన" (బృ.ఉ. 4-4-22) బ్రాహ్మణులు ఈ ఆత్మను వేదాధ్యయనముచేత, యజ్ఞముచేత, దానముచేత, అనాశకమైన కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సుచేత తెలిసికొనదలచుచున్నారు. పై శ్రుతులలో చెప్పబడిన బ్రహ్మచర్య, వేదానువచన యజ్ఞదాన తపః శబ్దముల చేత సంపూర్ణ నిత్యకర్మనుపలక్షణముగా దెలియవలెను. ఈ బ్రహ్మచర్యాద్యుపలక్షిత కామ్యవర్జిత సర్వ నిత్యకర్మ జాతము ఆత్మజ్ఞానోత్పత్తి

ద్వారా మోక్షమునకు సాధనములగుచున్నందున, (మోక్షమునకు) బహిరంగ సాధనములగును. మరియు వివేకాదులు అంతరంగసాధనములని విద్వాంసులు చెప్పుచున్నారు. ఎందుకనగా అంతరంగ (దగ్గరి) సాధనములు బహిరంగ (దూరపు) సాధనల కంటే బలమైనవిగా యుండును. కావున, బ్రహ్మ జిజ్ఞాసువుయందు వివేకము, వైరాగ్యము, శమాద్యంతరంగ సాధనముల వశ్యముగా నుండవలెను. ఎట్లు ధైర్యహీనుడగు యోద్ధ (సైకికుడు) ధరించిన అస్త్రశస్త్రరూపసంపత్తి నిష్ఫలమో, అట్లు అంతరంగసాధనలు లేని ముముక్షువుచే కోటిసార్లు చేయబడిన వేదాంత శ్రవణము గూడ నిష్ఫలమే యగును.

ఈ ప్రకారముగా సాధన చతుష్టయసంపత్తిరూప విశేషణ విశిష్టుడైన వాడే వేదాంతమునకధికారి యని నిరూపించబడినది. ఈ విషయములో శ్రీఆద్య శంకరుల వచనముదాహరింపబడుచున్నది.

శ్లో॥ **ప్రశాన్తచిత్తాయ జితేంద్రియాయ చ**
**ప్రహీణదోషాయ యథోక్తకారిణే ।**
**గుణాన్వితాయానుగతాయ సర్వదా**
**ప్రదేయమేతత్సతతం ముముక్షవే ॥** (ఉపదేశసాహస్రీ. 16-72)

**అర్థము :-** ప్రశాంతచిత్తాయ = అత్యంత శాంతచిత్తునకు (శమము గలిగినవానికి), జితేంద్రియాయ = ఇంద్రియనిగ్రహము (దమము) గలిగినవానికి, ప్రహీణదోషాయ = నితాంతనిర్మలాంతఃకరణునకు, యథోక్త కారిణే = శాస్త్ర ప్రతిపాదిత స్వధర్మము ననుసరించువాడు అనగా కామ్య నిషిద్ధ కర్మలను వదిలిపెట్టి నిత్య, నైమిత్తిక మరియు ప్రాయశ్చిత్తోపాసనలచే యీశ్వరానుగృహీతుడైన వానికి, గుణాన్వితాయ = వివేకవైరాగ్యోపరతి తితిక్షా సమాధానయుక్తుడగువానికి, సర్వదా = ఎల్లప్పుడు (దీర్ఘకాలము),

అనుగతాయ = శ్రద్ధాభక్తి పురఃసరుడై శ్రీగురుదేవులయొక్క అజ్ఞను శిరసావహించి పాలించు, ముముక్షవే= మోక్షకామునికి, ఏతత్ = ఈ ఆత్మతత్త్వజ్ఞానమును, సతతం = ఎల్లప్పుడు (నిరంతరము), ప్రదేయం = ఉపదేశించదగినది. ఈ చెప్పబడిన లక్షణసంపన్నుడగు యధికారి శిష్యునికి ఆచార్య గురుదేవులు ఆత్మతత్త్వోపదేశము నవశ్యముగా చేయవలెనని ఆచార్యోక్తి.

మరియు అనధికారియగు పురుషునకు బ్రహ్మవిద్యను బోధించగూడదని గూడ శాస్త్రము వ్యతిరేకముఖముగా నుడువుచున్నది.

శ్లో॥ అర్థవ్యుత్పన్న బుద్ధేస్తు నైతద్వ్యక్తం హి శోభతే ।
దృశ్యానయా భోగదృశా భావయన్నేష నశ్యతి ॥
(శ్రీయోగవాసిష్ఠము - స్థితి ప్రకరణము. 39-21)

అర్థము :- పూర్ణ పరిపాకము నొందని బుద్ధిగలవానికి "ఇదంతయు బ్రహ్మమే "యను వాక్యము శోభించదు. ఏలయన నాతడు దృశ్యప్రపంచమును ప్రాప్తింపజేయు భోగదృష్టిగలవాడై, దానిచే దృశ్యమునే భావించుచు తత్త్వజ్ఞానము నుండి చ్యుతుడగును.

శ్లో॥ ఆదౌ శమదమ ప్రాయైర్గుణైః శిష్యం విశోధయేత్ ।
పశ్చాత్సర్వ మిదం బ్రహ్మ శుద్ధస్త్వమితి బోధయేత్ ॥
(మహోపనిషత్. 5-104) (శ్రీయోగవాసిష్ఠము స్థి.ప్ర. 39-23)

అర్థము :- అర్ధ ప్రబుద్ధుడుగాని, అప్రబుద్ధుడుగాని నగు శిష్యునికి ప్రథమమున శమదమాదిసాధనములచే పరిశుద్ధునిగ జేయవలెను. తదుపరి "ఇదంతయు బ్రహ్మస్వరూపమే" ననియు, ఆ పిమ్మట "ఆశుద్ధబ్రహ్మము నీవే" యనియు క్రమముగా బోధింపవలెను.

**శ్లో॥ అజ్ఞస్యార్థ ప్రబుద్ధస్య సర్వం బ్రహ్మేతి యో వదేత్ ।**
**మహానరకజాతేషు స తేన వినియోజితః ॥**

(మహెూపనిషత్. 5-105) (శ్రీయోగవాసిష్ఠము. స్థి.ప్ర. 39-24)

**అర్థము :-** అజ్ఞనకుగాని, అర్థప్రబుద్ధునకుగాని "సర్వము బ్రహ్మమే" యని బోధించువాడు, ఆ శిష్యుని వలన మహానరకజాలంబున నియోగింపబడినవాడగును.

**శ్లో॥ అపరీక్ష్య చ యః శిష్యం ప్రశాస్త్యతివిమూఢధీః ।**
**స ఏవ నరకం యాతి యావదాభూతసంప్లవమ్ ॥**

(శ్రీయోగవాసిష్ఠము. స్థి.ప.) 39-26)

**అర్థము :-** మిగుల మూఢబుద్ధిగల శిష్యుని పరీక్షింపక జ్ఞానప్రదానమొనర్చువాడు ప్రళయకాలపర్యంతమును నరకమునే పొందును.

**శ్లో॥ యథా హి కనకం శుద్ధం తాపచ్ఛేదనికర్షణైః ।**
**పరీక్షేత తథా శిష్యానీక్షేత్కులగుణాదిభిః ॥**

( శ్రీమత్ మహాభారతము - శాంతిపర్వము. యో.ధ. 327-46)

**అర్థము :-** ఏ విధముగా శుద్ధమగు బంగారమును కాచి, ముక్కలుచేసి, ఒఱపురాయితో రాచి మరియు ఆమ్లము (తేజాబు)లో ముంచి చూసి మేలిమిని పరీక్షించెదరో, అట్లు శిష్యుని యొక్క కులమును, గుణము (శమదమాదుల)ను ఆచార్యుడు పరీక్షించవలెను.

అధికారి పురుషుడై యుండిగూడ ఎంతవరకు "నేను నీ శిష్యుడనని" గురువునకు శరణాగతినొందడో, అంతవరకతనికి ఆత్మతత్త్వమును బోధించగూడదు. అందుకే శ్రీకృష్ణ పరమాత్మ "నేను నీశిష్యుడను, నిన్ను శరణు

జొచ్చితిని, నన్ను రక్షింపుము” అని సంపూర్ణ శరణాగతి నొందిన పిదపయే అర్జునునికి గీతోపదేశము చేసినాడు. ఇక అనధికారికి, అభక్తునికి, అశ్రద్ధధానునకు, అన్యాయముగ నడుగువానికి బ్రహ్మవిద్యను బోధించ కూడదని వేరుగ చెప్పాలా! కైముతిక న్యాయముచే నర్థతః సిద్ధము.

**శ్లో॥ ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన ।**
**న చా శుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి.**

(గీత. 18-67)

**అర్థము :-** నీకు బోధించిన పరమగుహ్యమగు నీ గీతా శాస్త్రము, తపస్సులేనివానికి, భక్తుడు కానివానికి, వినాలనికోరిక లేనివానికి, పరమేశ్వరుడనైన నన్ను ద్వేషించువానికి గూడ నీచేత యెప్పుడు గూడ చెప్పదగినిది కాదు. చెప్పవద్దు అని అర్థము.

**శ్లో॥ నాపృష్టః కస్యచిద్బ్రూయా న్నచాన్యాయేన పృచ్ఛతః ।**
**జానన్నపి హి మేధావీ జడవల్లోక ఆచరేత్ ॥**

(సన్యాసోపనిషత్ 2-121) (మనుస్మృతి 2-110)

**అర్థము :-** వేదతత్త్వము నెఱింగియునుగూడ విద్వాన్ పురుషుడు తాను యెవరిచేత నడుగబడకుండగా తత్త్వజ్ఞానమును చెప్పగూడదు. భక్తి, శ్రద్ధలు లేకుండగా నన్యాయము (అవినీతి)చేత నడిగినవానికి గూడ తత్త్వజ్ఞానమును బోధించగూడదు. మరేమనగా లోకములో జడుని (మూగవాని) వలె నాచరించవలెను. (వ్యవహరించవలెను).





# దైవప్రార్థన

కరుణామూర్తియగు దేవా!

మా చిత్తము సర్వకాల సర్వావస్థలయందును నీ పాదార విందము లందు లగ్నమై అచంచలమైన భక్తితో కూడియుండునట్లు అనుగ్రహింపుము.

పరమ దయానిధీ!

ప్రాతఃకాలమున నిద్రలేచినది మొదలు మరల పరుండువఱకును మనో వాక్కాయములచే మావలన ఎవరికిని అపకారము కలుగకుండునట్లును, ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయులాగునను సద్బుద్ధిని దయచేయుము.

సచ్చిదానందమూర్తీ!

మా యంతఃకరణమునందు ఎన్నడును ఏ విధమైన దుష్టసంకల్పము గాని, విషయవాసన గాని, అజ్ఞానవృత్తి గాని జొరబడకుండునట్లు దయతో అనుగ్రహింపుము.

వేదాన్తవేద్యా! అభయస్వరూపా!

మాయందు భక్తిజ్ఞానవైరాగ్య బీజములంకురించి శీఘ్రముగా ప్రవృద్ధములగునట్లు ఆశీర్వదింపుము. మఱియు ఈ జన్మమునందే కడతేరి నీసాన్నిధ్యమున కేతెంచుటకు కావలసిన శక్తి సామర్థ్యములను కరుణతో నొసంగుము.

దేవా!

నీవు భక్తవత్సలుడవు. దీనులపాలిటి కల్పవృక్షస్వరూపుడవు. నీవు తప్ప మాకింకెవరు దిక్కు? నిన్ను ఆశ్రయించితిమి. అసత్తునుండి సత్తునకుగొని పొమ్ము. తమస్సు నుండి జ్యోతిలోనికి తీసుకొనిపొమ్ము. మృత్యువు నుండి అమృతత్వమును పొందింప జేయుము. ఇదే మా వినతి. అనుగ్రహించుము. నీ దరిజేర్చుకొనుము.

పాహి మాం, పాహి మాం పాహి మాం పాహి.